## ౩౬

### షట్త్రింశస్సర్గప్రారంభః.

భూయ ఏవ మహాతేజా హనుమాన్ మారుతాత్మజః
అబ్రవీత్ప్రశ్రితం వాక్యం సీతాప్రత్యయకారణాత్. ౧

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగల; మారుతాత్మజః= వాయుదేవునికొడుకైన; హనుమాన్ = హనుమంతుఁడు; సీతాప్రత్యయకారణాత్ =సీతయొక్క-నమ్మకమునుకారణమువలన, భూయఏవ=మఱలనే; ప్రశ్రితం=వినయముతోఁగూడిన; వాక్యం= మాటను; అబ్రవీత్ = పలికెను.

మహాపరాక్రమశాలియు వాయుదేవునికుమారుండునగు హనుమంతుండు, సీతకునమ్మకంబుగల్గించుటకై, మఱల, వినయంబుతో, నిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

వానరోఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః

టీక॥ మహాభాగే= అధికమయినభాగ్యముగలసీతాదేవీ! అహం= నేను; వానరః=వానరుండను. ధీమతః= బుద్ధిమంతుండగు; రామస్య= రామునియొక్క; దూతః=దూతను.

మహాభాగురాలవగుసీతాదేవీ! నేను వానరుండనుగాని రాక్షసుండనుగాను; బుద్ధిమంతుండగు రాముండుపంపఁగా వచ్చినదూతను. అని, తాత్పర్యము.

రామనామాంకితం చేదం పశ్య దేవ్యంగుళీయకమ్. ౨

టీక॥ దేవి=సీతాదేవీ! ఇదం=ఈ; రామనామాంకితం= రామునిపేరుచెక్కఁబడిన; అంగుళీయకంచ = ఉంగరమును; పశ్య=చూడుము.

సీతాదేవీ! ఇదిగో! రామునిపేరు వ్రాసినయుంగరముఁదెచ్చియున్నాను; చూడుము. అని, తాత్పర్యము.

ప్రత్యయార్థం తవానీతం తేన దత్తం మహాత్మనా

టీక॥తవ=నీకు; ప్రత్యయార్థం=నమ్మకముకొఱకు; ఆనీతం= తేఁబడినది. మహాత్మనా=పూజ్యమయి సత్స్వభావంబుగల; తేన=ఆ రామునిచేత; దత్తం=ఇయ్యఁబడినది.

నీకునమ్మకంబు గలుగుటకై, మహాత్ముండగు రాముండిచ్చఁగాఁ, దీసికొనివచ్చినాను. అని, తాత్పర్యము.

సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి

టీక॥సమాశ్వసిహి=ఊఱడిల్లుము. తే=నీకు; భద్రం=మంగళము; అస్తు (అధ్యాహృతము) = అగుఁగాక. త్వం(అధ్యాహృతము) = నీవు; క్షీణదుఃఖఫలా= నశించినదుఃఖముయొక్క ఫలములుగలదానవు; అసిహి=అగుచున్నావుగదా.

ఇంకనూఱటనొందుము; నీకుమంగళముగలుగుఁగాక; నీదుఃఖములన్నియు నశించినవి. అని, తాత్పర్యము.

గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్
భర్తారమివ సంప్రాప్తా జానకీ ముదితాఽభవత్. ౪

టీక॥సా=ఆ; జానకీ=సీతాదేవి; భర్తుః=పెనిమిటియొక్క; కరవిభూషణం=హస్తభూషణమయిన యుంగరమును; గృహీత్వా=తీసికొని; ప్రేక్షమాణా=చూచుచున్నదై; భర్తారం=పెనిమిటిని; సంప్రాప్తేవ (స్థితా)=పొందినట్లున్నదై; ముదితా=సంతసించినది; అభవత్=ఆయెను.

ఆసీతాదేవి, తనపెనిమిటి హస్తభూషణమయినయుంగరమును దీసికొని, పలుమాఱులుచూచిచూచి, పెనిమిటియగు రామునింబొందినట్లు, పరమసంతోషంబునొందినది.
అని, తాత్పర్యము.

చారు తద్వదనం తస్యాస్తామ్రశుక్లాయతేక్షణమ్
అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇవోడురాట్. ౫

టీక॥విశాలాక్ష్యాః= పెద్దకండ్లుగల; తస్యాః=ఆసీతాదేవియొక్క; చారు=సుందరమును; తామ్రశుక్లాయతేక్షణం = ఎఱ్ఱనివియుఁ దెల్లనివియును

దీర్ఘములయినవియునగు కండ్లుగలది యునగు; తత్=ఆ; వదనం=ముఖము; రాహుముక్తః=రాహువుచే విడువఁబడిన; ఉడురాడివ=నక్షత్రముల యొక్క రాజయినచంద్రిందుంబోలె; అశోభత=ప్రకాశించెను.

అప్పుడు సంతోషంబున, కొనల నెఱ్ఱనైనడుమం దెల్లనై విశాలంబులయిన కండ్లుగలిగి సుందరంబై యుండు, నాసీతాదేవిముఖము రాహువుచే విడువంబడినచంద్రుండుంబోలెఁ, బ్రకాశించెను. అని, తాత్పర్యము.

తత స్సా హ్రీమతీ బాలా భర్తృసందేశహర్షితా
పరితుష్టా ప్రియం కృత్వా ప్రశశంస మహాకపిమ్. ౬

టీక॥తతః=అటుపిమ్మట; బాలా=చిన్నదగు; సా=ఆసీతాదేవి ; భర్తృసందేశహర్షితా=పెనిమిటిచెప్పి పంపినమాటచేఁగగు హర్షటు నొందినదై; హ్రీమతీ=లజ్జగలదై; పరితుష్టా=సంతోషమునొందినదై; ప్రియం=సన్మానమును; కృత్వా=చేసి; మహాకపిం=పెద్దకోఁతియయినహనుమంతుని; ప్రశశంస=పొగడెను.

అంత, బాలయగునాసీతాదేవి, పెనిమిటివార్తవిన్నందుకై సంతుష్టయయి, మేనంబులకలువొడమఁ, గొంతలజ్జనొంది, సంతోషంబున, హనుమంతునిం బొగడెను. అని, తాత్పర్యము.

విక్రాంత స్త్వం సమర్థ స్త్వం ప్రాజ్ఞ స్త్వం వానరోత్తమ
యేనేదం రాక్షస పదం త్వయైకేన ప్రధర్షితమ్. ౭

టీక॥వానరోత్తమ=వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! యేన=ఏ; ఏకేన=ఒక్కఁడవైన; త్వయా=నీచేత; రాక్షసపదం=రాక్షసస్థానమయిన ; ఇదం=ఈలంకాప్రదేశము ; ప్రధర్షితం=తిరస్కరింపఁబడినదో , తృణముగా నెంచఁబడినదో యనుట; సః(అధ్యాహృతము)=అట్టి; త్వం=నీవు ; విక్రాంతః=పరాక్రమశాలివి. త్వం=నీవు; సమర్థః=సమర్థుండవు. త్వం=నీవు; ప్రాజ్ఞః=పండితుండవు.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవొక్కండవె, రాక్షసులచే నిండినయీలంకను, సరకుసేయక, ప్రవేశించినావే; నీపరాక్రమంబునునీధైర్యమునునీబుద్ధిని, ఏమనికొనియాడఁగలను; నీవేపరాక్రమశాలివి; నీవెధైర్యశాలివి; నీవెబుద్ధిశాలివి. అని, తాత్పర్యము.

శతయోజనవిస్తీర్ణ స్సాగరో మకరాలయః
విక్రమ శ్లాఘనీ యేన క్రమతా గోష్పదీకృతః. ౮

టీక॥శతయోజనవిస్తీర్ణః=నూఱుయోజనంబులచే విస్తీర్ణమయిన; మకరాలయః=మొసళ్లకునికిపట్టయిన; సాగరః=సముద్రము; విక్రమశ్లాఘనీయేన= పరాక్రమముచేఁగొనియాడఁదగినవాఁడవును; క్రమతా= దాఁటువాఁడవునగు; త్వయా (అధ్యాహృతము)= నీచేత; గోష్పదీకృతః=ఆవుయొక్క యడుగుకొలఁదిగాఁజేయఁబడినది.

సముద్రమునూఱుయోజనముల వైశాల్యములుగలది, మొసళ్లధికముగాఁగలది; అట్టిసముద్రమునునీవు ఆవుపాదమంతటిదానిఁగాఁదలఁచి దాఁటితివే; నీపరాక్రమముగొనియాడందగినది గదా! అని, తాత్పర్యము.

న హి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ
యస్య తే నాస్తి సంత్రాసో రావణా న్నాపి సంభ్రమః. ౯

టీక॥వానరర్షభ=వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! యస్య=ఏ; తే= నీకు; రావణాత్ = రావణునివలన; సంత్రాసః=భయము; నాస్తి= లేదో; సంభ్రమోపి=తొట్రుపాటయినను; న= లేదో; తం(అధ్యాహృతము)= అట్టి; త్వాం=నిన్ను; ప్రాకృతం= అల్పమగు; వానరం=కోఁతినిగా; నమన్యే=తలంపను. ("హి" అనునది పాదపూరణార్థము).

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! సర్వభూతభయంకరుండగు రావణునివలన, నీకుభయంబులేదు; కొంచెముతొట్రుపాటైనను లేదు, కావున, నీవు, సాధారణమయినకోఁతియనినాకుఁ దోఁచలేదు. అని, తాత్పర్యము.

అర్హసే చ కపిశ్రేష్ఠ మయా సమభిభాషితుమ్
యద్యపి ప్రేషిత స్తేన రామేణ విదితాత్మనా. ౧౦

టీక॥కపిశ్రేష్ఠ=వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! యద్యపి=ఏకారణము

వలన; విదితాత్మనా = తెలియఁబడినపరమాత్మగల; తేన = ఆ; రామేణ = రాముని చేత; ప్రేషితః = పంపఁబడినావో; తత్ (అధ్యాహృతము) = ఆ కారణము వలన; మయా = నాచేత; సమభిభాషితుం = మాటలాడుటకు; అర్హసేచ (అర్హసి) = తగుదువును.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! పరమాత్మవేత్తయగు రాముండు పంపఁగావచ్చినావు, కావున, నీతో నేను మాటలాడనువచ్చును.

అని, తాత్పర్యము.

ప్రేషయిష్యతి దుర్ధర్షో రామో న హ్యపరీక్షితమ్
పరాక్రమ మవిజ్ఞాయ మత్సకాశం విశేషతః. ౧౧

టీక॥ దుర్ధర్షః = ఎదిరింపఁగూడనీ; రామః = రాముండు; పరాక్రమం = పరాక్రమమును; అవిజ్ఞాయ = ఎఱుంగక; అపరీక్షితం = పరీక్షింపఁబడనివానిఁ; విశేషతః = విశేషించి; మత్సకాశం = నాసమీపమునుగూర్చి; నప్రేషయిష్యతి = పంపఁడు.

రాముండు, మహాబుద్ధిశాలి; నీపరాక్రమంబు దెలిసికొనక, నిన్నునానావిధంబులంబరీక్షింపక, యెచ్చటికినిబంపఁడు; అందు, విశేషించి, నాయొద్ద కెంతమాత్రము పంపఁడు; అట్టి రాముఁడు నిన్ను నాయొద్దకుఁబంపుటవలన నే, నీశక్తియద్భుతమని తెలియవచ్చుచున్నది.

అని, తాత్పర్యము.

దిష్ట్యాచ కుశలీ రామో ధర్మాత్మా సత్యసంగరః
లక్ష్మణశ్చ మహాతేజాః సుమిత్రానంద వర్ధనః. ౧౨

టీక॥ దిష్ట్యా = భాగ్యము చేత; ధర్మాత్మా = ధర్మస్వభావుండును; సత్యసంగరః = సత్యమయినప్రతిజ్ఞ గలవాఁడును; రామశ్చ = రాముఁడును; కుశలీ = క్షేమముగలవాఁడు. సుమిత్రానందవర్ధనః = సుమిత్రయొక్క సంతోషమునువృద్ధిఁబొందించువాఁడును; మహాతేజాః = అధికమయిన పరాక్రమముగలవాఁడునగు; లక్ష్మణశ్చ = లక్ష్మణుండును; కుశలీ (అధ్యాహృతము) = క్షేమము గలవాఁడు.

నాభాగ్యవశంబున, ధర్మాత్ముం




డును సత్యసంధుండునగు రాముండును, మహాపరాక్రమశాలియగు సుమిత్రాపుత్రుండు లక్ష్మణుండును, క్షేమంబుగ నున్నవారు. అని, తాత్పర్యము.

కుశలీ యది కాకుత్థ్సః కిన్న సాగరమేఖలామ్

"కిన్న సాగరమేఖలాం" ఇతి పాఠాంతరం.

మహీం దహతి కోపేన యుగాంతాగ్నిరివోత్థితః. ౧౩

టీక॥ కాకుత్థ్సః= రాముడు; కుశలీ యది= క్షేమముగలవాఁడగునేని; కోపేన= కోపముచేత; ఉత్థితః= లేచిన, మండుచున్నయనుట; యుగాంతాగ్నిరివ= ప్రళయమునందలి యగ్నిహోత్రమువలె; సాగరమేఖలాం= సముద్రమే మొలనూలుగాఁగల; మహీం= భూమిని; దహతికిన్న= దహించుచున్నాఁడా యేమి; కిన్నదహతి (అని పాఠాంతరము)= ఎందుకు దహింపఁడు.

రాముఁడు క్షేమంబున నున్నపక్షమున, ప్రియభార్యనగు నన్ను రాక్షసుండు గొనిపోవుటం జేసి, కోపంబుఁ బొంది, ప్రళయకాలాగ్నియుంబోలె, భూమి యంతఁ దహించుచున్నాఁడా? ఎందువలన దహింపఁడు? శక్తిలేనివాఁడా యేమి? శక్తియున్నచో దహించుచునే యుండును; అది లేదు కావున నే యూరకున్నాఁడు.

అని, తాత్పర్యము.

అథవా శక్తిమంతౌ తౌ సురాణామపి నిగ్రహే

మమైవతు న దుఃఖానామస్తి మన్యే విపర్యయః. ౧౪

టీక॥ అథవా= అటుకాదేని; తౌ= ఆ రామలక్ష్మణులు; సురాణాం= దేవతలయొక్క; నిగ్రహేపి= నిగ్రహించుటయందును; శక్తిమంతౌ= సామర్థ్యముగలవారలే. మమ= నాయొక్క; దుఃఖానామేవతు= దుఃఖములకుమాత్రమె; విపర్యయః= నాశము; నాస్తి= లేదు. ఇతి (అధ్యాహృతము)= అని; మన్యే= తలంచెదను.

అటుకాదేని, రాముండును లక్ష్మణుండును, దేవతలనైన జయింప సమర్థులె; అయితే, నా దుఃఖములకు నాశ




ము లేదు కాఁబోలు; అందువలననే, వారలకు నామీఁద మనసు రాకున్నది.

అని, తాత్పర్యము.

కచ్చిన్న వ్యథితో రామః కచ్చిన్న పరితప్యతే

టీ॥ రామః = రాముఁడు; నవ్యథితఃకచ్చిత్ = కృశించియుండ లేదుగదా? నపరితప్యతేకచ్చిత్ = పరితపింపఁడుగదా?

రాముండు, నా దుఃఖంబునఁ గృశింపకున్నాఁడుగదా? మఱియు నన్నుఁగూర్చియే యెల్లప్పుడును పరితపింప కున్నాఁడుగదా? అని, తాత్పర్యము.

ఉత్తరాణిచ కార్యాణి కురుతే పురుషోత్తమః. ౧౫

టీక॥ పురుషోత్తమః = పురుషశ్రేష్ఠుండగు రాముండు; ఉత్తరాణి = పైనఁజేయవలసిన; కార్యాణిచ = కార్యములను; కురుతే(కచ్చిత్) = చేయుచున్నాఁడుగదా?

పురుషశ్రేష్ఠుఁడగు రాముండు, అట్లు దుఃఖమునొందక నన్నుఁ బొందుటకై చేయవలసిన పనులను జేయుచుండుఁ గదా? అని, తాత్పర్యము.

కచ్చిన్నదీనస్సంభ్రాంతః కార్యేషుచ న ముహ్యతి
కచ్చిత్పురుషకార్యాణి కురుతే నృపతేస్సుతః. ౧౬

టీక॥ నృపతేః = మనుష్యులకుఁ బ్రభువైన దశరథమహారాజుయొక్క; సుతః = కొడుకైన రాముఁడు; నదీనఃకచ్చిత్ = దుఃఖంబునొందకున్నాఁడు గదా? సంభ్రాంతః = తొట్రుపాటుగలవాఁడై; కార్యేషు = పనులందు; నముహ్యతి (కచ్చిత్) = మోహంబు నొందకున్నాఁడుగదా? పురుషకార్యాణి = పురుషునిచేఁ జేయఁదగినకార్యములను; కురుతేకచ్చిత్ = చేయునుగదా?

దశరథమహారాజ పుత్రుండగు రాముండు, ఎల్లప్పుడును దీనుండై యుండఁడుగదా? అట్లు సంభ్రమంబునొంది కార్యములం జెఱుపుకొనఁడుగదా? ఊఱకుండక, పురుషుండు చేయవలసిన ప్రయత్నంబులం జేయుచుండునుగదా?

అని, తాత్పర్యము.

ద్వివిధం త్రివిధోపాయ ముపాయ మపి సేవతే
విజిగీషు స్సుహృ త్కచ్చి న్మిత్రేషుచ పరంతపః. ౧౭

టీక॥ పరంతపః=శత్రువులఁదపింపఁజేయునట్టి రాముఁడు; మిత్రేషుచ=స్నేహితులయందును (చకారముచే)శత్రువులందును; సుహృత్=స్నేహితుఁడై; విజిగీషుః=జయింపనిచ్ఛగలవాఁడునై; ద్వివిధం=రెండువిధములయిన; ఉపాయం=ఉపాయములను, సామదానములననుట; త్రివిధోపాయమపి=మూఁడువిధములయినయుపాయమును, దానభేదదండంబులననుట; సేవతేకచ్చిత్=పొందునుగదా?

శత్రువులం దపింపఁజేయునట్టి రాముండు, స్నేహితులయెడ మంచితలంపుగలిగి, వారల, సామదానంబులరెంటను, ఉపలాలించుచు, శత్రువులయెడ, దానభేదదండోపాయంబులం బ్రయోగించుచు, సమయంబుకొలంది మెలంగుచుండునుగదా? అని, తాత్పర్యము.

కచ్చి న్మిత్రాణి లభతే మిత్రైశ్చాప్య భిగమ్యతే

టీక॥ రామః (అధ్యాహృతము)=రాముఁడు; మిత్రాణి=స్నేహితులను; లభతేకచ్చిత్=పొందునుగదా? మిత్రైశ్చాపి=స్నేహితులచేతను; అభిగమ్యతేకచ్చిత్=పొందఁబడునుగదా?

రాముండు, క్రొత్తక్రొత్తస్నేహితులం బొందునుగదా? ఇతరులును, అతండుతెమకు స్నేహితుండు గావలయునని గోరుదురుగదా?

అని, తాత్పర్యము.

కచ్చి త్కల్యాణమిత్రశ్చ మిత్రైశ్చాపి పురస్కృతః. ౧౮

టీక॥ రామః (అధ్యాహృతము)=రాముఁడు; కల్యాణమిత్రః కచ్చిత్=మంచిస్నేహితులుగలవాఁడుగదా? మిత్రైశ్చాపి=స్నేహితులచేతను; పురస్కృతః (కచ్చిత్)=ముందిడుకొనఁబడువాఁడుగదా?

రామునకు మంచిస్నేహితులుగల్గుదురుగదా? ఆస్నేహితులతనిం దమకుఁ బ్రధానముగాఁదలంతురు.

అని, తాత్పర్యము.

కచ్చిదా శాస్తి దేవానాం ప్రసాదం పార్థివాత్మజః

టీక॥ పార్థివాత్మజః = రాచకొమరుండగు రాముండు; దేవానాం = దేవతలయొక్క; ప్రసాదం = అనుగ్రహమును; ఆశాస్తి కచ్చిత్ = కోరునుగదా?

రాచకొమరుండగు రాముండు, దేవతా సంగ్రహమును గోరుచుండును గదా?

అని, తాత్పర్యము.

కచ్చి త్పురుషకారంచ దైవంచ ప్రతిపద్యతే. ౧౯

టీక॥ రామః (అధ్యాహృతము) = రాముండు; పురుషకారంచ = పురుషప్రయత్నమును; దైవంచ = అదృష్టమును; ప్రతిపద్యతే కచ్చిత్ = పొందునుగదా?

రాముండు, సేయు ప్రయత్నమునకు దైవము అనుకూలముగా నుండునుగదా? అని, తాత్పర్యము.

కచ్చి న్న విగతస్నేహః ప్రవాసా న్మయి రాఘవః

టీక॥ రాఘవః = రాముండు; ప్రవాసాత్ = దూరంబుననుండుటవలన; మయి = నాయందు; విగతస్నేహానకచ్చిత్ = పోయినస్నేహముగలవాండు కాండుగదా?

రామునకు, ఇట్లు ఎడంబాటు గల్గుటవలన, నాయందలి స్నేహము తగ్గకున్నది గదా? అని, తాత్పర్యము.

కచ్చి న్మాం వ్యసనా దస్మా న్మోక్షయిష్యతి వానర. ౨౦

టీక॥ వానర = హనుమంతుండా! రామః (అధ్యాహృతము) = రాముండు; మాం = నన్ను; అస్మాత్ = ఈ; వ్యసనాత్ = దుఃఖమునుండి; మోక్షయిష్యతికచ్చిత్ = విడిపించునుగదా?

హనుమంతుండా! రాముండు, నా దుఃఖమునుబోంగొట్టునుగదా?

అని, తాత్పర్యము.

సుఖానా ముచితో నిత్య మసుఖానా మనౌచితః

దుఃఖముత్తర మాసాద్య కచ్చిద్రామో నసీదతి. ౨౧

టీక॥ సత్యం = ఎల్లప్పుడు; సుఖానాం = సుఖములకు; ఉచితః = తగినవాఁడును; అసుఖానాం = దుఃఖములకు; అనాచితః = తగనివాఁడునగు; రామః = రాముఁడు; ఉత్తరం = అధికమగునట్టి; దుఃఖం = దుఃఖమును; ఆసాద్య = పొంది; నసీదతి కచ్చిత్ = కృశింపకున్నాఁడుగదా?

ఎల్లప్పుడును సుఖంబులనే యనుభవింపందగినవాఁడును అతిసుకుమారుండుగావున దుఃఖంబు లనుభవింపందగనివాఁడునగు రాముండు, ఇప్పుడిట్టిమహాదుఃఖంబునొంది, కృశింపకున్నాఁడుగదా? అని, తాత్పర్యము.

కౌసల్యాయా స్తథా కచ్చిత్సుమిత్రాయా స్తథైవచ
అభీక్ష్ణం శ్రూయతే కచ్చిత్కుశలం భరతస్యచ. ౨౨

టీక॥ కౌసల్యాయాః = కౌసల్యయొక్కయు; తథా = అట్లు; సుమిత్రాయాః ఏవచ = సుమిత్రయొక్కయు; కుశలం = క్షేమము; అభీక్ష్ణం = అప్పుడప్పుడు; శ్రూయతే కచ్చిత్ = వినఁబడుచున్నదిగదా? తథా = అట్లు; భరతస్యచ = భరతునియొక్కయు; కుశలం (అధ్యాహృతము) = క్షేమము; శ్రూయతే (అధ్యాహృతము) కచ్చిత్ = వినఁబడుచున్నదిగదా?

కౌసల్య, సుమిత్ర, భరతుండు, వీరలక్షేమవార్త, యప్పుడప్పుడు, తెలియవచ్చుచున్నదిగదా!

అని, తాత్పర్యము.

మన్నిమిత్తేన మానార్హః కచ్చిచ్ఛోకేన రాఘవః

టీక॥ మానార్హః = గౌరవమునకుఁదగిన; రాఘవః = రాముఁడు; మన్నిమిత్తేన = నేనుగారణముగాఁగల; శోకేన = దుఃఖముచేత; పరితప్యతే (అధ్యాహృతము) కచ్చిత్ = పరితపించుచున్నాఁడుగదా?

పూజింపందగినరాముండు, నన్నుఁగురించి, దుఃఖించుచున్నాఁడుగదా?

అని, తాత్పర్యము.

కచ్చి న్నా న్యమనా రామః కచ్చి న్మాం తారయిష్యతి. ౨౩

టీక॥రామః= రాముఁడు; అన్యమనాః = ఇతరమునందు మనసుగలవాఁడు; నకచ్చిత్ = కాఁడుగదా? మాం= నన్ను; తారయిష్యతికచ్చిత్ = కడతేర్చునుగదా?

రాముండునాదుఃఖంబుననితరకార్యంబులన్నియువిడిచియుండునా? యేమి? నన్ను గడతేర్చునా? యేమి? అని, తాత్పర్యము.

కచ్చి దక్షౌహిణీం భీమాం భరతో భ్రాతృవత్సలః
ధ్వజినీం మంత్రిభి ర్గుప్తాం ప్రేషయిష్యతి మత్కృతే. ౨౪

టీ॥భ్రాతృవత్సలః= అన్నయందతిస్నేహముగల; భరతః=భరతుఁడు; మత్కృతే=నాకై; భీమాం=భయంకరమైనదియును; మంత్రిభిః= మంత్రులచేత; గుప్తాం=రక్షింపఁబడినదియును; అక్షౌహిణీం=అక్షౌహిణియంతటిపరిమాణముగలదియునగు(ఇరువదియొక్క వేలునెనమన్నూట డెబ్బదిరథములు, అన్నియేనుఁగులు, అఱువది యయిదు వేలునార్నూటపదిగుఱ్ఱములు, లక్షయొఁదొమ్మిదివేల మున్నూటయేఁబండ్రు పదాతులునుగలసేన ,యక్షౌహిణియనంబడును); ధ్వజినీం= సేనను; ప్రేషయిష్యతి కచ్చిత్ =పంపఁగలఁడా యేమి?

అన్నయందుమిక్కిలియు భక్తిగల భరతుండు, నాకై, మంత్రులచేరక్షింపఁబడి భయంకరంబై యుండు, నాకయక్షౌహిణి సేనంబంపునా యేమి?

అని, తాత్పర్యము.

వానరాధిపతి శ్శ్రీమాన్ సుగ్రీవః కచ్చి దేష్యతి
మత్కృతే హరిభి ర్వీరై ర్వృతో దంతనఖాయుధైః. ౨౫

టీక॥మత్కృతే=నాకై; వానరాధిపతిః=వానరులకుఁ బ్రభుండును; శ్రీమాన్ = అధికమయినసంపదగలవాఁడునగు; సుగ్రీవః=సుగ్రీవుఁడు; వీరైః= పరాక్రమ శాలులును; దంతనఖాయుధైః=దంతములునుగోళ్లునే యాయుధములుగాఁగలవారలునగు; హరిభిః=వానరులచేత; వృతః= పరివేష్టింపఁబడిన

వాఖ్యై; ఏష్యతి కచ్చిత్ = వచ్చునాయేమి? వానరాధీశ్వరుండును శ్రీమంతుండునగు సుగ్రీవుండు పరాక్రమశాలులును దంతములునునఖంబులు నాయుధంబులు గాఁగలవారలునగు వానరులతోఁ గూడి, నాకై యిచ్చటికి, వచ్చునాయేమి?

అని, తాత్పర్యము.

కచ్చి చ్చ లక్ష్మణ శ్శూర స్సుమిత్రానందవర్ధనః
అస్త్రవి చ్ఛరజాలేన రాక్షసా న్విధమిష్యతి. ౬౮

టీక॥ శూరః = యుద్ధమునందుభయములేనివాఁడును; సుమిత్రానందవర్ధనః = సుమిత్రయొక్క యానందమునువృద్ధిఁబొందించువాఁడును; అస్త్రవిత్ = అస్త్రములనెఱింగినవాఁడునగు; లక్ష్మణశ్చ = లక్ష్మణుండును; శరజాలేన = బాణసమూహముచేత; రాక్షసాన్ = రాక్షసులను; విధమిష్యతి కచ్చిత్ = చంపఁగలఁడాయేమి?

శూరుండు నస్త్రంబులందెలిసినవాఁడునగుసుమిత్రాపుత్రుండయిన లక్ష్మణుండిచ్చటికివచ్చి, పెక్కుబాణంబులంబరగించి, రాక్షసులనందఱను, వధించునాయేమి? అని, తాత్పర్యము.

రౌద్రేణ కచ్చి దస్త్రేణ జ్వలతా నిహతం రణే
ద్రక్ష్యా మ్యల్పేన కాలేన రావణం ససుహృజ్జనమ్. ౭౦

టీక॥ రణే = యుద్ధమునందు; రౌద్రేణ = భయంకరమైన; జ్వలతా = మండుచున్న; అస్త్రేణ = అస్త్రముచేత; నిహతం = చంపఁబడిన; సుహృజ్జనం = స్నేహితజనముతోఁగూడిన; రావణం = రావణుని; అల్పేన = స్వల్పమైన; కాలేన = కాలముచేత; ద్రక్ష్యామి కచ్చిత్ = చూడగలనాయేమి?

యుద్ధంబున, భయంకరంబుగజ్వలించుచున్న యస్త్రంబుచేత రావణుండును, అతనిబంధువర్గంబును, చంపఁబడుటను, నేనింకస్వల్పకాలంబునం జూడఁగలనాయేమి? అని, తాత్పర్యము.

కచ్చి న్న తద్ధేమసమానవర్ణం
తస్యాననం పద్మసమానగంధి

మయా వినా శుష్యతి శోకదీనం
జలక్షయే పద్మ మివాతపేన. ౨౮

టీక ॥ హేమసమానవర్ణం=బంగారముతో సమాన రంగు గలదియును,బంగారమువలెమనోహరమయినదియనుట; పద్మసమానగంధి=తామరపూవుయొక్క వాసనతో సమానమయినవాసనగలదియునగు; తస్య= ఆ రామునియొక్క; తత్=ఆ; ఆననం=ముఖము; మయావినా= నన్నువిడిచి; శోకదీనం=దుఃఖముచేదైన్యమునొందినదై;జలక్షయే = నీటియొక్కనాశము కాఁగా; ఆతపేన=ఎండచేత; పద్మమివ = తామరపూవువలె; నశుష్యతికచ్చిత్=శోషిల్లకున్నదా యేమి?

జలమంతయు నెండిపోయినపిమ్మట నెండ తాఁకుడునకుఁ గమలంబుశోషిల్లునట్లు,బంగారమువలెనిమ్మలంబునుదామరపూవువలెసుగంధంబు గలదియునగునా రామునిముఖంబు, నన్నువిడిచిదుఃఖంబున,శోషిల్లకున్నదిగదా?

అని, తాత్పర్యము.

ధర్మాపదేశా త్త్యజతశ్చ రాజ్యం
మాం చా ప్యరణ్యం నయతః పదాతిమ్
నాసీ ద్వ్యథా యస్య న భీ ర్న శోకః
కచ్చిత్స ధైర్యం హృదయే కరోతి. ౨౯

టీక॥ధర్మాపదేశాత్=ధర్మముయొక్కయుద్దేశమువలన; రాజ్యంచ=దొరతనమును;త్యజతః= విడుచుచున్నవాఁడును;మాంచ=నన్నును ; పదాతిం=పాదచారిణినిగాని;అరణ్యం=అడవిని;నయతః=పొందించుచున్నవాఁడునగు;యస్య=ఏరామునకు;వ్యథా= చింత;నాసీత్=కలుగలేదో ; భీః=భయము;న=కాలేదో;శోకః=దుఃఖము;న=కాలేదో;సః=అట్టిరాముఁడు ; హృదయే=మనసునందు; ధైర్యం=ధైర్యమును;కరోతికచ్చిత్= చేయుచున్నాఁడా యేమి?

ఎవ్వనికి,మున్ను, ధర్మసిద్ధికై,రాజ్యంబువిడిచినన్నుబాదచారిణిఁగా నరణ్యంబునకుందోడ్కొనివచ్చి నప్పుడు,

కొంచెమయినను, చింతగాని భయము గానిదుఃఖముగాని కలుగకుండెనో, అట్టిరాముండిప్పుడు నేను లేకుండుటచే, మనంబున ధైర్యంబు దప్పకున్నాఁడా యేమిః అని, తాత్పర్యము.

న చాస్య మాతా న పితా చ నాన్య
స్స్నేహా ద్విశిష్టో స్తి మయా సమోవా

టీక॥ అస్య = ఈరామునియొక్క; మాతాచ=తల్లియు; స్నేహాత్ (అధ్యాహృతము)=స్నేహమువలన; మత్తః(అధ్యాహృతము)=నాకన్న; విశిష్టా(అధ్యాహృతము) = అధికురాలు గాని; మయా(అధ్యాహృతము)= నాతో; సమావా(అధ్యాహృతము) = సమానురాలు గాని; న=కాదు. పితాచ= తండ్రియు; స్నేహాత్ =స్నేహమువలన; విశిష్టః=అధికుఁడుగాని; మయా= నాతో; సమోవా=సమానుండుగాని; న=కాఁడు; అన్యః=ఇతరుండును; న= కాఁడు.

ఈరామునితల్లికిఁగాని తండ్రికిఁగాని, యితరబంధువులకుఁగాని, యెవ్వరికిని, అతనిపై, నాకన్ననధిక స్నేహముగాని, నాకతనిపైఁగలిగియుండు స్నేహమంతటిస్నేహముగాని, లేదు.

అని, తాత్పర్యము.

లేక; ఈరామునకు, నాపైఁగలిగియుండు స్నేహముకన్న నధిక స్నేహముగాని, అంతటిస్నేహముగాని, యతనితల్లియందునుదండ్రియందును మఱి యెవ్వరియందును, లేదు.

అని, తాత్పర్యము.

తావ త్త్వహం దూత జిజీవిషేయం
యావ త్ప్రవృత్తిం శృణుయాం ప్రియస్య. ౩౦

టీక॥ యావత్ =ఎంతలోపల, ప్రియస్య=ప్రియుండగు రామునియొక్క; ప్రవృత్తిం=వార్తను; శృణుయాం= వినుదునో; తావత్తు= అంతవఱకే; అహం=నేను; జిజీవిషేయం= బ్రతుకనిచ్చింతును.

అట్లుకావున, రాముండు, నన్నుఁదోడ్కొనిపోవఁదలంచి యున్నాఁడో లే

దో, యనుసంగతినాకుఁ దెలియునంతవఱకు, నేనుబ్రతుకఁగోరియున్నాను; రాముఁడునన్నుమఱలందోడ్కొని పోవంగోరునేనిసరే; లేనిచోఁ, బ్రాణంబులవిడిచెను. అని, సీతాదేవి, హనుమంతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇతీవ దేవీ వచనం మహార్థం
తం వానరేంద్రం మధురార్థ ముక్త్వా
శ్రోతుం పున స్తస్య వచో భిరామం
రామార్థయుక్తం విరరామ రామా. ౩౧

టీక॥ దేవీ=రాణియగు; సీతా= సీత; ఇతీవ=ఇట్లు; తం = ఆ; వానరేంద్రం= వానరశ్రేష్ఠుండగుహనుమంతుం గూర్చి; మహార్థం=అధికమయినయర్థముగలదియు; మధురార్థం= మనోహరమయినయర్థము గలదియునగు; వచనం=మాటను; ఉక్త్వా=చెప్పి; తస్య=ఆహనుమంతునియొక్క; రామార్థయుక్తం = రామునికార్యముతోఁ గూడినదియును, కావుననే ; అభిరామం=మనోహరమయినదియునగు; వచః=మాటను; పునః=మఱల; శ్రోతుం=వినుటకు; విరరామ=ముగించెను.

సీతాదేవి, యిట్లు, హనుమంతునితో, నధికమయినయర్థముగలదియుమధురమునగుమాటం జెప్పి, యంత, నతనివలన, రామునింగుఱించినదగుటం జేసి మనోహరమయినమాటను, వినుటకై, యూరకుండెను.

అని, తాత్పర్యము.

సీతాయా వచనం శ్రుత్వా మారుతి ర్భీమవిక్రమః
శిరస్యం జలి మాధాయ వాక్య ముత్తర మబ్రవీత్. ౩౨

టీక॥ భీమవిక్రమః = భయంకరమయినపరాక్రమముగల; మారుతిః= వాయుదేవునికుమారుండైనహనుమంతుండు; సీతాయాః=సీతాదేవియొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; శిరసి= తలయందు; అంజలిం=చేమోడ్పును; ఆధాయ=ఉంచుకొని; ఉత్తరం=బదులు; వాక్యం=మాటను; అబ్రవీత్=పలికెను.

భయంకరంబయిన పరాక్రమంబుగలవాయుపుత్రుండగు హనుమంతుండు,

సీతాదేవిచెప్పినమాటనువిని, శిరంబు నం, జేమోడ్పుంగీలించుకొని,యిట్లని, బదులుచెప్పెను.

అని, తాత్పర్యము.

స త్వా మిహస్థాం జానీతే రామః కమలలోచనే

టీక॥ కమలలోచనే= తామరపూలవంటికండ్లుగలదానా! రామః=రాముఁడు; త్వాం=నిన్ను; ఇహస్థాం= ఇచ్చటనున్నదానిఁగా; నజానీతే=ఎఱుంగఁడు.

తామరపూలంబోలు కండ్లుగలసీతాదేవీ! నీవిచ్చటనున్నావని, రాముండెఱుంగఁడు. అని, తాత్పర్యము.

తేన త్వాం నానయ త్యాశు శచీ మివ పురందరః. ౩౩

టీక॥ తేన=అందుచేత; ఆశు=శీఘ్రముగ; పురందరః=ఇంద్రుఁడు; శచీమివ=శచీదేవినింబోలె; త్వాం=నిన్ను; నానయతి=తోడ్కొనిపోవకున్నాఁడు.

అందుచేతనే, అనుష్ఠోదునొద్దనుండుశచీదేవినెఱుంగకుండుటంజేసి,యింద్రుండుతీసికొనిపోవకుండునట్లు,నిన్నుశీఘ్రముగాఁదీసికొని పోవకున్నాఁడుగాని వేఱుగాదు; ఇంద్రునకుశచీదేవియనుహ్లాదునొద్దనున్నదని తెలిసినపిమ్మట, నాబిడంగొనిపోయినట్లు, నేనుబోయిచెప్పినంతనె,నిన్నుఁగొనిపోవంగలఁడు.

అని, తాత్పర్యము.

శ్రుత్వైవ తు వచో మహ్యం క్షిప్ర మేష్యతి రాఘవః
చమూం ప్రకర్ష న్మహతీం హర్యృక్షగణసంకులామ్. ౩౪

టీక॥ రాఘవః = రాముఁడు; మహ్యం=(షష్ఠ్యర్థమందుఁజతుర్థి)నాయొక్క; వచః = మాటను; శ్రుత్వైవతు=విన్నంతనె; క్షిప్రం=శీఘ్రముగా; మహతీం=పెద్దదియైనను; హర్యృక్షగణసంకులాం=వానరులయొక్కయు నెలుఁగుగొడ్డులయొక్కయు సమూహములచేనిండినదియైనను; చమూం=సేనను; ప్రకర్షన్=ఈడ్చుకొనుచు; ఏష్యతి=రాఁగలఁడు.

రాముండు, నేనుబోయి,నీసంగతిం జెప్పినంతనె, వానరులనుభల్లూకంబులను

బిలుచుకొని, శీఘ్రంబుగా, నిచ్చటికి, వచ్చును. అని, తాత్పర్యము.

విష్టంభయిత్వా బాణౌఘై రక్షోభ్యం వరుణాలయమ్
కరిష్యతి పురీం లంకాం కాకుత్స్థ శ్శాంత రాక్షసామ్. ౩౫

టీక॥ కాకుత్స్థః = రాముండు; అక్షోభ్యం = కొలంతపెట్టరాని ; వరుణాలయం = సముద్రమును; బాణౌఘైః = బాణసమూహంబులచేత ; విష్టంభయిత్వా (విష్టభ్య) = స్తంభించి; లంకాం = లంకయను; పురీం = పట్టణమును; శాంతరాక్షసాం = శాంతినొందిన రాక్షసులుగలదానినిగా; కరిష్యతి = చేయంగలండు.

రాముండు, అక్షోభ్యంబగు సముద్రంబును బాణంబుల స్తంభించి, దాటివచ్చి, యీలంకాపట్టణంబునందలి రాక్షసులనందఱంజంపును.

అని, తాత్పర్యము.

తత్ర యద్యంతరా మృత్యు ర్యది దేవా స్సహాసురాః
స్థాస్యంతి పథి రామస్య స తానపి వధిష్యతి. ౩౬

టీక॥ తత్ర = అప్పుడు ; రామస్య = రామునియొక్క; పథి = మార్గమునందు; అంతరా = అడ్డముగా; మృత్యుః = మృత్యువు; స్థాస్యతి (అధ్యాహృతము) యది = ఉండునేని; సహాసురాః = అసురులతోఁగూడిన; దేవాః = దేవతలు; స్థాస్యంతియది = ఉందురేని; సః = ఆరాముఁడు; తానపి = వారలనుంగూడ; వధిష్యతి = చంపఁగలండు.

అప్పుడు రాముని మార్గంబునకు, మృత్యువుగాని దేవతలుగానియసురులుగాని యడ్డమువచ్చినను, రాముండు, వారలనుంగూడఁజంపును; ఇంక, నీరాక్షసులంజంపునని చెప్పనేల?

అని, తాత్పర్యము.

తవాదర్శనజే నార్యే శోకేన స పరిప్లుతః
నశర్మ లభతే రామ స్సింహార్దిత ఇవ ద్విపః. ౩౭

టీక॥ ఆర్యే = పూజ్యురాలవగు సీతాదేవీ! తవ = నీయొక్క; అదర్శనజేన =

చూడకుండుటవలనంగలిగిన; శోకేన= దుఃఖముచేత; పరిప్లుతః= ముంపఁబడిన; సః= ఆ; రామః= రాముండు; సింహార్దితః= సింహముచేఁబీడింపఁబడిన; ద్విపఇవ= ఏనుంగుంబోలె; శర్మ= సౌఖ్యమును; నలభతే= పొందకున్నాఁడు.

పూజ్యురాలవగుసీతాదేవీ ! రాముండు, నిన్నుఁజూడకుండుటచేత, దుఃఖసముద్రంబునమునింగి, సింహంబుచేఁ బీడింపఁబడుచుండు నేనుంగుంబోలె, నెంతమాత్రము సుఖంబునొందకున్నాఁడు. అని, తాత్పర్యము.

మలయేనచ వింధ్యేన మేరుణా మందరేణచ
దుర్దురేణ చ తే దేవి శపే మూలఫలేనచ. ౩౮

యథా సునయనం వల్గు బింబోష్ఠం చారుకుండలమ్
ముఖం ద్రక్ష్యసి రామస్య పూర్ణచంద్ర మివోదితమ్. ౩౯

టీక॥ దేవి= సీతాదేవీ! యథా= ఎట్లు; సునయనం= సుందరములయినకండ్లుగలదియును; వల్గు= మనోహరమయినదియును; బింబోష్ఠం= దొండపండువంటిపెదవిగలదియును; చారుకుండలం= సుందరములయిన కుండలములు గలదియును; ఉదితం= ఉదయించిన; పూర్ణచంద్రమివ(స్థితం)= నిండుచంద్రుండువలెనున్నదియునగు; రామస్య= రామునియొక్క; ముఖం= మొగమును; ద్రక్ష్యసి= చూడఁగలవో; తథా= (అధ్యాహృతము) అట్లు; తే= నీకొఱకు; మలయేనచ= మలయపర్వతముచేతను; వింధ్యేన= వింధ్యపర్వతముచేతను; మేరుణా= మేరుపర్వతముచేతను; మందరేణచ= మందరపర్వతముచేతను; దుర్దురేణచ= దుర్దురపర్వతముచేతను; మూలఫలేనచ= గడ్డలచేతనుబండ్లచేతను; శపే= శపథముసేయుచున్నాను.

సీతాదేవీ! సుందరములయినకండ్లు కలిగి, మనోహరంబై, దొండపండువంటిపెదవితోఁగూడి, సుందరములయిన కుండలంబులతోనొప్పుచు, నిండుచందురునింబోలుచుండు, రామునిముఖంబును, నీవునిశ్చయముగాఁ, జూడఁగలవు; అట్లు, నేను, నావాసస్థానములగుమలయ వింధ్యమేరుమందరదుర్దురంబులు మొదలగుపర్వతంబులచేతను, నాయాహారంబగుకందమూలంబులచేతనుఫలంబులచేతను నీకు నమ్మకంబుగలుగుటకై,

శపథము సేయుచున్నాను. అని, తాత్పర్యము.

క్షిప్రం ద్రక్ష్యసి వైదేహి రామం ప్రస్రవణే గిరౌ
శతక్రతుమివాసీనం నాగరాజస్య మూర్ధని. ౪౦
"నాకపృష్ఠస్య" ఇతిపాఠాంతరం.

టీక॥ వైదేహి=సీతాదేవీ! ప్రస్రవణే=ప్రస్రవణంబను; గిరౌ= పర్వతమునం దు; ఆసీనం= కూర్చున్నవాఁడును; నాగ రాజస్య= ఏనుంగులలో శ్రేష్ఠమయిన యైరావతముయొక్క; నాకపృష్ఠస్య= (అని, పాఠాంతరము)= స్వర్గమునం దలియున్నతప్రదేశముయొక్క; మూ ర్ధని=శిరసునందు; ఆసీనం (అధ్యాహృతము)=కూర్చుండిన; శతక్రతుమివ (స్థితం)=దేవేంద్రుండువలె నున్నవాఁ డునగు; రామం=రాముని; క్షిప్రం=శీ ఘ్రముగా; ద్రక్ష్యసి=చూడఁగలవు.

సీతాదేవీ! నీవింక శీఘ్రంబుగనే, ప్రస్రవణం బను పర్వతంబుపైఁ గూ ర్చుండి, యైరావతంబుపైనున్న (పా ఠాంతర పక్షమునందు, నాకపృష్ఠంబు పైనున్న) దేవేంద్రునింబోలుచున్న, రా ముం, జూడఁగలవు. అని, తాత్పర్యము.

న మాంసం రాఘవో భుఙ్క్తే నచాపి మధు సేవతే

టీక॥ రాఘవః = రాముఁడు; మాం సం=మాంసమును; నభుఙ్క్తే=తినఁడు. మధుచాపి = మద్యమునైనను; న సేవ తే=సేవింపఁడు.

రాముండు, నీదుఃఖంబున, మాంస మును భుజింపఁడు; మద్యమునుఁ ద్రావఁ డు. అని, తాత్పర్యము.

వన్యం సువిహితం నిత్యం భక్తమశ్నాతి పంచమం. ౪౧

టీక॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; సువిహితం= వానప్రస్థుల కుఁజక్కఁగావిధింపఁబడిన; వన్యం=అ డవియందుఁబుట్టిన; భక్తం=ఆహారము ను; పంచమం= (అత్యంతయోగమునం దుద్వితీయ) ప్రాతస్సంగవమధ్యాహ్న పరాహ్ణసాయంకాలములనునైదుకా లంబులందు, ఐదవదైనసాయంకాలము

నందు; అశ్నాతి=తినుచున్నాఁడు.

రాముఁడు, ప్రతిదినంబును సాయం కాలంబునందొక్క-మాఱు, వానప్రస్థులకుయోగ్యములయిన, వన్యంబులగు, మూలఫలంబులను, దినుచున్నాఁడు.

అని, తాత్పర్యము.

నైవ దంశా న్న మశకా న్నకీటా న్న సరీసృపాన్
రాఘవో పనయే ద్గాత్రా త్త్వ ద్గతేనాం తరాత్మనా. ౪౨

టీక॥ రాఘవః=రాముఁడు; త్వద్గతేన=నిన్నుఁబొందిన; అంతరాత్మనా=మనంబుతో; సహితః (అధ్యాహృతము)=కూడినవాఁడై; గాత్రాత్=దేహమునుండి; దంశాన్= అడవియీఁగెలను; నైవాపనయేత్=తోలనేతోలఁడు. మశకాన్=దోమలను; న(అపనయేత్) తోలఁడు. కీటాన్= పురుగులను; న (అపనయేత్) — తోలఁడు. సరీసృపాన్=పాములను; న(అపనయేత్)=తోలఁడు.

రాముఁడు, మనంబుననిన్నెధ్యానించుచు, దేహంబుననుండి, యడవియీఁగెలనుగానిదోమలనుగాని పురుగులనుగానిపాములనుగాని, యవ్వలికిఁదోలికొనఁడు. అని, తాత్పర్యము.

నిత్యం ధ్యానపరో రామో నిత్యం శోక పరాయణః
నా న్య చ్చింతయతే కించి త్సతు కామవశం గతః. ౪౩

టీక॥ సః=ఆ; రామస్తు=రాముండుమాత్రము; కామవశం=మన్మథునియధీనతను; గతః=పొందినవాఁడై; నిత్యం=ఎల్లప్పుడు; ధ్యానపరః= ధ్యానించుటయందాసక్తుఁడై; నిత్యం=ఎల్లప్పుడును; శోకపరాయణః=దుఃఖమేముఖ్యమయినగతి గాఁగలవాఁడై; అన్యత్=ఇతరమును; కించిత్= కొంచెమయినను; నచింతయతే=చింతింపఁడు.

రాముఁడు, నీవులేకుండుటం జేసి, మన్మథపరవశుండై, యెల్లప్పుడును, నిన్నేధ్యానించుచునెల్లప్పుడును నిన్నేపేర్కొని దుఃఖించుచు, నితరముదేనినింగొంచెమయినందలంపఁడు.

అని, తాత్పర్యము.

అనిద్ర స్సతతం రామ స్సుప్తోపిచ నరోత్తమః

సీతేతి మధురాం వాణీం వ్యాహరన్ ప్రతి బుధ్యతే. ४४

టీక॥ నరోత్తమః=పురుషశ్రేష్ఠుం డగు; రామః=రాముండు; సతతం=ఎల్లప్పుడును; అనిద్రః=నిద్రలేనివాఁడై; సుప్తోపి=నిద్రించినను; సీతే=(సంధియార్షము) సీతా! ఇతి=అని; మధురాం=మనోహరమయిన; వాణీం=మాటను; వ్యాహరన్=చెప్పుచు; ప్రతిబుధ్యతే=మేలుకొనుచున్నాఁడు

పురుషశ్రేష్ఠుండగు రాముఁడు, నీ దుఃఖంబున, నెప్పుడునునిదురింపఁడు; అట్లుగొంచెము నిదురనోయినను, సీతా యనిమధురంబుగాని న్నుఁ బేరొ్కనుచు, మేలుకొనును.

అని, తాత్పర్యము.

దృష్ట్వా ఫలంవా పుష్పంవా యద్వాన్య త్సుమనోహరం
బహుశో హా ప్రియే త్యేవం శ్వసం స్త్వా మభిభాషతే. ४౫

టీక॥ రామః (అధ్యాహృతము)=రాముఁడు; ఫలంవా=పండునైనను; పుష్పంవా=పూవునైనను; అన్యత్=ఇతరమయిన; సుమనోహరం=మిక్కిలియు రమణీయమయినది; యత్ (అస్తి)=ఏదిగలదో; తత్ (అధ్యాహృతము)=వా=దానినైనను; దృష్ట్వా=చూచి; బహుశః=అనేకవిధంబులను; హాప్రియే=అయ్యోప్రియురాలా! ఇతి (సంధియార్షము)=అని; ఏవం=ఇట్లు; శ్వసన్=నిట్టూర్పుఁ విడుచుచు; త్వాం=నిన్ను; అభిభాషతే=పేరుకొనుచున్నాఁడు.

రాముండు, ఫలమునుగానిపుష్పమునుగాని యట్టిమనోహరపదార్థమును మఱి దేనినిగానిచూచునేని, అప్పుడే, నిన్నుఁదలంచుకొని "ప్రియురాలా!" అనినిన్నుఁబేరొ్కనుచు, నిట్టూర్పులువిడుచును. అని, తాత్పర్యము.

స దేవి నిత్యం పరితప్యమాన
స్త్వామేవ సీతే త్యభిభాషమాణః
ధృతవ్రతో రాజసుతో మహాత్మా
తవైవ లాభాయ కృత ప్రయత్నః. ४౬

టీక॥ దేవి=సీతాదేవీ! ధృతవ్రతః=ధరింపఁబడిన వానప్రస్థవ్రతంబుగల

వాఁడును;మహాత్మా= అధికమయినపరాక్రమముగలవాఁడును; రాజసుతః= రాచకొమరుండునగు;సః=ఆరాముండు;నిత్యం=ఎల్లప్పుడును; పరితప్యమానః=పరితాపమునొందుచు;సీతే(సంధియాషకము)=సీతా!ఇతి=అని;త్వామేవ=నిన్నే ; అభిభాషమాణః = పేరొంనుచు;తవ=నీయొక్క; లాభాయైవ=పొందుటకొఱకె;కృతప్రయత్నః=చేయఁబడినప్రయత్నముగలవాఁడు;భవతి( అధ్యాహృతము ) = అగుచున్నాఁడు.

సీతాదేవీ!తండ్రియాజ్ఞచే వానప్రస్థవ్రతమునవలంబించియున్నవాఁడును మహాపరాక్రమశాలియును రాచకొమరుండునగురాముండు, ఎల్లప్పుడును,నిన్నెదలంచుకొని పరితపించుచు, నిన్నే "సీతా!" యనిపేరొంనుచు, నిన్నుఁబొందుటకై యె, ప్రయత్నముసేయుచున్నాఁడు.అని,హనుమంతుండు, సీతకుఁజెప్పెను.అని, తాత్పర్యము.

సా రామ సంకీర్తన వీతశోకా
రామస్య శోకేన సమాన శోకా
శరన్ముఖే సాంబుద శేష చంద్రా
నిశేవ వైదేహసుతా బభూవ. ౪౭

టీక॥ వైదేహసుతా = జనకమహారాజుకొమార్తెయగు: సా=ఆసీతాదేవి;రామసంకీర్తనవీతశోకా= రాముని కీర్తించుట చేతవిడువఁబడిన దుఃఖముగలదై;రామస్య= రామునియొక్క; శోకేన=దుఃఖము చేత;సమానశోకా= రామునిదుఃఖముతో , సమానమయిన దుఃఖముగలదై; శరన్ముఖే = శరదృతువుయొక్క యారంభమునందు; సాంబుదశేషచంద్రా = మేఘముయొక్కమిగతతోఁగూడిన చంద్రుఁడుగల; నిశేవ=రాత్రివలె;బభూవ=ఉండెను.

జనకునికొమార్తెయగు నాసీతాదేవి, "రాముండు,తన్నుఁదోడ్కొనిపోవుటకైవచ్చును"అనివినుటచేదుఃఖములేనిదయ్యె; "రాముండుతనవిరహంబునఁబరమదుఃఖితుండైయున్నాఁ" డనివినుటచే,రామునకుం గల్గినంతటిదుఃఖమునొంది,శరదారంభంబునఁ, గొంచెముమేఘము చేఁగప్పఁబడినచంద్రునితోఁగూ

డినరాత్రివలెఁ, బ్రకాశముగల్గియు, లేకయు, నుండెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, షట్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండషట్త్రింశసర్గటీక
ముగిసినది.

---

సప్తత్రింశసర్గప్రారంభః.

సీతా తద్వచనం శ్రుత్వా పూర్ణచంద్ర నిభాననా
హనూమంత మువాచేదం ధర్మార్థ సహితం వచః. ౧

టీక॥ పూర్ణచంద్రనిభాననా=నిండుచంద్రునితోసమానమయినముఖముగల; సీతా=సీతాదేవి; తత్ = ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; హనూమంతం = హనుమంతునిగూర్చి; ధర్మార్థసహితం= ధర్మమనెడుప్రయోజనముతోఁగూడిన; ఇదం=ఈ; వచనం=మాటను; ఉవాచ=చెప్పెను.

నిండుచంద్రునింబోలు ముఖంబుగల సీతాదేవి, యాహనుమంతుండుచెప్పిన మాటనువిని, హనుమంతుంజూచి, ధర్మసహితంబగునీమాటంజెప్పెను. అని, తాత్పర్యము.

అమృతం విష సంసృష్టం త్వయా వానర భాషితం
యచ్చ నాన్య మనా రామో యచ్చ శోక పరాయణః. ౨

టీ॥ వానర=హనుమంతుఁడా! రామః=రాముఁడు; అన్యమనాః=ఇతరమునందు మనసుగలవాఁడు; న(ఇతి) యచ్చ (అస్తి)=కాఁడనున దేదియుగలదో; శోకపరాయణః=దుఃఖమెముఖ్యమయినగతి గాఁగలవాఁడు; (ఇతి) యచ్చ (అస్తి)= అనున దేదియుగలదో; తత్=(అధ్యాహృతము) అట్టి; విషసంసృష్టం =విషము

తోఁగలంపఁబడిన; అమృతం= అమృతము; త్వయా=నీచేత; భాషితం=చెప్పఁబడినది.

హనుమంతుఁడా! నీవు, "రాముండు, ఎప్పుడును నన్నే తలంచుకొనుచున్నాఁడు" అని, నాకు సంతోషకరంబగు వార్తను, "ఎప్పుడును దుఃఖించుచున్నాఁడు" అని, నాకు దుఃఖకరంబగు వార్తను, ఇట్లు, అమృతంబును విషంబునుం గలఁపినట్లు, ఈ రెండు మాటలం జెప్పి, చెప్పినావు, కావున, నాకు సంతోషంబును దుఃఖంబునుం గలుగుచున్నది. అని, తాత్పర్యము.

ఐశ్వర్యే వా సువిస్తీర్ణే వ్యసనే వాతి దారుణే
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాంతః పరికర్షతి. ౩

టీక॥ సువిస్తీర్ణే= మిక్కిలియు నధికమయిన; ఐశ్వర్యే వా= ఐశ్వర్యమునందుఁగాని; అతిదారుణే= మిక్కిలియు భయంకరమయిన; వ్యసనే వా= దుఃఖము నందుఁగాని; కృతాంతః=దైవము; పురుషం=పురుషుని; రజ్జ్వా= త్రాటిచేత; బద్ధ్వేవ=కట్టినవలె; పరికర్షతి=ఈడ్చుచున్నది.

మిక్కిలియు నధికమయిన యైశ్వర్యము వచ్చినప్పుడుగాని యతి భయంకరమయిన వ్యసనంబు సంభవించినప్పుడుగాని, పురుషుం డెంతమాత్రము స్వతంత్రుండు గాఁడు; దైవం బతనిఁ, ద్రాటిచే బంధించినట్లు పట్టుకొని, యీడ్చుకొనిపోవును. అని, తాత్పర్యము.

విధిర్నూన మసంహార్యః ప్రాణినాం ప్లవగోత్తమ
సౌమిత్రిం మాంచ రామంచ వ్యసనైః పశ్య మోహితాన్. ౪

టీక॥ ప్లవగోత్తమ= వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! విధిః = దైవము; ప్రాణినాం=జంతువులకు; అసంహార్యః=నివారింపఁదగనిది. నూనం= నిశ్చయము. వ్యసనైః = కష్టములచేత; మోహితాన్ = మోహమునొందిన; సౌమిత్రిం=లక్ష్మణుని; మాంచ=నన్నును; రామంచ=రాముని; పశ్య= చూడుము.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! ప్రాణులకు దైవము నతిక్రమింప నలవిగాదు; ఇది నిశ్చయము; లక్ష్మణుండును నేనును రాముండును, మువ్వురము, మహావ్యసనంబులం బొందియు

న్నాము; చూడుము. అని, తాత్పర్యము.

శోకస్యాస్య కదా పారం రాఘవోఽధిగమిష్యతి
ప్లవమానః పరిశ్రాంతో హతనౌస్సాగరే యథా. ౫

టీక॥ రాఘవః=రాముఁడు; సాగరే=సముద్రంబునందు; హతనౌః = భగ్నమయినయోడగలవాఁడును; ప్లవమానః=ఈఁదుచున్నవాఁడును; పరిశ్రాంతోయథా= అలసటనొందినవాఁడునగువాఁడువలె; అస్య=ఈ; శోకస్య=దుఃఖముయొక్క; పారం= అంతమును; కదా=ఎప్పుడు; అధిగమిష్యతి=పొందఁగలఁడు.

సముద్రంబుననోడమునుంగఁగా, నీఁదుకొనుచునలసటనొందినవాఁడువలెఁ, బరమదుఃఖితుండగురామునకు, ఈదుఃఖమెప్పుడునశించునుః అని, తాత్పర్యము.

రాక్షసానాం వధం కృత్వా సూదయిత్వాచ రావణం
లంకా మున్మూలితాం కృత్వా కదా ద్రక్ష్యతి మాం పతిః. ౬

టీక॥ పతిః=పెనిమిటియగురాముండు; రాక్షసానాం=రాక్షసులయొక్క; వధం=చంపుటను; కృత్వా=చేసి; రావణంచ=రావణుని; సూదయిత్వా=చంపి; లంకాం=లంకను; ఉన్మూలితాం=పెల్లగింపఁబడినదానిఁగా; కృత్వా=చేసి; కదా=ఎప్పుడు; మాం=నన్ను; ద్రక్ష్యతి=చూడఁగలఁడు.

నాపెనిమిటియగురాముండు, రాక్షసులనందఱంజంపి, రావణునివధించి, యీలంకయంతయునాశంబు నొందించి, నన్నెప్పుడుచూడఁగలఁడు.

అని, తాత్పర్యము.

స వాచ్య స్సంత్వర స్వేతి యావ దేవ న పూర్యతే
అయం సంవత్సరః కాల స్తావద్ధి మమ జీవితం. ౭

టీక॥ "యావత్= ఎంతలోపల; అయం=ఈ; సంవత్సరః= సంవత్సరమను; కాలః=కాలము; నపూర్యతే=కడవదో; తావత్(అధ్యాహృతము)ఏవ=

అంతలోపలనే "సంవత్సరస్వ=వేగిరపడుము." ఇతి=అని; సః=ఆ రాముఁడు;వాచ్యః=చెప్పఁదగినవాఁడు.మమ = నాయొక్క;జీవితం=ప్రాణము; తావద్ధి=అంతవఱకేగదా!

నాకు రావణుండు పెట్టిన యీ సంవత్సర కాలము గడువుగడచుటకుమున్నే యిచ్చటికిశీఘ్రముగా రావలసినట్లు, నీవు రామునకుంజెప్పుము; నేనుబ్రతుకునదంతవఱకే;ఆపిమ్మట, నన్ను రావణుండుచంపివేయును.

అని, తాత్పర్యము.

వర్తతే దశమో మాసో ద్వౌతు శేషౌ ప్లవంగమ
రావణేన నృశంసేన సమయో యః కృతో మమ. ౮

టీక॥ప్లవంగమ= హనుమంతుఁడా! నృశంసేన=క్రూరుండగు; రావణేన=రావణునిచేత; మమ=నాకు;యః=ఏ; సమయః=అవధి;కృతః= చేయఁబడినదో;తస్మిన్ (అధ్యాహృతము)= సంవత్సరమునందు;దశమః=పదవదైన;మాసః=మాసము; వర్తతే=ఉన్నది.ద్వౌతు=రెండు మాసములుమాత్రము; శేషౌ=మిగిలినవి.

హనుమంతుఁడా! క్రూరుండగు రావణుండు నాకొక్క సంవత్సరం బవధియుంచియున్నాఁడు;అందిప్పుడు, పదవమాసమును ముగియవచ్చినది; ఇంక రెండుమాసములె మిగిలియున్నవి; ఈ రెండుమాసములే నేనింక బ్రతికియుండఁగలను; ఈలోపలనే, రాముండిచ్చటికివచ్చునట్లు, సేయవలయును.

అని, తాత్పర్యము.

విభీషణేనచ భ్రాత్రా మమ నిర్యాతనం ప్రతి
అనునీతః ప్రయత్నేన నచ తత్కురుతే మతిం. ౯

టీక॥ రావణః(అధ్యాహృతము) = రావణుఁడు;భ్రాత్రా=తమ్ముడైన;విభీషణేనచ=విభీషణునిచేతను;మమ= నాయొక్క;నిర్యాతనంప్రతి= పంపుటనుగూర్చి;ప్రయత్నేన=ప్రయత్నముచేత; అనునీతః=అనునయింపఁబడినాఁడు; తత్=దానియందు;మతిం= బుద్ధిని,నచకురుతే=చేయనేచేయఁడు.

రావణునితమ్ముఁడు విభీషణుండనువాఁడు "నన్ను రామున కొసంగుము"

అని, రావణునకుఁ బ్రయత్నంబుగా, మంచిమాటలం జెప్పెను; అట్లయినను; అతండుఆమాటనంగీకరింపఁడయ్యె. అని, తాత్పర్యము.

మమ ప్రతిప్రదానంహి రావణస్య న రోచతే

టీక॥ రావణస్య = రావణునకు; మమ = నాయొక్క; ప్రతిప్రదానం = మరలనిచ్చుట; నరోచతేహి = రుచింపదుగదా!

నన్ను, మరలరామునకొసంగుటకు, రావణుండెంతమాత్ర మొప్పుకొనఁడయ్యె. అని, తాత్పర్యము.

రావణం మార్గతే సంఖ్యే మృత్యుః కాలవశం గతమ్. ౧౦

టీక॥ సంఖ్యే = యుద్ధమునందు; మృత్యుః = మృత్యువు; కాలవశం = కాలముయొక్కయధీనతను; గతం = పొందిన; రావణం = రావణుని; మార్గతే = వెదకుచున్నాఁడు.

కాలవశంగతుండగు రావణుని యుద్ధంబునంగొనిపోవ, మృత్యువు వెదకుచున్నాఁడుకాఁబోలు. అని, తాత్పర్యము.

జ్యేష్ఠా కన్యా నలా నామ విభీషణసుతా కపే
తయా మమేద మాఖ్యాతం మాత్రా ప్రహితయా స్వయమ్. ౧౧

టీక॥ కపే = హనుమంతుఁడా! విభీషణసుతా = విభీషణునికూఁతురు ; నలా నామ = నలయని ప్రసిద్ధినొందినది ; జ్యేష్ఠా = పెద్దదైన; కన్యా = కూఁతురు ; అస్తి (అధ్యాహృతము) = ఉన్నది. మాత్రా = తల్లి చేత; స్వయం = తనకుఁదానె; ప్రహితయా = పంపఁబడిన ; తయా = ఆబిడచేత; మమ = నాకు; ఇదం = ఈసమాచారము; ఆఖ్యాతం = చెప్పఁబడినది.

హనుమంతుఁడా ! విభీషణుని పెద్దకూఁతురు, నలయనునదియొక్కతెయున్నది; ఆబిడ, తనతల్లి పంపఁగా, నాయొద్దకువచ్చి, యీసమాచారమంతయుం జెప్పినది. అని, తాత్పర్యము.

అసంశయం హరిశ్రేష్ఠ క్షిప్రం మాం ప్రాప్స్యతే పతిః
అంతరాత్మా హి మే శుద్ధ స్తస్మింశ్చ బహవో గుణాః. ౧౨

టీక॥ హరిశ్రేష్ఠ=వానరోత్తముండవగుహనుమంతుఁడా! పతిః = పెనిమిటి; క్షిప్రం=శీఘ్రముగా; మాం=నన్ను; అసంశయం=సందేహములేదు; ప్రాప్స్యతే=పొందఁగలఁడు; మే=నాయొక్క; అంతరాత్మా=మనసు; శుద్ధా=నిర్మలంబుగదా; తస్మింశ్చ=ఆరామునందును; బహవః=అనేకములయిన; గుణాః=గుణంబులు; సంతి(అధ్యాహృతము)=ఉన్నవి.

వానరోత్తముండవగుహనుమంతుఁడా! నాపెనిమిటిరాముండు నన్నుశీఘ్రముగాఁబొందఁగలఁడు; ఇందెంతమాత్రము సందేహములేదు: ఏలననఁగా, నామనసునిర్మలంబుగనున్నది; మఱియు రామునందుఁ, బెక్కుగుణంబులు గలవు. అని, తాత్పర్యము.

ఉత్సాహః పౌరుషం సత్త్వ మానృశంస్యం కృతజ్ఞతా
విక్రమశ్చ ప్రభావశ్చ సంతి వానర రాఘవే. ౧౩

టీక॥ వానర=హనుమంతుఁడా! రాఘవే=రామునందు; ఉత్సాహః= గొప్పకార్యములయందు స్థిరమయినప్రయత్నమును; పౌరుషం=అట్టికార్యములు సేయుటయును; సత్త్వం=బలమును; ఆనృశంస్యం = క్రూరుఁడు గాకుండుటయు; కృతజ్ఞతా= ఉపకారముమఱవకుండుటయు; విక్రమశ్చ=శౌర్యమును; ప్రభావశ్చ=శక్తియును; సంతి=ఉన్నవి.

హనుమంతుఁడా! గొప్పకార్యములు సేయఁబ్రయత్నించుటయు, నట్టికార్యములు సేయుటయు, బలంబును, దయయు, నుపకారంబు మఱవకుండుటయు, శౌర్యంబును, శక్తియు, నీగుణంబులన్నియు, రామునందున్నవి.

అని, తాత్పర్యము.

చతుర్దశసహస్రాణి రాక్షసానాం జఘాన యః
జనస్థానే వినాభ్రాత్రా శత్రుః క స్తస్య నోద్విజేత్. ౧౪

టీక॥యః=ఎవ్వఁడు; జనస్థానే=జనస్థానమునందు; భ్రాత్రావినా= తమ్ముండగు లక్ష్మణునివిడిచి; రాక్షసానాం=రాక్షసులయొక్క; చతుర్దశ=పదునాలుగు;సహస్రాణి=వేలను; జఘాన=చంపెనో; తస్య=అట్టిరామునియొక్క; శత్రుః=శత్రువు;కః=ఎవ్వఁడు; నోద్విజేత్=దుఃఖింపఁడు?

జనస్థానంబున, లక్ష్మణుండును లేకుండునప్పుడు, అసహాయుండై, తానొక్కరుఁడె, పదునాలుగువేలరక్కసులంజంపినట్టిరామునకు, శత్రువైనవాఁడెవ్వఁడు,బ్రతుకంజాలును? అని, తాత్పర్యము.

న స శక్య స్తులయితుం వ్యసనైః పురుషర్షభః
అహం తస్య ప్రభావజ్ఞా శక్రస్యేవ పులోమజా. ౧౫

టీక॥పురుషర్షభః = పురుషశ్రేష్ఠుండగు;సః = ఆరాముండు; వ్యసనైః=కష్టములచేత;తులయితుం = చలింపఁజేయుటకు;శక్యః= అలవియయినవాఁడు;న=కాఁడు.అహం=నేను; తస్య=ఆరామునియొక్క; పులోమజా=శచీదేవి;శక్రస్యేవ = దేవేంద్రునియొక్కవలె;ప్రభావజ్ఞా = ప్రభావమునెఱుంగు దానను.

పురుషశ్రేష్ఠుండగునారాముండు,ఎన్నికష్టంబులువచ్చినను ఎంతమాత్రముచలింపఁడు; దేవేంద్రునిప్రభావముశచీదేవికిఁదెలిసినట్లు, రామునిప్రభావమునాకుఁదెలియును. అని,తాత్పర్యము.

శరజాలాంశుమాన్ శూరః కపే రామదివాకరః
శత్రు రక్షోమయం తోయ ముపశోషం నయిష్యతి. ౧౬

టీక॥కపే=హనుమంతుఁడా! శూరః=యుద్ధమునందుభయములేనివాఁడును;శరజాలాంశుమాన్=బాణసమూహమనెడుకిరణంబులు గలవాఁడునగు; రామదివాకరః=రాముండనుసూర్యుఁడు;శత్రురక్షోమయం=శత్రువులయిన రాక్షసులువికారమయిన; తోయం=జలమును;ఉపశోషం=ఎండుటను; నయిష్యతి(నేష్యతి)=పొందింపఁగలఁడు.

హనుమంతుఁడా!సూర్యుఁడుకిరణంబులజలమునుశోషిల్లఁజేయునట్లు, రాముండు, బాణంబులచే,శత్రువులయిన

రాక్షసులం, జంపఁగలఁడు. అనిసీత, హనుమంతునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి సంజల్పమానాం తాం రామార్థే శోకకర్శితామ్
అశ్రుసంపూర్ణనయనా మువాచ వచనం కపిః. ౧౭

టీక॥ కపిః=హనుమంతుఁడు; ఇతి=ఇట్లు; సంజల్పమానాం= చెప్పుచున్నదియును; రామార్థే= రామునినిమిత్తమయి; శోకకర్శితాం= దుఃఖముచేఁ గృశింపఁజేయఁబడినదియును; అశ్రుసంపూర్ణనయనాం= కన్నీళ్లచేనిండిన కండ్లుగలదియునగు; తాం= ఆసీతనుగూర్చి; వచనం=మాటను; ఉవాచ=చెప్పెను.

హనుమంతుండీప్రకారము చెప్పుచున్నదియును రామునినిమిత్తమయి దుఃఖంబునం గృశించియున్నదియుఁ గండ్లు నిండఁగన్నీళ్లు గార్చుచున్నదియు నగు, నాసీతంజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రుత్వైవతు వచో మహ్యం క్షిప్ర మేష్యతి రాఘవః
చమూం ప్రకర్షన్ మహతీం హర్యృక్షగణసంకులామ్. ౧౮

టీక॥ రాఘవః= రాముఁడు ; మహ్యం=(షష్ఠ్యర్థమందుఁజతుర్థి) నాయొక్క; వచః= మాటను ; శ్రుత్వైవతు=విన్నంతనె; మహతీం=పెద్దదియు; హర్యృక్షగణసంకులాం = వానరులయొక్కయు నెలుఁగు గొడ్డులయొక్కయుసమూహములచేత నిండినదియునగు; చమూం=సేనను; ప్రకర్షన్=ఈడ్చుకొనుచు; క్షిప్రం=శీఘ్రముగా; ఏష్యతి=రాఁగలఁడు.

రాముండు, నేనుబోయిసీసంగతింజెప్పినంతనె , పెక్కువానరులనుభల్లూకంబులనుంగూడి, యిచ్చటికి , శీఘ్రముగా, రాఁగలఁడు, అని, తాత్పర్యము.

అథవా మోచయిష్యామి త్వా మద్యైవ వరాననే
అస్మా ద్దుఃఖా దుపారోహ మమ పృష్ఠ మనిందితే. ౧౯



టీక॥వరాననే=సుందరమయినముఖముగలసీతాదేవీ!అథవా=అటుగాదేని; త్వాం=నిన్ను; అద్యైవ= ఇప్పుడె;అస్మాత్=ఈ;దుఃఖాత్= దుఃఖమునుండి; మోచయిష్యామి =విడిపించెదను.అనిందితే=నిందింపఁబడనిదానా!మమ=నాయొక్క; పృష్ఠం=వీపును; ఉపారోహ=ఎక్కుము.

సుందరమయినముఖముగలదానవు నిందింపఁబడనిదానవునగుసీతాదేవీ! అటుకాదేని, నీదుఃఖంబునిప్పుడెపోఁగొట్టెదను;నీవునావీఁపుపైనెక్కుము; నిన్నిప్పుడెరామునొద్దకుఁదీసికొని పోయెదను. అని, తాత్పర్యము.

త్వాం హి పృష్ఠగతాం కృత్వా సంతరిష్యామి సాగరమ్

టీక॥అహం (అధ్యాహృతము)—నేను;త్వాం—నిన్ను;పృష్ఠగతాం—వీపునొందినదానిఁగా; కృత్వా=చేసికొని; సాగరం=సముద్రమును ; సంతరిష్యామిహి=దాఁటెదనుగదా!

నేనునిన్నిప్పుడు వీపుపైనుంచుకొని, సముద్రమునుదాఁటెదను.

అని, తాత్పర్యము.

శక్తిరస్తిహి మే వోఢుం లంకామపి సరావణామ్. ౨౦

టీక॥ మే=నాకు; స రావణాం= రావణునితోఁగూడిన; లంకామపి= లంకనైనను; వోఢుం=మోయుటకు ; శక్తిః= సామర్థ్యము; అస్తిహి=ఉన్నదిగదా!

నాకునిన్ను మోసికొనిపోవుటకు శక్తియున్నదో లేదోయని శంకింపవలదు; రావణునితోఁగూడ నీలంకనైనను, మోసికొనిపోవంజాలుదును.

అని, తాత్పర్యము.

అహం ప్రస్రవణస్థాయ రాఘవాయాద్య మైథిలి
ప్రాపయిష్యామి శక్రాయ హవ్యం హుత మివానఘ. ౨౧

టీక॥ మైథిలి=సీతా! అహం= నేను; అద్య=ఇప్పుడు; ప్రస్రవణస్థాయ= ప్రస్రవణపర్వతమునందున్న ; రాఘవాయ=రామునికొఱకు; త్వాం (అధ్యాహృతము)=నిన్ను; శక్రాయ= ఇంద్రునికొఱకు; అనలః=అగ్నిహోత్రుఁడు; హుతం= హోమముచేయబడిన; హవ్యమివ= హవిస్సునువలె; ప్రాపయిష్యామి=పొందించెదను.

సీతాదేవీ! వేల్వంబడిన హవిస్సునగ్నిహోత్రుండు దేవేంద్రునకొసంగినట్లు, నే, నిప్పుడు నిన్నుదీసికొనిపోయి, ప్రస్రవణపర్వతంబునందున్న, రామునకొసంగెదను. అని, తాత్పర్యము.

ద్రక్ష్య స్యద్యైవ వైదేహి రాఘవం సహ లక్ష్మణమ్
వ్యవసాయ సమాయుక్తం విష్ణుం దైత్య వధే యథా ౨౨

టీక॥ వైదేహి=సీతాదేవీ; సహలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడినవాఁడును; దైత్యవధే = అసురులచంపుటయందు; వ్యవసాయసమాయుక్తం= ప్రయత్నముతోఁగూడినవాఁడును; విష్ణుంయథా (స్థితం) = విష్ణుదేవుఁడువలెనున్నవాఁడునగు; రాఘవం=రాముని; అద్యైవ= ఇప్పుడె; ద్రక్ష్యసి=చూడఁగలవు.

సీతాదేవీ! లక్ష్మణునింగూడి, రాక్షసవధంబునం బ్రయత్నంబుసేయుచు; నట్లుదైత్యవధంబునం బ్రయత్నించుదువిష్ణుదేవుండుంబోలెనున్న, రాముని, నిప్పుడె, చూడఁగలవు. అని, తాత్పర్యము.

త్వ ద్దర్శనకృతోత్సాహ మాశ్రమస్థం మహాబలమ్

పురందర మివాసీనం నాగరాజస్య మూర్ధని. ౨౩

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; త్వద్దర్శనకృతోత్సాహం= నీయొక్క చూచుటయందుఁజేయఁబడిన యుత్సాహముగలవాఁడును; మహాబలం=అధికమైనబలముగలవాఁడును; ఆశ్రమస్థం=ఆశ్రమంబుననున్నవాఁడును; నాగరాజస్య=ఏనుంగులలో శ్రేష్ఠమయిన ఐరావతముయొక్క; మూర్ధని= శిరమునందు; ఆసీనం=కూర్చున్న ; పురందరమివ (స్థితం)=దేవేంద్రుండువలెనున్నవాఁడునగు; రాఘవం (అధ్యాహృతము)=రాముని; ద్రక్ష్యసి (అధ్యాహృతము)=చూడఁగలవు.

నిన్నుఁజూడఁగోరుచున్నవాఁడును, మహాబలుండును, ఆశ్రమంబుననున్నఁవాఁడును, ఐరావతంబుపైఁగూర్చుండియున్నయింద్రుండుంబోలెఁ దేజరిల్లుచున్నవాఁడునగు, రామునిప్పుడె, చూడఁగలవు. అని, తాత్పర్యము.

పృష్ఠ మారోహ మే దేవి మావికాంక్షస్వ శోభనే
యోగ మన్విచ్ఛ రామేణ శశాంకేనేవ రోహిణీ. ౨౪

టీక॥శోభనే=మంగళకరివగు ; దేవి=సీతాదేవీ! మే=నాయొక్క ; పృష్ఠం=వీపును; ఆరోహ=ఎక్కుము. మావికాంక్షస్వ= ఉపేక్షింపకుము. రామేణ=రామునితో; శశాంకేన= చంద్రునితో; రోహిణీవ = రోహిణీదేవియుంబోలె; యోగం=కూడికను; అన్విచ్ఛ=కోరుము.

మంగళకరివగుసీతాదేవీ ! నావీపుపైఁగూర్చుండుము; ఉపేక్ష సేయవలదు; రోహిణీదేవిచంద్రునింగూడునట్లు, రామునింగూడుము. అని, తాత్పర్యము.

కథయంతీవ చంద్రేణ సూర్యేణచ మహార్చిషా
మత్పృష్ఠ మధిరుహ్య త్వం తరాకాశమహార్ణవౌ. ౨౫

టీక॥త్వం=నీవు; మత్పృష్ఠం = నాయొక్క వీపును; అధిరుహ్య=ఎక్కి; చంద్రేణ=చంద్రునితోను; మహార్చిషా= అధికమయినకాంతిగల; సూర్యేణచ=

స ౩౭

సూర్యునితోను; కథయంతీవ(స్థితా)= మాటలాడుచున్నట్లున్నదానవై; ఆకాశమహార్ణవౌ= ఆకాశమునుసముద్రమును;తర=దాటుము.

నీవు,నావీపుపైనెక్కి, చంద్రునితోనుసూర్యునితోనుమాటలాడుచున్నట్లు, ఆకాశమార్గంబునవలంబించి, సముద్రంబు దాటుము.

అని, తాత్పర్యము.

నహి మే సంప్రయాతస్య త్వా మితో నయతోఽంగనే

అనుగంతుం గతిం శక్తా స్సర్వే లంకానివాసినః. ౨౮

టీక॥ అంగనే=స్త్రీవగుసీతాదేవీ! సంప్రయాతస్య= పయనమయినవాండును;త్వాం=నిన్ను;ఇతః=ఇచ్చటనుండి;నయతః=తీసికొనిపోవుచున్నవాండునగు;మే=నాయొక్క;గతిం=గమనమును;అనుగంతుం=వెంబడించుటకు; లంకానివాసినః= లంకయందున్నవారలు; సర్వే=అందఱు; నశక్తాహి=సమర్థులుకారుగదా!

సీతాదేవీ!నీవుస్త్రీవికావున నేనునిన్నుం దీసికొనిబయలుదేఱంగానే , యొకవేళ రాక్షసులునన్నుం బట్టుకొందురనితలంతువుకాంబోలు; ఈలంకలోనున్నవాం డెవ్వండును, నాతోసరిగానాకాశంబునందిరుగంజాలండు.

అని, తాత్పర్యము.

యథైవా హ మిహ ప్రాప్త స్తథైవాహ మసంశయః

యాస్యామి పశ్య వైదేహి త్వా ముద్యమ్య విహాయసమ్. ౨౭

టీక॥వైదేహి=సీతాదేవీ!అహం=నేను;యథైవ=ఏవిధంబుననే;ఇహ=ఇచ్చటికి;ప్రాప్తః=వచ్చినానో;తథైవ= ఆవిధంబుననే;త్వాం=నిన్ను; ఉద్యమ్య ఎత్తికొని;విహాయసం= ఆకాశమును; యాస్యామి=పొందెదను.అసంశయః= సందేహములేదు.పశ్య=చూడుము.

సీతాదేవీ! నేనిచ్చటికెట్లుసులభంబుగాసముద్రమునుదాంటివచ్చినానో, అట్లే, ఏమియుంగష్టములేనట్లు, నిన్నెత్తుకొని, యాకాశమార్గంబునసముద్రంబుదాంటెదను;సందేహములేదు; చూడుము.అనిహనుమంతుండు, సీతతోంజెప్పెను.అని, తాత్పర్యము.

మైథిలీతు హరిశ్రేష్ఠా చ్ఛ్రుత్వా వచన మద్భుతమ్
హర్షవిస్మితసర్వాంగీ హనుమంత మథా బ్రవీత్. ౨౮

టీక॥ మైథిలీ = సీతాదేవి; హరిశ్రేష్ఠాత్ = వానరోత్తముండగు హనుమంతునివలన; అద్భుతం = ఆశ్చర్యకరమయిన; వచనం = మాటను; శ్రుత్వాతు = విన్నంతనే; హర్షవిస్మితసర్వాంగీ = సంతోషముచేగగుర్పాటునొందినసమస్తములయినయవయవములుగలదై; అథ = అటుపిమ్మట; హనుమంతం = హనుమంతునిగూర్చి; అబ్రవీత్ = పలికెను.

సీతాదేవి, వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు చెప్పిన యాశ్చర్య కరంబగు మాటనువిని, మహాసంతోషంబునొంది, దేహంబంతయు గగుర్పాటునొంద, హనుమంతుంజూచి, యిట్లని, చెప్పెను అని, తాత్పర్యము.

హనుమన్ దూర మధ్వానం కథం మాం వోఢు మిచ్ఛసి
త దేవ ఖలు తే మన్యే కపిత్వం హరియూథప. ౨౯

టీక॥ హనుమన్ = హనుమంతుఁడా! కథం = ఎట్లు; మాం = నన్ను; దూరం = దూరమయిన; అధ్వానం = మార్గము ను; వోఢుం = మోయుటకు; ఇచ్ఛసి = కోరుచున్నావు? హరియూథప = వానరసమూహముంబాలించునట్టివాఁడా! తదేవఖలు = అందువలననేకదా; తే = నీకు; కపిత్వం = వానరత్వము. ఇతి (అధ్యాహృతము) = అని; మన్యే = తలంచుచున్నాను.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవునన్నుబహుదూరము మోయుటకుఁగోరుచున్నావే! ఇదియేమి! కావుననే, నీవుకోఁతివై తివనితలంచెదను. అని, తాత్పర్యము.

కథంవా ల్పశరీర స్త్వం మా మితో నేతు మిచ్ఛసి
సకాశం మానవేంద్రస్య భర్తుర్మే ప్లవగర్షభ. ౩౦

టీక॥ ప్లవగర్షభ = వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! అల్పశరీరః =

చిన్నదేహముగల; త్వం=నీవు; మాం=నన్ను; ఇతః=ఇచ్చటనుండి; మే=నాయొక్క; భర్తుః=పెనిమిటివైన; మానవేంద్రస్య=మనుష్యులకుఁ బ్రభువయిన రామునియొక్క; సకాశం=సమీపమును; నేతుం=పొందించుటకు; కథం=ఎట్లు; ఇచ్ఛసి=కోరుచున్నావు?

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవు చిన్నదేహముగలవాఁడవు; ఇచ్చటనుండి, నాపెనిమిటి రాముండున్న స్థలమునకు బహుదూరమున్నది; నీవచ్చటికి నన్నుఁ దీసికొనిపోఁగోరుచున్నావే! వింతగానున్నది. అని, సీతాదేవి, హనుమంతునితోఁ జెప్పెను. అని తాత్పర్యము.

సీతాయా వచనం శ్రుత్వా హనూమా న్మారుతాత్మజః
చింతయామాస లక్ష్మీవా న్నవం పరిభవం కృతమ్. ౩౧

టీక॥ మారుతాత్మజః=వాయుదేవునికుమారుండును; లక్ష్మీవాన్=అధికమయిన కాంతిగలవాఁడునగు; హనూమాన్=హనుమంతుఁడు; సీతాయాః=సీతయొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; కృతం = చేయఁబడిన; నవం=నూతనమయిన; పరిభవం= అవమానమునుగూర్చి; చింతయామాస=చింతించెను.

కాంతిమంతుండును వాయుపుత్రుండునగు హనుమంతుండు, సీతాదేవి తన్నుఁ బరిహసించినదనిని, తనకిప్పుడుగలిగిన క్రొత్తయవమానమునుగుఱించి, యిట్లని, చింతించెను. అని, తాత్పర్యము.

న మే జానాతి సత్త్వంవా ప్రభావంవాఽసితేక్షణా

టీక॥ అసితేక్షణా=నల్లనికండ్లుగలసీతాదేవి; మే=నాయొక్క; సత్త్వంవా=బలమునుగాని; ప్రభావంవా=ప్రభావమునుగాని; నజానాతి = ఎఱుంగదు.

నల్లనికండ్లుగలసీతాదేవి; నాబలమునుగానినాప్రభావమునుగాని, యెంతమాత్రమెఱుంగదు; కావుననే, యిట్లు చెప్పినది.

అని, తాత్పర్యము.

తస్మా త్పశ్యతు వైదేహీ యద్రూపం మమ కామతః. ౩౨

టీక॥తస్మాత్ = అందువలన; వైదేహీ=సీతాదేవి; మమ= నాయొక్క; రూపం=ఆకారము; యత్ = ఏదో; తత్ (అధ్యాహృతము) = దానిని; కామతః=ఇచ్ఛవలన; పశ్యతు=చూచుగాక.

అందువలన, సీతాదేవి, నానిజమయినరూపమును యథేచ్ఛముగాఁ జూచుఁగాక. అని, హనుమంతుండుచింతించెను. అని, తాత్పర్యము.

ఇతి సంచింత్య హనుమాం స్తదా ప్లవగసత్తమః
దర్శయామాస వైదేహ్యా స్స్వరూప మరిమర్దనః. ౩౩

టీక॥అరిమర్దనః = శత్రువులమర్దించునట్టి; ప్లవగసత్తమః= వానరశ్రేష్ఠుండగు ; హనుమాన్ = హనుమంతుఁడు; తదా=అప్పుడు; ఇతి=ఇట్లు; సంచింత్య=ఆలోచించి; వైదేహ్యాః=సీతాదేవికి; స్వరూపం= తనయాకారమును; దర్శయామాస=చూపెను.

అప్పుడు, శత్రువులమర్దింపంజాలినవాఁడునువానరశ్రేష్ఠుండునగు హనుమంతుండిట్లు, చింతించి, తననిజమయినయాకారమును, సీతాదేవికిం, జూపెను. అని, తాత్పర్యము.

స తస్మాత్పాదపా ద్ధీమా నాప్లుత్య ప్లవగర్షభః
తతో వర్ధితు మారేభె సీతా ప్రత్యయకారణాత్. ౩౪

టీక॥ధీమాన్=బుద్ధిమంతుండగు; ప్లవగర్షభః=వానరశ్రేష్ఠుండయిన; సః=ఆహనుమంతుఁడు; తస్మాత్=ఆ; పాదపాత్=చెట్టుననుండి; ఆప్లుత్య=ఎగిరి; తతః=అటుపిమ్మట; సీతాప్రత్యయకారణాత్=సీతయొక్క నమ్మకమను కారణమువలన; వర్ధితుం=పెరుఁగుటకు; ఆరేభే=ఆరంభించెను.

బుద్ధిమంతుండును వానరశ్రేష్ఠుండునగుహనుమంతుండు, అంతనాచెట్టుమీఁదనుండిపొంతయవ్వలికరిగి, సీతకునమ్మకంబుగల్గుటకై, తనదేహంబునుపెంచుకొననారంభించెను. అని, తాత్పర్యము.

మేరుమందరసంకాశో బభౌ దీప్తానలప్రభః

అగ్రతో వ్యవతస్థేచ సీతాయా వానరోత్తమః. ౩౫



టీక॥ వానరోత్తమః = వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు; మేరుమందర సంకాశః = మేరుపర్వతముతోను మందరపర్వతముతోను సమానుండై; దీప్తానలప్రభః = మండుచున్నఅగ్నియొక్క కాంతివంటికాంతిగలవాండై; బభౌ = ప్రకాశించెను. సీతాయాః = సీతయొక్క; అగ్రతః = ముందట; వ్యవతస్థేచ = నిలిచెను.

వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు, మేరుమందరపర్వతంబులుం బోలె నొప్పుచు, మండుచున్నయగ్నిచూాత్రముంబోలెం బ్రకాశించుచు, సీతాదేవి, యెదుట, నిలిచెను. అని, తాత్పర్యము.

హరిః పర్వతసంకాశ స్తామ్రవక్త్రో మహాబలః
వజ్రదంష్ట్రో నఖో భీమో వై దేహీ మిద మబ్రవీత్. ౩౬

టీక॥ పర్వతసంకాశః=కొండతో సమానుండును; తామ్రవక్త్రః=ఎఱ్ఱని ముఖముగలవాఁడును; మహాబలః= అధికమయినబలముగలవాఁడును ; వజ్రదంష్ట్రనఖః=వజ్రములవంటి కోఱలునుగోళ్లును గలవాఁడును;భీమః=భయంకరుండునగు; హరిః= హనుమంతుండు; వై దేహీం= సీతాదేవినిగూర్చి; ఇదం=ఈమాటను;అబ్రవీత్ = చెప్పెను

అంతఁబర్వతాకారుండు నెఱ్ఱనిముఖముగలవాఁడునుమహాబలుండునువజ్రములవలెఁగఠినములయినకోఱలును నఖములునుగలవాఁడును , జూపరులకు భయంబుఁబుట్టించువాఁడునగు, హనుమంతుండు,సీతంజూచి,యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

సపర్వతవనోద్దేశాం సాట్టప్రాకారతోరణామ్
లంకా మిమాం సనాథాం వా నయితుం శక్తి రస్తి మే. ౩౭

టీక॥ సపర్వతవనోద్దేశాం= కొండలతోను వనప్రదేశములతోను గూడినదియును;సాట్టప్రాకారతోరణాం= కోటబురుజులతోను ప్రాకార ములతోను బురద్వారములతోనుంగూడినదియును; సనాథాం=ప్రభువైన రావణునితోఁ గూడినదియునగు;ఇమాం=ఈ ; లంకాంవా=లంకనైనను; నయితుం (నేతుం)=తీసికొనిపోవుటకు; మే=నాకు; శక్తిః=సామర్థ్యము ; అస్తి=కలదు.

కొండలతోనువనంబులతోను గోటబురుజులతోను ప్రాకారములతోను బురద్వారములతోనుగూడినయీలంకా పట్టణమునైనను రావణునితోఁగూడఁ బెల్లగించితీసికొనిపోఁగలను.

అని, తాత్పర్యము.

త దవస్థాప్య తాం బుద్ధి రలం దేవి వికాంక్షయా
విశోకం కురు వై దేహీ రాఘవం సహలక్ష్మణమ్. ౩౮

టీక॥ దేవి=సీతాదేవీ! తత్ = అందువలన; బుద్ధిః=బుద్ధి ; అవస్థాప్యతాం=

స్థిరము చేయఁబడుఁగాక . వికాంక్షయా=ఉపేక్షచేత; అలం= చాలును. వైదేహి=సీతాదేవీ! సహలక్ష్మణం= లక్ష్మణునితోఁ గూడిన ; రాఘవం= రాముని;విశోకం= దుఃఖములేనివానిఁగా;కురు=చేయుము.

సీతాదేవీ!అట్లుండుటవలన, భయముంచుకొనవలదు;బుద్ధినిస్థిరముగాఁ జేసికొనుము; అశ్రద్ధసేయకుము;రాముని లక్ష్మణుని దుఃఖములేని వారలుగాఁ జేయుము. అని,హనుమంతుఁడు,సీతాదేవితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

తం దృష్ట్వా భీమసంకాశ మువాచ జనకాత్మజా
పద్మపత్రవిశాలాక్షీ మారుత స్యౌరసం సుతమ్. ౩౯

టీక॥పద్మపత్రవిశాలాక్షీ= తామరపూలువలెవిశాలములయిన కండ్లుగల; జనకాత్మజా=జనకమహారాజుకొమారితయగుసీతాదేవి; భీమసంకాశం= భయంకరముగానున్నవాఁడును; మారుతస్య=వాయువుయొక్క ;ఔరసం= ఉత్తముఁడైన;సుతం = కొడుకునగు; తం=ఆహనుమంతుని; దృష్ట్వా= చూచి;ఉవాచ=చెప్పెను.

తామరపూరేకులుంబోలెవిశాలంబులయినకండ్లుగలసీతాదేవి, చూపరులకు వెఱపుఁబుట్టించుచున్న , వాయుదేవునియుత్తమపుత్రునిహనుమంతుం, జూచి,యిట్లని;చెప్పెను.

అని, తాత్పర్యము.

తవ సత్త్వం బలంచైవ విజానామి మహాకపే
వాయోరివ గతించైవ తేజ శ్చాగ్నే రివాద్భుతమ్. ౪౦

టీక॥మహాకపే = పెద్దకోఁతివగు హనుమంతుఁడా!తవ=నీయొక్క ; సత్త్వం=ధైర్యమును;బలంచైవ = బలమును;వాయోరివ= వాయువుయొక్కవలె;గతించైవ=గమనమును;అగ్నేరివ= అగ్నిహోత్రునియొక్కవలె ; అద్భుతం=ఆశ్చర్యకరమయిన; తేజశ్చ= పరాక్రమమును;విజానామి= చక్కఁగా నెఱుంగుదును.

హనుమంతుఁడా,నీధైర్యమును నీబలమును నేనుచక్కఁగా నెఱుంగుదును; నీవువాయుదేవుండుం బోలె శీఘ్రగమ

నముగలవాఁడవనియు, నగ్నిహోత్రుండుంబోలెఁ దేజంబు గలవాఁడవని యునాకుఁ, జక్కఁగాఁ దెలియును. అని, తాత్పర్యము.

ప్రాకృతోన్యః కథం చేమాం భూమి మాగంతు మర్హతి
ఉదధే రప్రమేయస్య పారం వానరపుంగవ. ౪౧

టీక॥ వానరపుంగవ = వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా; అన్యః = ఇతరుఁడైన; ప్రాకృతశ్చ = సాధారణుండును; అప్రమేయస్య = కొలఁతలేని; ఉదధేః = సముద్రముయొక్క; పారం = ఈవలిగట్టయిన; ఇమాం = ఈ; భూమిం = భూమినిగూర్చి, ఆగంతుం = వచ్చుటకు; కథం = ఎట్లు; అర్హతి = తగున? వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! అట్లుగాక నీవు సాధారణుండవగుదువేని, కొలందిలేనిసముద్రంబు దాఁటియిచ్చటికెట్లు రాఁగలవు? అని తాత్పర్యము.

జానామి గమనే శక్తిం నయనే చాపి తే మమ
అవశ్యం సంప్రధార్యాశు కార్యసిద్ధి మహాత్మనః. ౪౨

టీక॥ గమనే = పోవుటయందును; మమ = నాయొక్క; నయనే చాపి = తీసికొనిపోవుటయందును; తే = నీయొక్క; శక్తిం = సామర్థ్యమును; జానామి = ఎఱుంగుదును. మహాత్మనః = పూజ్యమయినస్వభావముగలరామునియొక్క; కార్యసిద్ధిః = కార్యముయొక్క నెఱవేఱుట; ఆశు = శీఘ్రముగా; అవశ్యం = అవశ్యముగా; సంప్రధార్యా = విచారింపఁదగినది. నీవు రాక్షసులకుఁ జిక్కక పోఁగలవనియు, నన్నుఁ దీసికొనిపోఁగలవనియు, నాకుఁ దెలియును; అయితే, మహాత్ముండగు రాముని కార్యము చెడకుండునట్లాలోచింపవలయును. అని, తాత్పర్యము.

అయుక్తంతు కపిశ్రేష్ఠ మమ గంతుం త్వయానఘ
వాయువేగసవేగస్య వేగో మాం మోహయేత్తవ. ౪౩

టీక॥ అనఘ = పాపరహితుండవు; కపిశ్రేష్ఠ = వానరశ్రేష్ఠుండవగు హనుమంతుండా! మమ = నాకు; త్వయా = నీతో; గంతుంతు = పోవుటకుమాత్రము; అ

యుక్తం=సరికాదు, వాయువేగసవేగస్య=వాయువేగముతో సమానమగుచున వేగముగల; తవ=నీయొక్క; వేగః=వేగము; మాం=నన్ను; మోహయేత్=భ్రమింపఁజేయును.

పాపరహితుండవు వానరశ్రేష్ఠుండవునగు హనుమంతుఁడా! నేను నీతోఁగూడవచ్చుటయెంతమాత్రము సరికాదు; ఏలయనఁగా, నీవు వాయువేగంబంతటివేగముగలవాఁడవు, నీవేగంబున నేను భయంబునొందుదును.

అని, తాత్పర్యము.

అహ మాకాశ మాపన్నా హ్యుపర్యుపరి సాగరమ్
ప్రపతేయం హి తే పృష్ఠా ద్భయా ద్వేగేన గచ్ఛతః. ౪౪

టీక॥ అహం=నేను; సాగరముపర్యుపరి= సముద్రమునకుమిక్కిలిసమీపముగా; ఆకాశం=ఆకాశమును; ఆపన్నాహి=పొందినదాననైనంతనే; వేగేన=వేగముచేత; గచ్ఛతః = పోవుచున్న; తే=నీయొక్క; పృష్ఠాత్=వీపుననుండి; భయాత్=భయమువలన; ప్రపతేయం హి=పడుదునుగదా!

నీవు నన్ను వీపుననుంచుకొని యతివేగంబునంబోవుచుండఁగా, సముద్రంబునకుఁగొంచెముమీఁదుగాఁబోవునప్పుడు, నేను, సముద్రంబునుజూచి, భయంబున, నీవీపుపైనుండి, సముద్రంబులోఁబడుదును. అని, తాత్పర్యము.

పతితా సాగరే చాహం తిమినక్రఝషాకులే
భవేయ మాశు వివశా యాదసా మన్న ముత్తమమ్. ౪౫

టీక॥ అహం=నేను; తిమినక్రఝషాకులే= నూఱుయోజనములపొడవుగలచేఁపలచేతను మొసళ్లచేతను మత్స్యములచేతనునిండిన; సాగరే= సముద్రమునందు; పతితాచ=పడినంతనే; వివశా=పరవశురాలనై; ఆశు=శీఘ్రముగా; యాదసాం=జలజంతువులకు; ఉత్తమం=శ్రేష్ఠమయిన; అన్నం=ఆహారము ; భవేయం=అగుదును.

అట్లు నేను, నూఱుయోజనంబులపొడవుగలచేఁపలతోను మొసళ్లతోను సాధారణంబులగుచేఁపలతోనునిండియుండునట్టి సముద్రంబునంబడినంతనే, పరవశురాలనగునన్నుఁదక్షణమే సముద్రంబు

నందలిజలజంతువులు,భక్షించును. అని, తాత్పర్యము.

నచ శక్ష్యే త్వయాసార్ధం గంతుం శత్రువినాశన
కళత్రవతి సందేహ స్త్వయ్యాపి స్యా దసంశయః. ౪౬

టీక॥శత్రువినాశన=శత్రువులను నశింపఁజేయునట్టిహనుమంతుఁడా! త్వయాసార్ధం=నీతోఁగూడ; గంతుం=పోవుటకు;నచశక్ష్యే= చాలనేచాలను. కళత్రవతి=రక్షింపఁదగినదిగల ; త్వయ్యాపి=నీవిషయ మయ్యును ; సందేహః=సందేహము ; స్యాత్=కలుగును.అసంశయః=సందేహములేదు.

హనుమంతుఁడా!నీవుశత్రువుల నాశమునొందించువాఁడవే;అయినను, నేనునీతోఁగూడ రాఁజాలను ; ఏలయనఁగా,నెంతసమర్థుఁడవును,మఱియొకరు రక్షింపవలసినవారుండునప్పుడు, ఆపదసంభవించును;గావున, నీకు, నన్ను రక్షింపవలసియున్నదికావున , నప్పుడు,నీప్రాణమునకునుసంకటము సంభవించును; ఇందుసందేహములేదు.

అని, తాత్పర్యము.

హ్రియమాణాం తు మాం దృష్ట్వా రాక్షసా భీమవిక్రమాః
అనుగచ్ఛేయు రాదిష్టా రావణేన దురాత్మనా. ౪౭

టీక॥హ్రియమాణాం=కొనిపోఁబడుచున్న;మాం=నన్ను; దృష్ట్వాతు=చూచినంతనె;భీమవిక్రమాః= భయంకరపరాక్రమముగల; రాక్షసాః= రాక్షసులు;దురాత్మనా=దుష్టబుద్ధిగల; రావణేన=రావణునిచేత; ఆదిష్టాః=ఆజ్ఞాపింపఁబడినవారలై; అనుగచ్ఛేయుః=వెంబడింతురు.

నీవునన్నుఁదీసికొని పోవుటంజూచినంతనె,దుష్టాత్ముండగు రావణునాజ్ఞచే,భయంకరంబగు పరాక్రమము గల రాక్షసులనేకులు, నిన్ను వెంబడింతురు.

అని,తాత్పర్యము.

తై స్త్వం పరివృత శ్శూరై శ్శూలముద్గరపాణిభిః
భవే స్త్వం సంశయం ప్రాప్తో మయా వీర కళత్రవాన్. ౪౮

టీక॥వీర=పరాక్రమశాలివగుహనుమంతుఁడా!మయా=నాచేత ; కళత్రవాన్=రక్షింపఁదగినదిగల;త్వం=నీవు; శూరైః=యుద్ధమునందు భయములేనివారును; శూలముద్గరపాణిభిః=శూలంబులును నినుపగుదియలును జేతులం గలవారలునగు; తైః= ఆరాక్షసులచేత;పరివృతః = చుట్టఁబడినవాఁడవై; త్వం=నీవు;సంశయం=సందేహమును; ప్రాప్తః=పొందినవాఁడవు;భవేః= అగుదువు.

పరాక్రమశాలివగు హనుమంతుఁడా!అంత , శూరులగునారాక్షసులు శూలంబులు నినుపగుదియలును దాల్చి నిన్నుఁబరివేష్టింతురు;అంత,నీకు,రక్షింపవలసినదానను నేనున్నాను గావునఁ, బ్రాణసందేహంబుగలుగును.

అని, తాత్పర్యము.

సాయుధా బహవో వ్యోమ్ని రాక్షసా స్త్వం నిరాయుధః
కథం శక్ష్యసి సంయాతుం మాం చైవ పరిరక్షితుమ్. ౭౯

టీక॥వ్యోమ్ని=ఆకాశమునందు;రాక్షసాః=రాక్షసులు; సాయుధాః=ఆయుధములుగలవారలు. బహవః=అనేకులు. త్వం=నీవు; నిరాయుధః= ఆయుధంబులేనివాఁడవు. సంయాతుం=పోరుటకును; మాం=నన్ను; పరిరక్షితుం చైవ=కాపాడుటకును; కథం=ఎట్లు;శక్ష్యసి=చాలుదువు.

ఆరాక్షసులు,నిన్నాకాశంబునంజుట్టుముట్టుదురు; వారలాయుధంబులుగలవారలు,అనేకులు;నీవొక్కరుఁడవు; ఆయుధంబు లేనివాఁడవు; యుద్ధముసేయుటకుఁగాని, నన్నురక్షించుటకుఁగాని,నీవెట్లుశక్తుఁడవగుదువు?

అని, తాత్పర్యము.

యుధ్యమానస్య రక్షోభి స్తవ తైః క్రూరకర్మభిః
ప్రపతేయం హి తే పృష్ఠా ద్భయార్తా కపిసత్తమ. ౮౦

టీక॥ కపిసత్తమ=వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా!తవ=నీవు; క్రూరకర్మభిః= క్రూరములయినకార్యములుగల;తైః=ఆ;రక్షోభిః=రాక్షసులచేత; యుధ్యమానస్య=పోరుచుండఁగా; అహం (అధ్యాహృతము)=నేను; భ

యాతాః=భయముచేఁ బీడింపఁబడినదాననై; తే=నీయొక్క; పృష్ఠాత్=వీపుననుండి; ఆపతేయంహి=పడుదునుగదా!

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవుకూరులగు నారాక్షసులతో యుద్ధముసేయుచుండఁగా, నేనుభయంబునొంది,నీవీపుననుండి, క్రిందంబడుదును.అని, తాత్పర్యము.

అథ రక్షాంసి భీమాని మహాంతి బలవంతిచ
కథంచి త్సాంపరాయే త్వాం జయేయుః కపిసత్తమ. ౫౧

టీక॥ కపిసత్తమ=వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! అథ=ఇంక; భీమాని=భయంకరులును; మహాంతి=పెద్దదేహము గలవారలును; బలవంతిచ = అధికమయినబలముగలవారలునగు; రక్షాంసి=రాక్షసులు; సాంపరాయే=యుద్ధమునందు; కథంచిత్=ఎట్లయినను; త్వాం=నిన్ను; జయేయుః=గెల్తురు.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! మఱియు, భయంకరులును మహాకాయులును బలవంతులునగురాక్షసులు,యుద్ధంబుననొకవేళ, నిన్నెట్లయినను జయింతురు.

అని, తాత్పర్యము.

అథవా యుధ్యమానస్య పతేయం విముఖస్య తే
పతితాంచ గృహీత్వా మాం నయేయుః పాపరాక్షసాః. ౫౨

టీక॥అథవా=అటుకాదేని; తే=నీవు;యుధ్యమానస్య=యుద్ధముసేయుచు;విముఖస్య= పరవశుండవుకాఁగా; పతేయం=పడుదును. పతితాంచ=పడినంతనే; మాం=నన్ను; పాపరాక్షసాః = దుష్టులగురాక్షసులు; గృహీత్వా=తీసికొని; నయేయుః=తోడ్కొనిపోదురు.

అటుకాదేని,యొక్కవేళ, నీవుయుద్ధంబుసేయుచుఁబరవశుండవైయుండఁగా, నేను నేలంబడినను బడుదును;అంత, నేను నేలంబడినంతనె, పాపిష్ఠులగురాక్షసులునన్నుఁదీసికొనిపోదురు.

అని, తాత్పర్యము.

స౩౭

మాం వా హరేయు స్త్వద్ధస్తా ద్విశసేయు రథాపివా
అవ్యవస్థౌ హి దృశ్యేతే యుద్ధే జయపరాజయౌ. ౫౩

టీక॥ మాం=నన్ను; త్వద్ధస్తాత్=నీచేతనుండి; హరేయుర్వా=అపహరించినను అపహరింతురు. అథ=అంత; విశసేయుర థాపివా= ఖండించినను ఖండింతురు. యుద్ధే=యుద్ధమునందు; జయపరాజయౌ= జయమును అపజయమును; అవ్యవస్థౌ=నిశ్చయములేనివిగా; దృశ్యేతేహి= చూడఁబడుచున్నవిగదా!

యుద్ధమునందు, జయాపజయములకు, నిశ్చయములేదు; కావున, నీకు జయమే గలుగునని యేమి నిశ్చయము? నీకుఁ బరాజయము గల్గినను గల్గును; అప్పుడు, ఆ రాక్షసులు, నీహస్తంబుననుండి నన్నులాగుకొని, నఱికివేసినను నఱికివేయుదురు. అని, తాత్పర్యము.

అహం వాపి విపద్యేయం రక్షోభి రభితర్జితా

టీక॥ అహం= నేనును; రక్షోభిః= రాక్షసులచేత; అభితర్జితా= బాధింపఁబడినదాననై; విపద్యేయం వాపి=ఆపద నొందినను నొందుదును.

నేను, రాక్షసుల చేతికిఁ జిక్కి బాధింపఁబడి, ప్రాణభయంబు నొందుదును. అని, తాత్పర్యము.

త్వత్ప్రయత్నో హరిశ్రేష్ఠ భవే న్నిష్ఫలఏవతు. ౫౪

టీక॥ హరిశ్రేష్ఠ= వానరోత్తముండవగు హనుమంతుఁడా! త్వత్ప్రయత్నస్తు=నీప్రయత్నమును; నిష్ఫలఏవ = నిష్ప్రయోజనముగానే; భవేత్ = అగును.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! అట్లగునేని, నీవింతదూరము శ్రమపడివచ్చి చేసిన ప్రయత్నమంతయు, నిష్ఫలమగును. అని, తాత్పర్యము.

కామం త్వమసి పర్యాప్తో నిహంతుం సర్వరాక్షసాన్
రాఘవస్య యశో హీయేత్ త్వయా శస్తైస్తు రాక్షసైః. ౫౫

టీక॥త్వం=నీవు;సర్వరాక్షసాన్—సమస్తరాక్షసులను;నిహంతుం=చంపుటకు;పర్యాప్తః కామం= చాలినవాఁడవే; అసి=అగుచున్నావు. త్వయా=నీచేత; శస్త్రైః=చంపఁబడిన;రాక్షసైస్తు= రాక్షసులచేతనే;రాఘవస్య = రాముని యొక్క;యశః—కీర్తి; హీయేత్ =క్షీణించును.

నీవొక్కఁడవె సమస్తరాక్షసులం జంపఁగలవు; ఇదివాస్తవమే;అయితే,నీవు రాక్షసులనందఱంజంపుదువేని, రామునికీర్తి నశించును.

అని, తాత్పర్యము.

అథవా దాయ రక్షాంసి న్యసేయు స్సంవృతే హి మామ్
యత్ర తే నాభిజానీయు హరయో నాపి రాఘవౌ. ౫౮

టీక॥అథవా = అటుకాదేని; యత్ర=ఎచ్చట; తే=ఆ;హరయః=వానరులు;నాభిజానీయుః—ఎఱుంగరో; రాఘవావపి=రామలక్ష్మణులయినను; న (అభిజానీయుః)— ఎఱుంగరో;తస్మిన్ (అధ్యాహృతము)—అట్టి;సంవృతే=రహస్యమయినప్రదేశమునందు; రక్షాంసి=రాక్షసులు;మాం = నన్ను;ఆదాయ=తీసికొని; న్యసేయుహీ—ఉంచుదురుగదా!

అటుకాదేని, రాక్షసులునన్నుఁదీసికొనిపోయి,యావానరులుగాని రామలక్ష్మణులుగాని యెంతమాత్రము నెఱుంగంజాలనట్టిరహస్య ప్రదేశమునందు, దాఁచిననుదాఁచుదురు.

అని, తాత్పర్యము.

ఆరంభస్తు మదర్థోయం తత స్తవ నిరర్థకః

టీక॥తతః=అటుపిమ్మట;తవ— నీయొక్క;అయం=ఈ;మదర్థః— నాకొఱకైన;ఆరంభస్తు=ప్రయత్నమును; నిరర్థకః=ప్రయోజనములేనిది;భవేత్ (అధ్యాహృతము)=అగును.

అంత, నీవునాకొఱకై చేసినప్రయత్నమంతయు,వ్యర్థమగును.

అని, తాత్పర్యము.

త్వయాహి సహ రామస్య మహా నాగమనే గుణః. ౫౯

టీక॥త్వయాసహ = నీతోఁగూడ; రామస్య = రామునియొక్క; ఆగమనే = వచ్చుటయందు; మహాన్ = అధికమయిన; గుణః = మేలు; అస్తి (అధ్యాహృతము) హి = ఉన్నదిగదా!

నీవుపోయి, రామునకునాసంగతిం జెప్పి, రామునిచ్చటికిం బిలుచుకొనివచ్చితివేని, మిక్కిలియుగుణముగలదు.

అని, తాత్పర్యము.

మయి జీవిత మాయత్తం రాఘవస్య మహాత్మనః
భ్రాతౄణాంచ మహాబాహో తవ రాజకులస్యచ. ౫౮

టీక॥ మహాబాహో = పెద్దచేతులుగలహనుమంతుఁడా! మహాత్మనః = అధికమయినపరాక్రమముగల; రాఘవస్య = రామునియొక్కయు; భ్రాతౄణాంచ = అతని, తమ్ములయొక్కయు; తవ = నీయొక్కయు; రాజకులస్యచ = రాజయినసుగ్రీవునివంశముయొక్కయు; జీవితం = ప్రాణము; మయి = నాయందు; ఆయత్తం = అధీనము.

మహాబాహుండవగు హనుమంతుఁడా! మహాత్ముండగు రాముండునతనితమ్ములునునీవును సుగ్రీవునిబంధువులును మీరందఱును, ఇప్పుడునన్నాశ్రయించి, ప్రాణంబులుంచుకొనియున్నారు; నాకిప్పుడపాయంబుసంభవించునేని, మీరందఱుఁ బ్రాణంబులవిడుతురు.

అని, తాత్పర్యము.

తౌ నిరాశౌ మదర్థేతు శోకసంతాపకర్శితౌ
సహ సర్వర్క్షహరిభి స్త్యక్ష్యతః ప్రాణసంగ్రహమ్. ౫౯

టీక॥మదర్థేతు = నాకొఱకే; శోకసంతాపకర్శితౌ = దుఃఖముచేతనుసంతాపముచేతనుకృశింపఁజేయఁబడిన; తౌ = ఆరామలక్ష్మణులు; నిరాశౌ = ఆశలేనివారలయి; సర్వర్క్షహరిభిస్సహ = సమస్తమయినభల్లూకంబులతోనువానరంబులతోనుంగూడి; ప్రాణసంగ్రహం = ప్రాణంబునుందుకొనుటను; త్యక్ష్యతః = విడువఁగలరు.

అట్లు, నాకేదైననపాయంబుగల్గునేని, నన్నుఁగూర్చియేయిప్పుడు మహాదుఃఖంబును సంతాపంబునుంబొంది కృశించియుండు నారామలక్ష్మణులు, "ఇంకనన్నుఁబొందఁగల" మనునాశనువిడిచి,

వానరభల్లూకంబుల యుందఱితోఁ గూడ, దాని నంబులు విడువంగలరు. అని, తాత్పర్యము.

భర్తు ర్భక్తిం పురస్కృత్య రామా దన్యస్య వానరః
నస్పృశామి శరీరంతు పుంసో వానరపుంగవ. ౬౦

టీక ॥ వానరపుంగవ=వానరశ్రేష్ఠుండవయిన; హనుమంతుఁడా! భర్తుః=పెనిమిటియొక్క ; భక్తిం=భక్తిని; పురస్కృత్య= ముందిడుకొని; రామాత్=రామునికన్న; అన్యస్య=ఇతరుఁడైన; పుంసః = పురుషునియొక్క; శరీరంతు=దేహమునే; నస్పృశామి=తాఁకను.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నేను పెనిమిటియందుభక్తి నవలంబించి, రాముండుదక్క, నితరపురుషుని దేహమునేదాఁకుటలేదు.

అని, తాత్పర్యము.

య దహం గాత్రసంస్పర్శం రావణస్య బలాద్గతా
అనీశా కిం కరిష్యామి వినాథా వివశా సతీ. ౬౧

టీక॥అహం=నేను; బలాత్= బలాత్కారమువలన; రావణస్య=రావణుని యొక్క; గాత్రసంస్పర్శం= దేహముయొక్క తాఁకుటను; గతా = పొందినదానను; (ఇతి)యత్(అస్తి)= అనునదియేదిగలదో; తత్ర ( అధ్యాహృతము)=అవిషయమునందు; అహం ( అధ్యాహృతము)=నేను; అనీశా=సమర్థురాలుగానిదానను; వినాథా= పెనిమిటిలేనిదానను; వివశాసతీ= పరవశురాలనై; కిం=ఏమి; కరిష్యామి=చేయఁగలను?

అయితే, "నిన్ను రావణుండు బలాత్కారంబునందాఁక లేదా?" యనియందువేమొ ; అవును; నాకప్పుడేమి సేయుటకును శక్తిలేదుగదా! నా పెనిమిటియుదగ్గిఱలేకుండెను; నేనును దుఃఖంబునంబరవశురాలనైయుంటిని; ఏమి సేయవచ్చును? అని, తాత్పర్యము.

యది రామో దశగ్రీవ మిహ హత్వా సబాంధవమ్

మామితో గృహ్య గచ్ఛేత త త్తస్య సదృశం భవేత్. ౬౨

టీక॥ రామః=రాముఁడు ; ఇహ=ఇచ్చట ; సబాంధవం = బంధువులతోఁగూడిన; దశగ్రీవం=రావణుని;హత్వా=చంపి; ఇతః = ఇచ్చటనుండి; మాం=నన్ను; గృహ్య(గృహీత్వా)=తీసికొని; గచ్ఛేత(గచ్ఛేత్) యది=పోవునేని; తత్=అది;తస్య=అతనికి; సదృశం=సమానము;భవేత్= అగును.

రాముం,డిచ్చటికివచ్చి, రావణుని బంధువులతోఁగూడవధించి , నన్నిచ్చటనుండితీసికొనిపోవునేని, యట్లుసేయుట,యతనికి, సరిగానుండును.

అని, తాత్పర్యము.

శ్రుతాహి దృష్టాశ్చ మయా పరాక్రమా
మహాత్మన స్తస్య రణావమర్దినః
న దేవగంధర్వభుజంగరాక్షసా
భవంతి రామేణ సమా హి సంయుగే. ౬౩

టీక॥ మహాత్మనః= అధికపరాక్రమముగలవాఁడును ; రణావమర్దినః=యుద్ధంబున మర్దించువాఁడునగు; తస్య = ఆరామునియొక్క ; పరాక్రమాః=పరాక్రమములు;మయా= నాచేత;శ్రుతాహి=వినఁబడినవిగదా!దృష్టాశ్చ=చూడఁబడినవియు, దేవగంధర్వభుజంగరాక్షసాః=దేవతలునుగంధర్వులును నాగంబులును రాక్షసులును; సంయుగే=యుద్ధమునందు; రామేణ=రామునితో;సమాః = సమానులు;న భవంతిహి=కారుగదా!

మహాపరాక్రమశాలియుయుద్ధంబుననెదురులేకశత్రువులనుమర్దించువాఁడునగురామునిపరాక్రమంబులనేకంబులనేనువినియున్నాను, చూచియు నున్నాను; దేవతలుగానిగంధర్వులుగాని నాగంబులుగానిరాక్షసులుగాని యెవ్వరును,యుద్ధంబున,రామునకుసరికారు.

అని, తాత్పర్యము.

సమీక్ష్య తం సంయతి చిత్రకార్ముకం
మహాబలం వాసవతుల్యవిక్రమమ్
సలక్ష్మణం కో విషహేత రాఘవం
హుతాశనం దీప్త మి వానిలేరితమ్. ౬౪

టీక॥సంయతి=యుద్ధమునందు; చిత్రకార్ముకం=నానావిధములయినగతులుగలధనుస్సుగలవాఁడును; మహాబలం=అధికమయినబలముగలవాఁడును; వాసవతుల్యవిక్రమం=ఇంద్రునిపరాక్రమముతోసమానమయిన పరాక్రమము గలవాఁడును; సలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడినవాఁడును,కావుననే; అనిలేరితం=నిప్పుచేఁబురికొల్పఁబడినదియు; దీప్తం=మండినదియునగు; హుతాశనమివ(స్థితం)= అగ్నిహోత్రమువలెనున్నవాఁడునగు;తం=ఆ; రాఘవం=రామునిఁ;కః=ఎవ్వఁడు;విషహేత= ఓర్వఁగలఁడు?

మహాబలుండు, దేవేంద్రునిపరాక్రమమువంటిపరాక్రమము గలవాఁడునగు రాముఁడు, యుద్ధంబునఁ, జిత్రగతుల మెఱయుధనువుధరించి,లక్ష్మణునింగూడి,వాయువుతోఁగూడినదీప్తాగ్నిచందంబునందేజరిల్లుచుండ, నతని, ఎవ్వరుదేఱిచూడఁగలరు?

అని, తాత్పర్యము.

స లక్ష్మణం రాఘవ మాజిమర్దనం
దిశాగజం మత్తమివ వ్యవస్థితమ్
సహేత కో వా నరముఖ్యసంయుగే
యుగాంతసూర్యప్రతిమం శరార్చిషమ్. ౬౫

టీక॥ వానరముఖ్య=వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా!సలక్ష్మణం=లక్ష్మణునితోఁ గూడినవాఁడును; ఆజిమర్దనం=యుద్ధంబునందు మర్దించువాఁడును; మత్తం=మదించిన; దిశాగజమివ వ్యవస్థితం=దిగ్గజమువలె నున్నవాఁడును; శరార్చిషం= కిరణంబులవంటిబాణంబులుగలవాఁడును; యుగాంతసూర్యప్రతిమం = ప్రళయకాలమునందలి సూర్యునితోఁ బోలికగలవాఁడునగు; రాఘవం=రాముని;సంయుగే=యుద్ధమునందు;కః=ఎవ్వఁడు; సహేత=ఓర్చును?

వానరశ్రేష్ఠుఁడవగు హనుమంతుఁడా!యుద్ధంబుననెదురులేక శత్రువులంజంపువాఁడునుమదించిన దిగ్గజముంబోలెనున్నవాఁడును , ప్రళయకాలమునందలిసూర్యునకుసరివచ్చుచు, నాసూర్యకిరణంబులవంటిబాణంబులంబ్రయోగించువాఁడును లక్ష్మణునితోఁ గూడినవాఁ

డునగు, రాముని, యుద్ధంబున, నెవ్వరెదిరింపఁగలరు? అని, తాత్పర్యము.

స మే హరిశ్రేష్ఠ సలక్ష్మణం పతిం
సయూథపం క్షిప్ర మిహోపపాదయ
చిరాయ రామం ప్రతి శోకకర్శితాం
కురుష్వ మాం వానరముఖ్య హర్షితామ్. ౬౬

టీక॥ హరిశ్రేష్ఠ=వానరోత్తముండవగుహనుమంతుఁడా! సః=అట్టి; త్వం (అధ్యాహృతము)=నీవు; సలక్ష్మణం=లక్ష్మణునితోఁగూడినవాఁడును; సయూథపం= వానరసమూహములంబాలించువారలతోఁగూడినవాఁడునగు; మే= నాయొక్క; పతిం=పెనిమిటిని; క్షిప్రం= శీఘ్రముగా; ఇహ=ఇచ్చటికి; ఉపపాదయ=పొందింపుము. వానరముఖ్య= వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! రామంప్రతి=రామునిగూర్చి; చిరాయ = బహుకాలముగా; శోకకర్శితాం=దుఃఖముచేఁ గృశింపఁజేయఁబడినదానవగు; మాం = నన్ను; హర్షితాం= సంతోషమునొందినదానింగా; కురుష్వ=చేయుము.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవు, నాపెనిమిటియగు రాముని లక్ష్మణునివానరసేనానాయకులను, అందఱను, ఇచ్చటికి, శీఘ్రముగాఁ, దోడ్కొనిరమ్ము; రామవిరహంబునబహుకాలముగా, దుఃఖింపుచుఁ గృశించియున్న నాకు, సంతోషంబుగల్గునట్లు సేయుము. అని, సీతాదేవి, హనుమంతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, సప్తత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండసప్తత్రింశసర్గటీక
ముగిసినది.

౩౮

అష్టత్రింశసర్గప్రారంభః.

తత స్స కపిశార్దూల స్తేన వాక్యేన హర్షితః
సీతా మువాచ తచ్ఛ్రుత్వా వాక్యం వాక్యవిశారదః. ౧

టీక॥తతః=అటుపిమ్మట; వాక్యవిశారదః= మాటలయందుఁబండితుండును;కపిశార్దూలః=వానరశ్రేష్ఠుండునగు;సః=ఆహనుమంతుఁడు; తత్ =ఆ; వాక్యం=మాటను;శ్రుత్వా = విని;తేన=ఆ;వాక్యేన= మాటచేత;హర్షితః = సంతోషమునొందినవాఁడై;సీతాం=సీతనుగూర్చి; ఉవాచ=పలికెను.

అంత,మాటలుచెప్పుటయందుఁబండితుండును వానరశ్రేష్ఠుండునగునాహనుమంతుండు,సీతచెప్పినమాటనువిని,సీతయట్టిధార్మికంబైన మాటనుజెప్పుటవలనఁ,బరమసంతోషంబునొంది, సీతంజూచి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

యుక్తరూపం త్వయా దేవి భాషితం శుభదర్శనే
సదృశం స్త్రీస్వభావస్య సాధ్వీనాం వినయస్యచ. ౨

టీక॥శుభదర్శనే= మంగళకరంబగుచూచుటగల;దేవి = సీతాదేవీ!త్వయా=నీచేత;స్త్రీస్వభావస్య= స్త్రీల స్వభావమునకును; సాధ్వీనాం=పతివ్రతలయొక్క; వినయస్యచ=అణఁకువకును,సదాచారమునకుననుట; సదృశం=సరిగా;యుక్తరూపం=మిక్కిలియుక్తముగా;భాషితం=చెప్పఁబడినది.

సీతాదేవీ! నిన్నుఁజూచు వారలకు మంగళంబులొదవు;నీవు,చెప్పినది,నీస్వభావమునకును, నీపాతివ్రత్యమునకును సరిగామిక్కిలియుక్తముగానున్నది.

అని, తాత్పర్యము.

స్త్రీత్వం నతు సమర్థంహి సాగరం వ్యతివర్తితుమ్
మా మధిష్ఠాయ విస్తీర్ణం శతయోజన మాయతమ్. ౩

టీక॥ మాం=నన్ను; అధిష్ఠాయ=అధిష్ఠించి; విస్తీర్ణం = వెడల్పుయునదియు; శతయోజనం= నూఱుయోజనములు; ఆయతం= దీర్ఘమయునదియునగు; సాగరం=సముద్రమును; వ్యతివర్తితుం=దాఁటుటకు; స్త్రీత్వంతు=స్త్రీయగుటయె; నసమర్థం హి= సమర్థము కాదుగదా!

నావీపుపైనెక్కి, యతివిస్తీర్ణంబయిననూఱుయోజనంబుల సముద్రమును దాఁటుటకు, స్త్రీకెంతమాత్రమలవిగాదు; ఇదివాస్తవమే.

అని, తాత్పర్యము.

ద్వితీయం కారణం యచ్చ బ్రవీషి వినయాన్వితే
రామా దన్యస్య నార్హామి సంస్పర్శ మితి జానకి. ౪
ఏత త్తే దేవి సదృశం పత్న్యా స్తస్య మహాత్మనః

టీక॥ వినయాన్వితే= వినయముతోఁ గూడిన; దేవి= రాణివగు; జానకి= సీతాదేవి! "రామాత్ = రామునికన్న; అన్యస్య = ఇతరపురుషుని యొక్క; సంస్పర్శం= తాఁకుటను; నార్హామి=పొందఁదగను." ఇతి= అని; ద్వితీయం= రెండవదైన; యత్ = ఏ; కారణం చ= కారణమును; బ్రవీషి = చెప్పుచున్నావో; ఏతత్ = ఈమాట; మహాత్మనః=పూజ్యమగు స్వభావముగల; తస్య = ఆరాముని యొక్క; పత్న్యాః = భార్యవయిన; తే=నీకు; సదృశం=సరియయినది.

వినయాదిసదాచారంబుగలదానవగు సీతాదేవీ! "రాముండుదక్క నితరపురుషుండు నన్నుఁదాఁకఁగూడదు" అని, నీవు రెండవకారణము చెప్పితివే; ఆమాట, మహాత్ముండగు రాముని పత్నివయిన నీకు సదృశంబుగానున్నది.

అని, తాత్పర్యము.

కా హ్యన్యా త్వా మృతే దేవి బ్రూయా ద్వచన మీదృశమ్. ౫

టీక॥ దేవి= సీతాదేవీ; త్వామృతే= నిన్నువిడిచి; అన్యా= ఇతర స్త్రీ; కా= ఎవ్వతె; ఈదృశం= ఇట్టి; వచనం హి= మాటనుంగూడ; బ్రూయాత్ = చెప్పును?

సీతాదేవీ, నీవుదక్క మఱియే స్త్రీ, యిట్టిపరమధార్మికంబగు మాటంజె

ప్పును? అని, తాత్పర్యము.

శ్రోష్యతే చైవ కాకుత్స్థ స్సర్వం నిరవశేషతః
చేష్టితం యత్త్వయా దేవి భాషితం మమ చాగ్రతః. ౬

టీక॥ దేవి=సీతాదేవీ; మమ = నాయొక్క; అగ్రతః=ముందు; త్వయా=నీచేత; యత్ =ఏది; చేష్టితం=చేయఁబడినదో; భాషితం=చెప్పబడినదో; తత్ (అధ్యాహృతము)=అది; సర్వం = అంతయు; నిరవశేషతః= నిశ్శేషముగ; కాకుత్స్థశ్చైవ=రాముండును; శ్రోష్యతే= వినుపింపఁబడుచున్నాఁడు.

సీతాదేవీ! నాముందట నీవు, రామవిరహంబు సహింపఁజాల కురివోసికొనం జూచుటయు, రావణునిం దృణీకరించి చెప్పినమాటలను, నీసమాచారమంతయు, రామునకుఁ జెప్పెదను.

అని, తాత్పర్యము.

కారణైర్బహుభి ర్దేవి రామప్రియచికీర్షయా
స్నేహప్రస్కన్నమనసా మయైత త్సముదీరితమ్. ౭

టీక॥ దేవి= సీతాదేవీ; బహుభిః= పెక్కువిధములయిన; కారణైః= కారణములచేత; స్నేహప్రస్కన్న మనసా=స్నేహముచేఁగరఁగినమనసుగల; మయా= నాచేత; రామప్రియచికీర్షయా = రామునకుసంతోషముచేయునిచ్ఛచేత; ఏతత్ = ఈమాట; సముదీరితం=చెప్పఁబడినది.

సీతాదేవీ! పెక్కుకారణంబులచే నామనసుగరఁగి, రామునకెట్లయినఁ బ్రియంబు సేయవలయునని, యిట్లుచెప్పినానుగాని, వేఱుగాదు.

అని, తాత్పర్యము.

లంకాయా దుష్ప్రవేశత్వా ద్దుస్తరత్వా న్మహోదధేః
సామర్థ్యా దాత్మనశ్చైవ మయైత త్సముదీరితమ్. ౮

టీక॥ లంకాయాః = లంకయొక్క; దుష్ప్రవేశత్వాత్ =ప్రవేశింపఁగూడనిదగుటవలనను; మహోదధేః= సముద్రముయొక్క, దుస్తరత్వాత్ = దాఁట

కూడనిదగుటవలనను;ఆత్మనః=నాయొక్క;సామర్థ్యాచ్చైవ=సామర్థ్యమువలనను;మయా=నాచేత; ఏతత్= ఇది;సముదీరితం=చెప్పఁబడినది.

లంకం బ్రవేశించుటయుసముద్రంబుదాఁటుటయు,మిక్కిలి కష్టముగావున, నేనుసమర్థుఁడగుటవలన, నాసామర్థ్యంబుఁజూపుటకై,యిట్లు చెప్పినానుగాని,వేఱుగాదు.

అని,తాత్పర్యము.

ఇచ్ఛామి త్వాం సమానేతు మద్యైవ రఘుబంధునా
గురుస్నేహేన భక్త్యాచ నాన్యథైత దుదాహృతమ్. ౯

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;అద్యైవ=ఇప్పుడె;త్వాం= నిన్ను;రఘుబంధునా=రఘువంశములోఁబుట్టినరామునితో; సమానేతుం= చేరుచుటకు;ఇచ్ఛామి=కోరుచున్నాను. గురుస్నేహేన=అధికమయిన స్నేహముచేతను; భక్త్యాచ=భక్తిచేతను;ఏతత్=ఇది; ఉదాహృతం=చెప్పఁబడినది. అన్యథా=వేఱువిధము;న=కాదు.

నేను,నిన్నిప్పుడె రామునితోఁ జేర్పఁగోరి,యధికస్నేహంబునను, భక్తిచేతను,ఇట్లుచెప్పినానుగాని,వేఱుగాదు.

అని,తాత్పర్యము.

యది నోత్సహసే యాతుం మయాసార్ధ మనిందితే
అభిజ్ఞానం ప్రయచ్ఛ త్వం జానీయా ద్రాఘవో హి తత్. ౧౦

టీక॥ అనిందితే=నిందింపఁబడని సీతాదేవీ!త్వం=నీవు; మయాసార్ధం=నాతోఁగూడ; యాతుం= పోవుటకు; నోత్సహసేయది=ఉత్సహింప కుందువేని; అభిజ్ఞానం=గుఱుతును ; ప్రయచ్ఛ=ఇమ్ము. రాఘవః=రాముండు; తత్=దానిని; జానీయాద్ధి=ఎఱుంగునుకదా!

నిందింపఁబడనిసీతాదేవీ!నీవునాతోఁగూడవచ్చుటకుసమ్మతింపవేని, నేనిచ్చటికివచ్చినిన్నుఁజూచుటరామునకుఁ దెలియునట్లు,ఏదైననొకగుఱుతునిమ్ము.అని,హనుమంతుండు,సీతతోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఏవ ముక్తా హనుమతా సీతా సురసుతోపమా

ఉవాచ వచనం మందం బాష్పప్రగ్రథితాక్షరమ్. ౧౧

టీక॥సురసుతోపమా= దేవకన్యక తోఁబోల్కిగల; సీతా=సీతాదేవి; ఏవం—ఇట్లు; హనుమతా=హనుమంతునిచేత; ఉక్తా=చెప్పఁబడినదై; బాష్పప్రగ్రథితాక్షరం— కన్నీటిచేఁ దడఁబడుచున్నయక్షరములుగల ; వచనం— మాటను;మందం—తిన్నఁగా; ఉవాచ= చెప్పెను.

దేవకన్యకంబోలియున్నసీతాదేవి, హనుమంతునిమాటనువిని , దుఃఖంబునందడఁబడుచుఁ,దిన్నఁగానిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

ఇదం శ్రేష్ఠ మభిజ్ఞానం బ్రూయా స్త్వంతు మమ ప్రియమ్

టీక॥త్వం=నీవు;శ్రేష్ఠం=ఉత్తమమయిన; ఇదం=ఈ;అభిజ్ఞానంతు— గుఱుతునుమాత్రము ; మమ — నాయొక్క; ప్రియం= పెనిమిటిని గూర్చి; బ్రూయాః=చెప్పుము.

నేను,నీకు త్తమమయిన యొకగుఱుతుఁజెప్పెదను;దాని,నీవు, నా ప్రియుండగు రామునకుం జెప్పుము.

అని,తాత్పర్యము.

శైలస్య చిత్రకూటస్య పాదే పూర్వోత్తరే పురా. ౧౨
తాపసాశ్రమవాసిన్యాః ప్రాజ్యమూలఫలోదకే
తస్మిన్ సిద్ధాశ్రమే దేశే మందాకిన్యా హ్య దూరతః.౧౩

టీక॥పురా=మున్ను ; చిత్రకూటస్య—చిత్రకూటమను ; శైలస్య=పర్వతముయొక్క;పూర్వోత్తరే= ఈశాన్యదిక్కునందు ; ప్రాజ్యమూలఫలోదకే=అధికములయినగడ్డలును ఫలములును జలమునుంగల; పాదే=కొండతతిప్పయందు ; మందాకిన్యాః— గంగానదికి; ("హి"అనునదిపూరణార్థము ) అదూరతః = సమీపంబునందు; తస్మిన్=ఆ; సిద్ధాశ్రమే= సిద్ధాశ్రమమను; దేశే = ప్రదేశమునందు; మమ(అధ్యాహృతము)= నేను; తాపసాశ్రమవాసిన్యాః=ఋషులయాశ్రమమునందుండఁగా; ఏవం (అధ్యాహృతము)=ఈప్రకారముగా ; ఆసీత్ (అధ్యాహృతము)=జరగినది.

మున్ను,చిత్రకూట పర్వతంబు నం దలిమూల ఫలోదకంబులు సమృద్ధము గాఁగలయీశాన్యపాదమునందు, గం గానదికి సమీపంబున, సిద్ధాశ్రమంబ నుప్రదేశంబున,నేను, నీతోఁగూడ,నా కబుష్యాశ్రమంబుననుండఁగా,నీప్రకా రముజరగినది.

అని,తాత్పర్యము.

తస్యోపవనషండేషు నానాపుష్పసుగంధిషు
విహృత్య సలిలక్లిన్నా తవాంకే సముపావిశమ్. ౧౪

టీక॥అహం(అధ్యాహృతము)= నేను; తస్య=ఆప్రదేశముయొక్క ; నానాపుష్ప సుగంధిషు = నానావిధములయినపూలచేమంచివాసనగల ; ఉపవనషండేషు = తోఁపుల సమూహంబులందు; విహృత్య=విహరించి;సలిలక్లిన్నా=నీళ్లచేఁదడుపఁబడినదాననై; తవ=నీయొక్క;అంకే= తొడయందు; సముపావిశం=కూర్చుంటిని.

నేను,అచ్చటనానావిధ పుష్పంబుల సుగంధంబులుగుబాళించుచుండు వనంబులందువిహరించి, చెమటచేఁ దడిసి, నీయంకంబునంగూర్చుంటిని.

అని,తాత్పర్యము.

తతో మాంససమాయుక్తో వాయసః పర్యతుండయత్

టీక॥తతః=అటుపిమ్మట ; వాయసః=కాకి; మాంస సమాయుక్తః = మాంసమునందాసగలదై ; స్తనాంతరే(అధ్యాహృతము)= స్తనంబునడుమనందు; పర్యతుండయత్=ఖండించెను.

అంత,నొక్కకాకి, మాంసమునాశించి,నా స్తనంబుననడుమ , ముక్కుతోఁబొడిచినది.అని,తాత్పర్యము.

త మహం లోష్ట ముద్యమ్య వారయామి స్మ వాయసమ్. ౧౫

టీక। అహం=నేను;లోష్టం=మంటిగడ్డను;ఉద్యమ్య=ఎత్తి;తం=ఆ; వాయసం=కాకిని;వారయామిస్మ=అడ్డగించినాను.

అప్పుడు,నేను,మంటిగడ్డనెత్తి,యాకాకిందోలినాను. అని, తాత్పర్యము.

దారయన్ సచ మాం కాక స్తత్రైవ పరిలీయతే

టీక॥సః=ఆ; కాకశ్చ=కాకియును; మాం=నన్ను; దారయన్=గీఱుచు; తత్రైవ=అచ్చటనే; పరిలీయతే=అగపడకున్నది.

ఆ కాకి, యెంతదోలినను బోక, యచ్చటనే దాఁగియుండెను.

అని, తాత్పర్యము.

నచాప్యుపారమన్మాంసాద్భక్షార్థీ బలిభోజనః. ౧౬

టీక॥భక్షార్థీ= ఆహారముఁగోరుచున్న; బలిభోజనః = కాకి; మాంసాత్ = మాంసమువలన; నాప్యుపారమచ్చ=విడువనులేదు.

ఆహారమును గోరియున్నయా కాకి, యెంతమాత్రము, నవ్వలికిఁబోక, విడవక, నా స్తనాంతరంబున గీఱుచు, నా మాంసమును దినుచునేయుండెను.

అని, తాత్పర్యము.

ఉత్కర్షంత్యాం చ రశనాం క్రుద్ధాయాం మయి పక్షిణా
స్రస్యమానే చ వసనే తతో దృష్టా త్వయా హ్యహమ్. ౧౭

టీక॥పక్షిణా=కాకిచేత; వసనే=వస్త్రము; స్రస్యమానే=జాఱునట్లు సేయఁబడుచుండఁగా; మయి= నేను; క్రుద్ధాయాం=కోపించినదాననై; రశనాం = మొలనూలును; ఉత్కర్షంత్యాం=ఈడ్చుకొనుచుండఁగా; తతః=అప్పుడు; అహం=నేను; త్వయా=నీచేత; దృష్టాహి=చూడఁబడినానుగదా!

అట్లా కాకిచే నా వస్త్రంబు వీడఁగా నేను గోపించి వస్త్రంబును దృఢముసేసికొనుటకై, మొలనూలు సవరించుకొనుచుండఁగా, నీవు నన్నుఁజూచినావు.

అని, తాత్పర్యము.

త్వయాఽపహసితా చాహం క్రుద్ధా సంలజ్జితా తదా

టీక॥తదా=అప్పుడు; క్రుద్ధా=కోపించియున్న; అహం=నేను; త్వయా=నీచేత; అపహసితా= పరిహసింపఁబడినదాననై; సంలజ్జితా=సిగ్గునొందినాను.

అప్పు, డట్లు నేనా కాకంబుపైఁ గో

పంబునొంది దానిందఱుముచుండఁగా, నీవునన్నుఁబరిహసించినావు; దానికినే నులజ్జించియుంటిని.

అని, తాత్పర్యము.

భక్షుగృధ్నేన కాకేన దారితా త్వా ముపాగతా. ౧౮

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;భక్షుగృధ్నేన=మాంసాహారమునందాశగల; కాకేన= కాకిచేత; దారితా=గీఱఁబడినదాననై; త్వాం=నిన్ను; ఉపాగతా=పొందినాను.

అట్లాకాకిచేవిదారింపంబడి, నేను మఱలనీయొద్దనుంటిని.

అని, తాత్పర్యము.

ఆసీనస్య చ తే శ్రాంతా పున రుత్సంగ మావిశమ్

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;శ్రాంతా = అలసటనొందినదాననై;పునః=మఱల;ఆసీనస్య=కూర్చుండియున్న; తే=నీయొక్క;ఉత్సంగంచ=తొడసే;ఆవిశం=పొందితిని.

నేనట్లలసటనొంది, యచ్చటఁగూర్చుండియున్ననీతొడపై , మఱలఁగూర్చుంటిని. అని, తాత్పర్యము.

క్రుధ్యంతీ చ ప్రహృష్టేన త్వయాహం పరిసాంత్వితా. ౧౯

టీక॥క్రుధ్యంతీ=కోపించియున్న;అహం=నేను;ప్రహృష్టేన=సంతసించిన ట్టి;త్వయా=నీచేత;పరిసాంత్వితాచ=ఊఱడింపఁబడినాను.

నేనట్లుకోపంబు నొందియుండుటం జూచి,నీవు,సంతోషంబున, నన్ను,మంచిమాటలం దేర్చినావు.

అని, తాత్పర్యము.

బాష్పపూర్ణముఖీ మందం చక్షుషీ పరిమార్జతీ
లక్షితాహం త్వయా నాథ వాయసేన ప్రకోపితా. ౨౦

టీక॥నాథ= పెనిమిటివగురాముఁడా!వాయసేన = కాకిచేత; ప్రకోపితా= కోపమునొందఁజేయఁబడినదానను;బాష్పపూర్ణముఖీ—కన్నీటిచేనిండినముఖముగలదానను;మందం— తిన్నఁగా;చక్షుషీ=కండ్లను; పరిమార్జతీ—




తుడుచు కొనుచున్న దాననగు ; అహం=నేను; త్వయా = నీచేత; లక్షితా=చూడఁబడినాను.

నాథుండవగు రాముఁడా! నేనట్లు వాయసము చేసిన దానికిఁగోపంబునొందినదానను, ముఖంబునిండఁగన్నీళ్లుంచుకొనుచుఁ, దిన్నఁగాఁ గండ్లుతుడుచుకొనుచుండఁగా, నీవు, నన్నుఁజూచినావు.

అని, తాత్పర్యము.

పరిశ్రమాత్ప్రసుప్తాచ రాఘవాంకే ప్యహంచిరమ్
పర్యాయేణ ప్రసుప్తశ్చ మమాంకే భరతాగ్రజః. ౨౧

టీక॥ అహమపి=నేనును; పరిశ్రమాత్=అలసటవలన; చిరం=బహుకాలము; రాఘవాంకే= రామునితొడయందు; ప్రసుప్తాచ=నిదురించిన దానను; అభవం(అధ్యాహృతము)=అయితిని; భరతాగ్రజశ్చ=భరతుని యన్నయయిన రాముండును; పర్యాయేణ=క్రమము చేత; మమ=నాయొక్క;అంకే= తొడయందు;ప్రసుప్తః= నిదురించినాఁడు.

అంత నేను, బరిశ్రమంబున, రామునితొడపైఁబరుండిబహుకాలమునిదురించినాను; నేనులేచినంతనె, రాముండును, నాతొడపైఁబరుండి, నిద్రించినాఁడు. అని, తాత్పర్యము. ఇంతవఱకు, సీతాదేవి, హనుమంతునితో, రామునింగూర్చి చెప్పునట్లు చెప్పి,యిప్పుడువృత్తాంతమువిశదమగుటకై, మఱలహనుమంతునిఁగూర్చి, చెప్పుచున్నది.

స తత్ర పునరేవాథ వాయస స్సముపాగమత్

టీక॥ సః=ఆ; వాయసః=కాకి; తత్ర=అచ్చటికి; పునరేవ=మఱలనే; సముపాగమత్=వచ్చెను.

అంత, నాకాకి,యచ్చటికి, మఱల, వచ్చినది. అని, తాత్పర్యము.

తత స్సుప్త ప్రబుద్ధాం మాం రామస్యాంకా త్సముత్థితామ్. ౨౨
వాయస స్సహసాగమ్య విదదార స్తనాంతరే

టీక॥ తతః=అటుపిమ్మట ; వాయసః=కాకి; సుప్తప్రబుద్ధాం=నిదురించి




లేచినదానను; రామస్య=రామునియొక్క;అంకాత్=తొడనుండి ; సముత్థితాం=లేచినదాననగు; మాం=నన్ను; సహసా=శీఘ్రముగా ; ఆగమ్య=పొంది; స్తనాంతరే=స్తనంబునడుమునందు; విదదార=గీఱెను.

అంత, నేనునిదురలేచి, రామునితొడపైనుండిలేచినంతనే, యాకాకి, తటాలుననాయొద్దకువచ్చి, నాస్తనంబునడుమ, ముక్కుతోఁబొడిచినది.

అని, తాత్పర్యము.

పునఃపున రథోత్పత్య విదదార స మాం భృశమ్. ౨౩

టీక॥అథ=అంత; సః=ఆకాకి; పునఃపునః=మాటిమాటికి; ఉత్పత్య=ఎగిరి;మాం=నన్ను ; భృశం=మిక్కిలి; విదదార=గీఱెను.

అట్లు,ఆకాకి,మాటిమాటికి నెగిరి, నాస్తనంబులుగీఱి , మిక్కిలిగాయముచేసినది.అని, తాత్పర్యము.

తత స్సముక్షితో రామో ముక్తైశ్శోణితబిందుభిః

టీ॥తతః=అందువలన; ముక్తైః=విడువఁబడిన; శోణితబిందుభిః=నెత్తురుబిందువులచేత; రామః=రాముఁడు; సముక్షితః=తడుపఁబడినాఁడు.

అట్లు, కాకిచేగీఱఁబడుచుండునాస్తనంబుననుండి కాఱునెత్తురు బిందువులచే,రాముండుతడిసినాఁడు.

అని, తాత్పర్యము.

వాయసేన తత స్తేన బలవ త్క్లిశ్యమానయా. ౨౪
స మయా బోధిత శ్శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః

టీక॥తతః=అటుపిమ్మట; తేన=ఆ; వాయసేన=కాకిచేత; బలవత్= అధికముగా; క్లిశ్యమానయా= దుఃఖంపఁజేయఁబడుచున్న; మయా= నాచేత;శ్రీమాన్ = అందఱికన్ననధికుండును;సుఖసుప్తః=సుఖముగా నిద్రించినవాఁడును; పరంతపః=శత్రువులందపింపఁజేయువాఁడునగు ; సః=ఆరాముఁడు;బోధితః=నిద్రలేపఁబడినాఁడు.

అంత,నట్లు,ఆకాకిచే, నధికముగా

బాధింపఁబడుచున్న నేను, జేయునదిలేక, శ్రీమంతుండును సుఖనిద్రలో నున్నవాఁడును శత్రువులందపింపఁ జేయువాఁడునగు, రామునిం, బ్రబోధించినాను.

అని, తాత్పర్యము.

స మాం దృష్ట్వా మహాబాహు ర్వితున్నాం స్తనయో స్తదా. ౨౫
ఆశీవిష మివ క్రుద్ధ శ్శ్వసన్ వాక్య మభాషత

టీక॥ మహాబాహుః= పెద్దచేతులుగలఁ; సః= ఆరాముండు; తదా = అప్పుడు; స్తనయోః= స్తనంబులయందు; వితున్నాం= బాధింపఁబడిన; మాం= నన్ను; దృష్ట్వా= చూచి; ఆశీవిషఇవ = సర్పముంబోలె; క్రుద్ధః= కోపించినవాఁడై; శ్వసన్ = నిట్టూర్పులువుచ్చుచు; వాక్యం= మాటను; అభాషత= పలికెను.

మహాబాహుండగు నారాముం, డప్పుడు, నెత్తురుగాఱు స్తనంబులతో నున్న నన్నుఁ జూచి, సర్పంబుంబోలెఁ, గోపంబునొంది, నిట్టూర్పులు వుచ్చుచు, నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

కేన తే నాగనాసోరు విక్షతం వై స్తనాంతరమ్. ౨౬
కః క్రీడతి సరోషేణ పంచ వక్త్రేణ భోగినా

టీక॥ నాగనాసోరు= ఏనుంగుతొండమువంటితొడలుగలదానా! కేన= ఎవ్వనిచేత; తే= నీయొక్క; స్తనాంతరం= స్తనమధ్యప్రదేశము; విక్షతం= గీఱఁబడినది ("వై" అనునది పాదపూరణార్థము)॥ కః= ఎవ్వఁడు; సరోషేణ= కోపముతోఁగూడినదియు; పంచవక్త్రేణ= అయిదుముఖములుగలదియునగు; భోగినా= సర్పముతో; క్రీడతి= ఆటలాడుచున్నాఁడు॥

ఏనుఁగుతొండములవంటితొడలుగల సీతాదేవీ! నీ స్తనంబుల నెవ్వఁడిట్లు గాయముచేసినాఁడు॥ ఎవ్వఁడిట్లు, కోపంబునొందియున్న యయిదుతలల పాముతోఁ గ్రీడించుచున్నాఁడు॥ కోపంబునొందినయయిదుతలల పాముతోఁ గ్రీడించువాని కేమిఫలముగలుగునో, నీ స్తనంబుల గాయములు గావించినవాఁడా ఫలంబు నొందును. అని, రాముండునన్నడిగెను.

అని, తాత్పర్యము.

వీక్షమాణ స్తత స్తం వై వాయసం సముదైక్షత. ౨౭
నఖైః సరుధిరై స్తీక్ష్ణై ర్మా మేవాభిముఖం స్థితమ్

టీక॥ సః (అధ్యాహృతము) = ఆరాముఁడు; తతః = అటుపిమ్మట; వీక్షమాణః = చూచుచు; సరుధిరైః = నెత్తురుతోఁ గూడినవియును; తీక్ష్ణైః = కఱకైనవియు నగు; నఖైః = గోళ్లతో; మామేవ = నన్నుఁ గూర్చియే; అభిముఖం = యెదురుగా; స్థితం = ఉన్నట్టి; తం = ఆ; ("వై" అనునది పాదపూరణార్థము) వాయసం = కాకిని; సముదైక్షత = చూచెను.

ఆ రాముండంత నాల్గుప్రక్కలం జూచుచు, నెత్తురుతోఁ గూడిన కఱకునఖంబులతో, నాయెదుట నేనిల్చియున్న, యా కాకిం జూచెను.

అని, తాత్పర్యము.

పుత్రః కిల స శక్రస్య వాయసః పతతాం వరః. ౨౮
ధరాంతరగత శ్శీఘ్రం పవనస్య గతౌ సమః

టీక॥ సః = ఆ; వాయసః = కాకి; శక్రస్య = ఇంద్రునియొక్క; పుత్రః కిల = కొడుకుగదా! పతతాం = పక్షులలోపల; వరః = శ్రేష్ఠుండు; ధరాంతరగతః = పర్వతమధ్యప్రదేశమును బొందినవాఁడు; శీఘ్రం = శీఘ్రముగా; గతౌ = పోవుటయందు; పవనస్య = వాయువునకు; సమః = సరివచ్చువాఁడు.

ఆకాకి, యింద్రునికొడుకు, పక్షులలో మేటియయినవాఁడు; పర్వతంబునం దునివసించును; శీఘ్రగమనంబున, వాయుదేవునకు, సరివచ్చును; అని, యటువెనుక రాముండు చెప్పెను.

అని. తాత్పర్యము.

తత స్తస్మి న్మహాబాహుః కోపసంవర్తితేక్షణః. ౨౯
వాయసే కృతవాన్ క్రూరాం మతిం మతిమతాం వరః

టీక॥ తతః = అటుపిమ్మట; మతిమతాం = బుద్ధిమంతులలోపల; వరః = శ్రేష్ఠుండగు; మహాబాహుః = పెద్దచేతులుగలరాముండు; కోపసంవర్తితేక్షణః = కోపముచేఁద్రిప్పఁబడిన కండ్లుగలవాఁడై; తస్మిన్ = ఆ; వాయసే = కాకియందు; క్రూరాం = భయంకరమయిన; మతిం = బుద్ధిని; కృతవాన్ = చేసినాఁడు.

అంత, బుద్ధిమంతులలోఁ శ్రేష్ఠుండును మహాబాహుండునగు, నారాముండు, ఆకాకిపైఁగోపంబుఁబూని, నేత్రంబులంగోపరసంబుగదుర, దానింజంపఁగోరెను.

అని, తాత్పర్యము.

స దర్భం సంస్తరా ద్గృహ్య బ్రాహ్మేణా స్త్రేణ యోజయత్. ౩౦

టీక॥సః=ఆరాముండు; సంస్తరాత్=దర్భాసనముననుండి; దర్భం=దర్భను;గృహ్య(గృహీత్వా)=తీసికొని;బ్రాహ్మేణ=బ్రహ్మసంబంధియయిన; అస్త్రేణ=అస్త్రముచేత;అస్త్రమంత్రముచేతననుట;యోజయత్ (అయోజయత్)=కూర్చెను.

ఆరాముండు, తనదర్భాసనంబుననుండి, యొకదర్భందీసి,దాని, బ్రహ్మాస్త్రముచే,నభిమంత్రించెను.

అని, తాత్పర్యము.

స దీప్త ఇవ కాలాగ్ని ర్జజ్వాలాభి ముఖోద్విజమ్

టీక॥సః=ఆదర్భ; దీప్తః= మండిన;కాలాగ్నిరివ= ప్రళయకాలమునందలియగ్నియుంబోలె;ద్విజమభిముఖః=పక్షికెదురై; జజ్వాల= జ్వలించినది.

ఆదర్భ మండుచున్న ప్రళయాగ్నిచందంబున,నాకాకికెదురై, ప్రజ్వరిల్లుచుండినది.

అని, తాత్పర్యము.

స తం ప్రదీప్తం చిక్షేప దర్భం తం వాయసం ప్రతి. ౩౧

టీక॥సః=ఆరాముండు;తం= ఆ; వాయసంప్రతి= కాకినిగూర్చి; తం= ఆ;ప్రదీప్తం=మండుచున్న; దర్భం= దర్భను; చిక్షేప=వైచెను.

రాముం, డట్లుమండుచున్నయాదర్భను,కాకిపైవైచెను.

అని, తాత్పర్యము.

తత స్తం వాయసం దర్భ స్సోంబరే ను జగామహ

టీక॥తతః=అటుపిమ్మట; సః=ఆ; దర్భః=దర్భ; అంబరే=ఆకాశము

స౩౮

నందు; తం=ఆ; వాయసం—కాకిని; అను జగామ—వెంబడించెను. "హ" అనునదిపాదపూరణార్థము.

అంత, నాదర్భ, జ్వలించుచు, నాకాశంబుననాకాకిందఱుముకొనిపోయినది. అని, తాత్పర్యము.

అనుసృష్ట స్తదా కాకో జగామ వివిధాం గతిమ్. ౩౨

టీక॥తదా=అప్పుడు; కాకః=కాకి; అనుసృష్టః=వెంబడింపఁబడినదై; వివిధాం=నానావిధమగు; గతిం=స్థానమును; జగామ=పొందెను.

అప్పుడాకాకి, యాదర్భచేఁదఱుమంబడినదై, పెక్కుస్థానంబులకుంబోయెను.

అని, తాత్పర్యము.

లోకకామ ఇమం లోకం సర్వం వై విచచార హ

టీక॥సః(అధ్యాహృతము)—ఆకాకి; లోకకామః=రక్షించుజనమునుఁగోరినదై; ఇమం=ఈ; లోకం=లోకమును; సర్వం వై=అంతను; విచచార=తిరిగెను.

"హ" అనునదిపాదపూరణార్థము.

ఆకాకి, తన్నెవరైనం గాపాడుదురోయని, వెదకుచు, నీప్రపంచమునంతయుం, దిరిగెను. అని, తాత్పర్యము.

స పిత్రా చ పరిత్యక్త స్సురైశ్చ సమహర్షిభిః. ౩౩
త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః

టీక॥సః—ఆకాకి; పిత్రా చ=తండ్రియయినయింద్రునిచేతను; సమహర్షిభిః=పూజ్యులయినఋషులతోఁగూడిన; సురైశ్చ—దేవతలచేతను; పరిత్యక్తః=విడువఁబడినవాఁడై; త్రీన్=మూఁడైన; లోకాన్=లోకంబులను; సంపరిక్రమ్య=ప్రదక్షిణించి; తమేవ—ఆరామునే; శరణం=రక్షకునిఁగా; గతః=పొందెను.

ఆకాకిని, తండ్రియయినయింద్రుండును "నిన్నురక్షింపనాచేతంగాదు" అని, విడిచినాఁడు; దేవతలునువిడిచిరి; అట్లు, మహర్షులునుబరిత్యజించిరి; అట్లు, ఆకాకి, ముల్లోకంబులకునుబ్రదక్షిణంబులుచేసి, తుదకు, ఆరామునే, శరణువొందెను. అని, తాత్పర్యము.

స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్. ౩౪
వధార్హమపి కాకుత్థ్సః కృపయా పర్యపాలయత్

టీక॥శరణ్యః=శరణుపొందదగినట్టి; సః=ఆ;కాకుత్థ్సః= రాముఁడు; భూమౌ=నేలయందు; నిపతితం= పడినది యును;శరణాగతం=రక్షకునిగాఁబొం దినదియును;తం= ఆకాకిని;వధార్హ మపి= చంపఁదగినదానినైనను; కృప యా=దయచేత;పర్యపాలయత్=పరి పాలించెను.

శరణుపొందినవారలఁగాపాడుట యను దృఢవ్రతముగలరాముండు, తన ముందట శరణాగతమై నేలం బడియు న్నయాకాకింజూచి,యదిచంపఁదగినదై నను,దయచేఁగాపాడెను.

అని, తాత్పర్యము.

స శర్మ లబ్ధ్వా లోకేషు తమేవ శరణం గతః. ౩౫

టీక॥ సః(అధ్యాహృతము)=ఆకా కి;లోకేషు = లోకములయందు; శ ర్మ=సౌఖ్యమును; నలబ్ధ్వా=పొందక; తమేవ=ఆరామునే; శరణం = రక్ష కునిఁగా;గతః=పొందినాఁడు.

ఆకాకి, యెన్నిలోకంబులు దిరిగిన ను, ఆదర్భతన్నువిడువకుండుటంజేసి, యారామునేశరణువొందెను.

అని,తాత్పర్యము.

పరిద్యూనం విషణ్ణంచ స త మాయాంత మబ్రవీత్

టీక॥సః = ఆరాముండు;పరిద్యూ నం= పరితాపమునుబొందినవాఁడును; విషణ్ణంచ = దుఃఖితుండును; ఆయాం తం=వచ్చుచున్నవాఁడునగు;తం= ఆ కాకినిగూర్చి;అబ్రవీత్=పలికెను.

ఆరాముండు,తనయొద్దకుఁ, బరితా పంబునొంది దుఃఖితుండైవచ్చినకాకిం జూచి,యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

మోఘం కర్తుం నశక్యంతు బ్రాహ్మ మస్త్రం తదుచ్యతామ్. ౩౬

టీక॥బ్రాహ్మం= బ్రహ్మసంబంధియయిన; అస్త్రంతు= అస్త్రముమాత్రము; మోఘం=వ్యర్థముగా; కర్తుం= చేయుటకు; నశక్యం = అలవిగాదు. తత్=అందువలన; ఉచ్యతాం=చెప్పఁబడుఁగాక.

ఈబ్రహ్మాస్త్రమును వ్యర్థముగాఁజేసిమరలింపనలవిగాదు; కావున, దానికేమి సేయవచ్చును? చెప్పుము. అనిరాముండు కాకినడిగెను, అని, తాత్పర్యము.

హినస్తు దక్షిణాక్షి త్వచ్ఛర ఇత్యథ సోఽబ్రవీత్

టీక॥అథ=అటుపిమ్మట; సః=ఆకాకి; "త్వచ్ఛరః = నీయస్త్రము; దక్షిణాక్షి=కుడికంటిని; హినస్తు=హింసించుఁగాక." ఇతి=అని; అబ్రవీత్=పలికెను.

అంత, నాకాకి, రాముంజూచి, "నీబ్రహ్మాస్త్రంబునాకుడికంటినిహింసించుఁగాక" అని, చెప్పెను.
అని, తాత్పర్యము.

తతస్తస్యాక్షి కాకస్య హినస్తిస్మ స దక్షిణమ్. ౩౭

టీక॥తతః=అటుపిమ్మట; సః= ఆదర్భ; తస్య=ఆ; కాకస్య=కాకియొక్క; దక్షిణం=కుడిదైన; అక్షి=కంటిని; హినస్తిస్మ=హింసించెను.

అంత, నాదర్భ, యాకాకి కుడికంటినిహింసించినది. అని, తాత్పర్యము.

దత్వా స దక్షిణం నేత్రం ప్రాణేభ్యః పరిరక్షితః

టీక॥సః=ఆకాకి; దక్షిణం= కుడిదైన; నేత్రం=కంటిని; దత్వా=ఇచ్చి; ప్రాణేభ్యః=ప్రాణంబులవలన ; పరిరక్షితః=రక్షింపఁబడినాఁడు.

ఆకాకి. తనకుడికంటినొసంగి, తనప్రాణంబులంగాపాడుకొనెను.
అని, తాత్పర్యము.

స రామాయ నమస్కృత్వా రాజ్ఞే దశరథాయచ. ౩౮
విసృష్టస్తేన వీరేణ ప్రతిపేదే స్వమాలయమ్

టీక॥సః=ఆకాకి; రామాయ=రామునికొఱకును; రాజ్ఞే=రాజయిన; ద

శరథాయచ=దశరథునికిన్నీ ఱకును; న మస్కృత్వా=మ్రొక్కి; వీరేణ=పరాక్రమశాలియయిన; తేన=ఆరామునిచే; విసృష్టః=విడువఁబడినవాఁడై; స్వం=తనదైన; ఆలయం=ఇంటిని; ప్రతిపేదే=పొందెను.

అంత, నాకాకి, రామునకును, దశరథమహారాజునకును, నమస్కరించి, పరాక్రమశాలియగు నారాము ననుజ్ఞనొంది, తనవాసస్థానంబునకుం, బోయెను.

అని, తాత్పర్యము.

మత్కృతే కాకమాత్రేతు బ్రహ్మాస్త్రం సముదీరితమ్. ౩౯
కస్మాద్యోమాం హరే త్త్వత్తః క్షమసే తం మహీపతే

టీక॥(సీతాదేవి, యిదివఱకు, హనుమంతునితో, నతనింగూర్చియే చెప్పి, మఱలదుఃఖావేశంబున, రాముసుద్దేశించి చెప్పుచున్నది.) మహీపతే=రాముఁడా! త్వయా(అధ్యాహృతము)=నీచేత; మత్కృతే=నాకుఁగా; కాకమాత్రేతు=కాకియంతటిదానియందే; బ్రహ్మాస్త్రం=బ్రహ్మాస్త్రము; సముదీరితం=ప్రయోగింపఁబడినది. యః=ఎవ్వఁడు; త్వత్తః=నీయొద్దనుండి; మాం=నన్ను; హరేత్ (అహరత్)=అపహరించెనో; తం=అతని; కస్మాత్=ఎందువలన; క్షమసే=క్షమించుచున్నావు?

రాముఁడా! నీవు, మున్ను నాకొఱకు, ఒకకాకియంతటి స్వల్పపక్షిమీఁద, బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించినావు; ఇప్పుడు, నీయొద్దనుండి నన్నపహరించిన పరమాపరాధియయినవాని, క్షమించుచున్నావేమి?

అని, తాత్పర్యము.

స కురుష్వ మహోత్సాహః కృపాం మయి నరర్షభ. ౪౦

టీక॥ నరర్షభ=పురుషశ్రేష్ఠుండవగు రాముఁడా! సః=అట్టి; త్వం(అధ్యాహృతము)=నీవు; మహోత్సాహః=అధికమయిన యుత్సాహము గలవాఁడవై; మయి=నాయందు; కృపాం=దయను; కురుష్వ=చేయుము.

పురుషోత్తముండవగు రాముఁడా! అట్లుదయాసముద్రుండవని ఖ్యాతిగాంచినట్టినీవు, అధికోత్సాహంబవలంబించి, నాయందుదయఁజూపుము.

అని, తాత్పర్యము.

త్వయా నాథవతీ నాథ హ్యనాథా ఇవ దృశ్యతే

టీక॥ నాథ=పెనిమిటివగు రాముఁడా! త్వయా=నీచేత; నాథవతీ=నాథుండుగలది; అనాథాఇవ (అనాథేవ)=నాథుఁడులేనిదివలె; దృశ్యతే = చూడఁబడుచున్నది.

నాథుఁడా! నీవు నాకు నాథుండవై యుండినను, నేననాథయుంబోలె, నిట్లుండుట సరియగునా? అని, తాత్పర్యము.

ఆనృశంస్యం పరో ధర్మ స్త్వత్త ఏవ మయా శ్రుతః. ౪౧

టీక॥ ఆనృశంస్యం= క్రౌర్యములేకుండుటయనెడు; పరః= అధికమయిన; ధర్మః=ధర్మము; త్వత్తఏవ=నీవలననే; మయా=నాచేత; శ్రుతః=వినఁబడినది.

దయఁగలిగియుండుట, పరమధర్మంబని, నీవే నాకుఁ జెప్పియున్నావు; ఇప్పుడు, నీవేయిట్లు దయఁదప్పవచ్చునా? అని, తాత్పర్యము.

జానామి త్వాం మహావీర్యం మహోత్సాహం మహాబలమ్
అపారపార మక్షోభ్యం గాంభీర్యా త్సాగరోపమమ్. ౪౨
భర్తారం ససముద్రాయా ధరణ్యా వాసవోపమమ్

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; త్వాం=నిన్ను; మహావీర్యం= అధికమయిన పరాక్రమముగలవానిఁగాను; మహోత్సాహం=అధికమయినయుత్సాహముగలవానిఁగాను ; మహాబలం=అధికమయినబలము గలవానిఁగాను; అపారపారం=పొందఁగూడనియంతముగలవానిఁగాను; అక్షోభ్యం=కలఁతపెట్టఁ గూడనివానిఁగాను; గాంభీర్యాత్ = గాంభీర్యమువలన; సాగరోపమం= సముద్రముతోఁబోలికగలవానిఁగాను; ససముద్రాయాః = సముద్రముతోఁగూడిన; ధరణ్యాః = భూమికి; భర్తారం=ప్రభువునుగాను; వాసవోపమం= ఇంద్రునితోఁబోలికగలవానిఁగాను; జానామి=ఎఱుంగుదును.

నిన్ను, మహాపరాక్రమశాలివనియు, నధికమయినయుత్సాహముగలవాఁడవ

నియు, మహాబలుండవనియు, ననంతముల గుగుణంబులుగలవాఁడవనియు, నెంతకష్టంబునందును క్షోభంబునొందనివాఁడవనియు, గాంభీర్యంబునసముద్రంబువంటివాఁడవనియుఁ, జతుస్సముద్రముల తోఁగూడినభూమికంతయుఁబ్రభుండవనియు, దేవేంద్రునకుసాటియయినవాఁడవనియు, నాకుఁదెలియును.

అని, తాత్పర్యము.

ఏవ మస్త్రవిదాం శ్రేష్ఠ స్సత్యవా న్బలవా నపి. ౪౩
కి మర్థ మస్త్రం రక్షస్సు నయోజయతి రాఘవః

టీక॥ రాఘవః=రాముఁడు; ఏవం=ఇట్లు; అస్త్రవిదాం= అస్త్రంబులనెఱింగినవారలలోపల; శ్రేష్ఠః=మేటియయ్యెను; సత్యవాక్=సత్యముగలవాఁడయ్యెను; బలవానపి=అధికమయినబలముఁగలవాఁడయ్యెను; రక్షస్సు=రాక్షసులయందు; అస్త్రం=అస్త్రమును; కిమర్థం=ఎందుకొఱకు; నయోజయతి=కూర్పఁడు?

రాముండు, ఇట్లు, అస్త్రవేత్తలలో నుత్తముండయ్యెను, సత్యవంతుండయ్యెను, బలవంతుండయ్యెను, రాక్షసులనన్నిట్లుబాధించుచుండఁగా, వారలపైనస్త్రములం బ్రయోగింపఁడేల?

అని, తాత్పర్యము.

సీత, యిదివఱకు, రాముసుద్దేశించి, చెప్పి, మఱలహనుమంతునుద్దేశించి, చెప్పుచున్నది.

న నాగా నాపి గంధర్వా నాసురా న మరుద్గణాః. ౪౪
రామస్య సమరే వేగం శక్తాః ప్రతిసమాధితుమ్

టీక॥ సమరే=యుద్ధమునందు; రామస్య=రామునియొక్క; వేగం=పరాక్రమమును; ప్రతిసమాధితుం= ఓర్చుటకు; నాగాః=సర్పములు; నశక్తాః=సమర్థములుకావు. గంధర్వాఅపి=గంధర్వులును; న(శక్తాః)=సమర్థులుకారు. అసురాః=రాక్షసులు; న(శక్తాః)= సమర్థులుకారు. మరుద్గణాః= దేవతలసమూహములు; న(శక్తాః)=సమర్థులు కారు.

సర్పంబులుగాని, గంధర్వులుగాని, యసురులుగాని, దేవతలుగాని, యుద్ధం

బున, రాముని పరాక్రమంబును సహింపలేరు. అని, తాత్పర్యము.

తస్య వీర్యవతః కశ్చి ద్య ద్యస్తి మయి సంభ్రమః. ౮౫
కిమర్థం నశరై స్తీక్ష్ణైః క్షయం నయతి రాక్షసాన్

టీక॥ వీర్యవతః = అధికమయినపరాక్రమముగల; తస్య = ఆ రామునికి; మయి = నావిషయమై; కశ్చిత్ = కొంచమైనను; సంభ్రమః = వేగిరిపాటు; అస్తియది = ఉండెనేని; తీక్ష్ణైః = కఱకులయిన; శరైః = బాణముల చేత; కిమర్థం = ఎందుకొఱకు; రాక్షసాన్ = రాక్షసులను; క్షయం = నాశమును; నయతి = పొందింపఁడు?

మహాపరాక్రమశాలియగు, నారామునకు, నన్నుఁ దీసికొని పోవలయునని, యెంతమాత్రమయినఁ దొందరయుండునేని, యీ రాక్షసులనందఱఁ, దీక్ష్ణంబులగు బాణంబుల చేఁ జంపకున్నాఁ డేల. అని, తాత్పర్యము.

భ్రాతు రాదేశ మాదాయ లక్ష్మణోవా పరంతపః. ౮౬
కస్య హేతో ర్న మాం వీరః పరిత్రాతి మహాబలః

టీక॥ వీరః = పరాక్రమశాలియును; మహాబలః = అధికమయినబలముగలవాఁడును; పరంతపః = శత్రువులఁదపింపఁజేయువాఁడునగు; లక్ష్మణోవా = లక్ష్మణుండైనను; భ్రాతుః = అన్నయొక్క; ఆదేశం = ఆజ్ఞను; ఆదాయ = గ్రహించి; కస్య = ఏ; హేతోః = (పంచమ్యర్థమందు షష్ఠి) కారణంబువలన; మాం = నన్ను; నపరిత్రాతి = రక్షింపఁడు?

వీరుండును మహాబలుండును శత్రువులందపింపఁజేయువాఁడునగు లక్ష్మణుండైనను, అన్నయొద్దననుజ్ఞఁ దీసికొని, యిచ్చటికివచ్చి, నన్ను రక్షింపకున్నాఁ డేమి? అని, తాత్పర్యము.

యది తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్ని సమతేజసౌ. ౮౭
సురాణామపి దుర్ధర్షౌ కిమర్థం మా ముపేక్షతః

టీక॥ పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులును; వాయ్వగ్నిసమతేజసౌ = వా

యువుయొక్కయు నగ్నియొక్కయుఁ గాంతితో సమానమయిన కాంతిగలవారలును; సురాణామపి=దేవతలకును; దుర్ధర్షౌ=ఎదిరింపఁగూడని వారలు నగు; తౌ=ఆరామలక్ష్మణులు; సంగతౌ=(అధ్యాహృతము) యది= చేరియున్నవారలగుదురేని; కిమర్థం= ఎందుకొఱకు; మాం=నన్ను; ఉపేక్షతః (ఉపేక్షేతే)=ఉపేక్షించుచున్నారు?

పురుషోత్తములును వాయువునకు నగ్నికిని సూర్యునకును బోలెఁగాంతిగలవారలును దేవతలకైననెదిరింప నలవిగానివారలునగు నారామలక్ష్మణులిద్దఱును, ఒకరినొకరువిడువక, యొకటిగాఁజేరియుందురేని నాపైని క్లేలయుపేక్ష సేయుచున్నారు? అని, తాత్పర్యము.

మమైవ దుష్కృతం కించి న్మహద స్తి న సంశయః. ౪౮
సమర్థా వపి తౌ యన్మాం నావేక్షేతే పరంతపౌ

టీక॥మమ=నాయొక్క; కించిత్=ఒకానొక; మహత్=గొప్ప; దుష్కృతమేవ=పాపమే; అస్తి= కలదు. సంశయః=సందేహము; న=లేదు. యత్=ఎందువలన; పరంతపౌ= శత్రువులందపింపఁజేయునట్టి; తౌ= ఆరామలక్ష్మణులు; సమర్థావపి= శక్తులయినను; మాం=నన్ను; నావేక్షేతే=చూడకున్నారో.

శత్రువులందపింపఁజేయునట్టి యారామలక్ష్మణులు, నాదుఃఖంబు వోలఁగింపఁసమర్థులయినను, నామీఁదదృష్టియుంచకుండుటకు, నేను జేసియున్నమహాపాపమే కారణము; ఇందుసందేహములేదు. అని, సీతాదేవి, హనుమంతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రుభాషితమ్. ౪౯
అథాబ్రవీ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః

టీక॥మహాతేజాః= అధికమయినపరాక్రమముగలవాఁడును; మారుతాత్మజః= వాయుదేవుని కుమారుండునగు; హనుమాన్=హనుమంతుండు; వైదేహ్యాః=సీతాదేవియొక్క; సాశ్రు= కన్నీళ్లతోఁగూడునట్లు; భాషితం=చెప్పఁబడిన; కరుణం=దుఃఖముగల్గించు నట్టి; వచనం=మాటను; శ్రుత్వా=విని; అథ=అటుపిమ్మట; అబ్రవీత్= చెప్పెను.

మహాపరాక్రమశాలియు, వాయు

దేవుని కుమారుండు నగు హనుమం తుండు, సీతాదేవికన్నిల్లొలుకం జెప్పి | నదుఃఖంపుమాటలనువిని, యిట్లని,బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన మే శపే. ౫౦

టీక॥ దేవి=సీతాదేవి; రామః= రాముఁడు; త్వచ్ఛోకవిముఖః=నీదుఃఖముచేతనైమఖ్యమునొందిన వాఁడు. మే=నాయొక్క; సత్యేన=సత్యముచేత; శపే= శపథము సేయుచున్నాను.

సీతాదేవీ! నీదుఃఖంబున రాముండు సన్నిటియందును విముఖుండై యున్నాఁడు; నేనుసత్యముచేశపథము సేయుచున్నాను. అని, తాత్పర్యము.

రామే దుఃఖాభిపన్నేచ లక్ష్మణః పరితప్యతే

టీక॥ రామే=రాముండు; దుఃఖాభిపన్నేచ= దుఃఖమునొందినవాఁడు కాఁగానే; లక్ష్మణః=లక్ష్మణుఁడు; పరితప్యతే=పరితపించుచున్నాఁడు.

రాముండుదుఃఖింపఁగానే, లక్ష్మణుండునుదుఃఖంబునొందును.
అని, తాత్పర్యము.

కథంచి ద్భవతీ దృష్టా నకాలః పరిశోచితుమ్. ౫౧

టీక॥ కథంచిత్=అతిప్రయాసముచేత; భవతీ=నీవు; దృష్టా= చూడఁబడినావు. పరిశోచితుం = దుఃఖించుటకు; కాలః=కాలము; న=కాదు.

మహాప్రయాసంబున, నిన్నుఁజూడఁగంటిని; ఇప్పుడునీవుసంతోషింపవలెనుగాని, దుఃఖించుటసరిగాదు.
అని, తాత్పర్యము.

ఇమం ముహూర్తం దుఃఖానాం ద్రక్ష్య స్యంత మనిందితే

టీక॥ అనిందితే= నిందింపఁబడనిచానా! ఇమం=ఈ; ముహూర్తం = (అత్యంత సంయోగమందుద్వితీయ) ముహూర్తమునందు; దుఃఖానాం=దుఃఖములయొక్క; అంతం= తుదను; ద్రక్ష్యసి=చూడఁగలవు.

నిందింపఁబడనిసీతాదేవీ! ఇంక, స్వల్పకాలంబుననె, నీదుఃఖంబులన్నియునశింపంగలవు. అని, తాత్పర్యము.

తావుభౌ పురుషవ్యాఘ్రౌ రాజపుత్రౌ మహాబలౌ. ౫౨
త్వద్దర్శనకృతోత్సాహౌ లంకాం భస్మీకరిష్యతః

టీక॥ పురుషవ్యాఘ్రౌ= పురుషశ్రేష్ఠులును; రాజపుత్రౌ= రాచకొమరులును; మహాబలౌ=అధికమయినబలముగలవారలును; త్వద్దర్శనకృతోత్సాహౌ= నీయొక్క చూచుటయందు త్సాహంబుగలవారలునగు; తౌ=ఆ రామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును; లంకాం=లంకను; భస్మీకరిష్యతః = భస్మముగాఁ జేయఁగలరు.

పురుషశ్రేష్ఠులును రాచకొమరులునుమహాబలులును నిన్నుఁ జూడఁగోరుచుండువారలునగు, నారామలక్ష్మణులు, లిద్దఱును, ఇంకస్వల్పకాలంబుననె, యీలంకనుభస్మంబుగావింతురు.

అని, తాత్పర్యము.

హత్వాచ సమరే క్రూరం రావణం సహబాంధవమ్. ౫౩
రాఘవ స్త్వాం విశాలాక్షి నేష్యతి స్వాం పురీంప్రతి

టీక॥ విశాలాక్షి = పెద్దకన్నులుగల సీతాదేవీ! రాఘవః=రాముఁడు; సమరే=యుద్ధమునందు; సహబాంధవం= బంధువులతోఁగూడిన; క్రూరం= దయలేని; రావణం= రావణుని ; హత్వాచ=చంపియు; త్వాం=నిన్ను; స్వాం= తనదైన; పురీంప్రతి = పట్టణమునుగూర్చి; నేష్యతి= తోడ్కొనిపోఁగలఁడు.

విశాలంబులగుకన్నులుగల సీతాదేవీ! రాముండు, క్రూరుండగురావణుని బంధువులతోడంజంపి, నిన్నుఁదోడ్కొని, తనయయోధ్యా పట్టణంబునకుఁ బోఁగలఁడు. అని, తాత్పర్యము.

బ్రూహి యద్రాఘవో వాచ్యో లక్ష్మణశ్చ మహాబలః. ౫౪
సుగ్రీవోవాపి తేజస్వీ హరయోపి సమాగతాః

టీక॥ రాఘవః=రాముఁడును; మహాబలః= అధికమయినబలముగల; లక్ష్మణశ్చ=లక్ష్మణుఁడును; తేజస్వీ=అధికమయినకాంతిగల; సుగ్రీవోవాపి=

సుగ్రీవుండును; యత్ = దేనిని; వాచ్యాః = చెప్పఁదగినవాఁడో ; సమాగతాః = చేరియున్న; హరయోవాపి= వానరులును ; వాచ్యాః (అధ్యాహృతము)= చెప్పఁదగినవారలో; తత్ (అధ్యాహృతము = దానిని; బ్రూహి= చెప్పుము.

రామునకుఁగాని, మహాబలుఁడగు లక్ష్మణునకుఁగాని, కాంతిమంతుండగు సుగ్రీవునకుఁగాని, యచ్చట గుంపుగుంపుగాఁ జేరియుండు వానరులకుఁగాని, యేమిచెప్పవలయును; దానిం జెప్పుము అని, హనుమంతుండు, సీతాదేవికిం జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్తవతి తస్మిం స్తు సీతా సురసుతోపమా. ౫౫
ఉవాచ శోకసంతప్తా హనుమంతం ప్లవంగమమ్

టీక॥ సురసుతోపమా= దేవకన్యకతోఁబోలికగల; సీతా= సీత; తస్మిన్= ఆహనుమంతుఁడు; ఇతి= ఇట్లు; ఉక్తవతితు= చెప్పఁగానే; శోకసంతప్తా= దుఃఖము చేమిక్కిలియుఁదపింపఁజేయఁబడినదై; ప్లవంగమం = వానరుండైన; హనుమంతం= హనుమంతునిగూర్చి; ఉవాచ= చెప్పెను.

హనుమంతుండిట్లుచెప్పఁగా, దేవకన్యకంబోలియున్నసీతాదేవి, పరమదుఃఖితయయి, హనుమంతుంజూచి, యిట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ. ౫౬
తం మమార్థే సుఖం పృచ్ఛ శిరసా చాభివాదయ

టీక॥ మనస్వినీ= మంచిమనసుగల; కౌసల్యా= కౌసల్య; లోకభర్తారం= లోకంబునకుఁబ్రభువయిన; యం= ఎవనిని; సుషువే= కనెనో; తం= ఆరాముని; మమ= నాయొక్క; అర్థే= ప్రయోజనమునిమిత్తమయి; సుఖం= సుఖమును; పృచ్ఛ= అడుగుము. శిరసా= తలచేత; అభివాదయచ = నమస్కారంబునుం జేయుము.

మనస్వినియగు, కౌసల్య, లోకనాయకుండగునేపుత్రుంగనెనో, అట్టిరాముని, నీవు, నాకై, సుఖంబడిగి, సాష్టాంగముగ నమస్కరింపుము.

అని, తాత్పర్యము.

స్రజశ్చ సర్వరత్నాని ప్రియాయాశ్చ వరాంగనాః. ౫౭
ఐశ్వర్యంచ విశాలాయాం పృథివ్యామపి దుర్లభమ్
పితరం మాతరం చైవ సమ్మాన్యాభి ప్రసాద్యచ. ౫౮
అనుప్రవ్రజితో రామం సుమిత్రా యేన సుప్రజాః

టీక ॥ యేన=ఎవ్వనిచేత; సుమిత్రా=సుమిత్ర; సుప్రజాః=మంచిసంతానముగలదో; సః= (అధ్యాహృతము)ఆలక్ష్మణుండు; స్రజశ్చ=పుష్పమాలికలను;సర్వరత్నాని=సమస్తములయినమణులను;వరాంగనాః=శ్రేష్ఠస్త్రీలయిన; ప్రియాః= భార్యలు;యాః(సంతి)=ఎవ్వరుగలరో; తాః(అధ్యాహృతము) చ= వారలను;విశాలాయాం=విశాలమయిన; పృథివ్యాం = భూమియందు; దుర్లభం=పొందఁగూడని;ఐశ్వర్యంచ=సంపదను; త్యక్త్వా(అధ్యాహృతము)=విడిచి; పితరం= తండ్రిని; మాతరంచైవ=తల్లిని; సమ్మాన్య=పూజించి;అభిప్రసాద్యచ=సంతోషింపఁజేసియు; రామం=రాముని; అనుప్రవ్రజితః=వెంబడించివనంబునొందెను.

సుమిత్రాసత్పుత్రుండైన లక్ష్మణుండు, పుష్పంబులు మొదలగు నానావిధభోగ్యద్రవ్యంబులను, సమస్తరత్నంబులను,ఉత్తమస్త్రీలయిన ప్రియలను, విశాలంబగుభూమియందంతయు దుర్లభంబైనయైశ్వర్యంబునువిడిచి, తల్లిదండ్రులఁబూజించి,వారలుసంతోషపడునట్లు చేసి, రామునితోఁగూడనరణ్యంబునకువచ్చినాఁడు.అని,తాత్పర్యము.

అనుకూల్యేన ధర్మాత్మా త్యక్త్వా సుఖ మనుత్తమమ్. ౫౯
అనుగచ్ఛతి కాకుత్థ్సం భ్రాతరం పాలయ న్వనే

టీక॥ధర్మాత్మా=ధర్మమునందుబుద్ధిగలలక్ష్మణుండు;ఆనుకూల్యేన=అనుకూలతచేత; అనుత్తమం=తనకన్నశ్రేష్ఠములేని;సుఖం = సౌఖ్యమును; త్యక్త్వా=విడిచి;వనే=అడవియందు; భ్రాతరం=అన్నయయిన;కాకుత్థ్సం= రాముని;పాలయన్=పాలింపుచు; అనుగచ్ఛతి(భూతార్థమందులట్)= వెంబడించెను.

ఆలక్ష్మణుండు, ధర్మాత్ముండు గావున, అన్నయగు రామునందలిస్నేహముచేత,నడవియందు రామునిం బా

లింపుకొనుచు, వెంబడించివచ్చినాఁడు. అని, తాత్పర్యము.

సింహస్కంధో మహాబాహు ర్మనస్వీ ప్రియదర్శనః. ౬౦
పితృవ ద్వర్తతే రామే మాతృవ న్మాం సమాచరన్

టీ॥సః(అధ్యాహృతము)=ఆలక్ష్మణుఁడు; సింహస్కంధః=సింహముయొక్క మూఁపులవంటి మూఁపులుగలవాఁడు. మహాబాహుః= పెద్దచేతులుగలవాఁడు. మనస్వీ= మంచిమనస్సుగలవాఁడు. ప్రియదర్శనః = సంతోషముగల్గించునట్టి చూచుటగలవాఁడు. మాతృవత్=తల్లినివలె; మాం=నన్ను; సమాచరన్= సేవింపుచు; రామే = రామునియందు; పితృవత్=తండ్రియందువలె; వర్తతే=ఉండును.

మఱియు, నాలక్ష్మణుఁడు, సింహముమూఁపులవంటి మూఁపులుగలవాఁడు;మహాబాహుండు; మంచిమనస్సుగలవాఁడు; చూపరులకుఁ బ్రియంబుఁబుట్టించువాఁడు;నన్నుఁదల్లిఁట్లు చూచుకొనును;రామునందుఁ, బితృభావంబుంచియుండును. అని, తాత్పర్యము.

హ్రియమాణాం తదా వీరో నతు మాం వేద లక్ష్మణః. ౬౧

టీ॥వీరః= పరాక్రమశాలియగు;లక్ష్మణస్తు=లక్ష్మణుండును;తదా=అప్పుడు;హ్రియమాణాం=అపహరింపఁబడుచున్న;మాం=నన్ను;నవేద= ఎఱుంగఁడు,

అప్పుడునన్నురావణుఁ డపహరించుకొనిపోవుట,వీరుండగు లక్ష్మణునకును,దెలియదు; తెలిసినచో , నప్పుడే రావణునివధించి, నాకింతపాటుసంభవింపకుండునట్లుచేసియుండును.

అని, తాత్పర్యము.

వృద్ధోపసేవీ లక్ష్మీవాన్ శక్తో న బహుభాషితా
రాజపుత్రః ప్రియ శ్శ్రేష్ఠ స్సదృశ శ్శ్వశురస్య మే. ౬౨

టీ॥సః(అధ్యాహృతము) = ఆలక్ష్మణుఁడు; వృద్ధోపసేవీ= పెద్దలసేవించువాఁడు;లక్ష్మీవాన్= అధికమయినకాంతిగలవాఁడు.శక్తః= సమర్థుఁ

డు. బహుభాషితా=అధికముగా మాటలాడువాఁడు; న=కాఁడు. రాజపుత్రః=రాచకొమరుండు. ప్రియః= సంతోషముగలిగించువాఁడు. శ్రేష్ఠః= ఉత్తముండు; మే=నాయొక్క; శ్వశురస్య= మామయయినదశరథునకు; సదృశః= సమానుండు.

ఆలక్ష్మణుండు, ఎప్పుడును బెద్దలకు సేవ సేయుచుండును; అధికమయినకాంతిగలవాఁడు; సమర్థుఁడు; అధికముగా మాటలాడఁడు; రాచకొమరుండు; చూపరులకు సంతోషంబు గలిగించును; ఉత్తముండు; గుణంబులనామామయగు దశరథమహారాజునకు సరివచ్చువాఁడు. అని, తాత్పర్యము.

మమ ప్రియ తరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః

టీక॥ లక్ష్మణః=లక్ష్మణుఁడు; మమ=నాకు; నిత్యం=ఎల్లప్పుడును; ప్రియతరః=మిక్కిలియుసంతోషంబు సేయువాఁడు. రామస్య = రామునియొక్క; భ్రాతా=తమ్ముండు.

అతండు, రామునకుఁదమ్ముండు; నాకెప్పుడును సంతోషంబు సేయుచుండును. అని, తాత్పర్యము.

నియుక్తో ధురి యస్యాంతు తా ముద్వహతి వీర్యవాన్. ౮౩

టీక॥ వీర్యవాన్= అధికమయిన పరాక్రమముగలలక్ష్మణుండు; యస్యాం ఏ; ధురి=భారమునందు; నియుక్తః= నియోగింపఁబడునో; తాం = ఆభారమును; ఉద్వహతితు=అవశ్యముమోయును.

పరాక్రమవంతుండగు లక్ష్మణుండు, తన్ను రాముఁడేకార్యంబునం దాజ్ఞాపించునో, ఆకార్యమునుదప్పక నెఱవేఱుచును. అని, తాత్పర్యము.

యం దృష్ట్వా రాఘవో నైవ వృత్త మార్య మనుస్మరేత్
స మమార్థాయ కుశలం వక్తవ్యో వచనా న్మమ. ౮౪

టీక॥ రాఘవః=రాముఁడు; యం=ఎవ్వని; దృష్ట్వా=చూచి; వృత్తం=చని

పోయిన; ఆర్యాః = పూజ్యుండగు దశరథుని; నైవానుస్మరేత్ = తలంపఁడో; సః = అట్టిలక్ష్మణుండు; మమ = నాయొక్క; వచనాత్ = మాటవలన; మమ = నాయొక్క; అర్థాయ = ప్రయోజనముకొఱకు; కుశలం = క్షేమమును; వక్తవ్యః = చెప్పఁబడవలసినవాఁడు.

ఎవ్వండు, తనకుఁ దండ్రివలెఁ బోషణము సేయుచుండుటవలన, రాముండు, వనిపోయినతండ్రిని దశరథుం దలంపకుండునో, అట్టిలక్ష్మణుని, నాకై నీవు, నామాటవలన, క్షేమంబడుగుము.

అని, తాత్పర్యము.

మృదు ర్నిత్యం శుచి ర్దక్షః ప్రియో రామస్య లక్ష్మణః

టీక॥ లక్ష్మణః = లక్ష్మణుఁడు; నిత్యం = ఎల్లప్పుడును; మృదుః = మెత్తనివాఁడు. శుచిః = కపటములేనివాఁడు. దక్షః = సమర్థుఁడు; రామస్య = రామునకు; ప్రియః = ఇష్టుండు.

అతండు, ఎప్పుడును మృదుప్రకృతి గలిగియుండువాఁడు; కపటములేనివాఁడు; సమర్థుఁడు; రామునకుఁ బ్రియుండు. అని, తాత్పర్యము.

యథాహి వానరశ్రేష్ఠ దుఃఖక్షయకరో భవేత్. ౬౭
త్వ మస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ

టీక॥ హరిసత్తమ = వానరులలో శ్రేష్ఠుండవగు; వానరశ్రేష్ఠ = హనుమంతుఁడా! యథా = ఎట్లు; రామః (అధ్యాహృతము) = రాముఁడు; దుఃఖక్షయకరః = దుఃఖముయొక్క నాశమును జేయువాఁడు; భవేత్ (అధ్యాహృతము) = అగునో; తథా (అధ్యాహృతము) = అట్లు; అస్మిన్ = ఈ; కార్యనిర్యోగే = కార్యముయొక్క దూర్చుటయందు; త్వం = నీవు; ప్రమాణంహి = కర్తవుగదా!

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! రాముండు నాదుఃఖంబును బోఁగొట్టునట్లు, ఈకార్యమును నెఱవేర్చుటకు, నీవె కర్తవు.

అని, తాత్పర్యము.

రాఘవ స్త్వత్సమారంభా న్మయి యత్నపరో భవేత్. ౬౮

టీక॥ రాఘవః=రాముడు; త్వత్స మారంభాత్= నీయొక్క-ప్రయత్నము వలన; మయి=నాయందు ; యత్నప రః=యత్నమునందాసక్తిగలవాడు ; భవేత్=అగును.

నీప్రయత్నంబువలననె, రాముడు నన్నుదీసికొనిపోవుటయందుఁ బ్రయత్నపడును; కావున, నీవుచక్క-గాఁబ్రయత్నముసేయవలయును.

అని, తాత్పర్యము.

ఇదం బ్రూయాశ్చ మేనాథం శూరం రామం పునఃపునః

టీక॥ త్వం (అధ్యాహృతము) = నీవు; మే=నాయొక్క-; నాథం = పెని మిటియను; శూరం= యుద్ధమునందు భయములేనివాఁడునగు; రామం= రాముని గూర్చి; ఇదంచ=ఈమాటను;పునఃపునః=మాటిమాటికి ;బ్రూయాః= చెప్పుము.

నీవు,శూరుండగునాపెనిమిటిని రామునిఁజూచి,తప్పక, యీమాటనుమాత్రము, మాటిమాటికిఁజెప్పుము.

అని, తాత్పర్యము.

జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ. ౬౭

టీక॥ దశరథాత్మజ= దశరథునికుమారుండవైనరాముఁడా! అహం (అధ్యాహృతము)=నేను; మాసం= ఒక నెల ; జీవితం = ప్రాణమును; ధారయిష్యామి=ధరించియుండెదను.

దశరథ పుత్రుండవగు రాముఁడా ! నేనింక నొక్క-మాసము ప్రాణంబులు దాల్చియుండెదను. అని,తాత్పర్యము.

ఊర్ధ్వం మాసాన్న జీవేయం సత్యేనాహం బ్రవీమి తే

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను: మాసాత్=మాసముకన్న ; ఊర్ధ్వం=అవ్వల; నజీవేయం= బ్రతుకను. అహం=నేను; తే=నీకొఱకు;సత్యేన=సత్యముచేత; బ్రవీమి = చెప్పుచున్నాను.

నేను,ఒకనెలకుఁబిమ్మట నెంతమాత్రముజీవింపను; నీకునమ్మకము గలుగుటకై , సత్యముపై శపథముసేయుచున్నాను.అని, తాత్పర్యము.

రావణేనోపరుద్ధాం మాం నికృత్యా పాపకర్మణా. ౬౮
త్రాతు మర్హసి వీర త్వం పాతాళా దివ కౌశికీమ్

టీక॥ వీర=పరాక్రమశాలివగు రాముఁడా! త్వం=నీవు; పాపకర్మణా=పాపముఁగల్గించుకార్యంబులుగల; రావణేన=రావణునిచేత; నికృత్యా=అవమానముచేత; ఉపరుద్ధాం=నిరోధింపఁబడిన; మాం = నన్ను; పాతాళాత్=పాతాళలోకముననుండి; కౌశికీమివ=ఇంద్రసంబంధినియగు లక్ష్మింబోలె; త్రాతుం=రక్షించుటకు ; అర్హసి=తగుదువు.

వీరుండవగు రాముఁడా! పూర్వము దేవేంద్రుని లక్ష్మి పాతాళంబుఁ బ్రవేశింపఁగా, దేవతలచేఁ బ్రార్థితుండై, విష్ణుదేవుండు, దానిం దీసికొని వచ్చిన ట్లునీవు, పాపాత్ముండగు రావణునిచే నిరోధింపఁ బడి యవమానంబు నొందుచున్న నన్ను, రక్షింపవలయును; అని నేనుచెప్పినట్లు రామునకుం జెప్పుము. అనిసీతాదేవి, హనుమంతునితో జెప్పెను.

అని, తాత్పర్యము.

తతో వస్త్రగతం ముక్త్వా దివ్యం చూడామణిం శుభమ్. ౬౯
ప్రదేయో రాఘవాయేతి సీతా హనుమతే దదౌ

టీక॥ తతః=అటుపిమ్మట; సీతా=సీతాదేవి; వస్త్రగతం = వస్త్రమును బొందియున్న ; దివ్యం= శ్రేష్ఠమయిన; శుభం=మంగళకరమయిన; చూడామణిం= తలయందుంచుకొనెడు రత్నమును; ముక్త్వా=విప్పి; "అయం (అధ్యాహృతము)=ఇది; రాఘవాయ = రామునికొఱకు; ప్రదేయః = ఇవ్వఁదగినది" ఇతి=అని; ఉక్త్వా (అధ్యాహృతము)=చెప్పి; హనుమతే=హనుమంతునికొఱకు; దదౌ=ఇచ్చెను.

అంత, సీతాదేవి, కొంగునంగట్టుకొనియున్నదివ్యమును సుందరమునగు చూడామణిందీసి, "దీని రామునికిమ్ము" అని, చెప్పి, హనుమంతునిచేతికిచ్చెను.

అని, తాత్పర్యము.

ప్రతిగృహ్య తతో వీరో మణిరత్న మనుత్తమమ్. ౭౦
అంగుళ్యా యోజయామాస నహ్యస్య ప్రాభవ ద్భుజః




టీక॥తతః=అటుపిమ్మట;వీరః= పరాక్రమ శాలియగు హనుమంతుండు; అనుత్తమం=తనకన్న శ్రేష్ఠములేని; మణిరత్నం= మణిశ్రేష్ఠమును ; ప్రతిగృహ్యా=తీసికొని; అంగుళ్యా=వ్రేలితో; యోజయామాస=కూర్చెను. భుజః= చేయి;అస్య=దీనికి;నప్రాభవద్ధి= చాలదయ్యెఁగదా!

అంతఁ,బరాక్రమశాలియగు హనుమంతుండు, ఉత్తమమయినయాచూడామణిందీసికొని, తనవ్రేలికిందొడుగుకొనెను;ఏలయనఁగా,నతండు, మున్నుసీతాదేవికిఁజూపినభయంకర రూపంబు విడిచిసూక్ష్మరూపంబు దాల్చినవాఁడయ్యెను,ఆచూడామణి, వెండ్రుకలతోఁ దూర్చఁగొనుటకై చేయఁబడినమిక్కిలియుసూక్ష్మమయినరంధ్రముగలది,కావునఁ,జేతిలోఁదొడుగుకొనుటకు, వీలు కాదయ్యె. అని,తాత్పర్యము.

మణిరత్నం కపివరః ప్రతిగృహ్యాభివాద్యచ. ౭౦
సీతాం ప్రదక్షిణం కృత్వా ప్రణతః పార్శ్వతస్స్థితః

టీక॥కపివరః = వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు,మణిరత్నం= మణిశ్రేష్ఠమును; ప్రతిగృహ్యా= పుచ్చుకొని; సీతాం=సీతాదేవిని; అభివాద్యచ=నమస్కరించియు; ప్రదక్షిణం= ప్రదక్షిణమును;కృత్వా=చేసి; ప్రణతః=వంగినవాఁడై; పార్శ్వతః=ప్రక్కను;స్థితః= ఉండెను.

వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు, మణులలో శ్రేష్ఠంబయినయాచూడామణిందీసికొని , సీతాదేవికి,ప్రదక్షిణనమస్కారంబులుచేసి,వినయంబునఁ, పార్శ్వంబునందునిలుచుండెను.
అని,తాత్పర్యము.

హర్షేణ మహతా యుక్తస్సీతాదర్శనజేన సః, ౭౧
హృదయేన గతో రామం శరీరేణతు విష్ఠితః

టీక॥సః=ఆహనుమంతుండు;సీతాదర్శనజేన=సీతయొక్క చూచుటవలనఁగలిగిన; మహతా= అధికమైన;హర్షేణ= సంతోషముతో; యుక్తః= కూడినవాఁడై;హృదయేన=మనస్సుచేత;రామం=రాముని;గతః=పొందినాఁ

దు; శరీరేణతు = దేహముచేతమాత్రము; విష్ఠితః=నిలిచియుండెను.

ఆహనుమంతుండుసీతం జూచుటవలన, మహాసంతోషమునొంది, దేహముచేమాత్రమిచ్చట నిలిచియుండినట్లుండెనుగాని, మనంబునరామునొద్దకుఁ బోయియుండెను. అని, తాత్పర్యము.

మణివర ముపగృహ్య తం మహార్హం
జనకనృపాత్మజయా ధృతం ప్రభావాత్. ౭౩
గిరివరపవనావధూతముక్త
స్సుఖితమనాః ప్రతిసంక్రమం ప్రపేదే

టీక॥ సః(అధ్యాహృతము)= ఆహనుమంతుండు; ప్రభావాత్=శక్తివలన; జనకనృపాత్మజయా=జనకమహారాజుకూఁతురయినసీతాదేవిచేత; ధృతం=ధరింపఁబడినదియును; మహార్హం=శ్రేష్ఠమునగు; తం=ఆ; మణివరం= మణిశ్రేష్ఠమును; ఉపగృహ్య= పుచ్చుకొని; పవనావధూతముక్తః=గాలిచేఁగదలుటచేవిడువఁబడిన; గిరివర=పర్వతమువలె; సుఖితమనాః= సుఖమునొందినమనసుగలవాఁడై; ప్రతిసంక్రమం=మరలఁబోవుటను; ప్రపేదే= పొందెను, పొందఁగోరెననుట.

ఆహనుమంతుండట్లు, తనసామర్థ్యంబున, సీతంజూచి, సీతాదేవిధరించినట్టి శ్రేష్ఠమయినమాణిక్యంబును, పెనుగాలికిఁగదలుచుండి దానిచేవిడువఁబడి సుఖంబుగానుండు పర్వతంబువలె మనంబున సుఖంబునొంది, మరల, రామునొద్దకుఁబోఁగోరెను. అని తాత్పర్యము-

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, అష్టత్రింశస్సర్గః.
ఇవి, సప్తాశీతిము
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండాష్టత్రింశసర్గటీక
ముగిసినది.

౩౯

ఏకోనచత్వారింశసర్గప్రారంభః.

మణిం దత్వా తత స్సీతా హనుమంత మథాబ్రవీత్

టీక॥సీతా=సీతాదేవి;మణిం=చూడామణిని;దత్వా=ఇచ్చి;తతః=అంత;అథ=అటుపిమ్మట ; హనుమంతం=హనుమంతుని గూర్చి ; అబ్రవీత్=పలికెను.

సీతాదేవియట్లు చూడామణిని హనుమంతునకొసంగి, యంత, హనుమంతుంజూచియిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అభిజ్ఞాన మభిజ్ఞాత మేత ద్రామస్య తత్త్వతః. ౧

టీక॥ఏతత్=ఈ;అభిజ్ఞానం=గురుతు; రామస్య=రామునకు; తత్త్వతః=యాథార్థ్యముచేత;అభిజ్ఞాతం= చక్కంగాం దెలిసినది.

ఈగురుతు రామునకు, యథార్థముగాం,జక్కంగాం దెలియును,

అని, తాత్పర్యము.

మణింతు దృష్ట్వా రామోవై త్రయాణాం సంస్మరిష్యతి
వీరో జనన్యా మమచ రాజ్ఞో దశరథస్యచ. ౨

టీక॥వీరః=పరాక్రమ శాలియగు; రామః=రాముఁడు ; మణిం=చూడామణిని; దృష్ట్వాతు=చూచినంతనే;జనన్యాః=(ద్వితీయార్థమందుషష్ఠి, ఇట్లు ముందునుం దెలిసికొనునది. ) నాతల్లిని,మమచ=నన్నును; రాజ్ఞః= రాజయిన;దశరథస్యచ=దశరథుని; త్రయాణాం=ముగ్గురిని;సంస్మరిష్యతి= తలంపఁగలఁడు.

పరాక్రమవంతుండగు, రాముండు, ఈచూడామణిం జూడఁగానే, ఈచూడామణిని వివాహకాలంబున, నాకునాతల్లి యిచ్చినదికావున, నాతల్లిని, అప్పుడు దశరథమహారాజునుండినందున దశరథ

మహారాజును, నన్నును, మాముగ్గురిఁ బలంచుకొనును. అని, తాత్పర్యము.

స భూయస్త్వం సముత్సాహే చోదితో హరిసత్తమ

టీక॥ హరిసత్తమ=వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! సః = అట్టి; త్వం=నీవు; సముత్సాహే=పురికొల్పుటయందు; భూయః=మఱలను; చోదితః=ప్రేరింపఁబడినావు.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవెట్లయిన రామునకుఁ బ్రోత్సాహంబు సేయవలయునని, మఱలఁ జెప్పుచున్నాను.

అని, తాత్పర్యము.

అస్మిన్ కార్యసమారంభే ప్రచింతయ యదుత్తరమ్. ౩

టీక॥ అస్మిన్=ఈ; కార్యసమారంభే = పనియొక్కయారంభించుటయందు; యత్=ఏది; ఉత్తరం= పైకార్యమో; తత్ (అధ్యాహృతము)=దానిని; ప్రచింతయ= చక్కఁగానాలోచింపుము.

ఈకార్యమునందుఁ బ్రయత్నించుటకిప్పుడేమిసేయవలయునో దాని నాలోచింపుము.

అని, తాత్పర్యము.

త్వమస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ

టీక॥ హరిసత్తమ=వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! త్వం=నీవు; అస్మిన్=ఈ; కార్యనిర్యోగే= పనియొక్కసంఘటనము సేయుటయందు; ప్రమాణం=కర్తవు.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! ఈకార్యము సంఘటించుటయందునీవే, కర్తవు. అని, తాత్పర్యము.

హనుమన్ యత్నమాస్థాయ దుఃఖక్షయకరో భవ. ౪

టీక॥ హనుమన్ = హనుమంతుఁడా! త్వం (అధ్యాహృతము)= నీవు; యత్నం=ప్రయత్నమును; ఆస్థాయ=అవలంబించి; దుఃఖక్షయకరః = దుఃఖముయొక్క నాశమును జేయువాఁడవు; భవ=అగుము.

హనుమంతుఁడా! నీవెట్లయినఁ బ్రయత్నంబుచేసి, నాదుఃఖంబునశించున ట్లుసేయుము-

అని, తాత్పర్యము.

తస్య చింతయతో యత్నో దుఃఖక్షయ కరో భవేత్

టీక॥ చింతయతః= ఆలోచించుచున్న; తస్య=అట్టి; తవ (అధ్యాహృతము)=నీయొక్క; యత్నః= ప్రయత్నము; దుఃఖక్షయకరః = దుఃఖముయొక్క-నాశముసేయునది; భవేత్ = అగును-

అట్టి మహాబుద్ధిశాలివైన నీవాలోచించిప్రయత్నంబుచేసితివేని, తప్పక, నాదుఃఖంబు నశింపంగలదు. అనిసీతాదేవి, హనుమంతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

స తథేతి ప్రతిజ్ఞాయ మారుతి ర్భీమవిక్రమః.
శిరసా వంద్య వైదేహీం గమనా యోపచక్రమే

టీక॥భీమవిక్రమః= భయంకరమయినపరాక్రమంబుగల; సః=ఆ ; మారుతః= వాయుదేవునికుమారుండైన హనుమంతుండు; "తథా=అట్లే" ఇతి = అని; ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞచేసి; శిరసా=తలచేత; వైదేహీం= సీతాదేవిని; ఆవంద్య=నమస్కరించి ; గమనాయ=పోవుటకొఱకు ; ఉపచక్రమే = ప్రారంభించెను-

భయంకరంబగు పరాక్రమంబుగలవాఁడును వాయుదేవుని కుమారుండు నగు హనుమంతుండు, సీతాదేవిచెప్పినందుకు "అలాగే" యనిప్రతిజ్ఞచేసి, సీతాదేవికి సాష్టాంగ నమస్కారంబు గావించి, పయనంబుకాఁగోరెను.

అని, తాత్పర్యము.

జ్ఞాత్వా సంప్రస్థితం దేవీ వానరం మారుతాత్మజమ్. ౬
బాష్పగద్గదయా వాచా మైథిలీ వాక్య మబ్రవీత్

టీక॥ దేవీ = రాణియయిన; మైథిలీ=సీతాదేవి; మారుతాత్మజం= వాయుదేవునికుమారుండగు; వానరం = హనుమంతుని; సంప్రస్థితం = బయలు

దేఱినవానిఁగా; జ్ఞాత్వా=ఎఱింగి; బాష్పగద్గదయా = కన్నీటిచేతడగ్గుత్తికగల; వాచా= మాటచేత ; వాక్యం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

సీతాదేవి, వాయుదేవుని కుమారుండైనహనుమంతుండు పయనంబగుటంజూచి, డగ్గుత్తికగమర, నిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

కుశలం హనుమన్ బ్రూయాస్సహితౌ రామలక్ష్మణౌ. ౭

హనుమన్= హనుమంతుఁడా! సహితౌ=చేరియున్న; రామలక్ష్మణౌ= రామలక్ష్మణులను; కుశలం= క్షేమమును; బ్రూయాః= చెప్పుము, అడుగుమనుట.

హనుమంతుఁడా! రామలక్ష్మణుల నిద్దఱను, క్షేమంబడుగుము.
అని, తాత్పర్యము.

సుగ్రీవంచ సహామాత్యం వృద్ధాన్ సర్వాంశ్చ వానరాన్
బ్రూయాస్త్వం వానరశ్రేష్ఠ కుశలం ధర్మసంహితమ్. ౮

టీక॥వానరశ్రేష్ఠ=వానరులలోనుత్తముండవగుహనుమంతుఁడా; సహామాత్యం=మంత్రులతోఁగూడిన ; సుగ్రీవంచ=సుగ్రీవునిని; వృద్ధాన్= ముసలివారలను; వానరాన్= వానరులను; సర్వాంశ్చ=అందఱను; ధర్మసహితం=ధర్మముతోఁగూడునట్లుగా; కుశలం= క్షేమమును; బ్రూయాః=చెప్పుము, అడుగుమనుట.

వానరోత్తముండవగుహనుమంతుఁడా! నీవు, సుగ్రీవుని, అతనిమంత్రులను, వృద్ధులగువానరులను, ఇంక నితరులయిన వానరులను, ధర్మయుక్తముగ, క్రమంబుగా, క్షేమంబడుగుము.
అని, తాత్పర్యము.

యథా సచ మహాబాహు ర్మాం తారయతి రాఘవః
అస్మాద్దుఃఖాంబుసంరోధా త్త్వం సమాధాతు మర్హసి. ౯

టీక॥యథా= ఎట్లు ; మహాబాహుః= పెద్దచేతులుగల; సః=ఆ; రాఘ

వశ్య=రాముండును ; అస్మాత్=ఈ; దుఃఖాంబుసంరోధాత్=దుఃఖసముద్రమునసుండి; మాం=నన్ను; తారయతి=కడతేర్చునో; తథా (అధ్యాహృతము)=అట్లు; త్వం=నీవు ; సమాధాతుం=సమాధానపఱచుటకు; అహా

సీతగుదువు.

మహాబాహుండగునారాముండు, నాదుఃఖంబుఁబోఁగొట్టునట్లు, నీవతనిసమాధానపఱుపవలసినది.

అని, తాత్పర్యము.

జీవంతీం మాం యథా రామ స్సంభావయతి కీర్తిమాన్
తత్తథా హనుమ న్వాచ్యం వాచా ధర్మ మవాప్నుహి. ౧౦

టీక॥హనుమన్=హనుమంతుఁడా! యథా=ఎట్లు; కీర్తిమాన్ = అధికమయినకీర్తిగల; రామః= రాముఁడు; సంభావయతి= ఊఱడించునో ; తత్తథా=అట్లు; వాచ్యం=చెప్పఁదగినది. వాచా నోటి=మాటచేత; ధర్మం= ధర్మమును; అవాప్నుహి=పొందుము.

హనుమంతుఁడా! నేనుబ్రతికియుండఁగానే, రాముండునన్నుఁ దీసికొనిపోయికీర్తినొందునట్లు, నీవు రామునికిఁ జెప్పవలయును ; నీవిట్లుమాటచెప్పుటమాత్రముననే , నీకుధర్మంబుగలుగును.

అని, తాత్పర్యము.

నిత్య ముత్సాహయుక్తాశ్చ వాచ శ్శ్రుత్వా త్వయేరితాః
వర్ధిష్యతే దాశరథేః పౌరుషం మదవాప్తయే. ౧౧

టీక॥నిత్యంచ=ఎల్లప్పుడును ; త్వయా= నీచేత; ఈరితాః= చెప్పఁబడిన; ఉత్సాహయుక్తాః = ఉత్సాహముతోఁగూడిన; వాచః= మాటలను; శ్రుత్వా=విని; మదవాప్తయే=నాయొక్క-పొందుటకొఱకు; దాశరథేః=దశరథునికొడుకైనరామునియొక్క-; పౌరుషం=పౌరుషము; వర్ధిష్యతే=వృద్ధిఁబొందఁగలదు.

ఎల్లప్పుడును, నీవుప్రోత్సాహంబుఁబుట్టించుమాటలంజెప్పఁగా, వానివినుటచే, రామునకుఁబౌరుషంబుపెరిఁగి , నన్నుఁబొందయత్నించును.

అని, తాత్పర్యము.

మత్సంకేశయుతా వాచ స్త్వత్తశ్శ్రుత్వాచ రాఘవః
పరాక్రమవిధిం వీరో విధివత్సంవిధాస్యతి. ౧౨

టీక॥వీరః= పరాక్రమశాలియగు; రాఘవః = రాముఁడు; త్వత్తః=నీవలన; మత్సంకేశయుతాః =నాయొక్క చెప్పి పంపినమాటలతో గూడిన ; వాచః= మాటలను; శ్రుత్వాచ=విని మె; విధివత్= యథాశాస్త్రముగా; పరాక్రమవిధిం=పరాక్రమకార్యమును; సంవిధాస్యతి=చేయఁగలఁడు.

పరాక్రమశాలియగు రాముండు, నీవు, నేనుజెప్పిపంపిన మాటలం బలుమాఱు చెప్పుచుండఁగా, విని,నన్నుఁబొందుటకై, పరాక్రమం బవలంబించి, చక్కఁగాఁ బ్రయత్నము సేయును.అనిసీతాదేవి,హనుమంతునితోఁ జెప్పెను.
అని, తాత్పర్యము.

సీతాయా వచనం శ్రుత్వా హనుమా న్మారుతాత్మజః
శిర స్యంజలి మాధాయ వాక్య ముత్తర మబ్రవీత్.

టీక॥మారుతాత్మజః=వాయుదేవుని కుమారుఁడయిన;హనుమాన్=హనుమంతుఁడు; సీతాయాః=సీతయొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; శిరసి=తలయందు;అంజలిం= చేమోడ్పును;ఆధాయ=ఉంచి;ఉత్తరం= బదులయిన;వాక్యం=మాటను;అబ్రవీత్ = చెప్పెను.

వాయుదేవునికుమారుండయిన హనుమంతుండు,సీతాదేవి చెప్పిన మాటను విని, శిరంబునఁజేమోడ్పుంగీలించి,యిట్లని,బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

క్షిప్ర మేష్యతి కాకుత్స్థో హర్యృక్షప్రవరై ర్వృతః
య స్తే యుధి విజిత్యారీన్ శోకం వ్యపనయిష్యతి. ౧౪

టీక॥యః=ఎవ్వఁడు; యుధి=యుద్ధమునందు;అరీన్=శత్రువులను; విజిత్య=జయించి; తే=నీయొక్క; శోకం= దుఃఖమును; వ్యపనయిష్యతి(వ్యపనేష్యతి) = పోఁగొట్టంగలఁడో;సః(అధ్యాహృతము)=అట్టి; కాకుత్స్థః=రాముండు;హర్యృక్షప్రవరైః=వానరశ్రేష్ఠులతోనుభల్లూకశ్రేష్ఠంబులతోను;వృతః= చుట్టఁబడినవాఁడై;క్షిప్రం= శీఘ్రముగా; ఏష్యతి=రాఁగలఁడు.

రాముండు, వానరులను భల్లూకంబులనుంబిలుచుకొని, శీఘ్రంబుగా నిచ్చటికివచ్చి, యుద్ధంబున శత్రువులంజంపి, నీ మఃఖంబుంబోంగొట్టంగలఁడు.

అని, తాత్పర్యము.

నహి పశ్యామి మర్త్యేషు నాసురేషు సురేషువా
యస్తస్య క్షిపతో బాణాన్ స్థాతు ముత్సహతేఽగ్రతః. ౧౫

టీక॥ యః=ఎవ్వఁడు; బాణాన్=బాణములను; క్షిపతః=ప్రయోగించుచున్న; తస్య=ఆ రాముని యొక్క-; అగ్రతః=ముందట; స్థాతుం=నిలుచుటకు; ఉత్సహతే=ప్రయత్నించునో; తం (అధ్యాహృతము)=అతని; మర్త్యేషు=మనుష్యులయందు; నపశ్యామిహి=చూడనుగదా! అసురేషు=రాక్షసులయందుఁగాని; సురేషువా=దేవతలయందుఁగాని; న (పశ్యామిహి)=చూడనుగదా!

మనుష్యులయందుఁగాని యసురులయందుఁగాని దేవతలయందుఁగాని, యుద్ధంబున రాముండు బాణంబులు ప్రయోగించుచుండఁగా, నతని యెదుట నిలువంగలవాఁడు, ఎవ్వఁడును నాకగపడఁడు.

అని, తాత్పర్యము.

అప్యర్క మపిపర్జన్య మపి వైవస్వతం యమమ్
స హి సోఢుం రణే శక్త స్తవ హేతో ర్విశేషతః. ౧౬

టీక॥ సః=ఆ రాముఁడు; అర్కమపి=సూర్యునైనను; పర్జన్యమపి=ఇంద్రునైనను; వైవస్వతం=సూర్యునికొడుకైన; యమమపి=యమునైనను; రణే=యుద్ధమునందు; సోఢుం=ఓర్చుటకు; తవ=నీవనెడు; హేతోః=(పంచమ్యర్థమందుషష్ఠి) కారణమువలన; విశేషతః=అధికముగా; శక్తోహి=సమర్థుఁడుగదా!

ఆ రాముండు యుద్ధంబున సూర్యునైనను దేవేంద్రునైనను యమునైనను సాధారణముగానే జయింపంగలండు; ఇంకనీకొఱకై జయించునని చెప్పనేల?

అని, తాత్పర్యము.

స హి సాగరపర్యంతాం మహీం శాసితు మీహతే

టీక॥సః=ఆరాముఁడు ; సాగరపర్యంతాం = సముద్రములె మెల్లగాఁగల;మహీం=భూమిని;శాసితుం=పాలించుటకు;ఈహతేహి=కోరుచున్నాఁడుగదా!

రాముండు,నాలుగుసముద్రంబులనడుమనున్న సమస్త భూమండలంబునుం బాలింప నుత్సాహంబుగల్గి యున్నాఁడు. అని, తాత్పర్యము.

త్వన్నిమిత్తో హి రామస్య జయో జనకనందిని. ౧౭

టీక॥జనకనందిని=జనకమహారాజు కూఁతురవయినసీతాదేవీ! రామస్య=రామునకు;త్వన్నిమిత్తః = నీవుకారణముగాఁగల,జయః= గెల్పు;భవిష్యతి=(అధ్యాహృతము)హి = కాఁగలదుగదా!

జనకమహారాజుకూఁతురవయిన సీతాదేవీ! రాముండుయుద్ధంబునందప్పక జయంబునొంది,నిన్నుఁబొందఁగలఁడు. అని,హనుమంతుండుసీతాదేవితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా సమ్యక్సత్యం సుభాషితమ్
జానకీ బహుమేనేథ వచనంచేద మబ్రవీత్. ౧౮

టీక॥జానకీ=సీతాదేవి; సమ్యక్=చక్కనిదియును;సత్యం= అబద్ధముకానిదియును;సుభాషితం=చక్కఁగాఁ జెప్పఁబడినదియునగు;తస్య=ఆహనుమంతునియొక్క;తత్=ఆ;వచనం= మాటను;శ్రుత్వా=విని;అథ= అటుపిమ్మట; బహుమేనే=గౌరవించెను. ఇదం=ఈ; వచనంచ=మాటను; అబ్రవీత్ = చెప్పెను.

సీతాదేవి, యిట్లుహనుమంతుండు చెప్పిన,యుపపన్నంబునుసత్యంబును జెవులకింపైనదియునగుమాటనువిని,యంత,హనుమంతునియెడ గౌరవబుద్ధి గలదై,యతనింజూచి,యిట్లని , చెప్పెను. అని, తాత్పర్యము.

తత స్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునఃపునః
భర్తృస్నేహాన్వితం వాక్యం సౌహార్దా దనుమానయత్. ౧౯

టీక॥ తతః = అటుపిమ్మట; సీతా = సీతాదేవి; ప్రస్థితం = పయనమయిన; తం = ఆహనుమంతుని; పునః పునః = మాటిమాటికి; వీక్షమాణా = చూచుచు; సౌహార్దాత్ = స్నేహమువలన; భర్తృస్నేహాన్వితం = పెనిమిటియొక్క స్నేహముతోఁగూడిన; వాక్యం = మాటను; అనుమానయత్ (అన్వమానయత్) = గౌరవించెను.

అంత, సీతాదేవి, పయనంబయిన హనుమంతునిమాటిమాటికింజూచుచు, నతండుచెప్పినమాటవలనఁ, బెనిమిటికిఁ దనయందుంగల స్నేహాతిశయముచక్కఁగాఁదెలియవచ్చుటం జేసి, మిక్కిలియు సంతోషించి, బహుమానించెను.

అని, తాత్పర్యము.

యదివా మన్యసే వీర వసైకాహ మరిందమ
కస్మింశ్చి త్సంవృతే దేశే విశ్రాంత శ్శ్వో గమిష్యసి. ౨౦

టీక॥ అరిందమ = శత్రువులనడఁగఁద్రొక్కునట్టి; వీర = పరాక్రమశాలివగు హనుమంతుఁడా! మన్యసే యదివా = తలంతువేని; కస్మింశ్చిత్ = ఒకానొక; సంవృతే = రహస్యమయిన; దేశే = ప్రదేశమునందు; ఏకాహం = ఒక్కదినము; వస = ఉండుము. విశ్రాంతః = అలసటదీర్చుకొన్నవాఁడవై; శ్వః = రేపు; గమిష్యసి = పోఁగలవు.

శత్రువులనడఁగఁద్రొక్కుంజాలిన పరాక్రమశాలివగు హనుమంతుఁడా! నీకిచ్చయుండునేని, యిచ్చటనొకరహస్యప్రదేశమునందునొక్కదినముండి, యలసటదీర్చుకొని రేపుపొమ్ము.

అని, తాత్పర్యము.

మమ చే దల్పభాగ్యాయాః సాన్నిధ్యా త్తవ వానర
అస్య శోకస్య మహతో ముహూర్తం మోక్షణం భవేత్. ౨౧

టీక॥ వానర = హనుమంతుఁడా! చేత్ = అట్లగునేని; తవ = నీయొక్క; సాన్నిధ్యాత్ = సన్నిధివలన; అల్పభాగ్యాయాః = కొంచెమయిన భాగ్యముగల; మమ = నాయొక్క; మహతః = పెద్దదైన; అస్య = ఈ; శోకస్య = దుఃఖమునకు; ముహూర్తం = స్వల్పకాలము; మోక్షణం = విడుచుట; భవేత్ = కలుగును.

హనుమంతుఁడా! అట్లునీవువిశ్రమార్థమయియుచ్చటఁగొంచెము సేపుండువేని, నాకిప్పుడుగల్గియుండుమహాదుఃఖమునకుఁగొంచెముపశాంతిగల్గును.

అని, తాత్పర్యము.

గతేహి హరిశార్దూల పునరాగమనాయ తు
ప్రాణానామపి సందేహో మమ స్యాన్నాత్ర సంశయః ౨౨

టీక॥ హరిశార్దూల = వానరశ్రేష్ఠుఁడవైనహనుమంతుఁడా! త్వయి (అధ్యాహృతము) = నీవు; పునరాగమనాయ = మఱలవచ్చుటకొఱకు; గతేతు = పోయినవాఁడవు కాఁగానే; మమ = నాయొక్క; ప్రాణానామపి = ప్రాణములకును; సందేహః = సందియము; స్యాత్ = కలుగును. అత్ర = ఈవిషయమునందు; సంశయః = సందేహము; న = లేదు.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవుమఱలవచ్చుటకై యిప్పుడుపోఁగానే, నాప్రాణంబులకును సందేహము గలుగును; ఇందుసంశయము లేదు.

అని, తాత్పర్యము.

తవా దర్శనజ శ్శోకో భూయో మాం పరితాపయేత్
దుఃఖా ద్దుఃఖపరామృష్టాం దీపయన్నివ వానర. ౨౩

టీక॥ వానర = హనుమంతుఁడా! తవ = నీయొక్క; అదర్శనజః = చూడకుండుటవలనఁగల్గిన; శోకః = దుఃఖము; దుఃఖాత్ = మునుపటిదుఃఖముకన్నను; దుఃఖపరామృష్టాం = దుఃఖముచేతవ్యాపింపఁబడిన; మాం = నన్ను; దీపయన్నివ = జ్వలింపఁజేయుచుండునో యనునట్లు; భూయః = అధికముగా; పరితాపయేత్ = తపింపఁజేయును.

హనుమంతుఁడా! నీవుపోయినపిమ్మట, నిన్నుఁజూడకుండుటవలన, నాకిప్పుడుగల్గియున్నదుఃఖము మఱియునతిశయించి, నాకింకనధికముగాఁ బరితాపముగల్గించును.

అని, తాత్పర్యము.

అయంచ వీర సందేహ స్తిష్ఠతీవ మమాగ్రతః

సుమహాం స్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర. ౨౪

టీక॥వీర= పరాక్రమశాలివగు;హరీశ్వర = వానరశ్రేష్ఠుండవయినహనుమంతుఁడా ! త్వత్సహాయేషు—నీసహాయులయిన; హర్యృక్షేషు=వానరులయెలుఁగు గొడ్డులవిషయమయి ; అయం=ఈ; సుమహాన్=మిక్కిలియునధికమయిన; సందేహః=సందియము ; మమ=నాయొక్క; అగ్రతః = ముందట; తిష్ఠతిస—నిలుచున్నట్లున్నది.

పరాక్రమ శాలివి వానరశ్రేష్ఠుండవునగుహనుమంతుఁడా! నీకుసహాయులయిన వానర భల్లూకముల విషయమయి,నాకొకగొప్పసంశయంబున్నది.

అని, తాత్పర్యము.

కథన్ను ఖలు దుష్పారం తరిష్యంతి మహోదధిమ్
తాని హర్యృక్షసైన్యాని తౌ వా నరవరాత్మజౌ. ౨౫

టీక॥తాని=ఆ ; హర్యృక్షసైన్యాని=వానరులయొక్కయు భల్లూకంబులయొక్కయుసైన్యంబులుగాని;తౌ=ఆ; నరవరాత్మజౌవా= రాజపుత్రులయినరామలక్ష్మణులుగాని;దుష్పారం= తరింపఁగూడని;మహోదధిం= గొప్పసముద్రమును;కథన్నుఖలు = ఎట్లు;తరిష్యంతి—దాటఁగలరు.

ఆభల్లూకంబులు గాని వానరులుగాని, రాజపుత్రులయినయారామలక్ష్మణులుగాని, యపారమయిన యీసముద్రమునెట్లుదాటఁగలరు?

అని, తాత్పర్యము.

త్రయాణామేవ భూతానాం సాగరస్యాస్య లంఘనే
శక్తిస్స్యాద్వైనతేయస్య తవ వా మారుతస్యవా. ౨౬

టీక॥అస్య=ఈ; సాగరస్య=సముద్రముయొక్క;లంఘనే = దాటుటయందు;వైనతేయస్య= గరుత్మంతునకుఁగాని;తవవా=నీకుఁగాని; మారుతస్యవా=వాయుదేవునకుఁగాని;త్రయాణాం=ముగ్గురయిన;భూతానామేవ= ప్రాణులకే;శక్తిః = సామర్థ్యము; స్యాత్=కలుగును.

ఈసముద్రంబు దాటుటకు, గరుత్మంతునకును వాయుదేవునకును నీకును మీముగ్గురికే శక్తిగలదు, కాని, మతియెవ్వరికిని లేదు. అని, తాత్పర్యము.

తదస్మిన్ కార్యనిర్యోగే వీరైవం దురతిక్రమే
కిం పశ్యసి సమాధానం త్వంహి కార్యవిదాం వరః. ౨౭

టీక॥ వీర=పరాక్రమశాలివగు హనుమంతుఁడా! తత్=అందువలన; దురతిక్రమే=అతిక్రమింపనలవిగాని; అస్మిన్=ఈ; కార్యనిర్యోగే=పనియొక్క నెఱవేర్చుటయందు; కిం=ఏమి; సమాధానం=ఉపాయమును; పశ్యసి=చూచుచున్నావు? త్వం=నీవు; కార్యవిదాం=పనులనెఱిఁగినవారలలోపల; వరో హి=శ్రేష్ఠుండవుగదా!

పరాక్రమశాలివగు రామఁడా! అట్లుండుటవలన నతికష్టంబగునీపనిని నెఱవేర్పనేమియుపాయంబున్నది? నీవు కార్యంబులనెఱవేర్పంగలవారలలో నుత్తముండవు గావున, నాకాయుపాయంబుఁజెప్పుము. అని, తాత్పర్యము.

కామ మస్య త్వ మేవైకః కార్యస్య పరిసాధనే
పర్యాప్తః పరవీరఘ్న యశస్యస్తే ఫలోదయః. ౨౮

టీక॥ పరవీరఘ్న=శత్రువులయిన వీరులం జంపునట్టి హనుమంతుఁడా! త్వం=నీవు; ఏక ఏవ=ఒకఁడవె; అస్య=ఈ; కార్యస్య=పనియొక్క; పరిసాధనే=సాధించుటయందు; పర్యాప్తః కామం=చాలినవాఁడవే. ఫలోదయః=శక్తిసమృద్ధి; తే=నీకు; యశస్యః=కీర్తి కల్గించునది.

శత్రువీరులంజంపునట్టిహనుమంతుఁడా! నీవొక్కఁడవె, రావణుంజంపి, నన్నురామునకొసంగియీకార్యమునంతయుసాధింపంజాలినవాఁడవేయయినను, అట్లుసేయుదువేని, యదినీకేకీర్తికరముగాని, నాకుఁగాదు. అని, తాత్పర్యము.

బలై స్సమగ్రై ర్యదిమాం రావణం జిత్య సంయుగే
విజయీ స్వపురం యాయా త్తత్తు మే స్యా ద్యశస్కరమ్. ౨౯

టీక॥ రామః(అధ్యాహృతము)=రాముఁడు; సమగ్రైః=సంపూర్ణములగు

యిన; బలైః=బలములచేత ; సంయుగే=యుద్ధమునందు; రావణం= రావణుని; జిత్య(జిత్వా)=జయించి; మాం=నన్ను; గృహీత్వా(అధ్యాహృతము)=తీసికొని; విజయీ=జయముగలవాఁడై; స్వపురం=తనపట్టణమును; యాయాద్యది=పొందునేని; తత్తు=అదియే; మే=నాకు; యశస్కరం= కీర్తిఁ జేయునది; స్యాత్=అగును.

రాముండు, బలంబున, యుద్ధమునందు రావణునింజంపినన్నుఁదీసికొని, జయశాలియయి, యయోధ్యకుం బోవునేని, యదియె నాకుఁగీర్తికరముగా నుండును. అని, తాత్పర్యము.

శరైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః
మాం నయేద్యది కాకుత్స్థ స్తత్తస్య సదృశం భవేత్. ౩౦

టీక॥ పరబలార్దనః=శత్రుబలంబులంబీడించునట్టి; కాకుత్స్థః = రాముండు; లంకాం=లంకను; శరైః= బాణములచేత; సంకులాం=నిండినదానిఁగా; కృత్వాతు=చేసియె; మాం=నన్ను; నయేద్యది=తీసికొనిపోవునేని; తత్=అది; తస్య=ఆరామునకు; సదృశం = సమానము గా; భవేత్=అగును.

శత్రుబలంబులంజంపునట్టి రాముండులంకాపురియంతయు, బాణంబులనిండునట్లు చేసి, నన్నుంగొనిపోవునేని, యదియతనికిసరిగానుండును.

అని, తాత్పర్యము.

తద్యథా తస్య విక్రాంత మనురూపం మహాత్మనః
భవే దాహవశూరస్య తథా త్వ ముపపాదయ. ౩౧

టీక॥ తత్=అందువలన; ఆహవశూరస్య= యుద్ధమునందుభయములేనివాఁడును; మహాత్మనః= అధికమయినపరాక్రమముగలవాఁడునగు; తస్య=ఆరామునకు; అనురూపం=సరియయిన; విక్రాంతం=పరాక్రమిందుట; యథా=ఎట్లు; భవేత్=అగునో; తథా=అట్లు; త్వం=నీవు; ఉపపాదయ=చేయుము.

అందువలన, యుద్ధమునందు శూరుండును మహాపరాక్రమశాలియునగునారాముండెట్లుపరాక్రమంబుఁజూచికీర్తినొందునో, నీవట్లుసన్నాహముసేయుము. అని, తాత్పర్యము.

తదర్థోపహితం వాక్యం సహితం హేతుసంహితమ్
నిశమ్య హనుమాన్ శేషం వాక్య ముత్తర మబ్రవీత్. ౩౨

టీక॥ హనుమాన్ = హనుమంతుఁడు; అర్థోపహితం = గొప్పయర్థము తోఁగూడినదియును; సహితం = సంగతమును; హేతుసంహితం = కారణములతోఁగూడినదియునగు; తత్ = ఆ; వాక్యం = మాటను; నిశమ్య = విని; శేషం = మిగిలిన; ఉత్తరం = బదులయిన; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

హనుమంతుండు, గొప్పయర్థము తోఁగూడినదియును సంగతంబునుయుక్తియుక్తంబునగు సీతాదేవిమాటనువిని, యంత, నిదివఱకుఁ దాను జెప్పకున్న మాటలం జెప్పెను.

అని, తాత్పర్యము.

దేవి హర్యృక్షసైన్యానా మీశ్వరః ప్లవతాం వరః
సుగ్రీవ స్సత్త్వ సంపన్న స్తవార్థే కృతనిశ్చయః. ౩౩

టీక॥ దేవి = సీతాదేవీ! హర్యృక్షసైన్యానాం = వానరులయొక్కయు భల్లూకంబులయొక్కయు సైన్యంబులకు; ఈశ్వరః = ప్రభుండును; ప్లవతాం = వానరులలో; వరః = శ్రేష్ఠుండును; సత్త్వసంపన్నః = బలముతోఁగూడినవాఁడునగు; సుగ్రీవః = సుగ్రీవుఁడు; తవ = నీయొక్క; అర్థే = ప్రయోజనము నిమిత్తమయి; కృతనిశ్చయః = చేయఁబడిననిశ్చయముగలవాఁడుగా; భవతి (అధ్యాహృతము) = అగుచున్నాఁడు.

సీతాదేవీ! వానరసైన్యంబులకును భల్లూక సైన్యంబులకును నాయకుండును వానర శ్రేష్ఠుండును బలవంతుండునగు సుగ్రీవుండు, నీకార్యము నెట్లయిన సాధింపవలెనని నిశ్చయించియున్నాఁడు.

అని, తాత్పర్యము.

స వానరసహస్రాణాం కోటీభి రభిసంవృతః
క్షిప్ర మేష్యతి వైదేహి రాక్షసానాం నిబర్హణః. ౩౪

టీక॥ వైదేహి = సీతాదేవీ! రాక్షసానాం = రాక్షసులయొక్క; నిబర్హణః = చంపునట్టి; సః = ఆసుగ్రీవుఁడు; వానరసహస్రాణాం = వానరులవేలయొ

క్క;కోటిభిః=కోటులచేత;అభిసంవృతః=చుట్టఁబడినవాఁడై;క్షిప్రం=శీఘ్రముగా; ఏష్యతి=రాఁగలఁడు.

సీతాదేవీ!ఆసుగ్రీవుండు రాక్షసుల నందఱఁజంపఁగలండు;అతండు పెక్కువేలకోట్లవానరులంగూడి శీఘ్రింబుగా నిచ్చటికివచ్చును. అని, తాత్పర్యము.

తస్య విక్రమసంపన్నా స్సత్త్వవంతో మహాబలాః
మనస్సంకల్పసంపాతా నిదేశే హరయ స్స్థితాః. ౩౫
యేషాం నోపరి నాధస్తా న్నతిర్య క్సజ్జతే గతిః

టీక॥విక్రమసంపన్నాః=పరాక్రమముతోఁగూడినవారలును ; సత్త్వవంతః=అధికమయినశక్తిగలవారలును;మహాబలాః=అధికమయినబలముగలవారలును; మనస్సంకల్పసంపాతాః= మనస్సుయొక్క-సంకల్పమువంటి వేగముగలవారలును;యేషాం=ఎవ్వరికి; గతిః=గమనము;ఉపరి=మీఁదుగా;నసజ్జతే=అడ్డపడదో;అధస్తాత్=క్రింద; న(సజ్జతే)= అడ్డపడదో;తిర్యక్ = అడ్డముగా;న(సజ్జతే) = అడ్డపడదో; తే(అధ్యాహృతము)=అట్టివారలునగు;హరయః=వానరులు;తస్య=ఆసుగ్రీవునియొక్క;నిదేశే=ఆజ్ఞయందు;స్థితాః= ఉన్నారు.

పరాక్రమశాలులును శక్తిమంతులునుబలవంతులును మనోవేగంబువంటివేగముగలవారలునగువానరులనేకులాసుగ్రీవునియాజ్ఞంగనిపెట్టియున్నారు; వారలు,ఊర్ధ్వముగాఁగాని,క్రిందుగాఁగానియడ్డముగాఁగాని, యడ్డులేకసంచరింతురు.

అని, తాత్పర్యము.

నచ కర్మసు సీదంతి మహత్స్వమితతేజసః. ౩౬

టీక॥అమితతేజసః= కొలఁదిలేనిశక్తిగల; తే(అధ్యాహృతము)= ఆవానరులు;మహత్సు=గొప్పవైన; కర్మసు చ=కార్యములందును;నసీదంతి = దుఃఖింపరు.

వారలుకొలఁదిలేని శక్తిగలవారలుగావున,నెట్టికార్యములనైనను, సరకు సేయరు. అని, తాత్పర్యము.

అసకృ త్తై ర్మహోత్సాహైః ససాగరధరా ధరా
ప్రదక్షిణీకృతా భూమి ర్వాయుమార్గాను సారిభిః. ౩౭

టీక॥ వాయుమార్గానుసారిభిః= వాయుదేవుని మార్గముననుసరించున ట్టివారలును; మహోత్సాహైః= అధికమయినయుత్సాహముగలవారలునగు; తైః= ఆవానరులచేత; ససాగరధరాధరా = సముద్రములతోను బర్వతములతోనుంగూడినట్టి; భూమిః = భూమి; అసకృత్ = పలుమారు; ప్రదక్షిణీకృతా= ప్రదక్షిణింపఁబడినది.

అధికమయిన యుత్సాహంబుగల యావానరులు, వాయుమార్గంబున సంచరించుచు, సముద్రపర్వతంబులతోఁ గూడిన భూమండలమునంతయుఁ బలుమాఱు చుట్టివచ్చియున్నారు.

అని, తాత్పర్యము.

మద్విశిష్టా శ్చ తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః
మత్తః ప్రత్యవరః కశ్చి న్నాస్తి సుగ్రీవ సన్నిధౌ. ౩౮

టీక॥ తత్ర= ఆ; సుగ్రీవసన్నిధౌ= సుగ్రీవునిసమీపమునందు; మద్విశిష్టాశ్చ= నాకన్నవధికులును; తుల్యాశ్చ= సమానులునగు; వనౌకసః= వానరులు; సంతి= ఉన్నారు. మత్తః = నాకన్న; ప్రత్యవరః= తక్కువయినవాఁడు; కశ్చిత్= ఒకానొకఁడును; నాస్తి= లేఁడు.

సుగ్రీవునిసమీపంబున, నాకన్ననధికులునాకుసమానులునగువానరులు పెక్కండ్రుగలరు; అందు, నాకన్నఁదక్కువయినవాఁడెవ్వఁడును లేఁడు.

అని, తాత్పర్యము.

అహం తావ దిహ ప్రాప్తః కింపున స్తే మహాబలాః
నహి ప్రకృష్టాః ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః. ౩౯

టీక॥ అహంతావత్ = నేనే; ఇహ= ఇచ్చటికి; ప్రాప్తః= వచ్చినాఁడను. మహాబలాః= అధికమయినబలముగల; తే= ఆవానరులు ; కింపునః (వక్తవ్యం= "రాగలరు" అనిచెప్పనేల ! ప్రకృష్టాః= శ్రేష్ఠులగువారలు ; నప్రేష్యంతేహి = పంపఁబడరుగదా! ఇతరే= ఇతరులయిన; జనాః= జనులు; ప్రే

వ్యం తేహి=పంపఁబడుదురుగదా!

లోకములో నెచ్చటికైనను త్తములం బంపుదురా? సాధారణులగువారలనే పంపుదురుగదా! నేనే సముద్రంబుదాఁటి యిచ్చటికివచ్చినానే; ఇంకమహాబలశాలులగునావానరులు వచ్చుటకేమి సందియము? అని, తాత్పర్యము.

తదలం పరితాపేన దేవి శోకో వ్యపైతు తే
ఏకోత్పాతేన తే లంకా మేష్యంతి హరియూథపాః. ౪౦

టీక॥ దేవి=సీతాదేవీ! తత్=అందువలన; పరితాపేన= సంతాపముచేత; అలం=చాలును. తే=నీయొక్క ; శోకః=దుఃఖము; వ్యపైతు= పోవుఁగాక. తే=ఆ; హరియూథపాః= వానరులసమూహములంబాలించునట్టివానరులు; ఏకోత్పాతేన= ఒకగంతుచేత ; లంకాం=లంకను; ఏష్యంతి=పొందఁగలరు.

సీతాదేవీ! అట్లుకావున, నీవుపరితాపపడకుము, ఈదుఃఖంబువిడువుము. ఆ వానరోత్తములొకటిగంతునకే యీ లంకాపురింజేరఁగలరు.

అని, తాత్పర్యము.

మమ పృష్ఠగతౌ తౌ చ చంద్రసూర్యావివోదితౌ
త్వత్సకాశం మహాసత్త్వౌ నృసింహా వాగమిష్యతః. ౪౧

టీక॥ మహాసత్త్వౌ=అధికమయినబలముగల; తౌ=ఆ; నృసింహౌ చ= పురుషశ్రేష్ఠులయిన రామలక్ష్మణులును; మమ=నాయొక్క; పృష్ఠగతౌ= వీపునుబొందినవారలై; ఉదితౌ= ఉదయించిన; చంద్రసూర్యావివ(స్థితౌ)=చంద్రసూర్యులంబోలెనున్నవారలై ; త్వత్సకాశం=నీసమీపమును; ఆగమిష్యతః= పొందఁగలరు.

బలవంతులునుబురుషశ్రేష్ఠులునగు నారామలక్ష్మణులును , నావీపుపైనెక్కి, యుదయించిన చంద్రసూర్యులంబోలె వెలుంగుచు, నీయొద్దకు, రాఁగలరు. అని, తాత్పర్యము.

తతో వీరౌ నరవరౌ సహితౌ రామలక్ష్మణౌ
ఆగమ్య నగరీం లంకాం సాయకైర్విధమిష్యతః. ౪౨

టీక॥తతః=అటుపిమ్మట;వీరౌ=పరాక్రమశాలులును;నరవరౌ=పురుషశ్రేష్ఠులునగు;రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు;సహితౌ=చేరినవారలై;ఆగమ్య=వచ్చి;లంకాం=లంకయను;నగరీం=పట్టణమును;సాయకైః=బాణములచేత;విధమిష్యతః=నాశము నొందింపఁగలరు.

అంతట,బరాక్రమశాలులునుబురుషశ్రేష్ఠులునగు రామలక్ష్మణులు , ఇద్దఱుసుంగూడివచ్చి,నానావిధ బాణంబులం బ్రయోగించి,యీలంకాపురినంతయు,నశింపఁజేయఁగలరు.అని, తాత్పర్యము.

సగణం రావణం హత్వా రాఘవో రఘునందనః
త్వా మాదాయ వరారోహే స్వపురీం ప్రతియాస్యతి. ౪౩

టీక॥వరారోహే = సుందరములయినపిఱుఁదులుగల సీతాదేవీ! రాఘవః=రఘువంశమునందుఁబుట్టిన; రఘునందనః=రాముఁడు;సగణం=బంధుసమూహముతోఁగూడిన;రావణం=రావణుని;హత్వా=చంపి; త్వాం=నిన్ను; ఆదాయ=తీసికొని;స్వపురీం;ప్రతి=తనపట్టణమునుగూర్చి;యాస్యతి=పోఁగలఁడు.

సుందరములయినపిఱుఁదులుగల సీతాదేవీ! రాముండు, రావణునినతనిబంధువులనుం,జంపి,నిన్నుఁదీసికొని , యయోధ్యాపట్టణంబునకుం బోఁగలఁడు. అని, తాత్పర్యము.

త దాశ్వసిహి భద్రం తే భవ త్వం కాలకాంక్షిణీ
న చిరా ద్ద్రక్ష్యసే రామం ప్రజ్వలంత మివానలమ్. ౪౪

టీక॥తత్=అందువలన;త్వం=నీవు;ఆశ్వసిహి=ఊఱడిల్లుము. కాలకాంక్షిణీ=కాలము నెదురుచూచుచున్నదానవు;భవ=అగుము. తే=నీకు; భద్రం=మంగళము;అస్తు (అధ్యాహృతము)=అగుఁగాక.ప్రజ్వలంతం = మండుచున్న; అనలమివ(స్థితం)=అగ్నిచూపుగ్రుండుంబోలెనున్న;రామం=రామునిః;నచిరాత్=శీఘ్రముగానే ; ద్రక్ష్యసే=చూడఁగలవు.

అందువలన, నీవుదుఃఖంబువిడిచి దినంబులెంచుకొనుచుండుము;నీకుమంగళ

మగుఁగాక;నీవు,శీఘ్రంబుగనే, మండుచున్నయగ్నిహోత్రుంబోలెఁ జూపట్టుచు,నీలంకాపురినేచుఁచున్నరాముం జూడఁగలవు. అని, తాత్పర్యము.

నిహతే రాక్షసేంద్రేఽస్మిన్ సపుత్రామాత్యబాంధవే
త్వం సమేష్యసి రామేణ శశాంకేనేవ రోహిణీ. ౪౫

టీక॥సపుత్రామాత్యబాంధవే=కొడుకులతోను మంత్రులతోనుబంధువులతోఁనుగూడిన;అస్మిన్=ఈ; రాక్షసేంద్రే=రాక్షసులకుఁబ్రభుండైనరావణుండు;నిహతే=చంపఁబడఁగా;త్వం= నీవు; రామేణ=రామునితో; శశాంకేన=చంద్రునితో;రోహిణీవ= రోహిణీదేవివలె;సమేష్యసి=చేరఁగలవు.

రావణుండును,అతని,కొడుకులును మంత్రులునుబంధుజనంబులునుజంపఁబడినవెనుక,నీవు,రోహిణీదేవిచంద్రుంజేరునట్లు, రాముంజేరఁగలవు.

అని, తాత్పర్యము.

క్షిప్రం త్వం దేవి శోకస్య పారం యాస్యసి మైథిలి

టీక॥మైథిలి=మిథిలయందుఁబుట్టిన;దేవి=సీతాదేవీ!త్వం=నీవు; క్షిప్రం=శీఘ్రముగా;శోకస్య=దుఃఖముయొక్క; పారం=తుదను;యాస్యసి = పొందఁగలవు.

సీతాదేవీ!ఇంక , శీఘ్రింబుగనే,నీదుఃఖంబంతయునశించును.

అని, తాత్పర్యము.

రావణంచైవ రామేణ నిహతం ద్రక్ష్యసేఽచిరాత్. ౪౬

టీక॥రామేణ= రామునిచేత;నిహతం=చంపఁబడిన; రావణంచైవ=రావణునింగూడ;అచిరాత్ = శీఘ్రముగానే;ద్రక్ష్యసే=చూడఁగలవు.

నీవు, శీఘ్రముగనే, రామునిచేఁజంపఁబడినరావణునింజూడఁగలవు. అని, హనుమంతుండు,సీతతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ మాశ్వాస్య వైదేహీం హనుమా న్మారుతాత్మజః
గమనాయ మతిం కృత్వా వైదేహీం పున రబ్రవీత్. ౪౭

టీక॥ మారుతాత్మజః = వాయుదేవునికొడుకైన; హనుమాన్ = హనుమంతుడు; వైదేహీం = సీతాదేవిని; ఏవం = ఇట్లు; ఆశ్వాస్య = ఓదార్చి; గమనాయ = పోవుటకొఱకు; మతిం = తలంపును; కృత్వా = చేసి; వైదేహీం = సీతాదేవినిగూర్చి; పునః = మఱల; అబ్రవీత్ = పలికెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు, ఈప్రకారముగ సీతాదేవినూఱడించి, యంతఁబోఁదలఁచి, మఱల, సీతాదేవింజూచి, యిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

తమరిఘ్నం కృతాత్మానం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్
లక్ష్మణంచ ధనుష్పాణిం లంకాద్వార ముపస్థితమ్. ౪౧

టీక॥ లంకాద్వారం = లంకవాకిలిని; ఉపస్థితం = పొందిన; అరిఘ్నం = శత్రువులంజంపునట్టి; కృతాత్మానం = చేయఁబడిన (నిశ్చితమయినయట్టి) బుద్ధిగల; రాఘవం = రామునిని; ధనుష్పాణిం = విల్లుచేతంగల; లక్ష్మణంచ = లక్ష్మణునిని; క్షిప్రం = శీఘ్రముగా; ద్రక్ష్యసి = చూడఁగలవు.

నీవు, శీఘ్రంబున, శత్రువులంజంపునట్టి వాఁడును నిశ్చితాత్ముండునగు రాముండు, ధనుర్ధరుండగు లక్ష్మణుండును, లంకాద్వారంబుఁజేరియుండఁగాఁ, జూడఁగలవు.

అని, తాత్పర్యము

నఖదంష్ట్రాయుధా న్వీరాన్ సింహశార్దూలవిక్రమాన్
వానరా న్వారణేంద్రాభాన్ క్షిప్రం ద్రక్ష్యసి సంగతాన్. ౪౨

టీక॥ సంగతాన్ = గుంపుగాఁగూడుకొన్నవారలును; నఖదంష్ట్రాయుధాన్ = గోళ్లునుకోఱలునెయాయుధములుగాఁగలవారలును; వీరాన్ = పరాక్రమశాలులును; సింహశార్దూలవిక్రమాన్ = సింహంబుయొక్కయుఁ బెద్దపులులయొక్కయుఁ బరాక్రమమువంటిపరాక్రమముగలవారలును; వారణేంద్రాభాన్ = ఏనుంగులలోశ్రేష్ఠములునయేనుఁగులయొక్కకాంతివంటికాంతిగలవారలునగు, అంతటిశరీరముగలవారలునగుననుట; వానరాన్ = వానరు

లను; క్షిప్రం= శీఘ్రముగా; ద్రక్ష్యసి = చూడఁగలవు.

నీవింక, శీఘ్రంబుననే, గోళ్లును గోలునాయుధంబులు గాఁగల్గిన వారలును బరాక్రమవంతులును సింహశార్దూలంబులకుంబోలె శౌర్యంబుగలవారలును, గజేంద్రంబులంతటిమేను గలవారలునునగు వానరులు, లంకాద్వారంబునం జేరియుండుటంజూడఁగలవు.

అని, తాత్పర్యము.

శైలాంబుదనికాశానాం లంకామలయసానుషు
నర్దతాం కపిముఖ్యానా మార్యే యూథా న్యనేకశః. ౫౦

టీక॥ ఆర్యే=పూజ్యురాలవయిన సీతాదేవీ! శైలాంబుదనికాశానాం= పర్వతములతోను మేఘములతోనుసమానులయినవారలును; లంకామలయసానుషు=లంకాపట్టణమునందలి మలయపర్వతముయొక్క నెత్తములయందు; నర్దతాం=అఱచుచున్నవారలునునగు; కపిముఖ్యానాం= వానరశ్రేష్ఠులయొక్క; అనేకశః=అనేకములయిన; యూథాని=సమూహములను; ద్రక్ష్యసి (అధ్యాహృతము)=చూడఁగలవు.

పూజ్యురాలవగుసీతాదేవీ! నీవింక శీఘ్రముగానే పర్వతాకారులును మేఘంబంతటిమేనుగలవారలునగు వానరశ్రేష్ఠులు, గుంపులుగుంపులుగా, లంకామలయసానువులంజేరి, సింహనాదంబులు గావించుటంజూడఁగలవు.

అని, తాత్పర్యము.

సతు మర్మణి ఘోరేణ తాడితో మన్మథేషుణా
న శర్మ లభతే రామ స్సింహార్దిత ఇవద్విపః. ౫౧

టీక॥ సః=ఆ; రామస్తు=రాముండును; ఘోరేణ=భయంకరమయిన; మన్మథేషుణా=మన్మథునిబాణముచేత; మర్మణి= జీవస్థానమునందు; తాడితః= కొట్టఁబడినవాఁడై; సింహార్దితః= సింహముచేఁబీడింపఁబడిన; ద్విపఇవ = ఏనుంగువలె; శర్మ= సౌఖ్యమును; నలభతే=పొందకున్నాఁడు.

ఆరాముండును, భయంకరంబులగు మన్మథబాణంబులచేమిక్కిలియుబాధింపంబడి, సింహంబుచేతంజిక్కినయేనుంగుంబోలె, సుఖంబునొందకున్నాఁడు.

అని, తాత్పర్యము.

మారుదో దేవి శోకేన మాభూ త్తే మనసోఽప్రియమ్
శచీవ పత్యా శక్రేణ భర్త్రా నాథవతీ హ్యసి. ౫౨

టీక॥ దేవి=సీతా దేవీ! శోకేన=దుఃఖముచేత; మారుదః=ఏడ్వకుము. తే=నీయొక్క; మనసః = మనసునకు; అప్రియం=దుఃఖము; మాభూత్ = కలుగకుండుఁగాక. పత్యా= పెనిమిటియయిన; శక్రేణ=ఇంద్రునిచేత; శచీమివ=శచీదేవియుంబోలె; భర్త్రా=పెనిమిటియయిన రామునిచేత; నాథవతీ = నాథుండుగలదానవు; అసిహి = అగుచున్నావుగదా!

సీతా దేవీ! నీవిట్లనాథయుంబోలె రోదనంబుసేయకుము; మనంబునదుఃఖంబుంచకుము; శచీదేవికి దేవేంద్రుండుంబోలె నీకు నాథుండు రాముండున్నాఁడుగదా! అని, తాత్పర్యము.

రామా ద్విశిష్టః కోన్యోస్తి కశ్చి త్సౌమిత్రిణా సమః
అగ్నిమారుతకల్పౌ తౌ భ్రాతరౌ తవ సంశ్రయౌ. ౫౩

టీక॥ రామాత్ = రామునికన్న ; విశిష్టః = అధికుఁడు; అన్యః = ఇతరుఁడు; కః=ఎవ్వఁడు; అస్తి=ఉన్నాఁడు? సౌమిత్రిణా=లక్ష్మణునితో ; సమః = సమానుఁడు; కశ్చిత్ = ఎవ్వఁడు? తవ=నీయొక్క; సంశ్రయౌ = ఆశ్రయభూతులయిన; తౌ=ఆ; భ్రాతరౌ = అన్నదమ్ములయిన రామలక్ష్మణులు ; అగ్నిమారుతకల్పౌ = నిప్పుతోనువాయువుతోనుసమానులు.

లోకంబునరామునికన్న నధికుండెవ్వఁడున్నాఁడు? లక్ష్మణునకుసరియయినవాఁడెవ్వఁడు? నీకాశ్రయులయినయీయన్నదమ్ములిద్దఱును, అగ్నివాయువులకుసరివత్తురు.

అని, తాత్పర్యము.

నాస్మింశ్చిరం వత్స్యసి దేవి దేశే
రక్షోగణై రధ్యుషితే తిరౌద్రే
న తే చిరా దాగమనం ప్రియస్య
క్షమస్వ మత్సంగమకాలమాత్రమ్. ౫౪

టీక॥దేవి=సీతాదేవీ!రక్షోగణైః= రాక్షససమూహములచేత ; అధ్యుషితే=అధిష్ఠింపఁబడినదియును ; అతిరౌద్రే= మిక్కిలియు భయంకరమయినదియునగు; అస్మిన్=ఈ; దేశే=ప్రదేశమునందు ; చిరం=బహుకాలము; న వత్స్యసి=ఉండవు. తే= నీయొక్క; ప్రియస్య= పెనిమిటియయినరామునియొక్క;ఆగమనం=వచ్చుట;చిరాత్= బహుకాలముగలది,న=కాదుంమత్సంగమకాలమాత్రం=నాయొక్క చేరుటకాలముమాత్రము;క్షమస్వ= ఓర్చియుండుము.

సీతాదేవీ! రాక్షసులకునికిపట్టయి నభయంకరమగుసీదేశమునందు, నీవింకబహుకాలంబుండవలసినదిలేదు ; నీపెనిటి రాముండింక శీఘ్రంబుగానే యిచ్చటికివచ్చును; నేనుబోయిరామునిం జేరునంతవఱకుమాత్ర మోర్చియుండుము; నేనుబిలుచుకొనివచ్చెదను. అని, హనుమంతుండు, సీతాదేవితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
సుందరకాండే,ఏకోనచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,సుందరకాండైకోనచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ.
చత్వారింశసర్గప్రారంభః.

శ్రుత్వాతు వచనం తస్య వాయుసూనో ర్మహాత్మనః
ఉవాచా త్మహితం వాక్యం సీతా సురసుతోపమా. ౧

టీక॥సురసుతోపమా= దేవకన్యకతోఁబోల్కిగల;సీతా=సీతాదేవి ; మహాత్మనః=అధికమయినబుద్ధిగల ; వాయుసూనోః= వాయుదేవునికొడుకై

న;తస్య=ఆహనుమంతునియొక్క; వచనం=మాటను;శ్రుత్వాతు = విన్నంతనే;ఆత్మహితం=తనకుమేలుగల్గించునట్టి;వాక్యం=మాటను; ఉవాచ = చెప్పెను.

దేవకన్యకతోఁబోలికగల సీతాదేవి,మహాత్ముండు వాయుపుత్రుండునగు నాహనుమంతుండుచెప్పినమాటవిని, తనకుహితముగానిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

త్వాం దృష్ట్వా ప్రియవక్తారం సంప్రహృష్యామి వానర
అర్ధసంజాతసస్యేవ వృష్టిం ప్రాప్య వసుంధరా. ౨

టీక॥వానర=హనుమంతుఁడా! అహం(అధ్యాహృతము)=నేను;ప్రియవక్తారం=సంతోషకరంబగు మాటచెప్పునట్టి;త్వాం=నిన్ను;దృష్ట్వా=చూచి;వృష్టిం=వానను;ప్రాప్య=పొంది ; అర్ధసంజాతసస్యా= సగముమొలిచినపైరుగల;వసుంధరేవ=భూమివలె ; సంప్రహృష్యామి=సంతోషించుచున్నాను.

హనుమంతుఁడా!నేను, నాకుఁబ్రియవార్తఁజెప్పునట్టి, నిన్నుఁజూచుటవలన,వానగురిసినపిమ్మట భూమియందుసగముపైరు మొలుచునట్లు , నాకు సగముకార్యసిద్ధియయినదని , మిక్కిలియుసంతోషించుచున్నాను.

అని, తాత్పర్యము.

యథా తం పురుషవ్యాఘ్రం గాత్రైః శోకాభికర్శితైః
సంస్పృశేయం సకామాహం తథా కురు దయాం మయి. ౩

టీక॥సకామా= మన్మథబాధగల; అహం=నేను;యథా=ఎట్లు;శోకాభికర్శితైః=దుఃఖముచేతఁగృశించునట్లుచేయఁబడిన; గాత్రైః= అవయవముల చేత;తం=ఆ;పురుషవ్యాఘ్రం=పురుషశ్రేష్ఠుండగురాముని; సంస్పృశేయం=తాఁకుదునో; తథా=అట్లు;మయి = నాయందు; దయాం=దయను; కురు= చేయుము.

మన్మథపీడితనైననేను , ఇట్లుదుఃఖంబునఁగృశించియుండునవయవంబులచేతఁబురుషశ్రేష్ఠుండగురామునిం దాఁకునట్లు,నాయందుదయయుంచి, సంఘటింపుము. అని, తాత్పర్యము.

అభిజ్ఞానం చ రామస్య దద్యాం హరిగణోత్తమ
క్షిప్తా మిషీకాం కాకస్య కోపా దేకాక్షి శాతనీమ్.౪

టీక॥హరిగణోత్తమ = వానరసమూహములో శ్రేష్ఠుండవైన;హనుమంతుఁడా!కోపాత్=కోపమువలన; కాకస్య=కాకముయొక్క ; ఏకాక్షిశాతనీం=ఒకకంటిని భేదించునట్టి;క్షిప్తాం=ప్రయోగింపఁబడిన;రామస్య=రామునియొక్క;ఇషీకాం=ఒకవిధమయినతృణమును;అవదం(అధ్యాహృతము)= చెప్పినాను. చ=మఱల;అభిజ్ఞానం = గుఱుతును;దద్యాం=ఇచ్చెదను.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా!రాముండుకోపంబునఁగాకముపైఁ దృణంబుఁబ్రయోగించి, వానికంటి నొకటిభేదించినసమాచారము నొక్కగుఱుతుఁజెప్పితినిగదా! ఇంకనుమఱియొక్కగుఱుతుంజెప్పెదను.

అని, తాత్పర్యము.

మనశ్శిలాయా స్తిలకో గండపార్శ్వే నివేశితః
త్వయా ప్రణష్టే తిలకే తం కిల స్మర్తు మర్హసి. ౫

టీక॥తిలకే=బొట్టు;ప్రణష్టే=నశింపఁగా;త్వయా = నీచేత; మనశ్శిలాయాః=మణిసిలయొక్క;తిలకః= బొట్టు;గండపార్శ్వే=గుండ్రాయిప్రక్కను,లేక, చెక్కిలిప్రక్కను; నివేశితః= ఉంచఁబడినది.తం = ఆసమాచారమును;స్మర్తుం = తలంచుకొనుటకు;అర్హసికిల=తగుదువుగదా! (సీతాదేవి,యీమాటను,రామునుద్దేశించిచెప్పినట్లు,హనుమంతునితోఁజెప్పినది.)

ఒకనాఁడు, నానుదుటిమీఁదిబొట్టు కలఁగికనుపడకుండఁగా,నీవు, మణిసిలనుబొట్టుగాఁజేసి,నానుదుటంబ్రతిఫలించి,బొట్టుగాఁగనుపట్టుచుండునట్లు,నాయెదుటనుండినగుండ్రాయిపై, నుంచినావు;దానిందలంచుకొనుము.

అని, తాత్పర్యము.

లేక; ఒకనాఁడు, నానుదుటిమీఁది బొట్టుకలఁగియగపడకుండఁగా, నీవు, మణిసిలనుబొట్టుగాఁజేసి, పరిహాసార్థము,నాచెక్కిలిపైఁబెట్టినావు; దానిందలంచుకొనుము.అని,సీతాదేవి,రామునకుంజెప్పుమని,హనుమంతునకుగుఱుతుఁజెప్పినది.అని,తాత్పర్యము.

స వీర్యవా న్కథం సీతాం హృతాం సమను మన్యసే
వసంతీం రక్షసాం మధ్యే మహేంద్రవరుణోపమః. ౬

టీక॥ వీర్యవాన్=అధికమయినపరాక్రమముగలవాఁడవును; మహేంద్రవరుణోపమః= దేవేంద్రునితోనువరుణునితోనుబోలికగలవాఁడవునగు; సః= అట్టి; త్వం(అధ్యాహృతము)=నీవు; హృతాం=అపహరింపఁబడినదియును; రక్షసాం=రాక్షసులయొక్క; మధ్యే=నడుమునందు; వసంతీం=ఉన్నదియునగు; సీతాం=సీతను; కథం=ఎట్లు; సమనుమన్యసే=ఉపేక్షించుచున్నావు.

రాముఁడా! నీవుమహాపరాక్రమశాలివి, దేవేంద్రునకునువరుణునకునుసరివచ్చువాఁడవు; పూర్వము, నన్నుహింసించినకాకాదులపై మహాకోపంబుఁజూపినవాఁడవు; అట్టినీవు. నేనురావణునిచేనపహరింపఁబడియిట్లు రాక్షసులనడుమనుండఁగా, నెట్లుపేక్షించియున్నావు?

అని, తాత్పర్యము.

ఏష చూడామణి ర్దివ్యో మయా సుపరిరక్షితః

టీక॥ దివ్యః=శ్రేష్ఠమయిన; ఏషః=ఈ; చూడామణిః=తలవెంద్రుకలయందుంచుకొనురత్నము; మయా=నాచేత; సుపరిరక్షితః= చక్కఁగాఁగాపాడఁబడినది.

శ్రేష్ఠమయినయీచూడామణిని, నేనిట్టి దుఃఖకాలంబు నందును జాగ్రతతోఁగాపాడినాను.

అని, తాత్పర్యము.

ఏతం దృష్ట్వా ప్రహృష్యామి వ్యసనే త్వా మివానఘ. ౭

టీక॥ అనఘ=పాపములేనిరాముఁడా! అహం(అధ్యాహృతము)=నేను; వ్యసనే=దుఃఖమునందు; ఏతం = ఈ చూడామణిని; దృష్ట్వా = చూచి; త్వాం=నిన్ను; దృష్ట్వా (అధ్యాహృతము) ఇవ=చూచినవలె; ప్రహృష్యామి=సంతోషించుచున్నాను.

పాపరహితుండవగురాముఁడా! నాకుమిక్కిలియు దుఃఖముగలిగినప్పుడు, నేనిచూడామణింజూచి,నిన్నుఁజూ

చినట్లు, సంతోషంబునొందుదును. అని, తాత్పర్యము.

ఏష నిర్యాతిత శ్శ్రీమా న్మయా తే వారిసంభవః

టీక॥ శ్రీమాన్=అధికమయినకాంతిగల; ఏషః=ఈ; వారిసంభవః = జలమునందుఁబుట్టుకగలమణి; మయా = నాచేత; తే=నీకొఱకు; నిర్యాతితః= పంపఁబడినది.

శ్రీమంతంబునరత్నాకరంబగుసముద్రంబునంబుట్టినదియునగు నీచూడామణింగూడ,నీకొఱకిప్పుడుపంపినాను.

అని, తాత్పర్యము.

అతఃపరం న శక్ష్యామి జీవితుం శోకలాలసా.౮

టీక॥శోకలాలసా = దుఃఖముచేమిక్కిలియుఁజపలనైన ; అహం(అధ్యాహృతము)=నేను; అతఃపరం= ఇంకమీఁద; జీవితుం=బ్రతుకుటకు; నశక్ష్యామి=సమర్థురాలనుగాను.

కొంచెమూఱట గలిగించునట్టియీచూడామణియులేదుకావున, నింక,నేనిట్టిదుఃఖముసహించి, బ్రతుకంజాలను. అని;తాత్పర్యము.

అసహ్యానిచ దుఃఖాని వాచశ్చ హృదయచ్ఛిదః
రాక్షసీనాం సుఘోరాణాం త్వత్కృతే మర్షయామ్యహమ్. ౯

టీక॥ అహం=నేను; అసహ్యాని = ఓర్వఁగూడని; దుఃఖానిచ= దుఃఖములను; సుఘోరాణాం = మిక్కిలియుభయంకరలయిన; రాక్షసీనాం = రాక్షసస్త్రీలయొక్క; హృదయచ్ఛిదః= మనసును ఛేదించునట్టి;వాచః=మాటలను; త్వత్కృతే = నీకొఱకు; మర్షయామి=సహించుచున్నాను.

నేను,జీవించియున్న నెట్లయిననీతో సంగమంబుగల్గుననునాసచేత, నోర్వరానిదుఃఖంబులను, భయంకరాకారలయినయీరాక్షసస్త్రీలాడు దుర్వాక్యంబులను,సహించి బ్రతికియున్నాను.

అని, తాత్పర్యము.

ధారయిష్యామి మాసంతు జీవితం శత్రుసూదన

ఊర్ధ్వం మాసా న్నజీవిష్యే త్వయా హీనా నృపాత్మజ. ౧౦

టీక॥శత్రుసూదన= శత్రువులంజంపునట్టి రాముఁడా!మాసంతు=ఒకమాసముమాత్రము; జీవితం = ప్రాణమును;ధారయిష్యామి=ధరించెదను. నృపాత్మజ=రాచకొమరుండవయిన రాముఁడా!త్వయా=నీచేత;హీనా= విడువఁబడినదాననై;మాసాత్=నెలకన్న; ఊర్ధ్వం=పైఁగా; నజీవిష్యే = బ్రతుకను.

శత్రువులంజంపునట్టి రాముఁడా! నేనింకనొకటి నెలమాత్రము ప్రాణములు ధరించియుండెదను; నెలకుఁబైఁగా నొకటిక్షణమయినను,నిన్నువిడిచి , బ్రతుకంజాలను. అని, తాత్పర్యము.

ఘోరో రాక్షస రాజోయం దృష్టిశ్చ నసుఖా మయి
త్వాంచ శ్రుత్వా విపద్యంతం నజీవేయ మహం క్షణమ్. ౧౧
"త్వాంచశ్రుత్వా విషజ్జంతం" ఇతిపాఠాంతరం.

టీక॥అయం=ఈ; రాక్షసరాజః= రాక్షసులకుఁబ్రభుండైన రావణుండు; ఘోరః=భయంకరుఁడు . దృష్టిశ్చ= చూపును;మయి=నాయందు; సుఖా= నిసుఖముగల్గించునది;న=లేదు. త్వాం= న్ను;విపద్యంతం = దుఃఖమునొందినవానిఁగా;(పాఠాంతరపక్షమునందు)విషజ్జంతం=జాగుసేయువానిఁగా; శ్రుత్వాచ=వినియు , తెలిసికొనియుననుట;అహం=నేను;క్షణం= క్షణకాలమయినను ; నజీవేయం=బ్రతుకను.

రాక్షసేశ్వరుండగు నీరావణుండతిభయంకరుఁడు; నన్నుఁదిన్నఁగానైనం జూడఁడు;మఱియు,నీవును దుఃఖితుండవగుటనువిన్నాను ; (పాఠాంతరపక్షమందు; "నీవునుపేక్షించియాలస్యముసేయుటయు నెఱింగినపిమ్మట") నేను మాసమునకుఁ బిమ్మటక్షణమయినను, బ్రతుకంజాలను. అని,సీతాదేవి, రామునిం బేరొకొని,విలపించినది.

అని, తాత్పర్యము-

వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రు భాషితం
అథా బ్రవీ న్మహా తేజా హనుమా న్మారుతాత్మజః. ౧౨

టీక॥ మారుతాత్మజః = వాయుదేవునికుమారుండయిన ; హనుమాన్ = హనుమంతుఁడు; వైదేహ్యాః = సీతాదేవియొక్క; కరుణం = దుఃఖము గలిగించునదియును; సాస్రుం = కన్నీళ్లతోఁగూడునట్లుగా; భాషితం = చెప్పఁబడినదియునగు; వచనం = మాటను; శ్రుత్వా = విని; అథ = అటుపిమ్మట; అబ్రవీత్ = పలికెను.

సీతాదేవి, కన్నీళ్లొలికించుచుఁ, జెప్పినదుఃఖకరంబగుమాటనువిని, వాయుదేవుసికుమారుండగుహనుమంతుం, డిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన తే శపే
రామే దుఃఖాభిభూతేతు లక్ష్మణః పరితప్యతే. ౧౩

టీక॥ దేవి = సీతాదేవీ! రామః = రాముఁడు; త్వచ్ఛోకవిముఖః = నీదుఃఖముచేతవిముఖుండై; అస్తి (అధ్యాహృతము) = ఉన్నాఁడు. తే = నీకొఱకు; సత్యేన = సత్యముచేత; శపే = శపథము సేయుచున్నాను. రామే = రాముఁడు; దుఃఖాభిభూతేతు = దుఃఖముచేతఁదిరస్కరింపఁబడినవాఁడు కాఁగానే; లక్ష్మణః = లక్ష్మణుఁడు; పరితప్యతే = దుఃఖించుచున్నాఁడు.

సీతాదేవీ! నీదుఃఖంబున నె, రాముం డేమియుందోఁచక, కార్యంబులయెడవిముఖుండైయున్నాఁడు; నీకునమ్మకము గలుగుటకై, సత్యంబుచేశపథముచేసెదను; అట్లురాముండు దుఃఖంబునొందఁగానే, లక్ష్మణుండునుదుఃఖమునొందుచున్నాఁడు. అని, తాత్పర్యము.

కథంచి ద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్
ఇమం ముహూర్తం దుఃఖానా మంతం ద్రక్ష్యసి భామిని. ౧౪

టీక॥ కథంచిత్ = అతిప్రయాసముచేత; భవతీ = నీవు; దృష్టా = చూడఁబడినావు. పరిశోచితుం = దుఃఖించుటకు; కాలః = సమయము; న = కాదు. భామిని = సీతాదేవీ! ఇమం = ఈ; ముహూర్తం = (అత్యంతసంయోగమునందుఁద్వితీయ) ముహూర్తమునందె; దుఃఖానాం = దుఃఖములయొక్క; అంతం = నాశమును; ద్రక్ష్యసే = చూడఁగలవు.

అతిప్రయాసముచేతనీవునాకగపడినావు; ఇప్పుడుసంతోషింపవలయును గానిదుఃఖింపరాదు; ఇంక, నతిశీఘ్రంబు

ననె, నీవు శిఖలంబులన్నియు నశింతురు. అని, తాత్పర్యము.

తౌ వృధౌ పురుషవ్యాఘ్రౌ రాజపుత్రౌ వరిందమౌ
త్వద్దర్శనకృతోత్సాహౌ లంకాం భస్మీకరిష్యతః. ౧౫

టీక॥ పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులును; అరిందమౌ = శత్రువులనడంగఁద్రొక్కునట్టివారును; రాజపుత్రౌ = రాచకొమరులును; త్వద్దర్శన కృతోత్సాహౌ = నీదర్శనమునందుఁ జేయఁబడినయుత్సాహము గలవారలునగు; తౌ = ఆరామలక్ష్మణులు; ఉభౌ = ఇద్దఱును; లంకాం = లంకను; భస్మీకరిష్యతః = భస్మముసేయఁగలరు.

పురుషశ్రేష్ఠులును శత్రువుల నడంగఁద్రొక్కఁజాలినవారలును రాచకొమరులును నిన్నుఁజూడ నుత్సాహంబుగలవారలునగు నారామలక్ష్మణు లిద్దఱును, ఈలంకాపట్టణమును భస్మంబుగావింతురు. అని, తాత్పర్యము.

హత్వాతు సమరే క్రూరం రావణం సహబాంధవమ్
రాఘవౌ త్వాం విశాలాక్షి స్వాం పురీం ప్రాపయిష్యతః. ౧౬

టీక॥ విశాలాక్షి = పెద్దకండ్లుగల సీతాదేవీ! రాఘవౌ = రామలక్ష్మణులు; క్రూరం = దుష్టుండగు; రావణం = రావణుని; సహబాంధవం = బంధువులతోఁగూడునట్లుగా; సమరే = యుద్ధమునందు; హత్వాతు = చంపియె; త్వాం = నిన్ను; స్వాం = తమదైన; పురీం = పట్టణమును; ప్రాపయిష్యతః = పొందింపఁగలరు.

విశాలంబులగుకండ్లుగలసీతాదేవీ! రామలక్ష్మణులు, యుద్ధంబునఁ, గ్రూరుండగురావణునిసమస్త బంధువులతోడఁజంపి, నిన్నుఁదమయయోధ్యాపురికిం, దోడ్కొనిపోవుదురు.

అని, తాత్పర్యము.

యత్తు రామో విజానీయా దభిజ్ఞాన మనిందితే
ప్రీతిసంజననం తస్య భూయస్త్వం దాతు మర్హసి. ౧౭

టీక॥ అనిందితే = నిందింపఁబడనట్టిసీతాదేవీ! యత్ = ఏ; అభిజ్ఞానం = గుఱు

తును; రామః = రాముఁడు; విజానీయాత్ = ఎఱుంగునో; తత్ (అధ్యాహృతము) = అట్టి; తస్య = అతనికి; ప్రీతిసంజననంతు = సంతోషముఁగల్గించునట్టిగుఱుతునుమాత్రము; త్వం = నీవు; భూయః = ఇంకను; దాతుం = ఇచ్చుటకు; అర్హసి = తగుదువు-

ఎవ్వరిచేతనునిందింపఁబడనిసీతాదేవీ! ఇంకను, దేనినిరామునండెఱుంగునో, అట్టిగుఱుతునొకటి, రామునకు సంతోషంబుగల్గించుదానిని, నీవునాకీయ వలయును-అని. హనుమంతుండు, సీతాదేవితోఁజెప్పెను-అని, తాత్పర్యము-

సా బ్రవీ ద్దత్తమేవేతి మయా భిజ్ఞాన ముత్తమమ్
ఏత దేవహి రామస్య దృష్ట్వా మత్కేశభూషణమ్. ౧౪
శ్రద్ధేయం హనుమ న్వాక్యం తవ వీర భవిష్యతి

టీక॥ "వీర = పరాక్రమశాలివగు; హనుమన్ = హనుమంతుఁడా! మయా = నాచేత; ఉత్తమం = శ్రేష్ఠమయిన; అభిజ్ఞానం = గుఱుతు; దత్తమేవ = ఇవ్వఁబడినదే. ఏతత్ = ఈ; మత్కేశభూషణమేవ = నావెంట్రుకలకలంకారమయినచూడామణినే; దృష్ట్వా = చూచి; రామస్య = రామునకు; తవ = నీయొక్క; వాక్యం = మాట; శ్రద్ధేయం = నమ్మఁదగినదిగా; భవిష్యతిహి = కాఁగలదుగదా! ఇతి = అని; సా = ఆసీత; అబ్రవీత్ = పలికెను.

"పరాక్రమశాలివగు హనుమంతుఁడా! నేనునీకుత్తమంబయిన గుఱుతునిచ్చియున్నాను; నాతల వెంట్రుకలకు భూషణమయినయీచూడామణిం బూడఁగానే, రామునకు, నీమాటయందు నమ్మకంబుగల్గును" అని, సీతాదేవి, హనుమంతునితోఁజెప్పెను-

అని, తాత్పర్యము-

స తం మణివరం గృహ్య శ్రీమాన్ ప్లవగసత్తమః. ౧౫
ప్రణమ్య శిరసా దేవీం గమనా యోపచక్రమే

టీక॥ శ్రీమాన్ = అధికమయినకాంతిగలవాఁడును; ప్లవగసత్తమః = వానరులలో శ్రేష్ఠుండునునగు; సః = ఆహనుమంతుఁడు; మణివరం = మణిశ్రేష్ఠమును; గృ

గృహ్య (గృహీత్వా) = తీసికొని ; శిరసా=తలచేత; దేవీం=సీతాదేవిని; ప్రణమ్య=నమస్కరించి; గమనాయ= పోవుటకొఱకు; ఉపచక్రమే= ప్రారంభించెను-

శ్రీమంతుండును వానరశ్రేష్ఠుండున గు హనుమంతుఁడు, మణిశ్రేష్ఠంబగు నా చూడామణిం దీసికొని, సీతాదేవికి సాష్టాంగముగ నమస్కారంబు గావించి, పయనంబు కాఁగోరెను-

అని, తాత్పర్యము-

తముత్పాతకృతోత్సాహ మవేక్ష్య హరిపుంగవమ్. ౨౦
వర్ధమానం మహావేగ మువాచ జనకాత్మజా
అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పగద్గదయా గిరా. ౨౧

టీక ॥ జనకాత్మజా= జనకమహారాజు కూఁతురయిన సీతాదేవి; ఉత్పాతకృతోత్సాహం= ఎగురుటయందుఁ జేయఁబడిన యుత్సాహముగలవాఁడును; వర్ధమానం= పెరుఁగుచున్నవాఁడును; మహావేగం= అధికమయిన వేగముగలవాఁడునగు; తం= ఆ; హరిపుంగవం= వానరశ్రేష్ఠుండునగు హనుమంతుని; అవేక్ష్య=చూచి; దీనా=దుఃఖమునొందినదై; అశ్రుపూర్ణముఖీ= కన్నీళ్లచేనిండిన ముఖము గలదై; బాష్పగద్గదయా= కన్నీళ్లచేడగ్గుత్తికగల; గిరా= మాటచేత; ఉవాచ = చెప్పెను.

ఎగురుట సముద్రంబు నవ్వలిగట్టునకు బోవుటకై యాకాశంబున కెగురఁజూచుచు దేహంబుఁ బెంచుచున్న మహావేగుండగు హనుమంతుంజూచి, సీతాదేవి, దుఃఖంబునొంది, ముఖంబునిండఁ గన్నీళ్లు గ్రాల, డగ్గుత్తిక గదుర, నిట్లని, చెప్పెను-

అని, తాత్పర్యము-

హనుమన్ సింహసంకాశౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ
సుగ్రీవంచ సహామాత్యం సర్వాన్ బ్రూయా హ్యనామయమ్- ౨౨

టీక ॥ హనుమన్ = హనుమంతుఁడా! సింహసంకాశౌ= సింహములతో సమానులును; భ్రాతరౌ =అన్నదమ్ములునగు; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులనుగూర్చియు; సహామాత్యం= మంత్రులతోఁగూడిన; సుగ్రీవంచ=సుగ్రీవు

నిగూర్చియు; సర్వాన్ = అందఱను గూర్చియు; అనామయం = ఆరోగ్యమును; బ్రూయాహి = చెప్పదువు గదా!

హనుమంతుఁడా! సింహంబులంబోలునట్టియన్నదమ్ములు రామలక్ష్మణులకును, సుగ్రీవునకును, అతనిమంత్రులకును, అందఱికిని, నేను సేమంబుగనున్నానని, చెప్పుము-అని, తాత్పర్యము.

యథాచ స మహాబాహు ర్మాం తారయతి రాఘవః
అస్మా ద్దుఃఖాంబుసంరోధా త్త్వం సమాధాతు మర్హసి. ౨౩

టీక॥ మహాబాహుః = పెద్దచేతులు గల; సః = ఆ; రాఘవః = రాముఁడు; యథా = ఎట్లు; మాం = నన్ను; అస్మాత్ = ఈ; దుఃఖాంబుసంరోధాత్ = దుఃఖసముద్రముననుండి; తారయతి = తరింపఁజేయునో; తథా (అధ్యాహృతము) = అట్లును; త్వం = నీవు; సమాధాతుం = సమ్మతింపఁజేయుటకు; అర్హసి = తగుదువు.

మహాబాహుండగు నా రాముండిచ్చటికివచ్చి నాదుఃఖంబుఁ బోఁగొట్టునట్లు, నీవు, రామునకుఁదగు మాటలం జెప్పవలయును. అని, తాత్పర్యము.

ఇమం చ తీవ్రం మమ శోకవేగమ్
రక్షోభి రేభిః పరిభర్త్సనంచ
బ్రూయాస్తు రామస్య గతస్సమీపమ్
శివశ్చ తే ధ్వాస్తు హరిప్రవీర. ౨౪

టీక॥ హరిప్రవీర = వానరులలోమిక్కిలియుఁబరాక్రమశాలివగు హనుమంతుఁడా! త్వం (అధ్యాహృతము) = నీవు; రామస్య = రామునియొక్క; సమీపం = సమీపమును; గతస్తు = పొందినవాఁడవై నంతనే; మమ = నాయొక్క; ఇమం = ఈ; శోకవేగం చ = దుఃఖముయొక్కయతిశయమును; ఏభిః = ఈ; రక్షోభిః = రాక్షసులచేత; పరిభర్త్సనంచ = బెదరించుటను; బ్రూయాః = చెప్పుము. తే = నీయొక్క; అధ్వాచ = మార్గమును; శివః = మంగళకరము; అస్తు = అగుఁగాక.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవు రామునియొద్దకుఁబోయినంతనె, నేననుభవించుచుండుసీదుఃఖమును, ఇట్లు రాక్షసులునన్ను బెదరించుటను, వీనినంతయు, వివరముగా రామునకుంజెప్పుము; నీకుమార్గమున సుఖంబుగలుగుఁగాక. అని, సీతాదేవి, హనుమంతునకుంజెప్పెను. అని, తాత్పర్యము.

స రాజపుత్ర్యా ప్రతివేదితార్థః
కపిః కృతార్థః పరిహృష్టచేతాః
అల్పావశేషం ప్రసమీక్ష్య కార్యం
దిశం హ్యుదీచీం మనసా జగామ. ౨౫

టీక॥ సః=ఆ; కపిః = హనుమంతుఁడు; రాజపుత్ర్యా = రాచకొమార్తెయగుసీతాదేవిచేత; ప్రతివేదితార్థః= తెలుపఁబడినయర్థముగలవాఁడై; కృతార్థః=నెఱవేఱినపనిగలవాఁడై; పరిహృష్టచేతాః= సంతసించినమనసుగలవాఁడై; కార్యం=పనిని; అల్పావశేషం=కొంచెముమిగతగలదానిఁగా; ప్రసమీక్ష్య=చూచి; ఉదీచీం=ఉత్తరపు; దిశం=దిక్కును; మనసా=మనసుచేత; జగామహి=పోయెనుగదా!

ఆ హనుమంతుఁడు, రాచకొమార్తెయగుసీతాదేవిచెప్పిన యభిజ్ఞానంబులనుగ్రహించి, కృతార్థుండై, పరమసంతోషంబునొంది, "యింకఁజేయవలసినదికొంచెమెయున్న"దని యెఱింగి, మనంబునను త్తరపుదిక్కునకుం బోఁగోరెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

౪౧

ఏకచత్వారింశసర్గ ప్రారంభః.

సచ వాగ్భిః ప్రశస్తాభి గమిష్యన్ పూజిత స్తయా
తస్మా ద్దేశా దపక్రమ్య చింతయామాస వానరః. ౧

టీక॥ సః=ఆ; వానరశ్చ=హనుమంతుఁడును; గమిష్యన్=పోఁబోవువాఁడై; తయా=ఆసీతచేత; ప్రశస్తాభిః= ఉత్తమములయిన; వాగ్భిః = మాటలచేత; పూజితః=పూజింపఁబడినవాఁడై ; తస్మాత్=ఆ; దేశాత్ = ప్రదేశముననుండి; అపక్రమ్య=అవ్వలికిఁబోయి; చింతయామాస=ఆలోచించెను.

ఆహనుమంతుండు, రాముని యొద్దకుఁ బయనంబయి, యాసీతాదేవిచేత, నుత్తమవాక్యంబులంగొనియాడంబడి , యాప్రదేశంబునువిడిచి, కొంతయవ్వలికరిగి, యిట్లని, యాలోచించెను.

అని, తాత్పర్యము.

అల్పశేష మిదం కార్యం దృష్టేయ మసితేక్షణా
త్రీ నుపాయా నతిక్రమ్య చతుర్థ ఇహవిద్యతే. ౨

టీక॥ ఇదం=ఈ; కార్యం=పని; అల్పశేషం= కొంచెముమిగతగలది . ఇయం=ఈ; అసితేక్షణా= నల్లనికండ్లుగలసీతాదేవి; దృష్టా = చూడఁబడినది. ఇహ= ఈవిషయమునందు ; త్రీన్= మూఁడైన; ఉపాయాన్= సామదానభేదంబులనునుపాయంబులను ; అతిక్రమ్య=అతిక్రమించి; చతుర్థః= నాలవదైనదండోపాయము; దృశ్యతే=చూడఁబడుచున్నది.

సీతాదేవింజూచినాను; ఇంకరావణుని హృదయముం దెలిసికొనుటయె కావలసినది; ఈవిషయమునందు, సామదానభేదములు మూఁడుపాయంబులునుబనికిరావు; నాలవదగుదండోపాయమునే ప్రయోగింపవలసియున్నది.

అని, తాత్పర్యము.

నసామరక్షస్సు గుణాయ కల్పతే

న దాన మర్థోపచితేషు యుజ్యతే
న భేదసాధ్యా బలదర్పితా జనాః
పరాక్రమ స్త్వేవ మమేహ రోచతే. ౩

టీక॥ రక్షస్సు=రాక్షసులయందు; సామ = సామోపాయము ; గుణాయ=మేలుకొఱకు; నకల్పతే= కాదు. అర్థోపచితేషు= ధనముచేనిండినవారలయందు; దానం = దానోపాయము; నయుజ్యతే=యుక్తముకాదు. బలదర్పితాః=బలముచేతగర్వించిన ; జనాః=జనులు; భేదసాధ్యాః=భేదోపాయముచేతసాధింపఁదగినవారలు; న=కారు. ఇహ=ఇచ్చట; పరాక్రమస్త్వేవ=పరాక్రమమే;మమ=నాకు; రోచతే=రుచించుచున్నది.

రావణుండు రాక్షసుండుగావున,నతనియందుసామోపాయముఁ బ్రయోగించుటవలననేమియుఁబ్రయోజనముగలుగదు;మిక్కిలియు ధనవంతుండుగావునదానోపాయంబునుబనికిరాదు; బలంబుచేఁగొవ్వియున్నాఁడు కావున, భేదమునకునులొంగఁడు ; ఇంకఁబరాక్రమంబునె యాశ్రయింప వలయునని నాకుఁదోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

న చాస్య కార్యస్య పరాక్రమా దృతే
వినిశ్చయః కశ్చి దిహోపపద్యతే
హతప్రవీరా హి రణే హి రాక్షసాః
కథంచి దీయు ర్యదిహాద్య మార్దవమ్. ౪

టీక॥అస్య=ఈ;కార్యస్య=పనికి;పరాక్రమాదృతే= పరాక్రమమునువిడిచి;వినిశ్చయః = ఉపాయము ;కశ్చిచ్చ = ఏదియును ; ఇహ=ఇచ్చట నోపపద్యతే=సరిపడదు. యత్= ఏ కారణమువలన ; రాక్షసాః=రాక్షసులు; అద్య=ఇప్పుడు;రణే = యుద్ధమునందు;("హి" అనునదిపాదపూరణార్థము) ; హతప్రవీరాః= చంపఁబడినవీరులుగలవారలై ("హి" అనునది పాదపూరణార్థము); కథంచిత్=ఎట్లయినను; మార్దవం=తిన్నఁదనమును; ఈయుః=పొందుదురు.

ఈకార్యంబుసాధించుటకుఁబరా

క్రమంబుకన్న వేఱెయుపాయమేదియు లేదు; ఇప్పుడు నేను యుద్ధముచేసికొంచ ఆరాక్షసవీరులం జంపుదునేని, యీరాక్షసులెట్లయినం గొంచెము మృదుత్వము నొందుదురు. అని, తాత్పర్యము.

కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూన్యపి సాధయేత్
పూర్వకార్యావిరోధేన స కార్యం కర్తుమర్హతి. ౫

టీక॥ నిర్దిష్టే=ఆజ్ఞాపింపఁబడిన; కర్మణి=కార్యము; కార్యే=చేయఁదగినది కాఁగా; యః=ఎవ్వఁడు; పూర్వకార్యవిరోధేన= మొదటికార్యముయొక్క విరోధము లేకుండుటచేత; బహూన్యపి=అనేకములయిన కార్యములను; సాధయేత్=సాధించునో; సః= అతఁడు; కార్యం=పనిని; కర్తుం=చేయుటకు; అర్హతి=తగును.

ఎవ్వఁడు, తనకాజ్ఞాపింపఁబడిన కార్యమును నెఱవేర్చి, యందుకువిరోధము లేకుండునట్లు, ఇతరంబులఁబెక్కు కార్యంబులను సాధించునో, అతండె, కార్యంబు సేయఁదగినవాఁడు. అని, తాత్పర్యము,

న హ్యేక స్సాధకో హేతు స్స్వల్పస్యాపీహ కర్మణః
యో హ్యర్థం బహుధా వేద స సమర్థోఽర్థసాధనే. ౬

టీక॥ ఏకః=ఒక్కటైన; హేతుః=కారణము; ఇహ=ఇచ్చట; స్వల్పస్య=కొంచెమయిన; కర్మణోపి= కార్యముయొక్కయు; సాధకః=సాధించునది; నహి=కాదుగదా! యః = ఎవ్వఁడు; అర్థం=కార్యమును; బహుధా=నానావిధములుగా; వేద=ఎఱుంగునో; సః=అతండు; అర్థసాధనే = కార్యముసాధించుటయందు; సమర్థోహి=సమర్థుఁడుగదా!

ఒకటికారణమును మాత్రముగాని, స్వల్పకార్యమునైనను సాధింపనలవిగాదు; ఇంకమహాకార్యమునెట్లుసాధింపవచ్చును? కావున, నేను సీతంజూచుటమాత్రముననె యేమిఫలము? ఎవ్వఁడు కార్యమునకు సాధకములయిన నానావిధోపాయంబుల నెఱుంగునో, యతండె కార్యంబుసాధింపంగలండుగాని, యితరునకలవిగాదు. అని, తాత్పర్యము.

స ౪౧

ఇహైవ తావ త్కృతనిశ్చయో హ్యహమ్
యది వ్రజేయం ప్లవగేశ్వరాలయమ్
పరాత్మసమ్మర్దవిశేషతత్త్వవి
త్తతః కృతం స్యాన్మమ భర్తృశాసనమ్. ౭

టీక॥ అహం = నేను; ఇహైవ తావత్ = ఇచ్చటనే; కృతనిశ్చయః = చేయఁబడినని శ్చయముగలవాఁడనై; పరాత్మసమ్మర్దవిశేషతత్త్వవిత్ = శత్రువులయొక్కయు మనవారలయొక్కయు యుద్ధమునందలి తారతమ్యముయొక్క నిశ్చయమునెఱింగిన వాఁడనై; ప్లవగేశ్వరాలయం = వానరులకుఁ బ్రభుండైనసుగ్రీవుని పట్టణమగు కిష్కింధను; వ్రజేయం యది = పొందుదునేని; తతః = అందువలన; మమ = నాయొక్క; భర్తృశాసనం = ప్రభువుయొక్క యాజ్ఞ; కృతం = చేయఁబడినది; స్యాద్ధి = అగును గదా!

నేనిచ్చటనే రావణునిబలాబలంబుల నిశ్చయించుకొని, రాక్షసులయందును మనవానరులయందునుంగల యుద్ధమునందలి తారతమ్యముం దెలిసికొని, కిష్కింధకుఁ బోవుదునేని, యప్పుడు, నేను సుగ్రీవునియాజ్ఞను జక్కఁగా నెఱవేర్చినవాఁడ నగుదును. అని, తాత్పర్యము.

కథన్ను ఖల్వద్య భవేత్సుఖాగతం
ప్రసహ్య యుద్ధం మమ రాక్షసైస్సహ
తథైవ ఖల్వాత్మబలంచ సారవ
త్సమానయేన్మాంచ రణే దశాననః. ౮

టీక॥ అద్య = ఇప్పుడు; మమ = నాకు; రాక్షసైస్సహ = రాక్షసులతోఁగూడ; ప్రసహ్య = బలాత్కారముచేత; యుద్ధం = పోరు; కథన్నుఖలు = ఎట్లు; సుఖాగతం = అనాయాసముగాఁ బ్రాప్తించినది; భవేత్ = అగును. సః = ఆ; దశాననః = రావణుఁడు; తథైవ = అట్లే; ఆత్మబలంచ = తనసైన్యమును; మాంచ = నన్నును; రణే = యుద్ధమునందు; సారవత్ = సారముగల్గినట్లుగా; మానయేత్ఖలు = విమర్శించుకొనును గదా!

ఇప్పుడు, నాకు రాక్షసులతోడ, యుద్ధం బనాయాసంబుగా నేయుపాయంబునం గలుగును? అట్లు యుద్ధంబు చేసిన నే

గదా! రావణుండు, తనవారిబలంబును, నాబలంబును, జక్కఁగాఁ దెలిసికొను ను. అని, తాత్పర్యము.

తత స్సమాసాద్య రణే దశాననమ్
సమంత్రివర్గం సబల ప్రయాయినమ్
హృది స్థితం తస్య మతం బలంచ వై
సుఖేన మత్వాహ మితః పునర్వ్రజే. ౯

టీక॥ అహం=నేను; తతః= అటు పిమ్మట; సమంత్రివర్గం = మంత్రుల సమూహముతోఁ గూడినవాఁడును; సబలప్రయాయినం= సేనాధిపతులతోఁ గూడినవాఁడునగు; దశాననం= రావణుని; రణే=యుద్ధమునందు; సమాసాద్య= పొంది; తస్య= ఆరావణునియొక్క; హృది= మనసునందు; స్థితం= ఉన్న; మతం=అభిప్రాయమును; బలం చ=బలమును "వై" అనునది పాదపూరణార్థము); సుఖేన= సుఖముచేత; మత్వా=తెలిసికొని; ఇతః=ఇచ్చటనుండి; పునః=మఱల; వ్రజే= పోయెదను.

నేనంతయుద్ధంబున మంత్రిసమూహంబుతోను సేనాధిపతులతోనుం గూడియున్న రావణునెదుర్కొని, నతని మనంబునందు భావంబును, అతనిబలంబును, సుఖంబుగాఁ దెలిసికొని, యిచ్చటనుండిపోయెదను.

అని, తాత్పర్యము.

ఇద మస్య నృశంసస్య నందనోపమ ముత్తమమ్
వనం నేత్రమనఃకాంతం నానాద్రుమలతాయుతమ్. ౧౦

టీక॥ నృశంసస్య= క్రూరుండగు; అస్య=ఈరావణునియొక్క; ఇదం = ఈ; వనం=అశోకవనము ; నందనోపమం=నందనవనముతోఁబోల్కగలది. ఉత్తమం = శ్రేష్ఠమయినది. నేత్రమనఃకాంతం= కండ్లకునుమనసునకునింపయినది. నానాద్రుమలతాయుతం = నానావిధములయినవృక్షములతోనుదీఁగెలతోనుగూడినది.

క్రూరుండగునీరావణునిదైనయీయశోకవనంబుత్తమంబయి, కండ్లకును మనంబునకును సంతోషంబునొసఁగుచు, నా

నావిధంబులగు వృక్షంబులును దీఁగెలు నుగలిగి, నందనవనంబుపగిదిం, బూపట్టు చున్నది. అని, తాత్పర్యము.

ఇదం విధ్వంసయిష్యామి శుష్కం వన మివా నలః
అస్మిన్ భగ్నే తతః కోపం కరిష్యతి దశాననః. ౧౧

టీక॥అహం(అధ్యాహృతము)=నేను; ఇదం=ఈయశోకవనమును ; అనలః=అగ్నిహోత్రుఁడు; శుష్కం= ఎండిన; వనమివ=అడవినివలె; విధ్వంసయిష్యామి=నశింపఁజేసెదను. అస్మిన్=ఈ యశోకవనము; భగ్నే=విఱువఁబడఁగా; తతః=అటుపిమ్మట ; దశాననః= రావణుఁడు; కోపం=కోపమును ; కరిష్యతి=చేయఁగలఁడు.

అగ్నిహోత్రుం డెండిన యడవినే చుఁచందంబున, నేనీయశోకవనంబును విఱిచెదను; నేనుదీనిని విఱువఁగా నే, రావణునకు, నాపైఁగోపంబువచ్చును.

అని, తాత్పర్యము.

తతో మహ త్సాశ్వమహారథద్విపం
బలం సమాదేక్ష్యతి రాక్షసాధిపః
త్రిశూలకాలాయసపట్టిసాయుధం
తతో మహ ద్యుద్ధ మిదం భవిష్యతి. ౧౨

టీక॥తతః=అటుపిమ్మట; రాక్షసాధిపః=రాక్షసులకుఁ బ్రభుండైన రావణుండు; మహత్=గొప్పదియును; సాశ్వమహారథద్విపం=గుఱ్ఱములతోను గొప్పరథములతోనుఏనుంగులతోనుం గూడినదియును ; త్రిశూలకాలాయసపట్టిసాయుధం = త్రిశూలంబులును ఇనుముతోఁజేయఁబడిన పట్టిసములను నాయుధములుగా యాయుధములు గాఁగలది యునగు; బలం=సేనను; సమాదేక్ష్యతి=ఆజ్ఞాపించును. తతః = అటుపిమ్మట; ఇదం=ఈ, నాచేఁగోరఁబడినట్టియు నుట; మహత్=గొప్పదైన; యుద్ధం= పోరు; భవిష్యతి=కాఁగలదు.

అంతట, రాక్షసేశ్వరుండగు రావణుండు, గుఱ్ఱములతోను రథములతోనుగజంబులతోనుం గూడి త్రిశూలంబులు నినుపపట్టిసంబులును దాల్చియుండునట్టి,

గొప్ప సేనం బంపును; అంత, నాకును వారికిని నేను గోరినట్లు గొప్ప యుద్ధంబు గలుగును. అని, తాత్పర్యము.

అహం తు తై స్సంయతి చండవిక్రమై
స్సమేత్య రక్షోభి రసహ్యవిక్రమః
నిహత్య త ద్రావణచోదితం బలం
సుఖం గమిష్యామి కపీశ్వరాలయమ్. ౧౩

టీక॥ అసహ్యవిక్రమః= ఓర్వరాని పరాక్రమంబుగల; అహంతు= నేనును; చండవిక్రమైః=భయంకరమగు పరాక్రమముగల; తైః=ఆ; రక్షోభిః= రాక్షసులతో; సమేత్య=చేరి; సంయతి= యుద్ధమునందు; రావణచోదితం = రావణునిచేఁ జంపఁబడిన; తత్=ఆ; బలం= సేనను; నిహత్య=చంపి; సుఖం= సుఖముగా; కపీశ్వరాలయం= వానరులకధిపుఁడైన సుగ్రీవుని పట్టణమగు కిష్కింధను; గమిష్యామి=పొందెదను.

ఓర్వఁగూడని పరాక్రమంబుగల నేనును, భయంకర పరాక్రమశాలులగు నా రాక్షసుల నెదిరించి, యుద్ధంబున, నా రావణుండు పంపిన సేన నంతయుఁ జంపి, సుఖంబుగాఁ గిష్కింధకుఁ, బోయెదను. అని, హనుమంతుం, డాలోచించెను. అని, తాత్పర్యము.

తతో మారుతవ త్క్రుద్ధో మారుతి ర్భీమవిక్రమః
ఊరువేగేన మహతా ద్రుమాన్ క్షేప్తు మథారభత్. ౧౪

టీక॥ తతః=అందువలన; అథ= అటుపిమ్మట; భీమవిక్రమః=భయంకరంబగు పరాక్రమముగల; మారుతిః= వాయుదేవునికుమారుండగు హనుమంతుఁడు; క్రుద్ధః = కోపమునొందినవాఁడై; మారుతవత్=వాయువువలె ; మహతా= పెద్దదైన; ఊరువేగేన= తొడలవేగముచేత; ద్రుమాన్= చెట్లను ; క్షేప్తుం = పడఁద్రోయుటకు ; ఆరభత్ =ప్రారంభించెను.

ఆప్రకారముగ నాలోచించి , భయంకరంబగు పరాక్రమముగల వాయుపుత్త్రుండగు హనుమంతుండు, కోపంబు వహించి, వాయుదేవుని భంగిన పారంబ

గునూరు వేగంబున, వృక్షంబులంబడఁ ద్రోయనారంభించెను.

అని, తాత్పర్యము.

తతస్తు హనుమా న్వీరో బభంజ ప్రమదావనమ్
మత్తద్విజసమాఘుష్టం నానాద్రుమలతాయుతమ్. ౧౫

టీక॥ తతస్తు = అంతను; వీరః = పరాక్రమశాలియగు; హనుమాన్ = హనుమంతుఁడు; మత్తద్విజసమాఘుష్టం = మదించినపక్షులచేతఘ్వనింపఁజేయఁబడినదియు; నానాద్రుమలతాయుతం = నానావిధంబులగువృక్షంబులతోను దీఁగెలతోనుంగూడినదియునగు; ప్రమదావనం = అంతఃపురవనమును; బభంజ = విఱిచెను.

అంతఁ, బరాక్రమవంతుండగుహనుమంతుండు, మదించినమనోహరంబుగాఁ గూయుచున్న పక్షులతోనొప్పుచు నానావిధంబులగు వృక్షములును దీఁగెలునుంగలిగియున్న, యంతఃపురవనమును, విఱిచెను. అని, తాత్పర్యము.

తద్వనం మథితై ర్వృక్షై ర్భిన్నైశ్చ సలిలాశయైః
చూర్ణితైః పర్వతాగ్రైశ్చ బభూవా ప్రియదర్శనమ్. ౧౬

టీక॥ తత్ = ఆ; వనం = అశోకవనము; మథితైః = విఱువఁబడిన; వృక్షైః = చెట్లచేతను; భిన్నైః = పగిలిన; సలిలాశయైశ్చ = కొలంకులచేతను; చూర్ణితైః = చూర్ణముగాఁజేయఁబడిన; పర్వతాగ్రైశ్చ = పర్వతశిఖరంబులచేతను; అప్రియదర్శనం = సంతోషకరంబుగానిచూచుటగలది; బభూవ = ఆయెను.

అట్లువృక్షంబులువిఱువఁబడియుఁగొలంకులు పగులఁగొట్టఁబడియుఁ గ్రీడాపర్వతశిఖరంబులు చూర్ణితంబులయ్యునుండుటంజేసి, యాయశోకవనంబు, వికృతంబుగాఁగానంబడియెను.

అని, తాత్పర్యము.

నానాశకుంతవిరుతైః ప్రభిన్నైస్సలిలాశయైః
తామ్రైః కిసలయైః క్లాంతైః క్లాంతద్రుమలతాయుతమ్. ౧౭
నబభౌ తద్వనం తత్ర దావానలహతం యథా

టీక॥ తత్ర = ఆలంకయందు ; క్లాంతద్రుమలతాయుతం = వాడినవృక్షములు

తోనుతీఁగెలతోనుగూడిన; తత్ = ఆ; వనం = అశోకవనము; నానాశకుంతవిరుతైః = నానావిధములయిన పక్షులధ్వనులచేతను; ప్రభిన్నైః = పగిలిన; సశిలాశయైః = కొలఁకులచేతను; క్లాంతైః = వాడిన; తామ్రైః = ఎఱ్ఱని; కిసలయైః = చిగురులచేత; దావానలహతంయథా = దావాగ్నిచేతఁగొట్టఁబడినదివలె; నబభౌ = ప్రకాశింపదయ్యె.

అచ్చట, వృక్షములునుదీఁగెలునుజీగురులునువాడియుండుటచేతను, బక్షులుభయంబున నానావిధధ్వనులు సేయుటచేతనుగొలంకులన్నియునాశమునొందియుండుటవలనను, ఆయశోకవనంబు, దావానలంబున దగ్ధమయినట్లు, ఎంతమాత్రముప్రకాశములేకుండెను.

అని, తాత్పర్యము.

వ్యాకులావరణా రేజు ర్విహ్వలా ఇవ తా లతాః. ౧౮

టీక॥ తాః = ఆ; లతాః = తీఁగెలు; వ్యాకులావరణాః = కలఁగినప్రాకుమానులుగలవై; విహ్వలాఇవ = మిక్కిలియు దుఃఖంబునొందిన స్త్రీలుంబోలె; రేజుః = ప్రకాశించినవి.

అచ్చటితీఁగెలు, ప్రాకుమానులువిఱిగిపడియుండుటంజేసి, మిక్కిలియు దుఃఖంబునొందినస్త్రీలపోలిక౯, జూపట్టుచుండినవి. అని, తాత్పర్యము.

లతాగృహై శ్చిత్రగృహైశ్చ నాశితై
ర్మహోరగై ర్వ్యాళమృగైశ్చ నిర్ధుతైః
శిలాగృహై రున్మథితై స్తథా గృహైః
ప్రణష్టరూపం త దభూ న్మహ ద్వనమ్. ౧౯

టీక॥ మహత్ = గొప్పదైన; తత్ = ఆ; వనం = అశోకవనము; నాశితైః = నశింపఁజేయఁబడిన; లతాగృహైశ్చ = తీఁగెలతోఁజేయఁబడినయిండ్లచేతను; చిత్రగృహైశ్చ = నానావర్ణములయిన గృహములచేతను; నిర్ధుతైః = ఎగురగొట్టఁబడిన; మహోరగైః = పెద్దసర్పములచేతను; వ్యాళమృగైశ్చ = క్రూరమృగములచేతను; ఉన్మథితైః = పగులఁగొట్టఁబడిన; శిలాగృహైః = ఱాతియిండ్ల

చేతను; తథా=అట్లు; గృహైః=ఇండ్లచేతను; ప్రణష్టరూపం=నశించిన సౌందర్యముగలది; అభూత్=అయ్యెను.

లతాగృహంబులును జిత్రగృహంబులు నాశంబునొందియు, మహాసర్పంబులును దుష్టమృగంబులును ఎల్లెడలం బడవేయcబడియు, శిలాగృహంబులును సాధారణంబులగు గృహంబులును బగులcగొట్టcబడియునుండుటవలన, నాయశోకవనంబు, ఎంతమాత్రము సౌందర్యంబు లేకుండెను. అని, తాత్పర్యము.

సా విహ్వలా శోకలతాప్రతానా
వనస్థలీ శోకలతాప్రతానా
జాతా దశాస్యప్రమదావనస్య
కపే ర్బలా ద్ధి ప్రమదావనస్య. ౨౦

టీక॥ దశాస్యప్రమదావనస్య=రావణుని స్త్రీలకు రక్షకమయిన; ప్రమదావనస్య=అంతఃపురవనము యొక్క; అశోకలతాప్రతానా = దుఃఖము లేని తీcగెలయొక్క సమూహముగల; సా=ఆ, వనస్థలీ=వనభూమి; కపేః=హనుమంతుని యొక్క; బలాత్=బలమువలన; విహ్వలా=కలcగినదై; శోకలతాప్రతానా = దుఃఖముతోcగూడిన తీcగెలసమూహముగలది; జాతాహి=అయినదిగదా!

రావణుని భార్యలకు సమస్తభోగంబులొసంగుచు నెంతమాత్రము బాధలేకుండుటవలన దుఃఖంబు నొందకుండినది తీcగెలనొప్పుచున్నయాయంతఃపుర వనము హనుమంతునిచే విఱువcబడియుండుటవలన అందలి తీcగెలన్నియు, దుఃఖంబు నొందినట్లు చూపట్టుచుండెను.

అని, తాత్పర్యము

స తస్య కృత్వా ర్థపతే ర్మహాకపి
ర్మహ ద్వ్యళీకం మనసో మహాత్మనః
యుయుత్సు రేకో బహుభి ర్మహాబలై
శ్శ్రియా జ్వలంస్తోరణ మాస్థితః కపిః. ౨౧

టీక॥ సః=ఆ; మహాకపిః = పెద్దకోతియయిన; కపిః= హనుమంతుcడు; మ

| | |
|---|---|
| హాత్మనః= అధికమయినపరాక్రమము గల; అర్థపతేః = ధనమునకుఁబ్రభు వయిన;తస్య = ఆరావణునియొక్క; మనసః=మనసునకు;మహత్ = అధిక మయిన; వ్యళీకం=అప్రియమును ; కృత్వా=చేసి; ఏకః= ఒక్కఁడై;మహాబలైః=అధికమయినబలముగల ; బహుభిః= పెక్కు రాక్షసులతో; యుయుత్సుః= యుద్ధముసేయఁగోరినవాఁడై; శ్రియా=కాంతిచేత;జ్వలన్ =ప్రకాశిం | చుచు;తోరణం= వెలుపలిద్వారమును; ఆస్థితః=అధిష్ఠించెను. ఆహనుమంతుండట్లు, మహాపరాక్రమశాలియు ధనవంతుండునగురావణునిమనంబునకుఁగొప్పయప్రియంబుగావించి, తానొక్కఁడై, మహాబలశాలులగుపెక్కురాక్షసులతోయుద్ధంబుసేయసమకట్టి,కాంతిచేజరిల్లుచు, నాయశోకవనంబువెలుపలి ద్వారంబున, నుండెను. అని,తాత్పర్యము. |

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
సుందరకాండే,ఏకచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,సుందరకాండైకచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః
ద్విచత్వారింశసర్గప్రారంభః.

తతః పక్షినినాదేన వృక్షభంగస్వనేనచ
బభూవు స్త్రాససంభ్రాంతా స్సర్వే లంకానివాసినః. ౧

| | |
|---|---|
| టీక॥ తతః=అటుపిమ్మట; లంకానివాసినః=లంకయందుండువారలు; సర్వే=అందఱును; పక్షినినాదేన = పక్షులధ్వనిచేతను ; వృక్షభంగస్వనేనచ= వృక్షములవిఱచుటయొక్కధ్వనిచేతను; త్రాససంభ్రాంతాః= భయంబుచేఁదొట్రుపాటుగలవారలు ; బభూవుః=అయిరి. | |




అంత, లంకలోనుండువారందఱును, బక్షులధ్వనులను, వృక్షంబులవిఱుచుశబ్దంబులను, విని, భయంబునుదొట్రుపాటునుం, బొందిరి.

అని, తాత్పర్యము.

విద్రుతాశ్చ భయత్రస్తా వినేదు ర్మృగపక్షిణః

టీక॥ మృగపక్షిణః=మృగంబులును బక్షులును; భయత్రస్తాః = భయముచేత భయపడినవై ; విద్రుతాశ్చ= పాఱినవైయును; వినేదుః=అఱచినవి.

మృగంబులునుబక్షులును, మహాభయంబునొంది, నలుదెసలకుంబఱచుచు, నఱచినవి. అని, తాత్పర్యము.

రక్షసాంచ నిమిత్తాని క్రూరాణి ప్రతిపేదిరే. ౨

టీక॥ రక్షసాం=రాక్షసులకు; క్రూరాణి=భయంకరములయిన; నిమిత్తానిచ=శకునములును, ప్రతిపేదిరే=పొందినవి.

అంత, రాక్షసులకునాశంబుగల్గుననిసూచించునట్టిభయంకరంబులయినయశుభనిమిత్తంబులును, దోఁచినవి.

అని, తాత్పర్యము.

తతో గతాయాం నిద్రాయాం రాక్షస్యో వికృతాననాః
తద్వనం దదృశు ర్భగ్నం తంచ వీరం మహాకపిమ్. ౩

టీక॥ తతః=అటుపిమ్మట ; నిద్రాయాం=నిదుర; గతాయాం=పోఁగా ; వికృతాననాః = వికారముతోఁగూడినముఖముగల; రాక్షస్యః= రాక్షసస్త్రీలు; భగ్నం= నాశమునొందిన; తత్ = ఆ;వనం=ఆయశోకవనమును;వీరం=పరాక్రమశాలియయిన; తం=ఆ; మహాకపించ= పెద్దకోఁతియయినహనుమంతునిః దదృశుః=చూచిరి.

అంత,వికృతంబులగుముఖంబులుగలరాక్షసస్త్రీలు , అర్ధ్వనికినిద్రమేల్కొని, నాశంబునొందియున్నయాయశోకవనంబును , మహాకాయుండై యున్నపరాక్రమవంతుండగుహనుమంతునిం, జూచిరి.అని,తాత్పర్యము.




స తా దృష్ట్వా మహాబాహు ర్మహాసత్త్వో మహాబలః
చకార సుమహ ద్రూపం రాక్షసీనాం భయావహమ్. ౪

టీక॥ మహాబాహుః = పెద్దచేతులుగలవాఁడును; మహాసత్త్వః= అధికమయినపరాక్రమముగలవాఁడును; మహాబలః = అధికమయినబలముగలవాఁడునగు; సః=ఆహనుమంతుఁడు; తాః= ఆరాక్షసస్త్రీలను ; దృష్ట్వా=చూచి ; రాక్షసీనాం=రాక్షసస్త్రీలకు; భయావహం = వెఱపుగల్గించునట్టి ; సుమహత్ = మిక్కిలియుఁబెద్దదైన; రూపం=దేహమును; చకార=చేసెను.

మహాబాహుండును మహాపరాక్రమశాలియుమహాభుజుండునగు నాహనుమంతుడు, ఆరాక్షసస్త్రీలు తన్నుఁజూచుటంజూచి, వారలకుభయంబుగల్గునట్లు, భయంకరమయినగొప్పదేహముదాల్చెను.

అని, తాత్పర్యము.

తత స్తం గిరిసంకాశ మతికాయం మహాబలమ్
రాక్షస్యో వానరం దృష్ట్వా ప్రపచ్ఛు ర్జనకాత్మజామ్. ౫

టీక॥తతః = అటుపిమ్మట; రాక్షస్యః=రాక్షసస్త్రీలు; అతికాయం=పెద్దమేనుగలవాఁడును; గిరిసంకాశం=పర్వతముతోసమానుఁడైనవాఁడును; మహాబలం= అధికమయినబలముగలవాఁడునగు; తం=ఆ; వానరం=హనుమంతుని; దృష్ట్వా=చూచి; జనకాత్మజాం=జనకమహారాజుకూఁతురయినసీతాదేవిని; పప్రచ్ఛుః=అడిగిరి.

అంత, నారాక్షసస్త్రీలు, పర్వతంబంతటిమహాదేహంబు దాల్చియున్నమహాబలుండగునాహనుమంతుంజూచి, సీతాదేవినిట్లనిపృచ్ఛించిరి.

అని, తాత్పర్యము.

కోయం కస్య కుతో వాయం కిన్నిమిత్త మిహాగతః
కథం త్వయా సహానేన సంవాదః కృత ఇత్యుత. ౬

టీక॥అయం=ఇతఁడు; కః = ఎవ్వఁడు? కస్య=ఎవ్వనివాఁడు? అయం=ఇతఁ

దుఃకుతోవా = ఎచ్చటనుండి; కిన్నిమి త్తం=ఏప్రయోజనమునుగూర్చి; ఇహ= ఇచ్చటికి; ఆగతః=వచ్చినాఁడు? కథము త=ఎట్లు; అనేన=ఇతనిచేత; త్వయాస హ=నీతోఁగూడ; సంవాదః=సంభాష ణము; కృతః=చేయఁబడినది? ఇతి=అని; పప్రచ్ఛుః(అధ్యాహృతము)=అడిగిరి.

ఇతండెవ్వఁడు? ఎవ్వఁడుపంపఁగా వచ్చినాఁడు? ఎచ్చటనుండివచ్చినాఁడు? ఇచ్చటికెందుకువచ్చినాఁడు? నీతోనెం దుకుసంభాషణముచేసినాఁడు?

అని, తాత్పర్యము.

ఆచక్ష్వ నో విశాలాక్షి మాభూత్తే సుభగే భయమ్
సంవాద మసితాపాంగే త్వయా కిం కృతవా నయమ్. ౭

టీక॥ విశాలాక్షి= పెద్దకండ్లుగల; సుభగే= మనోహరురాలవగుసీతాదే వీ! నః=మాకు; ఆచక్ష్వ = చెప్పుము. తే=నీకు; భయం=వెఱవు; మాభూత్= కలుగకుండుఁగాక. అసితాపాంగే= న ల్లనికడకండ్లుగలసీతాదేవీ! అయం= ఇ తండు; త్వయా=నీతోడ; కిం=దేనిఁగూ ర్చి; సంవాదం=సంభాషణమును ; కృ తవాన్=చేసినాఁడు?

నల్లనికడకండ్లుగలదానవు పెద్దకండ్లు గలదానవు మనోహరురాలవగు సీతా దేవీ! ఈవానరుండునీతోనేమిమాటలా డినాఁడు? నీవుభయపడవలదు; మాకుస విస్తరముగాఁజెప్పుము. అని, రాక్షసు లుసీతాదేవి,నడిగిరి.

అని, తాత్పర్యము.

అథా బ్రవీ న్మహాసాధ్వీ సీతా సర్వాంగసుందరీ

టీక॥ అథ=అటుపిమ్మట; మహాసా ధ్వీ=పూజ్యయయినపతివ్రతయును; స ర్వాంగసుందరీ=సమస్తములయిన య వయవములందు సౌందర్యముగలదియు నగు; సీతా=సీతాదేవి; అబ్రవీత్ = ప లికెను.

అంతఁ,బతివ్రతలలో నుత్తమురా లును సమస్తావయవంబులందునుసౌంద ర్యంబుగలదియునగు,సీతాదేవి, యిట్ల ని,చెప్పెను. అని, తాత్పర్యము.

రక్షసాం భీమరూపాణాం విజ్ఞానే మమ కా గతిః. ౮

టీక॥ భీమరూపాణాం=భయంకరములయినరూపములుగల; రక్షసాం=రాక్షసులయొక్క; విజ్ఞానే=ఎఱుంగుటయందు; మమ=నాకు; కా=ఏమి; గతిః=ఉపాయము?

భయంకరంబులగు నానావిధ రూపంబులుధరించునట్టి రాక్షసులనెఱుంగుటకుశక్తినాకులేదు.

అని, తాత్పర్యము.

యూయ మేవాభిజానీత యోఽయం యద్వా కరిష్యతి
అహి రేవ హ్యహేః పాదా న్విజానాతి న సంశయః. ౯

టీక॥అయం=ఇతండు; యః=ఎవ్వఁడో; యద్వా=దేనిని; కరిష్యతి=చేయునో, తత్ (అధ్యాహృతము) ఆసమాచారమును; యూయ మేవ=మీరలె; అభిజానీత=ఎఱుంగుదురు, అహేః= సర్పముయొక్క; పాదాన్=పాదములను; అహి రేవ=సర్ప మే; విజానాతి= ఎఱుంగును. సంశయః=సందేహము; న=లేదు.

పాముపాదంబులు పామునకే దెలియును గాని మఱి యెవ్వరికిని దెలియదు; అట్లుమీరురాక్షసులుగావున, రాక్షసుల సంగతిమీకే దెలియును; కావున,నీవానరుండెవ్వఁడో యేమిసేయునో యాసమాచారమంతయుమీకే దెలియును; ఇందుసందియములేదు.

అని, తాత్పర్యము.

అహ మప్యస్య భీతాస్మి నైనం జానామి కో న్వయమ్

టీక॥అహమపి=నేనును; అస్య=ఈహనుమంతునకు; భీతా= భయపడినదానను; అస్మి=అగుచున్నాను. ఏనం=ఇతనిని; నజానామి=ఎఱుంగను. అయం=ఇతండు; కోను=ఎవ్వఁడు?

నేనును, ఇతనింజూచి, భయపడియున్నాను; ఇతఁడెవ్వఁడో నాకుం దెలియలేదు; ఇతం డెవ్వఁడు? మీరలే చెప్పఁడు.

అని, తాత్పర్యము.

వేద్మి రాక్షస మేవైనం కామరూపిణ మాగతమ్. ౧౦

టీక॥అహం(అధ్యాహృతము)= నేను; ఏనం=ఈవానరుని; ఆగతం= వచ్చి

న; కామరూపిణం= ఇచ్ఛాధీనంబగురూపముగల; రాక్షసమేవ= రాక్షసునిగానే; వేద్మి= తెలిసికొనుచున్నాను.

నాకీవానరునింజూడఁగా, నిచ్ఛకువచ్చినరూపంబు దాల్పంజాలినరాక్షసుండెయిట్లు వానరరూపంబుదాల్చి వచ్చియుండుననితోఁచుచున్నది. అనిసీతాదేవి, రాక్షసస్త్రీలతోఁజెప్పినది.

అని, తాత్పర్యము.

వైదేహ్యా వచనం శ్రుత్వా రాక్షస్యో విద్రుతా దిశః
స్థితాః కాశ్చి ద్గతాః కాశ్చి ద్రావణాయ నివేదితుమ్. ౧౧

టీక॥ రాక్షస్యః= రాక్షసస్త్రీలు; వైదేహ్యాః= సీతాదేవియొక్క; వచనం= మాటను; శ్రుత్వా= విని; దిశః= దిక్కులనుగూర్చి; విద్రుతాః = పాఱిరి. కాశ్చిత్= కొందఱు; స్థితాః= ఉండిరి. కాశ్చిత్= కొందఱు; రావణాయ= రావణునికొఱకు; నివేదితుం= చెప్పుటకు; గతాః= పోయిరి.

సీతాదేవిచెప్పినమాటనువిని, యారాక్షసస్త్రీలుభయంబున దిక్కులకుం బఱచిరి. కొందఱు సీతారక్షణార్థమయి యచ్చటనుండిరి; కొందఱు ఈవృత్తాంతమునురావణునకుం దెలుపఁ బోయిరి.

అని, తాత్పర్యము.

రావణస్య సమీపే తు రాక్షస్యో వికృతాననాః
విరూపం వానరం భీమ మాఖ్యాతు ముపచక్రముః. ౧౨

టీక॥ వికృతాననాః= వికారముతోఁగూడినముఖముగల; రాక్షస్యః= రాక్షసస్త్రీలు; రావణస్య= రావణునియొక్క; సమీపేతు= సమీపమునందే; విరూపం= పెద్దదేహముగలవాఁడును; భీమం= భయంకరుండునగు; వానరం= హనుమంతుని; ఆఖ్యాతుం= చెప్పుటకు; ఉపచక్రముః= ఆరంభించిరి.

వికృతంబులగుముఖంబులుగలరాక్షసస్త్రీలు, రావణునిసమీపంబునకుఁబోయి, మహాకాయుండునుభయంకరుండునగు హనుమంతునిం గూర్చి చెప్పసాగిరి. అని, తాత్పర్యము.

అశోకవనికామధ్యే రాజన్ భీమవపుః కపిః

సీతయా కృతసంవాద స్తిష్ఠ త్యమితవిక్రమః. ౧౩

టీక॥ రాజన్ = రావణుఁడా! భీమవపుః= భయంకరమయినదేహముగల వాఁడును; అమితవిక్రమః= కొలఁతలేనిపరాక్రమంబుగలవాఁడునగు; కపిః= వానరుఁడు; సీతయా= సీతతో ; కృతసంవాదః= చేయఁబడినసంభాషణము గలవాఁడై; అశోకవనికామధ్యే= అశోకవనమునడుమను;తిష్ఠతి= ఉన్నాఁడు.

రావణుఁడా!భయంకరంబయినదేహముగలవాఁడునుగొలందిలేనిపరాక్రమంబుగలవాఁడునగు వానరుండొకఁడు,సీతతోసంభాషించి,యశోకవనంబు నడుమనున్నాఁడు. అని, తాత్పర్యము.

నచ తం జానకీ సీతా హరిం హరిణలోచనా
అస్మాభి ర్బహుధా పృష్టా నివేదయితు మిచ్ఛతి. ౧౪

టీక॥హరిణలోచనా = జింకయొక్కకండ్లవంటికండ్లుగలదియును;జానకీ=జనకునికొమార్తెయునగు;సీతాచ=సీతాదేవియు;అస్మాభిః,మాచేత;బహుధా=నానావిధంబులను;పృష్టా=అడఁగఁబడినదై;తం=ఆవానరుని; నివేదయితుం=తెలుపుటకు;నేచ్ఛతి=కోరదు.

జింకకన్నులవంటికండ్లుగలదియుజనకమహారాజపుత్రియునగుసీత, మేము నానావిధంబులనడిగినను , ఆవానరుని సంగతింజెప్పకున్నది.

అని, తాత్పర్యము.

వాసవస్య భవే ద్దూతో దూతో వై శ్రవణస్యవా
ప్రేషితోవాపి రామేణ సీతాన్వేషణకాంక్షయా. ౧౫

టీక॥ సః (అధ్యాహృతము)= ఆ వానరుఁడు;వాసవస్య = దేవేంద్రుని యొక్క; దూతః=దూత; భవేద్వా= అగునోయేమో! వైశ్రవణస్య= కుబేరునియొక్క; దూతోవా= దూతయో! రామేణ=రామునిచేత ; సీతాన్వేషణకాంక్షయా=సీతయొక్క వెదకుటయందిచ్ఛచేత; ప్రేషితోవాపి = పంపఁబడినవాఁడో!

ఆవానరుండు,దేవేంద్రుండుపంపఁగావచ్చినదూతయో! కుబేరుని దూతయో! అట్లుగాక,రాముండు, సీతనువె

దకుటకై పంపినదూతయో! యేమియుఁ దెలియకున్నది. అని, తాత్పర్యము.

తేన త్వద్భుతరూపేణ యత్తత్తవ మనోహరమ్
నానామృగగణాకీర్ణం ప్రమృష్టం ప్రమదావనమ్. ౧౬

టీక॥ తవ= నీయొక్క ; మనోహరం=సుందరమయినదియును; నానామృగగణాకీర్ణం = నానావిధములయిన మృగములచేతవ్యాపింపఁ బడినదియునగు; ప్రమదావనం=అంతఃపురవనము; యత్ (అస్తి)= ఏదిగలదో; తత్=అది; అద్భుతరూపేణ = ఆశ్చర్యకరంబగుదేహముగల; తేనతు=అతనిచేత నే; ప్రమృష్టం=నశింపఁజేయఁబడినది.

నానావిధంబులగు మృగంబులతో నొప్పుచుమనోహరంబై యున్న నీయంతఃపురవనంబంతయు మహాకాయుండగు వానరుండుతన దేహంబునకుఁజూపరులచ్చెరువొంద, నాశంబునొందించెను. అని, తాత్పర్యము.

న తత్ర కశ్చి దుద్దేశో య స్తేన నవినాశితః

టీక॥ యః=ఏది; తేన= ఆవానరునిచేత; నవినాశితః= నశింపఁజేయఁబడలేదో;సః (అధ్యాహృతము)=అట్టి; ఉద్దేశః=ప్రదేశము;కశ్చిత్=ఒకానొకటియును; తత్ర=అచ్చట; న=లేదు.

ఆయంతఃపురంబున, నతండు, నాశంబునొందింపని ప్రదేశమొకటియును లేదు. అని, తాత్పర్యము.

యత్ర సా జానకీ సీతా స తేన నవినాశితః. ౧౭

టీక॥ యత్ర=ఎచ్చట; జానకీ=జనకునికొమార్తెయగు; సా = ఆ; సీతా=సీతాదేవి; అస్తి= (అధ్యాహృతము)= ఉన్నదో; సః= ఆవృక్షము ; తేన=ఆవానరునిచేత; నవినాశితః= నశింపఁజేయఁబడదయ్యె.

జనకమహారాజు కొమార్తెయగు సీతాదేవియున్న వృక్షము మాత్రము ఆవానరుండు, విఱువఁడయ్యె-
అని, తాత్పర్యము.

జానకీరక్షణార్థంవా శ్రమాద్వా నోపలభ్యతే

టీక॥తత్ (అధ్యాహృతము)= అది; జానకీరక్షణార్థం వా=సీతయొక్క రక్షించుటకొఱకో; శ్రమాద్వా= అలసటవలననో; నోపలభ్యతే = అగపడలేదు.

అట్లతండు,సీతయున్నవృక్షంబును, సీతనురక్షించుటకై,విఱువలేదో, లేక, యలసటవలననైవిఱువఁడయ్యెనో, తెలియులేదు.అని, తాత్పర్యము.

అథవా కశ్శ్రమ స్తస్య సైవ తేనాభిరక్షితా. ౧౮

టీక॥అథవా=అటుగాదేని; తస్య= అతనికి;శ్రమః=అలసట;కః = ఏది?సైవ=ఆసీతయె; తేన=ఆవానరునిచేత;అభిరక్షితా=కాపాడఁబడినది.

అటుగాదేని,అతనికిశ్రమంబెక్కడిది?సీతనురక్షించుటకైయాయతండు, ఆచెట్టునువిఱువఁడయ్యె.

అని, తాత్పర్యము.

చారుపల్లవపుష్పాఢ్యం యం సీతా స్వయ మాస్థితా
ప్రవృద్ధ శ్శింశుపావృక్ష స్సచ తేనాభిరక్షితః.౧౯

టీక॥చారుపల్లవపుష్పాఢ్యం= సుందరములయినచిగురులతోను బూలతో నుంగూడిన;యం = ఏవృక్షమును; సీతా=సీతాదేవి;స్వయం=తానె; ఆస్థితా=అధిష్ఠించినదో;సః=అట్టి; ప్రవృద్ధః=పెరిఁగిన;శింశుపావృక్షశ్చ=శింశుపావృక్షమును; తేన=ఆవానరునిచేత; అభిరక్షితః=కాపాడఁబడినది.

సీతాదేవి, తానేసుందరంబులయిన చిగురులతోనుబువ్వములతోను జెలఁగుచున్నయొక్క శింశుపావృక్షమునొద్దఁ బోయియుండినది; అతండాశింశుపావృక్షమునుంగూడ,విఱువఁడయ్యె.

అని, తాత్పర్యము.

తస్యోగ్రరూపస్యోగ్ర త్వం దండ మాజ్ఞాతు మర్హసి
సీతా సంభాషితా యేన తద్వనంచ వినాశితమ్. ౨౦

టీక॥ఉగ్ర=అధికమయినకోపంబుగల రావణుఁడా! యేన=ఎవ్వనిచేత;సీతా-సీత;సంభాషితా = సంభాషింపబడినదో;తత్=ఆ;వనంచ= అశోకవనము

ను; వినాశితం = నశింపఁజేయఁబడినదో; తస్య = అట్టి; ఉగ్రరూపస్య = భయంకరమయిన మేనుగలవానరునకు; త్వం = నీవు; ఉగ్రం = తీవ్రమయిన; దండం = శిక్షను; ఆజ్ఞాతుం = ఆజ్ఞాపించుటకు; అర్హసి = తగుదువు.

మహాకోపముగల రావణుఁడా! సీతతో సంభాషించి ఆయశోకవనంబునంతయు నశింపఁజేసి యిట్లు రెండువిధములను మహాపరాధంబుగావించిన భయంకరాకారుండగు నావానరునకు, నీవిప్పుడు, తీవ్రమయిన శిక్షయాజ్ఞాపింపవలయును.

అని, తాత్పర్యము.

మనః పరిగృహీతాం తాం తవ రక్షోగణేశ్వర
కస్సీతా మభిభాషేత యో న స్యాత్త్యక్తజీవితః. ౨౧

టీక॥ రక్షోగణేశ్వర = రాక్షసులసమూహమున కధిపుండవగు రావణుఁడా! యః = ఎవ్వఁడు; త్యక్తజీవితః = విడువఁబడినప్రాణముగలవాఁడు; న స్యాత్ = కాఁడో; సః (అధ్యాహృతము) = అట్టి; కః = ఎవ్వఁడు, తవ = నీయొక్క; మనఃపరిగృహీతాం = మనస్సుచేతఁ గ్రహింపఁబడిన; తాం = ఆ; సీతాం = సీతనుగూర్చి; అభిభాషేత = మాటలాడును.

రాక్షసేశ్వరుండవగు రావణుఁడా! బ్రతుకనిచ్ఛగలవాఁ డెవ్వఁడును, నీవు మనంబునం బరిగ్రహించియున్న సీతతో మాటలాడఁడు? ఈవానరుండు మాటలాడినాఁడు, కావున, నతం డింక బ్రతుకంజాలఁడు. అని రాక్షసస్త్రీలు, రావణునితోఁ జెప్పిరి;

అని, తాత్పర్యము.

రాక్షసీనాం వచశ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః
హుతాగ్ని రివ జజ్వాల కోపసంవర్తితేక్షణః. ౨౨

టీక॥ రాక్షసేశ్వరః = రాక్షసులకుఁ బ్రభుండగు; రావణః = రావణుఁడు; రాక్షసీనాం = రాక్షసస్త్రీలయొక్క; వచః = మాటను; శ్రుత్వా = విని; కోపసంవర్తితేక్షణః = కోపముచేఁ ద్రిప్పఁబడిన కన్నులుగలవాఁడై; హుతాగ్నిరివ = హోమముసేయఁబడినయగ్నిహోత్రమువలె; జజ్వాల =

మండెను.

రాక్షసేశ్వరుండగు రావణుండు, రాక్షసస్త్రీలుచెప్పినమాటనువిని, మహాకోపంబునొంది, కండ్ల గ్రుడ్లుత్రిప్పుచు, నేతిచేఁ బ్రేల్వఁబడిన యగ్ని కైవడి త్రింబుమండునట్లు, మండెను.

అని, తాత్పర్యము.

తస్య క్రుద్ధస్య నేత్రాభ్యాం ప్రాపత న్నస్రబిందవః
దీప్తాభ్యామివ దీపాభ్యాం సార్చిష స్స్నేహబిందవః. ౨౩

టీక॥ క్రుద్ధస్య=కోపంబునొందిన; తస్య = ఆరావణునియొక్క; నేత్రాభ్యాం=కండ్లనుండి;అస్రబిందవః=కన్నీటిబిందువులు;దీప్తాభ్యాం = మండుచున్న;దీపాభ్యాం=దీపంబులనుండి;సార్చిషః=మంటతోఁగూడిన;స్నేహబిందవఇవ=నూనెబిందువులువలె;ప్రాపతన్=పడినవి.

మండుచున్నదీపంబులనుండి మంటలతోఁగూడనూనెబిందువులు నేలంబడునట్లు, క్రుద్ధుండగునారావణుని నేత్రంబులనుండి,మిక్కిలియు వేఁడియయిన కన్నీటిబిందువులుపడినవి.

అని, తాత్పర్యము.

ఆత్మన స్సదృశాన్ శూరాన్ కింకరాన్నామ రాక్షసాన్
వ్యాదిదేశ మహాతేజా నిగ్రహార్థం హనూమతః. ౨౪

టీక॥మహాతేజాః= అధికమయినపరాక్రమముగలరావణుఁడు; హనూమతః= హనుమంతునియొక్క; నిగ్రహార్థం=నిగ్రహించుటకొఱకు;ఆత్మనః=తనకు;సదృశాన్ = సమానులయిన; శూరాన్ = యుద్ధశూరులైనట్టి; కింకరాన్నామ= కింకరులనిప్రసిద్ధులయిన; రాక్షసాన్=రాక్షసులను;వ్యాదిదేశ=ఆజ్ఞాపించెను.

అంత, మహాపరాక్రమ శాలియగు రావణుండు, బలంబునందనకుసమానులునుశూరులునగు కింకరులను రాక్షసులను, హనుమంతునినిగ్రహింప, నాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

తేషా మశీతిసాహస్రం కింకరాణాం తరస్వినామ్

టీక॥తరస్వినాం=బలవంతులయిన; తేషాం=ఆ;కింకరాణాం=కింకరుల

యొక్క; అశీతిసాహస్రం = ఎనుబదివేలు; ఆసీత్ (అధ్యాహృతము) = ఉండెను.

బలవంతులగుకింకరులను రాక్షసులప్పుడెనిమిదివేలమందియుండిరి.

అని, తాత్పర్యము.

నిర్యయు ర్భవనా త్తస్మా త్కూటముద్గరపాణయః. ౨౫
మహోదరా మహాదంష్ట్రా ఘోరరూపా మహాబలాః
యుద్ధాభిమనస స్సర్వే హనుమద్గ్రహణోద్యతాః. ౨౬

టీక॥ కూటముద్గరపాణయః = కూటమను నాయుధములును ఇనుపగుదియలును జేతులంగలవారలును; మహోదరాః = పెద్దకడుపులుగలవారలును; మహాదంష్ట్రాః = పెద్దకోఱలుగలవారలును; ఘోరరూపాః = భయంకరమయినరూపము గలవారలును; మహాబలాః = అధికమయినబలముగలవారలునగు; తే (అధ్యాహృతము) = ఆకింకరులు; సర్వే = అందఱును; యుద్ధాభిమనసః = యుద్ధమున కభిముఖమయిన మనసుగలవారలై; హనుమద్గ్రహణోద్యతాః = హనుమంతునిపట్టుకొనుటయందుఁ బ్రయత్నముగలవారలై; తస్మాత్ = ఆ; భవనాత్ = ఇంటనుండి; నిర్యయుః = వెడలిరి.

పెద్దకడుపుగలవారలును పెద్దకోఱలుగలవారలును భయంకరాకారులును మహాబలశాలులునగు నాకింకరులను రాక్షసులందఱును, కూటంబులు నినుపగుదియలను జేతులందాల్చి యుద్ధంబునకు సన్నద్ధులై హనుమంతునింబట్టుకొనఁదలంచి, యింటనుండి వెడలిరి.

అని, తాత్పర్యము.

తే కపీంద్రం సమాసాద్య తోరణస్థ మవస్థితమ్
అభిపేతు ర్మహావేగాః పతంగా ఇవ పావకమ్. ౨౭

టీక॥ మహావేగాః = అధికమయినవేగముగల; తే = ఆకింకరులు; తోరణస్థం = బహిర్ద్వారంబుననున్నవాఁడును; అవస్థితం = సన్నద్ధుండైనవాఁడునగు; కపీంద్రం = వానరశ్రేష్ఠుండైనహనుమంతునికి; సమాసాద్య = సమీపించి; పతంగాః = మిడుతలు; పావకమివ = అగ్నిహోత్రమునుగూర్చివలెఁ; తం (అధ్యాహృత

ము)=ఆహనుమంతునిగూర్చి; అభిపే తుః=ఎదురుగాఁబోయిరి.

మహావేగులగునాకింకరులు, ఆయ శోకవనికబహిర్ద్వారంబునయుద్ధంబునకుసన్నద్ధుండైయున్న హనుమంతునిం జూచి,మిడుతలగ్ని హోత్రముపైకిఁబోవునట్లు,అతనిపైకిఁబోయిరి,

అని, తాత్పర్యము.

తే గదాభి ర్విచిత్రాభిః పరిఘైః కాంచనాంగదైః
ఆజఘ్ను ర్వానరశ్రేష్ఠం శరైశ్చా దిత్యసన్నిభైః. ౨౫

టీక॥ తే=ఆకింకరులు;విచిత్రాభిః=నానావర్ణములయిన;గదాభిః= గదలచేతను;కాంచనాంగదైః=బంగారపుభూషణములుగల;పరిఘైః=ఇనుపగుదియలచేతను;ఆదిత్యసన్నిభైః= సూర్యునితోసమానములయిన;శరైశ్చ=బాణములచేతను;వానరశ్రేష్ఠం= వానరులలోనుత్తముండైనహనుమంతుని ; ఆజఘ్నుః=కొట్టిరి.

ఆకింకరులు , వానరోత్తముండగు హనుమంతుని,నానావర్ణములయినగదలచేతనుబంగారముతో నలంకరింపఁబడినయినుపగుదియలచేతను,సూర్యునిభంగి వెలుంగుచున్న బాణంబులచేతనుం,బ్రహరించిరి.అని, తాత్పర్యము.

ముద్గరైః పట్టిసైః శూలైః ప్రాసతోమరశక్తిభిః
పరివార్య హనూమంతం సహసా తస్థు రగ్రతః. ౨౬

టీక॥ తే(అధ్యాహృతము)= ఆకింకరులు; ముద్గరైః= ఇనుపగుదియలతోను; పట్టిసైః = అడ్డకత్తులతోను; శూలైః=శూలములతోను ; ప్రాసతోమరశక్తిభిః = ఈఁటెలతోనుతోమరములనునాయుధంబులతోను చిల్లకోలలతోను; సహితాః(అధ్యాహృతము)=కూడినవారలై; సహసా=శీఘ్రముగా ; హనూమంతం = హనుమంతుని; పరివార్య=చుట్టి; అగ్రతః=ముందట ; తస్థుః=ఉండిరి.

ఆకింకరులంత , నినుపగుదియలనడ్డకత్తులనుశూలంబుల నీఁటెలను దోమరంబులనుజిల్లకోలలను, ధరించి , శీఘ్రంబున హనుమంతుం జుట్టుముట్టి , యుండిరి. అని. తాత్పర్యము.

హనుమా నపి తేజస్వీ శ్రీమా న్పర్వతసన్నిభః
క్షితా వావిధ్య లాంగూలం ననాదచ మహాస్వనమ్. ౩౦

టీక॥ తేజస్వీ=అధికమయినపరాక్రమముగలవాఁడును; శ్రీమాన్= అందఱికన్న నధికుండును ; పర్వతసన్నిభః = పర్వతముతో సమానుఁడు నగు ; హనుమానపి = హనుమంతుండును ; క్షితౌ = భూమియందు ; లాంగూలం=తోఁకను ; ఆవిధ్య= కొట్టి=; మహాస్వనం = అధికమయినధ్వనిగల్గునట్లుగా;ననాదచ= అఱచెను.

మహా పరాక్రమశాలియు శ్రీమంతుండును బర్వతాకారుండునగు హనుమంతుండు! తోఁకను నేలపైఁగొట్టి , మహాధ్వనిగల్గునట్లు, అఱచెను! అని, తాత్పర్యము.

స భూత్వా సుమహాకాయో హనుమా న్మారుతాత్మజః
ధృష్ట మా స్ఫోటయామాస లంకాం శబ్దేన పూరయన్. ౩౧

టీక॥ మారుతాత్మజః= వాయుదేవునికుమారుండయిన; హనుమాన్ = హనుమంతుండు ; సుమహాకాయః = మిక్కిలియుఁబెద్దదైన దేహముగలవాఁడు; భూత్వా=అయి; శబ్దేన=ధ్వనిచేత;లంకాం=లంకాపట్టణమును ;పూరయన్=నించుచు; ధృష్టం=గట్టిగా; ఆస్ఫోటయామాస=భుజంబుదట్టెను.

వాయుదేవునికుమారుఁడగు హనుమంతుండు, మిక్కిలియుఁబెద్దరూపంబుధరించి,లంకయంతయుశబ్దంబు నిండునట్లు,గట్టిగాభుజంబుదట్టెను. అని, తాత్పర్యము.

తస్యా స్ఫోటితశబ్దేన మహతా సానునాదినా
పేతు ర్విహంగా గగనా దుచ్చై శ్చేద మఘోషయత్. ౩౨

టీక॥ తస్య = ఆహనుమంతునియొక్క; మహతా=పెద్దదైన; సానునాదినా=ప్రతిధ్వనితోఁగూడిన; ఆస్ఫోటితశబ్దేన= భుజముతట్టుటయొక్కధ్వనిచేత, విహంగాః = పక్షులు ; గగనాత్=ఆకాశంబుననుండి ; పేతుః =

పడినవి. సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; ఇదంచ=ఈమాటను ; ఉచ్చైః=ఉన్నతముగా; అఘోషయత్=అఱచెను.

భయంకరంబును బ్రతిధ్వనులు గలదియునగు నాహనుమంతుని యాస్ఫోటితధ్వనిచేత నాకాశంబుననుండి పక్షులు నేలంబడినవి; అంతనాహనుమంతుండు, ఇట్లని, గట్టిగా నఱచెను.

అని, తాత్పర్యము.

జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః. ౩౩

టీక॥ అతిబలః=అధికమయినబలముగల; రామః=రాముఁడు; జయతి=అందఱికన్న నధికుఁడుగానున్నాఁడు. మహాబలః=అధికమయినబలముగల; లక్ష్మణశ్చ=లక్ష్మణుఁడును; జయతి (అధ్యాహృతము)=అందఱికన్న నధికుఁడుగానున్నాఁడు. రాఘవేణ=రామునిచేత, అభిపాలితః=రక్షింపఁబడిన; రాజా=రాజైన; సుగ్రీవః=సుగ్రీవుఁడు ; జయతి = అందఱికన్న నధికుఁడుగానున్నాఁడు.

మహాబలుండగు రాముండు జయంబుగల్గియున్నవాఁడు; మహాబలుండగు లక్ష్మణుండును జయంబు గల్గియున్నవాఁడు; వానర రాజుండగు సుగ్రీవుండును, రామునిచేఁబరిపాలితుండై జయంబుగల్గియున్నవాఁడు.

అని, తాత్పర్యము,

దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః. ౩౪

టీక॥ అహం=నేను ; కోసలేంద్రస్య=కోసలదేశమునకధిపతియగు ; అక్లిష్టకర్మణః= దుఃఖములేనికార్యములుగల; రామస్య=రామునకు; దాసః=దాసుండను. హనుమాన్ = హనుమంతుండను పేరుగలవాఁడను. శత్రుసైన్యానాం=శత్రువులసైన్యములయొక్క; నిహంతా=చంపువాఁడను . మారుతాత్మజః= వాయుదేవుని కుమారుండను.

నేను, ఎట్టికార్యంబునందును క్లేశంబునొందనివాఁడును గోసల దేశాధిపతియనగు రామునకు దాసుండను; హను

మంతుండను పేరుగలవాఁడను;శత్రుసై
న్యంబులంజంపువాఁడను;వాయుదేవుని
కుమారుండను. అని, తాత్పర్యము.

న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలంభవేత్
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః. ౩౫

టీక॥శిలాభిస్తు=ఱాళ్ల చేతను;పాద
పైశ్చ=వృక్షముల చేతను; సహస్రశః=
వేయివిధంబులుగా;ప్రహరతః=కొట్టు
చున్న;మే=నాకు;యుద్ధే = యుద్ధము
నందు;రావణసహస్రం = రావణుల
యొక్క-వేయి;ప్రతిబలం= సరియయిన
బలముగలది;నభవేత్=కాదు.

ఱాళ్ల చేతను వృక్షంబులచేతను వే
యివిధంబులం బ్రహరింపుచు విహారము
సేయుచుండు నాకు, యుద్ధంబున వేయి
మంది రావణులు సరికాఁజాలరు.
అని, తాత్పర్యము.

అర్దయిత్వా పురీం లంకా మభివాద్యచ మైథిలీమ్
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్. ౩౬

టీక॥అహం(అధ్యాహృతము)=నే
ను;సర్వరక్షసాం= సమస్తరాక్షసులు
ను;మిషతాం = చూచుచుండఁగా;లం
కాం=లంకయను;పురీం=పట్టణమును;
అర్దయిత్వా=పీడించి;మైథిలీం = సీ
తాదేవిని;అభివాద్యచ= నమస్కరించి
యు;సమృద్ధార్థః= సంపూర్ణమయి
నపనిగలవాఁడనై ; గమిష్యామి=పో
యెదను.

నేను, ఈ రాక్షసులందఱునుజూచు
చుండఁగానే యీలంకాపట్టణమునంత
యునశింపఁజేసి, సీతాదేవికినమస్కార
ముచేసి, కృతార్థుండనై, రాముని యొద్ద
కుఁబోయెదను. అని, హనుమంతుండుగ
ట్టిగానఱచెను. అని, తాత్పర్యము.

తస్య సన్నాదశబ్దేన తే భవ న్భయశంకితాః
దదృశుశ్చ హనూమంతం సంధ్యా మేఘ మివోన్నతమ్. ౩౭

టీక॥ తే=ఆకింకరులు; తస్య= ఆహనుమంతునియొక్క; సన్నాదశబ్దేన =

అందుటరయొక్క ధ్వనిచేత ; భయశంకితాః=భయముచేతభయపడినవారలు;అభవన్=అయిరి. ఉన్నతం=పొడవైన; సంధ్యామేఘమివ(స్థితం)=సంధ్యాకాలమునందలి మేఘమువలెనున్న;హనూమంతం = హనుమంతుని;దదృశుశ్చ=చూచిరియు.

ఆకింకరులు,ఆహనుమంతుండుచేసిన మహాధ్వనికి,భయంబునొంది, అప్పుడు,సంధ్యాకాలంబునందలి మేఘంబుంబోలెనత్యున్నతుండై రక్తవర్ణుండై క్రాలుచున్నహనుమంతుంజూచిరి.

అని, తాత్పర్యము.

స్వామిసందేశనిశ్శంకా స్తత స్తే రాక్షసాః కపిమ్
చిత్రైః ప్రహరణై ర్భీమై రభిపేతు స్తత స్తతః. ౩౮

టీక॥తతః=అటుపిమ్మట; తే=ఆ; రాక్షసాః=రాక్షసులు; స్వామిసందేశనిశ్శంకాః=ప్రభువుయొక్క యాజ్ఞచే భయములేనివారలై;తత స్తతః= అచ్చటచ్చటనుండి;చిత్రైః=నానావిధములయిన;భీమైః=భయంకరములయిన;ప్రహరణైః=ఆయుధములచేత ; కపిం=హనుమంతుని;అభిపేతుః=ఎదిరించిరి, ప్రహరించిరనుట.

అంత,నాకింకరులు, రాజాజ్ఞకుబద్ధులుకావున,భయంబువిడిచి, యచ్చటచ్చటదూరంబుననుండి,భయంకరంబులయిననానావిధాయుధంబుల,హనుమంతుంబ్రహరించిరి.అని, తాత్పర్యము.

స తైః పరివృత శ్శూరై స్సర్వత స్సమహాబలః
ఆససాదా యసం భీమం పరిఘం తోరణాశ్రితమ్. ౩౯

టీక॥సమహాబలః= అధికమయినబలముతోఁగూడిన;సః= ఆహనుమంతుండు;సర్వతః=అంతటను;శూరైః=యుద్ధంబునందుభయములేనట్టి;తైః= ఆరాక్షసులచేత;పరివృతః= చుట్టఁబడినవాఁడై;తోరణాశ్రితం=ద్వారమునుబొందియున్న;ఆయసం=ఇనుముతోఁజేయఁబడిన;భీమం= భయంకరమయిన ; పరిఘం=గుదియను;ఆససాద= పొందెను.

అంత, మహాబలుండగు హనుమంతుండు,నాలుగుప్రక్కలను శూరులగు నాకింకరులచేతఁబరివేష్టింపఁబడినవాఁ

ద్రై,ఆద్వారంబుననున్న భయంకరంబగునినుపగుదియ యొద్దకుంబోయెను.

అని, తాత్పర్యము.

స తం పరిఘ మాదాయ జఘాన రజనీచరాన్

టీక॥సః=ఆహనుమంతుండు;తం=ఆ;పరిఘం= ఇనుపగుదియను ; ఆదాయ=తీసికొని;రజనీచరాన్=రాక్షసులను;జఘాన=చంపెను.

ఆహనుమంతుండు, ఆయినుపగుదియందీసికొని,రాక్షసులంజంపెను.

అని, తాత్పర్యము.

స పన్నగమి వాదాయ స్ఫురంతం వినతాసుతః. ౪౦
విచచారాంబరే వీరః పరిగృహ్యాచ మారుతిః

టీక॥వీరః= పరాక్రమశాలియును; మారుతిః=వాయుదేవుని కుమారుండునగు;సః=ఆహనుమంతుడు ; స్ఫురంతం=ప్రకాశించుచున్న; తం (అధ్యాహృతము)= ఆయినుపగుదియను ; పన్నగం= సర్పమును;వినతాసుతః=ఇవ గరుత్మంతుడువలె;ఆదాయ= తీసికొని;పరిగృహ్యాచ=పట్టుకొనియు; అంబరే,ఆకాశమునందు;విచచార=తిరిగెను

పరాక్రమశాలియగు నాహనుమంతుండు,గరుత్మంతుండుసర్పంబుంగొనికొనునట్లుఆయినుపగుదియుం జేకొని, చేతంబట్టుకొని,యాకాశంబునవిహరించెను. అని, తాత్పర్యము.

స హత్వా రాక్షసాన్వీరాన్ కింకరాన్మారుతాత్మజః. ౪౧
యుద్ధకాంక్షీ పున ర్వీర స్తోరణం సముపాశ్రితః

టీక॥ మారుతాత్మజః=వాయుదేవునికుమారుండును; వీరః= పరాక్రమశాలియునగు ; సః = ఆహనుమంతుడు; వీరాన్=పరాక్రమశాలులయిన; కింకరాన్ = కింకరులను ; రాక్షసాన్=రాక్షసులను; హత్వా = చంపి; పునః=మరల; యుద్ధకాంక్షీ=యుద్ధమునుగోరినవాడై; తోరణం=ద్వారమును;సముపాశ్రితః=పొందినాడు.

వాయుపుత్రుండును బరాక్రమవం

తుండునగు హనుమంతుండు, వీరులగు నాకింకరులనురాక్షసులంజంపి, మఱల యుద్ధంబుఁగోరి, యాబహిద్వారంబునఁనె,యుండెను.

అని, తాత్పర్యము.

తత స్తస్మా ద్భయా న్ముక్తాః కతిచి త్తత్ర రాక్షసాః. ౪౨
నిహతాన్ కింకరాన్ సర్వా న్రావణాయ న్యవేదయన్

టీక॥తతః=అటుపిమ్మట;తత్ర=అచ్చట;తస్మాత్=ఆ;భయాత్=భయమువలన;ముక్తాః= విడువఁబడిన, పాఱిన యనుట;రాక్షసాః = రాక్షసులు;కతిచిత్=కొందఱు;నిహతాన్= చంపఁబడిన;కింకరాన్=కింకరులను;సర్వాన్= అందఱను; రావణాయ= రావణునికొఱకు;న్యవేదయన్=తెలిపిరి.

అంత, నచ్చటనుండి, భయంబునం బాఱినకొందఱురాక్షసులు,"కింకరులందఱుహనుమంతునిచేఁజంపఁబడిరి." అని,రావణునకుంజెప్పిరి.

అని, తాత్పర్యము.

స రాక్షసానాం నిహతం మహ ద్బలం
నిశమ్య రాజా పరివృ త్తలోచనః. ౪౩
సమాదిదేశా ప్రతిమం పరాక్ర మే
ప్రహ స్తపుత్రం సమరే సుదుర్జయమ్

టీక॥ సః=ఆ; రాజా= రావణుఁడు;రాక్షసానాం=రాక్షసులయొక్క; మహత్=గొప్పదైన; బలం=సైన్యమును; నిహతం=చంపఁబడినదానిఁగా ; నిశమ్య=విని; పరివృత్తలోచనః = త్రిప్పఁబడినకండ్లుగలవాఁడై ; పరాక్రమే=పరాక్రమమునందు; అప్రతిమం= సరిలేనివాఁడును; సమరే = యుద్ధమునందు; సుదుర్జయం = ఎంతమాత్రముజయింపఁగూడనివాఁడునగు; ప్రహస్తపుత్రం=ప్రహస్తునికొడుకును ; సమాదిదేశ=ఆజ్ఞాపించెను.

రావణుండు, కింకరులందఱునుజంపఁబడుటనువిని , కోపంబునఁగఁడ్లుద్రిప్పుచుఁబరాక్రమంబున నెదురులేనివాఁడునుయుద్ధంబునజయింపనలవిగానివాఁ

దునగు, ప్రహస్తపుత్రుని, హనుమంతునిపైకిఁబోవనాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ద్విచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండద్విచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ
త్రిచత్వారింశసర్గప్రారంభః.

తత స్స కింకరా న్హత్వా హనుమా న్ధ్యాన మాస్థితః

టీక॥ సః=ఆ; హనుమాన్=హనుమంతుఁడు; కింకరాన్=కింకరులను; హత్వా=చంపి; తతః=అటుపిమ్మట; ధ్యానం=చింతను; ఆస్థితః=పొందినాఁడు.

ఆహనుమంతుఁడిట్లు కింకరులంజంపి, యంత, నిట్లనియాలోచించెను.

అని, తాత్పర్యము.

వనం భగ్నం మయా చైత్యప్రాసాదో న వినాశితః. ౧

టీక॥ మయా=నాచేత; వనం=అశోకవనము; భగ్నం=విఱువఁబడినది. చైత్యప్రాసాదః=దేవాలయమువంటిమేడ; నవినాశితః=నశింపఁజేయఁబడలేదు.

నేనశోకవనంబును విఱిచినానుగాని, దేవాలయమువంటియీమేడను విఱువనైతిని. అని, తాత్పర్యము.

తస్మా త్ప్రాసాద మప్యేవ భీమం విధ్వంసయా మ్యహమ్

టీక॥ తస్మాత్=అందువలన; అహం=నేను; భీమం=భయంకరమగు;

ప్రాసాదమప్యేవ=మేడనుగూడనే; విధ్వంసయామి=నశింపఁజేసెదను.

అందువలన, నేనీచైత్యప్రాసాదంబునుంగూడఁబగులఁగొట్టెదను. అని, హనుమంతుండాలోచించెను.

అని, తాత్పర్యము.

ఇతి సంచింత్య మనసా హనుమాన్ దర్శయన్ బలమ్. ౨
చైత్యప్రాసాద మాప్లుత్య మేరుశృంగ మివోన్నతమ్
ఆరురోహ కపిశ్రేష్ఠో హనుమాన్మారుతాత్మజః. ౩

టీక॥హనుమాన్ = హనుమంతుండు; మనసా=మనసుచేత; ఇతి=ఇట్లు; సంచింత్య= ఆలోచించి;బలం=బలమును; దర్శయన్ = చూపువాఁడై; ఆప్లుత్య=ఎగిరి; కపిశ్రేష్ఠః= వానరశ్రేష్ఠుండును; మారుతాత్మజః= వాయుదేవునికుమారుండునగు;హనుమాన్ = హనుమంతుండు; ఉన్నతం=పొడవైన; మేరుశృంగమివ (స్థితం) = మేరుపర్వతముయొక్క-శిఖరమువలెనున్న ; చైత్యప్రాసాదం= దేవాలయమువంటిమేడను; ఆరురోహ=ఎక్కెను.

వానరశ్రేష్ఠుండును వాయుకుమారుండనగు హనుమంతుం డిట్లాలోచించి, తనబలంబుఁజూపుటకై, యెగిరి, మేరుశిఖరంబుం బోలె నత్యున్నతంబై యున్నచైత్యప్రాసాదంబుమీఁదికిదుమికెను.అని, తాత్పర్యము.

ఆరుహ్య గిరిసంకాశం ప్రాసాదం హరియూథపః
బభౌ స సుమహాతేజాః ప్రతిసూర్య ఇవోదితః. ౪

టీక॥సుమహాతేజాః= మిక్కిలియునధికమయినకాంతిగల ; హరియూథపః=వానరసమూహమును బాలించునట్టి;సః = ఆహనుమంతుఁడు;గిరిసంకాశం= పర్వతముతో సమానంబయిన; ప్రాసాదం=మేడను;ఆరుహ్య = ఎక్కి;ఉదితః=ఉదయించిన;ప్రతిసూర్య ఇవ=రెండవసూర్యుఁడువలె; బభౌ= ప్రకాశించెను.

వానరోత్తముండును గాంతిమంతుండునగునాహనుమంతుండు , పర్వతాకారంబయినచైత్యప్రాసాదం బధిరోహించి , రెండవసూర్యుండనందగి యొప్పుచుండెను.అని, తాత్పర్యము.

సంప్రధృష్యచ దుర్ధర్షం చైత్యప్రాసాద ముత్తమమ్
హనుమాన్ ప్రజ్వల న్లక్ష్మ్యా పారియాత్రోపమోఽ భవత్. ౫

టీక॥హనుమాన్= హనుమంతుండు;ఉత్తమం=శ్రేష్ఠమయినదియు; దుర్ధర్షం=ఎదిరింపఁగూడనిదియునగు; చైత్యప్రాసాదం= దేవాలయమువంటి మేడను;సంప్రధృష్యచ = నశింపఁజేసియు;లక్ష్మ్యా=జయలక్ష్మిచేత; ప్రజ్వలన్= వెలుంగుచు ; పారియాత్రోపమః=పారియాత్రపర్వతముతోఁబోల్కిగలవాఁడు;అభవత్ =ఆయెను.

హనుమంతుండు, ఎవ్వరికినింజొరరానియుత్తమంబగునాచైత్యప్రాసాదమునునశింపఁజేసి, జయలక్ష్మీసమేతుండై, పారియాత్రపర్వతంబుకరణి, వెలుంగుచుండెను. అని, తాత్పర్యము.

స భూత్వా సుమహాకాయః ప్రభావా న్మారుతాత్మజః
ధృష్ట మాస్ఫోటయామాస లంకాం శబ్దేన పూరయన్. ౬

టీక॥మారుతాత్మజః= వాయుదేవునికొడుకైన;సః=ఆహనుమంతుఁడు; ప్రభావాత్ =ప్రభావమువలన; సుమహాకాయః=మిక్కిలియుఁబెద్దదేహముగలవాఁడు;భూత్వా=అయి; శబ్దేన= శబ్దముచేత;లంకాం=లంకను ; పూరయన్=నించుచు;ధృష్టం=గట్టిగా ; ఆస్ఫోటయామాస=భుజంబుదట్టెను.

అంత,వాయుకుమారుండగు హనుమంతుండు,ప్రభావంబువలన, మిక్కిలియుగొప్పదేహముదాల్చి, శబ్దములంకయంతయునిండునట్లు,గట్టిగా,భుజంబుదట్టెను. అని, తాత్పర్యము.

తస్యా స్ఫోటితశబ్దేన మహతా శ్రోత్రఘాతినా
పేతు ర్విహంగమా స్తత్ర చైత్యపాలాశ్చ మోహితాః. ౭

టీక॥ తస్య= ఆహనుమంతునియొక్క; మహతా=పెద్దదియును; శ్రోత్రఘాతినా=చెవులనుహింసించునట్టి; ఆస్ఫోటితశబ్దేన = భుజంబుదట్టుటయొక్కధ్వనిచేత;తత్ర= అచ్చట; విహంగమాః=పక్షులు; పేతుః=పడినవి;చైత్య

పాలాశ్చ= చైత్యప్రాసాదమునురక్షిం చువారలును; మోహితాః= మూర్ఛ నొందినారు.
చెవులకుబాధసేయునట్టి యాహనుమం తునియాస్ఫోటితధ్వనిచేతఁ, బక్షులా కాశంబుననుండి, నేలఁబడినవి; ఆచైత్య ప్రాసాదంబునఁగావలియున్నరాక్షసు లందఱునుమూర్ఛఁబొందిరి.
అని, తాత్పర్యము.

అస్త్రవి జ్జయ తాం రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణా భిపాలితః. ౮

టీక॥అస్త్రవిత్= అస్త్రంబులనెఱిం గిన;రామః = రాముఁడు;జయతాం= అందఱికన్న నధికుండుగా నుండుఁ గాక.మహాబలః=అధికమైనబలముగల; లక్ష్మణశ్చ=లక్ష్మణుండును;జయతు (అ ధ్యాహృతము)=అందఱికన్ననధికుఁడు గానుండుఁగాక.రాఘవేణ= రాముని చేత;అభిపాలితః= రక్షింపఁబడిన;రా జా=సుగ్రీవుఁడు;జయతి=అందఱికన్న నధికుఁడుగానుండుఁగాక.
సమస్తములయినయస్త్రంబులనెఱిఁగి నరాముండుజయంబునొందుఁగాక; మ హాబలుండగు లక్ష్మణుండును జయంబు నొందుఁగాక.వానరరాజుండగు సుగ్రీ వుండును,రామునిచేరక్షింపంబడినవాఁ డై,జయంబునొందుఁగాక.
అని, తాత్పర్యము.

దాసోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః. ౯

టీక॥అహం= నేను;కోసలేంద్రస్య=కో సలదేశమునకధిపతియయిన ; అక్లిష్టక ర్మణః=దుఃఖములేనికార్యములుగల;రా మస్య=రామునియొక్క; దాసః= దాసుఁ డను.హనుమాన్= హనుమంతుండను వాఁడను. శత్రుసైన్యానాం = శత్రువు లసైన్యములయొక్క;నిహంతా= చం పువాఁడను. మారుతాత్మజః= వాయు దేవునికుమారుండను.
నేను,కోసలదేశాధిపతియును ఎట్టి కార్యంబునందును గ్లేశంబు నొందనివాఁ డునగు, రామునకు దాసుండ;హనుమం

తుండనువాఁడ; శత్రుసైన్యంబులం జం
పువాఁడ;వాయుదేవునికుమారుండ-

అని, తాత్పర్యము-

న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః. ౧౦

టీక॥శిలాభిస్తు=ఱాళ్ల చేతను; పాదపైశ్చ=వృక్షములచేతను ; సహస్రశః=వేయివిధములను;ప్రహరతః=కొట్టుచున్న;మే=నాకు;యుద్ధే = యుద్ధమునందు;రావణసహస్రం=రావణులవేయి;ప్రతిబలం=సరియయినబలముగ అది;నభవేత్ =కాదు-

ఱాళ్ల చేతనువృక్షంబులచేతను నానావిధంబులం బ్రహరించుచు విహరంబుసేయుచున్న నాకు,యుద్ధంబున, వేయిమంది రావణులును,సరికాఁజాలరు-

అని, తాత్పర్యము-

అర్దయిత్వా పురీం లంకా మభివాద్యచ మైథిలీమ్
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్. ౧౧

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;సర్వరక్షసాం = సమస్తరాక్షసులును;మిషతాం= చూచుచుండఁగా; లంకాం=లంకయను;పురీం=పట్టణమును; అర్దయిత్వా=పీడించి;మైథిలీం= సీతాదేవిని; అభివాద్యచ = నమస్కరించియు;సమృద్ధార్థః = ఈడేఱినపనిగలవాఁడనై;గమిష్యామి=పోయెదను.

నేను, ఈరాక్షసులందఱుఁ జూచుచుండఁగానే,లంకాపట్టణమునునశింపఁజేసి,సీతాదేవికినమస్కారముచేసి, కృతార్థుఁడనై, రామునొద్దకుఁబోయెదను. అని,హనుమంతుండు గట్టిగాఁజెప్పెను.అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా విమానస్థ శ్చైత్యస్థో హరియూథపః
ననాద భీమనిర్హ్రాదో రక్షసాం జనయన్ భయమ్. ౧౨

టీక॥విమానస్థః=చైత్యప్రాసాదంబునందునున్నవాఁడును ; భీమనిర్హ్రాదః = భయంకరమయినకంఠధ్వనిగలవాఁడును;హరియూథపః = వానరస

మూహమును చాలించునట్టి వాడునగు హనుమంతుండు; చైత్యస్థాన్ = చైత్య ప్రాసాదమునందున్న రాక్షసులనుగూర్చి; ఏవం = ఇట్లు; ఉక్త్వా = చెప్పి; రక్షసాం = రాక్షసులకు; భయం = వెఱపును; జనయన్ = పుట్టింపుచు; ననాద = అఱచెను.

ఇట్లు, ఆవానరోత్తముండగు హనుమంతుండు చైత్య ప్రాసాదంబుననుండు వారలకుం దెలియం జెప్పియా రాక్షసుల కుభయంబుగల్గునట్లు, భయంకరంబయినధ్వనిం, గావించెను.

అని, తాత్పర్యము.

తేన శబ్దేన మహతా చైత్యపాలా శ్శతం యయుః
గృహీత్వా వివిధా నస్త్రా న్ప్రాసా న్ఖడ్గా న్పరశ్వధాన్. ౧౩

టీక॥ మహతా = గొప్పదైన; తేన = ఆ; శబ్దేన = ధ్వనిచేత; చైత్య పాలాః = చైత్యప్రాసాదమునురక్షించునట్టివారు; శతం = నూర్గురు; ప్రాసాన్ = ఈటెలను; ఖడ్గాన్ = కత్తులను; పరశ్వధాన్ = గండగొడ్డళ్లను; వివిధాన్ = నానావిధములయిన; అస్త్రాన్ = ఆయుధములను; గృహీత్వా = తీసికొని; యయుః = పోయిరి.

ఆమహాధ్వనివిని, యాచైత్యప్రాసాదంబునురక్షించు వారలు నూర్గురు రాక్షసులు, ఈటెలు ఖడ్గంబులు గండగొడ్డళ్లు మొదలగు నానావిధంబులగు నాయుధంబులందీసికొని, హనుమంతునిపైకిం బోయిరి. అని, తాత్పర్యము.

విసృజంతో మహాకాయా మారుతిం పర్యవారయన్

టీక॥ మహాకాయాః = గొప్పదేహములుగల రాక్షసులు; అస్త్రాణి (అధ్యాహృతము) = ఆయుధములను ; విసృజంతః = విడుచుచు ; మారుతిం = వాయుకుమారుండయినహనుమంతుని; పర్యవారయన్ = చుట్టుకొనిరి.

గొప్పదేహంబుగలయా రాక్షసులు, నానావిధాయుధంబులం బ్రయోగింపుచు, వాయుపుత్రుండగు హనుమంతుం జుట్టుముట్టిరి. అని, తాత్పర్యము.

తే గదాభి ర్విచిత్రాభిః పరిఘైః కాంచనాంగదైః. ౧౪

ఆజఘ్ను ర్వానరశ్రేష్ఠం బాణై శ్చాదిత్యసన్నిభైః

టీక॥ తే=ఆరాక్షసులు ; విచిత్రాభిః = నానావర్ణములైన;గదాభిః= గదలచేతను ; కాంచనాంగదైః = బంగారపుపూవులుగల ; పరిఘైః=ఇనుపగుదియలచేతను;ఆదిత్యసన్నిభైః= సూర్యునితోసమానములయిన; బాణైశ్చ=బాణములచేతను; వానరశ్రేష్ఠం= వానరోత్తముండగుహనుమంతుని ; ఆజఘ్నుః=కొట్టిరి.

ఆరాక్షసులు , నానావర్ణములయినగదలచేతనుబంగారముచే నలంకరింపఁబడియుండునినుపగుదియల చేతనుసూర్యునిభంగివెలుంగుచున్న బాణంబులచేతను, వానరోత్తముఁడగు నాహనుమంతుం బ్రహరించిరి.

అని, తాత్పర్యము.

ఆవర్త ఇవ గంగాయా స్తోయస్య విపులో మహాన్. ౧౫
పరిక్షిప్య హరిశ్రేష్ఠం స బభౌ రక్షసాం గణః

టీక॥ మహాన్=పెద్దదైన;రక్షసాం= రాక్షసులయొక్క ; సః=ఆ;గణః=సమూహము;హరిశ్రేష్ఠం= వానరోత్తముండగుహనుమంతుని ; పరిక్షిప్య=చుట్టుకొని; గంగాయాః=గంగానదియొక్క; తోయస్య=జలముయొక్క ; విపులః=విశాలమయిన; ఆవర్త ఇవ = సుడివలె; బభౌ=ప్రకాశించెను.

అప్పుడువానరశ్రేష్ఠుండగు హనూమంతుంజుట్టుకొన్న యారాక్షసులగొప్పసమూహము, గంగాజలంబులందలి గొప్పసుడివలెనొప్పుచుండెను.

అని, తాత్పర్యము.

తతో వాతాత్మజః క్రుద్ధో భీమం రూపం సమాస్థితః. ౧౬

టీక॥ తతః=అటుపిమ్మట ; వాతాత్మజః = వాయుకుమారుండగుహనుమంతుండు; క్రుద్ధః= కోపమునొందినవాఁడై; భీమం= భయంకరమయిన ; రూపం=దేహమును ; సమాస్థితః = పొందినాఁడు.

అంత,వాయుదేవునికుమారుండగు హనుమంతుండు, కోపించి,భయంకరంబగురూపంబుధరించెను.

అని, తాత్పర్యము.

ప్రాసాదస్య మహాన్తస్య స్తంభం హేమపరిష్కృతమ్
ఉత్పాటయిత్వా వేగేన హనుమా న్పవనాత్మజః. ౧౭
తత స్తం భ్రామయామాస శతధార మ్మహాబలః

టీక॥ మహాబలః = అధికమయినబలముగల; పవనాత్మజః = వాయుదేవునికుమారుండగు; హనుమాన్ = హనుమంతుండు; మహాన్తస్య = ఉన్నతమయినశిఖరముగల; ప్రాసాదస్య = చైత్యప్రాసాదముయొక్క; హేమపరిష్కృతం = బంగారముచేనలంకరింపఁబడిన; స్తంభం = స్తంభమును; వేగేన = వేగముచేత; ఉత్పాటయిత్వా (ఉత్పాట్య) = పెఱికి; తతః = అటుపిమ్మట; తం = ఆ స్తంభమును; శతధా = నూఱు విధములుగా; అరం = శీఘ్రముగా; భ్రామయాస = త్రిప్పెను.

మహాబలుండునువాయుపుత్రుండునగుహనుమంతుండును, బంగారముచే నలంకరింపఁబడినయా చైత్యప్రాసాదమందలి స్తంభమును వేగంబునం బెఱికి, దానిం బలువిధంబుల శీఘ్రంబుగాఁద్రిప్పెను-అని తాత్పర్యము.

తత్ర చాగ్ని స్సమభవ త్ప్రాసాద శ్చాప్యదహ్యత. ౧౮

టీక॥ తత్ర = అచ్చట; అగ్నిశ్చ = అగ్నిహోత్రమును; సమభవత్ = పుట్టెను; ప్రాసాదశ్చాపి = చైత్యప్రాసాదమును; అదహ్యత = దహింపఁబడినది.

అట్టులా స్తంభమునుద్రిప్పుటచేత నిప్పుపుట్టినది; దానిచేతనా చైత్యప్రాసాదంబంతయుమండిపోయినది.

అని, తాత్పర్యము.

దహ్యమానం తతో దృష్ట్వా ప్రాసాదం హరియూథపః
స రాక్షసశతం హత్వా వజ్రే ణేంద్ర ఇవాసురాన్. ౧౯
అంతరిక్షే స్థిత శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్

టీక॥ శ్రీమాన్ = అందఱికన్నఁనధికుండును; హరియూథపః = వానరసమూహముఁబాలించునట్టి వాఁడునగు సః = ఆహనుమంతుఁడు; తతః = అటు

పిమ్మట; దహ్యమానం = దహింపఁబడుచున్న; ప్రాసాదం = చైత్యప్రాసాదమును; దృష్ట్వా = చూచి; తేన (అధ్యాహృతము) = ఆ స్తంభముచేత; రాక్షసశతం = రాక్షసులయొక్క నూటిని; వజ్రేణ = వజ్రాయుధముచేత; ఇంద్రః = దేవేంద్రుఁడు; అసురానివ = అసురులంబోలె; హత్వా = చంపి; అంతరిక్షే = ఆకాశమునందు; స్థితః = ఉన్నవాఁడై; ఇదం = ఈ; వచనం = మాటను; అబ్రవీత్ = పలికెను.

శ్రీమంతుండును వానరశ్రేష్ఠుండును నగు నాహనుమంతుండు, ఆచైత్యప్రాసాదంబు దగ్ధమగుటం జూచి, ఆ స్తంభముచేత, ఇంద్రుండు వజ్రముచేత నసురులం జంపునట్లు, ఆరాక్షసుల నూర్వురం జంపి, యంతరిక్షంబుననుండి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము,

మాదృశానాం సహస్రాణి విసృష్టాని మహాత్మనామ్. ౨౦
బలినాం వానరేంద్రాణాం సుగ్రీవవశవర్తినామ్

టీక॥ మహాత్మనాం = అధికమయిన పరాక్రమము గలవారలును; బలినాం = అధికమయిన బలము గలవారలును; సుగ్రీవవశవర్తినాం = సుగ్రీవుని యధీనతయందున్నవారలును నగు; మాదృశానాం = నావంటివారలయిన; వానరేంద్రాణాం = వానరశ్రేష్ఠులయొక్క; సహస్రాణి = వేలు; విసృష్టాని = పంపఁబడినవి.

మహాపరాక్రమశాలులును మహాబలులును సుగ్రీవునివశంబుననున్నవారలు నగు నావంటి వానరశ్రేష్ఠులు, వేనవేలుగా, సుగ్రీవునిచే, సీతాదేవిని వెదకుటకై, పంపఁబడిరి. అని, తాత్పర్యము.

అటంతి వసుధాం కృత్స్నాం వయమన్యేచ వానరాః. ౨౧

టీక॥ వయం = మేమును; అన్యే = ఇతరులయిన; వానరాశ్చ = వానరులును; కృత్స్నాం = సమస్తమయిన; వసుధాం = భూమియంతయు; అటంతి = తిరుగుచున్నారు.

మేముమాత్రమె కాదు; ఇంక ననేకులు వానరలిట్లు భూమియంతయు, సీతను వెదకుచుఁ దిరుగుచున్నారు.

అని, తాత్పర్యము.

దశనాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః
కేచి న్నాగసహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః. ౨౨

టీక॥ కేచిత్=కొందఱు; దశనాగబలాః= పదియేనుంగులబలముగలవారలు. కేచిత్ = కొందఱు;దశగుణోత్తరాః=పదంతలచేనధికులు, నూఱేనుంగులబలముగలవారలనుట. కేచిత్=కొందఱు;నాగసహస్రస్య= ఏనుంగులవేయికి;తుల్యవిక్రమాః= సరియయినపరాక్రమముగలవారలు;బభూవుః=అయిరి.

అందుఁ, గొందఱుపదియేనుంగులబలంబుగలవారలు; కొందఱునూఱేనుంగులబలముగలవారలు; కొందఱు వేయియేనుంగులబలముగలవారలు.
అని, తాత్పర్యము.

సంతి చౌఘబలాః కేచి త్కేచి ద్వాయుబలోపమాః
అప్రమేయబలా శ్చాన్యే తత్రా స న్హరియూథపాః. ౨౩

టీక॥తత్ర=అచ్చట; కేచిత్=కొందఱు;ఓఘబలాశ్చ=ఓఘమనెడుసంఖ్యగలయేనుంగులబలముగలవారలును; సంతి=ఉన్నారు. కేచిత్ = కొందఱు;వాయుబలోపమాః= వాయువుయొక్కబలంబుతోఁబోల్కిగలవారలు, అంతటిబలముగలవారలనుట.అన్యే=ఇతరులయిన;హరియూథపాశ్చ= వానరసమూహములంబాలించువారలు; అప్రమేయబలాః=కొలఁతపెట్టరానిబలముగలవారలు;ఆసన్=అయిరి.

అచ్చటఁ,గొందఱు,ఓఘమనుసంఖ్యగలయేనుంగులబలముగలవారలు; కొందఱువాయుబలముగలవారలు; ఇతరులగువానరశ్రేష్ఠుల బలమునకుఁ గొలందియె లేదు. అని, తాత్పర్యము.

ఈదృగ్విధై స్తు హరిభి ర్వృతో దంతనఖాయుధైః
శతై శ్శతసహస్రైశ్చ కోటీభి రయుతైరపి. ౨౪
ఆగమిష్యతి సుగ్రీవ స్సర్వేషాం వో నిషూదనః

టీక॥వః=మీయొక్క; సర్వేషాం=అందఱియొక్కయు;నిషూదనః=చంపువాఁడగు;సుగ్రీవస్తు=సుగ్రీవుఁడును.దంతనఖాయుధైః= దంతములునుగోళ్లునేయాయుధంబులుగాఁగల ; ఈదృగ్విధైః=ఇట్టి;హరిభిః = వానరులచేత;శ

స ౪౩

త్రైః=నూఱులచేతను ; శతసహస్రైశ్చ=లక్షలచేతను; అయుతైరపి=దశసహస్రముల చేతను;కోటీభిః= కోటులచేతను;వృతస్తు=చుట్టఁబడినవాఁడైయే;ఆగమిష్యతి=రాఁగలఁడు.

మిమ్ములనందఱంజంపునట్టి వాఁడగు సుగ్రీవుఁడు, దంతములు నఖములునాయుధములుగాఁగల యిట్టి వానరులు, నూఱులుగాను దశసహస్రంబులు గానులక్షలుగాను గోటులుగానుంగొల్వఁగా,నిచ్చటికి రాఁగలఁడు.

అని, తాత్పర్యము.

నేయ మస్తి పురీ లంకా న యూయం నచ రావణః. ౨౫
యస్మా దిక్ష్వాకునాథేన బద్ధం వైరం మహాత్మనా

టీక॥ యస్మాత్=ఎందువలన;మహాత్మనా=అధికమయినపరాక్రమముగల, లేక, పూజ్యమయినస్వభావంబుగల; ఇక్ష్వాకునాథేన= ఇక్ష్వాకువంశమునం బుట్టినవారలకుఁ బ్రభుండైన రామునితో;వైరం=పగ;బద్ధం=కట్టఁబడినదో; తస్మాత్(అధ్యాహృతము)=అందువలన;ఇయం=ఈ;లంకా= లంకయను;పురీ=పట్టణము;న=లేదు.యూయం=మీరు;న=లేరు.రావణశ్చ= రావణుండును;న=లేఁడు.

మీరుమహాత్ముండగు రామునితో వైరంబువహించినారు,కావున, నింకనీలంకాపట్టణమెంతమాత్రమునుండదు, నాశంబునొందును; మీరునుండరుచంపఁబడుదురు; అట్లురావణుండునింకనుండఁడు.అని,హనుమంతుఁడు,చెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే,త్రిచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, సుందరకాండత్రిచత్వారింశసర్గటీక, ముగిసినది.

౪౪

## చతుశ్చత్వారింశసర్గప్రారంభః.

సందిష్టో రాక్షసేంద్రేణ ప్రహస్తస్య సుతో బలీ
జంబుమాలీ మహాదంష్ట్రో నిర్జగామ ధనుర్ధరః. ౧
రక్తమాల్యాంబరధర స్స్రగ్వీ రుచిరకుండలః
మహాన్వివృత్తనయన శ్చండ స్సమరదుర్జయః. ౨
ధను శ్శక్రధనుః ప్రఖ్యం మహ ద్రుచిరసాయకమ్
విస్ఫారయానో వేగేన వజ్రాశనిసమస్వనమ్. ౩

టీక॥ మహాదంష్ట్రః = పెద్దకోఱలు గలవాఁడును; రక్తమాల్యాంబరధరః = ఎఱ్ఱనిపుష్పమాలికలనువస్త్రములను ధరించినవాఁడును; స్రగ్వీ = మంచిపుష్పమాలికలు గలవాఁడును; రుచిరకుండలః = సుందరములయినకుండలములుగలవాఁడును; మహాన్ = పెద్దదేహము గలవాఁడును; వివృత్తనయనః = గుండ్రములయినకండ్లుగలవాఁడును; చండః = భయంకరుండును; సమరదుర్జయః = యుద్ధంబునందు జయింప నలవిగానివాఁడును; బలీ = అధికమయినబలముగలవాఁడును; రాక్షసేంద్రేణ = రాక్షసులకుఁ బ్రభుఁడైనరావణునిచేత; సందిష్టః = ఆజ్ఞాపింపఁబడినవాఁడును; ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క; సుతః = కొడుకునగు; జంబుమాలీ = జంబుమాలియనువాఁడు; ధనుర్ధరః = వింటినిధరించినవాఁడై; శక్రధనుఃప్రఖ్యం = ఇంద్రధనుస్సుతోసమానమయినదియు; మహత్ = గొప్పదియు; రుచిరసాయకం = సుందరములయినబాణంబులుగలదియునగు; ధనుః = వింటిని; వేగేన = వేగముచేత; వజ్రాశనిసమస్వనం = పిడుగుమ్రోఁతతోసమానమయినధ్వనిగల్గునట్లు; విస్ఫారయానః = సారించుచు; నిర్జగామ = వెడలెను.

మహాదంష్ట్రుండును, ఎఱ్ఱనిపుష్పమాలికలును వస్త్రంబులునుధరించినవాఁడును శిరంబునంబూలు ముడుచుకొన్నవాఁడును సుందరంబులయిన కుండలములుగలవాఁడును మహాకాయుండును గుండ్రములయిననేత్రములుగలవాఁడును భయంకరాకారుండును యుద్ధంబున నెవ్వ

రికినిజయింపనలవిగానివాఁడును బ్రహస్తునిపుత్రుండునగు జంబుమాలి యనువాఁడు, రావణునిచేనాజ్ఞాపితుండై, ఇంద్రధనుస్సుంబోలినగొప్పధనువునుసుందరములయినబాణంబులుం దాల్చి, పిడుగుపడినట్లు మహాధ్వనిగలుగునట్లునారిసారించుచు, హనుమంతునిమీఁదికి, వెడలెను అని, తాత్పర్యము.

తస్య విస్ఫారఘోషేణ ధనుషో మహతా దిశః
ప్రదిశశ్చ నభశ్చైవ సహసా సమపూర్యత. ౪

టీక॥ తస్య= ఆజంబుమాలియొక్క; ధనుషః= వింటియొక్క; మహతా= పెద్దదైన; విస్ఫారఘోషేణ= నారిసారించుటయొక్కధ్వనిచేత; దిశః= దిక్కులును; ప్రదిశశ్చ= విదిక్కులును; నభశ్చైవ= ఆకాశమును; సహసా= శీఘ్రముగా; సమపూర్యత (సమపూర్యంత)= నింపఁబడినవి.

అప్పుడా జంబుమాలినారిసారింపఁగాఁగల్గినమహాధ్వని దిక్కులునువిదిక్కులునునూర్ధ్వాధోభాగంబులును, నిండి చెలంగినది. అని, తాత్పర్యము.

రథేన ఖరయుక్తేన త మాగత ముదీక్ష్య సః
హనుమా న్వేగసంపన్నో జహర్షచ ననాదచ. ౫

టీక॥ వేగసంపన్నః = వేగముతోఁగూడిన; హనుమాన్ = హనుమంతుఁడు; ఖరయుక్తేన = గాడిదలతోఁగూడిన; రథేన= రథముచే; ఆగతం= వచ్చిన; తం= ఆజంబుమాలిని; ఉదీక్ష్య= చూచి; జహర్షచ = సంతోషించెను, ననాదచ= ధ్వనిగావించెను.

వేగవంతుండగు నా హనుమంతుండు, గాడిదలుగట్టినరథంబుమీఁదవచ్చినయాజంబుమాలిం జూచి, మఱలయుద్ధంబు సేయఁగల్గెనను సంతోషంబున, సింహనాదంబు గావించెను.

అని, తాత్పర్యము.

తం తోరణవిటంకస్థం హనుమంతం మహాకపిమ్
జంబుమాలీ మహాబాహు ర్వివ్యాధ నిశితై శ్శరైః ౬

టీక॥మహాబాహుః= పెద్దచేతులు గలు;జంబుమాలీ=జంబుమాలి;తోరణవిటంకస్థం=ద్వారమునందలిగువ్వగూడులయందున్న,గువ్వగూడులు వేసియుండు దూలముపైనున్నయనుట;మహాకపిం= పెద్దకోతియయిన,హనుమంతుని; నిశితైః=తీక్ష్ణములయిన;శరైః=బాణములచేత;వివ్యాధ=కొట్టెను.

మహా బాహుండగు జంబుమాలి ద్వారంబుపైఁగా వేసియుండు దూలంబుననున్న హనుమంతుని, దీక్ష్ణంబులగు బాణంబులం బ్రహరించెను.

అని, తాత్పర్యము.

అర్ధచంద్రేణ వదనే శిరస్యే కేన కర్ణినా
బాహ్వో ర్వివ్యాధ నారాచై ర్దశభి స్తం కపీశ్వరమ్. ౭

టీక॥సః(అధ్యాహృతము)= ఆజంబుమాలి;తం=ఆ;కపీశ్వరం=వానరశ్రేష్ఠుండగుహనుమంతుని;వదనే= ముఖమునందు;అర్ధచంద్రేణ=అర్ధచంద్రమువంటిబాణముచేతను;శిరసి = తలయందు;ఏకేన = ఒకటియయిన;కర్ణినా = చెవివంటిబాణముచేతను; బాహ్వోః=చేతులందు; దశభిః=పదియయిన;నారాచైః= అచ్చముఇనుపబాణములచేతను;వివ్యాధ=కొట్టెను.

ఆజంబుమాలి, హనుమంతుని, ముఖంబున, నొకటి యర్ధచంద్రాకార బాణంబును, శిరంబుననొకటి చెవివంటి బాణంబును, బాహువులయందుఁ బదియినుపబాణంబులను, బ్రయోగించెను.

అని, తాత్పర్యము.

తస్య తచ్ఛుశుభేతామ్రం శరేణాభిహతం ముఖమ్
శరదీవాంబుజం ఫుల్లం విద్ధం భాస్కరరశ్మినా. ౮

టీక॥తామ్రం=ఎఱ్ఱనిదియును; శరేణ=బాణముచేత;అభిహతం = కొట్టఁబడినదియునగు;తస్య= ఆహనుమంతునియొక్క;తత్=ఆ;ముఖం= ముఖము; శరది=శరదృతువునందు;ఫుల్లం= వికసించినదియును ; భాస్కరరశ్మినా= సూర్యకిరణముచేత;విద్ధం= వ్యాపింపఁబడినదియునగు;అంబుజమివ= ఎఱ్ఱఁదామరపూవువలె ; శుశుభే = ప్రకాశించినది.

స్వభావంబుననె యెఱ్ఱనైనదియు బాణములచేఁగొట్టఁబడినదికావునరక్తముచేవ్యాపింపఁబడినదియునగు నాహనుమంతునిముఖము, శరదృతువునందుఁ జక్కఁగా వికసించినదియు సూర్యకిరణంబుచేవ్యాప్తమయినదియునగునెఱ్ఱని కమలంబుంబోలెఁ,బ్రకాశించినది.

అని, తాత్పర్యము.

తత్తస్య రక్తం రక్తేన రంజితం శుశుభే ముఖమ్
యథాకాశే మహాపద్మం సిక్తం చందనబిందుభిః. ౯

టీక॥రక్తం=ఎఱ్ఱనిదియు; రక్తేన=నెత్తురుచేత;రంజితం=ఎఱ్ఱఁగాఁజేయఁబడినదియునగు;తస్య=ఆహనుమంతునియొక్క;తత్=ఆ; ముఖం=ముఖము; ఆకాశే=ఆకాశమునందు; చందనబిందుభిః=రక్తచందనముయొక్క బిందువులచేత; సిక్తం=తడుపఁబడిన; మహాపద్మం యథా=ఎఱ్ఱఁగలువవలె ; శుశుభే=ప్రకాశించినది.

స్వభావంబుననెయెఱ్ఱనిదియు రక్తముగానుండుటవలనమఱియు నెఱ్ఱఁగా నున్నదియునగు నాహనుమంతుని ముఖంబు, ఆకాశంబున,రక్తచందనద్రవంబుచేఁదడుపఁబడియుండునెఱ్ఱఁగలువయుంబోలెఁబ్రకాశించినది.

అని, తాత్పర్యము.

చుకోప బాణాభిహతో రాక్షసస్య మహాకపిః

టీక॥ మహాకపిః=పెద్దకోఁతియయినహనుమంతుఁడు; రాక్షస్య=రాక్షసుఁడయినజంబుమాలియొక్క ; బాణాభిహతః = బాణముచేఁగొట్టఁబడినవాఁడై; చుకోప=కోపించెను.

హనుమంతుం డిట్లు జంబుమాలిచే బాణంబులంబ్రహరింపఁబడి, కోపంబు నొందెను. అని, తాత్పర్యము.

తతః పార్శ్వే తివిపులాం దదర్శ మహతీం శిలామ్.౧౦

టీక॥ సః(అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; తతః= అటుపిమ్మట ; పార్శ్వే= ప్రక్కయందు ; అతివిపులాం = మిక్కిలియువిశాల మయినదియు; మహతీం = పెద్దదియునగు; శిలాం=ఱాతిని; దదర్శ=చూచెను.

అంత, నాహనుమంతుండు, తనప్రయుండుటంజూచెను. కొనుఒక్క-విశాలమయిన పెద్దతాయి అని, తాత్పర్యము.

తరసా తాం సముత్పాట్య చిక్షేప బలవద్బలీ

టీక॥ బలీ=అధికమయిన బలముగల హనుమంతుఁడు; తరసా=వేగముచేత; తాం=ఆతాతిని; సముత్పాట్య = పెఱికి; బలవత్=బలముగల్గునట్లుగా; చిక్షేప=వైచెను.

బలవంతుండగు నా హనుమంతుండు, వేగంబున నాతాతిం బెకలించి, తనబలంబు కొలందిజంబుమాలిపై వైచెను. అని, తాత్పర్యము.

తాం శరై ర్దశభిః క్రుద్ధ స్తాడయామాస రాక్షసః. ౧౧

టీక॥ రాక్షసః=రాక్షసుండగు జంబుమాలి; క్రుద్ధః=కోపము నొందినవాఁడై; తాం=ఆతాతిని; దశభిః = పదియైన; శరైః=బాణములచేత; తాడయామాస=కొట్టెను.

అంతజంబుమాలి, కోపించి, పదిబాణంబులనాతాతింబడఁగొట్టెను. అని, తాత్పర్యము.

విపన్నం కర్మ త ద్దృష్ట్వా హనుమాం శ్చండ విక్రమః
సాలం విపుల ముత్పాట్య భ్రామయామాస వీర్యవాన్. ౧౨

టీక॥ చండవిక్రమః= భయంకరమయినపరాక్రమముగలవాఁడును; వీర్యవాన్= అధికమయినపరాక్రమముగలవాఁడునగు; హనుమాన్ = హనుమంతుఁడు; విపన్నం=కొట్టువడిన; తత్=ఆ; కర్మ=కార్యమును; దృష్ట్వా=చూచి; విపులం = విశాలమయిన; సాలం=సాలవృక్షమును; ఉత్పాట్య = పెఱికి; భ్రామయామాస=త్రిప్పెను.

అంత, భయంకరంబగుపరాక్రమంబుగలహనుమంతుఁడు, తానువైచినతాయివ్యర్థమగుటంజూచి, విశాలంబగు నొకసాలంబుఁ బెఱికి, గిఱగిఱంద్రిప్పెను. అని, తాత్పర్యము.

భ్రామయంతం కపిం దృష్ట్వా సాలవృక్షం మహాబలమ్

చిక్షేప సుబహూన్ బాణాన్ జంబుమాలీ మహాబలః. ౧౩

టీక॥మహాబలః= అధికమయినబలముగల;జంబుమాలీ=జంబుమాలి;సాలవృక్షం=సాలవృక్షమును; భ్రామయంతం=త్రిప్పుచున్న;మహాబలం=అధికమయినబలముగల; కపిం=హనుమంతుని; దృష్ట్వా=చూచి;సుబహూన్=మిక్కిలియనేకములయిన; బాణాన్=బాణములను;చిక్షేప=వేసెను.

మహాబలుండగుజంబుమాలి, యట్లు సాలవృక్షంబుఁద్రిప్పుచున్నవాని మహాబలుండగుహనుమంతునింజూచి, పెక్కుబాణంబులుప్రయోగించెను.

అని, తాత్పర్యము.

సాలం చతుర్భి శ్చిచ్ఛేద వానరం పంచభి ర్భుజే
ఉరస్యేకేన బాణేన దశభిస్తు స్తనాంతరే. ౧౪

టీక॥సః (అధ్యాహృతము)= ఆజంబుమాలి;సాలం=సాలవృక్షమును; చతుర్భిః=నాలుగుబాణములచేతను; చిచ్ఛేద=నఱికెను.వానరం=హనుమంతుని;భుజే=భుజమునందు;పంచభిః = అయిదుబాణములచేతను;ఉరసి = ఱొమ్మునందు;ఏకేన=ఒకటియైన;బాణేన=బాణముచేతను; స్తనాంతరేతు = స్తనంబులనడుమనుమాత్రము; దశభిః=పదిబాణములచేతను;వివ్యాధ (అధ్యాహృతము)=కొట్టెను.

ఆజంబుమాలి, నాలుగుబాణంబులచేసాలవృక్షముసుఖండించి, హనుమంతుసిభుజంబున నయిదు బాణంబులను ఱొమ్మునొకటిబాణమును స్తన ప్రదేశములందుఁబదిబాణంబులనుం,బ్రయోగించెను. అని, తాత్పర్యము.

స శరైః పూరితతనుః క్రోధేన మహతా వృతః
త మేవ పరిఘం గృహ్య భ్రామయామాస వేగితః. ౧౫

టీక॥సః=ఆహనుమంతుఁడు ; శరైః=బాణంబులచేత; పూరితతనుః=నిండఁబడినదేహముగలవాఁడై; మహతా=అధికమయిన; క్రోధేన= కోపముచే;వృతః=వ్యాపింపఁబడినవాఁడై; తం=ఆపరిఘమేవ= మునుపటిదియనే

గృహ్య(గృహీత్వా)=తీసికొని, వేగితః=వేగముపొందినవాఁడై; భ్రామయామాస=త్రిప్పెను.

అట్లాహనుమంతుండు, తనదేహం బంతయుబాణంబులం గప్పఁబడఁగామహాకోపంబునొంది యాయినుపగుదియనేవీసికొని, వేగంబునంద్రిప్పెను.

అని, తాత్పర్యము.

అతివేగో ఽతివేగేన భ్రామయిత్వా బలోత్కటః
పరిఘం పాతయామాస జంబుమాలే ర్మహోరసి. ౧౬

టీక॥అతివేగః= అధికమయినవేగముగలవాఁడును;బలోత్కటః= బలముచేమిక్కిలియు నధికుఁడైన వాఁడునగు హనుమంతుఁడు;అతివేగేన= అధికమయినవేగముచేత;భ్రామయిత్వా= త్రిప్పి;పరిఘం= ఇనుపగుదియను; జంబుమాలేః=జంబుమాలియొక్క; మహోరసి = పెద్దఱొమ్మునందు;పాతయామాస=పడవేసెను.

కొలందిలేనిబలముగలవాఁడును మహావేగముగలవాఁడునగు నాహనుమంతుండు, ఇట్లు మహావేగంబునంద్రిప్పి, యాయినుపగుదియను విశాలంబగునా జంబుమాలిఱొమ్మునపై,వైచెను.

అని, తాత్పర్యము.

తస్య చైవ శిరో నాస్తి న బాహూ న చజానునీ
న ధను ర్న రథో నాశ్వా స్తత్రాదృశ్యంత నేషవః. ౧౭

టీక॥తత్ర=అచ్చట;తస్య=ఆజంబుమాలియొక్క;శిరశ్చైవ=తలయును; నాస్తి=లేదు.బాహూ = చేతులును; న=లేవు.జానునీ=మోఁకాళ్లును. న=లేవు.ధనుః=విల్లును;న=లేదు. రథః=రథమును;న=లేదు.అశ్వాః= గుఱ్ఱములను,గాడిదలనుట;న=లేవు. ఇషవః=బాణములును;నాదృశ్యంత = చూడఁబడలేదు.

అంత, నచ్చట, నాజంబుమాలితలగానిచేతులుగాని మోఁకాళ్లుగాని విల్లుగాని రథముగానిగాడిదలుగాని బాణంబులుగాని,యేదియునగపడలేదు.

అని, తాత్పర్యము.

సహత స్సహసా తేన జంబుమాలీ మహాబలః

సపాత నిహతో భూమౌ చూర్ణితాంగవిభూషణః. ౧౮

టీక॥ మహాబలః=అధికమయినబలముగల; సః=ఆ; జంబుమాలీ= జంబుమాలి; తేన=ఆహనుమంతునిచేత; సహసా=వేగముచేత;హతః= కొట్టఁబడినవాఁడై;నిహతః= చంపఁబడినవాఁడై; చూర్ణితాంగవిభూషణః= చూర్ణముగాఁజేయఁబడిన దేహమును సొమ్ములునుగలవాఁడై;భూమౌ = నేలయందు;పపాత=పడెను.

అట్లు హనుమంతుండు వేగంబునం గొట్టఁగానే,మహాబలుండగు నాజంబుమాలి,చచ్చుటయెగాక, అతని దేహంబునాభరణంబులునుచూర్ణములై రూపఱి నేలంబడినవి.అని, తాత్పర్యము.

జంబుమాలించ నిహతం కింకరాంశ్చ మహాబలాన్
చుక్రోధ రావణశ్శ్రుత్వా కోపసంరక్తలోచనః. ౧౯

టీక॥ రావణః=రావణుఁడు; జంబుమాలించ=జంబుమాలిని ; నిహతం= చంపఁబడినవానిఁగాను;మహాబలాన్= అధికమయినబలముగల; కింకరాంశ్చ= కింకరులను; నిహతాన్ (అధ్యాహృతము)=చంపఁబడిన వారలఁగాను ; శ్రుత్వా=విని; కోపసంరక్తలోచనః=కోపముచేనెఱ్ఱనైనకండ్లుగలవాఁడై ; చుక్రోధ=కోపించెను.

అంత, రావణుండు, బలవంతులగు కింకరులుచంపఁబడుటయెగాక జంబుమాలియుఁజంపఁబడుటనువిని, కనుఁగొనలనెఱుపుగదుర,మహాకోపంబు నొందెను. అని, తాత్పర్యము

స రోషసంవర్తితతామ్రలోచనః
ప్రహస్తపుత్రే నిహతే మహాబలే
అమాత్యపుత్రా నతివీర్యవిక్రమాన్
సమాదిదేశాశు నిశాచరేశ్వరః. ౨౦

టీక॥మహాబలే= అధికమయిన బలముగల;ప్రహస్తపుత్రే= ప్రహస్తునికొడుకైనజంబుమాలి;నిహతే=చంపఁబడఁగా;నిశాచరేశ్వరః=రాక్షసులకుఁబ్రభు

వైన; సః = ఆరావణుఁడు; రోషసంవర్తిత
తతామ్రలోచనః = కోపముచేఁద్రిప్పబ
డినయెఱ్ఱనికండ్లుగలవాఁడై; ఆశు = శీ
ఘ్రముగా; అతివీర్యవిక్రమాన్ = అధి
కమయినబలమును బరాక్రమమునుగల
వారలగు; అమాత్యపుత్రాన్ = మంత్రిపు
త్రులను; సమాదిదేశ = ఆజ్ఞాపించెను.

మహాబలుఁడగుప్రహస్తపుత్రుండు
జంబుమాలిచావఁగానే, రావణుండు,
కోపంబునం గనులనెఱ్ఱఁదనంబుగదుర,
శీఘ్రంబున, మహాబలపరాక్రమశాలుల
గుమంత్రిపుత్రుల, హనుమంతునిపైకిఁ,
బోవనాజ్ఞాపించెను.
అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, చతుశ్చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండ చతుశ్చత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

౪౫.
పంచచత్వారింశసర్గ ప్రారంభః.

తత స్తే రాక్షసేంద్రేణ చోదితా మంత్రిణ స్సుతాః
నిర్యయు ర్భవనా త్తస్మా త్స ప్తసప్తార్చివర్చసః. ౧
మహాబల పరీవారా ధనుష్మంతో మహాబలాః
కృతా స్త్రాస్త్రవిదాం శ్రేష్ఠాః పరస్పర జయైషిణః. ౨
హేమజాల పరిక్షిప్తై ర్ధ్వజవద్భిః పతాకిభిః
తోయదస్వననిర్ఘోషై ర్వాజియుక్తై ర్మహారథైః. ౩
త ప్తకాంచనచిత్రాణి చాపా న్యమితవిక్రమాః
విస్ఫారయంత స్సంహృష్టా స్తటిత్వంత ఇవాంబుదాః. ౪

టీక॥ తతః = అటుపిమ్మట; సప్తార్చివర్చసః (సప్తార్చిర్వర్చసః) = అగ్నిహో

త్రముయొక్క కాంతివంటికాంతిగలవారలును; మహాబలాః = అధికమయినబలము గలవారలును; కృతాస్త్రాః అస్త్రవిదాం = నేర్వఁబడిన యస్త్రములుగలవారలలోను అస్త్రంబుల నెఱింగినవారలలోను; శ్రేష్ఠాః = ఉత్తములును; అమితవిక్రమాః = కొలదిలేనిపరాక్రమముగలవారలును; రాక్షసేంద్రేణ = రాక్షసులకు ప్రభువైన రావణునిచేత; చోదితాః = ఆజ్ఞాపింపఁబడినవారలునగు; తే = ఆ; మంత్రిణః = మంత్రియొక్క; సుతాః = కొడుకులు; సప్త = ఏడుగురు; మహాబలపరీవారాః = గొప్పసైన్యముపరివారముగాఁగలవారలై; ధనుష్మంతః = గొప్పధనువులుగలవారలై; పరస్పరజయైషిణః = ఒండొరులయొక్క జయమునుగోరువారలై; హేమజాలపరిక్షిప్తైః = బంగారముల సమూహముచేఁగప్పఁబడినవియు; ధ్వజవద్భిః = రాజచిహ్నములువ్రాసిన టెక్కెములుగలవియు; పతాకిభిః = సాధారణములైన టెక్కెములుగలవియును; తోయదస్వననిర్ఘోషైః = మేఘముయొక్క ధ్వనివంటి ధ్వనిగలవియును; వాజియుక్తైః = గుణములతోఁగూడినవియునగు; మహారథైః = గొప్పరథములతో; సహితాః (అధ్యాహృతము) = గూడినవారలై; సంప్రహృష్టాః = సంతోషమునొందినవారలై; తప్తకాంచనచిత్రాణి = కాఁచఁబడినబంగారముచేనానావర్ణములుగల; చాపాని = విండ్లను; విస్ఫారయంతః = సారింపుచు; తటిత్వంతః = మెఱుపులుగల; అంబుదాః ఇవ (స్థితాః) = మేఘములువలెనున్నవారలై; తస్మాత్ = ఆ; భవనాత్ = ఇంటనుండి; నిర్యయుః = వెడలిరి.

అంత, మహాబలశాలులును అస్త్రవేత్తలలోనుత్తములునుగొలందిలేని పరాక్రమంబుగలవారలునగు నామంత్రిపుత్రులేడ్వురు, రాక్షసేశ్వరుండయిన రావణునిచే నాజ్ఞాపితులయి, అగ్నిహోత్రంబుకైవడిఁ గ్రాలుచు, గొప్పసైన్యంబుదీసికొని, గొప్పధనువులం దాల్చి, బంగారముతోఁ గప్పఁబడినవియు రాజచిహ్నంబులతోఁగూడిన ధ్వజంబులుగలవియు సాధారణంబులగు టెక్కెంబులతోనలంకరింపఁ బడినవియు మేఘంబునకుంబోలె మహాధ్వని గలవియుగుఱ్ఱంబులతోఁగూడినవియునగు రథంబుల నెక్కి, "నేనుజయించెదను నేనుజయించెదను" అని, యహమహమికోక్తులాడుచుఁ, బరమసంతోషంబునొంది, బంగారముతోనలంకరింపఁబడినధనువులను

సారింపుచు, మెఱపులతోఁగూడిన మేఘంబులకరణిం గ్రాలుచు, గృహంబున నుండి వెడలిరి. అని, తాత్పర్యము.

జనన్యస్తు తత స్తేషాం విదిత్వా కింకరాన్ హతాన్
బభూవు శ్శోకసంభ్రాంతా స్సబాంధవసుహృజ్జనాః. ౫

టీక॥ తతః=అటుపిమ్మట; తేషాం=వారలయొక్క; సబాంధవ సుహృజ్జనాః= బంధువులతోను స్నేహితులతోనుగూడిన; జనన్యస్తు = తల్లులు మాత్రము; కింకరాన్=కింకరులను; హతాన్=చంపఁబడినవారలనుగా; విదిత్వా=తెలిసికొని; శోకసంభ్రాంతాః=దుఃఖముచేతఁదొట్రుపాటునొందినవారలు; బభూవుః=అయిరి.

అంత, వారలతల్లులును బంధువులును స్నేహితులును, "హనుమంతుండు కింకరులనుంగూడఁ జంపినాఁ"డని, విని. "అట్టిహనుమంతునిమీఁదికి వీరలుపోయెదరే" యనిమిక్కిలియుదుఃఖంబునొందిరి. అని, తాత్పర్యము.

తే పరస్పరసంఘర్షా త్తప్తకాంచనభూషణాః
అభిపేతు ర్హనూమంతం తోరణస్థ మవస్థితమ్. ౬

టీక॥ తప్తకాంచన భూషణాః= కాచఁబడిన బంగారపు సొమ్ములుగల; తే=ఆమంత్రికొడుకులు; తోరణస్థం=ద్వారంబుననున్నవాఁడును; అవస్థితం=సన్నద్ధుండునగు; హనూమంతం=హనుమంతునిగూర్చి; పరస్పరసంఘర్షాత్=ఒండొరులయొక్క యొరయుటవలన; అభిపేతుః=అభిముఖముగాఁబోయిరి.

ఉత్తమంబగు బంగారముతోఁ జేసినభూషణంబులు దాల్చియున్న యామంత్రిపుత్రులు, "నేనుముందు పోవలయు నేనుముందుపోవలయు" ననిఒకరి నొకరొరసికొనుచు, నాయశోకవన ద్వారంబున యుద్ధసన్నద్ధుండైయున్న హనుమంతుని మీఁదికిఁబోయిరి. అని, తాత్పర్యము.

సృజంతో బాణవృష్టిం తే రథగర్జితనిస్స్వనాః
వృష్టిమంత ఇవాంభోదా విచేరు ర్నైరృతాంబుదాః. ౭

టీక॥ తే=ఆ; నైరృతాంబుదాః= రాక్షసులను మేఘములు ; రథగర్జితనిస్స్వనాః= రథముయొక్క మేఘగర్జనమువంటిధ్వనిగలవారలై ; బాణవృష్టిం=బాణవర్షమును; సృజంతః= వృష్టించుచు; వృష్టిమంతః= వర్షముగల; అంభోదాఇవ=మేఘములువలె ; విచేరుః=విహరించిరి.

ఆమంత్రిపుత్రులు, ఏవ్వురును, రథధ్వనియెగర్జితంబుగా , బాణవర్షంబుగురియించుచు , వర్షముగురియు మేఘంబులుంబోలె , విహరించిరి.

అని, తాత్పర్యము.

అవకీర్ణ స్తత స్తాభి ర్హనుమాన్ శరవృష్టిభిః
అభవ త్సంవృతాకార శ్శైలరాడివ వృష్టిభిః. ౮

టీక॥తతః=అటుపిమ్మట ; హనుమాన్=హనుమంతుఁడు; తాభిః=ఆ; శరవృష్టిభిః=బాణవర్షములచేత;అవకీర్ణః=వ్యాపింపఁబడినవాఁడై; వృష్టిభిః=వర్షములచేత;శైలరాడివ=హిమవత్పర్వతమువలె;సంవృతాకారః= కప్పఁబడినయాకారముగలవాఁడు; అభవత్=ఆయెను.

అంత,హనుమంతుండు, ఆబాణవర్షంబులమునింగి,వర్షంబులం గప్పఁబడినహిమవత్పర్వతంబుకరణి, నొప్పుచుండెను. అని, తాత్పర్యము.

స శరా న్మోఘయామాస తేషా మాశుచరః కపిః
రథవేగంచ వీరాణాం విచర న్విమలేం బరే. ౯

టీక॥ఆశుచరః=శీఘ్రముగాఁ దిరుగునట్టి;సః=ఆ;కపిః=వానరుఁడు; విమలే=స్వచ్ఛమయిన; అంబరే= ఆకాశమందు; విచరన్ = తిరుగుచు; వీరాణాం=పరాక్రమశాలులగు; తేషాం = ఆమంత్రిపుత్రులయొక్క;శరాన్= బాణంబులను; రథవేగంచ=రథములయొక్క వేగమును; మోఘయామాస= వ్యర్థముగాఁజేసెను.

ఆహనుమంతుండు, పరాక్రమవంతులగునారాక్షసుల బాణంబులు దనపైఁబడకుండునట్లునువారలు రథవేగంబునఁదన్నుగుఱిపట్టకుండునట్లును, అతిశీఘ్రముగాస్వచ్ఛమయినయాకాశంబున,సంచరించుచుండెను.

అని, తాత్పర్యము.

స తైః క్రీడ న్ధనుష్మద్భి ర్వ్యోమ్ని వీరః ప్రకాశతే
ధనుష్మద్భి ర్యథా మేఘై ర్మారుతః ప్రభు రంబరే. ౧౦

టీక॥వీరః= పరాక్రమశాలియగు; సః=ఆహనుమంతుఁడు; వ్యోమ్ని=ఆకాశమునందు;ధనుష్మద్భిః=విండ్లుగల; తైః=ఆరాక్షసులతోఁ;క్రీడన్= విహరించుచు; అంబరే=ఆకాశమునందు; ధనుష్మద్భిః=ఇంద్రధనుస్సుగల;మేఘైః=మేఘములతోఁ; క్రీడన్(అధ్యాహృతము)=విహరించుచున్న; ప్రభుః=నాయకుఁడయిన; మారుతఇవ=వాయువువలె;ప్రకాశతే=ప్రకాశించుచుండెను.

పరాక్రమవంతుండగు నాహనుమంతుండు, ధనుర్ధరులగు నారాక్షసులతోనాకాశంబునవిహరించుచు, నాకాశంబున నింద్రధనుస్సుతోఁగూడినమేఘంబుల నొప్పుచుండు వాయుదేవునికైవడిఁ,జూపట్టుచుండెను.

అని, తాత్పర్యము.

స కృత్వా నినదం ఘోరం త్రాసయం స్తాం మహాచమూమ్
చకార హనుమా న్వేగం తేషు రక్షస్సు వీర్యవాన్. ౧౧

టీక॥వీర్యవాన్=అధికమయినపరాక్రమముగల;సః=ఆ;హనుమాన్= హనుమంతుఁడు;ఘోరం= భయంకరమయిన;నినదం=ధ్వనిని;కృత్వా= చేసి; తాం=ఆ;మహాచమూం= గొప్పసేనను;త్రాసయన్ = భయపఱచుచు; తేషు=ఆ;రక్షస్సు=రాక్షసులయందు; వేగం=వేగమును;చకార=చేసెను.

మహాపరాక్రమశాలియగునాహనుమంతుండు,భయంకరంబుగానఱచి, ఆసేననంతయువెఱపించుచు, నారాక్షసులయందు,వేగంబువహించెను.

అని,తాత్పర్యము.

తలేనా భ్యహన త్కాంశ్చి త్పాదైః కాంశ్చి త్పరంతపః
ముష్టినాభ్య హనత్కాంశ్చి న్నఖైః కాంశ్చిద్వ్యదారయత్. ౧౨

టీక॥ పరంతపః=శత్రువులందపింపఁజేయునట్టిహనుమంతుండు;తలేన=అ

ఱచేతిచేత; కాంశ్చిత్=కొందఱను; అభ్యహనత్=కొట్టెను. పాదైః=పాదంబులచేత; కాంశ్చిత్ = కొందఱను; అభ్యహనత్ (అధ్యాహృతము)= కొట్టెను. ముష్టినా=పిడికిలిచేత; కాంశ్చిత్= కొందఱను; అభ్యహనత్=కొట్టెను. నఖైః=గోళ్లచేత; కాంశ్చిత్= కొందఱను; వ్యదారయత్=చీల్చెను.

శత్రువులందడపింపఁ జేయునట్టిహనుమంతుండు, ఆరాక్షసులంగొందఱ, నఱచేతం గొట్టెను; కొందఱఁ, బాదంబులం దన్నెను; కొందఱఁబిడికిటిపోటులంబొడిచెను; మఱికొందఱ, నఖంబులంజీల్చెను.

అని, తాత్పర్యము.

ప్రమమాథో రసా కాంశ్చి దూరుభ్యా మపరాన్ కపిః

టీక॥ కపిః=హనుమంతుండు; కాంశ్చిత్=కొందఱను; ఉరసా = ఱొమ్ముచేత; ప్రమమాథ = చంపెను. అపరాన్=ఇతరులను; ఊరుభ్యాం=తొడలచేత; ప్రమమాథ (అధ్యాహృతము)= చంపెను.

హనుమంతుండు, కొందఱరాక్షసులనుఱొమ్ముతోఁజంపెను; మఱికొందఱనుదొడలతోఁజంపెను.

అని, తాత్పర్యము.

కేచి త్తస్య నినాదేన తత్రైవ పతితా భువి. ౧౩

టీక॥ కేచిత్=కొందఱు; తస్య= ఆహనుమంతునియొక్క; నినాదేన=ధ్వనిచేత; తత్రైవ=అచ్చటనే; భువి= నేలయందు; పతితాః=పడినారు.

కొందఱాహనుమంతునిధ్వనికి, యచ్చటనే నేలంబడిరి. అని, తాత్పర్యము.

తత స్తేష్వ వసన్నేషు భూమౌ నిపతితేషు చ
తత్సైన్య మగమ త్సర్వం దిశో దశ భయార్దితమ్. ౧౪

టీక॥ తతః=అటుపిమ్మట; తేషు= ఆరాక్షసులు; అవసన్నేషు= మృతులై; భూమౌ= నేలయందు; నిపతితేషు చ= పడినవారలనుకాఁగా; తత్ =ఆ; సైన్యం= సేన; సర్వం=అంతయు; భయార్దితం=భయముచేఁ బీడింపఁబడినదై; దశ=పదియైన; దిశః= దిక్కులనుఁగూర్చి; అగమత్ =పోయినది.

అంత, నా రాక్షసులు, మృతులై, నేలంబడినదిచూ, మిగిలినసైన్యం బంతయు, భయంబునొంది, దిక్కులకుంబఱచినది. అని, తాత్పర్యము.

వినేదు ర్విస్వరం నాగా నిపేతు ర్భువి వాజినః
భగ్ననీడధ్వజచ్ఛత్రై ర్భూశ్చ కీర్ణాఽభవ ద్రథైః. ౧౫

టీక॥నాగాః=ఏనుంగులు ; విస్వరం=వికృతంబగుధ్వనిగల్గునట్లుగా; వినేదుః=అఱచినవి.వాజినః = గుఱ్ఱములు;భువి=నేలయందు; నిపేతుః=పడినవి. భగ్ననీడధ్వజచ్ఛత్రైః= విఱిగిన పైకప్పునుధ్వజంబును గొడుగునుగల;రథైః=రథములచేత; భూశ్చ=నేలయును; కీర్ణా=వ్యాపింపఁబడినది; అభవత్=అయినది.

ఏనుంగులువికృతంబుగానఱచినవి; గుఱ్ఱంబులు నేలంబడినవి; రథంబులపైకప్పులునుధ్వజంబులుగొడుగులునువిఱిగి, భూమియంతయునావరించినవి.

అని, తాత్పర్యము.

స్రవతా రుధిరేణాథ స్రవంత్యో దర్శితాః పథి
వివిధైశ్చ స్వరై ర్లంకా ననాద వికృతం తదా. ౧౬

టీక॥అథ=అటుపిమ్మట;పథి=మార్గమునందు;స్రవతా= కాఱుచున్న; రుధిరేణ=నెత్తురుచేత;స్రవంత్యః= ఏఱులు ; దర్శితాః=చూపఁబడినవి. తదా=అప్పుడు;లంకాచ = లంకాపురియును;వివిధైః= నానావిధములయిన; స్వరైః=ధ్వనులచేత;వికృతం= వికారముగల్గునట్లుగా;ననాద=అఱచినది.

అంత, మార్గమునందు నెత్తురు,ఏఱులుగట్టిపాఱినది; అప్పుడులంకయందంతయు,నానావిధంబులుగా, వికృతధ్వని,వినఁబడినది.అని, తాత్పర్యము.

స తా న్ప్రవృద్ధా న్వినిహత్య రాక్షసా
న్మహాబల శ్చండపరాక్రమః కపిః
యుయుత్సు రన్యైః పునరేవ రాక్షసై
స్తమేవ వీరోఽభిజగామ తోరణమ్. ౧౭




టీక॥వీరః= పరాక్రమశాలియును; మహాబలః=అధికమయినబలముగలవాఁడును; చండపరాక్రమః= భయంకరమయినపరాక్రమముగలవాఁడునగు; సః= ఆ; కపిః = హనుమంతుఁడు; ప్రవృద్ధాన్=పెరిఁగిన; తాన్ = ఆ; రాక్షసాన్=రాక్షసులను; వినిహత్య=చంపి; పునరేవ=మఱలనే; అన్యైః= ఇతరులయిన; రాక్షసైః=రాక్షసులతో ; యుయుత్సుః=పోరఁగోరినవాఁడై; తం= ఆ; తోరణమేవ=ద్వారప్రదేశమునే; అభిజగామ=పొందెను.

మహాబలుండును, భయంకరంబగు పరాక్రమంబుగలవాఁడునగు నాహనుమంతుండు, బలంబునవృద్ధులగునారాక్షసులంజంపి, యింకను, ఇతరులగురాక్షసులతో యుద్ధముసేయఁగోరి, యాతోరణప్రదేశమునకేపోయియుండెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, సుందరకాండే, పంచచత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు,శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు,సుందరకాండపంచచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

౪౬

షట్చత్వారింశసర్గప్రారంభః.

హతాన్ మంత్రిసుతాన్ బుద్ధ్వా వానరేణ మహాత్మనా
రావణ స్సంవృతాకార శ్చకార మతి ముత్తమామ్. ౧

టీక॥రావణః=రావణుఁడు; మంత్రిసుతాన్=మంత్రికొడుకులను ; మహాత్మనా= అధికమయినపరాక్రమముగల ; వానరేణ = హనుమంతునిచేత ; హతాన్ = చంపఁబడినవారలనుగా; బుద్ధ్వా=తెలిసికొని; సంవృతాకారః=క

ప్పఁబడిన బొమముడిపాటులో నగువికారముగలవాఁడై; ఉత్తమాం=శ్రేష్ఠమయిన; మతిం=ఆలోచనను; చకార=చేసెను.

రావణుండు, మంత్రిపుత్రులు, మహాపరాక్రమశాలియగు హనుమంతునిచేఁ జంపఁబడిరని, తెలిసికొని, మనంబునభయంబునొందినవాఁడయ్యు, దానినొరులకుం దెలియనీయక, భయంబునంగల్గు దేహవికారంబులంగప్పికొని, మంచి యాలోచన చేసెను. అని, తాత్పర్యము.

స విరూపాక్ష యూపాక్షౌ దుర్ధరం చైవ రాక్షసమ్
ప్రఘసం భాసకర్ణం చ పంచ సేనాగ్రనాయకాన్. ౨
సందిదేశ దశగ్రీవో వీరా న్నయవిశారదాన్
హనుమద్గ్రహణవ్యగ్రా న్వాయువేగసమా న్యుధి. ౩

టీక॥ సః=ఆ; దశగ్రీవః=రావణుఁడు; విరూపాక్షయూపాక్షౌ=విరూపాక్షునియూపాక్షుని; దుర్ధరం=దుర్ధరుఁడను; రాక్షసంచైవ=రాక్షసుని; ప్రఘసం=ప్రఘసుండనువాని; భాసకర్ణంచ=భాసకర్ణుని; హనుమద్గ్రహణవ్యగ్రాన్=హనుమంతునిపట్టుకొనుటయం దధికేచ్ఛగలవారలును; యుద్ధే=యుద్ధమునందు; వాయువేగసమాన్=వాయువుయొక్క వేగముతోసమానమయినవేగముగలవారలును; నయవిశారదాన్=నీతిశాస్త్రంబునఁ బండితులును; వీరాన్=శూరులునగు; ఏతాన్ (అధ్యాహృతము)=ఈ; సేనాగ్రనాయకాన్=సేనాధిపతులను; పంచ=అయిదుగిరిని; సందిదేశ=ఆజ్ఞాపించెను.

ఆ రావణుండు, విరూపాక్షునియూపాక్షునిదుర్ధరుండనురాక్షసుని ప్రఘసునిభాసకర్ణుండనువాని, హనుమంతుంబట్టుకొన నధికేచ్ఛ గలవారలును యుద్ధంబునవాయుదేవునకుంబోలె వేగంబు గలవాగలు నయవిశారదులును శూరులునగు, ఈసేనానాయకుల నైదుగురింజూచి, యిట్లని, యాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

యాత సేనాగ్రగా స్సర్వే మహాబలపరిగ్రహాః
సవాజిరథమాతంగా స్స కపి శ్శాస్యతామితి. ౪

స౪౬

టీక॥ మహాబలపరిగ్రహాః = అధికమయిన బలముయొక్క-స్థానములయిన; సేనాగ్రగాః = సేనాధిపతులారా! యూయం(అధ్యాహృతము)=మీరలు; సర్వే= అందఱును; సవాజిరథమాతంగాః=గుఱ్ఱములతోను రథములతోను ఏనుగులతోనుం గూడినవారలై; యాత= పొండు. సః=ఆ; కపిః= వానరుండు; శాస్యతాం=శిక్షింపబడుంగాక. ఇతి= అని; సందిదేశ (అధ్యాహృతము)=ఆజ్ఞాపించెను.

మహాబలశాలులగు సేనాధిపతులారా! మీరలందఱు, గుఱ్ఱంబులను రథంబులను గజంబులనుంగూడిపోయి, యావానరుని శిక్షింపుఁడు. అని, యాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

యత్తైశ్చ ఖలు భావ్యం స్యాత్త మాసాద్య వనాలయమ్
కర్మణాచాపి సమాధేయం దేశకాలవిరోధినమ్. ౫

టీక॥ తం=ఆ; వనాలయం=కోఁతిని; ఆసాద్య=చేరి; యుష్మాభిః= మీచేత; యత్తైశ్చ=యత్నించువారలుగా; భావ్యం=కాఁదగినది; స్యాత్ =ఖలు; అగునుగదా ; దేశకాలవిరోధినం= (దేశకాలవిరోధి) దేశమునకును గాలమునకును విరోధించునట్టి; కర్మణాచాపి= కార్యమును; సమాధేయం=సరిపఱుచుకొనఁదగినది.

మీరావానరునొద్దకుఁబోయి, యెంతమాత్రము నేమఱక ప్రయత్నంబున నుండవలయును; మఱియు దేశకాలవిరోధియయిన కార్యమునుజేయరాదు. అని, తాత్పర్యము.

నహ్యహం తం కపిం మన్యే కర్మణా ప్రతి తర్కయన్

టీక॥ అహం= నేను; కర్మణా= కార్యముచేత; ప్రతితర్కయన్=విచారింపుచు; తం=అతని; కపిం=వానరునిగా; నమన్యేహి=తలంపనుగదా.

అతండు సేయుకార్యంబులవిచారింపఁగా, నతండువానరుండనినాకుఁదోఁచలేదు. అని, తాత్పర్యము.

సర్వథా త న్మహ ద్భూతం మహాబలపరిగ్రహమ్. ౬

టీక॥ తత్=అది; సర్వథా= అన్ని విధంబులను ;మహాబలపరిగ్రహం=గొప్పబలమునకుస్థానమయిన; మహత్=గొప్పదగు; భూతం=భూతము.

అన్ని విధంబులం జూడఁగా, నది, మహాబలంబుగలగొప్పభూతంబుగానున్నదిగాని, వేఱుగాదు.

అని, తాత్పర్యము.

భవే దింద్రేణవా సృష్ట మస్మదర్థం తపోబలాత్

టీక॥అస్మదర్థం=మనకొఱకు; తపోబలాత్= తపంబుయొక్కబలిమివలన;ఇంద్రేణ=ఇంద్రునిచేత;సృష్టంవా=సృజింపఁబడినదేమొ!

ఒకవేళనింద్రుండుతపస్సుచేసి,మనలంజంపుటకై,యీభూతంబునుసృజించినాఁడేమొ!అని, తాత్పర్యము.

సనాగయక్షగంధర్వా దేవాసురమహర్షయః. ౭
యుష్మాభి స్సహితై స్సర్వై ర్మయా సహ వినిర్జితాః

టీక॥మయా=నాచేత; సహితైః=కూడిన;యుష్మాభిః=మీతో; సర్వైస్సహ=అందఱితోఁగూడ; సనాగయక్షగంధర్వాః=సర్పములతోనుయక్షులతోనుగంధర్వులతోనుంగూడిన; దేవాసురమహర్షయః=దేవతలునసురులునుమహర్షులును;వినిర్జితాః=జయింపఁబడినారు.

నేనుమున్ను, మిమ్ములనందఱంగూడి,సర్పంబులనుయక్షులనుగంధర్వులను దేవతల నసురులను మహర్షులను జయించియున్నాను. అని, తాత్పర్యము.

తై రవశ్యం విధాతవ్యం వ్యళీకం కించిదేవ నః. ౮
తదేవ నాత్ర సందేహః ప్రసహ్య పరిగృహ్యతామ్

టీక॥తైః=వారలచేత;నః=మనకు; కించిత్=కొంచెము;వ్యళీకం= అప్రియము;అవశ్యం=అవశ్యముగా;విధాతవ్యమేవ=చేయఁబడవలసినదే.తదేవ= అదియే.అత్ర=ఈవిషయమునందు;సందేహః=సంశయము;న=లేదు.ప్రసహ్య=బలాత్కారముగా;పరిగృహ్యతాం=పట్టుకొనఁబడుఁగాక.

కాఁబట్టి,వారలు,మనకేదైననుబదులుగాఁగీడుసేయవలసినదే; అట్టిదేయి

ది; ఇందుకుసందేహములేదు ; బలాత్కారముగాదానింబట్టుకొనుడు.

అని, తాత్పర్యము.

నావమాన్యో భవద్భిశ్చ హరి ర్భీకర పరాక్రమః. ౯

టీక॥ భీరపరాక్రమః = భయంకరమయినపరాక్రమముగల; హరిః= వానరుడు; భవద్భిశ్చ=మీచేతనుంగూడ ; అవమాన్యః= అవమానింపఁదగినవాఁడు; న=కాఁడు.

ఈవానరుఁడు, భయంకరమగుపరాక్రమముగలవాఁడు, కావునవీనినవమానింపమీకునలవిగాదు. అని, తాత్పర్యము.

ఈయర్థశ్లోకమునందు "భీరపరాక్రమః" అనుశబ్దమునందలి (భీ) అనునక్షరముచేత గాయత్రి పదునాలవయక్షరముగ్రహింపబడినది. పదుమూడువేలశ్లోకంబులైనవి. పదునాలవశ్లోకసహస్రమునకిదియారంభము.

దృష్టాహి హరయః పూర్వం మయా విపులవిక్రమాః
వాలీచ సహసుగ్రీవో జాంబవాంశ్చ మహాబలః. ౧౦
నీల స్సేనాపతిశ్చైవ యేచాన్యే ద్వివిదాదయః

టీక॥ సహసుగ్రీవః= సుగ్రీవునితోఁగూడిన; వాలీచ=వాలియును; మహాబలః= అధికమయిన బలముగల; జాంబవాంశ్చ=జాంబవంతుండును; సేనాపతిః= సేనానాయకుండగు; నీలశ్చైవ=నీలుండును; ద్వివిదాదయః= ద్వివిదుఁడుమొదలుగాఁగల; అన్యే=ఇతరులు; యే(సంతి)=ఎవ్వరుగలరో; తే=(అధ్యాహృతము)చ=వారలును; ఏతే(అధ్యాహృతము)=ఈ; విపులవిక్రమాః = అధికమయినపరాక్రమముగల; హరయః= కోఁతులు; మయా=నాచేత; పూర్వం= మున్ను, దృష్టాహి = చూడఁబడినారుగదా!

నేను, మున్ను, వాలినిసుగ్రీవుని, మహాబలుండగు జాంబవంతుని , వానరసేనానాయకుండగునీలుని , మఱియు ద్వివిదుండుమున్నగునితరులను, మహాపరాక్రమశాలులగువానరులం , జూచియున్నాను. అని, తాత్పర్యము.

నైవం తేషాం గతి ర్భీమా నతేజో నపరాక్రమః. ౧౧

న మతి ర్న బలోత్సాహౌ న రూపపరికల్పనమ్

టీక॥ తేషాం=వారలకు, ఏవం=ఇట్లు; భీమా= భయంకరమయిన; గతిః= గమనము; న=లేదు. తేజః=కాంతి; న=లేదు. పరాక్రమః = పరాక్రమము; న=లేదు. మతిః=బుద్ధి; న= లేదు. బలోత్సాహౌ=బలమునుత్సాహమును;న=లేవు.రూపపరికల్పనం=రూపముయొక్క-నిర్మాణము; న=లేదు.

వారలకిట్టి, భయంకరమయిన గతియును తేజంబును బరాక్రమంబునుబుద్ధియును బలంబు నుత్సాహంబునురూపంబును లేదు. అని, తాత్పర్యము.

మహ త్సత్త్వ మిదం జ్ఞేయం కపిరూపం వ్యవస్థితమ్. ౧౨

టీక॥ ఇదం=ఇది; కపిరూపం=వానరునియొక్క-రూపమువంటి రూపముగలదిగా;వ్యవస్థితం=ఉన్న; మహత్=గొప్పదైన; సత్వం = భూతముగా; జ్ఞేయం=ఎఱుంగఁదగినది.

ఇది, చూడఁగా, వానరరూపంబు వహించివచ్చిన, మహాభూతంబుగా, నున్నదిగాని. వేఱుకాదు.

అని, తాత్పర్యము.

ప్రయత్నం మహ దాస్థాయ క్రియతా మస్య నిగ్రహః

టీక॥ మహత్=గొప్పదైన; ప్రయత్నం=యత్నమును; ఆస్థాయ=అవలంబించి; అస్య=ఈవానరునియొక్క-; నిగ్రహః=నిగ్రహించుట; క్రియతాం = చేయబడుగాఁక.

గొప్పప్రయత్నంబుఁజేసి,యీవానరునెట్లయిన,నిగ్రహింపుఁడు.

అని, తాత్పర్యము.

కామం లోకా స్త్రయ స్సేంద్రా స్ససురా సుర మానవాః. ౧౩
భవతా మగ్రత స్స్థాతుం న పర్యాప్తా రణా జిరే

టీక॥ సేంద్రాః=ఇంద్రునితోఁగూడినవియును; ససురాసురమానవాః= దే



వతలతోను అసురులతోను మనుష్యులతో సుంగూడినవియునగు; లోకాః = లోకములు; త్రయః = మూఁడును; రణాజిరే = యుద్ధభూమియందు; భవతాం = మీయొక్క; అగ్రతః = ముఁదట; స్థాతుం = నిలుచుటకు; నపర్యాప్తాః కామం = చాలవనుటవాస్తవమే.

ముల్లోకంబులనుండు, దేవతలు నసురులు మానవులు నొక్కటియయి యింద్రునింగూడివచ్చినను, యుద్ధభూమియందు, మీయెదుట, నిలువంజాలరు; ఇది వాస్తవమే. అని, తాత్పర్యము.

తథాపితు నయజ్ఞేన జయ మాకాంక్షతా రణే. ౧౪
ఆత్మా రక్ష్యః ప్రయత్నేన యుద్ధసిద్ధి హి చంచలా

టీక॥ తథాపితు = అట్లయినను; రణే = యుద్ధమునందు; జయం = గెల్పును; ఆకాంక్షతా = కోరుచున్నట్టి నయజ్ఞేన = నీతినెఱింగినవానిచేత; ప్రయత్నేన = యత్నముచేత; ఆత్మా = తాను; రక్ష్యః = కాపాడుకొనఁదగినవాఁడు. యుద్ధసిద్ధిః = యుద్ధమునందుజయము; చంచలాహి = స్థిరముకాదుగదా!

అట్లయినను, యుద్ధంబునజయంబెగలుగుననునిశ్చయములేదు; కావున, జయంబుగోరునట్టి రాజనీతిజ్ఞుండు, ముఖ్యముగాఁ బ్రయత్నంబునఁదన్నుఁదానురక్షించుకొనవలసినది; అందువలనమీరు జాగ్రత్తనవలంబించియుండవలయును. అని, రావణుండు ఆయయిదుగురిసేనానాయకులకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

తే స్వామివచనం సర్వే ప్రతిగృహ్య మహౌజసః. ౧౫
సముత్పేతు ర్మహావేగా హుతాశసమ తేజసః
రథై ర్మత్తైశ్చ మాతంగై ర్వాజిభిశ్చ మహాజవైః. ౧౬
శస్త్రైశ్చ వివిధై స్తీక్ష్ణై స్సర్వైశ్చోపచితా బలైః

టీక॥ మహౌజసః = అధికమయిన బలముగలవారలును; మహావేగాః = అధికమయినవేగముగలవారలును; హుతాశసమతేజసః = అగ్నిహోత్రునితోసరియైనపరాక్రమముగలవారలునునగు; తే = ఆసేనానాయకులు; సర్వే = అంద



ులును; స్వామివచనం=రాజుమాటను; ప్రతిగృహ్య=స్వీకరించి; రథైః= రథములచేతను; మత్తైః= మదించిన; మాతంగైశ్చ=ఏనుంగులచేతను; మహాజవైః=అధికమయినవేగముగల; వాజిభిశ్చ=గుఱ్ఱములచేతను; వివిధైః=నానావిధములగు; తీక్ష్ణైః=కఱకులయిన; శస్త్రైశ్చ = ఆయుధములచేతను; సర్వైః=సమస్తములయిన;బలైశ్చ=సైన్యములచేతను;ఉపచితాః=వృద్ధిఁబొందింపఁబడినవారలై;సముత్పేతుః= పోయిరి.

అంతమహాబలశాలులును మహావేగులును అగ్నిహోత్రమువంటిపరాక్రమంబుగలవారలునగునాసేనానాయకులైదుగురును, రాజాజ్ఞనుశిరసావహించి, రథంబులనుమదించినయేనుంగులను మహావేగంబులగు గుఱ్ఱంబులను నానావిధంబులగుకఱకు శస్త్రంబులను సమస్తవిధసైన్యంబులనుంగూడి, హనుమంతునొద్దకుఁబోయిరి.

అని, తాత్పర్యము.

తత స్తం దదృశు ర్వీరా దీప్యమానం మహాకపిమ్. ౧౭
రశ్మిమంత మివో ద్యంతం స్వతేజోరశ్మిమాలినమ్
తోరణస్థం మహోత్సాహం మహాసత్త్వం మహాబలమ్. ౧౮

టీక ॥ తతః = అటుపిమ్మట; వీరాః=పరాక్రమశాలులగునాసేనానాయకులు;దీప్యమానం= ప్రకాశించుచున్నవాఁడును;ఉద్యంతం=ఉదయించిన; రశ్మిమంతమివ(స్థితం) = సూర్యుండువలెనున్నవాఁడును; స్వతేజోరశ్మిమాలినం = తనకాంతిచేసూర్యుండయినవాఁడును;మహోత్సాహం= అధికమయినయుత్సాహము గలవాఁడును;మహాసత్త్వం= అధికమయిన ప్రయత్నము గలవాఁడును;మహాబలం= అధికమయినబలముఁగలవాఁడును; తోరణస్థం= బహిర్ద్వారంబున నున్నవాఁడునగు; తం=ఆ;మహాకపిం=పెద్దకోఁతియయినహనుమంతుని;దదృశుః=చూచిరి.

అంత,మహాపరాక్రమ శాలులగు, నాసేనానాయకులు, ఆయశోకవనబహిర్ద్వారంబునవెలుంగుచున్నవాఁడునప్పుడుదయించిన సూర్యునిభంగి నొప్పుచున్నవాఁడును దనకాంతిచే సూర్యుంబోలియున్నవాఁడును,అధికమయినయుత్సాహముగలవాఁడును, మహా

కార్యంబులు సేయఁగలవాఁడును, మహా బలుండునగు నాహనుమతుం, జూచిరి.

అని, తాత్పర్యము.

మహామతిం మహావేగం మహాకాయం మహాబలమ్
తం సమీక్ష్యైవ తే సర్వే దిక్షు సర్వాస్వవస్థితాః. ౧౯
తైస్తైః ప్రహరణై ర్భీమై రభిపేతు స్తత స్తతః

టీక॥ తే = ఆసేనానాయకులు; సర్వే = అందఱును; మహామతిం = అధికమయిన బుద్ధిగలవాఁడును; మహావేగం = అధికమయిన వేగముగలవాఁడును; మహాకాయం = అధికమయిన దేహముగలవాఁడును; మహాబలం = అధికమయిన బలముగలవాఁడునగు; తం = ఆహనుమంతుని; సమీక్ష్యైవ = చూచినంతనె; సర్వాసు = సమస్తములయిన; దిక్షు = దిక్కులందు; అవస్థితాః = ఉన్నవారలై; తత స్తతః = అంతనంత; తైస్తైః = ఆయా; భీమైః = భయంకరములయిన; ప్రహరణైః = ఆయుధములచేత; అభిపేతుః = ఎదిరించిరి.

అంత, నాసేనానాయకులు, మహాబుద్ధిశాలియును మహావేగుండును మహాదేహుండును మహాబలుండునగు నాహనుమంతుం జూచినంతనె, యతనిచుట్టును నిలిచి, భయంకరంబులగు నయ్యాయుధంబులతో, నెదిరించిరి.

అని, తాత్పర్యము.

తస్య పంచాయసా స్తీక్ష్ణా శ్శితాః పీతముఖా శ్శరాః. ౨౦
శిరస్యుత్పలపత్రాభా దుర్ధరేణ నిపాతితాః

టీక॥ దుర్ధరేణ = దుర్ధరునిచేత; తస్య = ఆహనుమంతుని యొక్క; శిరసి = తలయందు; ఆయసాః = ఇనుముతోఁజేయఁబడినవియును; తీక్ష్ణాః = క్రూరములును; శితాః = కకుకులయినవియును; పీతముఖాః = పసుపువన్నెగల ముఖములుగలవియును; ఉత్పలపత్రాభాః = కలువ తేకులకాంతివంటి కాంతిగలవియునగు; శరాః = బాణములు; పంచ = అయిదు; నిపాతితాః = వేయఁబడినవి.

దుర్ధరుండు, ఆయసంబులును క్రూరంబులును కఱకుగలవియును ము

ఖంబులబంగారునీరుబూసియుండుటం జేసిపసుపువన్నెగలవియుఁగలువఱేకులకుంబోలెఁగాంతిగలవియునగు నైదుబాణంబుల, నాహనుమంతునితలపైఁ, బ్రయోగించెను. అని, తాత్పర్యము.

స తైః పంచభి రావిద్ధ శ్శరై శ్శిరసి వానరః. ౨౧
ఉత్పపాత నదన్ వ్యోమ్ని దిశో దశ వినాదయన్

టీక॥ సః=ఆ; వానరః= హనుమంతుఁడు; తైః=ఆ; పంచభిః=అయిదైన; శరైః=బాణంబులచేత; శిరసి=తలయందు; ఆవిద్ధః = కొట్టఁబడినవాఁడై; నదన్=అఱచుచు ; దశ=పదియయిన ; దిశః=దిక్కులను; వినాదయన్ = ధ్వనింపఁజేయుచు; వ్యోమ్ని= ఆకాశమునందు; ఉత్పపాత=ఎగిరెను.

ఆహనుమంతుండు, శిరంబున, నాయయిదుబాణంబులందాడితుండై , దశదిశలునిండ , సింహనాదంబుసేయుచు, నాకాశంబునకెగిరెను.

అని, తాత్పర్యము.

తతస్తు దుర్ధరో వీర స్సరథ స్సజ్యకార్ముకః. ౨౨
కిరన్ శరశతై స్తీక్ష్ణై రభిపేదే మహాబలః

టీక॥తతస్తు=అంతనే; వీరః=పరాక్రమశాలియును; మహాబలః=అధికమయినబలముగలవాఁడునగు; దుర్ధరః= దుర్ధరుఁడు; సరథః=రథముతోఁగూడినవాఁడై; సజ్యకార్ముకః=అల్లెత్రాటితోఁగూడినవిల్లుగలవాఁడై; తీక్ష్ణైః= కఱకులయిన; శరశతైః= బాణంబులనూఱులచేత; కిరన్=వెదజల్లుచు; అభిపేదే=ఎదిరించెను.

అంతఁ, బరాక్రమశాలియునుమహాబలుండునగుదుర్ధరుండు, ధనువెక్కువెట్టి, రథంబుతోనాకాశంబున కుద్గమించి, తీక్ష్ణంబులగు పెక్కుబాణంబులం బ్రయోగించుచు, హనుమంతునెదిరించెను.

అని, తాత్పర్యము.

స కపి ర్వారయామాస తం వ్యోమ్ని శరవర్షిణమ్. ౨౩




వృష్టిమంతం పయోదాంతే పయోద మివ మారుతః

టీక॥ సః=ఆ; కపిః=హనుమంతుఁడు; వ్యోమ్ని = ఆకాశమునందు; శరవర్షిణం = బాణంబులంగురియుచున్న; తం=ఆదుర్ధరుని; మారుతః = వాయువు; పయోదాంతే= శరదృతువునందు; వృష్టిమంతం=వర్షముగల; పయోదమివ=మేఘమునువలె; వారయామాస= అడ్డగించెను.

శరదృతువునందు వర్షంబు గురియుమేఘంబును వాయువు సులభంబుగా నడ్డగించునట్లు, హనుమంతుండాకాశంబున, బాణవర్షంబుగురియుచున్న యాదుర్ధరునడ్డగించెను.

అని, తాత్పర్యము.

అర్ద్యమాన స్తత స్తేన దుర్ధరేణా నిలాత్మజః. ౨౪
చకార కదనం భూయో వ్యవర్ధత చ వేగవాన్

టీక॥ తతః=అంత; వేగవాన్= అధికమయిన వేగముగల; అనిలాత్మజః = వాయుపుత్త్రుఁడగు హనుమంతుఁడు; తేన=ఆ; దుర్ధరేణ=దుర్ధరునిచేత; అర్ద్యమానః=పీడింపఁబడినవాఁడై; కదనం=యుద్ధమును; చకార= చేసెను. భూయః=అధికముగా; వ్యవర్ధత చ= వృద్ధిఁబొందెను.

అంత; నట్లు, వేగవంతుండగువాయుకుమారుండైనహనుమంతుండు, దుర్ధరునిచేఁబీడింపఁబడి, మఱియునధికముగా మేనుఁబెంచి, యుద్ధంబుచేసెను.

అని, తాత్పర్యము.

స దూరం సహసోత్పత్య దుర్ధరస్య రథే హరిః. ౨౫
నిపపాత మహావేగో విద్యుద్రాశి ర్గిరావివ

టీక॥ సః=ఆ; హరిః=హనుమంతుండు; సహసా=శీఘ్రముగా; దూరం=దూరముగా; ఉత్పత్య=ఎగిరి; మహావేగః = అధికమయిన వేగముగలవాఁడై; దుర్ధరస్య= దుర్ధరునియొక్క; రథే=రథమునందు; విద్యుద్రాశిః=పిడుగు; గిరావివ=పర్వతమునందువలె; నిపపాత=పడెను.




స ౪౬

ఆహనుమంతుం,డంతనధికవేగంబు నవలంబించి, శీఘ్రంబున దూరంబుగాఁబైకెగిరి, పర్వతంబుపైఁ బిడుగుపడునట్లు, దుర్ధరునిరథంబుపైదుమికెను. అని, తాత్పర్యము.

తత స్స మథితాష్టాశ్వం రథం భగ్నాక్షకూబరమ్. ౨౬
విహాయ న్యపత ద్భూమౌ దుర్ధర స్త్యక్త జీవితః

టీక॥తతః=అటుపిమ్మట; సః=ఆ; దుర్ధరః=దుర్ధరుఁడు; మథితాష్టాశ్వం=చంపఁబడిన యెనిమిదిగుఱ్ఱములు గలదియును; భగ్నాక్షకూబరం=విఱిగినకండ్లును నొగయును గలదియు నగు; రథం=రథమును; విహాయ=విడిచి; త్యక్తజీవితః= విడువఁబడినప్రాణముఁగలవాఁడై; భూమౌ= నేలయందు; న్యపతత్=పడెను.

అంత, నెనిమిదిగుఱ్ఱంబులును జచ్చి, కండ్లును నొగయును విఱిగి, నేలఁగూలినరథంబుననుండి. దుర్ధరుండు, మృతుండై, నేలంబడెను. అని, తాత్పర్యము.

తం విరూపాక్ష యూపాక్షౌ దృష్ట్వా నిపతితం భువి. ౨౭
సంజాతరోషౌ దుర్ధర్షా వుత్పేతతు రరిందమౌ

టీక॥భువి=నేలయందు; నిపతితం=పడిన; తం=ఆదుర్ధరుని; దృష్ట్వా=చూచి; దుర్ధర్షౌ=ఎదిరింపనలవిగానివారలును; అరిందమౌ=శత్రువులనడంగఁద్రొక్కు-వారలునగు; విరూపాక్షయూపాక్షౌ =విరూపాక్షుండును యూపాక్షుండును; సంజాతరోషౌ= కలిగినకోపముగలవారలై; ఉత్పేతతుః=ఎగిరిరి.

ఆదుర్ధరుండు, చచ్చి నేలంబడుటనుజూచి, దుర్ధర్షులును శత్రువులనడంగఁ ద్రొక్కు-వారలునగు విరూపాక్షయూపాక్షులు, మహాకోపంబునొంది, యాకాశంబునకెగిరిరి. అని, తాత్పర్యము.

స తాభ్యాం సహసోత్పత్య విష్ఠితో విమలేంబరే. ౨౮
ముద్గరాభ్యాం మహాబాహు ర్వక్షస్యభిహతః కపిః




టీక॥ తాభ్యాం=ఆవిరూపాక్షయూపాక్షులచేత; సహసా=శీఘ్రముగా; ఉత్పత్య=ఎగిరి; విమలే=స్వచ్ఛమయిన; అంబరే=ఆకాశమునందు; విష్ఠితః=ఉన్నట్టి; మహాబాహుః = పెద్దచేతులుగల; సః=ఆ; కపిః = హనుమంతుండు; ముద్గరాభ్యాం= ఇనుపగుదియలచేత; వక్షసి=ఱొమ్మునందు; అభిహతః=కొట్టఁబడినాఁడు.

ఆవిరూపాక్షయూపాక్షులు, శీఘ్రంబుననెగిరి, స్వచ్ఛంబగునాకాశంబుననున్నమహాబాహుండగు హనుమంతునిఱొమ్మున, ఇనుపగుదియలచేఁగొట్టిరి. అని, తాత్పర్యము.

తయో ర్వేగవతో ర్వేగం వినిహత్య మహాబలః ౨౯
నిపపాత పున ర్భూమౌ సుపర్ణసమవిక్రమః

టీక॥ సుపర్ణసమవిక్రమః = గరుత్మంతునిపరాక్రమముతోసమానమయినపరాక్రమముగలవాఁడును; మహాబలః=అధికమయినబలముగలవాఁడునగు హనుమంతుండు; వేగవతోః= అధికమయిన వేగముగల; తయోః= ఆవిరూపాక్షయూపాక్షులయొక్క; వేగం=వేగమును; వినిహత్య=కొట్టి; పునః=మఱల; భూమౌ=నేలయందు; నిపపాత=పడెను, వ్రాలెననుట.

గరుత్మంతునకుంబోలెఁబరాక్రమంబుగలవాఁడునుమహాబలుండునగుహనుమంతుండు, వేగవంతులగునావిరూపాక్షయూపాక్షుల వేగంబునడంచి, మఱల, నేలకువ్రాలెను. అని, తాత్పర్యము.

స సాలవృక్ష మాసాద్య త ముత్పాట్యచ వానరః ౩౦
తావుభౌ రాక్షసౌ వీరౌ జఘాన పవనాత్మజః

టీక॥ పవనాత్మజః = వాయుదేవునికుమారుండగు; సః=ఆ; వానరః = హనుమంతుఁడు; సాలవృక్షం=మద్దిచెట్టును; ఆసాద్య=పొంది; తం=ఆమద్దిచెట్టును; ఉత్పాట్యచ=పెఱికియు; వీరౌ=పరాక్రమశాలులయిన; తౌ= ఆవిరూపాక్షయూపాక్షులను; ఉభౌ= ఇద్దఱను; జఘాన=చంపెను.

వాయుదేవునికుమారుండగు నాహనుమంతుండంత, నొకమద్దిచెట్టుఁజేరి,




దానిం బెఱికి, దానిచే, వీరులగు నావిరూపాక్ష యూపాక్షులం, జంపెను-

అని, తాత్పర్యము-

తత స్తాం త్రీన్ హతాన్ జ్ఞాత్వా వానరేణ తరస్వినా. ౩౧
అభిపేదే మహావేగః ప్రసహ్య ప్రఘసో హరిమ్
భాసకర్ణశ్చ సంక్రుద్ధ శ్శూల మాదాయ వీర్యవాన్- ౩౨

టీక॥ తతః=అటుపిమ్మట; తరస్వినా=బలవంతుండగు; వానరేణ=హనుమంతునిచేత; తాన్ = ఆ ; త్రీన్= ముగ్వురును; హతాన్= చచ్చినవారలనుగా; జ్ఞాత్వా=ఎఱింగి; మహావేగః=అధికమయిన వేగముగల; ప్రఘసః=ప్రఘసుఁడు; హరిం = హనుమంతుని; ప్రసహ్య=బలాత్కారముగా; అభిపేదే= ఎదిరించెను. వీర్యవాన్= అధికమయిన పరాక్రమముగల; భాసకర్ణశ్చ=భాసకర్ణుఁడును; సంక్రుద్ధః= మిక్కిలియయుఁ గోపించినవాఁడై; శూలం = శూలమును; ఆదాయ = తీసికొని; అభిపేదే(అధ్యాహృతము)=ఎదిరించెను.

అంత, నాదుర్ధర వీరూపాక్ష యూపాక్షులుముగ్వురును, బలవంతుండగుహనుమంతునిచేఁ జచ్చుటఁజూచి, మహావేగుండగుప్రఘసుండును, వేగంబున,హనుమంతునిపైకిఁదోయెను; పరాక్రమవంతుండగుభాసకర్ణుండును,గోపించి, శూలంబుగొని , హనుమంతుని మీఁదికడరెను. అని, తాత్పర్యము.

ఏకతః కపిశార్దూలం యశస్వినమవస్థితౌ

టీక॥ తౌ(అధ్యాహృతము)=ఆయిద్దఱును; యశస్వినం = అధికమయినకీర్తిగల; కపిశార్దూలం = వానరశ్రేష్ఠుండగుహనుమంతునిగూర్చి;ఏకతః= ఒక్కచోటను ; అవస్థితౌ=ఉండినారు.

ఆప్రఘసభాసకర్ణులిర్వురును, ఒకప్రక్కననెయుండి, వానరశ్రేష్ఠుండగు హనుమంతునితోయుద్ధముచేసిరి.

అని, తాత్పర్యము.

పట్టిసేన శితాగ్రేణ ప్రఘసః ప్రత్యయోధయత్. ౩౩

భాసకర్ణశ్చ శూలేన రాక్షసః కపిసత్తమమ్

టీక॥ ప్రఘసః = ప్రఘసుఁడు; శితాగ్రేణ = కఱకైనకొనగల; పట్టిసేన = అడ్డకత్తిచేత; కపిసత్తమం = వానరశ్రేష్ఠుండగు హనుమంతుని ; ప్రత్యయోధయత్ = ఎదిరించియుద్ధముచేసెను. భాసకర్ణః = భాసకర్ణుఁడను; రాక్షసశ్చ = రాక్షసుఁడును; శూలేన = శూలముచేత ; ప్రత్యయోధయత్ (అధ్యాహృతము) = ఎదిరించి యుద్ధముచేసెను.

ప్రఘసుండు , కఱకుగలయడ్డకత్తిగొని, వానరశ్రేష్ఠుండగు హనుమంతునితో యుద్ధముచేసెను ; భాసకర్ణుఁడు, శూలముతో , యుద్ధముచేసెను. అని, తాత్పర్యము.

స తాభ్యాం విక్షతైర్గాత్రై రసృగ్దిగ్ధ తనూరుహః. ౩౪
అభవ ద్వానరః క్రుద్ధో బాలసూర్యసమప్రభః

టీక॥ సః = ఆ; వానరః = హనుమంతుండు; తాభ్యాం = ఆప్రఘసభాసకర్ణులచేత; విక్షతైః = గాయముచేయఁబడిన ; గాత్రైః = అవయవములతో; సహితః (అధ్యాహృతము) = కూడినవాఁడై; కావున నే; అసృగ్దిగ్ధతనూరుహః = నెత్తురుచేఁబూయఁబడినవెండ్రుకలుగలవాఁడై ; బాలసూర్యసమప్రభః = లేఁతసూర్యునికాంతివంటికాంతిగలవాఁడై; క్రుద్ధః = కోపంబునొందినవాఁడు; అభవత్ = ఆయెను.

ఆహనుమంతుండు , అట్లుప్రఘసభాసకర్ణులచేఁ దాఁడితుండై , దేహంబంతయు నెత్తురుగ్రమ్మ డేర, బాలసూర్యునిభంగి వెలుంగుచుఁ , గోపంబునొందెను. అని, తాత్పర్యము.

సముత్పాట్య గిరేశ్శృంగం సమృగవ్యాళపాదపమ్. ౩౫
జఘాన హనుమా న్వీరో రాక్షసౌ కపికుంజరః

టీక॥ కపికుంజరః = వానరశ్రేష్ఠుండును; వీరః = పరాక్రమశాలియునయిన; హనుమాన్ = హనుమంతుఁడు ; సమృగవ్యాళపాదపం = మృగంబులతోనుసర్పంబులతోను వృక్షంబులతోనుం గూడిన; గిరేః = పర్వతముయొక్క;

శృంగం=శిఖరమును; సముత్పాట్య = పెకలించి; రాక్షసా = ప్రఘసభాసకర్ణులనురాక్షసులను; జఘాన = చంపెను.

వానరశ్రేష్ఠుండును బరాక్రమశాలియనగుహనుమంతుం, డంత, మృగంబులతోను సర్పంబులతోను వృక్షంబులతోనుంగూడినయొకపర్వతశిఖరంబుఁబెకలించి, దానిచే, నాప్రఘసభాసకర్ణులం, జంపెను.

అని, తాత్పర్యము

తత స్తేష్వ వసన్నేషు సేనాపతిషు పంచసు. ౩౬
బలం త దవశేషం చ నాశయామాస వానరః

టీక॥ తతః=అటుపిమ్మట; తేషు=ఆ; సేనాపతిషు= సేనానాయకులు; పంచసు= అయిదుగురును; అవసన్నేషు=చంపఁబడఁగా; వానరః= హనుమంతుండు;తత్=ఆ;అవశేషం=మిగిలిన;బలంచ=సైన్యమును; నాశయామాస=నశింపఁజేసెను.

అట్లు, హనుమంతుండు, ఆసేనానాయకులుమృతులయిన పిమ్మట, మిగిలియున్న,సైన్యంబునుం,జంపెను,

అని, తాత్పర్యము.

అశ్వై రశ్వాన్ గజై ర్నాగాన్ యోధై ర్యోధా న్రథై రథాన్. ౩౭
స కపి ర్నాశయామాస సహస్రాక్ష ఇవాసురాన్

టీక॥సః=ఆ; కపిః=హనుమంతుండు; అశ్వైః = గుఱ్ఱములచేత; అశ్వాన్=గుఱ్ఱములను; గజైః=ఏనుంగులచేత;నాగాన్= ఏనుంగులను; యోధైః=భటులచేత; యోధాన్=భటులను;రథైః=రథములచేత;రథాన్= రథములను;సహస్రాక్షః=ఇంద్రుఁడు; అసురానివ=అసురులనువలె; నాశయామాస=నశింపఁజేసెను.

ఆహనుమంతుండు,గుఱ్ఱములచే గుఱ్ఱంబులనేసియు, నేనుంగులపై నేనుంగులనెత్తివైచియు, భటులనెత్తి భటులపైఁబడవైచియు,రథంబులరథంబులపై నేసియు,నీప్రకారంబున,దేవేంద్రుండు అసురులంజంపినట్లు, ఆసైన్యంబునంతయు,నశింపఁజేసెను.అని, తాత్పర్యము.

స ౪౬

హతైర్నాగైశ్చ తురగైః భగ్నాక్షైశ్చ మహారథైః ౩౮
హతైశ్చ రాక్షసైర్భూమి రుద్ధమార్గా సమంతతః

టీక॥హతైః=చంపఁబడిన; నాగైశ్చ=ఏనుంగులచేతను; తురగైః=గుఱ్ఱములచేతను; భగ్నాక్షైః=విఱిగినకండ్లుగల; మహారథైశ్చ= గొప్పరథములచేతను; హతైః=చంపఁబడిన; రాక్షసైశ్చ=రాక్షసులచేతను; భూమిః= నేల; సమంతతః= అంతటను; రుద్ధమార్గా=అడ్డగింపఁబడినదారిగలది; అభవత్(అధ్యాహృతము)=అయినది.

చచ్చిపడియున్నయేనుంగులచేతను గుఱ్ఱంబులచేతను విఱిగికూలిన గొప్పరథంబులచేతను హతులయిన రాక్షసుల కళేబరంబులచేతను భూమియంతయు గప్పఁబడియుండుటంజేసి, మార్గంబుననడచుటకవకాశములేకుండినది.

అని, తాత్పర్యము.

తతః కపి స్తాన్ ధ్వజినీపతీ న్రణే
నిహత్య వీరాన్ సబలాన్ సవాహనాన్. ౩౯
సమీక్ష్య వీరః పరిగృహ్య తోరణం
కృతక్షణః కాలఇవ ప్రజాక్షయే

టీక॥వీరః= పరాక్రమశాలియగు; కపిః=హనుమంతుఁడు; తాన్=ఆ; వీరాన్= పరాక్రమశాలులును; సబలాన్=సైన్యముతోఁ గూడినవారలును; సవాహనాన్= వాహనములతోఁగూడినవారలునగు; ధ్వజినీపతీన్= సేనాధిపతులను; నిహత్య=చంపి; తతః= అంతట; సమీక్ష్య=చూచి; తోరణం= బహిర్ద్వారమును; పరిగృహ్య= పొంది; కృతక్షణః=చేయఁబడిన యూరకుండుటగలవాఁడై; ప్రజాక్షయే= ప్రజలవినాశకాలమునందు; కాలఇవ= యముఁడువలె; ఆసీత్(అధ్యాహృతము)= ఉండెను.

పరాక్రమవంతుఁడగు నాహనుమంతుఁడు, వీరులగు నాసేనానాయకులనైదుగురను, వారిసైన్యవాహనంబులతోఁ డంజంపి, యంత, మఱల, నాబహిర్ద్వారంబునొంది, ప్రజలవినాశకాలమునం దుగ్రుండై యుండు యముని భంగింజూపట్టుచు, నూరకుండెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, షట్చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, సుందరకాండషట్చత్వారింశసర్గ టీక, ముగిసినది.

---

శ్రీః

## సప్తచత్వారింశసర్గప్రారంభః.

సేనాపతీన్ పంచ స తు ప్రమాపితాన్
హనూమతా సానుచరాన్ సవాహనాన్
సమీక్ష్య రాజా సమరోద్ధతోన్ముఖం
కుమార మక్షం ప్రసమైక్షతాగ్రతః. ౧

టీ॥ సః=ఆ; రాజా=రావణుండు; హనూమతా=హనుమంతునిచేత; ప్రమాపితాన్=చంపఁబడిన; సానుచరాన్= వెంబడిఁబోవువారలతోఁగూడినవారలును; సవాహనాన్ = వాహనములతోఁగూడినవారలునగు; సేనాపతీన్=సేనానాయకులను; పంచ=అయిదుగురను; సమీక్ష్య=చూచి; అగ్రతః=ముందట; స్థితం(అధ్యాహృతము)=ఉన్నవాఁడైన; సమరోద్ధతోన్ముఖం = యుద్ధంబునకు గర్వించినవాఁడునుఎదురుముఖముగలవాఁడునగు; కుమారం=కొడుకైన; అక్షం=అక్షుని; ప్రసమైక్షత=చూచెను.

అంత, రావణుండు, సేనానాయకులయిదుగురును సైన్యవాహనంబులతోఁగూడ, హనుమంతునిచేఁజంపఁబడుటనువిని, తనముందటనున్న, ఎల్లప్పుడును యుద్ధంబునకుఁ గాలుద్రవ్వుచుండువాఁడునుయుద్ధోన్మత్తుండునగు, తనకుమారుండక్షునిపైఁగటాక్షంబుఁబఱపెను.

అని, తాత్పర్యము.

స తస్య దృష్ట్యర్పణ సంప్రచోదితః
ప్రతాపవాన్ కాంచనచిత్రకార్ముకః
సముత్పపాతాథ సదస్స్యుదీరితో
ద్విజాతిముఖ్యై ర్హవిషేవ పావకః. ౨

టీ॥అథ=అటుపిమ్మట; సదసి=సభయందు; ప్రతాపవాన్ = అధికమయినపరాక్రమముగల; సః=ఆయక్షకుమారుఁడు; తస్య=ఆరావణునియొక్క; దృష్ట్యర్పణసంప్రచోదితః= చూపుయొక్క పొందించుటచేతఁ బ్రేరేపింపఁబడినవాఁడై; కాంచనచిత్రకార్ముకః = బంగారముచే నానావర్ణముగలవిల్లుగలవాఁడై; ద్విజాతిముఖ్యైః= బ్రాహ్మణశ్రేష్ఠులచేత; హవిషా=హవిస్సుచేత; ఉదీరితః=వృద్ధిఁ బొందింపఁబడిన; పావకఇవ, అగ్నిహోత్రమువలె; సముత్పపాత=లేచెను.

అంత, మహాపరాక్రమశాలియగు నాయక్షకుమారుండు ; రావణునిచే దృష్టిమాత్రంబుననాజ్ఞాపింపఁబడినవాఁడై, బంగారముతోనలంకరింపఁ బడిన ధనుస్సుధరించి, బ్రాహ్మణోత్తములచే హవిస్సుఁ వేల్చివృద్ధిఁబొందింపఁబడినయగ్నిహోత్రముకైవడి, సంరంభంబునలేచెను. అని, తాత్పర్యము.

తతో మహద్బాలదివాకరప్రభం
ప్రతప్తజాంబూనదజాలసంతతమ్
రథం సమాస్థాయ యయౌ స వీర్యవాన్
మహాహరిం తం ప్రతి నైరృతర్షభః. ౩

టీక॥తతః = అటుపిమ్మట; వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగలవాఁడును; నైరృతర్షభః = రాక్షసశ్రేష్ఠుండునగు; సః = ఆయక్షుఁడు; మహత్ =గొప్పదియును; బాలదివాకరప్రభం= లేతసూర్యునికాంతివంటికాంతిగలదియును; ప్రతప్తజాంబూనదజాలసంతతం= కాచఁబడినబంగారముల సమూహముచే వ్యాపింపఁబడినదియునగు; రథం=రథమును; సమాస్థాయ= అధిష్ఠించి; తం=ఆ; మహాహరింప్రతి= పెద్దకోఁతియయిన హనుమంతునిఁగూ

చిఁ;యయౌ=పోయెను.

అంత, మహాపరాక్రమశాలియును రాక్షస శ్రేష్ఠుండునగు నక్షకుమారుండు, బాలసూర్యుండుంబోలె వెలుంగున దియును త్తమంబగుబంగారముచే నలంకరింపఁబడినదియునగుగొప్పరథంబునెక్కి, హనుమంతునొద్దకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తత స్తపస్సంగ్రహసంచయార్జితం
ప్రత ప్తజాంబూనదజాల శోభితమ్
పతాకినం రత్నవిభూషితధ్వజం
మనోజవాష్టాశ్వవరై స్సుయోజితమ్. ౪
సురాసురాధృష్య మసంగచారిణం
రవిప్రభం వ్యోమచరం సమాహితమ్
సతూణ మష్టాసినిబద్ధబంధురం
యథా క్రమావేశితశ క్తితోమరమ్. ౫
విరాజమానం ప్రతిపూర్ణ వస్తునా
సహేమదామ్నా శశిసూర్యవర్చసా
దివాకరాభం రథ మాస్థిత స్తత
స్సనిర్జగామా మరతుల్య విక్రమః. ౬

టీక॥తతః=అటుపిమ్మట; అమరతుల్యవిక్రమః=దేవతలపరాక్రమమువంటి పరాక్రమముగల; సః=ఆయక్షుఁడు; తపస్సంగ్రహసంచయార్జితం= తపస్సుల యనుష్ఠానములయొక్క సమూహముచే సంపాదింపఁబడినదియును; ప్రత ప్త జాంబూనదజాలశోభితం = కాఁచఁబడినబంగారములసమూహముచేనలంకరింపఁ బడినదియును; పతాకినం=సాధారణంబులగు టెక్కెములు గలదియును; రత్నవిభూషితధ్వజం = మణులచే నలంకరింపఁబడిన రాజచిహ్నంబులతోఁగూడినటెక్కెములుఁగల దియును; మనోజవాష్టాశ్వవరైః= మనంబునకుంబోలె వేగముఁగల యెనిమిది యశ్వశ్రేష్ఠములతో;సుయోజితం=కూ

ర్పఁ బడినదియును; సురాసురాధృష్యం=దేవతలచేతను అసురులచేతను ఎదిరింపఁగూడనిదియును; అసంగచారిణం=భూమిసంబంధములేనట్లుగా సంచరించునదియును; రవిప్రభం=సూర్యునికాంతివంటి కాంతిగలదియును; వ్యోమచరం= ఆకాశమునందిరుగునదియును; సమాహితం=యుద్ధమునకు సన్నద్ధమయినదియును; సతూణం= అమ్ములపొదులతోఁగూడినదియును; అష్టాసిబద్ధబంధురం= ఎనిమిదికత్తులుగలవియును గట్టఁబడిన ఘంటలుగలదియును; యథాక్రమావేశితశక్తితోమరం= వరుసదప్పకయుంచబడిన శక్తియను నాయుధమును జిల్లకోలయును గలదియును; శశిసూర్యవర్చసా=చంద్రసూర్యులకాంతులవంటి కాంతులు గలదియు; సహేమదామ్నా=బంగారుపుష్పమాలికలతోఁ గూడినదియునగు; ప్రతిపూర్ణవస్తునా=నిండినసామగ్రిచేత; విరాజమానం = ప్రకాశించుచున్నదియును; దివాకరాభం=సూర్యునికాంతివంటి కాంతిగలదియునగు; రథం=రథమును; ఆస్థితః=అధిష్ఠించినవాఁడై; తతః=అంత; నిర్జగామ=వెడలెను.

అంత, దేవతలకుంబోలె మహాపరాక్రమంబుగల యాయక్షకుమారుండు, పెక్కుతపంబులచే సంపాదింపఁబడినదియును, శ్రేష్ఠమయిన బంగారములచే నలంకరింపఁబడినదియును, సాధారణంబులగు పెక్కుమణులను మణులచేనలంకృతమయిన రాజచిహ్నయుక్తంబులగు పెక్కంబులును గలదియును, మనోవేగంబుగల యెనిమిది యుత్తమాశ్వంబులుగట్టినదియును, దేవతలకునసురులకు నుందేఱిచూడఁ గూడనిదియును, భూమినంటకయె సంచరించునదియును, సూర్యునింబోలె వెలుంగునదియును, ఆకాశంబుననంచరించునదియును, యుద్ధసన్నద్ధంబయినదియును, అమ్ములపొదులతోను, ఎనిమిదికత్తులతోనుం గూడినదియును, గంటలుగట్టియుండునదియును, అన్యోన్యస్థలంబుల నుంచఁబడినశక్తితోమరంబులను నాయుధంబులుగలదియును, చంద్రసూర్యులుంబోలె వెలుంగుచున్న బంగారుపుష్పమాలికలతో నొప్పుచున్నదియును, ధనుఃకవచాదిసమస్తోపకరణంబులతోనుం గూడినదియునగు, రథంబునెక్కి, వెడలెను. అని తాత్పర్యము.

స పూరయన్ ఖంచ మహీంచ సాచలాం
తురంగమాతంగమహారథస్వనైః

బలై స్సమేతై స్సహ తోరణస్థితమ్
సమర్థ మాసీన ముపాగమ త్కపిమ్. ౭

టీక॥ సః=ఆయక్షుఁడు ; తురంగమాతంగమహారథస్వనైః= గుఱ్ఱములయొక్కయు యేనుంగులయొక్కయు గొప్పరథములయొక్కయుధ్వనులచేత;ఖంచ=ఆకాశమును ; సాచలాం=పర్వతములతోఁగూడిన; మహీంచ = భూమిని; పూరయన్=నిండునట్లు సేయుచు ; సమేతైః=చేరిన ; బలైః=సైన్యములతో; సహితః(అధ్యాహృతము)=కూడినవాడై; సః=ఆయక్షుఁడు; తోరణస్థితం = బహిర్ద్వారంబుననున్నవాఁడును; సమర్థం =సమర్థుఁడును; ఆసీనం= కూర్చున్నవాఁడునగు; కపిం = హనుమంతుని;ఉపాగమత్=పొందెను.

అట్లు, అక్షకుమారుండు , అశ్వగజరథంబుల ధ్వనుల నాకాశంబునుబర్వతంబులతోఁగూడిన భూమియునిండ , సమస్తసైన్యంబులంగూడి , సమర్థుఁడును అశోకవన బహిర్ద్వారంబునం గూర్చుండియున్నవాఁడునగు, హనుమంతుం, జేరెను.

అని, తాత్పర్యము.

స తం సమాసాద్య హరిం హరీక్షణో
యుగాంతకాలాగ్ని మివ ప్రజాక్షయే
అవస్థితం విస్మితజాతసంభ్రమ
స్సమైక్షతా క్షో బహుమానచక్షుషా. ౮

టీక॥హరీక్షణః=సింహముయొక్క కండ్లవంటికండ్లుగల;సః=ఆ;అక్షః=అక్షకుమారుఁడు;ప్రజాక్షయే = జనుల నాశమునందు;అవస్థితం = ప్రవృత్తినొందిన; యుగాంతకాలాగ్నిమివ (స్థితం) = ప్రళయకాలమునందలియగ్నిహోత్రుంబువలెనున్న;తం = ఆ;హరిం=హనుమంతుని;సమాసాద్య=చేరి; విస్మితజాతసంభ్రమః=ఆశ్చర్యమునొందినవాఁడును కలిగిన తొట్రుపాటుగలవాఁడునై ;బహుమానచక్షుషా=గౌరవముతోఁగూడినకంటిచేత; సమైక్షత= చూచెను.

సింహమునకుంబోలె నేత్రంబులుగ

ల యాయక్షకుమారుండు, ప్రజలనశింపఁజేయంబూనియున్న ప్రళయకాలాగ్నిహోత్రునిచందంబునం జూపట్టుచున్న,హనుమంతుంజేరి , యతనిగంభీరరూపంబునకాశ్చర్యంబును దొట్రుపాటునుంబొంది,యితండు;పరాక్రమవంతుండేయనియతనిసగౌరవంబుగాఁజూచెను.అని, తాత్పర్యము.

స తస్య వేగంచ కపే ర్మహాత్మనః
పరాక్రమం చారిషు పార్థివాత్మజః
విధారయన్ స్వంచ బలం మహాబలో
హిమక్షయే సూర్య ఇవాఽభివర్ధతే ౯

టీక॥మహాబలః= అధికమయినబలముగల;సః=ఆ;పార్థివాత్మజః= రాజయినరావణునికొడుకగునక్షుఁడు; మహాత్మనః= అధికమయినపరాక్రమముగల;తస్య=ఆ;కపేః = హనుమంతునియొక్క;వేగంచ=వేగమును; అరిషు=శత్రువులయందు;పరాక్రమంచ=పరాక్రమమును;స్వం=తనదైన; బలంచ=బలమును;విధారయన్ = నిర్ణయించుచు;హిమక్షయే=వసంతర్తువునందు;సూర్యఇవ=సూర్యుఁడువలె;అభివర్ధతే (భూతార్థమందులట్)= వృద్ధిఁబొందెను.

మహాబలుండగునాయక్షకుమారుండు,మహాపరాక్రమశాలియగునాహనుమంతునివేగంబును శత్రువుల జయించు పరాక్రమంబును, తనబలంబును, సరిచూచుకొని,వసంతర్తువునందు, సూర్యుండువృద్ధిఁబొందునట్లు, వృద్ధిఁబొందెను అని, తాత్పర్యము.

స జాతమన్యుః ప్రసమీక్ష్య విక్రమం
స్థిరం స్థిర స్సంయతి దుర్నివారణమ్
సమాహితాత్మా హనుమంత మాహవే
ప్రచోదయామాస శరై స్త్రిభి శ్శితైః ౧౦

టీక॥సః=ఆయక్షకుమారుఁడు; సంయతి=యుద్ధమునందు ; దుర్నివార

ణం=అడ్డగింపఁగూడని; స్థిరం= నిలుకడగల; విక్రమం=పరాక్రమమును; ప్రసమీక్ష్య=చూచి; జాతమన్యుః= కలిగిన కోపంబుగలవాఁడై ; స్థిరః= నిలుకడగలవాఁడై; సమాహితాత్మా= ఎచ్చరికనొందినమనసుగలవాఁడై; ఆహవే= యుద్ధమునందు; హనుమంతం = హనుమంతుని; శితైః=తీక్ష్ణములయిన; త్రిభిః= మూఁడగు; శరైః= బాణములచేత; ప్రచోదయామాస=కొట్టెను.

అంత, నక్షకుమారుండు "యుద్ధంబున హనుమంతునిజయించుటకష్ట" మనిమెఱింగి, కోపంబునొంది, స్థిరుండై, మెచ్చరికగలవాఁడై, హనుమంతునిఁ, దీక్ష్ణంబులగుమూఁడుబాణంబులం , గొట్టెను. అని, తాత్పర్యము.

తతః కపిం తం ప్రసమీక్ష్య గర్వితం
జితశ్రమం శత్రుపరాజయోర్జితమ్
అవైక్షతాక్షస్సముదీర్ణమానస
స్సబాణపాణిః ప్రగృహీతకార్ముకః. ౧౧

టీక॥ తతః=అటుపిమ్మట; అక్షః= అక్షుఁడు; సముదీర్ణమానసః = గర్వించినమనసుఁగలవాఁడై; సబాణపాణిః=బాణముతోఁగూడిన హస్తముగలవాఁడై; ప్రగృహీతకార్ముకః=పట్టుకొనఁబడినవిల్లుగలవాఁడై; తం=ఆ; కపిం=హనుమంతుని; గర్వితం=గర్వమునొందినవానిఁగాను; జితశ్రమం=జయింపఁబడినయలసటగలవానిఁగాను; శత్రుపరాజయోర్జితం= శత్రువులజయించుటయందుసమర్థునిఁగాను; ప్రసమీక్ష్య=చూచి, మెఱింగియనుట; అవైక్షత=చూచెను, ఆలోచించెననుట.

అంత, నక్షుఁడు, మనంబునగర్వమునొంది, ధనుర్బాణంబులధరించి, "హనుమంతుండు, గర్వితుండు, ఎట్టిశ్రమంబునుసరకుసేయక శత్రువులజయించుటయందుసమర్థుండు" అని, మెఱింగి, కొంతయాలోచించెను.

అని, తాత్పర్యము.

సహేమనిష్కాంగదచారుకుండల
స్సమాససాదాశు పరాక్రమః కపిమ్

తయో ర్బభూవాఽ ప్రతిమ స్సమాగమ
స్సురాసురాణా మపి సంభ్రమప్రదః. ౧౨

టీక॥ హేమనిష్కాంగదచారుకుండలః=బంగారుపతకముగల బాహుపురులునుబోఁగులుగలవాఁడును; ఆశుపరాక్రమః= శీఘ్రమయినపరాక్రమంబుగలవాఁడునగు; సః=ఆయక్షుఁడు; కపిం= హనుమంతుని; సమాససాద= పొందెను. తయోః=ఆయక్షహనుమంతులయొక్క;సమాగమః=చేరిక; అప్రతిమః=సరిలేనిదియు;సురాసురాణామపి = దేవతలకునసురులకును; సంభ్రమప్రదః=భయంబునిచ్చునదియును; బభూవ=అయినది.

అంత, బంగారుపతకంబు వేసిన బాహుపురులును బోఁగులును ధరించియున్నవాఁడును శత్రువుచెయ్యెత్తుటకు నవకాశములేకుండునట్లు పరాక్రమించువాఁడునగు నాయక్షకుమారుండు, హనుమంతుండాఁకెను ; అప్పుడాయిరువురసమాగమంబసదృశమయి, దేవతలకునసురులకును భయంబుఁగలిగించినది. అని, తాత్పర్యము.

రరాస భూమి ర్నతతాప భానుమా న్
వవౌ న వాయుః ప్రచచాల చాచలః
కపేః కుమారస్యచ వీక్ష్య సంయుగం
ననాదచ ద్యౌ రుదధిశ్చ చుక్షుభే. ౧౩

టీక॥కపేః= హనుమంతునియొక్కయు; కుమారస్యచ= అక్షకుమారునియొక్కయు; సంయుగం= యుద్ధమును;వీక్ష్య=చూచి;భూమిః=భూమి; రరాస=ధ్వనించినది. భానుమాన్=సూర్యుఁడు; నతతాప= తపింపఁజేయఁడయ్యె. వాయుః=వాయువు; నవవౌ= వీవఁడయ్యె. అచలశ్చ=పర్వతమును; చచాల=కదలినది. ద్యౌశ్చ=ఆకాశమును; ననాద=అఱచినది. ఉదధిశ్చ=సముద్రమును;చుక్షుభే=కలంగినది.

అప్పుడక్షహనుమంతుల యుద్ధంబునుజూచి, భయంబునొంది, భూమిధ్వనించినది;సూర్యుండుతపింపఁ జేయఁడ

స ౪౮

వ్యో; వాయువు వీవఁడవ్యో; పర్వతంబు చలించినది; ఆకాశంబున ఱచినది; సముద్రంబునుంగూడఁ గలంగినది.

అని, తాత్పర్యము.

తత స్స వీర స్సుముఖాన్ పతత్రిణ
స్సువర్ణపుంఖాన్ సవిషా నివోరగాన్
సమాధిసంయోగవిమోక్షతత్త్వవి
చ్ఛరా నథ త్రీన్ కపిమూర్ధ్న్యపాతయత్. ౧౪

టీక॥ తతః=అంత; అథ=పిమ్మట; సమాధిసంయోగవిమోక్షతత్త్వవిత్ = గుఱిపెట్టుట యొక్కయు సంధించుట యొక్కయు విడుచుట యొక్కయు తత్త్వము నెఱింగిన; వీరః=పరాక్రమశాలియగు; సః= ఆయక్షుండు; సుముఖాన్=సుందరములయిన ముఖములుగలవియును; పతత్రిణః= ఱెక్కలుగలవియును; సువర్ణపుంఖాన్=బంగారముతోఁ జేయఁబడిన క్రిందిచివరలుగలవియును; సవిషాన్= విషముతోఁగూడినవియును; ఉరగానివ(స్థితాన్)=సర్పములువలెనున్నవియునగు; త్రీన్=మూఁడైన; శరాన్=బాణములను; కపిమూర్ధ్ని=హనుమంతునితలయందు; అపాతయత్=వేసెను.

అంత, లక్ష్యంబునందు దృష్టియుంచుటయందును బాణంబును సంధించుటయందును బ్రయోగించుటయందును నేర్పరియగు నాయక్షుండు, సుందరంబులగు ముఖంబులుగలవియును ఱెక్కలు గట్టినవియును, బంగారముతోఁ జేసిన క్రింది చివరలు గలవియును విషంబుఁ బూసిన వగుటచే సర్పంబులుంబోలె నున్నవియు నగు మూఁడు బాణంబుల, హనుమంతుని శిరంబుపైఁ బ్రయోగించెను.

అని, తాత్పర్యము.

స తైశ్శరై ర్మూర్ధ్ని సమం నిపాతితైః
క్షరన్నసృగ్దిగ్ధవివృత్తలోచనః
నవోదితాదిత్యనిభ శ్శరాంశుమా
న్వ్యరాజతాదిత్య ఇవాంశుమాలికః. ౧౫

షః=బాణమయమయినవర్షముగల దియునగు; రాక్షసాంబుదః=రాక్షసుం డగునక్షుండను మేఘము; హరీశ్వరాచలే=వానరశ్రేష్ఠుండగు హనుమంతుండను పర్వతమునందు; వలాహకః= మేఘము; అచలోత్తమే= పర్వతశ్రేష్ఠమునందు; వృష్టిమివ=వర్షమునువలె, ఆశు= శీఘ్రముగా; శరాన్=బాణములను; ముమోచ=విడిచెను.

అంత, యుద్ధంబునం, దనధనువె యింద్రధనువుగా, బాణమయంబగువర్షంబుగురియుచు, మేఘంబువలెనుండు, నాయక్షుండు, మేఘముపర్వతముపై వర్షముగురియునట్లు, పర్వతాకారుం డగునాహనుమంతునిపై, బాణంబులం బ్రయోగించెను. అని, తాత్పర్యము.

తతః కపిస్తం రణచండవిక్రమం
వివృద్ధతేజోబలవీర్యసంయుతమ్
కుమారమక్షం ప్రసమీక్ష్య సంయుగే
ననాద హర్షాద్ఘనతుల్యవిక్రమమ్. ౧౯

టీక ॥ తతః=అటుపిమ్మట; కపిః= హనుమంతుఁడు; సంయుగే=యుద్ధమునందు; రణచండవిక్రమం= యుద్ధంబునందు భయంకరమయినపరాక్రమము గలవాఁడును; వివృద్ధతేజోబలవీర్యసంయుతం = మిక్కిలియువృద్ధిఁబొందిన కాంతియునుబలమునుపరాక్రమమంబునుగలవాఁడును; ఘనతుల్యవిక్రమం=మేఘంబుయొక్క నడకతో సమానమయిననడకగలవాఁడునగు; అక్షం=అక్షుండను; కుమారం=కుమారుని; ప్రసమీక్ష్య=చూచి; హర్షాత్ = సంతోషమువలన; ననాద=అఱచెను.

అంత, యుద్ధంబున, భయంకరంబగు పరాక్రమంబునం గ్రాలుచుమిక్కిలియు నధికంబగు తేజంబునుబలంబును బరాక్రమంబునుంగలిగి, మేఘంబుంబోలె, నాకాశంబునందిరుగుచున్న, యక్షకుమారుంజూచి, సంతోషంబున, సింహనాదంబుచేసెను.

అని, తాత్పర్యము.

స బాలభావాద్యుధి వీర్యదర్పితః

ప్రవృద్ధమన్యుః క్షతజోపమేక్షణః
సమాససాదా ప్రతిమం కపిం రణే
గజో మహాకూప మివావృతం తృణైః. ౨౦

టీక॥ సః= ఆయక్షుఁడు; బాలభావాత్ = బాల్యమువలన; యుధి= యుద్ధమునందు; వీర్యదర్పితః= పరాక్రమముచేగర్వమునొందినవాఁడై; ప్రవృద్ధమన్యుః= మిక్కిలియువృద్ధిఁబొందినకోపముగలవాఁడై; క్షతజోపమేక్షణః = నెత్తురుతో బోలికగల కండ్లుగలవాఁడై; రణే = యుద్ధమునందు ; అప్రతిమం= సరిలేనట్టి; కపిం=హనుమంతుని; గజః= ఏనుంగు; తృణైః = పచ్చికలచేత; ఆవృతం= కప్పబడిన; మహాకూపమివ= పెద్దబావినివలె, సమాససాద= పొందెను.

ఆయక్షుండు, బాలుండగుటఁ జేసి, యుద్ధంబునఁ బరాక్రమగర్వితుండై, మహాకోపంబునొంది, నేత్రంబు నెఱ్ఱఁదనంబుగదుర, నేనుంగుదృణంబులం గప్పఁబడినపెద్దపాడుబావిపైకిఁబోవునట్లు, యుద్ధంబున నెదురులేనట్టి హనుమంతుని పైకిఁబోయెను. అని, తాత్పర్యము.

స తేన బాణైః ప్రసభం నిపాతితై
శ్చకార నాదం ఘననాదనిస్స్వనః

టీక॥ఘననాదనిస్స్వనః = మేఘగర్జనమువంటిధ్వనిగల; సః = ఆహనుమంతుఁడు; తేన=ఆయక్షునిచేత; ప్రసభం=బలాత్కారముగా; నిపాతితైః= వేయఁబడిన; బాణైః= బాణములచేత; నాదం=ధ్వనిని; చకార=చేసెను.

మేఘగర్జనమువంటిధ్వనిగల యా హనుమంతుండు, అక్షకుమారుండు వేసినబాణంబులచేఁటునకు, గట్టిగా నఱచెను. అని, తాత్పర్యము.

స ముత్పపాతాశు నభ స్స మారుతి
ర్భుజోరువిక్షేపణఘోరదర్శనః. ౨౧

టీక॥సః=ఆ; మారుతిః= వాయుదేవునికుమారుండగుహనుమంతుండు; భు




జోరువిక్షేపణఘోరదర్శనః= బాహువులయొక్కయుఁ దొడలయొక్కయువిసరుట చేతభయంకరమగు చూచుటగలవాఁడై;ఆశు=శీఘ్రముగా;నభః = ఆకాశమునుగూర్చి;సముత్పపాత= ఎగిరెను.

వాయుదేవునికుమారుండగునాహనుమంతుండు, బాహువులఁదొడలనువిసరుచుఁ,జూపరులుభయంబునొంద, శీఘ్రంబుగా,నాకాశంబునకెగిరెను.

అని, తాత్పర్యము.

సముత్పతంతం సమభిద్రవద్బలీ
స రాక్షసానాం ప్రవరః ప్రతాపవాన్
రథీ రథిశ్రేష్ఠతమః కిరన్ శరైః
పయోధరశ్శైలమివాశ్మవృష్టిభిః. ౨౨

టీక॥బలీ= అధికమయినబలముగలవాఁడును;రాక్షసానాం = రాక్షసులలోపల;ప్రవరః=శ్రేష్ఠుండును; ప్రతాపవాన్= అధికమయినపరాక్రమముగలవాఁడును;రథిశ్రేష్ఠతమః=రథికులలో మిక్కిలియుశ్రేష్ఠుండునగు;సః= ఆయక్షుఁడు;సముత్పతంతం= ఎగురుచున్న హనుమంతుని;శరైః= బాణములచేత; పయోధరః=మేఘము; అశ్మవృష్టిభిః= తాళ్లవానలచేత;శైలమివ=పర్వతమునువలె;కిరన్=వెదచల్లుచు;రథీ = రథముగలవాఁడై;సమభిద్రవత్(సమభ్యాద్రవత్)=తఱిమెను.

బలవంతుండును రాక్షసశ్రేష్ఠుండునుమహాపరాక్రమశాలియును, రథికోత్తముండునగునాయక్షుండు, మేఘంబుపర్వతంబుపై తాళ్లవానగురియునట్లు, ఆకాశంబున నెగురుచున్నహనుమంతునిపై బాణంబులు వేయుచు, రథంబుతోఁగూడఁ,దోడనేదానును,ఆకాశంబునకెగిరెను.అని,తాత్పర్యము.

స తాన్ శరాం స్తస్య హరిర్విమోక్షయన్
చచార వీరః పథి వాయుసేవితే
శరాంతరే మారుతవ ద్వినిష్పత




న్మనోజవ స్సంయతి చండవిక్రమః. ౨౩

టీక॥మనోజవః= మనస్సునకుంబోలె వేగముగలవాఁడును; సంయతి=యుద్ధమునందు; చండవిక్రమః= భయంకరమయినపరాక్రమముగలవాఁడును ; వీరః=పరాక్రమశాలియునగు; సః=ఆ; హరిః=హనుమంతుండు ; మారుతవత్=వాయువువలె; శరాంతరే= బాణంబులనడుమనందు; వినిష్పతన్=తిరుగుచు; తస్య = ఆయక్షునియొక్క ; తాన్=ఆ; శరాన్=బాణములను ; విమోక్షయన్=విడుపించుచు ; వాయుసేవితే=వాయువుచే సేవింపఁబడిన; పథి=మార్గమునందు; చచార = తిరిగెను.

మనంబునకుంబోలె వేగంబుగలవాఁడును, యుద్ధంబునభయంకరంబైనపరాక్రమంబుగలవాఁడునగు నాహనుమంతుండు, వాయువుంబోలె, బాణంబులకునడుమం దిరుగుచు, నాయక్షకుమారుని బాణంబులుదనపైఁబడనీయక, వాయుసేవితంబగునాకాశంబున, విహరించుచుండెను. అని, తాత్పర్యము.

తమాత్తబాణాసనమాహవోన్ముఖం
ఖమాస్తృణంతం విశిఖైః శరోత్తమైః
అవైక్షతాక్షం బహుమానచక్షుషా
జగామ చింతాంచ సమారుతాత్మజః. ౨౪

టీక॥మారుతాత్మజః= వాయుదేవునికుమారుండగు; సః = ఆహనుమంతుండు; ఆత్తబాణాసనం= పొందఁబడినధనుస్సుగలవాఁడును; ఆహవోన్ముఖం=యుద్ధంబునకెదురుమొగము గలవాఁడును; విశిఖైః= నానావిధంబులగు శిఖలుగల; శరోత్తమైః= బాణశ్రేష్ఠములచేత; ఖం=ఆకాశమును ; ఆస్తృణంతం=కప్పుచున్నవాఁడునగు ; తం=ఆ; అక్షం=అక్షకుమారుని ; బహుమానచక్షుషా= గౌరవముతోఁగూడినకంటిచేత; అవైక్షత=చూచెను . చింతాం చ=ఆలోచనను; జగామ=పొందెను.

వాయుదేవునికుమారుండగు నాహనుమంతుండు, ధనువుధరించియుద్ధంబునకభిముఖుండైయాకాశంబునంతయుబా

ణంబులంగప్పుచున్న యక్షకుమారునిం జూచి, మెచ్చుకొని," యితని నెట్లువధింపఁగలను" అని, చింతనొందెను.

అని, తాత్పర్యము.

తత శ్శరై ర్భిన్నభుజాంతరః కపిః
కుమారవీరేణ మహాత్మనా నదన్
మహాభుజః కర్మవిశేషతత్త్వవి
ద్విచింతయామాస రణే పరాక్రమమ్. ౨౫

టీక॥ తతః=అటుపిమ్మట; మహాభుజః=పెద్దచేతులుగలవాఁడును; కర్మవిశేషతత్త్వవిత్ = కార్యంబులవిశేషముయొక్క యథార్థతను నెఱింగినవాఁడు నగు; కపిః = హనుమంతుఁడు; మహాత్మనా= అధికమయినబలముగల; కుమారవీరేణ=వీరుండగునక్షకుమారునిచేత; శరైః=బాణములచేత; భిన్నభుజాంతరః=కొట్టఁబడినభుజంబులమధ్యప్రదేశముంగలవాఁడై; నదన్= అఱచుచు; రణే=యుద్ధమునందు; పరాక్రమం=శత్రువుయొక్క లోఁగొనుటను గుఱించి; విచింతయామాస=ఆలోచించెను.

అంత, మహాబాహుండగుహనుమంతుండు, మహాబల పరాక్రమశాలియగునక్షకుమారునిచే బాణంబుల భుజాంతరంబునందుఁగొట్టఁబడినవాఁడై, యఱచి, కార్యవిశేషంబుల నెఱింగినవాఁడు, కావున, నక్షకుమారుని జయించుటనుగుఱించి, యిట్లని, యాలోచించెను.

అని, తాత్పర్యము,

అబాలవద్బాలదివాకరప్రభః
కరోత్యయం కర్మ మహన్మహాబలః
నచాస్య సర్వాహవకర్మశోభినః
ప్రమాపణే మే మతి రత్ర జాయతే. ౨౬

టీక॥ మహాబలః=అధికమయినబలముగలవాఁడును; బాలదివాకరప్రభః= బాలసూర్యుని కాంతివంటికాంతి గలవాఁడునగు; అయం=వీఁడు ; అబాల

వత్ = పెద్దవాఁడువలె; మహాత్ = గొప్పదైన; కర్మ = కార్యమును; కరోతి = చేయుచున్నాఁడు. సర్వాహవకర్మశోభినః = సమస్తములయిన యుద్ధమునకుఁదగిన కార్యములందుఁ బ్రకాశించుచున్న; అస్య = ఈయక్షునియొక్క; పరిమాపణే = చంపుటయందు; అత్ర = ఇప్పుడు; మే = నాకు; మతిశ్చ = బుద్ధియును; నజాయతే = పుట్టలేదు.

ఇతండు, మహాబలుండు; బాలుండయ్యు, బాలసూర్యనిభుంగి వెలుంగుచు, గొప్పకార్యంబు సేయుచున్నాఁడు మఱియు, సమస్తయుద్ధోపాయంబులనుం దెలిసియున్నాఁడు; నాకితనిఁజంపం దోఁచలేదు. అని, తాత్పర్యము.

అయం మహాత్మా చ మహాంశ్చ వీర్యత
స్సమాహితశ్చాతిసహశ్చ సంయుగే
అసంశయం కర్మగుణోదయాదయం
సనాగయక్షైర్మునిభిశ్చ పూజితః. ౨౭

టీక॥ అయం = ఇతఁడు; మహాత్మా చ = అధికమయినబలముగలవాఁడు; వీర్యతః = పరాక్రమమువలన; మహాంశ్చ = అధికుండును; సంయుగే = యుద్ధమునందు; సమాహితశ్చ = ఎచ్చరికగలవాఁడు; అతిసహశ్చ = అధికముగ సహించువాఁడునగు. అయం = ఇతండు; కర్మగుణోదయాత్ = యుద్ధకార్యముయొక్క యాధిక్యముయొక్క అభివృద్ధివలన; సనాగయక్షైః = సర్పములతోను యక్షులతోనుంగూడిన; దేవైః (అధ్యాహృతము) = దేవతలచేతను; మునిభిశ్చ = మునులచేతను; పూజితః = పూజింపఁబడినవాఁడు. అసంశయం = సందేహము లేదు.

ఇతండు, మహాబలుండు; మహాపరాక్రమశాలి; యుద్ధంబున నెచ్చరికగలవాఁడు; కష్టంబు నోర్చువాఁడు; యుద్ధంబునం దలియుత్కర్షంబు గలుగుటవలన, నితని, నాగయక్షులును దేవతలును, మునులును బూజింపుచుందురు; ఇందు, సందేహము లేదు. అని, తాత్పర్యము.

పరాక్రమోత్సాహవివృద్ధమానస
స్సమీక్షతే మాం ప్రముఖాగ్రతస్స్థితః

టీక॥అయం(అధ్యాహృతము)=ఇతండు;పరాక్రమోత్సాహవివృద్ధమానసః=పరాక్రమము చేతను నుత్సాహము చేతను వృద్ధిఁబొందినమనసుగలవాఁడై: ప్రముఖాగ్రతః=ఎదురుమొగముగునట్లు ముందట;స్థితః=ఉన్నవాఁడై;మాం=నన్ను;సమీక్షతే=చూచుచున్నాఁడు.

ఇతండు,మనంబునఁ,బరాక్రమంబు నుత్సాహంబునుగదుర, నాముఖంబునెదుటనిలుచుండి, నన్నుఁజూచుచున్నాఁడు. అని, తాత్పర్యము.

పరాక్రమో హ్యస్య మనాంసి కంపయే
త్సురాసురాణామపి శీఘ్రగామినః. ౨౮

టీక॥ శీఘ్రగామినః=శీఘ్రముగాఁబోవునట్టి;అస్య=ఇతనియొక్క; పరాక్రమః = పరాక్రమము; సురాసురాణాం= దేవతలయొక్కయు నసురుల యొక్కయు; మనాంస్యపి=మనంబులనైనను;కంపయేత్=కదలించును.

మిక్కిలియు వడిగాఁబరాక్రమించునట్టియితని పరాక్రమముఁజూచినచో, దేవాసురులకైనను, మనంబున,భయంబుగల్గును. అని,తాత్పర్యము.

న ఖల్వయం నాభిభవేదుపేక్షితః
పరాక్రమో హ్యస్య రణే వివర్ధతే
ప్రమాపణం త్వేవ మమాద్య రోచతే
నవర్ధమానోఽగ్నిరుపేక్షితుం క్షమః. ౨౯

టీక॥అయం=ఇతండు; ఉపేక్షితః (చేత్)=ఉపేక్షింపఁబడునేని; నఖలు నాభిభవేత్=తిరస్కరింపకుండడు. అస్య=ఇతనియొక్క; పరాక్రమః=పరాక్రమము;రణే=యుద్ధమునందు; అభివర్ధతేహా = వృద్ధిఁబొందుచున్నదిగదా!అద్య = ఇప్పుడు;ప్రమాపణం త్వేవ=చంపుటయే;మమ = నాకు;రోచతే = రుచింపుచున్నది.వర్ధమానః=వృద్ధిఁబొందుచున్న;అగ్నిః=నిప్పు;ఉపేక్షితుం=ఉపేక్షించుటకు;నక్షమః=తగినదికాదు.

ఇతనినిప్పుడుచంపకుండనుపేక్షించి విడుతునేని,యటుపిమ్మట,నితండుతప్ప

కమమ్ము బాధించును; ఏలయనఁగా, నితని పరాక్రమం బిప్పుడే మిక్కిలియు నధికముగా నున్నది; ఇంకఁ గొన్నాళ్లకు మఱియు నెంతయధికమగునో! కావున, నిప్పుడు, వీనిఁ జంపుటయే యుక్తంబని నాకుఁ దోఁచుచున్నది; వృద్ధిఁ బొందుచున్నయగ్నిశత్రురోగములు నెప్పుడైన నుపేక్షింపవచ్చునా? అని, హనుమంతుండాలోచించెను. అని, తాత్పర్యము.

ఇతి ప్రవేగంతు పరస్య తర్కయన్
స్వకర్మయోగంచ విధాయ వీర్యవాన్
చకార వేగంతు మహాబలస్తదా
మతించ చక్రేస్య వధే మహాకపిః. ౩౦

టీక॥ వీర్యవాన్ = అధికమయినపరాక్రమంబుగలవాఁడును; మహాబలః = అధికమయినబలముగలవాఁడునగు; మహాకపిః = పెద్దకోఁతియగు హనుమంతుఁడు; ఇతి = ఇట్లు; పరస్య = శత్రువుయొక్క; ప్రవేగం = అధికవేగమునుఁగూర్చి; తర్కయన్ = ఆలోచింపుచు; స్వకర్మయోగంచ = తనకార్యారంభమును; విధాయ = నిర్ణయించి; తదా = అప్పుడు; వేగంతు = వేగమును; చకార = చేసెను; అస్య = ఇతనియొక్క; వధే = చంపుటయందు; మతించ = బుద్ధినిగూడ; చక్రే = చేసెను.

మహాపరాక్రమశాలియును మహాబలుండునగు హనుమంతుండు, ఈప్రకారము శత్రువుపరాక్రమంబును గుఱించి యాలోచించి, తాను జేయవలసినవిధంబును నిర్ణయించుకొని, యతనిఁ జంపనిశ్చయించి, యధికమయిన వేగంబు నవలంబించెను. అని, తాత్పర్యము.

స తస్య తాన్ నష్టహయాన్ మహాజవాన్
సమాహితాన్ భారసహాన్ వివర్తనే
జఘాన వీరః పథివాయుసేవితే
తలప్రహారైః పవనాత్మజః కపిః. ౩౧

టీక॥ వీరః = పరాక్రమశాలియును; పవనాత్మజః = వాయుదేవునికుమారుం




దునగు; సః=ఆ; కపిః=హనుమంతుండు; వాయుసేవితే=వాయువుచే సేవింపంబడిన; పథి=మార్గమునందు; మహాజవాన్ = అధికమయిన వేగముగలవియును; సమాహితాన్=ఎచ్చరికగలవియును; వివర్తనే=తిరుగుటయందు; భారసహాన్ = రథముయొక్క బరువు నోర్చునవియునగు; తస్య= ఆయక్షకుమారునియొక్క; హయాన్= గుఱ్ఱములను; అష్ట=ఎనిమిదింటిని; తలప్రహారైః=అఱచేతిదెబ్బలచేత; జఘాన=చంపెను.

పరాక్రమవంతుండును వాయుదేవుని కుమారుండునగు నాహనుమంతుండు, మహావేగంబుగలవియు నేమఱుపాటులేనివియు, నానావిధగతులందు రథభారంబు సహించునవియునగు నాయక్షకుమారుని గుఱ్ఱముల నెనిమిదింటి నాకాశంబున, నఱచేతం గొట్టి, చంపెను.

అని, తాత్పర్యము.

తత స్తలేనాభిహతో మహారథ
స్స తస్య పింగాధిపమంత్రినిర్జితః
ప్రభగ్ననీడః పరిముక్తకూబరః
పపాత భూమౌ హతవాజి రంబరాత్. ౩౭

టీక॥ తతః=అటుపిమ్మట; తలేన=అఱచేతిచేత; అభిహతః= కొట్టఁబడినః; తస్య=ఆయక్షునియొక్క; సః=ఆ; మహారథః=గొప్పరథము; పింగాధిపమంత్రినిర్జితః=వానరరాజుండు సుగ్రీవుని మంత్రియయినహనుమంతునిచే జయింపఁబడినదై; ప్రభగ్ననీడః=విఱిగిన చక్రిమునుగలదై; పరిముక్తకూబరః=విడువఁబడిన నొగగలదై ; హతవాజిః (హతవాజీ)=చంపఁబడిన గుఱ్ఱములుగలదై; అంబరాత్ = ఆకాశంబుననుండి; భూమౌ=నేలయందు ; పపాత=పడెను.

అంత, వానరరాజుండగు సుగ్రీవుని మంత్రియయినహనుమంతుని యఱచేతిపోటునకు, ఆయక్షునిమహారథము , చక్రింబులు విఱిగియు నొగదొలఁగియు గుఱ్ఱంబులు చచ్చియు, నాకాశంబుననుండి, నేలంగూలినది. అని, తాత్పర్యము.




స తం పరిత్యజ్య మహారథో రథం
సకార్ముకః ఖడ్గధరః ఖ ముత్పతన్
తపోభియోగా దృషి రుగ్రవీర్యవాన్
విహాయ దేహం మరుతా మివాలయమ్. 33

టీక॥ఉగ్రవీర్యవాన్ = భయంకరముగు పరాక్రమంబుగల; మహారథః = తన్నును సారథిని గుఱ్ఱములను గాపాడుకొనుచుఁ బదునొకండు వేలమంది విలుకాండ్రతోఁ బోరుశక్తి; సః = ఆయక్షుఁడు; తం = ఆ; రథం = రథమును; పరిత్యజ్య = విడిచి; సకార్ముకః = విల్లుతోఁ గూడినవాఁడై; ఖడ్గధరః = కత్తినిదాల్చినవాఁడై; ఖం = ఆకాశమునుగూర్చి; ఉత్పతన్ = ఎగురుచు; తపోభియోగాత్ = తపస్సుయొక్క యతిశయమువలన; దేహం = దేహమును; విహాయ = విడిచి; మరుతాం = దేవతలయొక్క; ఆలయం = స్థానమయిన స్వర్గమునుగూర్చి; ఉత్పతన్ (అధ్యాహృతము) = ఎగురుచున్న; ఋషిరివ = ఋషివలె; అభవత్ (అధ్యాహృతము) = ఉండెను.

భయంకరంబగు పరాక్రమంబుగలవాఁడును తన్నును సారథిని గుఱ్ఱములను గాపాడుకొనుచుఁ బదునొకండు వేలమంది విలుకాండ్రతోఁ బోరంజాలినమహాశూరుండు నగునాయక్షుండు, ఆరథంబువిడిచి; ధనుస్సును ఖడ్గంబును ధరించి, ఋషి, తపంబు పెంపున, దేహంబు విడిచి స్వర్గంబునకుఁ బోవునట్లు, ఆకాశంబున కెగిరెను. అని, తాత్పర్యము.

తతః కపి స్తం విచరంత మంబరే
పతత్త్రిరాజానిలసిద్ధసేవితే
సమేత్య తం మారుతతుల్యవిక్రమః
క్రమేణ జగ్రాహ సపాదయో ర్దృఢమ్. 3౪

టీక॥తతః = అటుపిమ్మట; మారుతతుల్యవిక్రమః = వాయువుయొక్క పరాక్రమముతో సమానమయినపరాక్రమంబుగల; సః = ఆ; కపిః = హనుమంతుండు; పతత్త్రిరాజానిలసిద్ధసేవితే = గరుత్మంతునిచేతను వాయువుచేతను సిద్ధులచేత

స ౪౭

ను సేవింపఁబడిన; అంబరే = ఆకాశము నందు; విచరంతం = విహరించుచున్న; తం = ఆయక్షుని, సమేత్య = పొంది; తం = అతని; క్రమేణ = వరుసచేత; పాదయోః = పాదములయందు; దృఢం = గట్టిగా; జగ్రాహ = పట్టుకొనెను.

అంత, వాయువునకుంబోలె మహాపరాక్రమంబుగలహనుమంతుండు, గరుత్మంతునకును వాయుదేవునకునుసిద్ధులకునువిహారస్థానమయినయాకాశమునందు, విహరించుచున్నయాయక్షకుమారుంజూచి, యుపాయంబున, నతనిపాదంబులంగట్టిగాఁబట్టుకొనెను.

అని, తాత్పర్యము.

స తం సమావిధ్య సహస్రశః కపి
ర్మహోరగం గృహ్య ఇవాండజేశ్వరః
ముమోచ వేగా త్పితృతుల్యవిక్రమో
మహీతలే సంయతి వానరోత్తమః. ౩౫

టీక॥ పితృతుల్యవిక్రమః = తండ్రియగువాయువుయొక్క పరాక్రమముతో సమానమయిన పరాక్రమముగలవాఁడును; వానరోత్తమః = వానరశ్రేష్ఠుండును అగు; సః = ఆ; కపిః = హనుమంతుండు; సంయతి = యుద్ధమునందు; అండజేశ్వరః = గరుత్మంతుండు; మహోరగమివ = పెద్దసర్పమునువలె; తం = ఆయక్షుని; గృహ్య (గృహీత్వా) = పట్టుకొని; సహస్రశః = వేయిమార్లు; సమావిధ్య = కొట్టి; వేగాత్ = వేగమువలన; మహీతలే = భూతలమునందు; ముమోచ = విడిచెను.

తన తండ్రియగు వాయుదేవునకుంబోలెఁబరాక్రమంబుగలవాఁడును వానరోత్తముండునగునాహనుమంతుండు, గరుత్మంతుండు మహాసర్పంబును బట్టుకొనునట్లు, ఆయక్షునింబట్టుకొని, వేయిమార్లుత్రిప్పి, వేగంబున, నేలంబడవైచెను. అని, తాత్పర్యము.

స భగ్నబాహూరుకటీశిరోధరః
క్షరన్న సృఙ్నిర్మథితాస్థిలోచనః
సభగ్నసంధిః ప్రవికీర్ణబంధనో

హతః క్షితౌ వాయుసుతేన రాక్షసః. ౩౭

టీక॥సః=ఆ; రాక్షసః=రాక్షసుండగు నక్షుండు; భగ్నబాహూరుకటీశిరోధరః= విఱిగినచేతులును దొడలును మొలయును మెడయును గలవాఁడై; క్షరన్నసృక్(క్షరదసృక్)= కాఱుచున్న నెత్తురుగలవాఁడై, నిమథిత్నాస్థిలోచనః=నలియఁగొట్టఁబడిన యెముకలును కండ్లును గలవాఁడై; సభగ్నసంధిః=విఱిగినసంధులతోఁగూడినవాఁడై; ప్రవికీర్ణబంధనః=వీడినదట్టిగలవాఁడై; వాయుసుతేన=హనుమంతునిచేత; హతః=చంపఁబడినవాఁడై; క్షితౌ = నేలయందు; అపతత్(అధ్యాహృతము)=పడెను.

ఆయక్షకుమారుండు, చేతులును దొడలును మొలయును మెడయునువిఱిగి, దేహంబున నెత్తురుగాఱ, యెముకలును గండ్లును నలఁగి, కండ్లకుఁగానరాకుండ, సంధిబంధంబులువిఱుగ, దట్టివీడ, హనుమంతుని చేహతుండై, నేలంబడెను. అని, తాత్పర్యము.

మహాకపి ర్భూమితలే నిపీడ్య తం
చకార రక్షోధిపతే ర్మహద్భయమ్

టీక॥మహాకపిః= పెద్దకోఁతియయిన హనుమంతుఁడు; తం=ఆయక్షకుమారుని; భూమితలే=నేలయందు; నిపీడ్య=పీడించి; రక్షోధిపతేః=రాక్షసులకుఁబ్రభువైన రావణునకు; మహత్=అధికమయిన; భయం=వెఱపును; చకార= చేసెను.

హనుమంతుం, డట్లు, అక్షకుమారు నేలంగొట్టి ముద్దగాఁజేసి, రాక్షసేశ్వరుండగు రావణునకు, మహాభయంబు, గలిగించెను. అని, తాత్పర్యము.

మహర్షిభి శ్చక్రచరై ర్మహావ్రతైః
స్సమేత్య భూతైశ్చ సయక్షపన్నగైః. ౩౮
సురైశ్చ సేంద్రై ర్భృశజాతవిస్మయై
ర్హతే కుమారే స కపి ర్నిరీక్షితః

స ౪౭




టీక॥కుమారే = అక్షకుమారుఁడు; హతే = చంపఁబడఁగా ; చక్రచరైః = జ్యోతిశ్చక్రమునందుఁ దిరుగునట్టివారు ను; మహావ్రతైః = అధికమయినవ్రతము గలవారలును; భృశజాతవిస్మయైః = మి క్కిలియు గలిగినయాశ్చర్యము గలవారి లునగు; మహర్షిభిః = మహాఋషులచే తను; సయక్షపన్నగైః = యక్షులతో నుసర్పంబులతోనుంగూడిన ; భూతైశ్చ = భూతములచేతను ; సేంద్రైః = ఇంద్రునితోఁగూడిన; సురైశ్చ = దేవతల చేతను; సమీక్ష్య = చేసి; సః = ఆ; కపిః = హనుమంతుఁడు; నిరీక్షితః = చూడఁబ డినాఁడు.

హనుమంతుండక్షకుమారుం జంపఁ గానే, జ్యోతిశ్చక్రంబునందిరుగువారలు ను మహావ్రతులునగు మహాఋషులును భూతంబులును యక్షులును బన్నగంబు లును దేవతలును దేవేంద్రుండునొక్కటి గాఁ, మిక్కిలియు నాశ్చర్యంబునొంది, యీహనుమంతుంజూచిరి.

అని, తాత్పర్యము.

నిహత్య తం వజ్రిసుతోపమప్రభం
కుమార మక్షం క్షతజోపమేక్షణమ్. ౪౮
తమేవ వీరోభిజగామ తోరణం
కృతక్షణః కాల ఇవ ప్రజాక్షయే

టీక॥ వీరః = పరాక్రమశాలియగు హనుమంతుండు ; వజ్రిసుతోపమప్రభం = ఇంద్రునికొడుకుకాంతితోఁ బో లిక గలకాంతిగలవాఁడును; క్షతజోపమేక్షణం = నెత్తురుతోఁబోలిక గలకండ్లు గలవాఁడునగు; తం = ఆ; అక్షం = అ క్షుఁడను; కుమారం = కుమారుని; నిహత్య = చంపి; కృతక్షణః = చేయఁబడిన యూరకుండుటగలవాఁడై ; ప్రజాక్షయే = జనులవినాశకాలమునందు; కాల ఇవ(స్థితః) = యముఁడువలె నున్నవాఁడై; తం = ఆ; తోరణమేవ = బహిర్ద్వారమునే; అభిజగామ = పొందెను.

పరాక్రమవంతుఁడగు నాహనుమంతుండు, దేవేంద్రునికొడుకుంబోలిన వాఁడును నెత్తురువలెనెఱ్ఱనైనకండ్లుగల వాఁడునగు నక్షకుమారుంజంపి, ఆయ శోకవన బహిర్ద్వారంబునకేపోయి, ప్రళయకాలమునందు యముండునుంబో లెంజూపఱులకుభయంబుఁబుట్టించుచు,




నూరకుండెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, సప్తచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండసప్తచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

అష్టచత్వారింశసర్గప్రారంభః.

తత స్స రక్షోధిపతి ర్మహాత్మా
హనూమతాఽక్షే నిహతే కుమారే
మన స్సమాధాయ త దేంద్రకల్పం
సమాదిదేశేంద్రజితం సరోషమ్. ౧

టీక॥కుమారే=కొడుకైన; అక్షే=అక్షుండు; హనూమతా=హనుమంతునిచే త; నిహతే=చంపబడఁగా; తతః=అటు పిమ్మట; మహాత్మా=అధికమైనపరాక్రమముగల; రక్షోధిపతిః=రాక్షసులకుఁ బ్రభుండగు; సః=ఆ రావణుఁడు; మనః=మనసును; సమాధాయ=నెమ్మదిచేసుకొని; తదా=అప్పుడు; సరోషం=కోపముతోఁగూడుకొనట్లు; ఇంద్రకల్పం=ఇంద్రునితో సమానుడగు; ఇంద్రజితం=ఇంద్రజిత్తును; సమాదిదేశ=ఆజ్ఞాపించెను.

అట్లు, హనుమంతునిచే నక్షకుమారుండు చచ్చుటను విని, మహాపరాక్రమశాలియయిన రాక్షసేశ్వరుండగు రావణుండు, సుఖింబడంచుకొని, కోపంబునొంది, ఇంద్రతుల్యుండగు నింద్రజిత్తుం జూచి, యిట్లని, యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

త్వమస్త్రవిచ్ఛస్త్రవిదాం వరిష్ఠ
స్సురాసురాణామపి శోకదాతా
సురేషు సేంద్రేషుచ దృష్టకర్మా
పితామహారాధనసంచితాస్త్రః. ౨

టీక॥త్వం — నీవు; అస్త్రవిత్ = అస్త్రంబుల నెఱింగినవాఁడవు. శస్త్రవిదాం = శస్త్రంబుల నెఱింగినవారలలో; వరిష్ఠః = శ్రేష్ఠుండవు. సురాసురాణామపి = దేవతలకును నసురులకును; శోకదాతా — దుఃఖము నొసంగువాఁడవు. సేంద్రేషు = ఇంద్రునితోఁగూడిన; సురేషుచ = దేవతలయందును; దృష్టకర్మా = చూడఁబడిన కార్యముగలవాఁడవు; పితామహారాధనసంచితాస్త్రః = బ్రహ్మదేవు నారాధించుటచేతఁ గూర్పఁబడిన యస్త్రములు గలవాఁడవు.

నీ,వస్త్రవేత్తవు; శస్త్రవిద్య నేర్చినవారలలో నుత్తముఁడవు; నిన్నుఁ జూచి దేవతలు నసురులును దుఃఖము నొందుదురు; మఱియుఁ బెక్కుమాఱులు, దేవేంద్రునితోఁగూడ దేవతల నందఱ యుద్ధంబున జయించినవాఁడవు; బ్రహ్మదేవు నారాధించి, పెక్కు దివ్యాస్త్రంబులు సంపాదించియున్నావు. అని, తాత్పర్యము.

తవాస్త్రబల మాసాద్య నాసురా న మరుద్గణాః
న శేకు స్సమరే స్థాతుం సురేశ్వరసమాశ్రితాః. ౩

టీక॥ తవ = నీయొక్క; అస్త్రబలం = అస్త్రశక్తిని; ఆసాద్య = పొంది; సమరే = యుద్ధమునందు; స్థాతుం = ఉండుటకు; అసురాః = అసురులు; న(శేకుః) = చాలరు. మరుద్గణాః = వాయుసమూహములు; న(శేకుః) చాలరు, సురేశ్వరసమాశ్రితాః — దేవేంద్రునాశ్రయించినవారలు; న శేకుః = చాలరు.

నీయస్త్రబలమహిమచే, నసురులుగాని వాయువులుగాని దేవేంద్రునితట్టువారలుగాని, యుద్ధంబున, నీయెదుట నిలువంజాలరు. అని, తాత్పర్యము.

న కశ్చి త్త్రిషు లోకేషు సంయుగే నగతశ్రమః

టీక॥త్రిషు — మూఁడైన; లోకేషు — లోకములయందు; తవ = నీయొక్క; సం

యుగే = యుద్ధమునందు ; నగతశ్ర మః = అలసటనొందనివాఁడు; కశ్చిత్ = ఒకానొకండును;న=లేఁడు. ముల్లోకంబులందును, నీతోయుద్ధముచేసి,పరాజయంబు నొందనివాఁడెవ్వఁడును,లేఁడు. అని,తాత్పర్యము.

భుజవీర్యాభిగుప్తశ్చ తపసాచా భిరక్షితః. ౪
దేశకాలవిభాగజ్ఞ స్త్వమేవ మతిసత్తమః

టీక॥త్వమేవ=నీవే; భుజవీర్యాభిగుప్తః=బాహుపరాక్రమముచేరక్షింపఁబడినవాఁడవును.తపసాచ= తపస్సుచేతను; అభిరక్షితః=రక్షింపఁబడినవాఁడవు.దేశకాలవిభాగజ్ఞః= దేశములయొక్కయుఁగాలములయొక్కయువిభాగము నెఱింగినవాఁడవు. మతిసత్తమః= బుద్ధిచేశ్రేష్ఠుండవు.

నీవు, బాహుపరాక్రమంబునను దపంబునను రక్షితుండవు ; ఏదేశంబున నేకాలంబున నేది సేయఁవలయునో, అవిభాగంబు నెఱింగినవాఁడవు; తీక్ష్ణమయినబుద్ధిగలవాఁడవు; నీయట్టివాఁ డెవ్వఁడును లేఁడు. అని, తాత్పర్యము.

న తేస్త్యశక్యం సమరేషు కర్మణా
న తేస్త్యకార్యం మతిపూర్వమంత్రిణే. ౫
నసోస్తి కశ్చి త్త్రిషు సంగ్రహేషు వై
నవేద యస్తేస్త్రబలం బలంచ తే

టీక॥సమరేషు=యుద్ధములందు; కర్మణా=పురుషకారముచేత; తే=నీకు;అశక్యం=అలవిగానిది;న=లేదు.మతిపూర్వమంత్రిణే= బుద్ధిపూర్వముగా నాలోచించుటయందు; తే=నీకు; అకార్యం=చేయఁగూడనిది;న = లేదు.త్రిషు=మూఁడైన;లోకేషు= లోకములయందు;("వై" అనునది పాదపూరణార్థము) యః=ఎవ్వఁడు; తే = నీయొక్క;అస్త్రబలం=అస్త్రంబుల బలిమిని; తే=నీయొక్క; బలంచ=దేహబలమును;నవేద=ఎఱుంగఁడో;సః= అతండు; కశ్చిత్=ఒకానొకండును;న=లేఁడు.

యుద్ధంబునఁ, బురుషకారంబున నీకశక్యమయినదేదియు లేదు; బుద్ధితో నాలోచించుటయందు, నీకసాధ్యమేదియు లేదు; ముల్లోకంబులందును, నీయస్త్రబలంబు నీదేహబలంబు నెఱుంగనివాఁడెవ్వఁడును లేఁడు. అని తాత్పర్యము

మమానురూపం తపసో బలంచ
పరాక్రమ శ్చాస్త్రబలంచ సంయుగే. ౬
న త్వాం సమాసాద్య రణావమర్దే
మనశ్శ్రమం గచ్ఛతి నిశ్చితార్థమ్

టీక॥ తే=నీయొక్క; తపసః = తపముయొక్క; బలంచ=బలమును; మమ=నాకు; అనురూపం = తగినది. సంయుగే=యుద్ధమునందు; పరాక్రమశ్చ= పరాక్రమమును; మమ, అనురూపః(అధ్యాహృతము)=నాకుఁదగినది. అస్త్రబలంచ= అస్త్రంబులబలిమియును; మమ, అనురూపం(అధ్యాహృతము)=నాకుదగినది. రణావమర్దే=యుద్ధసంకటమునందు; త్వాం=నిన్ను; సమాసాద్య=పొంది; మనః=మనసు; నిశ్చితార్థం = నిశ్చయింపఁబడినప్రయోజనముగలదై; శ్రమం=అలసటను; నగచ్ఛతి=పొందదు.

నీవు, తపోబలంబునను యుద్ధంబునను అస్త్రబలంబునను, నన్నుఁబోలినవాఁడవు; యుద్ధంబునసంకటంబుగల్గునప్పుడు, నామనసు, నిన్నుఁదలఁచి, దుఃఖముఁబొందకుండును. అని, తాత్పర్యము,

నిహతాః కింకరా స్సర్వే జంబుమాలీచ రాక్షసః. ౭
అమాత్యపుత్రా వీరాశ్చ పంచసేనాగ్రయాయినః
బలాని సుసమృద్ధాని సాశ్వనాగరథానిచ. ౮

టీక॥ కింకరాః=కింకరులు; సర్వే=అందఱును; జంబుమాలీ = జంబుమాలియను; రాక్షసశ్చ = రాక్షసుండును; వీరాః=పరాక్రమశాలులగు; అమాత్యపుత్రాశ్చ= మంత్రిపుత్రులును; సేనాగ్రయాయినః= సేనానాయకులు; పంచ= అయిదుగురును; నిహతాః=చంపఁబడినారు. సుసమృద్ధాని= సంపూర్ణము

లయినవియును; సాశ్వనాగరథాని=గుఱ్ఱములతోను ఏనుంగులతోను రథములతో నుంగూడినవియునగు; బలానిచ=సైన్యములును; నిహతాని (అధ్యాహృతము)=చంపఁబడినవి.

కింకరులందఱునుజంపఁబడిరి; జంబుమాలియును వీరులగుమంత్రిపుత్రులును, సేనానాయకులయిదుగురును, నిహతులైరి; మఱియు, గుఱ్ఱంబుల యేనుంగుల రథంబులసంపూర్ణంబులయినసైన్యంబులునుజంపఁబడినవి. అని, తాత్పర్యము.

సహోదరస్తే దయితః కుమారోఽక్షశ్చ సూదితః

టీక॥ తే = నీయొక్క; సహోదరః=తమ్ముఁడును; దయితః=దయితుండును; కుమారః= బాలుండునగు; అక్షశ్చ=అక్షుండును; సూదితః= చంపఁబడినాఁడు.

నీకుఁదమ్ముఁడును ప్రియుండును బాలుండునగునక్షుండునుజచ్చినాఁడు.
అని, తాత్పర్యము.

నహి తేష్వేవ మే సారో యస్త్వయ్యరినిషూదన. ౯

టీక॥ అరినిషూదన= శత్రువులచంపునట్టియింద్రజిత్తా! మే=నాకు; త్వయి=నీయందు; యః= ఏ; సారః = గౌరవమో; తేషు=వారలయందు; నైవహి=లేనేలేదుగదా!

శత్రువులంజంపునట్టియింద్రజిత్తా! నాకునీయందుండు గౌరవము వారలయందులేదు. అని, తాత్పర్యము.

ఇదంహి దృష్ట్వా మతిమన్మహద్బలం
కపేః ప్రభావంచ పరాక్రమంచ
త్వమాత్మనశ్చాపి సమీక్ష్య సారం
కురుష్వ వేగం స్వబలానురూపమ్. ౧౦

టీక॥మతిమన్—అధికమయినబుద్ధిగలయింద్రజిత్తా! త్వం=నీవు; కపేః= హనుమంతునియొక్క; ఇదం — ఈ; మహత్=గొప్పదైన; బలం — బలమును;

ప్రభావంచ = ప్రభావమును; పరాక్రమంచ — పరాక్రమమును; దృష్ట్వా = చూచి; ఆత్మనః = నీయొక్క; సారం చాపి = బలమును; సమీక్ష్య = చూచుకొని; స్వబలానురూపం = నీబలంబునకుఁదగిన; వేగం = వేగమును; కురుష్వ = చేయుము.

ఇంద్రజిత్తా! నీవుబుద్ధిమంతుండవు; కింకరులాదిగా నక్షకుమారునివఱకుంగలశూరులంజంపిన యావానరునిబలంబునుబ్రభావంబును బరాక్రమంబునువిమర్శించి, నీబలంబునుగణిసించుకొని, నీబలంబునకుఁ దగునట్లు వేగముఁ వహింపుము. అని, తాత్పర్యము.

బలావమర్ద స్త్వయి సన్నికృష్టే
యథా గతే శామ్యతి శాంతశత్రౌ
తథా సమీక్ష్యాత్మబలం పరంచ
సమారభస్వా స్త్రవిదాంవరిష్ఠ. ౧౧

టీక॥ అస్త్రవిదాం — అస్త్రంబులనెఱింగినవారలలో; వరిష్ఠ = ఉత్తముఁడవగునింద్రజిత్తా! శాంతశత్రౌ = శమింపఁజేయఁబడినశత్రువులుగల; త్వయి = నీవు; గతే — పోయినవాఁడవై; సన్నికృష్టే = సమీపింపఁగా; యథా = ఎట్లు; బలావమర్దః = సేనానాశము; శామ్యతి = నిలుచునో; తథా = అట్లు; ఆత్మబలం = నీబలమును; పరంచ = శత్రువును; సమీక్ష్య = చూచి; సమారభస్వ = ఆరంభింపుము.

అస్త్రవేత్తలలో నుత్తముఁడవగు నింద్రజిత్తా! శత్రువులను శమింపఁజేయఁగలనీవు, ఇచ్చటనుండిపోయి, యావానరుంజేరఁగానే, యటువిమ్మట నైనను, మన సేనకునాశముగలుగకుండునట్లు, నీబలంబునుశత్రుబలంబునుంబాచుకొని, యుద్ధంబుసేయుము.

అని, తాత్పర్యము.

న వీర సేనా గణశోచ్యవంతి
న వజ్ర మాదాయ విశాలసారమ్
న మారుతస్యాస్య గతేః ప్రమాణం

న చాగ్నికల్పః కర ణేన హంతుమ్.౧౨

టీక॥వీర=పరాక్రమశాలివగు నిం ద్రజిత్తా! గణశోచి=సమూహమును దుఃఖింపఁజేయువానియందు; సేనాః= సేనలు;నావంతి=రక్షింపవు. అలసారం= మొక్కవోయినధారలుగల; వ జ్రం=వజ్రాయుధమును; ఆదాయ= తీసికొని;నవిశ=చొరకుము.అస్య= ఈ హనుమంతునియొక్క; గతేః=గమన ముయొక్క ప్రమాణం=కొలఁదికి మారుతస్య=వాయువునకు;న=లేదు.అగ్నికల్పః=నిప్పుతోసమానుఁడైనవాఁడు;క రణేనచ=పిడికిలిలోనగువానిచేత;హంతుం=చంపుటకు ; న( శక్యః )= అలవికాఁడు.

పరాక్రమశాలివగునింద్రజిత్తా! ఓ క్కొక్కసారికిగుంపులుగుంపులుగాఘటులంజంపునట్టి, యీవానరుని విషయము యి, సేనలుపనికిరావు;వజ్రాయుధంబునుఅతనిపై నేమియుసేయంజాలదు;కావున, దానిందీసికొనిపోవలదు; ఇతనికున్నంతశీఘ్రగమనము , వాయువునకుం గూడలేదు; మఱియు, నగ్నిహోత్రంబువంటివాఁడు,కావున,నతనిఁబిడికిళ్లం బొడిచియుఁజంపనలవిగాదు.

అని, తాత్పర్యము.

తమేవ మర్థం ప్రసమీక్ష్య సమ్యక్
స్వకర్మసామ్యాద్ధి సమాహితాత్మా
స్మరంశ్చ దివ్యం ధనుషో స్త్రవీర్యం
వ్రజాక్షతం కర్మ సమారభస్వ. ౧౩

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; తం=ఆ;ఏవం=ఈప్రకారమయిన; అర్థం=విషయమును; సమ్యక్=చక్కఁగా; ప్రసమీక్ష్య=చక్కఁగాఁజూచి;స్వకర్మసామ్యాత్ = నీకార్యము యొక్క సమతవలన, నీకార్యములు చెడకుండుటకైయనుట;సమాహితాత్మా= ఎచ్చరికతోఁగూడినమనసుగలవాఁడవై; దివ్యం=ఉత్తమమయిన; ధనుషః=వింటియొక్క; అస్త్రవీర్యం=అస్త్రబలమును;స్మరంశ్చ=తలంచుచును; వ్రజ= పొమ్ము. అక్షతం=అపాయములేనట్లు

గా; కర్మ = కార్యమును; సమారభస్వ = ఆరంభింపుము.

నీవు, నేనిప్పుడు చెప్పినవిషయమును జక్కఁగావిచారించి, నీకార్యంబు చెడకుండునట్లు, ఏమియుపాటులేక, దివ్యంబగునీయస్త్రబలంబునుస్మరించుచుఁ, బాము; అపాయము రాకుండునట్లు సేయుము. అని, తాత్పర్యము.

నఖల్వియం మతిశ్శ్రేష్ఠా యత్త్వాం సంప్రేషయా మ్యహమ్
ఇయంచ రాజధర్మాణాం క్షత్రియస్య మతి ర్మతా. ౧౪

టీక॥ అహం = నేను; త్వాం = నిన్ను; సంప్రేషయామి (ఇతి) యత్ = పంపుచున్నానను నదియేదిగలదో; ఇయం = ఈ; మతిః = ఉపాయము; నశ్రేష్ఠాఖలు = ఉత్తమము కాదుగదా; ఇయం = ఈ; మతిః = ఉపాయము; రాజధర్మాణాం = రాజధర్మములకును; క్షత్రియస్యచ = క్షత్రియునకును; మతా = యుక్తమయినది.

నేను నిన్నుయుద్ధమునకుఁ బంపుటయంతయు త్తమమయినదికాదు; అయితే, ఈయుపాయము, రాజధర్మములకును, వానిననుష్ఠించు క్షత్రియునకును యుక్తమయినది; కావున, నిన్నుఁబంపుచున్నాను. అని, తాత్పర్యము.

నానాశస్త్రైశ్చ సంగ్రామే వైశారద్య మరిందమ
అవశ్యమేవ యోద్ధవ్యం కామ్యశ్చ విజయో రణే. ౧౫

టీక॥ అరిందమ = శత్రువుల నడఁగఁ ద్రొక్కునట్టియింద్రజిత్తా! నానాశస్త్రైః = నానావిధాయుధములచేత; సంగ్రామే = యుద్ధమునందు; వైశారద్యం = పాండిత్యము; తవ (అధ్యాహృతము) = నీకు; అస్తి (అధ్యాహృతము) = కలదు. అవశ్యమేవ = అవశ్యముగానే; యోద్ధవ్యం = యుద్ధము సేయుట కావలసినది. రణే = యుద్ధమునందు; విజయశ్చ = గెల్పును; కామ్యః = కోరఁదగినది.

శత్రువులనడంగఁద్రొక్కఁజాలిన యింద్రజిత్తా! నీవు, నానావిధాయుధంబులయుద్ధంబు సేయుటయందుఁ బండితుండవు; కావున; నవశ్యము యుద్ధము సేయవలసినదే; ఎట్లయినను యుద్ధంబునజయంబు నొందునట్లు సేయవల

యును. అని, తాత్పర్యము.

తతః పితు స్తద్వచనం నిశమ్య
ప్రదక్షిణం దక్షసుతప్రభావః
చకార భర్తార మదీనసత్త్వో
రణాయ వీరః ప్రతిపన్నబుద్ధిః. ౧౬

టీక॥ తతః=అటుపిమ్మట; దక్షసుతప్రభావః=దేవతలయొక్క ప్రభావమువంటి ప్రభావముగలవాఁడును; అదీనసత్త్వః=తక్కువ కాని బలముగలవాఁడును; వీరః=పరాక్రమశాలియునగు నింద్రజిత్తు; పితుః=తండ్రియొక్క; తత్=ఆ; వచనం=మాటను; నిశమ్య=విని; రణాయ=యుద్ధముకొఱకు; ప్రతిపన్నబుద్ధిః=పొందఁబడినబుద్ధిగలవాఁడై; భర్తారం=ప్రభువైన రావణుని గూర్చి; ప్రదక్షిణం=ప్రదక్షిణమును; చకార=చేసెను.

అంత, దేవతలకుంబోలెఁ బ్రభావంబుగలవాఁడును మహాబలుండును బరాక్రమవంతుండునగు నింద్రజిత్తు, తండ్రిచెప్పినమాటను విని, యుద్ధంబునకుఁ బోఁదలంచి, తండ్రికిఁ బ్రదక్షిణంబు చేసెను.

అని, తాత్పర్యము.

తత స్తైః స్వగణై రిష్టై రింద్రజి త్ప్రతిపూజితః
యుద్ధోద్ధతః కృతోత్సాహ స్సంగ్రామం ప్రత్యపద్యత. ౧౭

టీక॥ తతః=అటుపిమ్మట; ఇంద్రజిత్=ఇంద్రజిత్తు; ఇష్టైః=ప్రియులయిన; స్వగణైః=తనవారలచేత; ప్రతిపూజితః=పూజింపఁబడినవాఁడై; యుద్ధోద్ధతః=యుద్ధగర్వముగలవాఁడై; కృతోత్సాహః=చేయఁబడిన యుత్సాహముగలవాఁడై; సంగ్రామం=యుద్ధమును; ప్రత్యపద్యత=పొందెను.

అంత, నింద్రజిత్తు, తనవారలు నానావిధంబులం బొగడ, యుద్ధగర్వంబునఁ, బరమోత్సాహంబునొంది, యుద్ధంబు సేయుటకై, పోయెను.

అని, తాత్పర్యము.

శ్రీమా న్పద్మపలాశాక్షో రాక్షసాధిపతే స్సుతః

నిజగామ మహాతేజా స్సముద్ర ఇవ పర్వసు. ౧౮

టీక॥ శ్రీమాన్=అధికమయినకాంతిగలవాఁడును; పద్మపలాశాక్షః=తామరపూరేకులవంటి కండ్లుగలవాఁడును; మహాతేజాః=అధికమైనపరాక్రమముగలవాఁడునగు; రాక్షసాధిపతేః=రాక్షసులకుఁ బ్రభుండగు రావణునియొక్క; సుతః=కొడుకైనయింద్రజిత్తు; పర్వసు=పర్వకాలములందు; సముద్ర ఇవ=సముద్రుఁడువలె; నిజగామ=వెడలెను.

కాంతిమంతుండును కమలంబులతేకులంబోలిన కండ్లుగలవాఁడును మహాపరాక్రమశాలియునగు నింద్రజిత్తు, పర్వకాలంబులందుసముద్రుండువలె నుప్పొంగి, యుద్ధంబునకు, వెడలెను.

అని, తాత్పర్యము.

స పక్షిరాజోపమతుల్యవేగై
ర్వ్యాళై శ్చతుర్భి స్సితతీక్ష్ణదంష్ట్రైః
రథం సమాయుక్త మసంగవేగం
సమారురోహేంద్రజి దింద్రకల్పః. ౧౯

టీక॥ ఇంద్రకల్పః=ఇంద్రునితోసమానుఁడయిన; సః=ఆ; ఇంద్రజిత్=ఇంద్రజిత్తు; పక్షిరాజోపమతుల్యవేగైః=గరుత్మంతునివేగముతోఁబోలికగలవియు సమానమయినవియు నగు వేగము గలవియును; సితతీక్ష్ణదంష్ట్రైః=తెల్లనివియుఁగఱకు గలవియు నగుకోఱలుగలవియును; చతుర్భిః=నాలుగైన; వ్యాళైః=ఏనుంగులతో; సమాయుక్తం=కూడినదియును; అసంగవేగం=భూమిసంబంధములేని వేగముగలదియునగు; రథం=రథమును; సమారురోహ=ఎక్కెను.

ఇంద్రతుల్యుండగు నాయింద్రజిత్తు, వేగంబునగరుత్మంతునకుసాటియయినవియు వేగంబునఁ బరస్పరసమానములునుఁ దెల్లని కఱకు కోఱలు గలవియు నగు నాలుగుగజంబులతోఁగూడిన రథంబు, నెక్కెను. అని, తాత్పర్యము.

సరథీ ధన్వినాం శ్రేష్ఠ శ్శస్త్రజ్ఞో స్త్రవిదాంవరః
రథే నాభియయౌ క్షిప్రం హనుమా న్యత్ర సోభవత్. ౨౦

స ౪౫

టీక॥ రథీ=రథముగలవాఁడును; ధన్వినాం=విలుకాండ్రలోపల; శ్రేష్ఠః=ఉత్తముండును; శస్త్రజ్ఞః=ఆయుధంబుల నెఱింగినవాఁడును; అస్త్రవిదాం=అస్త్రంబుల నెఱింగిన వారిలోపల; వరః=శ్రేష్ఠుండునగు; సః= ఆయింద్రజిత్తు; సః=ఆ; హనుమాన్=హనుమంతుఁడు; యత్ర=ఎచ్చటఁ; అభవత్=ఉండెనో; తత్ర (అధ్యాహృతము)= అచ్చటికి; రథేన=రథముచేత; క్షిప్రం=శీఘ్రముగా; అభియయౌ=పోయెను.

రథికుండును, విలుకాండ్రలో శ్రేష్ఠుండును, శస్త్రవిద్య నేర్చినవాఁడును, అస్త్రవేత్తలలో నుత్తముఁడునగు నాయింద్రజిత్తు, రథంబు నెక్కి, శీఘ్రముగా హనుమంతుండున్న చోటికిం బోయెను- అని, తాత్పర్యము-

స తస్య రథనిర్ఘోషం జ్యాస్వనం కార్ముకస్య చ
నిశమ్య హరివీరో౽సౌ సంప్రహృష్టతరో౽భవత్. ౨౧

టీక॥ సః=ఆ; అసౌ = ఈ; హరివీరః=వానరవీరుండగు హనుమంతుండు; తస్య = ఆయింద్రజిత్తుయొక్క; రథనిర్ఘోషం=రథధ్వనిని; కార్ముకస్య= వింటియొక్క; జ్యాస్వనంచ= అల్లెత్రాటిధ్వనిని; నిశమ్య = విని; సంప్రహృష్టతరః=మిక్కిలియు సంతోషించినవాఁడు; అభవత్=ఆయెను.

హనుమంతుండు, ఆయింద్రజిత్తురథధ్వనిని అల్లెత్రాటిధ్వనిని విని, మఱలయుద్ధంబు సేయఁగలిగినదని, పరమసంతోషంబునొందెను. అని, తాత్పర్యము.

సుమహచ్చాప మాదాయ శితశల్యాంశ్చ సాయకాన్
హనుమంత మభిప్రేత్య జగామ రణపండితః. ౨౨

టీక॥ రణపండితః = యుద్ధంబునం దుఁ బండితుండగు నింద్రజిత్తు; సుమహత్=మిక్కిలియుఁ బెద్దదైన; చాపం=వింటిని; శితశల్యాన్=కోఱకుగల మేకులుగల; సాయకాంశ్చ=బాణంబులను; సమాదాయ=తీసికొని; హనుమంతం=హనుమంతుని; అభిప్రేత్య=ఉద్దేశించి; జగామ=పోయెను.

యుద్ధంబున సమర్థుండగు హనుమంతుండు, గోష్పదనుస్సును, కలంకుబాణంబులనుదీసికొని, హనుమంతుంగురించి చెప్పెను. అని, తాత్పర్యము.

తస్మిం స్తత స్సంయతి జాతహర్షే
రణాయ నిర్గచ్ఛతి బాణపాణౌ
దిశశ్చ సర్వాః కలుషా బభూవు
ర్మృగాశ్చ రౌద్రా బహుధా వినేదుః. ౨౩

టీక ॥ తతః = అటుపిమ్మట; తస్మిన్ = ఆయింద్రజిత్తు; సంయతి= యుద్ధమునందు; జాతహర్షే= కలిగినసంతోషముగలవాఁడును; బాణపాణౌ= బాణముచేతియందుఁగలవాఁడునగుచు; రణాయ=యుద్ధముకొఱకు;నిర్గచ్ఛతి=వెడలుచుండఁగా; దిశశ్చ= దిక్కులు;సర్వాశ్చ=అన్నియును; కలుషాః=మలినములు;బభూవుః= అయినవి. రౌద్రాః=భయంకరములయిన; మృగాశ్చ=మృగంబులును; బహుధా=పెక్కువిధంబులుగా;వినేదుః=అఱచినవి.

అంత,నప్పుడు, ఇంద్రజిత్తు,ఉత్సాహంబునబాణంబుచేతం దాల్చి , యుద్ధంబునకు వెడలుచుండఁగా , దిక్కులన్నియు మలినములుగాఁ జూపట్టినవి ; క్రూరమృగంబులు నానావిధంబుగ నఱచినవి.అని, తాత్పర్యము.

సమాగతా స్తత్ర తు నాగయక్షా
మహర్షయ శ్చక్రచరాశ్చ సిద్ధాః
నభ స్సమావృత్య చ పక్షిసంఘా
వినేదు రుచ్చైః పరమప్రహృష్టాః ౨౪

టీక॥తత్రతు= అచ్చటికిని; చక్రచరాః=జ్యోతిశ్చక్రమునందుఁదిరుగునట్టి; నాగయక్షాః= సర్పంబులునుయక్షులును;మహర్షయః=మహర్షులును; సిద్ధాశ్చ=సిద్ధులును;సమాగతాః=వచ్చిరి.పక్షిసంఘాశ్చ= పక్షిసమూహములును;పరమప్రహృష్టాః= మిక్కిలియు సంతసించినవై;నభః= ఆకాశమును;

ఆవృత్య=ఆవరించి; ఉచ్చైః = గట్టిగా; వినేదుః=అఱచినవి.

అప్పు, డాయుద్ధంబుఁజూడ, నచ్చటికి, జ్యోతిశ్చక్రసంచారులగు సర్పంబులును యక్షులును మహాఋషులును సిద్ధులును, వచ్చిరి; పక్షులు, పరమసంతోషంబున నాకాశంబున, గుంపులుగట్టి, గట్టిగా నఱచినవి. అని, తాత్పర్యము.

ఆయాంతం స రథం దృష్ట్వా తూర్ణ మింద్రజితం కపిః
వినినాద మహానాదం వ్యవర్ధత చ వేగవాన్. ౨౫

టీక॥ వేగవాన్=అధికమయిన వేగముగల; కపిః=హనుమంతుఁడు; తూర్ణం=శీఘ్రముగా; ఆయాంతం= వచ్చుచున్న; సరథం—రథముతోఁగూడిన; ఇంద్రజితం=ఇంద్రజిత్తును; దృష్ట్వా=చూచి; మహానాదం= అధికమయిన ధ్వనిగల్గునట్లుగా; వినినాద= అఱచెను. వ్యవర్ధత చ=వృద్ధిఁబొందెను.

వేగవంతుండగు నాహనుమంతుండు, రథంబునెక్కి శీఘ్రంబుగా వచ్చుచున్న యింద్రజిత్తుంజూచి, సంతోషంబున, మహాధ్వనిగల్గునట్లు సింహనాదంబుచేసి, మేనుబెంచెను. అని, తాత్పర్యము.

ఇంద్రజిత్తు రథం దివ్య మాస్థిత శ్చిత్రకార్ముకః
ధను ర్విస్ఫారయామాస తటిదూర్జితనిస్స్వనమ్. ౨౬

టీక॥ చిత్రకార్ముకః = నానావర్ణంబగుధనుస్సుగల; ఇంద్రజిత్తు—ఇంద్రజిత్తును; దివ్యం = శ్రేష్ఠమయిన; రథం—రథమును; ఆస్థితః = అధిష్ఠించినవాఁడై; తటిదూర్జితనిస్స్వనం—పిడుగువంటిమహాధ్వనిగల్గునట్లుగా; ధనుః=వింటిని; విస్ఫారయామాస — సారించెను.

ఇంద్రజిత్తును, జిత్రంబగుధనువుఁజేకొని, దివ్యరథంబుపైనుండి, పిడుగునకుంబోలెమహాధ్వనిగల్గునట్లు, సారించెను. అని, తాత్పర్యము.

తత స్సమేతా వతితీక్ష్ణవేగా

మహాబలౌ తౌ రణనిర్విశంకౌ
కపిశ్చ రక్షోధిపతేశ్చ పుత్ర
స్సురాసురేంద్రా వివ బద్ధవైరౌ. ౨౭

టీక॥ తతః=అటుపిమ్మట; అతితీక్ష్ణవేగౌ=మిక్కిలియునధికమయినవేగము గలవారలును;మహాబలౌ= అధికమయినబలముగలవారలును;రణనిర్విశంకౌ= యుద్ధంబునందుభయములేనివారలును; బద్ధవైరౌ=కట్టఁబడిన పగగలవారలునగు;తౌ=ఆ; కపిశ్చ= హనుమంతుండును; రక్షోధిపతేః=రాక్షసులకుఁబ్రభువయినరావణునియొక్క;పుత్రశ్చ=కొడుకగు నింద్రజిత్తును; సురాసురేంద్రావివ = దేవేంద్రుండునుఅసురేంద్రుండునుంబలె;సమేతౌ=కలిసినారు.

అంత,మహావేగులును మహాబలశాలులును, యుద్ధంబునందెంతమాత్రము భయము లేనివారలునగు పరస్పరవైరంబుగలవారలు నాహనుమదింద్రజిత్తులు, ఒండొరులంగలిసిరి.

అని, తాత్పర్యము.

స తస్య వీరస్య మహారథస్య
ధనుష్మత స్సంయతి సమ్మతస్య
శరప్రవేగం వ్యహన త్ప్రవృద్ధ
శ్చచార మార్గే పితు రప్రమేయే. ౨౮

టీక॥సః=ఆహనుమంతుండు; ప్రవృద్ధః=మిక్కిలియు వృద్ధిఁబొందినవాఁడై; మహారథస్య=తన్నును గుఱ్ఱములనుసారథినిం గాపాడుకొనుచుఁ బదునొకండువేలమంది విలుకాండ్రతోఁబోరువాఁడును; ధనుష్మతః=విల్లుగలవాఁడును;సంయతి=యుద్ధమునందు; సమ్మతస్య=గౌరవింపఁబడినవాఁడునగు; తస్య=ఆయింద్రజిత్తుయొక్క; శరప్రవేగం= బాణవేగమును; వ్యహనత్=విఘాతించెను. అప్రమేయే = కొలందిలేని;పితుః= తండ్రియగువాయుదేవునియొక్క; మార్గే=మార్గమునందు; చచార=తిరిగెను.

ఆహనుమంతుండు, మేనుఁబెంచి , యప్రమేయంబగునాకాశంబున విహ

రించుచుఁ,బరాక్రమశాలియునుఁదన్నుసారథిని గుఱ్ఱములనుం గాపాడుకొనుచుఁ బహునొకండు వేలమందివిలుకాండ్రతోఁబోరంజాలినవాఁడును ధనుష్మంతుండునుయుద్ధంబుసేయుటయందు సమర్థుండును గౌరవంబునొందినవాఁడు నగు నాయింద్రజిత్తువేయుబాణంబులఁ దనపైఁబడనీయక, వ్యర్థముగాఁజేసెను. అని, తాత్పర్యము.

తత శ్శరా నాయతతీక్ష్ణశల్యాన్
సుపత్రిణః కాంచనచిత్రపుంఖాన్
ముమోచ వీరః పరవీరహంతా
సుసన్నతాన్ వజ్రనిపాతవేగాన్. ౭౯

టీక॥ తతః=అటుపిమ్మట; పరవీరహంతా= శత్రువీరులచంపువాఁడయిన; వీరః= పరాక్రమశాలియగునింద్రజిత్తు; ఆయతతీక్ష్ణశల్యాన్= నిడుపులయినవియుఁగఱకుగలవియునగునుక్కుమేకులుగలవియును; సుపత్రిణః=సుందరములగుఱెక్కలుగలవియును; కాంచనచిత్రపుంఖాన్ = బంగారముతోఁజేయఁబడిన నానావర్ణములయినక్రిందిచివరలుగలవియును; సుసన్నతాన్= మిక్కిలియువంగినకొనలుగలవియును; వజ్రనిపాతవేగాన్ = వజ్రాయుధముయొక్క వ్రేటువంటివేగము గలవియునగు;శరాన్=బాణంబులను ; ముమోచ=విడిచెను.

అంత,శత్రువీరులంజంపునట్టి,వీరుండగునింద్రజిత్తు, నిడుపులయినవియుఁగఱకుగలవియు నగు నుక్కుమేకులుగలవియును సుందరములగు ఱెక్కలు గట్టినవియును,బంగారముతోఁజేయఁబడిన చిత్రములగు క్రింది చివరలుగలవియును,గొంచెమువంగినయగ్రములుగలవియు, వజ్రాయుధంబునకుం బోలె వేగంబుగలవియునగు, బాణంబులను, హనుమంతునిపై, వేసెను.

అని, తాత్పర్యము.

తతస్తు తత్స్యందననిస్స్వనంచ

మృదంగభేరీపటహస్వనంచ
వికృష్యమాణస్యచ కార్ముకస్య
నిశమ్యఘోషం పున రుత్పపాత. ౩౦

టీక॥ తతస్తు = అటుపిమ్మటను; సః (అధ్యాహృతము) = ఆహనుమంతుండు; తత్స్యందననిస్స్వనంచ = ఆయింద్రజిత్తుయొక్క రథధ్వనిని; మృదంగభేరీపటహస్వనంచ = మద్దెళలయొక్కయు భేరులయొక్కయు తప్పెటలయొక్కయు ధ్వనిని; వికృష్యమాణస్య = ఈడ్వఁబడుచున్న; కార్ముకస్య = ధనుస్సుయొక్క; ఘోషంచ = ధ్వనిని; నిశమ్య = విని; పునః = మరల; ఉత్పాత = ఎగిరెను.

అంత, నాహనుమంతుండు, ఆయింద్రజిత్తురథధ్వనిని, మద్దెళలు భేరులు తప్పెటలు మొదలగువానిధ్వనిని, ఆకర్షింపఁబడుచున్నవింటిశబ్దంబును, విని, మరల, నాకాశంబున కెగిరెను.

అని, తాత్పర్యము.

శరాణా మంతరే ష్వాశు వ్యవర్తత మహాకపిః
హరి స్తస్యా భిలక్ష్య స్య మోఘయన్ లక్ష్యసంగ్రహమ్. ౩౧

టీక॥ మహాకపిః = పెద్దకోఁతియయినః; హరిః = హనుమంతుఁడు; అభిలక్ష్యస్య = గుఱిపెట్టుటయందుబ్రసిద్ధుఁడైన; తస్య = ఆయింద్రజిత్తుయొక్క; లక్ష్యసంగ్రహం = గుఱిపెట్టుటను; మోఘయన్ = వ్యర్థము సేయుచు; ఆశు = శీఘ్రముగా; శరాణాం = బాణములయొక్క; అంతరేషు = మధ్యప్రదేశములందు; వ్యవర్తత = తిరిగెను.

ఆహనుమంతుండు, గుఱిపెట్టికొట్టుటయందుఁబ్రసిద్ధుండైన యాయింద్రజిత్తుపట్టినగుఱివ్యర్థమగునట్లు, శీఘ్రగమనంబున, బాణంబులమధ్యప్రదేశములందు, సంచరించెను.

అని, తాత్పర్యము.

శరాణా మగ్రత స్తస్య పున స్సమభివర్తత
ప్రసార్య హస్తౌ హనుమా నుత్పపాతా నిలాత్మజః. ౩౨

టీక॥ అనిలాత్మజః = వాయుదేవుని కుమారుండగు; హనుమాన్ = హనుమంతుండు; పునః = మరల; తస్య = ఆయింద్రజిత్తుయొక్క; శరాణాం = బాణముల యొక్క, అగ్రతః = ముందట; సమభివర్తత (సమభ్యవర్తత) = ఎదురుగా నుండెను. హస్తౌ = చేతులను; ప్రసార్య = చాంచి; ఉత్పపాత = ఎగిరెను.

వాయుదేవుని కుమారుండగు హనుమంతుండు, ఆయింద్రజిత్తుబాణంబులకు ముందట నెదురుగా నుండి, మరల, చేతులు చాంచి, యాకాశంబునకెగిరెను; ఇట్లు నానావిధప్రకారంబుల విహరించెను. అని, తాత్పర్యము.

తావుభౌ వేగసంపన్నౌ రణకర్మవిశారదౌ
సర్వభూతమనోగ్రాహి చక్రతు ర్యుద్ధ ముత్తమమ్. ౩౩

టీక॥ వేగసంపన్నౌ = వేగముతోఁ గూడినవారలును; రణకర్మవిశారదౌ = యుద్ధకార్యమునందుఁ బండితులు నగు; తౌ = ఆహనుమదింద్రజిత్తులు; ఉభౌ = ఇద్దఱును; సర్వభూతమనోగ్రాహి = సమస్తభూతంబుల మనంబులను గ్రహించునట్టి; ఉత్తమం = శ్రేష్ఠమునగు; యుద్ధం = జగడమును; చక్రతుః = చేసిరి.

వేగవంతులును యుద్ధముసేయుట యందు సమర్థులునునగు నాహనుమదింద్రజిత్తులిర్వురును; సమస్తభూతంబుల మనంబులకును సంతోషంబుగల్గునట్లు, ఉత్తమంబగు యుద్ధంబుఁ జేసిరి.
అని, తాత్పర్యము.

హనూమతో వేద న రాక్షసోంతరం
న మారుతి స్తస్య మహాత్మనోంతరమ్
పరస్పరం నిర్విషహౌ బభూవతు
స్సమేత్య తౌ దేవసమానవిక్రమౌ. ౩౪

టీక॥ రాక్షసః = ఇంద్రజిత్తు; హనూమతః = హనుమంతునియొక్క; అంతరం = ఛిద్రమును; న వేద = ఎఱుంగఁడయ్యె. మారుతిః = వాయుదేవుని కొడు

కైనహనుమంతుండు; మహాత్మనః= అధికమయినపరాక్రమముగల; తస్య=ఆయింద్రజిత్తుయొక్క; అంతరం = ఛిద్రమును; న వేద=ఎఱుంగఁడయ్యె. దేవసమానవిక్రమౌ= దేవతలపరాక్రమముతో సమానమయిన పరాక్రమముగల ; తౌ=ఆహనుమదింద్రజిత్తులు; సమేత్య=కలిసి; పరస్పరం= ఒండొరులను గూర్చి; నిర్విషహౌ=ఓర్వఁగూడనివారలు ; బభూవతుః=అయిరి.

హనుమంతునిఛిద్రం బింద్రజిత్తునకుం దెలియదయ్యె; హనుమంతునకును మహాపరాక్రమశాలియగు నాయింద్రజిత్తునియంతరంబు దెలియలేదు; అట్లు దేవతలకుంబోలె మహాపరాక్రమంబుగల యాయిద్దఱకును, ఒకరినొకరు, జయించుటయసాధ్యముగానుండెనది.

అని, తాత్పర్యము.

తతస్తు లక్ష్యే స విహన్యమానే
శరేష్వమోఘేషు చ సంపతత్సు
జగామ చింతాం మహతీం మహాత్మా
సమాధిసంయోగసమాహితాత్మా. ౩౫

టీక॥ తతస్తు=అటుపిమ్మటను ; అమోఘేషు= వ్యర్థములుకాని ; శరేషు=బాణంబులు; సంపతత్సు చ=పడుచున్నను ; లక్ష్యే=గుఱియయినహనుమంతుడు; విహన్యమానే=విఘాతము నొందుచుండఁగా , గుఱితప్పుచుండఁగాననుట ; సమాధిసంయోగసమాహితాత్మా= గుఱిపట్టుటయందును బాణముసంధించుటయందును ఎచ్చరికగల మనసుగలవాఁడును ; మహాత్మా =అధికమయిన పరాక్రమముగలవాఁడునగు; సః= ఆయింద్రజిత్తు; మహతీం= గొప్పదైన; చింతాం = ఆలోచనను; జగామ=పొందెను.

అంత, నట్లమోఘంబులగు బాణంబులేసినను హనుమంతుపైఁబడక గుఱిదప్పివ్యర్థమగుటంజూచి, గుఱిపట్టుటయందును బాణంబులు సంధించుటయందును నేమఱుపాటులేనట్టి మహాపరాక్రమశాలియగు నాయింద్రజిత్తు, గొప్పచింతనొందెను. అని, తాత్పర్యము.

తతో మతిం రాక్షసరాజసూను

శ్చకార తస్మిన్ హరివీరముఖ్యే
అవధ్యతాం తస్య కపే స్సమీక్ష్య
కథం నిగచ్ఛే దితి నిగ్రహార్థమ్. ౩౮

టీక॥తతః=అటుపిమ్మట ; రాక్షస రాజసూనుః=రాక్షసేశ్వరుండగు రావణునికొడుకైనయింద్రజిత్తు; తస్య=ఆ; కపేః=హనుమంతునియొక్క; అవధ్యతాం=చంపనలవిగాకుండుటను; సమీక్ష్య=చూచి; నిగ్రహార్థం=పట్టుకొనుటకొఱకు; "కథం=ఎట్లు; నిగచ్ఛేత్=పట్టుపడును" ఇతి=అని; తస్మిన్=ఆ; హరివీరముఖ్యే= వానరవీరులలో శ్రేష్ఠుండగుహనుమంతునియందు; మతిం=ఉపాయమును; చకార=చేసెను.

అంత, రాక్షసేశ్వరుండగు రావణునికొడుకయినయాయింద్రజిత్తు, "హనుమంతునివధింపనలవిగాదు" అని, యెఱింగి, పట్టుకొనుటకైనను, "ఇతండేవిధంబునఁబట్టుపడు"నని యాలోచించి, వానరోత్తముండగు నాహనుమంతుండుపట్టుపడునట్లు, ఒకయుపాయంబుపన్నెను.

అని, తాత్పర్యము.

తతః పైతామహం వీర స్సోஉస్త్ర మస్త్రవిదాంవరః
సందధే సుమహాతేజా స్తం హరిప్రవరం ప్రతి. ౩౯

టీక॥తతః=అటుపిమ్మట; వీరః=పరాక్రమశాలియును; అస్త్రవిదాం=అస్త్రంబులనెఱింగినవారలలోపల; వీరః=శ్రేష్ఠుండును; సుమహాతేజాః= మిక్కిలియునధికమయినకాంతిగలవాఁడునగు; సః=ఆయింద్రజిత్తు; హరిప్రవరం=వానరశ్రేష్ఠుండగు; తం= ఆహనుమంతునిగూర్చి; పైతామహం=బ్రహ్మసంబంధియగున; అస్త్రం=అస్త్రమును; సందధే=సంధించెను.

అంత, వీరుండునుఅస్త్రవేత్తలలోనుత్తముఁడును మహాకాంతిశాలియునగునాయింద్రజిత్తు, వానరశ్రేష్ఠుండగు నాహనుమంతునిపైకి, బ్రహ్మాస్త్రంబు సంధించెను. అని, తాత్పర్యము.

అవధ్యోయ మితి జ్ఞాత్వా త మస్త్రేణాస్త్ర తత్త్వవిత్

నిజగ్రాహ మహాబాహు ర్మారుతాత్మజ మింద్రజిత్. ౩౭

టీక॥ అస్త్రతత్త్వవిత్ = అస్త్రంబుల తత్త్వంబు నెఱింగినవాఁడును; మహాబాహుః = పెద్దచేతులుగలవాఁడునగు; ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు; "అయం = ఈ హనుమంతుఁడు; అవధ్యః = చంపఁగూడనివాఁడు." ఇతి = అని; జ్ఞాత్వా = ఎఱింగి; అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచేత; తం = ఆ; మారుతాత్మజం = వాయుదేవుని కొడుకైన హనుమంతుని; నిజగ్రాహ = పట్టుకొనెను.

సమస్తాస్త్రతత్త్వంబుల నెఱింగినవాఁడును మహాబాహుండు నగు, నింద్రజిత్తు, "హనుమంతుని జంప నలవిగా"దని యెఱింగి, బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించి, వాయుపుత్రుండగు హనుమంతుం, బట్టుకొనెను. అని, తాత్పర్యము.

తేన బద్ధ స్తతో ఽస్త్రేణ రాక్షసేన స వానరః
అభవ న్నిర్విచేష్టశ్చ పపాత స మహీతలే. ౩౮

టీక॥ తతః = అటుపిమ్మట; సః = ఆ; వానరః = హనుమంతుండు; రాక్షసేన = రాక్షసునిచేత; తేన = ఆ; అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచేత; బద్ధః = కట్టఁబడినవాఁడై; నిర్విచేష్టశ్చ = చేష్టలులేనివాఁడును; అభవత్ = ఆయెను. మహీతలే = భూమియందు; పపాత చ = పడెను.

అంత, నాహనుమంతుండు, ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రంబునకుఁ గట్టువడి, చేష్టలు దక్కి, నేలం బడెను. అని, తాత్పర్యము.

తతో ఽథ బుద్ధ్వా స తదాస్త్రబంధం
ప్రభోః ప్రభావా ద్విగతాత్మవేగః
పితామహానుగ్రహ మాత్మనశ్చ
విచింతయామాస హరిప్రవీరః. ౪౦

టీక॥ తతః = అంత; అథ = పిమ్మట; తదా = అప్పుడు; సః = ఆ; హరిప్రవీరః =

స ౪౮

వానరవీరుండగుహనుమంతుండు ; అస్త్రబంధం=అస్త్రముచేఁగట్టుటను; బుద్ధ్వా=ఎఱింగి; ప్రభోః= బ్రహ్మదేవునియొక్క; ప్రభావాత్=మాహాత్మ్యమువలన; విగతాత్మవేగః=పోయినదేహవేగముఁగలవాఁడై; ఆత్మనః=తనయొక్క; పితామహానుగ్రహంచ= బ్రహ్మదేవునియనుగ్రహమును; విచింతయామాస=తలంచెను.

అంత, నప్పుడు , హనుమంతుండు, తాన బ్రహ్మాస్త్రంబుచేఁబట్టువడుట నెఱింగి, బ్రహ్మదేవుని ప్రభావంబువలనఁ, జేష్టలు దక్కి, తనకుఁ బూర్వము బ్రహ్మదేవుండొసంగిన వరముం దలంచుకొనెను.

అని, తాత్పర్యము.

తత స్స్వాయంభువై ర్మంత్రై ర్బ్రహ్మాస్త్ర మభిమంత్రితమ్
హనూమాం శ్చింతయామాస వరదానం పితామహాత్. ౪౧

టీక॥ తతః=అటుపిమ్మట; హనూమాన్ = హనుమంతుండు; బ్రహ్మాస్త్రం=బ్రహ్మాస్త్రమును; స్వాయంభువైః= బ్రహ్మయే దేవతగాఁగల; మంత్రైః = మంత్రములచేత; అభిమంత్రితం=అభిమంత్రింపఁబడినదానిఁగా; విజ్ఞాయ(అధ్యాహృతము)=తెలిసికొని; పితామహాత్=బ్రహ్మదేవునివలన; వరదానం= వరంబునిచ్చుటయును; చింతయామాస=తలంచెను.

అంత, హనుమంతుండు, తనపై, నింద్రజిత్తు, స్వాయంభువమంత్రంబుల నభిమంత్రించి బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించినాఁడని, తెలిసికొని, తనకుఁ బూర్వము బ్రహ్మదేవుఁడు వరం బొసంగియుండుటను, తలంచుకొనెను. అని, తాత్పర్యము.

న మే స్త్రబంధస్య చ శక్తి రస్తి
విమోక్షణే లోకగురోః ప్రభావాత్
ఇత్యేవ మత్వా విహితో స్త్రబంధో
మయాత్మయోనే రనువర్తితవ్యః. ౪౨

టీక॥ లోకగురోః= లోకంబులకుఁ దండ్రియయిన బ్రహ్మదేవునియొక్క; ప్ర

భావాత్ = మాహాత్మ్యమువలన; మే = నాకు; అస్త్రబంధస్య = అస్త్రముచేఁ గట్టుటయొక్క; విమోక్షణే = విడిపించుకొనుటయందు; శక్తిశ్చ = సామర్థ్యమును; నాస్తి = లేదు; ఇతి = అని; మత్వైవ = తలంచియే; అస్త్రబంధః = అస్త్రముచేఁ గట్టుట; విహితః = చేయఁబడినది ఆత్మయోనేః = బ్రహ్మదేవునియొక్క; అస్త్రబంధః (అధ్యాహృతము) = అస్త్రముచేఁ గట్టుట; మయా = నాచేత; అనువర్తితవ్యః = అనుసరింపఁబడవలసినది.

లోకగురుండగు బ్రహ్మదేవుని ప్రభావమువలన, బ్రహ్మాస్త్రబంధమునే నేవిడిపించుకొనంజాలనని, తలంచియిట్లు, నన్ను బ్రహ్మాస్త్రముచే బంధించినాఁడు; అయినను, నేను బ్రహ్మదేవునియస్త్రబంధమును, గొంచెమును సరించియుండవలసినదే. అని, హనుమంతుండు, తలంచెను. అని, తాత్పర్యము.

స వీర్యమస్త్రస్య కపి ర్విచార్య
పితామహానుగ్రహ మాత్మనశ్చ
విమోక్షశక్తిం పరిచింతయిత్వా
పితామహాజ్ఞా మనువర్తతే స్మ. ౪౩

టీక॥ సః = ఆ; కపిః = హనుమంతుండు; అస్త్రస్య = బ్రహ్మాస్త్రముయొక్క; వీర్యం = మాహాత్మ్యమును; విచార్య = ఆలోచించి; ఆత్మనః = తనయొక్క; పితామహానుగ్రహం = బ్రహ్మదేవునియనుగ్రహరూపమయిన; విమోక్షశక్తించ = విడిపించుకొనుశక్తిని; పరిచింతయిత్వా (పరిచింత్య) = తలంచి; పితామహాజ్ఞాం = బ్రహ్మదేవునియాజ్ఞను; అనువర్తతే స్మ = అనుసరించెను.

హనుమంతుండట్లు, బ్రహ్మాస్త్రప్రభావమును విచారించి, తనకుఁ బూర్వమే యస్త్రమునైనను సరకుసేయకుండు శక్తిని బ్రహ్మదేవుండనుగ్రహించియుండుటను దలంచుకొని, బ్రహ్మదేవునియాజ్ఞ చొప్పునఁ గొంతసేపు, బద్ధుండయ్యెను. అని, తాత్పర్యము.

అస్త్రేణాపిహి బద్ధస్య భయం మమ న జాయతే
పితామహమహేంద్రాభ్యాం రక్షితస్యానిలేనచ. ౪౪

టీక॥అస్త్రేణ= బ్రహ్మాస్త్రముచే త;బద్ధస్యాపి=కట్టఁబడినవాఁడనైనను; పితామహమహేంద్రాభ్యాం= బ్రహ్మదేవునిచేతను దేవేంద్రునిచేతను;అనిలేనచ=వాయువుచేతను;రక్షితస్య= కాపాడఁబడినవాఁడనగు; మమ=నాకు; భయం=వెఱపు; నజాయతే= కలుగదుగదా!

బ్రహ్మాస్త్రంబునబంధింపఁబడినవాఁడనగునన్ను,బ్రహ్మదేవుండును దేవేంద్రుండును వాయుదేవుండును, రక్షించుచున్నారు,కావున, నాకేమియుభయంబు కలుగదు. అని, తాత్పర్యము.

గ్రహణేచాపి రక్షోభి ర్మహన్మే గుణదర్శనః
రాక్షసేంద్రేణ సంవాద స్తస్మాద్గృహ్ణంతు మాం పరే. ౪౫

టీక॥రక్షోభిః=రాక్షసులచేత; గ్రహణేచాపి= పట్టుకొనుటయందును ; మే=నాకు;మహాన్=గొప్పదగు; గుణదర్శనః=గుణముచూపునట్టి; రాక్షసేంద్రేణ=రాక్షసనాయకుండగు రావణునితో;సంవాదః=మాటలాడుట ; భవిష్యతి(అధ్యాహృతము)= కాఁగలదు తస్మాత్=అందువలన;పరే = శత్రువులు;మాం=నన్ను;గృహ్ణంతు = పట్టుకొందురుగాక.

ఒకవేళరాక్షసులు నన్నుఁబట్టుకొన్నను,నాకు,మహాఫలంబగు రావణునితోటసంవాదంబుగల్గును;కావున , సన్నుశత్రువులుపట్టుకొన్నను బట్టుకొందురుగాక. అని,హనుమంతుండు, తలంచెను. అని, తాత్పర్యము.

స నిశ్చితార్థః పరవీరహంతా
సమీక్ష్యకారీ వినివృత్తచేష్టః
పరైః ప్రసహ్యాభిగతై ర్నిగృహ్య
ననాద తైస్తైః పరిభర్త్స్యమానః. ౪౬

టీక॥పరవీరహంతా=శత్రువీరులచంపువాఁడును;సమీక్ష్యకారీ = విచారించిచేయువాఁడునగు;సః= ఆహనుమంతుండు;నిశ్చితార్థః=నిశ్చయింపఁబడినకార్యముగలవాఁడై; వినివృత్తచేష్టః=నిలిచినచేష్టలుగలవాఁడై ; నిగృ

హ్యా=పట్టుకొని; ప్రసహ్య — బలాత్కారముగా; అభిగతైః= ఎదురుగా వచ్చిన; తైస్తైః=ఆయా; పరైః=శత్రువులచేత; పరిభర్త్స్యమానః=బెదరింపఁబడినవాఁడై; ననాద— అఱచెను.

శత్రువీరులంజంపువాఁడును చక్కఁగా విచారించి కార్యంబులం జేయువాఁడునగు నాహనుమంతుండు, ఈప్రకారము నిశ్చయించి, చేష్టలుదక్కి, రాక్షసులు తన్నుఁబట్టుకొని, భయంబున మెల్ల మెల్లఁగా నెదుటవచ్చి నానావిధంబుల బెదరింపఁగా, సింహనాదంబు చేసెను. అని, తాత్పర్యము.

తత స్తం రాక్షసా దృష్ట్వా నిర్విచేష్ట మరిందమమ్
బబంధు శ్శణవల్కై శ్చ ద్రుమచీరైశ్చ సంహతైః. ౪౭

టీక॥ తతః=అటుపిమ్మట; రాక్షసాః=రాక్షసులు; నిర్విచేష్టం= చేష్టలుదక్కియున్న; అరిందమం=శత్రువులనడంగఁద్రొక్కునట్టి; తం= ఆహనుమంతుని; దృష్ట్వా=చూచి; సంహతైః= పేడఁబడిన; శణవల్కైశ్చ= జనపనారలచేతను; ద్రుమచీరైశ్చ— నారచీరలచేతను; బబంధుః— కట్టిరి.

అంత, రాక్షసులు, శత్రువుల నడంగఁద్రొక్కఁజాలిన హనుమంతుండు, చేష్టలుదక్కియుండుటంచూచి, జనపనారను నారచీరలనుం బేఁడి, యాత్రాళ్లతో బంధించిరి. అని, తాత్పర్యము.

స రోచయామాస పరైశ్చ బంధనం
ప్రసహ్య వీరై రభినిగ్రహంచ
కౌతూహలా న్మాం యది రాక్షసేంద్రో
ద్రష్టుం వ్యవస్యే దితి నిశ్చితార్థః. ౪౮

టీక॥ సః=ఆహనుమంతుండు; "రాక్షసేంద్రః=రాక్షసేశ్వరుండగు రావణుండు; కౌతూహలాత్=కౌతుకమువలన; మాం=నన్ను; ద్రష్టుం=చూచుటకు; వ్యవస్యేద్యది— యత్నించునేమో" ఇతి— అని; నిశ్చితార్థః=నిశ్చయింపఁబడిన

ప్రయోజనముగలవాఁడై; వీరైః = పరాక్రమశాలులగు; పరైః = శత్రుప్రుల చేత; బంధనంచ = గట్టుటను; ప్రసహ్య = బలాత్కారముగా; అభినిగ్రహంచ = పట్టుకొనుటను; రోచయామాస = ఒప్పియుండెను.

ఆహనుమంతుఁడు, "ఒకవేళ రావణుండు కౌతూహలంబున, దన్నుఁజూచునేమో" అని తలంచివీరులగు నారాక్షసులు దన్ను గట్టినను బలాత్కారంబునం బట్టుకొన్నను, దానికంతయు నొప్పియుండెను. అని, తాత్పర్యము.

స బద్ధస్తేన వల్కేన విముక్తో౽స్త్రేణ వీర్యవాన్
అస్త్రబంధ స్సచాన్యంహి నబంధ మనువర్తతే. ౪౯

టీక॥వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగల; సః = ఆహనుమంతుఁడు; తేన = ఆ; వల్కేన = నారతోఁ; బద్ధః = కట్టఁబడినవాఁడై; అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచేత; విముక్తః = విడువఁబడినాఁడు. సః = ఆ; అస్త్రబంధశ్చ = బ్రహ్మాస్త్రబంధమును; అన్యం = ఇతరమయిన; బంధం = కట్టును; నానువర్తతేహి = అనుసరింపదుగదా!

రాక్షసు,లట్లు, పరాక్రమవంతుండగుహనుమంతుని, ఆనారతోఁ గట్టఁగా, నాబ్రహ్మాస్త్రబంధంబతనివిడిచినది; మఱియొకదానితోఁ గట్టినపిమ్మట, బ్రహ్మాస్త్రబంధము నిలువదు. అని, తాత్పర్యము.

అథేంద్రజిత్తు ద్రుమచీరబద్ధం
విచార్య వీరః కపిసత్తమంతమ్
విముక్త మస్త్రేణ జగామ చింతాం
నాన్యేన బద్ధో హ్యనువర్తతే౽స్త్రమ్. ౫౦

టీక॥అథ = అటుపిమ్మట; వీరః = పరాక్రమశాలియగు; ఇంద్రజిత్తు = ఇంద్రజిత్తును; ద్రుమచీరబద్ధం = నారచీరలతోఁ గట్టఁబడిన; తం = ఆ; కపిసత్తమం = వానరశ్రేష్ఠుండగుహనుమంతుని; అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచేత; విముక్తం = విడువఁబడినవానిఁగా; విచార్య = విచారించి, తెలిసికొనియనుటు; "అన్యేన = ఇతరము

చేత; బద్ధః=కట్టఁబడినవాఁడు; అస్త్రం= అస్త్రమును; నానువర్తేహి=అనుసరింపఁడుగదా!" ఇతి (అధ్యాహృతము)=అని; చింతాం = చింతను; జగామ=పొందెను.

అంత, వీరుండగు నింద్రజిత్తు, వానర శ్రేష్ఠుండయిన హనుమంతుండు నారచీరలతోఁ గట్టఁబడఁగానే, బ్రహ్మాస్త్రమువలన విడివడుట నెఱింగి, "మఱియొకదానితోఁ గట్టినపిమ్మట బ్రహ్మాస్త్రబంధమునిలువదుగదా" యని, చింతనొందెను.

అని, తాత్పర్యము.

అహో మహత్కర్మ కృతం నిరర్థకం
న రాక్షసైర్మంత్రగతి ర్విమృష్టా
పునశ్చ నాస్త్రే విహతేఽస్త్రమన్య
త్ప్రవర్తతే సంశయితాస్స్మ సర్వే. ౫౧

టీక॥ అహో=అయ్యో! మహత్=గొప్పదగు; కార్యం=పని; నిరర్థకం=ప్రయోజనములేనిదిగా; కృతం=చేయఁబడినది. రాక్షసైః=రాక్షసులచేత; మంత్రగతిః= బ్రహ్మాస్త్రమంత్రముయొక్క స్వభావము; నవిమృష్టా=ఆలోచింపఁబడదయ్యె. అస్త్రే=బ్రహ్మాస్త్రము; విహతే=కొట్టువడఁగా; పునశ్చ=ఇంకను; అన్యత్=ఇతరమయిన; అస్త్రం=అస్త్రము; నప్రవర్తతే = ప్రవర్తింపదు. సర్వే=అందఱమును; సంశయితాః= సందేహింపఁబడినవారలము; స్మ(స్థః)=అగుచున్నాము.

అయ్యో! గొప్పపనిచేసినను అది వ్యర్థమయినది, మూర్ఖులగు నీరాక్షసులు, బహ్మాస్త్రస్వభావంబును విచారింపక, యీనారతో హనుమంతుం గట్టినారు; మఱియు, బ్రహ్మాస్త్రము ప్రతిహతమయినపిమ్మట, మఱియొకయస్త్రముపాఱదు; ఇంక, మాయందఱియందును, రావణునకు, సంశయము గల్గును. అని, యింద్రజిత్తు, చింతించెను. అని, తాత్పర్యము.

అస్త్రేణ హనుమాన్ ముక్తో నాత్మాన మవబుధ్యత
కృష్యమాణస్తు రక్షోభి స్తైశ్చ బంధై ర్నిపీడితః. ౫౨

 

టీక॥ హనుమాన్ = హనుమంతుడు; అస్త్రేణ=బ్రహ్మాస్త్రముచేత; ముక్తః=విడువఁబడినవాఁడై; తైః=ఆ; రక్షోభిః=రాక్షసులచేత ; కృష్యమాణస్తు=ఈడ్వఁబడుచున్నవాఁడును ; బంధైశ్చ = కట్టులచేతను; నిపీడితః= పీడింపఁబడినవాఁడునైయును ; ఆత్మానం=తన్ను;నావబుధ్యత (నావాబుధ్యత)=తెలిసికొనఁడయ్యె.

హనుమంతుండు,బ్రహ్మాస్త్రంబువలనవిడివడియును,తన్నుఁ రాక్షసులు గట్టిగా బంధించి యీడ్చుకొనిపోవుచున్నను, "తన్నుబ్రహ్మాస్త్రంబు విడిచినదని, తెలిసికొనఁడయ్యె. అని, తాత్పర్యము.

హన్యమాన స్తతః క్రూరై రాక్షసైః కాష్ఠముష్టిభిః
సమీపం రాక్షసేంద్రస్య ప్రాకృష్యత స వానరః. ౫౩

టీక॥తతః=అటుపిమ్మట; సః=ఆ; వానరః=హనుమంతుండు;క్రూరైః=దయలేనట్టి;రాక్షసైః = రాక్షసులచేత; కాష్ఠముష్టిభిః=కట్టెలచేతనుఁబిడికిళ్లచేతను; హన్యమానస్తు=కొట్టఁబడుచున్నవాఁడై; రాక్షసేంద్రస్య=రాక్షసులకుఁ బ్రభుండయిన రావణునియొక్క; సమీపం= సమీపమునుగూర్చి; ప్రాకృష్యత=ఈడ్వఁబడెను.

అంత,నిర్దయులగునారాక్షసులు హనుమంతుని గట్టియలం గొట్టుచును, బిడికిళ్లంబొడుచుచును,రాక్షసేశ్వరుండగు రావణుని, సమీపంబున కీడ్చుకొనిపోయిరి. అని,తాత్పర్యము.

అథేంద్రజి త్తం ప్రసమీక్ష్య ము క్త
మస్త్రేణ బద్ధం ద్రుమచీర సూత్రైః
వ్యదర్శయ త్తత్ర మహాబలం తం
హరి ప్రవీరం సగణాయ రాజ్ఞే. ౫౪

టీక॥అథ=అటుపిమ్మట; తత్ర=అచ్చట;ఇంద్రజిత్=ఇంద్రజిత్తును;అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచేత;ముక్తం=విడువఁబడినవాఁడును;ద్రుమచీరసూత్రైః=నారచీరలత్రాళ్లచేత;బద్ధం= కట్టఁబడినవాఁడునగు;తం=ఆహనుమంతుని; ప్ర

 

సమీక్ష్య=చూచి; మహాబలం=అధికము యినబలముగల; తం=ఆ; హరిప్రవీరం= హనుమంతునిని; సగణాయ= సమూహముతోఁగూడిన; రాజ్ఞే= రావణునికొఱకు; వ్యదర్శయత్=చూపెను.

అంత, నా రాజసభయందు, యింద్రజిత్తు, బ్రహ్మాస్త్రంబువలనవిడివడినా నచీరలత్రాళ్ల చేబంధింపఁబడిన, మహాబలుండగు నాహనుమంతుంజూచి, "యితండె, యీవానరుం"డని, సభికులతోఁ గూడిన రావణునకుం, జూపెను.

అని, తాత్పర్యము.

తం మత్త మివ మాతంగం బద్ధం కపి వరోత్తమమ్
రాక్షసా రాక్షసేంద్రాయ రావణాయ న్యవేదయన్. ౫౫

టీక॥ రాక్షసాః = రాక్షసులు; మత్తం = మదించిన; మాతంగమివ(స్థితం)=ఏనుంగుంబోలెనున్నట్టి; బద్ధం=కట్టఁబడిన; తం=ఆ; కపివరోత్తమం=వానరశ్రేష్ఠులలో నుత్తముండగుహనుమంతుని; రాక్షసేంద్రాయ=రాక్షసులకుఁ బ్రభుండగు రావణునికొఱకు; న్యవేదయన్=తెల్పిరి.

రాక్షసులు, మదించిన యేనుంగుం బోలియున్నబద్ధుండగు నాహనుమంతుం దీసికొనిపోయి, రాక్షసేశ్వరుండగు రావణునకుంజూపిరి. అని, తాత్పర్యము.

కోయం కస్య కుతో వాత్ర కిం కార్యం కో వ్యపాశ్రయః
ఇతి రాక్షసవీరాణాం తత్ర సంజజ్ఞిరే కథాః. ౫౬

టీక॥ అయం=ఇతండు; కః=ఎవ్వఁడు; కస్య(పురుషః)= ఎవ్వనిమనిషి? అత్ర=ఇచ్చటికి; కుతోవా=ఎందువలన; ఆగతః (అధ్యాహృతము)=వచ్చినాఁడు? కిం=ఏమి; కార్యం=పని? కః=ఎవ్వఁడు; వ్యపాశ్రయః=ఆశ్రయము? ఇతి= అని; తత్ర=అచ్చట; రాక్షసవీరాణాం= రాక్షసవీరులకు; కథాః=మాటలు; సంజజ్ఞిరే=కలిగినది.

ఈవానరుండెవ్వఁడు? ఎవ్వనిమనిషి? ఇచ్చటికేలవచ్చినాఁడు? ఇచ్చటనితనికేమిపని? ఎవ్వనియొద్దకువచ్చినాఁడు? అని, యిట్లాసభయందు; రాక్షసులుపరస్పరముచెప్పుకొనిరి. అని; తాత్పర్యము.

హన్యతాం దహ్యతాం వాపి భక్ష్యతా మితి చాపరే
రాక్షసా స్తత్ర సంక్రుద్ధాః పరస్పర మథాబ్రువన్. ౫౭

టీక॥అథ— అటుపిమ్మట ; హన్యతాం=చంపఁబడుఁగాక.దహ్యతాంవాపి=దహింపఁబడును గాక. భక్ష్యతాం=తినఁబడుఁగాక. ఇతిచ=అనియు; అపరే=ఇతరులగు ; రాక్షసాః—రాక్షసులు;తత్ర—అచ్చట;సంక్రుద్ధాః= కోపమునొందినవారలై ; పరస్పరం— ఒండొరులనుగూర్చి;అబ్రువన్=చెప్పిరి.

అంత,నచ్చట, మఱికొందఱు రాక్షసులు, "ఈవానరుంజంపుఁడు,దహించివేయుఁడు, భక్షింపుదము" అని, పరస్పరము,చెప్పుకొనిరి.

అని,తాత్పర్యము.

అతీత్య మార్గం సహసా మహాత్మా
స తత్ర రక్షోధిపపాదమూలే
దదర్శ రాజ్ఞః పరిచారవృద్ధాన్
గృహం మహారత్నవిభూషితం చ. ౫౮

టీక ॥ మహాత్మా=అధికమగునపరాక్రమముగల; సః= ఆహనుమంతుఁడు;సహసా=శీఘ్రముగా;మార్గం=దారిని; అతీత్య=కడచి; తత్ర—అచ్చట; రక్షోధిపపాదమూలే=రాక్షసులకుఁబ్రభుండగు రావణునియొక్క— పాదంబులసమీపమునందు; రాజ్ఞః=రావణునియొక్క— ; పరిచారవృద్ధాన్=మంత్రవృద్ధులను;మహారత్నవిభూషితం=గొప్పమణులచేనలంకరింపఁబడిన;గృహం చ—ఇంటినిని;దదర్శ=చూచెను.

అంత, మహాపరాక్రమశాలియగు హనుమంతుండు, శీఘ్రంబుగమార్గంబునతిక్రమించి,రావణునిపాదమూలంబుననున్న, మంత్రివృద్ధులను,దివ్యాభరణములనలంకృతంబై యున్నసభాగృహంబునుం,జూచెను. అని, తాత్పర్యము.

స దదర్శ మహాతేజా రావణః కపిసత్తమమ్

రక్షోభి ర్వికృతాకారైః కృష్యమాణ మిత స్తతః. ౫౯

టీక॥ మహాతేజాః= అధికమయిన పరాక్రమముగల; సః = ఆ; రావణః=రావణుఁడు; వికృతాకారైః= వికారముతోఁగూడినరూపములుగల; రక్షోభిః=రాక్షసులచేత;ఇత స్తతః= ఇటునటు;కృష్యమాణం= ఈడ్వఁబడుచున్న;కపిసత్తమం = వానరశ్రేష్ఠుండగు హనుమంతుని;దదర్శ=చూచెను.

మహాపరాక్రమశాలియగునారావణుండు,వికృతరూపులగురాక్షసులచేత నీతట్టుకాతట్టుకు నీడ్వఁబడుచున్నవానరోత్తముని,హనుమంతుం,జూచెను. అని, తాత్పర్యము.

రాక్షసాధిపతిం చాపి దదర్శ కపిసత్తమః
తేజోబలసమాయుక్తం తపంత మివ భాస్కరమ్. ౬౦

టీక॥కపిసత్తమశ్చాపి=వానరోత్తముఁడగుహనుమంతుండును; తేజోబలసమాయుక్తం=కాంతితోనుబలముతోనుంగూడినవాఁడును;తపంతం= ఎండగాయుచున్న; భాస్కరమివ(స్థితం)= సూర్యుఁడువలెనున్నవాఁడునగు;రాక్షసాధిపతిం= రాక్షసులకుఁబ్రభుండగు రావణుని;దదర్శ=చూచెను.

వానరోత్తముఁడగుహనుమంతుండును కాంతిమంతుండును బలవంతుండును, మధ్యాహ్నమునందలి సూర్యునిభంగి వెలుంగుచున్నవాఁడునగురావణుం, జూచెను.అని, తాత్పర్యము.

స రోషసంవర్తితతామ్రదృష్టి
ర్దశాననస్తం కపి మన్వవేక్ష్య
అథోపవిష్టాన్ కులశీలవృద్ధాన్
సమాదిశత్తంప్రతి మంత్రిముఖ్యాన్. ౬౧

టీక॥అథ=అటుపిమ్మట; సః=ఆ; దశాననః=రావణుండు; రోషసంవర్తి

తతా ప్రమదృష్టిః=కోపముచేతఁద్రిప్పఁబడినవియు నెఱ్ఱనివియు నగు కండ్లుగలవాఁడై; తం=ఆ; కపిం=హనుమంతుని; అన్వవేక్ష్య=చూచి; తం ప్రతి=ఆహనుమంతునిఁగూర్చి; ఉపవిష్టాన్ = కూర్చున్నవారలును; కులశీలవృద్ధాన్ = కులముచేతను సదాచారముచేతను వృద్ధులునగు; మంత్రిముఖ్యాన్ = మంత్రిశ్రేష్ఠులను; సమాదిశత్ = ఆజ్ఞాపించెను.

అంత, నారావణుండు, కోపంబుచే నేత్రంబుల నెఱ్ఱందనంబుగదుర, గ్రుడ్లుత్రిప్పుచు, నాహనుమంతుంబూచి, యతనిసమాచారం బడుగుటకై, యచ్చటఁగూర్చుండియున్న కులశీల వృద్ధులగుమంత్రిశ్రేష్ఠులకాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

యథాక్రమం తై స్స కపి ర్విపృష్టః
కార్యార్థ మర్థస్యచ మూల మాదౌ
నివేదయామాస హరీశ్వరస్య
దూత స్సకాశా దహ మాగతోస్మి. ౬౨

టీక॥ సః=ఆ; కపిః = హనుమంతుఁడు; తైః = ఆమంత్రులచేత; యథాక్రమం=వరుసదప్పక; ఆదౌ= మొదట; కార్యార్థం= చేయఁదగినప్రయోజనమును; అర్థస్య = ప్రయోజనముయొక్క; మూలంచ = నిమిత్తమగువాని; విపృష్టః=అడుగఁబడినవాఁడై; "అహం= నేను;" హరీశ్వరస్య = వానరనాయకుండగుసుగ్రీవునియొక్క; సకాశాత్ = సమీపముననుండి ; దూతః=రాయబారినై; ఆగతః=వచ్చినవాఁడను; అస్మి= అగుచున్నాను." ఇతి (అధ్యాహృతము) = అని; నివేదయామాస= తెలిపెను.

అంత, నామంత్రులు, "నీవేలయిచ్చటికివచ్చినావు? ఎవ్వరు నిన్నుఁబంపినారు" అనిక్రమంబున నడుగఁగా, హనుమంతుండు, "నేనువానరేశ్వరుండగుసుగ్రీవునిదూతను; అతఁడుపంపఁగావచ్చినాను" అని, వారలకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

సుందరకాండే, అష్టచత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, సుందరకాండాష్టచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

౪౯

ఏకోనపంచాశసర్గప్రారంభః.

తత స్స కర్మణా తస్య విస్మితో భీమవిక్రమః
హనుమా న్రోషతామ్రాక్షో రక్షోధిప మవైక్షత. ౧

టీక॥తతః=అటుపిమ్మట; భీమవిక్రమః= భయంకరమయిన పరాక్రమముగల; సః=ఆ; హనుమాన్= హనుమంతుఁడు; తస్య=ఆరావణునియొక్క; కర్మణా=కార్యముచేత; విస్మితః=ఆశ్చర్యమునొందినవాఁడై; రోషతామ్రాక్షః= కోపముచే నెఱ్ఱనైన కండ్లుగలవాఁడై; రక్షోధిపం=రాక్షసులకుఁ బ్రభుండగు రావణుని; అవైక్షత=చూచెను.

అంత, భయంకరపరాక్రముండగు హనుమంతుండు, "రావణుండు, తాను, సింహాసనంబున నేయుండి, నన్నుఁగట్టించియిచ్చుటకిఁ జెప్పించినాఁడు గదా" యనియతనికార్యమునకాశ్చర్యమునొంది, కోపంబున నేత్రంబులం జెఱ్ఱఁదనంబు గదుర, రావణుంజూచెను-

అని, తాత్పర్యము.

భ్రాజమానం మహార్హేణ కాంచనేన విరాజతా
ముక్తాజాలావృతేనాథ మకుటేన మహాద్యుతిమ్. ౨
వజ్రసంయోగసంయుక్తై ర్మహార్హమణివిగ్రహైః

స ౪౯

హేమైరాభరణైశ్చిత్రైర్మనసేవ ప్రకల్పితైః. ౩
మహార్హక్షౌమసంవీతం రక్తచందనరూషితమ్
స్వనులిప్తం విచిత్రాభిర్వివిధాభిశ్చ భక్తిభిః. ౪
వివృతైర్దర్శనీయైశ్చ రక్తాక్షైర్భీమదర్శనైః
దీప్తతీక్ష్ణమహాదంష్ట్రైః ప్రలంబదశనచ్ఛదైః. ౫
శిరోభిర్దశభిర్వీరం భ్రాజమానం మహౌజసమ్
నానావ్యాళసమాకీర్ణైః శ్శిఖరైరివ మందరమ్. ౬
నీలాంజనచయప్రఖ్యం హారేణోరసి రాజతా
పూర్ణచంద్రాభవక్త్రేణ సబలాకమివాంబుదమ్. ౭
బాహుభిర్బద్ధకేయూరైశ్చందనోత్తమరూషితైః
భ్రాజమానాంగదైః పీనైః పంచశీర్షైరివోరగైః. ౮
మహతి స్ఫాటికే చిత్రే రత్నసంయోగసంస్కృతే
ఉత్తమాస్తరణాస్తీర్ణే సూపవిష్టం వరాసనే. ౯
అలంకృతాభిరత్యర్థం ప్రమదాభిస్సమంతతః
వాలవ్యజనహస్తాభిరారాత్సముపసేవితమ్. ౧౦
దుర్ధరేణ ప్రహస్తేన మహాపార్శ్వేన రక్షసా
మంత్రిభిర్మంత్రతత్త్వజ్ఞైర్నికుంభేనచ మంత్రిణా. ౧౧
సుఖోపవిష్టం రక్షోభిశ్చతుర్భిర్బలదర్పితైః
కృత్స్నైః పరివృతో లోకశ్చతుర్భిరివ సాగరైః. ౧౨
మంత్రిభిర్మంత్రతత్త్వజ్ఞైరన్యైశ్చ శుభబుద్ధిభిః
అన్వాస్యమానం రక్షోభిస్సురైరివ సురేశ్వరమ్. ౧౩
అపశ్యద్రాక్షసపతిం హనుమానతితేజసమ్
విష్ఠితం మేరుశిఖరే సతోయమివ తోయదమ్. ౧౪

టీక॥అథ= అటుపిమ్మట ; హనుమాన్=హనుమంతుడు; మహార్హ

ణ=ఉత్తమంబును; విరాజతా= ప్రకాశించుచున్నదియు;కాంచనేన= బం

గారముతోఁ జేయఁబడినదియును; ము
క్తాజాలావృతేన= ముత్తెములయొక్క
సమూహముచేఁ గప్పఁబడినవియు న
గు;మకుటేన=కిరీటముచేత;భ్రాజమా
నం=ప్రకాశించుచున్నవాఁడును;మహా
ద్యుతిం=అధికమయిన కాంతిగలవాఁడు
ను;వజ్రసంయోగసంయుక్తైః=వజ్రము
తోఁగూడుటతోఁగూడినవియును; మ
హార్హమణివిగ్రహైః=శ్రేష్ఠములయినమ
ణులుగల రూపములుగలవియును; హై
మైః=బంగారముతోఁజేయఁబడినవియు
ను;చిత్రైః= నానావర్ణములయినవి
యు;మనసా=మనసుచేతప్రకల్పితైరివ
(స్థితైః)= నిర్మింపఁబడినట్లున్నవియును
గు;ఆభరణైః=సొమ్ములతో;సహితం(అ
ధ్యాహృతము)=కూడినవాఁడును; మ
హార్హక్షౌమసంవీతం= శ్రేష్ఠమయిన
పట్టువస్త్రముచేఁగప్పఁబడినవాఁడును;
రక్తచందనభూషితం = ఎఱ్ఱనిగంధము
చేఁబూయఁబడినవాఁడును ; విచిత్రా
భిః=నానావర్ణములును ; వివిధాభి
శ్చ=నానావిధంబులునగు;భక్తిభిః= క
స్తూర్యాదులను జేర్చుట మొదలగు విశేష
ములతో;స్వనులిప్తం=చక్కఁగాఁబూ
యఁబడినవాఁడును; వివృతైః= తెఱవఁ
బడినవియును;దర్శనీయైశ్చ= సుందర
ములును; రక్తాక్షైః=ఎఱ్ఱనికండ్లుగలవి
యును; భీమదర్శనైః=భయంకరముగు
చూచుటగలవియును;దీప్తతీక్ష్ణమహాదం
ష్ట్రైః=ప్రకాశించునవియుఁ గఱకు
గలవియునగు పెద్దకోఱలుగలవియును;
ప్రలంబదశనచ్ఛదైః=వ్రేలుచుండు పెద
వులుగలవియునగు ; దశభిః= పదియ
యిన;శిరోభిః=తలలచేత ; భ్రాజమా
నం=ప్రకాశించుచున్నవాఁడును; కాన
నైః నానావ్యాళసమాకీర్ణైః= నా
నావిధములయిన దుష్ట జంతువులచేత
వ్యాపింపఁబడిన; శిఖరైః=శృంగముల
చేత; భ్రాజమానం ( అధ్యాహృత
ము)=ప్రకాశించుచున్న ; మందరమివ
(స్థితం)=మందరపర్వతమువలె నున్న
వాఁడును; వీరం=పరాక్రమశాలియు
ను;మహౌజసం=అధికమయిన కాంతి
గలవాఁడును; నీలాంజనచయప్రఖ్యం=
నల్లనికాటుకలసమూహముతో సమా
నుఁడును; ఉరసి=ఱొమ్మునందు; రా
జతా=ప్రకాశించుచున్న; పూర్ణచం
ద్రాభవక్త్రేణ = నిండుచంద్రునికాం
తివంటికాంతిగలపతకముగల ; హారే
ణ=హారముచేత;సబలాకం= కొక్కె
రలతోఁగూడిన;అంబుదమివ (స్థితం)=
మేఘమువలె నున్నవాఁడును ; బద్ధకే
యూరైః=కట్టఁబడిన బాహుపురులుగ
లవియును;చందనోత్తమరూషితైః=

చందనంబులలోనుత్తమమగువానిచేతఁ బూయఁబడినవియును; భ్రాజమానాంగదైః=ప్రకాశించుచున్న మణియొక్క విధమయినబాహుపురులు గలవియును; పీనైః=బలిసినవియును; పంచశీర్షైః=అయిదుతలలుగల; ఉరగైరివ(స్థితైః)=సర్పములుంబోలెనున్నవియునగు; బాహుభిః=చేతులతోఁ; సహితం (అధ్యాహృతము)=కూడినవాఁడును; మహతి=పెద్దదియును; స్ఫాటికే= స్ఫటికమణితోఁ జేయఁబడినదియును; చిత్రే=నానావర్ణమనునదియును; రత్నసంయోగసంస్కృతే= మణులతోఁ గూర్చుటచేసంస్కరింపఁబడినదియును; ఉత్తమాస్తరణాస్తీర్ణే=శ్రేష్ఠంబగుకంబళముతోఁ బఱుపఁబడినదియునగు; వరాసనే=ఉత్తమమగునాసనమునందు; సూపవిష్టం= చక్కఁగాఁగూర్చున్నవాఁడును; అత్యర్థం=మిక్కిలియు; అలంకృతాభిః=అలంకరింపఁబడినవారలును; వ్యాలవ్యజనహస్తాభిః= చామరములు చేతులందుఁగలవారలునగు; ప్రమదాభిః=స్త్రీలచేత; సమంతతః=అంతటను; ఆరాత్ = సమీపమునందు; సముపసేవితం=సేవింపఁబడినవాఁడును; దుర్ధరేణ=దుర్ధరుండనువానితోను; ప్రహస్తేన=ప్రహస్తునితోను; రక్షసా = రాక్షసుండగు; మహాపార్శ్వేన= మహాపార్శ్వుఁడనువానితోను; మంత్రిణా= మంత్రియగు; నికుంభేనచ=నికుంభునితోను; మంత్రతత్త్వజ్ఞైః=ఆలోచనలతత్త్వములనెఱింగినవారలును; మంత్రిభిః=మంత్రులును; బలదర్పితైః= బలముచేగర్వించినవారలునగు; చతుర్భిః=నలుగురైన; రక్షోభిః(సహ) = రాక్షసులతోఁ గూడ; సుఖోపవిష్టం= సుఖముగాఁగూర్చున్నవాఁడును; కావుననే; చతుర్భిః=నాలుగయిన; సాగరైః=సముద్రముల చేత; పరివృతః = చుట్టఁబడిన; కృత్స్నః= సమస్తమయిన; లోకఇవ(స్థితః) = లోకమువలెనున్నవాఁడును; అన్యైః = ఇతరులయిన; మంత్రతత్త్వజ్ఞైః= ఆలోచనలతత్త్వముగానెఱింగిన; శుభదర్శనైః= మంగళకరంబగుదృష్టిగల, మంగళకరంబగునాలోచనగలయునుటు; మంత్రిభిః=మంత్రులగు; రక్షోభిః=రాక్షసులచేత; అన్వాస్యమానం= సేవింపఁబడుచున్నవాఁడును; సురైః=దేవతలచే; అన్వాస్యమానం (అధ్యాహృతము)=సేవింపఁబడుచున్న; సురేశ్వరమివ(స్థితం)= దేవేంద్రుండువలెనున్నవాఁడును; అతితేజసం= అధికమయిన కాంతిగలవాఁడును; మేరుశిఖరే= మేరుపర్వతముయొక్క శిఖరమునందు ; స్థి

తం=ఉన్న; సతోయం=జలముతోఁగూడిన; తోయదమివ (స్థితం)=మేఘమువలెనున్నవాఁడగు; రాక్షసపతిం=రాక్షసులకుఁబ్రభుండగు రావణుని; అపశ్యత్=చూచెను.

అంత, హనుమంతుండు, దివ్యంబును గాంచనమయంబును ముత్తెములతోనలంకరింపఁ బడినదియునగు కిరీటముతో నొప్పుచున్నవాఁడును, మహాకాంతిగలవాఁడును, వజ్రంబులు మొదలగు నానావిధమణులుపొదిగి బంగారముతోఁజేసిన నానావర్ణంబులగు నాభరణంబులతోఁగూడిన వాఁడును, ఉత్తమంబగుపట్టువస్త్రముగట్టుకొన్న వాఁడును, కస్తూరి మొదలగునవిగలిపినరక్తచందనముధరించియున్నవాఁడును, గొంచెము దెఱవఁబడిన నోళ్లుగలవియుసుందరంబులునుజూపరులకుభయంబుగలిగించునవియును బెద్దకడుపు కోఱలుగలవియు బ్రేలుచాడు పెదవులుగలవియునగుపదితలలుగలవాఁడగుటచే, నానావృక్షసంపన్నంబులగుశిఖరంబులతోఁగూడిన మందరపర్వతంబుకై వడి భాసిల్లుచున్నవాఁడును, నల్లకాటుకవలె నల్లనివాఁడును, బొమ్మున సిందుచందురునింబోలుపతకముతోఁగూడిన ముక్తాహారముగలవాఁడు కావునఁ, గొక్కెరలతోఁగూడినయాకాశంబుపగిదిఁ జూపట్టుచున్నవాఁడును, బాహుపురులుధరించినవియుఁ జందనాలంకృతంబులును బీనంబులునుఅయిదుతలల సర్పంబులుంబోలెనున్నవియునగుబాహువులు గలవాఁడును రత్నంబులుచెక్కి మంచికళలము పఱచి, సుందరముగా నుండుస్ఫాటికపీఠంబునఁ, జక్కఁగానలంకరించుకొనిచామరంబులు చేతులందాల్చియున్నయుత్తమస్త్రీలచేవీవంబడుచు, నాలుగుప్రక్కలను, దుర్ధరుండును బ్రహస్తుండునుమహాపార్శ్వుండునుని కుంభుండునను నాలుగుమంత్రివర్యులు, చతుస్సముద్రంబులు లోకముంబోలెఁ; బరివేష్టించియుండ, వారలతోసుఖసల్లాపంబులు సేయుచు, సితరులగుపెక్కండ్రగుమంత్రులచే దేవతలచే దేవేంద్రుండుంబోలె సేవింపఁ బడుచు, మేరుపర్వతశిఖరంబుననున్ననూతనమేఘంబుకై వడి నీలదేహంబునఁగాంచన సింహాసనగతుండై యొప్పుచున్న వాఁడునగు రాక్షసేశ్వరుని, రావణునిం జూచెను.

అని, తాత్పర్యము.

స తైస్సంపీడ్యమానోపి రక్షోభి ర్భీమవిక్రమైః
విస్మయం పరమం గత్వా రక్షోధిప మవైక్షత. ౧౫

టీక॥సః = ఆహనుమంతుండు; భీమవిక్రమైః = భయంకరమగుపరాక్రమముగల; తైః = ఆ, రక్షోభిః = రాక్షసులచేత; సంపీడ్యమానోపి = చక్కఁగా బాధింపఁబడుచున్నవాఁడైనను; పరమం = అధికమయిన; విస్మయం = ఆశ్చర్యమును; గత్వా = పొంది; రక్షోధిపం = రాక్షసేశ్వరుండగు రావణుని; అవైక్షత = చూచెను.

ఆహనుమంతుండు, భయంకరంబగు పరాక్రమంబుగలయారాక్షసులు తన్ను బాధించుచున్నను, దానిసరకుసేయక, రావణునియద్భుతాకారంబునకుఁ, బరమాశ్చర్యంబునొంది, మఱల, రాక్షసనాయకుండగు రావణుంజూచెను. అని, తాత్పర్యము.

భ్రాజమానం తతో దృష్ట్వా హనుమా న్రాక్షసేశ్వరమ్
మనసా చింతయామాస తేజసా తస్య మోహితః. ౧౬

టీక॥హనుమాన్ = హనుమంతుఁడు; భ్రాజమానం = ప్రకాశించుచున్న; రాక్షసేశ్వరం = రాక్షసులకుఁబ్రభుఁడైన రావణుని; దృష్ట్వా = చూచి; తతః = అంత; తస్య = ఆరావణునిచేత; తేజసా = కాంతిచేత; మోహితః = మోహమునొందినవాఁడై; మనసా = మనసుచేత; చింతయామాస = ఆలోచించెను.

హనుమంతుండట్లు దేదీప్యమానుండైయున్న రావణుఁ జూచి, యతనికాంతివలన మోహంబునొంది తేఱిచూడంజాలక, యిట్లని, తలఁచెను. అని, తాత్పర్యము.

అహో రూప మహో ధైర్య మహో సత్త్వ మహో ద్యుతిః
అహో రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా. ౧౭

టీ॥ రాక్షసరాజస్య = రాక్షసులకుఁ బ్రభుండగు రావణునియొక్క; రూపం = ఆకారము! అహో = ఆశ్చర్యకరము! ధైర్యం = ధీమసము; అహో = ఆశ్చర్యకరము! సత్త్వం = బలము; అహో = ఆశ్చర్యకరము! ద్యుతిః = కాంతి; అహో =

ఆశ్చర్యకరము! సర్వలక్షణయుక్తతా=సమస్తలక్షణంబులతోఁ గూడియుండుట; అహో=ఆశ్చర్యకరము!

రాక్షసరాజుండగు రావణుని, యాకారము! ధైర్యము! బలము! కాంతి! సమస్తశుభలక్షణంబులును! అన్నియు, నాశ్చర్యకరములు గానున్నవి!

అని, తాత్పర్యము.

యద్య ధర్మో న బలవా న్స్యా దయం రాక్షసేశ్వరః
స్యా దయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా. ౧౮

టీక॥ అయం=ఈ; అధర్మః=అధర్మము; బలవాన్=అధికమయినది; న స్యాత్ యది=కాదేని; అయం=ఈ; రాక్షసేశ్వరః=రాక్షసులకుఁ బ్రభుండగు రావణుండు; సశక్రస్య=ఇంద్రునితోఁ గూడిన; సురలోకస్యాపి=దేవలోకంబునకైనను; రక్షితా=రక్షించువాఁడు; స్యాత్=అగును.

ఇతండు, ఇంతయధికమయినయధర్మమును జేయకుండు నేని, రాక్షసరాజుండగునీరావణుండు, ఇంద్రునకును దేవలోకంబునకునుంగూడఁ, బ్రభువగును.

అని, తాత్పర్యము.

అస్య క్రూరై ర్నృశంసై శ్చ కర్మభి ర్లోకకుత్సితైః
తేన బిభ్యతి ఖల్వ స్మా ల్లోకా స్సామర దానవాః. ౧౯

టీక॥ అస్య=ఈరావణునియొక్క; క్రూరైః=భయంకరంబులును; నృశంసైః=ఇతరులకుద్రోహము సేయునవియును; లోకకుత్సితైః=జనులచేనిందింపఁబడినవియునగు; కర్మభిః=కార్యములచేత; తేన=ఆకారణముచేత; అస్మాత్=ఈరావణునివలన; సామరదానవాః=దేవతలతోను దానవులతోనుంగూడిన; లోకాః=లోకములు; బిభ్యతి ఖలు=భయపడుచున్నవిగదా!

ఈరావణుండు, భయంకరంబులును, క్రూరంబులును, జనకంటకంబులునగు, కర్మంబుల ననేకంబులంజేసియున్నాఁడు; అందుచేతనే, యితనిం జూచి, దేవతలును దానవులును మున్నగు సమస్తలోకంబులవారును, భయంబునొందెదరు. అని, తాత్పర్యము.

అయం హ్యుత్సహతే క్రుద్ధః కర్తు మేకార్ణవం జగత్

టీక॥ అయం=ఇతండు; క్రుద్ధః = కోపించినవాఁడై; జగత్=ప్రపంచమును; ఏకార్ణవం = ఒక్కటెసముద్రమునుగాఁ;కర్తుం=చేయుటకు;ఉత్సహతేహి= ఉత్సాహంబుగలవాఁడగునుగదా!

ఇతండు, కోపంబునొందునేని, ప్రపంచమునంతయు , నేకసముద్రంబుగాఁజేయంజూచును. అని, హనుమంతుండు, చింతించెను.

అని, తాత్పర్యము.

ఇతి చింతాం బహువిధా మకరో న్మతిమాన్ హరిః. ౨౧
దృష్ట్వా రాక్షసరాజస్య ప్రభావ మమితౌజసః

టీక॥ మతిమాన్ = బుద్ధిమంతుండగు; హరిః=హనుమంతుండు; అమితౌజసః=కొలఁదిలేనికాంతిగల ; రాక్షసరాజస్య=రాక్షసులకుఁబ్రభువైనరావణునియొక్క; ప్రభావం=మాహాత్మ్యమును; దృష్ట్వా=చూచి; ఇతి = ఇట్లు; బహువిధం=పెక్కువిధంబులుగల; చింతాం=చింతను; అకరోత్=చేసెను.

బుద్ధిమంతుండగు హనుమంతుండు మహాకాంతిశాలియగు రావణునిప్రభావంబుఁజూచి, యిట్లు, నానావిధంబులుగాఁ, దలపోసెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ఏకోనపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండైకోనపంచాశసర్గటీక, ముగిసినది.



(౫౦)

పంచాశసర్గప్రారంభః.

తముద్వీక్ష్య మహాబాహుః పింగాక్షం పురత స్థ్సితమ్
కోపేన మహతాఽఽవిష్టో రావణో లోకరావణః. ౧
శంకాహృతాత్మా దధ్యౌ స కపీంద్రం తేజసా వృతమ్

టీక॥ మహాబాహుః = పెద్దచేతులు గలవాఁడును; లోకరావణః = లోకంబుల నేడ్పించువాఁడునగు; సః = ఆ; రావణః = రావణుఁడు; మహతా = అధికమయిన; కోపేన = కోపముచేత; ఆవిష్టః = వ్యాపింపఁబడినవాఁడై; పురతః = ముందట; స్థితం = ఉన్నవాఁడును; పింగాక్షం = గోరోచనవువన్నెగలకండ్లుగలవాఁడును, తేజసా = కాంతిచే; ఆవృతం = కప్పబడినవాడును, కపీంద్రం = వానరశ్రేష్ఠుండునగు; తం = ఆహనుమంతుని; ఉద్వీక్ష్య = చూచి; శంకాహృతాత్మా = భయముచే నపహరింపఁబడిన మనసుగలవాఁడై; దధ్యౌ = తలంచెను.

మహాబాహుండును, సమస్తలోకంబుల నేడ్పించువాఁడునగు నా రావణుండు, మహాకోపంబునఁ, దనముందటనున్నవాఁడును, గోరోచనవువన్నెగల కండ్లతో నొప్పుచున్నవాఁడును దేజోవంతుండునగువాని వానరోత్తము హనూమంతుంజూచి, యంత, మనంబున, భయంబునొంది, యిట్లని, చింతించెను.

అని, తాత్పర్యము.

కిమేష భగవా న్నందీ భవే త్సాక్షా దిహాగతః. ౨
యేన శప్తోఽస్మి కైలాసే మయా సంచాలితే పురా

టీ॥ పురా = మున్ను; కైలాసే = కైలాసపర్వతము; మయా = నాచేత; సంచాలితే = కదలింపఁబడఁగా; యేన = ఎవ్వనిచేత; శప్తః = శపింపబడినవాఁడను; అస్మి = అగుచున్నానో; ఏషః = ఇట్టి; భగవాన్ = మాహాత్మ్యముగల; నందీ = నందికేశ్వరుఁడు; సాక్షాత్ = తానే; ఇహ = ఇచ్చటికి; ఆగతః కిం = వచ్చినాఁడాయేమి?

మున్ను నేనుగైలాసపర్వతమును గదలించినప్పుడునాకు శాపంబునొసంగిన

యట్టి భగవంతుండగు సాక్షాన్నందికేశ్వరుండే, యిప్పటికి, ఈవానర రూపంబున, వచ్చినాఁడా యేమి? అని, తాత్పర్యము.

సోఽయం వానరమూర్తిస్స్యాత్కింస్విద్బాణో మహాసురః. ౩

టీక॥ సః=అట్టి; అయం=ఈవానరుఁడు; వానరమూర్తిః=వానరుని యొక్క - యాకారమువంటి యాకారముగల; బాణః=బాణుఁడను; మహాసురః=కింస్విత్=గొప్పయసురుఁడా యేమి?

లేక, మహాసురుండగు బాణుండే, యిట్లు వానరాకారంబుఁ దాల్చి వచ్చినాఁడా యేమి? అని, రావణుఁడు, చింతించెను. అని, తాత్పర్యము.

స రాజా రోషతామ్రాక్షః ప్రహస్తం మంత్రిసత్తమమ్
కాలయుక్తమువాచేదం వచో విపులమర్థవత్. ౪

టీక॥ సః=ఆ; రాజా=రాక్షసరాజుండగు రావణుండు; రోషతామ్రాక్షః=కోపముచే నెఱ్ఱనైన కన్నులుగలవాఁడై; మంత్రిసత్తమం=మంత్రిశ్రేష్ఠుండగు; ప్రహస్తం=ప్రహస్తునిఁగూర్చి; కాలయుక్తం=కాలంబునకుఁ దగినదియును; విపులం=విశాలమును; అర్థవత్=అధికమయినయర్థముగలదియునగు; ఇయం=ఈ; వచః=మాటను; ఉవాచ=చెప్పెను.

రాక్షసరాజుండగు రావణుండంతఁ, గోపంబునొంది, నేత్రంబుల నెఱ్ఱఁదనంబుగదుర, మంత్రిశ్రేష్ఠుండగు, ప్రహస్తుంజూచి, యాకాలంబునకుఁ దగినట్లు అధికమయినయర్థముగల గంభీరంబగు మాటంజెప్పెను. అని, తాత్పర్యము.

దురాత్మా పృచ్ఛ్యతామేష కుతః కింవాస్య కారణమ్
వనభంగే చ కోఽస్యార్థో రాక్షసీనాం చ తర్జనే. ౫

టీక॥ "కుతః=ఎచ్చటనుండి; ఆగతః (అధ్యాహృతము)=వచ్చినాఁడు? అస్య=ఈవచ్చుటకు; కింవా=ఏమి; కారణం=కారణము? వనభంగే=అశోకవన

మువిఱుచుటయందును; రాక్షసీనాం= రాక్షసస్త్రీలయొక్క; తర్జనేచ=బెదరించుటయందును, అస్య=ఇతనికి; కః=ఏమి;అర్థః=ప్రయోజనము?" ఇతి(అధ్యాహృతము)=అని; ఏషః=ఈ; దురాత్మా=దుష్టబుద్ధిగలవాఁడు ; పృచ్ఛ్యతాం=అడుగఁబడుఁగాక.

నీవెచ్చటనుండివచ్చినావు? ఇచ్చటికేలవచ్చినావు?అశోకవనంబునేల విఱిచినావు;రాక్షసస్త్రీలనేందుకు బెదరించినావు?" అని,నీవీదురాత్ముని నడుగుము.అని, తాత్పర్యము.

మత్పురీ మప్రధృష్యాం వా గమనే కిం ప్రయోజనమ్
ఆయోధనే వా కిం కార్యం పృచ్ఛ్యతా మేష దుర్మతిః. ౬

టీక॥"అప్రధృష్యాం=ఎదిరింపఁగూడని;మత్పురీం=నాపట్టణమునుగూర్చి; ఆగమనేవా = వచ్చుటయందుఁగాని; కిం=ఏమి;ప్రయోజనం = ప్రయోజనము?ఆయోధనే = యుద్ధముసేయుటయందుఁగాని;కిం=ఏమి;కార్యం= ప్రయోజనము?" ఇతి(అధ్యాహృతము)= అని;దుర్మతిః = దుష్టబుద్ధిగల;ఏషః= ఈవానరుఁడు;పృచ్ఛ్యతాం= అడుగఁబడుఁగాక.

"నీవెట్టివారికినిఁజొరరాని, నాపట్టణంబునకేలవచ్చితివి; యుద్ధంబేలచేసితివి?" అని, నీవు, దురాత్ముండగు, వీనినడుగుము. అని,రావణుండు, ప్రహస్తునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

రావణస్య వచశ్శ్రుత్వా ప్రహస్తో వాక్య మబ్రవీత్

టీక॥ప్రహస్తః= ప్రహస్తుఁడు;రావణస్య=రావణునియొక్క ; వచః= మాటను; శ్రుత్వా=విని;వాక్యం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

ప్రహస్తుండు, రావణుండుచెప్పినమాటనువిని,హనుమంతుంజూచి,యిట్లని,చెప్పెను.అని, తాత్పర్యము.

సమాశ్వసిహి భద్రం తే న భీః కార్యా త్వయా కపే. ౭

టీక॥ కపే= హనుమంతుఁడా! సమాశ్వసిహి= ఊఱడిల్లుము. తే = నీ

ను; భద్రం=మంగళము ; భవతు (అధ్యాహృతము) = అగుఁగాక, త్వయా= నీచేత; భీః = భయము; నకార్యా=చేయఁదగినదికాదు.

హనుమంతుఁడా! ఊఱటనొందుము; నీకుమంగళంబగుగాక ; భయపడవలదు. అని, తాత్పర్యము.



యది తావత్త్వ మింద్రేణ ప్రేషితో రావణాలయమ్
తత్త్వ మాఖ్యాహి మాభూత్తే భయం వానర మోక్ష్యసే.౮
యదివైశ్రవణస్య త్వం యమస్య వరుణస్యచ
చారరూప మిదం కృత్వా ప్రవిష్టో నః పురీ మిమామ్. ౯
విష్ణునా ప్రేషితోవాపి దూతో విజయకాంక్షిణా

టీక॥ వానర=వానరుఁడా!త్వం = నీవు; ఇంద్రేణ=ఇంద్రునిచేత;రావణాలయం = రావణునిస్థానమునుగూర్చి; ప్రేషితోయదితావత్ = పంపఁబడినవాఁడవవుదువేనియు ; త్వం=నీవు; వైశ్రవణస్య=కుబేరునకుఁగాని ; యమస్య=యమునకుఁగాని; వరుణస్యవా= వరుణునకుఁగాని;ఇదం=ఈ; చారరూపం=చారత్వమును ; కృత్వా=చేసి; నః=మాయొక్క ; ఇమాం=ఈ; పు




రీం=లంకాపట్టణమును ; ప్రవిష్టోయది=ప్రవేశించినవాఁడవగుదువేని యు, విజయకాంక్షిణా = జయమునుగోరునట్టి; విష్ణునా= విష్ణుదేవునిచేత; ప్రేషితః=పంపఁబడిన; దూతోపి= దూతవైనను; తే=నీకు; భయం=వెఱపు; మాభూత్=కలుగకుండుఁగాక. తత్త్వం=యథార్థస్థితిని; ఆఖ్యాహి = చెప్పుము. మోక్ష్యసే= విడువఁబడఁగలవు.

ఇచ్చటికి, నిన్ను దేవేంద్రుండు, పంపినాఁడా? కుబేరుండుగాని యముఁడుగానివరుణుఁడుగాని, పంపఁగా, జారుఁడవై, యిచ్చటికివచ్చినావా? లేక, విష్ణుదేవుండేమైనా రావణునిజయింపఁగోరి, నిన్నిచ్చటికిదూతగాఁ బంపినాఁడా? ఎవ్వరుపంపినను, నిన్నేమియుఁ జేయుటలేదు; భయంబునొందకుము; యథార్థస్థితింజెప్పుము ; నిన్నువిడిచిపుచ్చెదము, అని, తాత్పర్యము.

నహి తే వానరం తేజో రూపమాత్రంతు వానరమ్. ౧౦

టీక॥ తే=నీకు; వానరం = వానరసంబంధియయిన; తేజః= ప్రభావము; నహి = లేదుగదా! రూపమాత్రంతు=దేహముమాత్రమె; వానరం=వానరసంబంధియయినది.

నీదేహముమాత్రము, వానరదేహము, గాని, ప్రభావంబు దలంచినచోనద్భుతంబుగానున్నది. అని, తాత్పర్యము.

తత్త్వతః కథయస్వాఽద్య తతో వానర మోక్ష్యసే

టీక॥ వానర=వానరుఁడా! అద్య=ఇప్పుడు; తత్త్వతః = యథార్థముగా; కథయస్వ=చెప్పుము. తతః= అటుపిమ్మట; మోక్ష్యసే=విడువఁబడెదవు.

నీవు, నీవృత్తాంతమును యథార్థముగాఁజెప్పుము; అపిమ్మట, నిన్ను, విడిచిపుచ్చెదము.

అని, తాత్పర్యము.

అనృతం వదతశ్చాపి దుర్లభం తవ జీవితమ్. ౧౧

టీక॥ అనృతం = అబద్ధమును; వదతః = చెప్పునట్టి; తవ=నీకు; జీవితంచాపి=ప్రాణమును; దుర్లభం = పొందఁగూడనిది.

నీవబద్ధముజెప్పుదువేని, నీవుప్రాణంబుతోనుండఁజాలవు. అని, తాత్పర్యము.




అథవా యన్నిమిత్తం తే ప్రవేశో రావణాలయే

టీక॥ అథవా = అటుగాదేని; రావణాలయే = రావణునిపురియందు; తే=నీయొక్క; ప్రవేశః = ప్రవేశించుట; యన్నిమిత్తం = ఎందుకొఱకో; తత్ (అధ్యాహృతము)= దానిని; కథయస్వ (అధ్యాహృతము)=చెప్పుము.

అట్లు, ఎవ్వరిచేతనుం బంపఁబడక, నీవైయె, వచ్చినవాఁడ వగుదువేని, నీవిచ్చటికేల వచ్చితివో, దానినైనం జెప్పుము. అని, తాత్పర్యము.

ఏవ ముక్తో హరిశ్రేష్ఠ స్తదా రక్షోగణేశ్వరమ్. ౧౨
అబ్రవీ న్నాస్మి శక్రస్య యమస్య వరుణస్య వా

టీక॥ హరిశ్రేష్ఠః=వానరోత్తముండగుహనుమంతుఁడు; ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; తదా= అప్పుడు; రక్షోగణేశ్వరం = రాక్షససమూహంబులకుఁ బ్రభువైన రావణునింగూర్చి; అబ్రవీత్= చెప్పెను. శక్రస్య= ఇంద్రునియొక్కగాని; యమస్య= యమునియొక్కగాని; వరుణస్య=వరుణునియొక్కగాని; చారః (అధ్యాహృతము)=వేగువాఁడను; నాస్మి= కాను.

వానరోత్తముండగు హనుమంతుఁడు, ప్రహస్తుండు చెప్పినమాటను విని, రాక్షసేశ్వరుండగు రావణుంజూచి, యిట్లని, చెప్పెను. నేను, దేవేంద్రునకుఁగాని యమునకుఁగాని వరుణునకుఁగాని, చారుండనై వచ్చినవాఁడనుగాను. అని, తాత్పర్యము.

ధనదేన న మే సఖ్యం విష్ణునా నాస్మి చోదితః. ౧౩

టీక॥ మే=నాకు; ధనదేన= కుబేరునితో; సఖ్యం=చెలిమి; న = లేదు. అహం (అధ్యాహృతము)=నేను; విష్ణునా=విష్ణుదేవునిచేత; చోదితః = పంపఁబడినవాఁడను; నాస్మి=కాను.

నాకుఁ గుబేరునితో నెంతమాత్రము స్నేహములేదు; నన్ను విష్ణుదేవుఁడిచ్చటికిఁ బంపలేదు. అని, తాత్పర్యము.

జాతిరేవ మమ త్వేషా వానరోఽహ మిహాగతః

టీక॥ఏషాతు=ఈవానరత్వముమా త్రిము; మమ = నాయొక్క; జాతిరేవ=జాతియే. ఇహ = ఇచ్చటికి; ఆగతః=వచ్చిన; అహం=నేను; వానరః=వానరుండను.

నేనుజాతిచేతనేవానరుండనుగాని, వానరరూపంబు నొందివచ్చినవాఁడను గాను. అని, తాత్పర్యము.

దర్శనే రాక్షసేంద్రస్య దుర్లభే తదిదం మయా, ౧౪
వనం రాక్షసరాజస్య దర్శనార్థే వినాశితమ్

టీక॥రాక్షసేంద్రస్య=రాక్షసులకుఁ బ్రభుండవగు; తే(అధ్యాహృతము)-నీయొక్క; దర్శనే = చూచుట; దుర్లభే= పొందఁగూడనిదికాఁగా; రాక్షసరాజస్య= రాక్షసులకుఁ బ్రభువైన నీయొక్క ;దర్శనార్థే= చూచుటయను ప్రయోజనము నిమిత్తమయి ; మయా=నాచేత; తత్=ఆ; ఇదం=ఈ; వనం=అశోకవనము; వినాశితం = నశింపఁజేయఁబడినది.

రాక్షసనాయకుఁడవగునీదర్శనంబు నాకుదుర్లభంబగుటంజూచి, నీదర్శనంబుఁగోరి, నీయశోకవనంబువిఱిచితిని. అని, తాత్పర్యము.

తత స్తే రాక్షసాః ప్రాప్తా బలినో యుద్ధకాంక్షిణః. ౧౫

టీక॥తతః=అటుపిమ్మట;బలినః=బలవంతులగు; తే=ఆ;రాక్షసాః= రాక్షసులు;యుద్ధకాంక్షిణః=యుద్ధమునుగోరువారలై; ప్రాప్తాః=వచ్చినారు.

అంత,బలవంతులగునారాక్షసులు, నాతోయుద్ధంబుసేయఁగోరి,నాపైకివచ్చిరి.అని, తాత్పర్యము.

రక్షణార్థంతు దేహస్య ప్రతియుద్ధా మయా రణే

టీక॥దేహస్య= దేహముయొక్క; రక్షణార్థంతు= కాపాడుకొనుటకొఱకే; తే(అధ్యాహృతము)= వారలు;రణే=యుద్ధమునందు;మయా=నాచేత; ప్రతియుద్ధాః=బదులుకొట్టఁబడిరి.

నాదేహసంరక్షణార్థమయ్యే, యుద్ధంబున, నేనువారలనుమఱలంగొట్టితిని. అని, తాత్పర్యము.

అస్త్రపాశైర్న శక్యోఽహం బద్ధుం దేవాసురైరపి. ౧౬

టీక॥ అహం = నేను; దేవాసురైరపి = దేవతలచేతను అసురులచేతనుంగూడ; అస్త్రపాశైః = అస్త్రముల చేతను త్రాళ్ల చేతను; బద్ధుం = కట్టుపడుటకు; న శక్యః = అలవిగాను.

నేను దేవాసురులకును ఏయస్త్రంబునకును ఏపాశంబునకును, నన్ను బంధింప, నలవిగాదు. అని, తాత్పర్యము.

పితామహాదేవ వరో మమాప్యేషోఽభ్యుపాగతః

టీక॥ మమ = నాకొఱకు; ఏషః = ఈ; వరోఽపి = వరమును; పితామహాదేవ = బ్రహ్మదేవుని వలననే; అభ్యుపాగతః = పొందఁబడినది.

నాకును, ఈ వరంబును, బ్రహ్మదేవుండే, యిచ్చినాఁడు. అని, తాత్పర్యము.

రాజానం ద్రష్టుకామేన మయాస్త్రమనువర్తితమ్. ౧౭

టీక॥ రాజానం = రాక్షసరాజుండవగు నిన్ను; ద్రష్టుకామేన = చూడఁగోరునట్టి; మయా = నాచేత; అస్త్రం = బ్రహ్మాస్త్రము; అనువర్తితం = అనుసరింపఁబడినది.

రాక్షసరాజుఁడవగు నిన్నుఁజూడవలయునను నాసచే, నేనీ బ్రహ్మాస్త్రంబునకు బద్ధుండనై తినిగాని, వేఱు గాదు. అని, తాత్పర్యము.

విముక్తోఽప్యహమస్త్రేణ రాక్షసైస్త్వభిపీడితః

టీక॥ అహం = నేను; రాక్షసైః = రాక్షసుల చేత; అభిపీడితస్తు = పీడింపఁబడినవాఁడనైనను అయినను; అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచేత; విముక్తోఽపి = విడువఁబడినానుగదా!

నన్ను, ఈ రాక్షసులు బంధించినంతనె, బ్రహ్మాస్త్రంబు విడిచినది. అని, తాత్పర్యము.

కేనచిద్రాజకార్యేణ సంప్రాప్తోఽస్మి తవాంతికమ్. ౧౮

స ౫౦




టీక॥అహం(అధ్యాహృతము)=నేను; కేనచిత్ =ఒకానొక ; రాజకార్యేణ=రాచకార్యముచేత;తవ = నీయొక్క;అంతికం=సమీపమును ; సంప్రాప్తః=పొందినవాఁడను; అస్మి = అగుచున్నాను.

నాకొక రాజకార్యమున్నది;అందుకై, నేనునీయొద్దకువచ్చినాను.

అని, తాత్పర్యము.

దూతోఽహమితి విజ్ఞేయో రాఘవస్యామి తౌజసః

టీక॥అహం=నేను;అమితౌజసః = కొలందిలేనిపరాక్రమంబుగల; రాఘవస్య=రామునియొక్క;దూతః = దూతను.ఇతి=అని;విజ్ఞేయః =ఎఱుంగఁదగినవాఁడను.

నేను కొలందిలేనిపరాక్రమంబుగల రామునియొద్దనుండివచ్చిన, దూతనని , యెఱుంగుఁడు. అని, తాత్పర్యము.

శ్రూయతాం చాపి వచనం మమ పథ్యమిదం ప్రభో. ౧౯

టీక॥ ప్రభో= రాక్షసప్రభుండవగురావణుఁడా!పథ్యం=మేలుగలిగించునట్టి; మమ=నాయొక్క ; వచనంచాపి=మాటయును; శ్రూయతాం = వినఁబడుఁగాక.

రాక్షసప్రభుండవగురావణుఁడా! నేనునీకుమేలుగలిగించుమాటంజెప్పెదను; దానివినుము. అని, రావణునితోహనుమంతుండుచెప్పెను.అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

సుందరకాండే, పంచాశస్సర్గః.

ఇది,స్పష్టార్థము,

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండపంచాశసర్గటీక,

ముగిసినది.




శ్రీః

ఏకపంచాశసర్గప్రారంభః.

తం సమీక్ష్య మహాసత్త్వం సత్త్వవాన్ హరిసత్తమః
వాక్య మర్థవ దవ్యగ్ర స్త ముదాచ దశాననమ్. ౧

టీక॥సత్త్వవాన్=అధికమయినబలముగలవాఁడును; హరిసత్తమః=వానరోత్తముండునగుహనుమంతుండు;మహాసత్త్వం= అధికమయినబలముగల; తం=ఆరావణుని;సమీక్ష్య=చూచి; అవ్యగ్రః=ఏమఱుపాటులేనివాఁడై;తం=ఆ;దశాననం=పదిముఖములుగల రావణునింగూర్చి;అర్థవత్ = అధికమయినయర్థముగల;వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

బలవంతుండును, వానరశ్రేష్ఠుండునగుహనుమంతుండు,మహాబలశాలియగునారావణుంజూచి , యధికమయినయర్థముగలయీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

అహం సుగ్రీవసందేశా దిహ ప్రాప్త స్తవా లయమ్

టీక॥అహం=నేను;సుగ్రీవసందేశాత్ =సుగ్రీవునిసమాచారమువలన ; ఇహ=ఇచ్చటికి;తవ=నీయొక్క ; ఆలయం=స్థానమునుగూర్చి ;ప్రాప్తః=వచ్చినాను.

సుగ్రీవుండు,నీకుఁజెప్పుమని, కొన్నిసమాచారములంజెప్పినన్నుఁ బంపుటంజేసి, నేనునీయొద్దకువచ్చినాను.

అని, తాత్పర్యము.

రాక్షసేంద్ర హరీశ స్త్వాం భ్రాతా కుశల మబ్రవీత్. ౨

టీక॥రాక్షసేంద్ర=రాక్షసులకుఁబ్రభుండవగురావణుఁడా;భ్రాతా= తోఁబుట్టువగు, తోఁబుట్టువుతోసమానుఁడగుననుట;హరీశః= వానరులకుఁబ్రభుండగు;సుగ్రీవః=సుగ్రీవుఁడు; త్వాం =నిన్నుఁగూర్చి;కుశలం= క్షేమమును;అబ్రవీత్ =చెప్పెను.

రాక్షసులకుఁ బ్రభుండవగు రావ





డా! నీకుఁదోఁబుట్టువువంటి వాఁడు నువానరాధీశ్వరుండునగు సుగ్రీవుండు, తనక్షేమమును, నీకుఁ జెప్పుమనెను.

అని, తాత్పర్యము.

భ్రాతు శ్శృణు సమాదేశం సుగ్రీవస్య మహాత్మనః
ధర్మార్థోపహితం వాక్య మిహచా ముత్ర చ క్షమమ్. ౩

టీక॥ మహాత్మనః = పూజ్యమయిన స్వభావముగలవాఁడును; భ్రాతుః = తోఁబుట్టువంటి వాఁడునగు ; సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క; సమాదేశం = నాతోఁజెప్పిపంపఁబడినదియు; ధర్మార్థోపహితం=ధర్మముతోను అర్థముతోనుంగూడినదియు; ఇహచ = ఈ లోకంబునందును; అముత్రచ=పరలోకమునందును; క్షమం= సమర్థంబునగు; వాక్యం = మాటను ; శృణు=వినుము.

మహాత్ముండును నీకుఁ దోఁబుట్టువు వంటివాఁడునగు సుగ్రీవుండు చెప్పిన ధర్మార్థసహితంబును ఇహపరలోకంబులరెంటియందును మేలు గలిగించునదియునగు, మాటం జెప్పెదను; వినుము.

అని, తాత్పర్యము.

రాజా దశరథో నామ రథకుంజరవాజిమాన్
పితేవ బంధు లోకస్య సురేశ్వర సమద్యుతిః. ౪

టీక॥ రథకుంజరవాజిమాన్ = రథంబులును ఏనుంగులునుగుఱ్ఱములునుగలవాఁడును; లోకస్య=లోకమునకు; పితేవ=తండ్రియుంబోలె ; బంధుః = బంధువైనవాఁడును; సురేశ్వరసమద్యుతిః = దేవేంద్రునియొక్క కాంతివంటికాంతిగలవాఁడునగు ; దశరథోనామ=దశరథుఁడనెడు; రాజా= రాజు; ఆసీత్ (అధ్యాహృతము)=ఆయెను.

అధికంబుగా రథంబులు నేనుంగులును గుఱ్ఱంబులునుగలవాఁడును , జనులకుఁ దండ్రివంటివాఁడును దేవేంద్రుండుంబోలెఁ గాంతిమంతుండునగు , దశరథుండనునొక్కమహారాజుండెను.

అని, తాత్పర్యము.

జ్యేష్ఠ స్తస్య మహాబాహుః పుత్రః ప్రియకరః ప్రభుః
పితు ర్నిదేశా న్నిష్క్రాంతః ప్రవిష్టో దండకావనమ్. ౫



లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయాచాపి భార్యయా
రామోనామ మహాతేజా ధర్మ్యం పంథాన మాశ్రితః. ౭

టీ॥ తస్య=ఆదశరథమహారాజునకు; జ్యేష్ఠః=పెద్దవాఁడగు; పుత్రః=కొడుకును; మహాబాహుః= పెద్దచేతులుగలవాఁడును; ప్రియకరః= సంతోషంబు సేయువాఁడును; ప్రభుః= సమర్థుండును; మహాతేజాః=అధికమయినకాంతిగలవాఁడునగు; రామోనామ = రాముఁడను వాఁడు; పితుః = తండ్రియొక్క; నిదేశాత్ =అజ్ఞవలన; భ్రాత్రా= తమ్ముఁడైన; లక్ష్మణేన=లక్ష్మణునితోను; భార్యయా = భార్యయగు; సీతయాచాపి సహ=సీతతోనుంగూడ; ధర్మ్యం = ధర్మముతోఁగూడిన; పంథానం = మార్గమును; ఆశ్రితః = పొందినవాఁడై; ప్రవ్రాజితః = వెడలినవాఁడై ; దండకావనం=దండకారణ్యమును ; ప్రవిష్టః=ప్రవేశించినవాఁడు.

ఆదశరథమహారాజు జ్యేష్ఠపుత్రుండును, అతనికిఁప్రియుండును, మహాబాహుండును సమర్థుండును, మహాతేజుండునగు రాముండనువాఁడు, తండ్రియాజ్ఞవలన, ధర్మంబవలంబించి, తమ్ముండగు లక్ష్మణుని, భార్యనుంగూడి , దండకారణ్యంబు నొందెను,

అని, తాత్పర్యము.

తస్య భార్యా వనే నష్టా సీతా పతి మనువ్రతా
వైదేహస్య సుతా రాజ్ఞో జనకస్య మహాత్మనః. ౮

టీక॥ మహాత్మనః = పూజ్యమయిన స్వభావఁబుగలవాఁడును ; వైదేహస్య=విదేహదేశమునకు రాజునగు; జనకస్య=జనకుండను; రాజ్ఞః= రాజుయొక్క; సుతా = కొమార్తెయును; పతిం=పెనిమిటిని; అనువ్రతా=అనుసరించినదియునగు; తస్య = ఆరామునియొక్క; భార్యా=పెండ్లామగు; సీతా= సీత; వనే=అడవియందు; నష్టా= అగపడకపోయినది.

మహాత్ముండును ,విదేహదేశరాజుండునగు జనకమహారాజు కూఁతురును, పతివ్రతయునగు నా రాముని భార్య, సీతయనునది, వనంబున నగపడక పోయినది.

అని, తాత్పర్యము.

స మార్గమాణ స్తాం దేవీం రాజపుత్ర స్సహానుజః
ఋశ్యమూక మనుప్రాప్త స్సుగ్రీవేణ సమాగతః. ౮

టీక॥ సః=ఆ; రాజపుత్రః= రాచకొమరుండగు రాముండు; సహానుజః= తమ్మునితోఁగూడినవాఁడై; తాం=ఆ; దేవీం=భార్యను ; మార్గమాణః=వెదకుచు; ఋశ్యమూకం=ఋశ్యమూకమనుపర్వతమును; అనుప్రాప్తః=పొందినవాఁడై; సుగ్రీవేణ = సుగ్రీవునితో; సమాగతః=చేరినాఁడు.

రాచకొమరుండగు రాముండు, తమ్మునితోఁగూడ, సీతాదేవిని, వెదకుచు ఋశ్యమూకంబునకువచ్చి , సుగ్రీవునితోఁజేరెను. అని, తాత్పర్యము.

తస్య తేన ప్రతిజ్ఞాతం సీతాయాః పరిమార్గణమ్
సుగ్రీవస్యాపి రామేణ హరిరాజ్యం నివేదితమ్. ౯

టీక॥ తేన = ఆసుగ్రీవునిచేత; తస్య=ఆరామునకు; సీతాయాః = సీతయొక్క; పరిమార్గణం=వెదకుట; ప్రతిజ్ఞాతం=అంగీకరింపఁబడినది. సుగ్రీవస్యాపి=సుగ్రీవునకును; రామేణ = రామునిచేత; హరిరాజ్యం= వానరరాజ్యమును; నివేదితం=ఇవ్వఁబడినది.

సుగ్రీవుండు, రామునకు , సీతను వెదకించెదనని ప్రతిజ్ఞయొసంగెను; రాముండందుకుబదులుగా, సుగ్రీవునివానరరాజ్యంబునకు రాజుచేసెదనప్రతిజ్ఞ చేసెను. అని, తాత్పర్యము.

తత స్తేన మృధే హత్వా రాజపుత్రేణ వాలినమ్
సుగ్రీవ స్థాపితో రాజ్యే హర్యృక్షాణాం గణేశ్వరః.౧౦

టీక॥తతః=అటుపిమ్మట; తేన=ఆ; రాజపుత్రేణ=రాచకొమరుండగు రామునిచేత; మృధే=యుద్ధమునందు; వాలినం=వాలిని; హత్వా=చంపి ; సుగ్రీవః=సుగ్రీవుఁడు ; హర్యృక్షాణాం= వానరులయొక్కయు , భల్లూకంబులయొక్కయు; గణేశ్వరః= సమూహంబులకుఁబ్రభుండుగా; రాజ్యే=దొరతనమునందు; స్థాపితః= ఉంచఁబడినాఁడు.

అంత, రాచకొమరుండగు రాముండు

యుద్ధంబున, వాలింజంపి, సుగ్రీవుని, వానరభల్లూకసమూహంబుల కధిరాజునుగాఁ, జేసెను. అని, తాత్పర్యము.

త్వయా విజ్ఞాతపూర్వ శ్చ వాలీ వానరపుంగవః
రామేణ నిహత స్సంఖ్యే శరేణై కేన వానరః. ౧౧

టీక॥ వానరపుంగవః = వానరశ్రేష్ఠుండగు; వాలీ = వాలి; త్వయాచ = నీచేతనుంగూడ; విజ్ఞాతపూర్వః = ముందు తెలియఁబడినవాఁడు - వానరః = వాలి; సంఖ్యే = యుద్ధమునందు; రామేణ = రామునిచేత; ఏకేన = ఒకటైన; శరేణ = బాణముచేత నే; నిహతః = చంపఁబడినాఁడు-

వానరోత్తముండగువాలిని, నీవు నెఱుంగుదువుగదా! అట్టివాలిని, రాముండు, యుద్ధంబునందు, నొక్కబాణంబునం, జంపెను- అని, తాత్పర్యము-

స సీతామార్గణే వ్యగ్ర స్సుగ్రీవ స్సత్యసంగరః
హరీన్ సంప్రేషయామాస దిశ స్సర్వా హరీశ్వరః. ౧౨

టీక॥ సత్యసంగరః = సత్యమయినప్రతిజ్ఞ గలవాఁడును; హరీశ్వరః = వానరనాయకుండునగు; సః = ఆ; సుగ్రీవః = సుగ్రీవుఁడు; సీతామార్గణే = సీతయొక్క వెదకుటయందు; వ్యగ్రః = మిక్కిలియు నాసక్తుండై; సర్వాః = సమస్తములయిన; దిశః = దిక్కులంగూర్చి; హరీన్ = వానరులను; సంప్రేషయామాస = పంపెను-

ప్రతిజ్ఞ దప్పనివాఁడును వానరాధీశ్వరుండునగు నా సుగ్రీవుండు, సీతను వెదకుటయందె, యత్యాసక్తుండై, సమస్త దిక్కులకును, వానరులం బంపెను- అని, తాత్పర్యము-

తాం హరీణాం సహస్రాణి శతాని నియుతానిచ
దిక్షు సర్వాసు మార్గంతే హ్యధశ్చోపరి చాంబరే. ౧౩

టీ॥ హరీణాం = వానరులయొక్క; సహస్రాణి = వేలు; శతాని = నూఱులు; నియుతానిచ = లక్షలను, సర్వాసు = సమస్తములయిన; దిక్షు = దిక్కు-

లందును; అధశ్చ = పాతాళలోకమునందును ; ఉపరిచ = భూమియందును; అంబరే = ఆకాశమునందును; తాం = ఆ సీతను; మార్గంతేహి = వెదకుచున్నారుగదా!

వానరులు, లక్షలుగాను, వేయిలక్షలుగాను, గుంపులుగూడి, సమస్తదిక్కులందును, పాతాళమునందును, భూమియందును, ఆకాశమునందును, ఆసీతను, వెదకుచున్నారు.

అని, తాత్పర్యము.

వైనతేయసమాః కేచి త్కేచి త్తత్రానిలోపమాః
అసంగగతయ శ్శీఘ్రా హరివీరా మహాబలాః. ౧౪

టీక॥ తత్ర = అచ్చట ; అసంగగతయః = నేలదాఁకకుండునట్టుగమనముగలవారలును; శీఘ్రాః = శీఘ్రగమనముగలవారలును; మహాబలాః = అధికమయినబలముగలవారలునగు ; హరివీరః = వానరవీరులును; కేచిత్ = కొందఱు ; వైనతేయసమాః = గరుత్మంతునితోసమానులు; కేచిత్ = కొందఱు; అనిలోపమాః = వాయువుతోఁబోలికగలవారలు.

అందు, నేలనే తాఁకకుండనతిశీఘ్రంబుగాసంచరించువారలుమహాబలశాలులునగువానరవీరులుకొందఱు, గరుత్మంతునివంటి వేగముగలవారలు ; మఱికొందఱువాయువేగంబుగలవారలు.

అని, తాత్పర్యము.

అహం తు హనుమాన్నామ మారుత స్యౌరస స్సుతః

టీక॥ అహంతు = నేనును ; మారుతస్య = వాయుదేవునియొక్క; ఔరసః = వీర్యమునకుఁబుట్టిన; సుతాః = కుమారుండను. హనుమాన్నామ = హనుమంతుండనువాఁడను.

నేను, వాయుదేవునికుమారుండ ; హనుమంతుండనువాఁడ.

అని, తాత్పర్యము.

సీతాయా స్తు కృతే తూర్ణం శతయోజన మాయతమ్. ౧౫
సముద్రం లంఘయిత్వైవ తాం దిదృక్షు రిహాగతః

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; సీతాయాః=సీతయొక్క; కృతే తు—కార్యమునిమిత్తమయ్యే; శతయోజనం=నూఱామడలు ;ఆయతం = దీర్ఘమయిన; సముద్రం = సముద్రమును;లంఘయిత్వైవ=దాఁటియే;తాం= ఆసీతను;దిదృక్షుః=చూడఁగోరినవాఁడనై ;ఇహ — ఇచ్చటికి; ఆగతః=వచ్చినాను.

నేను,సీతానిమిత్తమయ్యె, నూఱు యోజనంబులవైశాల్యంబు గలయీసముద్రంబునుదాఁటి , సీతంజూచుటకై వచ్చినాను. అని, తాత్పరము.

భ్రమతా చ మయా దృష్టా గృహే తే జనకాత్మజా. ౧౬

టీక॥భ్రమతా = తిరుగుచున్న;మయా=నాచేత;జనకాత్మజాచ= జనకునికూఁతురయినసీతాదేవియును; తే= నీయొక్క;గృహే—ఇంటియందు; దృష్టా—చూడఁబడినది.

నేనీలంకయందు, సీతనువెదకుచుండఁగా, నీగృహంబుననేనాకుసీతయగపడినది. అని, తాత్పర్యము.

తద్భవాన్ దృష్టధర్మార్థ స్తపఃకృతపరిగ్రహః

టీక॥తత్ =అందువలన; భవాన్— నీవు;దృష్టధర్మార్థః= చూడఁబడినధర్మప్రయోజనముగలవాఁడవు.తపఃకృతపరిగ్రహః=తపస్సుచేచేయఁబడినస్వీకారముగలవాఁడవు.

అట్లుండుటంజేసి, ( నామాటవినుము)నీవు,శాస్త్రంబులుచూచి, చక్కఁగా ధర్మస్వరూపంబు దెలిసినవాఁడవు;మహాతపంబుచేసినవాఁడవు.

అని, తాత్పర్యము.

పరదారాన్ మహాప్రాజ్ఞ నోపరోద్ధుం త్వ మర్హసి. ౧౭

టీక॥మహాప్రాజ్ఞ = గొప్పపండితుండవగురావణుఁడా!త్వం=నీవు;పరదారాన్=పరస్త్రీలను;ఉపరోద్ధుం— నిరోధించుటకు;నాహసి=తగవు.

రావణుఁడా! నీవుమహాపండితుండవు; నీవిట్లుపరస్త్రీలనీయింటనుంచికొని నిరోధింపరాదు.అని, తాత్పర్యము.

నహి ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు కర్మసు
మూలఘాతిషు సజ్జంతే బుద్ధిమంతో భవద్విధాః. ౧౭

టీక॥ భవద్విధాః = నీవంటివారల గు; బుద్ధిమంతః=బుద్ధిశాలులు; ధర్మవిరుద్ధేషు= ధర్మమునకువిరుద్ధమయిన; బహ్వపాయేషు= పెక్కుపాయములు గలవియును; మూలఘాతిషు = వేళునునశింపఁజేయునవియునగు; కర్మసు=పనులందు; నసజ్జంతేహి = ప్రయత్నింపరుగదా!

నీవంటిబుద్ధిమంతులు, ధర్మవిరుద్ధంబులును పెక్కుపాయంబులంగల్గించునవియును, మూలతోహానికరంబులునగు, పనులనెంతమాత్రమును, జేయరుగదా! అని, తాత్పర్యము.

కశ్చ లక్ష్మణముక్తానాం రామకోపానువర్తినామ్
శరాణా మగ్రత స్థాతుం శక్తో దేవా సురేష్వపి. ౧౮

టీక॥ లక్ష్మణముక్తానాం=లక్ష్మణునిచేవిడువఁబడినవియును ; రామకోపానువర్తినాం = రామునికోపమననుసరించునవియునగు; శరాణాం=బాణంబులయొక్క; అగ్రతః= ముందట ; స్థాతుంచ=నిలుచుటకును; దేవాసురేష్వపి= దేవతలయందునుఅసురులయందును; కః = ఎవ్వఁడు ; శక్తః = సమర్థుఁడు?

రాముండుకోపంబునొందుటం జూచి, లక్ష్మణుండు దానునుమహాకోపంబునొంది, ప్రయోగించుబాణంబుల ముందటనిలుచుటకు, దేవాసురులయిననుసమర్థులుకారు. అని, తాత్పర్యము.

నచాపి త్రిషు లోకేషు రాజ న్విద్యేత కశ్చన
రాఘవస్య వ్యళీకం యః కృత్వా సుఖ మవాప్నుయాత్. ౨౦

టీక॥ రాజన్ = రాక్షసరాజుండవగు రావణుఁడా! యః=ఎవ్వఁడు ; రాఘవస్య = రామునికి ; వ్యళీకం = అపరాధమును; కృత్వా = చేసి ; సుఖం = సుఖమును; అవాప్నుయాత్ = పొందునో; సః(అధ్యాహృతము)=అ

ట్టివాఁడు; కశ్చన=ఒకానొకండును; త్రిషు=మూఁడైన;లోకేషు=లోకంబులయందును; నవిద్యేతచాపి= ఉండనే ఉండఁడు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! రామునకపరాధముగావించి సుఖంబు నొందంగలవాఁడు, ముల్లోకంబులందును, ఒక్కఁడైన,నుండఁడు.

అని, తాత్పర్యము.

తత్త్రికాలహితం వాక్యం ధర్మ్య మర్థానుబంధిచ
మన్యస్వ నరదేవాయ జానకీ ప్రతిదీయతామ్. ౨౧

టీక॥తత్=అట్టి;వాక్యం=సుగ్రీవుని మాటను;త్రికాలహితం= మూఁడుకాలంబులందును మేలుసేయునదిగాను; ధర్మ్యం=ధర్మముతోఁగూడినదిగాను; అర్థానుబంధిచ=అర్థముతోసంబంధించినదిగాను;మన్యస్వ=తలంచుకొనుము.నరదేవాయ= మనుష్యులకుఁబ్రభువైనరామునికొఱకు;జానకీ=సీత; ప్రతిదీయతాం=ఇయ్యఁబడుఁగాక.

ఈమాటను,సుగ్రీవుఁడుసీతోఁజెప్పమనిచెప్పినాఁడు;ఇది,నీకుభూతభవిష్యద్వర్తమానకాలంబులందును మేలుగలిగించునది;ధర్మ్యమును;మఱియు, సమస్తపురుషార్థంబులనొసంగునది; అని, తలంచి,రామునకుసీతాదేవినిమ్ము.

అని, తాత్పర్యము.

దృష్టాహీ యం మయా దేవీ లబ్ధం య దిహ దుర్లభమ్
ఉత్తరం కర్మ యచ్ఛేషం నిమిత్తం తత్ర రాఘవః. ౨౨

టీక॥మయా=నాచేత ; ఇయం= ఈ; దేవీ=సీతాదేవి; దృష్టాహి=చూడఁబడినదిగదా!యత్=ఏది;దుర్లభం=పొందఁగూడనిదో; తత్(అధ్యాహృతము)=అది;ఇహ=ఇచ్చట; లబ్ధం=పొందఁబడినది.ఉత్తరం=వెనుకను;యత్=ఏది;శేషం=మిగిలిన;కర్మ = కార్యమో;తత్ర=అందు; రాఘవః=రాముఁడు;నిమిత్తం=ప్రమాణము.

నేనుసీతాదేవింజూచినాను; మాకందఱకునుఏది దుర్లభముగా నుండినదో,అట్టిసీతాదర్శనము పొందఁబడినది;ఇంకమీఁదఁజేయవలసిన కార్యము, రామునియందున్నది ; అదినాకాజ్ఞాపింపఁబడలేదు. అని, తాత్పర్యము.

లక్షితేయం మయా సీతా తథా శోకపరాయణా
గృహ్య యాం నాభిజానాసి పంచాస్యామివ పన్నగీమ్. ౨౩

టీక॥త్వం(అధ్యాహృతము)=నీవు; పంచాస్యాం=అయిదుతలలుగల; పన్నగీమివ=ఆడుసర్పమునుంబోలె; యాం=ఎవ్వతెను; గృహ్య(గృహీత్వా)= గ్రహించి; నాభిజానాసి= ఎఱుంగకున్నావో; సా(అధ్యాహృతము)=అట్టిదియును; తథా=అట్లు ; శోకపరాయణా=దుఃఖమె ముఖ్యమయినగతి గాఁగలదియునగు; ఇయం=ఈ; సీతా=సీత; మయా=నాచేత; లక్షితా=చూడఁబడినది.

నీవు, అయిదుతలలసర్పంబును గ్రహించినట్లు, ఎవ్వతెను గ్రహించి, అయిదుతలలసర్పమువంటి దానిని గ్రహించినానని, తెలిసికొనకున్నావో, అట్టి, పరమదుఃఖితయయియున్న, సీతాదేవినిం, జూచినాను. అని, తాత్పర్యము.

నేయం జరయితుం శక్యా సాసురైరమరైరపి
విషసంసృష్టమత్యర్థం భుక్తమన్నమివౌజసా. ౨౪

టీక॥ఇయం=ఈసీత; సాసురైః=అసురులతోఁగూడిన; అమరైరపి=దేవతలచేతనుంగూడ; భుక్తం= భుజింపఁబడిన; అత్యర్థం=అధికముగా; విషసంసృష్టం=విషముచేఁగలపఁబడిన; అన్నమివ=అన్నమువలె; ఓజసా= పరాక్రమముచేత; జరయితుం=జీర్ణింపఁజేసికొనుటకు; నశక్యా= అలవి యయినది కాదు.

దేవతలునసురులునొక్కటి యయినను, ఎచ్చుగావిషముగలసిన యన్నమును దిఁజీర్ణింపఁ జేసికొనం జాలనట్లు, ఈసీతను, దక్కించుకొనంజాలరు.

అని, తాత్పర్యము.

తపస్సంతాపలబ్ధస్తే యోఽయం ధర్మపరిగ్రహః
న స నాశయితుం న్యాయ్య ఆత్మప్రాణపరిగ్రహః. ౨౫

టీక॥ తే=నీయొక్క; తపస్సంతాపలబ్ధః= తపస్సుచేఁబొందఁబడిన; ధర్మపరిగ్రహః=ధర్మఫలభూతమయిన ; అయం=ఈ, ఆత్మప్రాణపరిగ్రహః=

ప్రాణంబులస్వీకారము; యః(అస్తి)= ఏదిగలదో; సః—అది; నాశయితుం= నశింపఁజేసికొనుటకు ; నన్యాయ్యః— యుక్తముకాదు.

నీవు,మహాతపస్సుగావించి, యందుకుఫలముగా,దీర్ఘాయుస్సునొందియున్నావు; దాని,నశింపఁజేసికొనుటయుక్తముకాదు. అని, తాత్పర్యము.

అవధ్యతాం తపోభి ర్యాం భవాన్ సమనుపశ్యతి
ఆత్మనస్సాసురై ర్దేవై ర్హేతు స్తత్రా ప్యయం మహాన్-౨౬

టీక॥ భవాన్— నీవు;తపోభిః— తపస్సులచేత;ఆత్మనః= నీయొక్క; సాసురైః=అసురులతోఁగూడిన; దేవైః= దేవతలచేత ; యాం = ఏ; అవధ్యతాం=చంపఁగూడకుండుటను; సమనుపశ్యతి = చూచుచున్నావో; తత్రాపి=అచ్చటనుంగూడ; అయం=ఈ;మహాన్=గొప్ప; హేతుః= కారణము అస్తి(అధ్యాహృతము)=కలదు.

నీవు, గొప్పతపస్సుచేసి, దేవతలచేతనుగాని యసురులచేతనుగానియవధ్యుఁడనగునట్లువరంబుగొని యున్నానని,గర్వించియున్నావు ; ఆవరంబునుంగూడబాధించు కారణంబొకటియున్నది-అని, తాత్పర్యము-

సుగ్రీవో నహి దేవోయం నాసురో నచ రాక్షసః
నదానవో న గంధర్వో న యక్షో నచ పన్నగః-౨౭

టీక॥ అయం— ఈ ; సుగ్రీవః=సుగ్రీవుఁడు; దేవః=దేవత;నహి— కాఁడుగదా!అసురః = అసురుఁడు ; న= కాఁడు;రాక్షసశ్చ = రాక్షసుండును; న=కాఁడు. దానవః— దానవుఁడు;న= కాఁడు.గంధర్వః=గంధర్వుఁడు; న= కాఁడు.యక్షః=యక్షుఁడు;న—కాఁడు. పన్నగశ్చ=సర్పమును;న=కాఁడు.

ఈసుగ్రీవుఁడు;దేవతయునుగాఁడుగదా! అసురుండునుగాఁడు;రాక్షసుండునుగాఁడు; దానవుండునుగాఁడు ; గంధర్వుండునుగాఁడు ; యక్షుండునుగాఁడు;పన్నగంబునుగాఁడు ; అట్లునీవెవ్వరెవ్వరివలనంజావులేనట్లువరంబుగొనియున్నావో, వారల యెవ్వరిలోనుంజేరినవాఁడుకాఁడు.

అని, తాత్పర్యము.

తస్మాత్త్వా౽౽త్మపరిత్రాణం కథం రాజన్ కరిష్యసి

టీక॥ రాజన్ = రాక్షసరాజుండవగు రావణుఁడా! తస్మాత్ = ఆసుగ్రీవునివలన; ప్రాణపరిత్రాణం = ప్రాణంబులరక్షించుటను; కథం = ఎట్లు; కరిష్యసి = చేయఁగలవు.

రాక్షసరాజుండవగు రావణుఁడా! అట్టిసుగ్రీవునిచేతంజావక, నీవు, ప్రాణంబులనెట్లుదక్కించుకొందువు? అని, తాత్పర్యము.

నతు ధర్మోపసంహార మధర్మఫలసంహితమ్. ౨౮
త దేవఫల మన్వేతి ధర్మశ్చా ధర్మనాశనః

టీక॥ ధర్మోపసంహారంతు = ధర్మముయొక్కఫలముమాత్రము; అధర్మఫలసంహితం = అధర్మఫలముతోఁగూడినది; న = కాదు. తత్ = అట్టి; ఫలమేవ = ఫలమునే; అన్వేతి = అనుసరించును. ధర్మశ్చ = ధర్మమే; అధర్మనాశనః = అధర్మమునునశింపఁజేయునది.

ధర్మఫలంబెప్పుడును, అధర్మఫలంబుతోఁజేరదు; ధర్మఫలముతోనేచేరును; మఱియు, ధర్మమువలననె, యధర్మమునశించును. అని, తాత్పర్యము.

ప్రాప్తం ధర్మఫలం తావ ద్భవతా నాత్ర సంశయః. ౨౯

టీక॥ భవతా = నీచేత; ధర్మఫలం = ధర్మఫలము; తావత్ = అంతయు; ప్రాప్తం = పొందఁబడినది. అత్ర = ఈవిషయమునందు; సంశయః = సంశయము; న = లేదు.

అట్లుండుటంజేసి, నీవుతపస్సుమొదలగువానిచేసంపాదించిన ధర్మఫలములోఁ, గొంత, యధర్మమునునశింపఁజేయుటకై, వినియుక్తమయినది; మిగిలినదంతయు, నీవనుభవించినావు; ఇందు, సందియములేదు- అని, తాత్పర్యము-

ఫల మస్యా ప్యధర్మస్య క్షిప్ర మేవ ప్రపత్స్యసే

టీక॥అస్య=ఈ;అధర్మస్య= అధర్మముయొక్క; ఫలమపి=ఫలమునుంగూడ;క్షిప్రమేవ=శీఘ్రముగనే; ప్రపత్స్యసే=పొందఁగలవు-

అట్లు,ధర్మఫలంబునంతయు నిశ్శేషముగాననుభవించినావు,కావున, నీసీతాహరణంబునంగల్గినయధర్మమును నశింపఁజేయంగలధర్మమునీయందులేదు,కాఁబట్టి,దీనిఫలంబునుంగూడ, నింక,శీఘ్రంబుగనే, యనుభవింపంగలవు.

అని, తాత్పర్యము.

జనస్థానవధం బుద్ధ్వా బుద్ధ్వా వాలివధం తథా. ౩౦
రామసుగ్రీవసఖ్యంచ బుధ్యస్వ హిత మాత్మనః

టీక॥జనస్థానవధం = జనస్థానములోనిరాక్షసులవధమును;బుద్ధ్వా= తెలిసికొని;తథా=అట్లు;వాలివధం= వాలియొక్క వధమును;బుద్ధ్వా = తెలిసికొని;తథా = అట్లు;రామసుగ్రీవసఖ్యంచ= రామునియొక్కయుసుగ్రీవునియొక్కయుఁజెలిమిని; బుద్ధ్వా(అధ్యాహృతము)=తెలిసికొని;ఆత్మనః = నీయొక్క;హితం=మేలును;బుధ్యస్వ= తెలిసికొనుము.

రాముం డొకరుండె జనస్థానంబులోనిరాక్షసులనందఱంజంపుటను, ఒకబాణంబుననెవాలింజంపుటను, రాముండునుసుగ్రీవుండునుసఖ్యముచేసికొనుటను,విచారించి,నీకుహితమగుదానిం దెలిసికొనుము.అని, తాత్పర్యము.

కామం ఖల్వ హ మప్యేక స్సవాజిరథకుంజరామ్. ౩౧
లంకాం నాశయితుం శక్త స్తస్యై షతు న నిశ్చయః

టీక॥అహం=నేను;ఏకోపి=ఒక్కఁడనే;సవాజిరథకుంజరాం= గుఱ్ఱములతోను రథములతోను ఏనుంగులతోనుంగూడిన;లంకాం=లంకను;కామం= మిక్కిలియు;నాశయితుం = నశింపఁజేయుటకు; శక్తఃఖలు= సమర్థుండనుగదా!ఏషతు=ఇదిమాత్రము; తస్య= ఆరామునియొక్క;నిశ్చయోన = నిశ్చయముకాదు.

నే,నొకరుండనె,గుఱ్ఱంబులతోనురథంబులతోనుగజంబులతోను నిండియుండునీలంకనంతయు,రూపుమాపంజాలు

దును; అయినను, అది రాముని, యిష్టము కాదు. అని, తాత్పర్యము.

రామేణ హి ప్రతిజ్ఞాతం హర్యృక్షగణసన్నిధౌ. ౩౨
ఉత్పాదన మమిత్రాణాం సీతా యైస్తు ప్రధర్షితా

టీక॥ యైస్తు=ఎవ్వరిచేతనే; సీతా= సీతాదేవి; ప్రధర్షితా=తిరస్కరింపఁబడినదో; తేషాం(అధ్యాహృతము)= ఆ; అమిత్రాణాం= శత్రువులయొక్క; ఉత్పాదనం=చంపుట; రామేణ= రామునిచేత; హర్యృక్షగణసన్నిధౌ= వానరులయొక్కయు నెలుఁగుగొడ్డులయొక్కయు సమూహములయొక్క సమీపమునందు; ప్రతిజ్ఞాతంహి = ప్రతిజ్ఞ చేయఁబడినదిగదా!

సీతనపహరించిన శత్రువులందఱనే చంపెదనని, రాముఁడు, వానరభల్లూకసమూహంబుల యెదుటఁ, బ్రతిజ్ఞ చేసినాఁడు. అని, తాత్పర్యము.

అపకుర్వన్హి రామస్య సాక్షాదపి పురందరః. ౩౩
న సుఖం ప్రాప్నుయాదన్యః కిం పున స్త్వద్విధో జనః

టీక॥ సాక్షాత్పురందరోపి= సాక్షాద్దేవేంద్రుఁడైనను; రామస్య= రామునకు; అపకుర్వన్= అపకారముచేయుచు; సుఖం = సుఖమును; నప్రాప్నుయాత్ హి= పొందఁడుగదా! అన్యః=ఇతరుఁడయిన; త్వద్విధః=నీవంటి; జనః= జనము; సుఖం, నప్రాప్నుయాత్(అధ్యాహృతము)=సుఖమునొందఁడు. ఇతి(అధ్యాహృతము)=అని; కింపునః(వక్తవ్యం)=చెప్పఁబడవలయునా యేమి?

సాక్షాద్దేవేంద్రుండైనను, రామునకపకారముగావించువాఁడు, సుఖంబునొందఁజాలఁడు; ఇంకనీవంటియల్పునిసంగతిచెప్పనేల? అని, తాత్పర్యము.

యాం సీతేత్యభిజానాసి యేయం తిష్ఠతి తే వశే. ౩౪
కాళరాత్రీతి తాం విద్ధి సర్వలంకావినాశినీమ్

టీక॥ యాం=ఎవ్వతెను; సీతేతి= సీతయని; అభిజానాసి=తెలిసికొనియున్నావో; యా=ఏ; ఇయం= ఈసీత; తే=నీయొక్క; వశే = అధీనతయందు;




తిష్ఠతి = ఉన్నదో; సర్వలంకావినాశినీం = సమస్తలంకనునశింపఁజేయునట్టి; తాం=ఆసీతను ; కాళరాత్రిమ్ ఇతి = కాళరాత్రియని; విద్ధి=ఎఱుంగుము.

నీవెవ్వతెను సీతయని తలంచియున్నావో, ఎవ్వతెయిప్పుడునీవశంబునంజిక్కియున్నదో; అట్టిసీత, యీలంకనంతయునాశంబునొందించునట్టి కాళరాత్రియని, యెఱుంగుము.

అని, తాత్పర్యము.

తదలం కాలపాశేన సీతావిగ్రహరూపిణా. ౩౫
స్వయం స్కంధావసక్తేన క్షమ మాత్మని చింత్యతామ్

టీక॥ తత్ = అందువలన; స్వయం=తనకుఁదానె; స్కంధావసక్తేన=మూఁపులయందుంచుకొనఁబడిన; సీతావిగ్రహరూపిణా=సీతయొక్కశరీరమెరూపముగాఁగల; కాలపాశేన = కాలపాశముచేత; అలం = చాలును; ఆత్మని= నీయందు; క్షమం= హితము గనది; చింత్యతాం = ఆలోచింపఁబడుఁగాక.

అట్లుండుటంజేసి, సీతాకారంబుననుండునట్టియీకాలపాశమును, నీవే, నీమెడపైవేసుకొనవలదు; ఇంక, నీకుహితమేదో, దానినాలోచించుకొనుము.

అని, తాత్పర్యము.

సీతాయాస్తేజసా దగ్ధాం రామకోపప్రపీడితామ్. ౩౬
దహ్యమానా మిమాం పశ్య పురీం సాట్టప్రతోళికామ్

టీక॥సీతాయాః = సీతాదేవియొక్క; తేజసా = ప్రభావముచేత; దగ్ధాం=దహింపఁబడినదియును; రామకోపప్రపీడితాం= రామునికోపముచేఁబీడింపఁబడినదియును ; సాట్టప్రతోళికాం=కోటబురుజులతోనువీధులతోనుఁగూడినదియునగు;ఇమాం=ఈ;పురీం= పట్టణమును;దహ్యమానాం = దహింపఁబడుచున్నదానిఁగా;పశ్య = చూడుము.

ఈలంకాపట్టణము,ఇప్పటికే, సీతాతేజంబున దహింపఁబడియె యున్నది; ఇంక రామునికోపంబునఁ, గోటబురుజులతోనువీధులతోనుంగూడ, దహింపఁబడంగలదని, యెఱుంగుము.

అని, తాత్పర్యము.




స్వానిమిత్రాణిమంత్రీశ్చ జ్ఞాతీన్ భ్రాతౄన్ సుతాన్ హితాన్. ౩౭
భోగాన్ దారాంశ్చ లంకాంచ మా వినాశ ముపానయ

టీక॥ స్వాని=నీవారలయిన; మిత్రాణి=స్నేహితులను; మంత్రీంశ్చ = మంత్రులను; జ్ఞాతీన్=దాయాదులను; భ్రాతౄన్=తోఁబుట్టువులను; సుతాన్=కొడుకులను; హితాన్=ఇష్టములయిన; భోగాన్=భోగములను; దారాంశ్చ=భార్యలను; లంకాంచ = లంకను; వినాశం=నాశమును; మోపానయ = పొందింపకుము.

నీస్నేహితులను మంత్రులను దాయాదులను దోఁబుట్టువులను ఇష్టంబులగుభోగంబులను భార్యలను, లంకను, నాశంబునొందింపకుము.

అని, తాత్పర్యము.

సత్యం రాక్షసరాజేంద్ర శృణుష్వ వచనం మమ. ౩౮
రామదాసస్య దూతస్య వానరస్య విశేషతః

టీక॥ రాక్షసరాజేంద్ర = రాక్షసరాజులలోనుత్తముండవగు రావణుఁడా! రామదాసస్య=రామునిదాసుండను; దూతస్య= రాయబారిని; విశేషతః=విశేషించి; వానరస్య=వానరుండనగు; మమ=నాయొక్క; సత్యం=అబద్ధముకాని; వచనం=మాటను; శృణుష్వ=వినుము.

రాక్షసరాజులలో నుత్తముండవగు రావణుఁడా! నేను, రామునిదాసుండను, గావున, రామునిప్రభావంబును జక్కఁగానెఱుంగుదును; రాయబారిని, గావున. నీకుహితంబుదెల్పవలసినవాఁడను; అందును, నేనురాక్షసుండనుగాని, మనుష్యుండనుగాని, కాను; వానరుండనగుటవలన, మధ్యస్థుండను, నిష్పక్షపాతంబుగాఁజెప్పుదును; నామాటనువినుము. నేనుజెప్పునదితప్పదు.

అని, తాత్పర్యము.

సర్వాన్ లోకాన్ సుసంహృత్య సభూతాన్ సచరాచరాన్. ౩౯
పునరేవ తథా స్రష్టుం శక్తో రామో మహాయశాః

టీక॥ మహాయశాః=అధికమయినకీర్తిగల; రామః=రాముఁడు; సభూ

తాన్ = పంచమహాభూతంబులతోఁ గూడినవియును; సచరాచరాన్ = జంగమస్థావరములతోఁగూడినవియునగు; సర్వాన్ = సమస్తములయిన; లోకాన్=లోకంబులను; సుసంహృత్య= చక్కఁగాసంహరించి; పునః=మఱల; తథా=అట్లు; స్రష్టుం=సృజించుటకు; శక్తః=సమర్థుఁడు.

మహాకీర్తిశాలియగు నారాముండు, పంచమహాభూతంబులతోను, జంగమస్థావరంబులతోనుఁగూడ, సమస్తలోకంబలనుసంహరించి, మఱల, వానియథాప్రకారంబుగా సృజింపఁగలఁడు. అని,తాత్పర్యము.

దేవాసురనరేంద్రేషు యక్షరక్షోగణేషుచ. ౪౦
విద్యాధరేషు సర్వేషు గంధర్వేషూరగేషుచ
సిద్ధేషు కిన్నరేంద్రేషు పతత్రిషుచ సర్వతః. ౪౧
సర్వభూతేషు సర్వత్ర సర్వకాలేషు నాస్తి సః
యోరామం ప్రతియుధ్యేత విష్ణుతుల్యపరాక్రమమ్. ౪౨

టీక॥ దేవాసుర నరేంద్రేషు = దేవతలయందును అసురులయందును రాజులయందును; యక్షరక్షోగణేషుచ = యక్షుల యొక్కయు రాక్షసులయొక్కయుసమూహముల యందును; సర్వేషు = సమస్తులయిన; విద్యాధరేషు=విద్యాధరులయందును; గంధర్వేషు= గంధర్వులయందును; ఉరగేషుచ=సర్పములయందును; సిద్ధేషు = సిద్ధులయందును;కిన్నరేంద్రేషు=కిన్నరోత్తములయందును; పతత్రిషుచ=పక్షులయందును; సర్వతః = అంతటను;సర్వభూతేషు= సమస్తప్రాణులయందును; సర్వత్ర=అన్నిచోట్లను; సర్వకాలేషు=సమస్తకాలములందును; యః= ఎవ్వండు; విష్ణుతుల్యపరాక్రమం = విష్ణుదేవునిపరాక్రమముతోసమానమయినపరాక్రమముగల; రామంప్రతి= రామునిగూర్చి; యుధ్యేత = పోరునో; సః=అతండు; నాస్తి= లేఁడు.

విష్ణుదేవునకుసరియయిన పరాక్రమంబుగలరామునితోయుద్ధంబు సేయంగలవాఁడు , దేవతలలోఁగాని అసురులలోఁగాని రాజులలోఁగాని, యక్షులలోఁగాని రాక్షసులలోఁగాని,విద్యాధరులలోఁగాని, గంధర్వులలోఁగా ని

సర్పంబులలోఁగాని, సిద్ధులలోఁగాని, కిన్నరోత్తములలోగాని, పక్షులలోఁగాని, ఏవిధమయినప్రాణులందును, ఎచ్చటను, ఏకాలమునందును, లేఁడు.

అని, తాత్పర్యము.

సర్వలోకేశ్వరస్యైవం కృత్వా విప్రియ ముత్తమమ్
రామస్య రాజసింహస్య దుర్లభం తవ జీవితమ్. ౪౩

టీక॥ సర్వలోకేశ్వరస్య= సమస్తలోకంబులకును ప్రభుండును; రాజసింహస్య=రాజశ్రేష్ఠుండునగు; రామస్య=రామునకు; ఏవం=ఇట్లు; ఉత్తమం= మిక్కిలియునధికమయిన; విప్రియం=అపకారమును; కృత్వా=చేసి; తవ=నీకు; జీవితం= బ్రతుకు; దుర్లభం=పొందఁగూడనిది.

సమస్తలోకనాయకుండును రాజశ్రేష్ఠుండునగు రాముని కింతటిమహాపకారంబుగావించినావు; ఇంక, నీవు, బ్రతుకంజాలవు. అని, తాత్పర్యము

దేవాశ్చ దైత్యాశ్చ నిశాచరేంద్ర
గంధర్వవిద్యాధరనాగయక్షాః
రామస్య లోకత్రయనాయకస్య
స్థాతుం న శక్తా స్సమరేషు సర్వే. ౪౪

టీక॥ నిశాచరేంద్ర= రాక్షసులకుఁబ్రభుండవగు రావణుఁడా! దేవాశ్చ= దేవతలును; దైత్యాశ్చ= అసురులును; గంధర్వవిద్యాధరనాగయక్షాః= గంధర్వులును విద్యాధరులును సర్పములును యక్షులును; సర్వే=అందఱును; లోకత్రయనాయకస్య = లోకంబులమూఁడిఁటికిని ప్రభుండైన; రామస్య = రాముని యొక్క. అగ్రతః(అధ్యాహృతము)= ముందట; సమరేషు= యుద్ధములందు; స్థాతుం=నిలుచుటకు; నశక్తాః = చాలరు.

రాక్షసులకుఁబ్రభుండవగు రావణుఁడా! దేవతలునసురులును గంధర్వులును విద్యాధరులును సర్పంబులును యక్షులును, యుద్ధంబున, ముల్లోకంబులకును ప్రభుండైన, రాముని యెదుట, నిలువంజాలరు.

అని, తాత్పర్యము.

స ౫౧

బ్రహ్మా స్వయంభూ శ్చతురాననోవా
రుద్ర స్త్రీనేత్ర స్త్రిపురాంత కోవా
ఇంద్రో మహేంద్ర స్సురనాయకోవా
త్రాతుం న శక్తా యుధి రామ వధ్యమ్. ౪౫

టీక॥ స్వయంభూః= తనకుఁదానె పుట్టినవాఁడును, స్వతంత్రుండుననుట; చతురాననః = నాలుగుముఖంబులు గలవాఁడును, ఏకకాలంబుననె నాలుగుముఖంబులను నాలుగు వేదంబులను చ్ఛరించువాఁడుననుట ; బ్రహ్మావా = ("బృహివృద్ధౌ అనుధాతువునం బుట్టినది)సర్వాతిశాయియునగు బ్రహ్మదేవుండుగాని; రుద్రః= ప్రళయకాలంబునఁబ్రజల సంహరించుచు నేడ్పించువాఁడును;లేక (రుతంరాతీతిరుద్రః)= వేదరూపమయిన శబ్దమును గల్పాదియందుబ్రహ్మదేవునికొఱకుఁ జెప్పువాఁడును; త్రినేత్రః=మూఁడుకండ్లు గలవాఁడును,అగ్నిహోత్రరూపంబగు మూఁడవకంటిచే మన్మథునిదహించిన వాఁడుననుట; త్రిపురాంతకోవా=త్రిపురాసురులంజంపినవాఁడునగుశివుఁడుగాని, ఇంద్రః=("ఇదిపరమైశ్వర్యే" అనుధాతువునంబుట్టినది) పరమైశ్వర్యంబు గలవాఁడును; మహేంద్రః= పూజ్యుండగునింద్రుండును, వృత్రాసురుం జంపినవాఁడుననుట ( ఇంద్రుండువృత్రాసురుంజంపుటవలన నతనికి మహేంద్రుండనుపేరుగల్గినదని , వేదంబునందున్నది); సురనాయకోవా = దేవతలకధిపుండును , సమస్తదేవతలతోఁగూడినవాఁడుననుట, అట్టిదేవేంద్రుండుగాని; యుధి = యుద్ధమునందు ; రామవధ్యం= రామునకుఁ జంపఁదగినవాని ; త్రాతుం=రక్షించుటకు; నశక్తాః= సమర్థులుకారు.

తనకుఁదానెపుట్టుటంజేసి యతిస్వతంత్రుండునునాలుగు మొగంబులనేకకాలంబుననాలుగువేదంబులం జదువంజాలినమహాత్ముండును సర్వాతిశాయియునగుబ్రహ్మదేవుండైనఁగాని ,ప్రళయకాలంబుననమస్తభూతంబులనేడ్పించువాఁడును,బ్రహ్మదేవునకుఁ గల్పాదియందువేదంబులు మొదలగు సమస్తవిద్యలనుపదేశించువాఁడును మూఁడవనేత్రంబున మన్మథునిదహించినవాఁడును, సమస్తదేవతలకునసాధ్యులగు త్రిపురాసురులనొక్కబాణంబుననీఱుచేసిన వాఁడున

గుశివుండైనఁగాని, పరమైశ్వర్యశాలియు, వృత్రాసురుంజంపినవాఁడును, సమస్త దేవతలకును ప్రభుండునగు దేవేంద్రుండైనంగాని, వీరలందఱునొక్కటియైగాని, యుద్ధంబున, రామవధ్యుఁడగువానిని, నెంతమాత్రమురక్షింపఁజాలరు.అని,హనుమంతుండు రావణునకుం జెప్పెను.అని,తాత్పర్యము.

విశేషార్థము.— ఇందువలన, రాముండనఁగా, బ్రహ్మరుద్రేంద్ర భిన్నుండనియు, వారలకన్ననధికుండనియు, స్పష్టమగుచున్నది; మఱియు, రామవధ్యునిరక్షింపఁజాలనిప్రధానదేవతలలెక్క పెట్టుటలో, విష్ణువు, గణింపఁబడకుండుటంజేసి, పారిశేష్యంబున, విష్ణుదేవుండే రాముండని సిద్ధమయినవి.

అని,గోవిందరాజులవారి యభిప్రాయము.

ఈవచనము,హనుమంతునిచే, రావణునకు,భయోత్పాదనార్థముగ చెప్పంబడినది.కావున, నిదియన్యథా సిద్ధము.మఱియు,నిది, యుత్తరకాండంబున,రాముండు,లవణవధార్థంబు శత్రుఘ్నునకు నారాయణ శరీరాత్మకంబగునొక్కదివ్యాస్త్రంబు నొసంగి, దానిచే,లవణునకుశివుండు తనశూలంబుననుండిసృజించియొసంగినయొకానొకశూలంబు, లవణునియొద్ద లేకుండునప్పుడే, లవణుంజంపుమని శత్రుఘ్నునాకుపదేశించి, తదుపపాదనార్థము, "శ్రీమతశ్శితికంఠస్య కృత్యంహిదురతిక్రమం"(శివుండు,సర్వాతిశాయి, అతనికృత్యంబునతిక్రమింపనెట్టివానికినలవిగాదు) అని విష్ణునికన్న శివుండుపరమాధికుండని,శత్రుఘ్నునకుగ్గడించి,చెప్పినవచనంబునకువిరుద్ధంబు కావున,సీ"బ్రహ్మాస్స్వయంభూః" ఇత్యాదిశ్లోకంబునకు,ఈహనుమంతుండే సీతకుధైర్యంబుగలుగుటకై చెప్పిన, "మత్తఃప్రత్యవరఃకశ్చి న్నాస్తిసుగ్రీవసన్నిధౌ, అహంతావదిహప్రాప్తఃకింపునస్తేమహాబలాః. నహిప్రకృష్టాఃప్రేష్యంతేప్రేష్యంతేహితరేజనాః."(సుగ్రీవునియొద్దనాకన్నఁ దక్కువయిన వాఁడెవ్వఁడునులేఁడు; నేనేయీసముద్రంబు దాఁటివచ్చితినే! ఇంకమహాబలశాలులగువారలందఱు రాఁగలరనిచెప్పనేల?ఎచ్చటికైనఁగార్యార్థముగా, నుత్తములంబంపరుగదా! నీచులనేగదాపంపుదురు.)అను,వచనంబునకుంబోలె,స్వార్థంబునంబ్రామాణ్యంబులేదు. అని, యప్పయదీక్షితులవారభిప్రాయపడిరి.

స సాష్టవోపేత మదీనవాదినః
కపేర్నిశమ్యాప్రతిమోఽప్రియం వచః
దశాననః కోపవివృత్తలోచన
స్సమాదిశత్తస్య వధం మహాకపేః. ౪౬

టీక॥ అప్రతిమః=సరిలేని ; సః = ఆ; దశాననః =రావణుఁడు ; అదీనవాదినః = భయంబు లేనట్లు మాటలాడుచున్న; కపేః=హనుమంతునియొక్క; సాష్టవోపేతం= చక్కఁదనముతోఁగూడిన; అప్రియం=అనిష్టంబగు ; వచః=మాటను; నిశమ్య=విని; కోపవివృత్తలోచనః = కోపముచేఁద్రిప్పఁబడినకండ్లుగలఁవాఁడై; తస్య = ఆ; మహాకపేః=పెద్దకోఁతియయినహనుమంతునియొక్క; వధం = చంపుటను; సమాదిశత్=ఆజ్ఞాపించెను.

అసదృశుండగు నా రావణుండు, హనుమంతుండు నిర్భయంబుగాఁజెప్పిన, నిర్దోషంబును, తనకప్రియంబునగు నా మాటనువిని, కోపంబున నేత్రంబులం ద్రిప్పుచు, నాహనుమంతుంజంప నాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ఏకపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము,
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండైకపంచాశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

ద్విపంచాశసర్గప్రారంభః.

తస్య త ద్వచనం శ్రుత్వా వానరస్య మహాత్మనః
ఆజ్ఞాపయ ద్వధం తస్య రావణః క్రోధమూర్ఛితః. ౧

టీక॥ రావణః=రావణుఁడు; మహాత్మనః= అధికమయినబుద్ధిగల;తస్య=ఆ;వానరస్య= హనుమంతునియొక్క; తత్=ఆ;వచనం=మాటను;శ్రుత్వా=విని;క్రోధమూర్ఛితః = కోపముచేత వ్యాపింపఁబడినవాఁడై;తస్య= ఆహనుమంతునియొక్క;వధం=చంపుటను; ఆజ్ఞాపయత్=ఆజ్ఞాపించెను.

రావణుండు, బుద్ధిమంతుండగునా హనుమంతుండుచెప్పినమాటనువిని, మహాకోపంబునొంది,ఆహనుమంతునింజంప,నాజ్ఞాపించెను. అని,తాత్పర్యము.

వధే తస్య సమాజ్ఞప్తే రావణేన దురాత్మనా
నివేదితవతో దూత్యం నానుమేనే విభీషణః. ౨

టీక॥దురాత్మనా= దుష్టబుద్ధిగల; రావణేన=రావణునిచేత;తస్య = ఆ హనుమంతునియొక్క; వధే=చంపుట; సమాజ్ఞప్తే=ఆజ్ఞాపింపఁబడఁగా;విభీషణః=విభీషణుఁడు;నివేదితవతః= తెలుపఁబడినకార్యముగలహనుమంతునియందు;దూత్యం=దూతసంబంధివధమును; నానుమేనే=సమ్మతింపఁడయ్యె.

దురాత్ముండగురావణుండు, హనుమంతునింజంపనాజ్ఞాపించుటనువిని,విభీషణుండుమాత్రము, తానువచ్చిన కార్యమునుయథార్థముగాఁ జెప్పినదూతంజంపుటకుసమ్మతింపఁడయ్యె.

అని, తాత్పర్యము.

తం రక్షోధిపతిం క్రుద్ధం తచ్చ కార్య ముపస్థితమ్
విదిత్వా చింతయామాస కార్యం కార్యవిధౌ స్థితః. ౩

టీక॥ కార్యవిధౌ = కార్యములచేయుటయందు;స్థితః = ఉన్నవాఁడగు; పండితుండగుననుట , విభీషణుండు ; తం=ఆ; రక్షోధిపతిం= రాక్షసులకుఁ బ్రభుండగురావణుని; క్రుద్ధం= కోపించినవానిఁగాను; తత్=ఆ; కార్యంచ= దూతవధరూప కార్యమును ; ఉపస్థితం=సమీపించినదానిఁగాను;విదిత్వా= తెలిసికొని; కార్యం= చేయఁదగినదానిని; చింతయామాస=ఆలోచించెను.

కార్యంబులందుఁబండితుండగు విభీషణుండు , రాక్షసేశ్వరుండగురావణుండట్లు కోపంబునొంది యుండుటయు , హనుమంతునివధంబుసేయయ

త్సించుటయు నెఱింగి, చేయవలసిన తెఱంగు నాలోచించెను.

అని, తాత్పర్యము.

నిశ్చితార్థ స్తత స్సామ్నా పూజ్యం శత్రుజి దగ్రజమ్
ఉవాచ హిత మత్యర్థం వాక్యం వాక్యవిశారదః. ४

టీక॥ తతః=అటుపిమ్మట ; శత్రుజిత్ = శత్రువులజయించువాఁడును ; వాక్యవిశారదః=మాటలయందుఁబండితుండునగు, విభీషణుఁడు ; నిశ్చితార్థః= నిశ్చయింపఁబడినకార్యముగలవాఁడై; పూజ్యం= పూజింపఁదగినవాఁడును; అగ్రజం = అన్నయునగు రావణుంగూర్చి ; అత్యర్థం = మిక్కిలియు; హితం = మేలుగలిగించునదియగు; వాక్యం= మాటను ; ఉవాచ = చెప్పెను.

అంత, శత్రువులజయించువాఁడును మాటలుచెప్పుటయందుఁబండితుండునగు, విభీషణుండు, చేయందగుకార్యంబు నిశ్చయించి, పూజ్యుండు నగ్రజుండు నగు రావణుంజూచి, పరమహితంబగు నీమాటం జెప్పెను-

అని, తాత్పర్యము.

క్షమస్వ రోషం త్యజ రాక్షసేంద్ర
ప్రసీద మద్వాక్య మిదం శృణుష్వ
వధం నకుర్వంతి పరావరజ్ఞాః
దూతస్య సంతో వసుధాధిపేంద్రాః. ౫

టీక॥ రాక్షసేంద్ర=రాక్షసులకుఁబ్రభుండవగు రావణుఁడా! క్షమస్వ = క్షమింపుము. రోషం=కోపమును; త్యజ= విడువుము-ప్రసీద = ప్రసన్నుండవగుము-ఇదం=ఈ; మద్వాక్యం = నామాటను; శృణుష్వ = వినుము. పరావరజ్ఞాః= మంచిచెడుగులుదెలిసినవారలును; సంతః=పెద్దలునగు; వసుధాధీపేంద్రాః = రాజులలోనుత్తములగువారలు; దూతస్య=దూతయొక్క; వధం= చంపుటను; నకుర్వంతి=చేయరు.

రాక్షసులకుఁ బ్రభుండవగు రావణుఁడా! క్షమింపుము; కోపంబువిడిచి, ప్రసన్నుండవగుము; నామాటను విను

ము; మంచిచెడుగులు దెలిసినమహాత్ముల గు రాజశ్రేష్ఠులు, దూతం, జంపరు. అని, తాత్పర్యము.

రాజధర్మవిరుద్ధంచ లోకవృత్తేశ్చ గర్హితమ్
తవచా సదృశం వీర కపే రస్య ప్రమాపణమ్. ౬

టీక॥ వీర = పరాక్రమశాలివగు రావణుఁడా! అస్య = ఈ ; కపేః = హనుమంతునియొక్క ; ప్రమాపణం = చంపుట ; రాజధర్మవిరుద్ధంచ = రాజధర్మమునకు విరుద్ధమును. లోకవృత్తేశ్చ = లోకాచారమునకును ; గర్హితం = నిందింపఁబడినది. తవచ = నీకును ; అసదృశం = సరికానిది.

పరాక్రమ శాలివగు రావణుఁడా! ఈహనుమంతుంజంపుట, రాజధర్మంబునకువిరుద్ధము, లోకాచారంబునకునువ్యతిరిక్తముగానున్నది; నీయట్టిధార్మికునకు, సరియయినకార్యమునుగాదు. అని, తాత్పర్యము.

ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ రాజధర్మవిశారదః
పరావరజ్ఞో భూతానాం త్వమేవ పరమార్థవిత్. ౭

టీక॥ భూతానాం = ప్రాణులలోపల ; త్వమేవ = నీవే ; ధర్మజ్ఞశ్చ = ధర్మములనెఱింగినవాఁడవును. కృతజ్ఞశ్చ = చేయఁబడిన యుపకారము కొంచెమయినను దానినెచ్చుగా నెఱుంగువాఁడవును. రాజధర్మవిశారదః = రాజధర్మంబులందుఁబండితుండవును. పరావరజ్ఞః = మంచిచెడుగులు దెలిసినవాఁడవు. పరమార్థవిత్ = ముఖ్యమయినయర్థము నెఱింగినవాఁడవు.

సమస్తప్రాణులలోను, నీవే, ధర్మంబులనెఱింగినవాఁడవు; కృతజ్ఞుండవు; రాజధర్మంబులఁ జక్కఁగాఁ దెలిసినవాఁడవు; మంచిచెడ్డలు దెలిసినవాఁడవు; మఱియుఁ, బరమార్థంబుల నెఱింగినవాఁడవు. అని, తాత్పర్యము.

గృహ్యంతే యది రోషేణ త్వాదృశోపి విపశ్చితః
తతశ్శాస్త్రవిపశ్చిత్త్వం శ్రమఏవహి కేవలమ్. ౮

టీక॥ త్వాదృశః = నీవంటి ; విప శ్చితోపి=పండితులును; రోషేణ= కోపముచేత;గృహ్యంతేయది=గ్రహింపఁబడుదురేని; తతః=అంత ; శాస్త్రవిపశ్చిత్త్వం=శాస్త్రపాండిత్యము;శ్రమ ఏవ కేవలం=అలసటయేగదా!

నీవంటిపండితులును, ఇట్లు, అస్థానంబునఁ, గోపమునొందుదురేని,సమస్తశాస్త్రములను జదివిపాండిత్యంబు సంపాదించుకొనుటచే, నేమిప్రయోజనము? వట్టిశ్రమమేకదా!
అని, తాత్పర్యము.

తస్మాత్ప్రసీద శత్రుఘ్న రాక్షసేంద్ర దురాసద
యుక్తాయుక్తం వినిశ్చిత్య దూతదండో విధీయతామ్. ౯

టీక॥ శత్రుఘ్న= శత్రువులంజంపువాఁడవును; దురాసద= పొందఁగూడనివాఁడవునగు; రాక్షసేంద్ర = రాక్షసులకుఁబ్రభుండవయినరావణుఁడా ! తస్మాత్ =అందువలన; ప్రసీద = ప్రసన్నుండవుగమ్ము. యుక్తాయుక్తం = యుక్తాయుక్తములను;వినిశ్చిత్య= నిశ్చయించికొని; దూతదండః=దూతశిక్ష; విధీయతాం=చేయఁబడుఁగాక.

శత్రువులంజంపువాఁడవును శత్రువులకుం జెనకనలవిగానివాఁడవును రాక్షసేశ్వరుండవునగు రావణుఁడా ! అట్లగుటంజేసి , కోపంబు విడువుము ; యుక్తాయుక్తంబులు నాలోచించి , దూతకుయోగ్యమయిన శిక్ష , విధింపుము. అని,విభీషణుండు, రావణునకుం జెప్పెను. అని, తాత్పర్యము.

విభీషణవచశ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః
రోషేణ మహతా విష్టో వాక్యముత్తర మబ్రవీత్. ౧౦

టీక॥రాక్షసేశ్వరః= రాక్షసులకుఁబ్రభుండగు;రావణః=రావణుండు; విభీషణవచః = విభీషణునిమాటను;శ్రుత్వా=విని;మహతా = అధికమయిన; రోషేణ=కోపముచేత;ఆవిష్టః= వ్యాపింపఁబడినవాఁడై;ఉత్తరం=బదులయిన;వాక్యం=మాటను;అబ్రవీత్ = చెప్పెను.

రాక్షసనాయకుండగు రావణుండు,విభీషణుండుచెప్పినమాటనువిని, మ

హాకోపంబునొంది, ఇట్లని, బలుకులు చెప్పెను. అని, తాత్పర్యము.

న పాపానాం వధే పాపం విద్యతే శత్రుసూదన
తస్మాదేనం వధిష్యామి వానరం పాపచారిణమ్. ౧౧

టీక॥శత్రుసూదన= శత్రువులంజంపునట్టివిభీషణుఁడా! పాపానాం= పాపముసేయువారలయొక్క; వధే= చంపుటయందు; పాపం= పాపము; నవిద్యతే= లేదు. తస్మాత్ =అందువలన; పాపచారిణం= పాపకార్యంబులనాచరించునట్టి; ఏనం= ఈ; వానరం=కోఁతిని; వధిష్యామి=చంపెదను.

శత్రువులంజంపునట్టి విభీషణుఁడా! పాపిష్ఠులంజంపుటచే, నెంతమాత్రము పాపంబుగలుగదు; అందువలనఁ, బాపిష్ఠుండగునీవానరుంజంపెదను. అని, రావణుండువిభీషణునకుంజెప్పెదను.

అని, తాత్పర్యము.

అధర్మమూలం బహురోషయుక్త
మనార్యజుష్టం వచనం నిశమ్య
ఉవాచ వాక్యం పరమార్థతత్త్వం
విభీషణో బుద్ధిమతాం వరిష్ఠః. ౧౨

టీక॥బుద్ధిమతాం= అధికమయినబుద్ధిగలవారలలో; వరిష్ఠః= శ్రేష్ఠుండగు; విభీషణః=విభీషణుఁడు; అధర్మమూలం= అధర్మమునకు మూలమయినదియును; బహురోషయుక్తం= అధికమయినకోపముతోఁగూడినదియును ; అనార్యజుష్టం=దుష్టులచే సేవింపఁబడినదియునగు; వచనం=మాటను; నిశమ్య= విని; పరమార్థతత్త్వం= శ్రేష్ఠమయినకార్యనిశ్చయముగల; వాక్యం=మాటను; ఉవాచ=చెప్పెను.

బుద్ధిమంతులలో మొదటివాఁడగు విభీషణుండు రావణుండు బహుకోపంబునంజెప్పిన, యధర్మిష్ఠంబునుదుష్టులకుమాత్రమెదగినదియునగు మాటనువిని, పరమధర్మంబుగలుగునట్లు, కార్యనిశ్చయంబు సేయువాఁడై, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రసీద లంకేశ్వర రాక్షసేంద్ర

ధర్మార్థయుక్తం వచనం శృణుష్వ

టీక॥ లంకేశ్వర= లంకకుఁబ్రభుండవగు; రాక్షసేంద్ర=రాక్షసులకుఁబ్రభుండవయినరావణుఁడా! ప్రసీద = ప్రసన్నుండవగుము. ధర్మార్థయుక్తం=ధర్మముతోను అర్థముతోనుం గూడిన; వచనం=మాటను;శృణుష్వ= వినుము.

లంకాధీశ్వరుండవు, రాక్షసనాయకుండవునగురావణుఁడా! కోపంబువిడువుము; ధర్మార్థంబులరెంటినిగలిగించుమాటంజెప్పెదను; వినుము.

అని, తాత్పర్యము.

దూతా నవధ్యాః సమయేషు రాజన్
సర్వేషు సర్వత్ర వదంతి సంతః. ౧౩

టీక॥ రాజన్= రాక్షసరాజుండవగురావణుఁడా! సంతః= పెద్దలు; సర్వేషు = సమస్తములయిన; సమయేషు=కాలములందును; సర్వత్ర= అంతటను; దూతాన్= రాయబారులను ; అవధ్యాన్=చంపఁదగనివారలనుగా ; వదంతి=చెప్పుచున్నారు.

రాక్షసరాజుండవగురావణుఁడా! ఏకాలమునందును ఏస్థలములందును , గాని, దూతలంజంపఁగూడదు; అని, పెద్దలుచెప్పెదరు. అని, తాత్పర్యము.

అసంశయం శత్రు రయం ప్రవృద్ధః
కృతంహ్య నేనా ప్రియమప్రమేయమ్
న దూతవధ్యాం ప్రవదంతి సంతో
దూతస్య దృష్టా బహవో హి దండాః. ౧౪

టీక॥అయం= ఈవానరుఁడు; అసంశయం=సందేహములేనట్లుగా; ప్రవృద్ధః = మిక్కిలియువృద్ధిఁబొందిన; శత్రుః=శత్రువు. అనేన=ఇతనిచేత; అప్రమేయం = కొలఁతపెట్టరాని; అప్రియం=అనిష్టము; కృతంహి = చేయఁబడినదిగదా!సంతః= పెద్దలు; దూతవధ్యాం=దూతయొక్కచంపుటను;నప్రవదంతి=చెప్పరు. దూతస్య=దూతకు; బహవః=అనేకములయిన;దండాః= శి

క్షులు; దృష్టాహి = చూడఁబడినవిగదా! ఇతండు, అక్షకుమారాదులంజఁపుటచే, నెంతమాత్రమెకాఁడు; గొప్పశత్రుండునగును; ఇందు, సంశయములేదు; అయినను, పెద్దలు, దూతంజంపఁగూడదనిచెప్పెదరు; అయితే, దూతకు, పెక్కు - తెఱంగులశిక్షలు, చెప్పఁబడియున్నవి; అందేదైననిప్పుడుప్రయోగింపవచ్చును. అని, తాత్పర్యము.

వైరూప్య మంగేషు కశాభిఘాతో
మౌణ్డ్యం తథా లక్షణసన్నిపాతః
ఏతాన్హి దూతే ప్రవదంతి దండాన్
వధస్తుదూతస్య న నశ్శ్రుతోపి. ౧౫

టీక॥ అంగేషు = అవయవములందు; వైరూప్యం = వికృతియును; కశాభిఘాతః = చబుకుతోఁగొట్టుటయు; మౌండ్యం = ముండనమును; తథా = అట్లు; లక్షణసన్నిపాతః = ముద్రవేయుటయు; ఏతాన్ = వీనిని; దూతే = దూతయందు; దండాన్ = శిక్షలనుగా; ప్రవదంతిహి = చెప్పుచున్నారుగదా! దూతస్య = రాయబారియొక్క; వధస్తు = చంపుటమాత్రము; నః = మనకు; శ్రుతోపి = వినఁబడినదియు; న = కాదు.

అంగవికృతిగావించుటయును, జబుకుతోఁగొట్టుటయును, దలవెంట్రుకలన్నియుగొఱిగి ముండనము గావించుటయు, ముద్రవేయుటయు, నివిదూతకుందగినదండంబులని, పెద్దలుచెప్పెదరు; దూతఁజంపుటను, మాత్రము, మనమెప్పుడునువిననేలేదు. అని, తాత్పర్యము.

కథంచ ధర్మార్థవినీతబుద్ధిః
పరావరప్రత్యయనిశ్చితార్థః
భవద్విధః కోపవశే హి తిష్ఠే
త్కోపన్నియచ్ఛంతిహి సత్త్వవంతః. ౧౬

టీక॥ ధర్మార్థవినీతబుద్ధిః = ధర్మమునందును అర్థమునందును శిక్షింపఁబడినబుద్ధికలవాఁడును; పరావరప్రత్యయనిశ్చితార్థః = మంచిచెడ్డల

యొక్క-జ్ఞానముచేనిశ్చయింపఁబడినకార్యముగలవాఁడునగు ; భవద్విధశ్చ=నీవంటివాఁడును; కోపవశే= కోపముయొక్క-యధీనతయందు, (హి''అనునదిపాదపూరణార్థము); కథం = ఎట్లు; తిష్ఠేత్ = ఉండును ? సత్త్వవంతః= అధికమయినధైర్యముగలవారలు; కోపం—కోపమును; నియచ్ఛంతిహి—అణఁచుచున్నారుగదా!

ధర్మార్థంబులుచక్క-ఁగాఁ దెలిసినవాఁడునుమంచిశాస్త్రములు తెలిసికార్యంబులు సేయువాఁడునగునీయట్టిపండితుండును;కోపమునకెట్లు, వశ్యుండగును? ధైర్యశాలులగువారలు, కోపంబుననణంచుకొందురుగదా!అని, తాత్పర్యము.

న ధర్మవాదే నచ లోకవృత్తే
న శాస్త్రబుద్ధిగ్రహణేషుచాపి
విద్యేత కశ్చిత్తవ వీర తుల్య
స్త్వంహ్యుత్తమ స్సర్వ సురాసురాణామ్. ౧౭

టీక॥ వీర=పరాక్రమశాలివగురావణుఁడా! తవ=నీకు; తుల్యః= సమానుఁడు;కశ్చిత్—ఒకానొకఁడును; ధర్మవాదే=ధర్మముఁజెప్పుటయందు; నవిద్యేత=ఉండఁడు.లోకవృత్తేచ=లోకాచారమునందును; న=ఉండఁడు. శాస్త్రబుద్ధిగ్రహణేషుచాపి = శాస్త్రములయందునుబుద్ధియందును తెలిసికొనుటయందును; న=ఉండడు. త్వం= నీవు ; సర్వసురాసురాణాం = (పంచమ్యర్థమందుషష్ఠి)సమస్తదేవాసురులకన్నను; ఉత్తమోహి=శ్రేష్ఠుండవుగదా!

పరాక్రమశాలివగురావణుఁడా ! ధర్మవాదమునందుఁగాని లౌకికాచారమునందుఁగాని,శాస్త్రములందుఁగాని, బుద్ధియందుఁగాని,యుక్తమగుదానిగ్రహించుటయందుఁగాని, నీకుసమానుండెవ్వఁడునులేఁడు ; సమస్తదేవతలకన్నను, సమస్తాసురులకన్నను, నీవేయుత్తముండవు. అని, తాత్పర్యము.

నచాప్యస్య కపేః ఘాతే కంచి త్పశ్యా మ్యహం గుణమ్

టీక॥ అస్య=ఈ; కపేః=వానరునియొక్క-, ఘాతే=చంపుటయందు ; కం

చిత్=ఒకానొక; గుణంచాపి = గుణమునుంగూడ ; నపశ్యామి= చూడకున్నాను.

శాస్త్రవిరోధంబుమాత్రమెకాదు; ఇతనింజంపుటచే, మనకేమియులాభంబును, లేదు. అని, తాత్పర్యము.

తేష్వయం పాత్యతాం దండో యైరయం ప్రేషితః కపిః. ౧౮

టీక॥అయం=ఈ;కపిః = వానరుండు;యైః=ఎవ్వరిచేత;ప్రేషితః = పంపఁబడినవాఁడో; తేషు=వారలయందు; అయం=ఈ;దండః= వధరూపమయిన శిక్ష;పాత్యతాం=వేయఁబడుఁగాక.

ఈవానరునిచ్చటికెవ్వరు పంపినారో,వారలనువధింపుము.
అని, తాత్పర్యము.

సాధుర్వా యదివా సాధుః పరైరేష సమర్పితః
బ్రువన్ పరార్థం పరవాన్న దూతో వధ మర్హతి. ౧౯

టీక॥సాధుర్వా = మంచివాఁడైనను;అసాధుర్వా = చెడ్డవాఁడైనను;పరైః=శత్రువులచేత;సమర్పితః=పంపఁబడినవాఁడును;పరార్థం=ఇతరులప్రయోజనమును;బ్రువన్ = చెప్పుచున్నవాఁడును ; పరవాన్=పరాధీనుండునగు;ఏషః=ఈ;దూతః=దూత; వధం=చంపుటను;నార్హతి=పొందఁదగఁడు.

ఇతండు,మంచివాఁడగుఁగాక; లేక,చెడ్డవాఁడైననగుఁగాక; పరులుపంపఁగావచ్చినాఁడు;పరాధీనుండుకావున, వారలుచెప్పుమన్నమాటలుంజెప్పుచున్నాఁడు;ఇదియుతనితప్పుగాదు; కావున,నితనిజంపుటయుక్తముకాదు.
అని, తాత్పర్యము.

అపిచాస్మిన్ హతే రాజ న్నాన్యం పశ్యామి ఖేచరమ్
ఇహ యః పున రాగచ్ఛే త్పరం పారం మహోదధేః. ౨౦

టీక॥రాజన్= రాక్షసరాజుండవగు రావణుఁడా!అస్మిన్ = ఈవానరుఁడు;హతే=చంపఁబడఁగా;యః = ఎవ్వఁడు;పునః=మరల;ఇహ=ఇచ్చటికి;




మహోదధేః = మహాసముద్రముయొక్క; పరం=ఈవలి; పారం=గట్టును; ఆగచ్ఛేత్=పొందునో; తం(అధ్యాహృతము)=అట్టి; ఖేచరం = ఆకాశమునందిరుగునట్టి; అన్యం=మఱియొక్కనిని; నపశ్యామి=చూడను.

రాక్షసరాజుండవగు రావణుఁడా! ఈతండుచంపఁబడినపిమ్మట, ఈమహాసముద్రంబు దాఁటియిచ్చటికి రాఁగలఖేచరుండు, మఱియొక్కండుండునట్లు, నాకుఁదోఁచలేదు. అని, తాత్పర్యము.

తస్మా న్నాస్య వధే యత్నః కార్యః పరపురంజయ

టీక॥ పరపురంజయ=శత్రుపట్టణంబులను జయించునట్టిరావణుఁడా! తస్మాత్=అందువలన; అస్య= ఈహనుమంతునియొక్క; వధే = చంపుటయందు; యత్నః=ప్రయత్నము; నకార్యః=చేయఁదగినది కాదు.

శత్రువులపట్టణంబులను జయించునట్టిరావణుఁడా! అట్లుకావున, నీవితనిం జంపుటకుఁ బ్రయత్నంబు సేయవలదు. అని, తాత్పర్యము.

భవాన్ సేంద్రేషు దేవేషు యత్నమాస్థాతు మర్హతి. ౨౧

టీక॥ భవాన్=నీవు; సేంద్రేషు = ఇంద్రునితోఁగూడిన; దేవేషు= దేవతలయందు; యత్నం=ప్రయత్నమును; ఆస్థాతుం=పొందుటకు; అర్హతి = తగుదువు.

దేవేంద్రునితోఁగూడ, దేవతలెదిరించివచ్చినప్పుడు, నీవువారలనువధింపందగుదువు, కాని, నీకుదూతయగునీవానరుం జంపుటయుక్తముకాదు.

అని, తాత్పర్యము.

అస్మి న్వినష్టే నహి దూత మన్యం
పశ్యామి యస్తౌ నరరాజపుత్రౌ
యుద్ధాయ యుద్ధప్రియ దుర్వినీతా
వుద్యోజయే ద్దీర్ఘపథావరుద్ధౌ. ౨౨

టీక॥ యుద్ధప్రియ=యుద్ధమెప్రియముగాఁగలరావణుఁడా! అస్మిన్ = ఈ




వానరుఁడు; వినష్టే=నశింపఁగా; యౌ= ఎవ్వఁడు; దర్పితౌ=గర్వితులును; దీర్ఘపథావరుద్ధౌ= దీర్ఘమయినమార్గముచేనడ్డగింపఁబడినవారునగు; తౌ = ఆ; నరరాజపుత్రౌ= మనుష్యులకుఁ బ్రభువై నదశరథునికొడుకులయిన రామలక్ష్మణులను; యుద్ధాయ= యుద్ధముకొఱకు; ఉద్యోజయేత్ = ప్రయత్నించునట్లుచేయునో; తం=అట్టి; అన్యం = మఱియొకనిని; నపశ్యామి=చూడను.

యుద్ధప్రియుండవగు రావణుఁడా! ఇతండు, చంపఁబడు నేని, గర్వితులును బహుదూరస్థులునగు, రామలక్ష్మణులను, ఇచ్చటికివచ్చి, నీతోఁబోరునట్లు సేయంజాలునట్టివాఁడు, మఱియొక్కండుండునట్లు, నాకుఁదోఁచలేదు. అని, తాత్పర్యము.

పరాక్రమోత్సాహమనస్వినాంచ
సురాసురాణామపి దుర్జయేన
త్వయా మనోనందన నైరృతానాం
యుద్ధాయతి ర్నాశయితుం న యుక్తా. ౨౩

టీక॥ నైరృతానాం=రాక్షసులయొక్క; మనోనందన= మనసునుసంతోషింపఁజేయునట్టిరావణుఁడా! పరాక్రమోత్సాహమనస్వినాంచ=పరాక్రమమునుత్సాహమును ధైర్యమునుగల; సురాసురాణామపి=దేవతలకునసురులకునైనను; దుర్జయేన= జయింపసలవిగానివాఁడవగు; త్వయా = నీచేత; యుద్ధాయతిః= యుద్ధమురాక; నాశయితుం= నశింపఁజేయుటకు; నయుక్తా= తగినది కాదు.

రాక్షసులకుసంతోషంబుగల్గించునట్టిరావణుఁడా! పరాక్రమంబునుత్సాహంబును ధైర్యంబునుగలదేవాసురులైననునిన్నుఁజెనకంజాలరు; అట్టినీవు, యుద్ధంబురానుండఁగా, దానింబోఁగొట్టుకొనఁగూడదు. అని, తాత్పర్యము.

హితాశ్చ శూరాశ్చ సమాహితాశ్చ
కులేషు జాతాశ్చ మహాగుణేషు
మనస్వినశ్శస్త్రభృతాం వరిష్ఠాః

కోట్యగ్రశస్తే సుభృతాశ్చ యోధాః. ౨౪

టీక॥ తే—నీకు; హితాశ్చ= మేలు సేయువారలును; శూరాశ్చ= యుద్ధమునందుభయములేనివారలును; సమాహితాశ్చ=ఎచ్చరికగలవారలును; మహాగుణేషు=అధికమయిన గుణములుగల; కులేషు=వంశములందు; జాతాశ్చ=పుట్టినవారలును; మనస్వినః=మంచిమనస్సుగలవారలును; శస్త్రభృతాం= ఆయుధముదాల్చువారలలోపల; వరిష్ఠాః=ఉత్తములును; సుభృతాశ్చ= చక్కఁగాఁ బోషింపఁబడినవారలునగు; యోధాః=భటులు; కోట్యగ్రశః— కోటులుకోటులుగా; వశేఽంతే (అధ్యాహృతము)=ఉన్నారు.

నీకు మేలు సేయువారలును, శూరులును, ఎచ్చరికగలవారలును, మహాగుణంబులుగలవంశంబులంబుట్టినవారలును, మంచిమనస్సుగలవారలును, ఆయుధధారులలో నుత్తములును జక్కఁగాఁ బోషింపఁబడినవారలునగుభటులు, నీయొద్దఁ, గోటులుకోటులుగానున్నారు. అని, తాత్పర్యము.

తదేకదేశేన బలస్య తావ
త్కేచి త్తవా దేశకృతోభియాంతు
తౌ రాజపుత్రౌ వినిగృహ్య మూఢౌ
పరేషు తే భావయితుం ప్రభావమ్. ౨౫

టీక॥ తత్=అందువలన; తవ=నీయొక్క; ఆదేశకృతః=ఆజ్ఞను జేయువారలగు; తే=ప్రసిద్ధులయిన; కేచిత్ తావత్—కొందఱుమాత్రము; మూఢౌ=తెలివిలేని; తౌ=ఆ; రాజపుత్రౌ= రాచకొమరులును; వినిగృహ్య — నిగ్రహించి; పరేషు=శత్రువులయందు; ప్రభావం=మహిమను; భావయితుం=తోఁపింపఁజేయుటకు; బలస్య— సైన్యముయొక్క; ఏకదేశేన(సహ)= ఒకభాగముతోఁగూడ; అభియాంతు— యుద్ధమునకుఁబోవుదురుగాక.

అందువలన, నీయాజ్ఞచేఁ గొందఱుశూరులు, కొంతసైన్యముం గూడి, పోయి, మూఢులగు, నారాచకొమారులయిన రామలక్ష్మణులను నిగ్రహిం

చి, శత్రువులకుఁ, దమప్రభావంబుఁబూపుదురుగాక. అని, విభీషణుండు, రావణునకుఁజెప్పెను. అని, తాత్పర్యము.

నిశాచరాణా మధిపో నుజస్య
విభీషణస్యో త్తమవాక్య మిష్టమ్
జగ్రాహ బుద్ధ్యా సురలోక శత్రు
ర్మహాబలో రాక్షసరాజ ముఖ్యః. ౨౬

టీక॥ నిశాచరాణాం = రాక్షసులకు; అధిపః=ప్రభుండును; సురలోకశత్రుః= దేవసమూహమునకుశత్రుఁడను; మహాబలః=అధికమయినబలముగలవాఁడును; రాక్షసరాజముఖ్యః=రాక్షసరాజులలో నుత్తముండునగురావణుండు; అనుజస్య=తమ్ముండైన; విభీషణస్య=విభీషణునియొక్క- ; ఇష్టం= ప్రియమగు; ఉత్తమవాక్యం=శ్రేష్ఠమయినమాటను; బుద్ధ్యా=బుద్ధిచేత; జగ్రాహ=గ్రహించెను.

రాక్షసులకుఁబ్రభుండును; దేవలకుశత్రుండును, మహాబలుండును రాక్షసరాజోత్తముండునగురావణుండు, విభీషణుండుచెప్పిన, ప్రియంబు నుత్తమంబునగు మాటను బుద్ధితో నాలోచించి, యంగీకరించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ద్విపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండద్విపంచాశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

## త్రిపంచాశస్సర్గప్రారంభః.

తస్య తద్వచనం శ్రుత్వా దశగ్రీవో మహాబలః
దేశకాలహితం వాక్యం భ్రాతు రుత్తర మబ్రవీత్. ౧

మహాబలః = అధికమయినబలము గల; దశగ్రీవః = పదికంఠములుగలరావణుఁడు; తస్య = ఆ; భ్రాతుః = తమ్ముండగువిభీషణుని యొక్క; తత్ = ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; దేశకాలహితం = దేశమునకును కాలమునకును సరియయిన ; ఉత్తరం = బదులయిన; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పెను.

మహాబలుండగు రావణుండు, తమ్ముండగు విభీషణుని మాటను విని, దేశకాలంబులకుఁదగునట్లు, ఈ ప్రకారముగా, బదులు చెప్పెను. అని, తాత్పర్యము.

సమ్యగుక్తంహి భవతా దూతవధ్యా విగర్హితా
అవశ్యంతు వధా దన్యః క్రియతా మస్య నిగ్రహః. ౨

టీక॥ భవతా = నీచేత ; దూతవధ్యా = దూతయొక్క చంపుట; విగర్హితా = నిందింపఁబడినది. ఇతి (అధ్యాహృతము) = అని; సమ్యక్ = చక్కఁగా; ఉక్తంహి = చెప్పఁబడినదిగదా ! అవశ్యంతు = అవశ్యముగానే- అస్య = వీనికి; వధాత్ = చంపుటకన్న; అన్యః = ఇతరమయిన, నిగ్రహః = దండము; క్రియతాం = చేయఁబడుఁగాక.

నీవు చక్కఁగాఁజెప్పినావు ; దూతంజంపుటనింద్యమగుటవాస్తవమే; ఇతనికవశ్యము, మఱియొకశిక్ష , విధింపవలయును. అని, తాత్పర్యము.

కపీనాం కిల లాంగూల మిష్టం భవతి భూషణమ్
త దస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్ఛతు. ౩

టీక॥ కపీనాం = కోఁతులకు ; లాంగూలం = తోఁక; ఇష్టం = ప్రియమైన; భూ

షణం=అలంకారము; భవతికిల=అగుచున్నదిగదా! అస్య=ఇతనియొక్క; తత్=ఆతోఁక; దీప్యతాం=దహింపఁబడుఁగాక. దగ్ధేన=దహింపఁబడిన; తేన=ఆతోఁకతో; గచ్ఛతు=పోవుఁగాక.

కోఁతులకుఁ, దోఁక, ప్రియమయిన యలంకారముగదా! ఇతనితోఁకను దహింపుఁడు; ఇతఁడు, దగ్ధమయిన తోఁకతోఁబోవుఁగాక. అని, తాత్పర్యము.

తతః పశ్య న్త్విమం దీన మఙ్గవైరూప్యకర్శితమ్
సమిత్రజ్ఞాతయ స్సర్వే బాన్ధవా స్ససుహృజ్జనాః. ౪

టీక॥ తతః=అటుపిమ్మట; సమిత్రజ్ఞాతయః= ఆప్తులతోను దాయాదులతోను గూడినవారలును; ససుహృజ్జనాః=సమసుఖదుఃఖులగువారలతోఁగూడినవారలునగు; బాన్ధవాః=బంధువులు; సర్వే= అందఱును; అఙ్గవైరూప్యకర్శితం=అంగవికారముచేఁగృశింపజేయఁబడినవాఁడును; దీనం=దుఃఖితుండునగు; ఇమం=ఇతని; పశ్యన్తు=చూతురుగాక.

అంత, నితని, యాప్తులును దాయాదులును స్నేహితులును బాంధవులునందఱును, అంగవికృతినొందిపరమదుఃఖితుండైయున్నయితనిం, జూతురుగాక. అని, రావణుండువిభీషణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఆజ్ఞాపయ ద్రాక్షసేన్ద్రః పురం సర్వం సచత్వరమ్
లాఙ్గూలేన ప్రదీప్తేన రక్షోభిః పరిణీయతామ్. ౫

టీక॥ రాక్షసేన్ద్రః= రాక్షసులకుఁ బ్రభుండగు రావణుండు; ప్రదీప్తేన=దహింపఁబడిన; లాఙ్గూలేన= తోఁకతో; యుక్తః(అధ్యాహృతము) = గూడిన; హనుమాన్(అధ్యాహృతము)= హనుమంతుఁడు; రక్షోభిః=రాక్షసులచేత; సచత్వరం= చతుష్పథములతోఁగూడిన; పురం=పట్టణమును; సర్వం=అంతయును; పరిణీయతాం=త్రిప్పఁబడుఁగాక. ఇతి(అధ్యాహృతము) = అని; ఆజ్ఞాపయత్=ఆనతిచ్చెను.

రాక్షసేశ్వరుండగు రావణుండు, "ఈహనుమంతుని తోఁకంగాల్చి, అది మండుచుండఁగా, నితనిఁ, జతుష్పథంబు

లందునుబట్టణంబునందంతటయుఁ,ద్రిప్పుఁడు." అని,యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసాః కోపకర్శితాః
వేష్టయంతిస్మ లాంగూలం జీర్ణైః కార్పాసకైః పటైః. ౬

టీక॥రాక్షసాః=రాక్షసులు ; తస్య=ఆరావణుని;తత్=ఆ ; వచనం=మాటను;శ్రుత్వా=విని ; కోపకర్శితాః=కోపముచేఁగృశింపఁజేయఁబడినవారలై;జీర్ణైః=చినిఁగిన ; కార్పాసకైః=ప్రత్తితోఁజేయఁబడిన;పటైః=వస్త్రములచేత;లాంగూలం= తోఁకను; వేష్టయంతిస్మ=చుట్టిరి.

రాక్షసులు,రావణునాజ్ఞనువిని,మహాకోపంబునొంది , చినిగినగుడ్డపేలికలతో,హనుమంతునితోఁకంజుట్టిరి.

అని, తాత్పర్యము.

సంవేష్ట్యమానే లాంగూలే వ్యవర్ధత మహాకపిః
శుష్క మింధన మాసాద్య వనేష్వివ హుతాశనః. ౭

టీక॥లాంగూలే= తోఁక;సంవేష్ట్యమానే=చుట్టఁబడుచుండఁగా; మహాకపిః= పెద్దకోఁతియగుహనుమంతుఁడు; హుతాశనః= అగ్ని;వనేషు=అడవులయందు;శుష్కం = ఎండిన;ఇంధనం=కొయ్యను;ఆసాద్యేవ= పొందివలె;వ్యవర్ధత=వృద్ధిఁబొందెను.

అట్లువారలుతనతోఁకకుగుడ్డపేలికలంజుట్టుటనుజూచి, హనుమంతుండు, అడవియందెండినకట్టెలకుఁదగులుకొనినయగ్నిచూత్రుండుంబోలె, వృద్ధిఁబొందెను-అని,తాత్పర్యము-

తైలేన పరిషిచ్యాథ తేఽగ్నిం తత్రాభ్యపాతయన్

టీక॥అథ=అటుపిమ్మట; తే=ఆరాక్షసులు;తైలేన=నూనెతో; పరిషిచ్య=తడిపి!తత్ర=ఆతోఁకయందు; అగ్నిం=నిప్పును;అభ్యపాతయన్=వేసిరి.

అంత,నారాక్షసులు, గుడ్డపేలికలుచుట్టినతోఁకను నూనెతోఁదడిపి, నిప్పంటించిరి. అని,తాత్పర్యము.

లాంగూలేన ప్రదీప్తేన రాక్షసాం స్తానపాతయత్. ౮
రోషామర్షపరీతాత్మా బాలసూర్యసమాననః

టీక॥ సః (అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు; రోషామర్షపరీతాత్మా = ("రోషము, అమర్షము" అనునవి రెండును సమానార్థకములయినను, ఆధిక్యమును దెలుపుటకై ప్రయోగింపఁబడినవి) అధికమయినకోపముచే వ్యాపింపఁబడిన మనసుగలవాఁడై; బాలసూర్యసమాననః = లేఁతసూర్యునితో సమానమయిన ముఖముగలవాఁడై; ప్రదీప్తేన = మండుచున్న; లాంగూలేన = తోఁకచేత; తాన్ = ఆ; రాక్షసాన్ = రాక్షసులను; అపాతయత్ = పడఁద్రోసెను.

ఆహనుమంతుఁడు, మహాకోపంబున, ముఖం బెఱ్ఱఁదనంబునొంది, బాలసూర్యునిపగిదిఁదోఁప, మండుచున్న తోఁకను విసరివైచి, యారాక్షసులసమూహం, బడఁద్రోసెను.

అని, తాత్పర్యము.

లాంగూలం సంప్రదీప్తం తు ద్రష్టుం తస్య హనూమతః. ౯
సహస్త్రీబాలవృద్ధాశ్చ జగ్ముః ప్రీతా నిశాచరాః

టీక॥ నిశాచరాః = రాక్షసులు; ప్రీతాః = సంతసించినవారలై; సహస్త్రీబాలవృద్ధాశ్చ = స్త్రీలతోను బాలురతోను వృద్ధులతోనుంగూడినవారలై; తస్య = ఆ; హనూమతః = హనుమంతుని యొక్క; సంప్రదీప్తం = మండుచున్న; లాంగూలం = తోఁకను; ద్రష్టుం = చూచుటకు; జగ్ముః = పోయిరి.

అంత, లంకయందలి రాక్షసులు, హనుమంతునివాలంబునకు నిప్పదరికొల్పఁబడుట విని, సంతోషంబునొంది, స్త్రీలతోను బాలురతోను వృద్ధులతోనుంగూడ, దానింజూడఁబోయిరి.

అని, తాత్పర్యము.

స భూయస్సంగతైః క్రూరై రాక్షసై ర్హరిసత్తమః. ౧౦
నిబద్ధః కృతవాన్ వీర స్తత్కాలసదృశీం మతిమ్

టీక॥ వీరః = పరాక్రమశాలియగు; సః = ఆ; హరిసత్తమః = వానరోత్తముండయిన హనుమంతుఁడు; భూయః = మఱల; సంగతైః = కూడిన;

మూర్ఖైః=కఠినులగు; రాక్షసైః= రాక్షసులచేత; నిబద్ధః=కట్టంబడినవాఁడనై; తత్కాలసదృశీం=ఆసమయమునకుసమానమయిన; మతిం=బుద్ధిని; కృతవాన్=చేసినాఁడను.

పరాక్రమవంతుండును వానరోత్తముండునగు, నాహనుమంతుండు, క్రూరులగు రాక్షసులందఱుంజేరి, మఱలం నన్నుబంధింపఁగా, నాకాలంబునకుం దగునట్లు, ఈప్రకారంబున, నాలోచించెను. అని, తాత్పర్యము.

కామం ఖలు న మే శక్తా నిబద్ధస్యాపి రాక్షసాః. ౧౧
ఛిత్త్వా పాశాన్ సముత్పత్య హన్యామహమిమాన్ పునః

టీక॥ రాక్షసాః=రాక్షసులు; నిబద్ధస్యాపి = బంధింపఁబడినవాఁడనైనను; మే=నాయొక్క; నిగ్రహే (అభ్యాహృతము)=నిగ్రహించుటయందు; శక్తాః=సమర్థులు; నకామం ఖలు = కానేకారుగదా! పాశాన్=త్రాళ్లను; ఛిత్త్వా=తెంచుకొని; పునః = మఱల; సముత్పత్య=ఎగిరి; అహం ఇమాన్= ఈరాక్షసులను; హన్యాం=చంపుదును.

నేను బద్ధుండనైనను, రాక్షసులెంతమాత్రమును నన్ను నిగ్రహింపఁజాలరు; ఈపాశంబులం ద్రెంచుకొని, యుద్ధమించి, యెగిరి, రాక్షసులనందఱంజంపుదును. అని, తాత్పర్యము.

యది భర్తుర్హితార్థాయ చరంతం భర్తృశాసనాత్. ౧౨
బధ్నంత్యేతే దురాత్మానో న తు మే నిష్కృతిః కృతా

టీక॥ ఏతే=ఈ; దురాత్మానః=దుష్టబుద్ధిగలరాక్షసులు; భర్తుః= ప్రభువైనరామునియొక్క; హితార్థాయ= మేలైనప్రయోజనముకొఱకు; చరంతం=తిరుగుచున్న; మాం (అభ్యాహృతము)=నన్ను; భర్తృశాసనాత్ = ప్రభువైన రావణునాజ్ఞవలన; బధ్నంతియది=బంధింతురేని; మే = నాకు; నిష్కృతిః=ప్రతీకారము; నతుకృతా= చేయఁబడనేలేదు.

దురాత్ములగునీరాక్షసులు, రామహితంబుకొఱకు, సంచరించుచున్ననన్ను, రావణునాజ్ఞచే బంధింతురేని, దీనివలననీరలునాకెంతమాత్రము ప్రతీకా

రముచేసినవారలు, కాఁజాలరు; ఇదినన్నె మియుఁజేయంజాలదు-

అని, తాత్పర్యము.

సర్వేషామేవ పర్యాప్తో రాక్షసానా మహం యుధి. ౧౩

టీక॥ అహం=నేను; యుధి=యుద్ధమునందు; రాక్షసానాం = రాక్షసులకు; సర్వేషామేవ=అందఱకునే; పర్యాప్తః= చాలినవాఁడను.

యుద్ధంబున, రాక్షసులకందఱకు నేనొక్కఁడనె, చాలుదును.

అని, తాత్పర్యము.

కింతు రామస్య ప్రీత్యర్థం విషహిష్యేహ మీదృశమ్
లంకా చారయితవ్యా వై పునరేవ భవేదితి. ౧౪

టీక॥ కింతు= ఇఁకనేమన్నను; అహం=నేను; రామస్య= రామునియొక్క; ప్రీత్యర్థం; సంతోషముకొఱకును; పునరేవ=మఱలనే; లంకా= లంకాపట్టణము; చారయితవ్యావై= సంచరింపఁబడవలసినదియు; భవేత్ = అగును. ఇతి=అనియును; ఈదృశం= ఇట్టియవమానమును; విషహిష్యే = సహించెదను.

అయినను, రాముండు! తానే, రావణుంజంపెదనని ప్రతిజ్ఞ చేసినాఁడు, కావున, నట్టిప్రతిజ్ఞాసిద్ధివలనం గలుగు సంతోషము, రామునకుం గలుగుటకును, వీరలునన్నులంకయంతయుఁద్రిప్పెదరు, కావున, మఱలలంకయంతయుం జూడవచ్చుననియు, నేనిట్టియవమానంబునుసహించియున్నాను, గాని, వేఱుగాదు. అని, తాత్పర్యము.

రాత్రౌ నహి సుదృష్టా మే దుర్గకర్మవిధానతః
అవశ్యమేవ ద్రష్టవ్యా మయా లంకా నిశాక్షయే. ౧౫

టీక॥ రాత్రౌ = రాత్రియందు; మే=నాకు; లంకా(అధ్యాహృతము)= లంక; దుర్గకర్మవిధానతః= పట్టణమునురక్షించుట యొక్క చేయుటతో; సుదృష్టా=చక్కఁగాఁజూడఁబడినది; నహి=కాదుగదా! అవశ్యమేవ=అవశ్య

ముగానే; మయా = నాచేత; నిశాక్షయే=ప్రాతఃకాలమునందు;లంకాం = లంకాపట్టణము;ద్రష్టవ్యా= చూడఁబడవలసినది.

నేను, రాత్రియందు , లంకఁజూచినాను గావున నగరరక్షణసాధనవిశేషములంజక్కఁగాఁజూడలేదుకాఁబట్టి ప్రాతఃకాలంబున , నవశ్యంబుగలంకంజూడవలయును.

అని, తాత్పర్యము.

కామం బద్ధస్య మే భూయః పుచ్ఛస్యోద్దీపనేనచ
పీడాం కుర్వంతు రక్షాంసి న మే స్తి మనస శ్శ్రమః. ౧౬

టీక॥రక్షాంసి=రాక్షసులు ; బద్ధస్య=కట్టఁబడిన;మే=నాకు; భూయః= ఇంకను;కామం= యథేష్టముగా;పుచ్ఛస్య=తోఁకయొక్క;ఉద్దీపనేనచ = దహించుటచేతను;పీడాం=పీడను;కుర్వంతు=చేయుదురుగాక.మే = నాయొక్క;మనసః=మనసునకు;శ్రమః= బాధ;నాస్తి=లేదు.

ఈరాక్షసులు,ఇప్పుడునన్ను బంధించియున్నారుగదా!ఇంకను, యథేష్టంబుగానాతోఁకనుంగాల్చి, నన్నుఁబీడింతురుగాక;ఇందువలన,నాకెంతమాత్రమునుబాధలేదు.అని,హనుమంతుండు, మనంబున,నాలోచించెను.

అని,తాత్పర్యము.

తత స్తే సంవృతాకారం సత్త్వవంతం మహాకపిమ్
పరిగృహ్య యయు ర్హృష్టా రాక్షసాః కపికుంజరమ్. ౧౭

టీక॥తతః=అటుపిమ్మట;తే = ఆ; రాక్షసాః=రాక్షసులు; సంవృతాకారం=గుప్తమయినయాకారముగలవాఁడును;సత్త్వవంతం= అధికమయినబలముగలవాఁడును;కపికుంజరం= వానరశ్రేష్ఠుండునగు; మహాకపిం=హనుమంతుని;పరిగృహ్య=తీసికొని; హృష్టాః= సంతోషించినవారలయి;యయుః=పోయిరి.

అంత, నారాక్షసులు, సంతుష్టులయి, తనయాకారమునుసంకోచపఱచుకొనియున్నవానరోత్తముండగు హనుమంతుందీసికొనిపోయిరి.

అని,తాత్పర్యము.

శంఖభేరీనినాదైస్తం ఘోషయంతస్స్వకర్మభిః
రాక్షసాః క్రూరకర్మాణ శ్చారయంతిస్మ తాం పురీమ్. ౧౮

టీక॥ క్రూరకర్మాణః = క్రూరములయిన కార్యములుగల; రాక్షసాః = రక్కసులు; శంఖభేరీనినాదైః = శంఖములయొక్కయు భేరులయొక్కయు ధ్వనుల చేతను; స్వకర్మభిః = తమ కార్యముల చేతను; ఘోషయంతః = ధ్వనింపఁజేయుచు; తాం = ఆ; పురీం = పట్టణమునందు; తం = ఆహనుమంతుని; చారయంతిస్మ = త్రిప్పిరిగదా!

క్రూరులగు నా రాక్షసులు, శంఖంబులూదుచు, భేరులు వాయించుచు, సింహనాదంబులు సేయుచు, భుజంబులు దట్టుచు, హనుమంతుని, లంక యంతయుం ద్రిప్పిరి. అని, తాత్పర్యము.

అన్వీయమానో రక్షోభి ర్యయౌ సుఖమరిందమః
హనుమాం శ్చారయామాస రాక్షసానాం మహాపురీమ్. ౧౯

టీక॥ అరిందమః = శత్రువులనడంగఁ ద్రొక్కునట్టి హనుమంతుండు; రక్షోభిః = రాక్షసుల చేత; అన్వీయమానః = వెంబడింపఁబడుచున్నవాఁడై; సుఖం = అనాయాసముగా; యయౌ = పోయెను. హనుమాన్ = హనుమంతుండు; రాక్షసానాం = రాక్షసులయొక్క; మహాపురీం = గొప్పపట్టణమయిన లంకను, చారయామాస = తిరిగెను.

శత్రువుల నడంగఁ ద్రొక్కఁజాలిన హనుమంతుండు, రాక్షసులు తన్ను వెంబడింప, సుఖంబున బోవుచు, నాలంకాపట్టణమంతయు సంచరించెను. అని, తాత్పర్యము.

తథా పశ్య ద్విమానాని విచిత్రాణి మహాకపిః
సంవృతాన్ భూమిభాగాంశ్చ సువిభక్తాంశ్చ చత్వరాన్. ౨౦

టీక॥ అథ = అటుపిమ్మట; మహాకపిః = పెద్దకోఁతియగు హనుమంతుండు; విచిత్రాణి = నానావిధములయిన; విమానాని = విమానములను; సంవృతాన్ = మూయఁబడిన; భూమిభాగాంశ్చ = భూప్రదేశములను; సువిభక్తాన్ =

స్త్రీబాలవృద్ధా నిర్జగ్ము స్తత్రతత్ర కుతూహలాత్. ౨౩
తం ప్రదీపితలాంగూలం హనుమంతం దిదృక్షవః

టీక॥ తత్రతత్ర=అచ్చటచ్చట; స్త్రీబాలవృద్ధాః=స్త్రీలును బాలురును వృద్ధులును; కుతూహలాత్ = కోరికవలన; ప్రదీపితలాంగూలం=దహింపఁబడిన తోఁకగల; తం=ఆ; హనుమంతం= హనుమంతుని; దిదృక్షవః = చూడఁగోరిన వారలయి; నిర్జగ్ముః=వెడలిరి.

అచ్చటచ్చట స్త్రీలును బాలురును వృద్ధులును, కౌతుకంబున, మండుచున్న తోఁకతోఁగూడిన హనుమంతుం జూచుటకై, ఇండ్లనుండి, వెడలిరి.

అని, తాత్పర్యము.

దీప్యమానే తత స్తస్య లాంగూలాగ్రే హనూమతః. ౨౪
రాక్షస్య స్తా విరూపాక్ష్య శ్శంసు ర్దేవ్యా స్తదప్రియమ్

టీక॥ తతః=అటుపిమ్మట; తస్య= ఆ; హనూమతః = హనుమంతునియొక్క; లాంగులాగ్రే=తోఁకకొన; దీప్యమానే= వెలిఁగింపఁబడుచుండఁగా; విరూపాక్ష్యః= వికృతములయినకండ్లుగల; తాః=ఆ; రాక్షస్యః= రాక్షసస్త్రీలు; తత్=ఆ; అప్రియం=దుఃఖమును, దేవ్యాః = సీతాదేవికి; శంసుః (శశంసుః)=చెప్పిరి.

అంత, హనుమంతునితోఁకకు రాక్షసులు నిప్పుముట్టించినపిమ్మట వికృతంబులగుకండ్లుగల యారాక్షసస్త్రీలు, ఆదుఃఖవార్తను, సీతాదేవికిం, జెప్పిరి.

అని, తాత్పర్యము.

య స్త్వయా కృతసంవాద స్సీతే తామ్రముఖః కపిః. ౨౫
లాంగూలేన ప్రదీప్తేన స ఏష పరిణీయతే

టీక॥ సీతే=సీతాదేవీ! యః=ఏ; తామ్రముఖః = ఎఱ్ఱనిముఖముగల; కపిః=వానరుఁడు; త్వయా=నీతో; కృతసంవాదః=చేయఁబడినమాటలాడుట గలవాఁడో; సః=అట్టి; ఏషః = ఈవానరుఁడు; ప్రదీప్తేన=మండిన; లాంగూలేన=తోఁకతో; పరిణీయతే= త్రిప్పఁబడుచున్నాఁడు.

సీతా! ఇంతకుముందునీతోనెవ్వండు,మాటలాడిపోయినాఁడో; ఇప్పుడు ఆవానరునితోఁకకునిప్పుముట్టించి, యతని, నూరంతయుఁద్రిప్పుచున్నారు. అని, రాక్షసస్త్రీలుసీతకుం,జెప్పిరి.
అని,తాత్పర్యము.

శ్రుత్వా తద్వచనం క్రూర మాత్మాపహరణోపమమ్. ౨౬
వైదేహీ శోకసంతప్తా హుతాశన ముపాగమత్

టీక॥ వైదేహీ=సీత; క్రూరం=భయంకరమయిన ; ఆత్మాపహరణోపమం=ప్రాణంబులయపహరించుటతోఁబోలికఁగల; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; శోకసంతప్తా=దుఃఖముచేమిక్కిలియుఁదపింపఁజేయఁబడినదై; హుతాశనం=అగ్నిహోత్రుని; ఉపాగమత్=ఉపాసించెను.

సీతాదేవి , క్రూరంబగునామాటనువిని, తనప్రాణంబులనపహరించినట్లు పరమదుఃఖంబునొంది, యగ్నిహోత్రునుపాసించెను. అని,తాత్పర్యము,

మంగళాభిముఖీ తస్య సా తదాఽసీన్మహాకపేః. ౨౭

టీక॥ సా=ఆసీతాదేవి; తదా=అప్పుడు; తస్య=ఆ; మహాకపేః=పెద్దకోఁతియయినహనుమంతునకు ; మంగళాభిముఖీ= మంగళమునకెదురైనది , మంగళముగలిగింపఁగోరునది; ఆసీత్=అయినది.

అప్పు, డాసీతాదేవి , యాహనుమంతునకు, మంగళంబొనగూర్పఁగోరినది. అని, తాత్పర్యము.

ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్

టీక॥ విశాలాక్షీ= వెడల్పులయినకండ్లుగలసీతాదేవి; ప్రయతా=పరిశుద్ధురాలై; హవ్యవాహనం = అగ్నిహోత్రుని; ఉపతస్థే = ఉపాసించినది.

విశాలంబులగునేత్రంబులుగలసీతాదేవి,పరిశుద్ధంబగుమనంబుననగ్నిహోత్రునుపాసించినది.
అని,తాత్పర్యము.

యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితంతపః. ౨౮
యది వా హ్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః

టీక॥ పతిశుశ్రూషా = పతిసేవ ; అస్తియది = ఉండునేని ; చరితం = చేయఁబడిన ; తపః = తపస్సు ; అస్తియది = ఉండునేని ; ఏకపత్నీత్వంచ = ప్రాతివ్రత్యమును ; అస్తియది = ఉండునేని ; హనూమతః = హనుమంతునకు ; శీతః = చల్లనివాఁడవు ; భవ = అగుము.

నేనుపతిసేవచేసియుండునేని, తపంబాచరించియుండునేని, నాకుఁబాతివ్రత్యంబు గలదేని, హనుమంతునకుఁ జల్లగానుండుము. అని, తాత్పర్యము.

యది కించిదనుక్రోశ స్తస్య మయ్యస్తి ధీమతః.
యది వా భాగ్యశేషో మే శీతో భవ హనూమతః

టీక॥ ధీమతః = అధికమైనబుద్ధిగల ; తస్య = ఆరామునకు ; మయి = నాయందు ; కించిదనుక్రోశః = కొంచెముదయ ; అస్తి (అధ్యాహృతము) యది = ఉండునేని ; మే = నాకు ; భాగ్యశేషోవా = భాగ్యముయొక్క మిగతయయినను ; అస్తి (అధ్యాహృతము) యది = ఉండునేని ; హనూమతః = హనుమంతునకు ; శీతః = చల్లనివాఁడవు ; భవ = అగుము.

బుద్ధిమంతుండగు రామునకు, నాయందేమైనఁ గొంచెముదయ యుండునేని, నేనింకమీఁదఁగొంచెమైనను భాగ్యముఁబొందవలసియుండునేని, హనుమంతునకుఁజల్లఁగానుండుము.

అని, తాత్పర్యము.

యది మాం వృత్తసంపన్నాం తత్సమాగమలాలసామ్. ౩౦
స విజానాతి ధర్మాత్మా శీతో భవ హనూమతః

టీక॥ ధర్మాత్మా = ధర్మబుద్ధిగల ; సః = ఆరాముండు ; మాం = నన్ను ; వృత్తసంపన్నాం = మంచియాచారముతోఁగూడినదానిఁగాను ; తత్సమాగమలాలసాం = ఆరామునితోఁగూడుటయందధికేచ్ఛగలదానిఁగాను ; విజానాతి యది = ఎఱుంగునేని ; హనూమతః = హనుమంతునకు ; శీతః = చల్లనివాఁడవు ;

భవ=అగుము.

నేను, పాతివ్రత్యంబువదల కున్నాననియు, రామునింబొందవలెననితమవగచుచున్నాననియు, ధర్మాత్ముండగు రాముండు, తలంచియుండునేని , హనుమంతునకుఁజల్లఁగానుండుము.

అని,తాత్పర్యము.

యదిమాం తారయేదార్య స్సుగ్రీవ స్సత్యసంగరః.౩౧
అస్మా ద్దుఃఖాంబుసంరోధా చ్ఛీతో భవ హనూమతః

టీక॥ఆర్యః=పూజ్యుండును ; సత్యసంగరః=అబద్ధముకాని ప్రతిజ్ఞగలవాఁడునగు; సుగ్రీవః=సుగ్రీవుఁడు; అస్మాత్=ఈ;దుఃఖాంబుసంరోధాత్= దుఃఖసముద్రముననుండి; మాం=నన్ను ; తారయేద్యది = దాఁటించునేని; హనూమతః=హనుమంతునకు; శీతః = చల్లనివాఁడవు; భవ=అగుము.

పూజ్యుండును సత్యప్రతిజ్ఞుండునగు సుగ్రీవుండు , నాకిప్పుడు గలిగియున్న దుఃఖంబుపోఁగొట్టునేని , నీవు, హనుమంతునకుఁ జల్లఁగానుండుము. అని,సీతాదేవి, యగ్నిహోత్రునిం బ్రార్థించినది. అని,తాత్పర్యము.

తత స్తీక్ష్ణార్చి రవ్యగ్రః ప్రదక్షిణశిఖో నలః. ౩౨
జజ్వాల మృగశాబాక్ష్యా శ్శంసన్నివ శివం కపేః

టీక॥తతః=అటుపిమ్మట;అనలః=అగ్నిహోత్రుఁడు; మృగశాబాక్ష్యాః=జింకపిల్లయొక్క-కండ్లవంటికండ్లుగలసీతాదేవికి;కపేః=హనుమంతునియొక్క-; శివం=మేలును;శంసన్నివ=చెప్పువాఁడువలె;తీక్ష్ణార్చిః= తీక్ష్ణములయినమంటలుగలవాఁడై,యధికములయినమంటలుగలవాఁడై,యమట;అవ్యగ్రః = ఏమఱుపాటులేనివాఁడై;ప్రదక్షిణశిఖః= ప్రదక్షిణజ్వాలలుగలవాఁడై;జజ్వాల= జ్వలించెను.

అంత, హనుమంతునితోఁకయందలి యగ్నిహోత్రుండు,సీతకు, హనుమంతునకుభయంబులేదనితెల్పుచుఁదక్షిణంబున, నధికంబులగు ప్రదక్షిణజ్వాలలతో,జ్వలించెను.అని,తాత్పర్యము.

హనుమజ్జనక శ్చాపి పుచ్ఛా నలయుతో నిలః. ౩౩

వవౌ స్వాస్థ్యకరో దేవ్యాః ప్రాలేయానిలశీతళః

టీక॥హనుమజ్జనకః=హనుమంతుని తండ్రియును;పుచ్ఛానలయుతః=తోఁక యందలి యగ్నిహోత్రముతోఁగూడిన వాఁడునగు;అనిలశ్చాపి= వాయువును; ప్రాలేయానిలశీతళః=మంచుగాలివలెఁ జల్లనివాఁడై;దేవ్యాః = సీతాదేవికి; స్వాస్త్యకరః = నెమ్మదిసేయువాఁడై;వవౌ=వీచెను.

హనుమంతునితోఁకయందలియగ్ని హోత్రముతోనున్న, యతనితండ్రియగువాయుదేవుండును,సీతాదేవికినెమ్మదిగలుగుటకై, మంచుగాలివలెఁ జల్లఁగా,వీచెను. అని, తాత్పర్యము.

దహ్యమానే చ లాంగూలే చింతయామాస వానరః. ౩౪

టీక॥లాంగూలే=తోఁక; దహ్యమానే=దహింపఁబడుచుండఁగా; వానరశ్చ=హనుమంతుండును;చింతయామాస=ఆలోచించెను.

అట్లు,తనతోఁకదహింపఁబడుచుండుటంజూచి,హనుమంతుండిట్లని , చింతించెను.అని, తాత్పర్యము.

ప్రదీప్తోగ్ని రయం కస్మా న్న మాం దహతి సర్వతః

టీక॥అయం=ఈ; ప్రదీప్తః=మండుచున్న;అగ్నిః=నిప్పు;కస్మాత్=ఎందువలన; మాం=నన్ను; సర్వతః=అంతటను; న దహతి=కాల్పదు?

నాతోఁకయందు,నిప్పు , మండుచున్నది;ఇది,నన్నంతటను దహింపకున్నదేల? అని, తాత్పర్యము.

దృశ్యతే చ మహాజ్వాలః కరోతి న చ మే రుజమ్. ౩౫

టీక॥అయం (అధ్యాహృతము) = ఈనిప్పు;మహాజ్వాలశ్చ=అధికములయి నమంటలుగలదిగాను; దృశ్యతే= చూడఁబడుచున్నది. మే=నాకు; రుజంచ=బాధనుంగూడ ; నకరోతి = చేయకున్నది.

ఈనిప్పు,పెనుమంటలుగల్గియున్నది;అయినను, నాకుఁ గొంచెమయిన

ను, బాధగల్గింపకున్నది! అని, తాత్పర్యము.

శిశిరస్యేవ సంపాతో లాంగూలాగ్రే ప్రతిష్ఠితః

టీక॥అయం ( అధ్యాహృతము)=ఈయగ్నిహోత్రము;శిశిరస్య= చల్లని పదార్థముయొక్క;సంపాతఇవ= సమూహమువలె; లాంగూలాగ్రే=తోఁకకొనయందు;ప్రతిష్ఠితః=ఉన్నది.

ఈయగ్నిహోత్రము, నావాలాగ్రమునందుఁ, జల్లనిదగుచందనము మొదలగువానిసమూహమునుంబోలెఁ, జల్లఁగానున్నది. దీనికేమికారణము?
అని, తాత్పర్యము.

అథవా త దిదం వ్యక్తం య ద్దృష్టం ప్లవతా మయా. ౩౮
రామప్రభావా దాశ్చర్యం పర్వత స్సరితాం పతౌ

టీక॥అథవా=అటుకాదేని;యత్=ఎందువలన;ప్లవతా=దాఁటుచున్న;మయా=నాచేత ; రామప్రభావాత్=రాముని ప్రభావమువలన ; సరితాం=నదులకు; పతౌ=ప్రభువైన సముద్రమునందు; పర్వతః= కొండయనెడు; ఆశ్చర్యం=ఆశ్చర్యము;దృష్టః=చూడఁబడినదో;తత్=అందువలన ; ఇదం=ఇది;వ్యక్తం=స్పష్టము.

అటుకాదేని,దీనికిఁగారణమిప్పుడు స్పష్టమయినది; నేనుసముద్రంబు దాఁటునప్పుడు,సముద్రంబులో నాశ్చర్యంబుగానొక్కపర్వతంబుఁ జూచితిని గదా!అందుకురాముని ప్రభావమేగదా కారణము!అందువలన, నిప్పుడు నాకు నిప్పుచల్లఁగానుండుటకును, రామునిప్రభావమేకారణము.అని, తాత్పర్యము.

యది తావత్సముద్రస్య మైనాకస్యచ ధీమతః. ౩౯
రామార్థం సంభ్రమ స్తాదృ క్కి మగ్ని ర్నకరిష్యతి

టీక॥సముద్రస్య తావత్=సముద్రమునకును;ధీమతః= మంచిబుద్ధిగల;మైనాకస్యచ = మైనాకపర్వతమునకును;రామార్థం=రామునికొఱకు;తాదృక్=

అట్టి; సంభ్రమోయది=త్వరగల్గునేని; అగ్నిః = అగ్నిహోత్రుఁడు; సంభ్రమం(అర్ధ్యాహృతము)=త్వరను; కిం= ఎందుకు;పక రిష్యతి=చేయుఁడు?

సముద్రిందునుబుద్ధిమంతుండునగు మైనాకుండును, రామునకుమేలుసేయ వలెనని, యింతదూరముత్వరపడినారు కదా! ఇంక,నగ్నిహోత్రుఁడుమాత్రము,రామునకు మేలుసేయ నేలయత్నింపఁడు?అని, తాత్పర్యము.

సీతాయా శ్చానృశంస్యేన తేజసా రాఘవస్య చ. ౩౮
పితుశ్చ మమ సఖ్యేన న మాం దహతి పావకః

టీక॥సీతాయాః = సీతాదేవియొక్క;ఆనృశంస్యేనచ=దయచేతను;రాఘవస్య=రామునియొక్క; తేజసాచ= ప్రభావముచేతను; మమ=నాయొక్క; పితుః = తండ్రియయినవాయుదేవుని యొక్క;సఖ్యేనచ=చెలిమిచేతను; పావకః=అగ్నిహోత్రుఁడు;మాం= నన్ను;నదహతి=దహింపకున్నాఁడు.

సీతాదేవిదయవలనను, రామునిప్రభావంబువలనను, నాతండ్రియగు వాయుదేవునకితండు స్నేహితుండగుటవలనను, ఈయగ్నిహోత్రుండునన్నుదహింపకున్నాఁడు. అని,హనుమంతుండు,చింతించెను.అని, తాత్పర్యము.

భూయ స్స చింతయామాస ముహూర్తం కపికుంజరః. ౩౯

టీక॥సః=ఆ;కపికుంజరః = వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు ; భూయః=మఱల; ముహూర్తం=కొంచెముసేపు; చింతయామాస=ఆలోచించెను.

వానరోత్తముండగు, నాహనుమంతుండు,మఱల, నాపైఁజేయవలసినకార్యమునుగుఱించి, కొంచెముసేపాలోచించెను.అని, తాత్పర్యము.

ఉత్పపాతాథ వేగేన ననాదచ మహాకపిః

టీక॥అథ = అటుపిమ్మట;మహాకపిః= పెద్దకోఁతియయినహనుమంతుండు;వేగేన=వేగముచేత;ఉత్పపాత=ఎగిరెను;ననాదచ=అఱచెను.

అంత, హనుమంతుండు, వేగంబున [illegible]గిరి, సింహనాదము చేసెను.
అని, తాత్పర్యము.

పురద్వారం తత శ్శ్రీమాన్ శైలశృంగమివోన్నతమ్. ౪౦
విభక్తరక్షస్సంబాధ మాససాదానిలాత్మజః

టీక॥ తతః = అటుపిమ్మట; శ్రీమాన్ = కాంతిమంతుండగు; అనిలాత్మజః = వాయుదేవునికొడుకయినహనుమంతుండు; ఉన్నతం = పొడవైన; శైలశృంగమివ(స్థితం) = పర్వతశిఖరమువలెనున్నదియును; విభక్తరక్షస్సంబాధం = పోయినరాక్షసులసంచారముగలదియునగు; పురద్వారం = పట్టణద్వారమును; ఆససాద = పొందెను.

అంత, శ్రీమంతుండగుహనుమంతుండు, పర్వతశిఖరంబుచోలెనున్నతంబును రాక్షససంచారంబులేనిదియునగు పట్టణద్వారంబుఁజేరెను.

అని, తాత్పర్యము.

స భూత్వా శైలసంకాశః క్షణేన పున రాత్మవాన్. ౪౧
హ్రస్వతాం పరమాం ప్రాప్తో బంధనాన్య వశాతయత్

టీక॥ శైలసంకాశః = పర్వతముతో సమానుఁడును; ఆత్మవాన్ = అధికమయినధైర్యముగలవాఁడునగు; సః = ఆ హనుమంతుఁడు; పునః = మఱల; క్షణేన = క్షణముచేత; పరమాం = మిక్కిలి యధికమయిన; హ్రస్వతాం = పొట్టియగుటను; ప్రాప్తః = పొందినవాఁడు; భూత్వా = అయి; బంధనాని = కట్టులను; అవశాతయత్ = వదలించుకొనెను.

పర్వతాకారుండును మహాధైర్యశాలియునగు నాహనుమంతుఁడు, క్షణంబున, మిక్కిలియుఁజిన్నరూపము వహించి, బంధంబులన్నియు వదలించుకొనెను.

అని, తాత్పర్యము.

విముక్తశ్చాభవచ్ఛ్రీమాన్ పునః పర్వత సన్నిభః. ౪౨
వీక్షమాణశ్చ దదృశే పరిఘం తోరణాశ్రితమ్

టీక॥ శ్రీమాన్ = కాంతిమంతుండగుహనుమంతుడు; విముక్తశ్చ = విడు




వఁబడినవాఁడైనంతనె ; పునః=మఱల; పర్వతసన్నిభః= కొండతోఁబోల్కి గలవాఁడు; అభవత్ = ఆయెను. వీక్షమాణశ్చ=చూచుచును; తోరణాశ్రితం = బహిర్ద్వారమునొందిన; పరిఘం = ఇనుపగుదియను ; దదృశే=చూచెను.

శ్రీమంతుండగుహనుమంతుండు, బంధంబులు వదలించుకొన్నంతనె, మఱలఁ బర్వతాకారంబువహించి, నలుదిక్కులంబూచి, బహిర్ద్వారంబునవేసియున్నయొకయినుపగుదియుంగనెను.

అని, తాత్పర్యము.

స తం గృహ్య మహాబాహుః కాలాయసపరిష్కృతమ్. ౪౩
రక్షిణస్తాన్ పునస్సర్వాన్ సూదయామాస మారుతిః

టీక॥ మహాబాహుః= పెద్దచేతులుగల; సః=ఆ, మారుతిః=వాయుదేవునికుమారుండగుహనుమంతుండు; కాలాయసపరిష్కృతం=ఇనుముతోఁజేయఁబడిన; తం=ఆగుదియను ; గృహ్య (గృహీత్వా)=తీసికొని; పునః = మఱల ; తాన్=ఆ; రక్షిణః= రక్షించురాక్షసులను;సర్వాన్= అందఱను; సూదయామాస=చంపెను.

మహాబాహుండునువాయుదేవునికుమారుండునగు, నాహనుమంతుండు, ఆయినుప గుదియంజేకొని , మఱల,దనకుఁగావలియున్న రాక్షసులనందఱం జంపెను, అని,తాత్పర్యము.

స తాన్నిహత్వా రణచండవిక్రమ
స్సమీక్షమాణః పునరేవ లంకామ్, ౪౪
ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ
ప్రకాశతాదిత్య ఇవార్చిమాలీ

టీక॥రణచండవిక్రమః=యుద్ధమునందుభయంకరమయిన పరాక్రమముగల; సః=ఆహనుమంతుండు; తాన్=ఆరాక్షసులను; నిహత్వా(నిహత్య)=చంపి; పునరేవ=మఱలనే; లంకాం=లంకాపట్టణమును; సమీక్షమాణః=చూచుచు ; ప్రదీప్తలాంగూల కృతార్చిమాలీ = (ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ)=మండుచున్నతోఁకచేఁ జేయఁడిన జ్వాలలపఙ్క్తి గలవాఁడై ; అర్చిమాలీ




(అర్చిర్మాలీ)=కిరణంబులపఙ్క్తిగల; ఆదిత్యఇవ =సూర్యుఁడువలె; ప్రకాశత (ప్రాకాశత)=ప్రకాశించెను.

యుద్ధంబునభయంకరంబగుపరాక్రమముగలయాహనుమంతుండు, ఆరాక్షసులంజంపి, మఱలలంకతట్టుచూచుచు, దోఁకయందలియగ్నిజ్వాలలచేఁగప్పఁబడినవాఁడగుటంజేసి, కిరణసమూహంబులం గప్పఁబడియుండుసూర్యునిపోల్కిం, బ్రకాశించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే;
సుందరకాండే, త్రిపంచాశస్సర్గః.
ఇది,స్పష్టార్థము,
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు,సుందరకాండత్రిపంచాశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

చతుఃపంచాశసర్గప్రారంభః.

వీక్షమాణ స్తతో లంకాం కపిః కృత మనోరథః
వర్ధమానసముత్సాహః కార్యశేష మచింతయత్. ౧

టీక॥తతః=అటుపిమ్మట;కపిః=హనుమంతుండు;కృతమనోరథః=చేయఁబడినకోర్కులుగలవాఁడై;లంకాం=లంకను; వీక్షమాణః=చూచుచు ; వర్ధమానసముత్సాహః= వృద్ధిఁబొందుచున్నయుత్సాహముగలవాఁడై; కార్యశేషం=కార్యముయొక్కమిగతను;అచింతయత్ =ఆలోచించెను.

అంతనట్లుహనుమంతుండు, తనకోర్కులండీఁడేర్చుకొని,లంకంజూచుచు, నుత్సాహంబంతకంతకువృద్ధిఁబొంద,"నింకనేమిచేయవలసినది" అని, యాలోచించెను. అని,తాత్పర్యము.

కిన్నుఖల్వవశిష్టం మే కర్తవ్య మిహ సాంప్రతమ్
య దేషాం రక్షసాం భూయ స్సంతాపజననం భవేత్. ౨

టీక॥ఇహ=ఇచ్చట;సాంప్రతం=ఇప్పుడు; యత్=ఏది;ఏషాం=ఈ; రక్షసాం=రాక్షసులకు; భూయః= అధికముగా;సంతాపజననం= దుఃఖముగల్గించునది;భవేత్=అగునో; తత్ (అధ్యాహృతము)=అట్టిది;మే=నాకు; కర్తవ్యం=చేయఁబడవలసినది; కిన్నుఖల్వవశిష్టం=ఏమిమిగిలియున్నది.

ఈరాక్షసులకేది యింక నధికముగాఁగష్టముగలిగించునో,అట్టికార్యము,ఇప్పుడిచ్చట, నేనింక నేమైనఁ జేయవలసియున్నదా యేమి?అని, తాత్పర్యము.

వనం తావ త్ప్రమథితం ప్రకృష్టా రాక్షసా హతాః
బలైకదేశః క్షపిత శ్శేషం దుర్గవినాశనమ్. ౩

టీక॥వనంతావత్= అశోకవనము మాత్రము; ప్రమథితం= విఱువఁబడినది.ప్రకృష్టాః=శ్రేష్ఠులయిన ; రాక్షసాః=రాక్షసులు; హతాః= చంపఁబడినారు.బలైకదేశః= సైన్యమునందొకభాగము;క్షపితః=నశింపఁ జేయఁబడినది.దుర్గవినాశనం=కోటయొక్కనశింపఁజేయుట;శేషం=మిగిలియున్నది.

అశోకవనముఁ విఱిచినాను;ఉత్తములగు రాక్షసులంగొందఱఁ జంపినాను; సైన్యములోఁగొంతభాగమునునశింపఁజేసినాను; ఇంక నీపట్టణదుర్గమునునశింపఁజేయఁవలసినది , యొకటిమిగిలియున్నది.అని, తాత్పర్యము.

దుర్గే వినాశితే కర్మ భవే త్సుఖపరిశ్రమమ్

టీక॥దుర్గే=కోట;వినాశితే= నశింపఁజేయఁబడఁగా;కర్మ = కార్యము;సుఖపరిశ్రమం = సుఖకరమయిన యాయాసముగలది;భవేత్=అగును.

నేనీదుర్గంబును నశింపఁజేయుదునేని, సముద్రము దాఁటుట మొదలగు కార్యములందు నేనుబడినశ్రమము, సఫలమగును.అని, తాత్పర్యము.

అల్పయత్నేన కార్యే స్మిన్ మమ స్యా త్సఫల శ్శ్రమః. ౪

టీక॥అల్పయత్నేన = స్వల్పప్రయత్నముచేత; కార్యే = చేయఁదగిన; అస్మిన్ = ఈపనికాఁగా; మమ = నాయొక్క; శ్రమః = ప్రయాసము; సఫలః = ఫలముతోఁగూడినది; స్యాత్ = అగును.

ఈదుర్గనాశనంబును, సులభముగానే చేయఁదగియున్నది; దీనింజేయుదునేని, నాశ్రమంబంతయు, సఫలంబగును. అని, తాత్పర్యము.

యో హ్యయం మమ లాంగూలే దీప్యతే హవ్యవాహనః
అస్య సంతర్పణం న్యాయ్యం కర్తుమేభి ర్గృహోత్తమైః. ౫

టీక॥యః = ఏ ("హి" అనునది పాదపూరణార్థము); అయం = ఈ; హవ్యవాహనః = అగ్నిహోత్రుఁడు; మమ = నాయొక్క; లాంగూలే = తోఁకయందు; దీప్యతే = మండుచున్నాఁడో; అస్య = ఈయగ్నిహోత్రునియొక్క; ఏభిః = ఈ; గృహోత్తమైః = ఇండ్లలో నుత్తమంబులగువానిచేత; సంతర్పణం = తృప్తిఁబొందించుట; కర్తుం = చేయుటకు; న్యాయ్యం = యుక్తమయినది.

నాతోఁకయందగ్నిహోత్రుండు మండుచున్నాఁడే; ఇతనికీయుత్తమగృహంబులచేఁదృప్తిసేయుటయుక్తము. అని, తాత్పర్యము.

తతః ప్రదీప్తలాంగూలః సవిద్యుదివ తోయదః
భవనాగ్రేషు లంకాయా విచచార మహాకపిః. ౬

టీక॥తతః = అటుపిమ్మట; ప్రదీప్తలాంగూలః = మండుచున్నతోఁకగలవాఁడును, కావుననే; సవిద్యుత్ = మెఱుపులతోఁగూడిన; తోయదఇవ (స్థితః) = మేఘమువలెనున్నవాఁడునగు; మహాకపిః = హనుమంతుండు; లంకాయాః = లంకాపట్టణముయొక్క; భవనాగ్రేషు = ఇండ్లపైభాగములందు; విచచార = జరిగెను.

అంత, హనుమంతుండు, మండుచున్నవాలంబుతో, మెఱుపుగలమేఘంబుకైవడిభాసిల్లుచు, లంకాపట్టణంబు నందలి, యిండ్లపై, సంచరించెను. అని, తాత్పర్యము.

గృహా ద్గృహం రాక్షసానా ముద్యానానిచ వానరః
వీక్షమాణో హ్యసంత్రస్తః ప్రాసాదాంశ్చ చచార సః. ౭

టీక॥సః=ఆ;వానరః = హనుమంతుఁడు;ఉద్యానానిచ = ఉపవనంబులను;ప్రాసాదాంశ్చ=మేడలను;వీక్షమాణః=చూచుచు;అసంత్రస్తః=భయపడనివాఁడై;రాక్షసానాం=రాక్షసులయొక్క;గృహాత్= ఇంటనుండి;గృహం= ఇంటిని గూర్చి;చచారహి — తిరిగెనుగదా!

ఆహనుమంతుండు,ఉద్యానవనంబులను బ్రాసాదంబులనుం జూచుచు, నిర్భయంబుగా, రాక్షసుల యిండ్లన్నియుఁదిరిగెను.అని, తాత్పర్యము.

అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్
అగ్నిం తత్ర స నిక్షిప్య శ్వసనేన సమో బలీ. ౮
తతో న్య త్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్

టీక॥మహావేగః—అధికమయినవేగముగలవాఁడును;శ్వసనేన—వాయువుతో;సమః=సమానుఁడును ; బలీ= అధికమయినబలముగలవాఁడును; వీర్యవాన్= అధికమయిన పరాక్రమముగలవాఁడునగు;సః= ఆహనుమంతుఁడు;ప్రహస్తస్య=ప్రహస్తునియొక్క; నివేశనం—గృహమునుగూర్చి;అవప్లుత్య — దిగిరి;తత్ర—అచ్చట;అగ్నిం=నిప్పును;నిక్షిప్య=ఉంచి;తతః—అటుపిమ్మట; అన్యత్=మఱియొకటైన;మహాపార్శ్వస్య= మహాపార్శ్వునియొక్క;వేశ్మ— ఇంటిని గూర్చి;పుప్లువే—ఎగిరెను.

మహావేగుండును,వాయుదేవునితో సమానుండును,బలవంతుండును, బరాక్రమశాలియునగు నాహనుమంతుండు, ప్రహస్తునియింటిపై కెగిరి,యచ్చటనిప్పుముట్టించి,యంత,మహాపార్శ్వునియింటిపై కెగిరెను. అని, తాత్పర్యము.

ముమోచ హనుమా నగ్నిం కాలానలశిఖోపమమ్. ౯

టీక॥హనుమాన్ = హనుమంతుండు ; కాలానలశిఖోపమం = కాలాగ్ని

జ్వాలతోఁబోలిక-గల; అగ్నిం=నిప్పును; ముమోచ=విడిచెను.

హనుమంతుండు, అంతమహాపార్శ్వునింటఁ, గాలాగ్నిజ్వాలంబోలినయగ్నిహోత్రంబుదరికొల్పెను.

అని, తాత్పర్యము.

వజ్రదంష్ట్రస్యచ తథా ప్లుప్లువే స మహాకపిః
శుకస్యచ మహాతేజా స్సారణస్యచ ధీమతః. ౧౦

టీక॥ మహాతేజాః= అధికమయినపరాక్రమముఁగల; మహాకపిః=పెద్దకోఁతియగు; సః=ఆహనుమంతుండు; తదా= అప్పుడు; వజ్రదంష్ట్రస్యచ = వజ్రదంష్ట్రునియొక్క-యు; శుకస్యచ=శుకునియొక్క-యు-ధీమతః = బుద్ధిమంతుండగు; సారణస్యచ = సారణునియొక్క-యు; వేశ్మాని(అధ్యాహృతము)=ఇండ్లనుగూర్చి; ప్లుప్లువే=ఎగిరెను.

అంత, మహాపరాక్రమశాలియగు నాహనుమంతుండు, వజ్రదంష్ట్రునియింటికిని, శుకునిగృహంబునకును, బుద్ధిమంతుండగుసారణునిగృహంబునకు, నెగిరి, యాగృహంబులకు, నిప్పుముట్టించెను.

అని, తాత్పర్యము.

తథా చేంద్రజితో వేశ్మ దదాహ హరియూథపః

టీక॥ హరియూథపః = వానరసమూహమును బాలించునట్టి హనుమంతుఁడు; తథా=అట్లు; ఇంద్రజితః=ఇంద్రజిత్తుయొక్క-; వేశ్మ చ=ఇంటినింగూడ; దదాహ=కాల్చెను.

అట్లు, వానరోత్తముండగు హనుమంతుండు, ఇంద్రజిత్తుగృహంబును; దహించెను. అని, తాత్పర్యము.

జంబుమాలే స్సు మాలేశ్చ దదాహ భవనం తతః. ౧౧

టీక॥ సః(అధ్యాహృతము)= ఆహనుమంతుండు; తతః=అటుపిమ్మట; జంబుమాలేః= జంబుమాలియొక్క-యు; సుమాలేశ్చ=సుమాలియొక్క-యు; భవనం=ఇంటిని; దదాహ=కాల్చెను.

అంత, హనుమంతుండు, జంబుమాలియుసుమాలియునను వారల గృహంబులదహించెను. అని, తాత్పర్యము.

రశ్మికేతోశ్చ భవనం సూర్యశత్రో స్తథైవచ
హ్రస్వకర్ణస్య దంష్ట్రస్య రోమశస్యచ రక్షసః. ౧౨
యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య రక్షసః
విద్యుజ్జిహ్వస్య ఘోరస్య తథాహస్తిముఖస్యచ. ౧౩
కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవహి
కుంభకర్ణస్య భవనం మకరాక్షస్య చైవహి. ౧౪
యజ్ఞశత్రోశ్చ భవనం బ్రహ్మశత్రో స్తథైవచ
నరాంతకస్య కుంభస్య నికుంభస్య దురాత్మనః. ౧౫
వర్జయిత్వా మహాతేజా విభీషణ గృహంప్రతి
క్రమమాణః క్రమేణైవ దదాహ హరిపుంగవః. ౧౬

టీక॥ మహాతేజాః= అధికమయిన పరాక్రమముగల; హరిపుంగవః= వానరశ్రేష్ఠుండగుహనుమంతుఁడు ; క్రమేణైవ=వరుసచేతనే; క్రమమాణః = తిరుగుచు; విభీషణగృహం = విభీషణు నింటిని;ప్రతివర్జయిత్వా= విడిచి;రశ్మికేతోః=రశ్మికేతువను రాక్షసుని యొక్క; భవనంచ=ఇంటిని; తథైవ= అట్లె;సూర్యశత్రోః = సూర్యశత్రువను రాక్షసునియొక్క ; భవనం (అధ్యాహృతము) చ= ఇంటిని; హ్రస్వకర్ణస్య= హ్రస్వకర్ణుఁడను వానియొక్కయు; దంష్ట్రస్య=దంష్ట్రుండను రాక్షసునియొక్కయు; రోమశస్య= రోమశుండను; రక్షసశ్చ=రాక్షసునియొక్కయు; యుద్ధోన్మత్తస్య = యుద్ధోన్మత్తుండనువానియొక్కయు; మత్తస్య = మత్తుండనువానియొక్కయు ; ధ్వజగ్రీవస్య=ధ్వజగ్రీవుండను; రక్షసః = రాక్షసునియొక్కయు; ఘోరస్య=భయంకరుఁడయిన; విద్యుజ్జిహ్వస్య=విద్యుజ్జిహ్వునియొక్కయు;తథా=అట్లు; హస్తిముఖస్యచ = హస్తిముఖుండను రాక్షసునియొక్కయు; కరాళస్య= కరాళుండనువానియొక్కయు; పిశాచస్య= పిశాచుండనువానియొక్కయు ; శోణితాక్షస్యచైవహి = శోణితాక్షుండను వానియొక్కయు ; భవనాని (అధ్యాహృతము) = ఇండ్లను; కుంభకర్ణస్య= కుంభకర్ణుఁడను వానియొక్కయు; భవనం=ఇంటిని ; మకరాక్షస్యచైవహి=మకరాక్షునియొక్కయు; భ

వనం(అధ్యాహృతము) = ఇంటినిఁ; యజ్ఞశత్రోః = యజ్ఞశత్రువుయొక్క ; భవనం=ఇంటిని ; తథైవ =అట్లె; బ్రహ్మశత్రోః=బ్రహ్మశత్రువుయొక్క; భవనం (అధ్యాహృతము) చ= ఇంటినిఁ; నరాంతకస్య=నరాంతకునియొక్కయు; కుంభస్య=కుంభునియొక్కయు; దురాత్మనః = దుష్టబుద్ధిగల; నికుంభస్య = నికుంభునియొక్కయు; భవనాని (అధ్యాహృతము) = ఇండ్లను; దదాహ=కాల్చెను.

మహాపరాక్రమశాలియు వానరోత్తముండునగు, హనుమంతుండట్లు ; క్రమంబునఁ , బ్రతిగృహంబును దిరుగుచువిభీషణునింటినిమాత్రము విడిచి , రశ్మికేతువు గృహంబును, సూర్యశత్రుభవనంబును , హ్రస్వ కర్ణుని యాలయంబును, దంష్ట్రునినిలయంబును , రోమశుండను రాక్షసుని మందిరంబును, యుద్ధోన్మత్తునిసదనంబును మత్తనియాలయంబును , ధ్వజగ్రీవుని సద్మంబును, భయంకరుండగు విద్యుజ్జిహ్వునివేశ్మంబును, హస్తిముఖుని నివేశనంబును, కరాళపిశాచులనికేతనంబులను, శోణితాక్షునిగృహంబును , కుంభకర్ణునిమందిరంబును, మకరాక్షునిభవనంబును, యజ్ఞశత్రుబ్రహ్మశత్రువులసద్మంబులను , నరాంతకునివేశ్మంబును; కుంభునినికేతనమును ,దురాత్ముండగు నికుంభునియావాసంబును,దహించెను. అని, తాత్పర్యము.

తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః
గృహే ష్వృద్ధిమతామృద్ధిం దదాహ స మహాకపిః. ౧౭

టీక॥ మహాయశాః= అధికమయిన కీర్తిగలవాఁడును; మహాకపిః = పెద్ద కోఁతియునగు; సః= ఆహనుమంతుఁడు;మహార్హేషు= శ్రేష్ఠములయినవియును;భవనేషు=సంపదగలవియునగు; తేషు తేషు=ఆయా;గృహేషు=ఇండ్లయందు;ఋద్ధిమతాం=అధికమయినసంపదగలరాక్షసులయొక్క;ఋద్ధిం= సంపదను; దదాహ=దహించెను.

మహాకీర్తిశాలియగు నాహనుమంతుండు,ఉత్తమంబులగు నాయాగృహంబులందు , అధికంబుగా నారాక్షసులు సంపాదించికూర్చిపెట్టుకొన్న , మణిముక్తాప్రవాళాదిసంపదలం, దహించెను. అని, తాత్పర్యము.

సర్వేషాం సమతిక్రమ్య రాక్షసేంద్రస్య వీర్యవాన్
ఆససాదాథ లక్ష్మీవాన్ రావణస్య నివేశనమ్. ౧౭

టీక॥ వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగలవాఁడును; లక్ష్మీవాన్ = అధికమయినకాంతిగల వాఁడునగుహనుమంతుండు; సర్వేషాం = అందఱియొక్క; భవనాని (అధ్యాహృతము) = ఇండ్లను; సమతిక్రమ్య = దాఁటి; అథ = అటుపిమ్మట; రాక్షసేంద్రస్య = రాక్షసులకుఁ బ్రభువైన; రావణస్య = రావణునియొక్క; నివేశనం = ఇంటిని; ఆససాద = పొందెను.

మహాపరాక్రమశాలియు మహాతేజశ్శాలియునగుహనుమంతుండు, అట్లు, రాక్షసులయందఱిగృహంబులందునుని ష్క్రమించి యంత రాక్షసేశ్వరుండగు రావణునిగృహంబునకుం బోయెను.

అని, తాత్పర్యము.

తత స్తస్మిన్ గృహే ముఖ్యే నానారత్న విభూషితే
మేరుమందర సంకాశే సర్వమంగళశోభితే. ౧౮
ప్రదీప్త మగ్ని ముత్సృజ్య లాంగూలాగ్రే ప్రతిష్ఠితమ్
ననాద హనుమాన్ వీరో యుగాంతజలదో యథా. ౧౯

టీక॥ తతః = అటుపిమ్మట; వీరః = పరాక్రమశాలియగు; హనుమాన్ = హనుమంతుండు; నానారత్నవిభూషితే = నానావిధములయినమణులచేనలంకరింపఁబడినదియు; మేరుమందరసంకాశే = మేరుపర్వతముతోను మందరపర్వతముతోను సమానమయినదియు; సర్వమంగళశోభితే = సమస్తమంగళద్రవ్యములచేతఁబ్రకాశమునొందినదియును; ముఖ్యే = శ్రేష్ఠమునగు; తస్మిన్ = ఆ; గృహే = ఇంటియందు; లాంగూలాగ్రే = తోఁకకొనయందు; ప్రతిష్ఠితం = ఉన్న; ప్రదీప్తం = మండుచున్న; అగ్నిం = అగ్నిహోత్రమును; ఉత్సృజ్య = విడిచి; యుగాంతజలదో యథా = ప్రళయకాలమేఘంబువలె; ననాద = అఱచెను.

అంతఁ, బరాక్రమవంతుండగు నా హనుమంతుండు, నానావిధమణులచే నలంకరింపఁబడినదియు మేరుమందరపర్వతంబులకు సాటివచ్చునదియు సమస్తమంగళద్రవ్యంబులతోనుం గూడినదియు ను త్తమంబునగు, నాగృహంబునకును,

దనతోఁకలో వెలుంగుచున్ననిప్పుముట్టించి, ప్రళయకాలమేఘంబుకరణి , సింహనాదంబు చేసెను.

అని, తాత్పర్యము.

శ్వసనేనచ సంయోగా దతివేగో మహాబలః
కాలాగ్ని రివ జజ్వాల ప్రావర్ధత హుతాశనః. ౨౧

టీక॥ హుతాశనః= అగ్నిహోత్రము; శ్వసనేన= వాయువుతోడ; సంయోగాచ్చ=కూడికవలనను; అతివేగః= అధికమయినవేగముగలవాఁడై; మహాబలః=అధికమయినబలముగలవాఁడై; కాలాగ్నిరివ= ప్రళయకాలమునందలియగ్నిహోత్రమువలె; జజ్వాల= మండెను. ప్రావర్ధత=వృద్ధిఁబొందెను.

ఇంతకుమున్నిదివఱకు, వాయువునగ్నిహోత్రుండును, రావణునకుభయంపడియున్నవారలైనను, ఇప్పుడు, దేవతలకుబలంబుహెచ్చుటనెఱింగి, రావణభయంబువిడిచి, యుద్ధమునుంగలయుటంజేసి, యగ్నిహోత్రుండు , మహావేగంబునుమహాబలంబునుంబొంది, ప్రవృద్ధుండై , ప్రలయకాలాగ్నిచందంబునం , బ్రజ్వలించెను.

అని, తాత్పర్యము.

ప్రదీప్త మగ్నిం పవన స్తేషు వేశ్మ స్వచారయత్

టీక॥ పవనః = వాయువు; ప్రదీప్తం=మండుచున్న; అగ్నిం=అగ్నిని ; తేషు=ఆ; వేశ్మసు=ఇండ్లయందు; అచారయత్=పొందించెను.

వాయువు , మండుచున్న యగ్నిహోత్రమును, ఆయాగృహంబులపై వ్యాపించునట్లుచేయుచుండెను.

అని, తాత్పర్యము.

అభూచ్ఛ్వసన సంయోగా దతివేగో హుతాశనః. ౨౨

టీక॥ హుతాశనః = అగ్ని; శ్వసనసంయోగాత్=వాయువుతోఁజేరికవలన; అతివేగః= అధికమయినవేగముగలది; అభూత్=అయినది.

వాయువుతోడ్పడుటంజేసి, యగ్నిహోత్రంబతివేగంబున , లంకయంత

యు, వ్యాపించెను. అని, తాత్పర్యము.

తాని కాంచన జాలాని ముక్తామణిమయానిచ
భవనా న్యవశీర్యంత రత్నవంతి మహాంతిచ. ౨౩

టీక॥ కాంచనజాలాని=బంగారువికారములయినకిటికీలుగలవియును; ముక్తామణిమయానిచ=ముత్తెములయొక్కయు రత్నములయొక్కయు వికారములును; రత్నవంతి= మణులుగలవియును; మహాంతిచ=పెద్దవియునగు; తాని=ఆ; భవనాని=గృహంబులు; అవశీర్యంత=పడినవి.

బంగారుకిటికీలుగలవియు ముక్తారత్నమయంబులును మణులతో నిండినవియును గొప్పవియు నగు నాగృహంబులు,దహింపఁబడి, నేలంబడినవి.

అని, తాత్పర్యము.

తాని భగ్న విమానాని నిపేతు ర్వసుధాతలే
భవనానీవ సిద్ధానా మంబరా త్పుణ్య సంక్షయే. ౨౪

టీక॥తాని=ఆ ; భగ్నవిమానాని=విఱిగినమేడలు; పుణ్యసంక్షయే = పుణ్యంబుయొక్క-నాశముకాఁగా; సిద్ధానాం=సిద్ధులయొక్క;భవనానీవ=ఇండ్లువలె; అంబరాత్=ఆకాశముననుండి; వసుధాతలే=భూతలమునందు; నిపేతుః=పడినవి.

అట్లువిఱిగినమేడలు,పుణ్యంబునశించినపిదప,సిద్ధులవిమానంబులు, నేలంబడునట్లు,ఆకాశముననుండి, నేలంగూలినవి. అని, తాత్పర్యము.

సంజజ్ఞే తుముల శ్శబ్దో రాక్షసానాం ప్రధావతాం
స్వగృహస్య పరిత్రాణే భగ్నోత్సాహోర్జిత శ్రియామ్. ౨౫
నూన మేషోగ్ని రాయాతః కపిరూపేణ హాఇతి

టీక॥ స్వగృహస్య=తనయింటియొక్క; పరిత్రాణే=రక్షించుకొనుటయం

దు; భగ్నోత్సాహార్జితశ్రియాం = నశించినయుత్సాహమునుఅధికమయినకాంతియును గలవారలును; ప్రధావతాం = పరుగులిడుచున్నవారలునగు; రాక్షసానాం = రాక్షసులయొక్క; "హా = అయ్యో! ఏషః = ఇతండు; అగ్నిః = అగ్నిహోత్రుఁడు; కపిరూపేణ = వానరరూపముచేత; ఆయాతః = వచ్చినాఁడు. నూనం = నిశ్చయము" ఇతి = అని; తుములః = దొమ్మియయిన; శబ్దః = ధ్వని; సంజజ్ఞే = పుట్టినది.

అంత రాక్షసులందఱుఁ దమతమగృహంబులం గాపాడుకొనం జాలక, భగ్నోత్సాహులై, పరమ దీనులయి, "అయ్యో, ఇతండు, సాక్షాదగ్నిహోత్రుండే, వానరరూపంబుననిచ్చటికి వచ్చినాఁడు; ఇదినిశ్చయము" అని, యాక్రోశించుచుఁబరుగెత్తిరి.

అని, తాత్పర్యము.

క్రందంత్యస్సహసా పేతు స్స్తనంధయధరా స్త్రియః. ౨౮
కాశ్చి దగ్ని పరీతేభ్యో హర్మ్యేభ్యో ముక్తమూర్ధజాః

టీక॥ కాశ్చిత్ = కొందఱు; స్తనంధయధరాః = పాలుత్రాఁగుబిడ్డలందాల్చియున్న; స్త్రియః = స్త్రీలు; క్రందంత్యః = ఏడ్చుచు; అగ్నిపరీతేభ్యః = అగ్నిహోత్రముచేవ్యాపింపఁబడిన ; హర్మ్యేభ్యః = మేడలనుండి ; ముక్తమూర్ధజాః = విడువఁబడినతలవెండ్రుకలుగలవారలై ; సహసా = తటాలున; పేతుః = పడిరి.

లేఁతబిడ్డలనెత్తుకొనియున్న స్త్రీలు కొందఱు, దహింపఁబడుచుండు మేడలపైనుండి, రోదనంబుసేయుచుఁ, గొప్పులువీడం, దటాలున, నేలంబడిరి.

అని, తాత్పర్యము.

పతంత్యో రేజిరేభ్రేభ్య స్సౌదామిన్య ఇవాంబరాత్. ౨౯

టీక॥ అంబరాత్ = ఆకాశమునుండి; పతంత్యః = పడుచున్నస్త్రీలు; అభ్రేభ్యః = మేఘంబులనుండి ; పతంత్యః(అధ్యాహృతము) = పడుచున్న; సౌదామిన్యఇవ = మెఱుపులువలె; రేజిరే = ప్రకాశించిరి.

అప్పుడట్లాకాశంబుననుండి పడుచున్నయాస్త్రీలు , మేఘంబులనుండిపడు

మెఱుపులుంబోలె, వెలింగిరి. అని, తాత్పర్యము.

వజ్ర విద్రుమ వైడూర్య ముక్తా రజత సంహితాన్
విచిత్రాన్ భవనాన్ ధాతూన్ స్యందమానాన్ దదర్శసః. ౨౮

టీక॥ సః=ఆహనుమంతుండు; వజ్రవిద్రుమవైడూర్య ముక్తారజతసంహితాన్= వజ్రములతోనుబగడములతోనువైడూర్యములతోను ముత్తెములతోనుఇతరరత్నంబులతోనుం గూడినవియును; ధాతూన్ = బంగారములను; స్యందమానాన్ = కార్చుచున్నవియునగు; విచిత్రాన్=నానావిధములయిన; భవనాన్(భవనాని)=ఇండ్లను; దదర్శ=చూచెను.

ఆహనుమంతుండు, వజ్రములతోను,బ్రవాళంబులతోను వైడూర్యంబులతోను ముత్తెములతోను ఇతర మణులతోనుంగూడినవియు, నిప్పువేండ్రంబునకుఁ, గరఁగికాఱుచున్నవియునగు, నానావిధంబులయిన,బంగారుగృహంబులంజూచెను. అని, తాత్పర్యము.

నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం తృణానాం హరియూథపః
నాగ్నేనాపి విశస్తానాం రాక్షసానాం వసుంధరా. ౨౯

టీక॥కాష్ఠానాం=(తృతీయార్థమందుషష్ఠి) ఇట్లుముందును దెలిసికొనునది)కట్టెలచేతను;తృణానాం=గడ్డిచేతను;అగ్నిః = అగ్నిహోత్రుఁడు;నతృప్యతి=తృప్తిఁబొందఁడయ్యె. అగ్నేః=అగ్నిహోత్రముచేత ; హరియూథపః=హనుమంతుండు;న(తృప్యతి)=తృప్తిఁబొందఁడయ్యె.విశస్తానాం = చంపఁబడిన;రాక్షసానాం= రాక్షసులచేత;వసుంధరాపి=భూమియును; న(తృప్యతి)=తృప్తిఁబొందదయ్యె.

అగ్నిహోత్రము, ఎట్లుకట్టెలునుగడ్డియునెంతయుండినను దృప్తిఁబొందదో, అట్లు, హనుమంతుండు,లంకకునిప్పు,నెంతమట్టించినను, దృప్తిఁబొందఁడయ్యె;అట్లురాక్షసులపీనుంగులు,ఎంతపడినను, భూమియుఁదృప్తిఁబొందకుండినది.అని,తాత్పర్యము.

క్వచి త్కింశుక సంకాశాః క్వచి చ్ఛాల్మలి సన్నిభాః
క్వచి త్కుంకుమ సంకాశా శ్శిఖావహ్నే శ్చకాశిరే. ౩౦

టీక॥వహ్నేః = అగ్నియొక్క; శిఖాః=జ్వాలలు; క్వచిత్=ఒకానొకచోట; కింశుకసంకాశాః= మోదుగుపుష్పముతోసమానములయి; క్వచిత్=ఒకానొకచోట; శాల్మలిసన్నిభాః= బూరుగపుష్పతోసమానములయి; క్వచిత్=ఒకానొకచోట; కుంకుమసంకాశాః=కుంకుమపుష్పతోసమానములయి; చకాశిరే=ప్రకాశించినవి.

అప్పుడు,అగ్నిహోత్రము,దహింపఁబడుపదార్థములస్వభావముచే,నొక్కచో మోదుగుపువ్వులంబోలు జ్వాలలను,ఒక్కచోబూరుగపుష్పంబులవంటి మంటలను,మఱియొక్కచోఁ,గుంకుమపువ్వులతో సమానములగు కీలలనుం గల్గి,ప్రకాశించెను.అని, తాత్పర్యము.

హనూమతా వేగవతా వానరేణ మహాత్మనా
లంకాపురం ప్రదగ్ధం త ద్రుద్రేణ త్రిపురం యథా. ౩౧

టీక॥వేగవతా=అధికమయిన వేగముగలవాఁడును; మహాత్మనా= అధికమయిన పరాక్రమముగలవాఁడును; వానరేణ=కోఁతియునగు ; హనూమతా=హనుమంతునిచేత;తత్=ఆ; లంకాపురం=లంకాపట్టణము;రుద్రేణ=శివునిచేత; త్రిపురంయథా=త్రిపురమువలె;ప్రదగ్ధం=దహింపఁబడినది.

వేగవంతుండునుమహాపరాక్రమశాలియునగుహనుమంతుండు, రుద్రుండు, త్రిపురమునుదహించినట్లు,లంకాపురంబును,దహించెను.అని, తాత్పర్యము.

తతస్తు లంకాపుర పర్వతాగ్రే సముత్థితో భీమపరాక్రమోగ్నిః
ప్రసార్య చూడావలయం ప్రదీప్తో హనూమతా వేగవతా విసృష్టః. ౩౨

టీక॥తతస్తు=అటుపిమ్మటను;వేగవతా=అధికమయినవేగముగల; హనూమతా=హనుమంతునిచేత; విసృష్టః=విడువఁబడిన; అగ్నిః= అగ్నిహోత్రము;లంకాపురపర్వతాగ్రే=లంకాపట్టణమునకాధారమయినత్రికూటపర్వతశి

ఖరమునందు, చూడావలయం=జ్వాలల సమూహమును; ప్రసార్య=వి స్తరింపఁ జేసికొని; ప్రదీ ప్తః=మండుచున్నదై; భీ మపరాక్రమః—భయంకరంబగు పరా క్రమముగలదై; సముత్థితః=లేచినది.

అంత, వేగవంతుండగు హనుమం తుండుంచినయగ్నిహోత్రము, లం కాపట్టణంబంతయుజ్వాలలచే వ్యాపిం చి, భయంకరాకారంబున, మండినది.

అని, తాత్పర్యము.

యుగాంతకాలానలతుల్యవేగ
స్సమారుతోగ్ని ర్వవృధే దివిస్పృక్
విధూమ రశ్మి ర్భవనేషు సక్తో
రక్షశ్శరీరాజ్య సమర్పితార్చిః. ౩౩

టీక॥ అగ్నిః=అగ్నిహోత్రము; సమా రుతః= వాయువుతోఁ గూడినదై; యు గాంతకాలానలతుల్యవేగః = ప్రళయ కాలమునందలి యగ్నిహోత్రముయొ క్క వేగముతో సమానమయినవేగముగ లదై; దివిస్పృక్=ఆకాశమును దాఁకున దియై; విధూమరశ్మిః= పొగలేనిమంట లుగలదై; భవనేషు=ఇండ్లయందు; స క్తః—సంబంధించినదై; రక్షశ్శరీరాజ్య సమర్పితార్చిః= రాక్షసులదేహము లను నేతిచే లేపఁబడినమంటలుగలదై; వ వృధే=వృద్ధిఁబొందినది.

అంత, నాయగ్నిహోత్రము, వా యువుతోడ్పడం, బ్రళయకాలమునందలి యగ్నిహోత్రంబుపగిది, నాకాశంబు వంటి, పొగలులేని మంటలతో నిండ్లన్ని యువ్యాపించి, రాక్షసుల దేహంబులను నాజ్యముచే, మఱియువృద్ధిఁబొందినది.

అని, తాత్పర్యము.

ఆదిత్యకోటీ సదృశ స్సుతేజా
లంకాం సమస్తాం పరివార్య తిష్ఠన్
శబ్దై రనేకై రశనిప్రరూఢై
ర్భిందన్నివాండం ప్రబభౌ మహాగ్నిః. ౩౪

టీక॥ ఆదిత్యకోటీసదృశః = సూర్యులకోటితో సమానమయినదియును; సు

తేజాః= అధికమయినప్రభావముగలది యునగు;మహాగ్నిః=గొప్పయగ్నిహోత్రము;సమాప్తాం = సమస్తమయిన; లంకాం=లంకను; పరివార్య=చుట్టుకొని;తిష్ఠత్=ఉన్నదై; అశనిప్రరూఢైః=పిడుగులువలెఁగఠినములయిన;అనేకైః=పెక్కులయిన;శబ్దైః= ధ్వనులచేత; అండం= బ్రహ్మాండమును ; భిందన్నివ= భేదించునదివలె; ప్రబభౌ=ప్రకాశించినది.

ఆయగ్నిహోత్రము, కోటిసూర్యులకాంతి గల్గి వెలుంగుచుఁ, బిడుగులంబోనిశబ్దంబుల నేకంబులు సేయుచు,నీబ్రహ్మాండము నంతయుఁ బగులఁగొట్టుపోల్కిం,బ్రకాశించుచుండినది.

అని, తాత్పర్యము.

తత్రాంబరా దగ్ని రతిప్రవృద్ధో
రూక్షప్రభః కింశుక పుష్పచూడః

టీక॥తత్ర=అచ్చట; రూక్షప్రభః= తీక్ష్ణమయినకాంతిగలదియును; కింశుకపుష్పచూడః=మోదుగుపువ్వువంటిమంటలుగలదియునగు; అగ్నిః=అగ్నిహోత్రము;అంబరాత్ = ఆకాశపర్యంతము; అతిప్రవృద్ధః=మిక్కిలియు వృద్ధిఁ బొందినది.

అచ్చటఁ,దీక్ష్ణంబగుకాంతిగల్గి, మోదుగుపూలంబోలుమంటలతో నొప్పుచున్న,యాయగ్నిహోత్రము, ఆకాశంబువఱకువ్యాపించినది. అని,తాత్పర్యము.

నిర్వాణధూమా కులరాజయశ్చ
నీలోత్పలాభాః ప్రచకాశిరేభ్రాః. ౩౫

టీక ॥ నిర్వాణధూమాకులరాజయః=ఆఱుటయందలిపొగలచేఁగప్పఁబడినపజ్క్తులుగల; అభ్రాశ్చ (అభ్రాణిచ)=మేఘములును;నీలోత్పలాభాః = నల్లకలువలకాంతివంటికాంతిగలవై ; ప్రచకాశిరే=ప్రకాశించినవి.

ఇండ్లుమండిచల్లాఱు నప్పుడుగలుగుపొగలుగప్పుకొనుటంజేసి, యచ్చటిమేఘంబులు , నల్లకలువలకాంతిగల్గియొప్పుచుండినవి, అని, తాత్పర్యము.

వజ్రీ మహేంద్ర స్త్రీదశేశ్వరోవా
సాక్షాద్యమోవా వరుణో నిలోవా

రుద్రోగ్ని రర్కో ధనదశ్చ సోమో
నవానరోయం స్వయమేవ కాలః. ౩౬

టీక ॥ అయం=ఇతండు; వజ్రీ=వజ్రాయుధము గలవాఁడును; మహేంద్రః = వృత్రాసురుం జంపినవాఁడును; త్రిదశేశ్వరో వా=దేవతలకుఁ బ్రభుఁడునగు నిందుఁడో. సాక్షాద్యమో వా=సాక్షాత్ యముఁడో; వరుణః=వరుణుఁడో. అనిలో వా=వాయువో. రుద్రః=రుద్రుఁడో. అగ్నిః= అగ్నిహోత్రుఁడో.అర్కః=సూర్యుఁడో. ధనదశ్చ=కుబేరుఁడో.సోమః=చంద్రుఁడో. వానరః=కోఁతి;న=కాఁడు . స్వయంకాల ఏవ=సాక్షాత్ కాలుఁడే.

ఇతండు , వజ్రాయుధంబుదాల్చినవాఁడునువృత్రాసురుంజంపినవాఁడును దేవేంద్రుండునగునిందుఁడో ; లేక , సాక్షాత్ యముఁడో; లేక, వరుణుఁడో; వాయువో; రుద్రుఁడో ; అగ్నియో;సూర్యుఁడో, కుబేరుఁడో; చంద్రుఁడో; తెలియలేదు;వానరుండుమాత్రముకాఁడు; సాక్షాత్ యముండేయయియుండును. అని, తాత్పర్యము.

కిం బ్రహ్మణ స్సర్వపితామహస్య
సర్వస్య ధాతు శ్చతురాననస్య
ఇహాగతో వానర రూపధారీ
రక్షోపసంహారకరః ప్రకోపః. ౩౭

టీక॥సర్వపితామహస్య= సమస్తలోకంబులకును తాతయును;సర్వస్య=సమస్తముయొక్కయు;ధాతుః=ధరించువాఁడును;చతురాననస్య= నాలుగు మొగంబులుగలవాఁడునగు;బ్రహ్మణః=బ్రహ్మదేవునియొక్క;రక్షోపసంహారకరః(రక్షఉపసంహారకారః)=రాక్షసుల యొక్క యుపసంహారమునుజేయునట్టి; ప్రకోపః=కోపము; వానరరూపధారీ = కోఁతిరూపమునుధరించినదై ; ఇహ=ఇచ్చటికి, ఆగతఃకిం=వచ్చినదా యేమి?

సమస్తలోకంబులకును తాతయునుసమస్తలోకంబులను ధరించియున్నవాఁడునునాలుగు మొగంబులవాఁడునగుబ్రహ్మదేవుండు, రాక్షసులనందఱను రూపుమాపవలెననితలంపఁగా, నాయనకోపము,ఇట్లు, వానరరూపముదాల్చి యిచ్చటికి,వచ్చినదాయేమి?

అని, తాత్పర్యము.

కిం వైష్ణవం వా కపిరూప మేత్య
రక్షోవినాశాయ పరం సుతేజః
అనంత మవ్యక్త మచింత్య మేకం
స్వమాయయా సాంప్రత మాగతంవా. ౩౮

టీక॥అనంతం= పరిచ్ఛేదములేనిదియు;అవ్యక్తం= ఇంద్రియంబులకుఁగోచరంబుగానిదియు;అచింత్యం=ఎన్నరానిదియు; ఏకం=ఒకఁటియునగు;వైష్ణవం=విష్ణుసంబంధియగు;సుతేజో-వా= ఉత్కృష్టమయినతేజస్సే ; రక్షోవినాశాయ= రాక్షసులవినాశముకొఱకు; సాంప్రతం = ఇప్పుడు; స్వమాయయా=తనమాయచేత; కపిరూపం = వానరరూపమును;ఏత్య=పొంది; ఆగతంకింవా=వచ్చినదా?ఏమి?

లేక;పరిచ్ఛేదశూన్యంబునుజక్షురాదీంద్రియములకగోచరంబునుమనంబునకైననచింత్యంబునద్వితీయంబునగువైష్ణవంబయినతేజస్సే, ఇట్లు, రాక్షసులనశింపఁజేయుటకై ,తనమాయచేవానరరూపంబుఁదాల్చి,యిచ్చటికి, వచ్చెనా యేమి?అని,రాక్షసులు, చెప్పుకొనిరి.

అని,తాత్పర్యము.

ఇత్యేవ మూచు ర్బహవో విశిష్టా
రక్షోగణా స్తత్ర సమేత్య సర్వే
సప్రాణిసంఘాం సగృహాం సవృక్షామ్
దగ్ధాం పురీం తాం సహసా సమీక్ష్య. ౩౯

టీక॥సప్రాణిసంఘాం = ప్రాణిసమూహములతోఁగూడినదియు ; సగృహాం = ఇండ్లతోఁగూడినదియు;సవృక్షాం = వృక్షములతోఁగూడినదియునగు;తాం=ఆ;పురీం = లంకాపట్టణమును;సహసా=శీఘ్రముగా; దగ్ధాం=దహింపఁబడినదానిఁగా;సమీక్ష్య= చూచి;తత్ర=అచ్చట; బహవః=అనేకములగు;రక్షోగణాః= రాక్షససమూహములు;సర్వే=అంతయును; విశిష్టాః= కూడినవై;సమేత్య=చేరి;ఇతి=అని; ఏవం=ఇట్లు;ఊచుః=చెప్పిరి.

ప్రాణిసమూహంబులతోను గృహంబులతోను వృక్షంబులతోనునిమేష



మాత్రంబునన్ దగ్ధమయిన లంకాపట్టణముం జూచి, రాక్షసులందఱుగుంపులుచేరి, యీప్రకారముగాఁజెప్పఁదొడఁగిరి.

అని, తాత్పర్యము.

తతస్తు లంకా సహసా ప్రదగ్ధా
సరాక్షసా సాశ్వరథా సనాగా
సపక్షిసంఘా సమృగా సవృక్షా
రురోద దీనా తుములం సశబ్దమ్. ౪౦

టీక॥ తతస్తు=అటుపిమ్మటను; సరాక్షసా = రాక్షసులతోఁగూడినదియు; సాశ్వరథా= గుఱ్ఱములతోను రథములతోనుం గూడినదియు; సనాగా=ఏనుంగులతోనుం గూడినదియు; సపక్షిసంఘా= పక్షిసమూహములతోఁగూడినదియు; సమృగా=మృగములతోఁగూడినదియు; సవృక్షా=వృక్షములతోఁగూడినదియునగు; లంకా = లంకాపట్టణము; సహసా=తటాలున; ప్రదగ్ధా=దహింపఁబడినదై; దీనా=దైన్యమునొందినదై; తుములం=దొమ్మిగా; సశబ్దం= ధ్వనిగలుగునట్లుగా; రురోద=ఏడ్చినది.

అంత, లంకాపట్టణము, రాక్షసులతోను గుఱ్ఱంబులతోను రథంబులతోను గజంబులతోను పక్షిసమూహంబులతోను మృగంబులతోను వృక్షంబులతో నుదహింపఁబడునప్పుడు, అయ్యో ప్రాణులాక్రోశించుట మొదలగువానిచే, మిక్కిలియు, దీనధ్వనిగల్గినది.

అని, తాత్పర్యము.

హాతాత హాపుత్రక కాంత మిత్ర
హాజీవితం భోగయుతం సుపుణ్యమ్
రక్షోభి రేవం బహుధా బ్రువద్భి
శ్శబ్దః కృతో ఘోరతర స్సుభీమః. ౪౧

టీక॥ హా తాత=అయ్యోతండ్రీ! హా పుత్రక = అయ్యోచిన్నికొడుకా! కాంత=మనోహరుఁడా! మిత్ర = స్నేహితుఁడా! హా=అయ్యో! భోగయుతం= భోగముతోఁగూడినదియు; సుపుణ్యం= అధికమయినపుణ్యముగలదియునగు; జీ



వితం=ప్రాణము; గతం(అధ్యాహృతము)-పోయినదే!ఏవం=ఇట్లు; బహుధా=పెక్కువిధములుగా; బ్రువద్భిః=చెప్పుచున్న; రక్షోభిః=రాక్షసులచేత; ఘోరతరః= మిక్కిలియుఁదీవ్రమయినదియు;సుభీమః=మిక్కిలియుభయంకరమయినదియునగు;శబ్దః=ధ్వని;కృతః=చేయఁబడినది.

"అయ్యోతండ్రీ! అయ్యోముద్దుకొడుకా!అయ్యోప్రియుఁడా!అయ్యోస్నేహితుఁడా!అయ్యో!సమస్తభోగంబులననుభవింపఁదగినదియుబహుపుణ్యంబు సేయఁజాలునదియగుజీవితంబుపోవుచున్నదే!" అని,యిట్లు, రాక్షసులు, తమ తండ్రులు,కొడుకులు,ప్రియులు, స్నేహితులు,తాము,చచ్చునప్పుడు,భయంకరంబగు, శబ్దముగలుగునట్లు,అఱచిరి అని,తాత్పర్యము.

హుతాశనజ్వాలసమావృతా సా
హతప్రవీరా పరివృత్తయోధా
హనూమతః క్రోధబలాభిభూతా
బభూవ శాపోపహతేవ లంకా. ౪౨

టీక ॥ హుతాశనజ్వాల సమావృతా(హుతాశనజ్వాలాసమావృతా)=నిప్పుమంటలచేఁ గప్పఁబడినదియు; హతప్రవీరా = చంపఁబడినవీరులుగలదియు; పరివృత్తయోధా=తిరుగుడుపడినభటులుగలదియు ; హనూమతః=హనుమంతునియొక్క ; క్రోధబలాభిభూతా= కోపాతిశయముచేఁ దిరస్కరింపఁబడినదియునగు; సా=ఆ; లంకా = లంక; శాపోపహతేవ = శాపముచేఁ గొట్టఁబడినదివలె; బభూవ=ఉండినది.

హనుమంతుని కోపంబున, లంకయంతయునగ్నిహోత్రంబు చుట్టుకొని, వీరులుచచ్చియు,భటులందఱుఁదిరుగుడునొందియునుండుటంజేసి, యాలంకాపట్టణము, మహర్షిశాపముచే నాశనముచెందినట్లుండెను.

అని, తాత్పర్యము.

ససంభ్రమత్రస్తవిషణ్ణరాక్షసాం
సముజ్జ్వలజ్జ్వాలహుతాశనాంకితామ్
దదర్శ లంకాం హనుమాన్మహామనా

స్స్వయంభుకోపోపహతా మివా వనిమ్. ౪౩

టీక॥ మహామనాః = పూజ్యమయి నమనసుగల; హనుమాన్ = హనుమంతుండు; ససంభ్రమత్రస్తవిషణ్ణరాక్షసాం = త్రొట్రుపాటుతోఁగూడినవారును భయపడినవారును దుఃఖితులునగు రాక్షసులుగలదియు; సముజ్జ్వలజ్జ్వాలహుతాశనాంకితాం = మండుచున్నమంటలు గలనిప్పుచేనంకితమైనదియు; స్వయంభుకోపోపహతాం = బ్రహ్మదేవునికోపము చేఁగొట్టఁబడిన; అవనిమివ(స్థితాం) = భూమివలెనున్నదియునగు; లంకాం = లంకాపురిని; దదర్శ = చూచెను.

మహాధైర్యశాలి యగు హనుమంతుండు, సంభ్రాంతులును భీతులును దుఃఖితులునగు రాక్షసులతోఁ గూడినదియుఁ, గీలాభీలంబుగా జ్వలించుచున్న యగ్నిహోత్రంబుచేఁ గప్పఁబడినదియును, బ్రహ్మదేవునికోపంబునఁబ్రళయకాలంబున దహ్యమానంబగుభూమండలంబు చందంబున నొప్పుచున్న, లంకాపట్టణముం జూచెను.

అని, తాత్పర్యము.

భఙ్క్వా వనం పాదపరత్నసంకులం
హత్వాతు రక్షాంసి మహాంతి సంయుగే
దగ్ధ్వా పురీం తాం గృహరత్నమాలినీం
తస్థౌ హనూమాన్ పవనాత్మజః కపిః. ౪౪

టీక॥పవనాత్మజః = వాయుపుత్రుండగు; కపిః = కోఁతియయిన; హనూమాన్ = హనుమంతుండు; పాదపరత్నసంకులం = వృక్షశ్రేష్ఠములచేనిండిన; వనం = అశోకవనమును; భఙ్క్వా = విఱిచి; సంయుగే = యుద్ధమునందు; మహాంతి = గొప్పవారగు; రక్షాంసి = రాక్షసులను; హత్వాతు = చంపియు; గృహరత్నమాలినీం = గృహశ్రేష్ఠములపఙ్క్తిగల; తాం = ఆ; పురీం = లంకాపట్టణమును; దగ్ధ్వా = దహించియు; తస్థౌ = నిలిచెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు, మంచివృక్షంబులతోఁ గూడినయశోకవనంబంతయువిఱిచి, యుద్ధంబునగొప్పరాక్షసులంజంపి, యుత్తమంబులగుగృహంబులుగలయాలంకాపురిని

దహించి,యంత,మూరకుండెను. అని,తాత్పర్యము.

త్రికూటశృంగాగ్రతలే విచిత్రే
ప్రతిష్ఠితో వానరరాజసింహః
ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ
వ్యరాజతాదిత్య ఇవాంశుమాలీ. ౪౫

టీక॥త్రికూటశృంగాగ్రతలే = త్రికూటపర్వతము యొక్క శిఖరముయొక్క మీఁదిభాగమునందు; ప్రతిష్ఠితః=ఉన్నవాఁడునును;ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ (ప్రదీప్తలాంగూల కృతార్చిర్మాలీ)=మండుచున్న తోఁకచేఁ జేయఁబడినకిరణపఙ్క్తి గలవాఁడునగు; వానరరాజసింహః = వానరోత్తములలో శ్రేష్ఠుండగుహనుమంతుండు; అంశుమాలీ=కిరణపఙ్క్తిగల; ఆదిత్యఇవ=సూర్యుఁడువలె;వ్యరాజత= ప్రకాశించెను.

త్రికూటపర్వతశిఖరంబుననున్న హనుమంతుండు,తోఁకయందలిమంటలెకిరణంబులై యొప్పుమీఱఁ, గిరణంబులు గలసూర్యునిభంగిం,దేజరిల్లుచుండెను. అని,తాత్పర్యము.

స రాక్షసాం స్తాన్ సుబహూంశ్చ హత్వా
వనంచ భఙ్క్త్వా బహుపాదపం తత్
విసృజ్య రక్షోభవనేషు చాగ్నిం
జగామ రామం మనసా మహాత్మా. ౪౬

టీక॥ మహాత్మా= అధికమయినపరాక్రమముగల; సః= ఆహనుమంతుండు; సుబహూన్= మిక్కిలియునసనేకములయిన; తాన్=ఆ; రాక్షసాన్ = రాక్షసులను ; హత్వాచ = చంపియు;బహుపాదపం= పెక్కువృక్షములుగల; తత్=ఆ;వనం=అశోకవనమును; భఙ్క్త్వాచ=విఱిచియు ; రక్షోభవనేషు=రాక్షసులయిండ్లయందు ; అగ్నిం=అగ్నిహోత్రమును ; విసృజ్యచ=విడిచియు; మనసా=మనసుచేత ; రామం=రాముని; జగామ=పొందెను.

మహాపరాక్రమశాలియగు నాహనుమంతుండు, పెక్కురాక్షసులం జంపి, పెక్కువృక్షంబులుగల యశోకవనంబువిఱిచి, రాక్షసులగృహంబులం దగ్నిహోత్రంబు దరికొల్పి, యంత, రాముసొద్దకుఁబోఁగోరెను.

అని, తాత్పర్యము.

తతస్తు తాం వానరవీరముఖ్యం
మహాబలం మారుతతుల్యవేగమ్
మహామతిం వాయుసుతం వరిష్ఠం
ప్రతుష్టువు ర్దేవగణాశ్చ సర్వే. ౪౭

టీక॥తతస్తు=అటుపిమ్మటను; దేవగణాః=దేవతాసమూహములు;సర్వే చ=అందఱును ; వానరవీరముఖ్యం=వానరవీరులలో శ్రేష్ఠుండును; మహాబలం=అధికమయినబలముగలవాఁడును; మారుతతుల్యవేగం = వాయువుయొక్కవేగమువంటి వేగముగలవాఁడును; మహామతిం=అధికమయినబుద్ధిగలవాఁడును;వరిష్ఠం=శ్రేష్ఠుండును; వాయుసుతం=వాయుదేవుని కుమారుండునగు; తం=ఆహనుమంతుని;తుష్టువుః= పొగడిరి.

అంత, దేవతలందఱు,వానరవీరశ్రేష్ఠుండును మహాబలుండును వాయుదేవునకుంబోలెవేగంబుగలవాఁడును, మహాబుద్ధిశాలియు , నుత్తముండునువాయుదేవునికుమారుండునగు నాహనుమంతుం,బ్రస్తుతించిరి.

అని, తాత్పర్యము.

భజ్క్త్వా వనం మహాతేజా హత్వా రక్షాంసి సంయుగే
దగ్ధ్వా లంకాపురీం రమ్యాం రరాజ స మహాకపిః. ౪౮

టీక॥మహాతేజాః = అధికమయినకాంతిగలవాఁడును; మహాకపిః=పెద్దకోఁతియునగు;సః = ఆహనుమంతుండు;వనం=అశోకవనమును;భజ్క్త్వా=విఱిచి; సంయుగే=యుద్ధమునందు ; రక్షాంసి= రాక్షసులను;హత్వా= చంపి;రమ్యాం=సుందరమయిన;లంకాపురీం=లంకాపట్టణమును;దగ్ధ్వా=కాల్చి;

రరాజ=ప్రకాశించెను.

మహాతేజశ్శాలియగు నాహనుమం తుండు,అశోకవనంబునువిఱిచి , యుద్ధంబునరాక్షసులంజంపి,రమ్యంబగులంకాపురియంతయుదహించి , యొప్పుచుండెను. అని,తాత్పర్యము.

తతో దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః
దృష్ట్వా లంకాం ప్రదగ్ధాం తాం విస్మయం పరమం గతాః. ౪౯

టీక॥తత్ర=అచ్చట;సగంధర్వాః=గంధర్వులతోఁగూడిన;దేవాః= దేవతలును;సిద్ధాశ్చ=సిద్ధులును; పరమర్షయః = పూజ్యులగుఋషులును;ప్రదగ్ధాం=దహింపఁబడిన;తాం = ఆ;లంకాం = లంకాపట్టణమును;దృష్ట్వా=చూచి;పరమం = అధికమయిన;విస్మయం=ఆశ్చర్యమును;గతాః=పొందిరి.

అప్పుడు, దేవతలునుగంధర్వులును సిద్ధులునుమహర్షులును, ఆలంకాపట్టణంబంత యుదహింపఁబడియుండుటం జూచి,పరమాశ్చర్యంబునొందిరి. అని,తాత్పర్యము.

తం దృష్ట్వా వానరశ్రేష్ఠం హనుమంతం మహాకపిమ్
కాలాగ్ని రితిసంచింత్య సర్వభూతాని తత్రసుః. ౫౦

టీక॥సర్వభూతాని= సమస్తప్రాణులు;వానరశ్రేష్ఠం= వానరోత్తముండును;మహాకపిం= పెద్దకోఁతియునగు; తం=ఆ;హనుమంతం= హనుమంతుని; దృష్ట్వా=చూచి;"కాలాగ్నిః=ప్రళయకాలాగ్నిహోత్రము."ఇతి=అని; సంచింత్య=తలంచి;తత్రసుః = భయపడినవి.

భూతంబులన్నియు , వానరోత్తముండగుహనుమంతుంజూచి, ప్రళయకాలాగ్నిహోతురిండనితలంచి,భయంబునొందినవి.అని,తాత్పర్యము.

దేవాశ్చ సర్వే మునిపుంగవాశ్చ
గంధర్వవిద్యాధరనాగయక్షాః
భూతాని సర్వాణి మహాంతి తత్ర

జగ్ముః పరాం ప్రీతి మతుల్యరూపామ్. ౫౧

టీక॥ తత్ర = అచ్చట; దేవాశ్చ = దేవతలును; మునిపుంగవాశ్చ = మునిశ్రేష్ఠులును; గంధర్వవిద్యాధరనాగయక్షాః = గంధర్వులును విద్యాధరులును సర్పములును యక్షులును; సర్వే = అందఱును; సర్వాణి = సమస్తములయిన; మహాంతి = పూజ్యములగు; భూతాని = భూతములును; అతుల్యరూపాం = సరిలేనియాకారముగల; పరాం = అధికమయిన; ప్రీతిం = సంతోషమును; జగ్ముః = పొందినవి.

దేవతలును మునిశ్రేష్ఠులును గంధర్వులును విద్యాధరులును సర్పములును యక్షులును, సమస్తప్రాణులును, లంకాపట్టణము దహింపఁబడుటవలన, సరిలేని సంతోషమునొందిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, చతుఃపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండచతుఃపంచాశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

పంచపంచాశసర్గప్రారంభః.

లంకాం సమస్తాం సందీప్య లాంగూలాగ్నిం మహాబలః
నిర్వాపయామాస తదా సముద్రే హరిసత్తమః. ౧

టీక॥ మహాబలః = అధికమయిన బలముగల; హరిసత్తమః = వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు; లంకాం = లంకాపట్టణమును; సమస్తాం = అంతను; సందీప్య = వెలిఁగించి; తదా = అప్పుడు; లాంగూలాగ్నిం = తోఁకయందలినిప్పును; సముద్రే = సముద్రమునందు; నిర్వాపయామాస = ఆర్చెను.

మహాబలశాలియయినవానరోత్తముండునగుహనుమంతుండు, లంకయంతయుదహించియయినపిమ్మట, లోంకను, సముద్రములోముంచి,చల్లార్చెను.

అని, తాత్పర్యము.

సందీప్యమానాం విధ్వస్తాం త్రస్తరక్షోగణాం పురీమ్
అవేక్ష్య హనుమాన్ లంకాం చింతయామాస వానరః. ౨

టీక॥వానరః=కోతియగు ; హనుమాన్=హనుమంతుండు;సందీప్యమానాం=వెలిగింపఁబడుచున్నదియు; విధ్వస్తాం=చెడినదియు ; త్రస్తరక్షోగణాం=భయముపడినరాక్షసులసమూహముగలదియునగు ; లంకాం=లంకయను ; పురీం = పట్టణమును; అవేక్ష్య=చూచి; చింతయామాస= చింతించెను.

హనుమంతుం,డంత, నగ్నిహోత్రంబుచేదహింపఁబడినయాలంకాపట్టణంబంతయు, ధ్వస్తంబయి, యారాక్షసులందఱుభయంబునొంది, యుండుటంజూచి,యిట్లని,చింతించెను.

అని, తాత్పర్యము.

తస్యాభూత్సుమహాంస్త్రాసః కుత్సాచాత్మన్యజాయత

టీక॥తస్య=ఆహనుమంతునకు; సుమహాన్ = మిక్కిలియునధికమయిన; త్రాసః=భయము;అభూత్= కలిగినది.ఆత్మనః=తనయందు;కుత్సాచ=నిందయును;అజాయత=కలిగినది.

ఆహనుమంతునకు, మనంబున, మహాభయంబుగలిగినది ; తన్నుమిక్కిలియు,నిందించుకొనెను.

అని, తాత్పర్యము.

లంకాం ప్రదహతా కర్మ కింస్విత్కృతమిదం మయా. ౩

టీక॥ లంకాం=లంకాపట్టణమును; ప్రదహతా=దహించుచున్న;మయా=నాచేత;ఇదం=ఈ;కింస్విత్=ఏ;కర్మ=కార్యము;కృతం=చేయఁబడినది?

నేనీలంకాపట్టణముదహించినానే! ఎంత చెడ్డకార్యముచేసినాను!

అని, తాత్పర్యము.

ధన్యా స్తే పురుషశ్రేష్ఠా యే బుద్ధ్యా కోప ముత్థితమ్
నిరుంధంతి మహాత్మానో దీప్త మగ్ని మివాంభసా. ౪

టీక॥ యే=ఏ; మహాత్మానః=పూజ్యమయినస్వభావముగలపురుషులు; ఉత్థితం=లేచిన; కోపం = కోపమును; బుద్ధ్యా=బుద్ధిచేత; అంభసా=జలముచేత; దీప్తం=మండుచున్న; అగ్నిమివ= నిప్పునువలె; నిరుంధంతి = అడ్డగించుచున్నారో; తే=అట్టి; పురుషశ్రేష్ఠాః= పురుషోత్తములు; ధన్యాః = పుణ్యవంతులు.

ఎవ్వరు, కోపంబువచ్చునప్పుడు, జలముచే మండుచున్ననిప్పును జల్లార్చునట్లు, ఆకోపమునుబుద్ధిచేనిరోధించుకొందురో, అట్టి, మహాత్ములగుపురుషశ్రేష్ఠులు, పుణ్యవంతులు. అని, తాత్పర్యము.

క్రుద్ధః పాపం నకుర్యా త్కః క్రుద్ధో హన్యాద్గురూనపి
క్రుద్ధః పరుషయా వాచా నర స్సాధూ నధిక్షిపేత్. ౫

టీక॥ క్రుద్ధః = కోపించినవాఁడు; కః=ఎవ్వఁడు; పాపం=పాపమును; నకుర్యాత్=చేయఁడు? క్రుద్ధః= కోపించినవాఁడు; గురూనపి=గురుజనములనైనను; హన్యాత్=చంపును. క్రుద్ధః= కోపమునొందిన, నరః=మనుష్యుఁడు; పరుషయా=కఠినమయిన; వాచా= మాటచేత; సాధూన్=పెద్దలను; అధిక్షిపేత్=ఆక్షేపించును.

కోపంబునొందినవాఁడెవ్వఁడుపాపముసేయకుండును? కోపంబునొందినవాఁడుగురువులనుఁగూడఁజంపును; కోపంబునొందినవాఁడు, పరుషవాక్యంబున, సత్పురుషులం, దిరస్కరించును. అని, తాత్పర్యము.

వాచ్యావాచ్యం ప్రకుపితో నవిజానాతి కర్హిచిత్
నాకార్య మస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే క్వచిత్. ౬

టీక॥ ప్రకుపితః=మిక్కిలియుఁ గోపంబునొందినవాఁడు; వాచ్యావాచ్యం=చెప్పఁదగినదానిని జెప్పఁదగనిదానిని; కర్హిచిత్=ఒకానొకప్పుడును; నవిజా

నాస్తి=ఎఱుఁగఁడు. క్రుద్ధస్య=కోపము నొందినవానికి; క్వచిత్= ఎచ్చటనైనను; అకార్యం= చేయఁగూడనిది ; నాస్తి=లేదు. అవాచ్యం=చెప్పఁదగనిది; నవిద్యతే=లేదు.

కోపంబునొందినవాఁడు, "ఇది చెప్పఁదగినమాట, ఇదిచెప్పందగని మాట" యనియెఱుంగఁడు ; క్రుద్ధునకుఁజేయఁగూడనికార్యమేదియులేదు, చెప్పఁగూడనిమాటయేదియునులేదు.

అని, తాత్పర్యము.

యస్సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి
యథోరగ స్త్వచం జీర్ణాం సవై పురుష ఉచ్యతే. ౭

టీక॥యః=ఎవ్వఁడు ; సముత్పతితం=పుట్టిన; క్రోధం= కోపమును; క్షమయైవ=ఓపికచేతనే; జీర్ణాం=జీర్ణమయిన; త్వచం=చర్మమును; ఉరగో యథా=సర్పమువలె; నిరస్యతి= విడుచునో; సవై =అతండె; పురుషః= పురుషుఁడుగా; ఉచ్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

ఎవ్వండు, సర్పముజీర్ణమయిన కుబుసమును విడుచునట్లు, తనకుం గల్గినకోపంబును, ఓపికచే, నణఁచుకొనునో, అతండె, పురుషుండనంబడును.

అని, తాత్పర్యము.

ధిగస్తు మాం సుదుర్బుద్ధిం నిర్లజ్జం పాపకృత్తమమ్
అచింతయిత్వా తాం సీతా మగ్నిదం స్వామిఘాతకమ్. ౮

టీక॥సుదుర్బుద్ధిం= మిక్కిలియదుష్టమయినబుద్ధిగలవాఁడను; నిర్లజ్జం= సిగ్గులేనివాఁడను; పాపకృత్తమం= పాపముసేయువారలలో నుత్తముండను; తాం=ఆ; సీతాం=సీతను; అచింతయిత్వా=తలంపక; అగ్నిదం=నిప్పునిచ్చినవాఁడను; స్వామిఘాతకం=ప్రభువునుజెఱిపినవాఁడనగు; మాం=నన్నుఁగూర్చి; ధిక్=దహింపబడుట; అస్తు=అగుగాక.

నేను, సీతయున్నదనితలంపక, లంకకునిప్పుముట్టించినాను, గావున, నేను స్వామిద్రోహిని, దుర్బుద్ధిని; సిగ్గులేనివాఁడను; పాపిష్ఠుండను; నేనుదహింపఁబడుదునుగాక. అని, తాత్పర్యము.

యది దగ్ధా త్వియం లంకా నూన మార్యాపి జానకీ
దగ్ధా తేన మయా భర్తుః హృతం కార్య మజానతా. ౯

టీక॥ ఇయం=ఈ; లంకాతు= లంకయంతయు; దగ్ధా= దహింపఁబడినది. ఆర్యా = పూజ్యురాలగు ; జానక్యపి=సీతయును; దగ్ధాయది= దహింపఁబడినదగునేని; తేన = అందుచేత; అజానతా= తెలియనట్టి, అజ్ఞాని నగు ననుట; మయా=నాచేత; భర్తుః = ప్రభువుయొక్క; కార్యం=పని ; హృతం=చెఱుపఁబడినది. నూనం = నిశ్చయము.

ఈలంకయంతయు దహింపఁబడినది; ఇప్పుడు, పూజ్యురాలగు, సీతయు దహింపఁబడియుండునేని , నేనజ్ఞానినై, ప్రభుకార్యమునంతయుఁ జెఱిచినవాఁడనగుచున్నాను; నిశ్చయము!

అని, తాత్పర్యము.

యదర్థ మయ మారంభ స్త త్కార్య మవసాదితమ్
మయాహి దహతా లంకాం న సీతా పరిరక్షితా. ౧౦

టీక॥ యదర్థం=దేనికొఱకు; అయం=ఈ; ఆరంభః=ప్రయత్నమో; తత్=ఆ; కార్యం = పని; అవసాదితం=నశింపఁజేయఁబడినది. లంకాం= లంకను; దహతా=దహించుచున్న ;మయా=నాచేత; సీతా=సీతాదేవి; న పరిరక్షితాహి= రక్షింపఁబడదయ్యెఁగదా!

ఏకార్యముకొఱకు, ఇంతమహాప్రయత్నముచేయఁబడినదో , అట్టికార్యము ను జెఱచినాను; నేను,లంకనుదహించునప్పుడు, సీతాదేవిని రక్షింపనైతిని గదా! అని, తాత్పర్యము.

ఈష త్కార్య మిదం కార్యం కృత మాసీ న్నసంశయః
తస్య క్రోధాభి భూతేన మయా మూలక్షయః కృతః. ౧౧

టీక॥ఇదం=ఈ;కార్యం=పని; ఈషత్కార్యం= కొంచెమె చేయఁదగినదిగా;కృతం=చేయఁబడినది; ఆసీత్=అయినది.సంశయః=సందేహము;న=లే

దు.క్రోధాభిభూతేన=కోపముచేలోఁగొనఁబడిన;మయా=నాచేత;తస్య=ఆ కార్యముయొక్క;మూలక్షయః=మూలనాశము;కృతః=చేయఁబడినది.

సముద్రముదాఁటుటయు, సీతనువెదకిచూచుటయు రామునకుఁ దెల్పుటయు మొదలుగాఁగలయీగొప్పకార్యమును, అంతయు సాధించియుంకరామునకుఁదెల్పుటయె, మిగిలినదిగాఁజేయఁబడినది;ఇందుసందియము లేదు; అయితే,ఇప్పుడు, నేనుక్రుద్ధుండనై, యాకార్యమునకు మూలభూతయయినసీతాదేవికే,నాశముగల్గించినాను.

అని, తాత్పర్యము.

వినష్టా జానకీ నూనం నహ్యాదగ్ధః ప్రదృశ్యతే
లంకాయాం కశ్చి దుద్దేశ స్సర్వాభస్మీ కృతా పురీ. ౧౨

టీక॥జానకీ=సీతాదేవి;వినష్టా=నశించినది.నూనం=నిశ్చయము. లంకాయాం=లంకయందు;కశ్చిత్=ఒకానొక;ఉద్దేశః=ప్రదేశమును;అదగ్ధః=దహింపఁబడనిదిన;నప్రదృశ్యతేహి=చూడఁబడదుగదా!సర్వా=సమస్తమయిన;పురీ=పట్టణము; భస్మీకృతా=భస్మముచేయఁబడిఁది.

సీతాదేవి నిశ్చయముగానే నశించియుండును; లంకయందు; ఒక్కప్రదేశమయినను,దగ్ధముగాకుండునది యగపడలేదు; పట్టణంబంతయు దగ్ధమయియున్నది. అని, తాత్పర్యము,

యది త ద్విహతం కార్యం మమ ప్రజ్ఞావిపర్యయాత్
ఇహైవ ప్రాణసన్న్యాసో మమాపి హ్యద్య రోచతే. ౧౩

టీక॥తత్=ఆ; కార్యం=పని ; మమ=నాయొక్క;ప్రజ్ఞావిపర్యయాత్=బుద్ధివైపరీత్యమువలన; విహతంయది=కొట్టఁబడినదగునేని;మమాపి=నాకును;అద్య=ఇప్పుడు; ఇహైవ=ఇచ్చటనే, ప్రాణసన్న్యాసః=ప్రాణంబులవిడుచుట;రోచతేహి=రుచించుచున్నది.

నాబుద్ధివైపరీత్యమువలన,సీతనశించియుండునేని,నేనును, ఇప్పుడిచ్చటనె,ప్రాణంబులవిడుచుట, యుక్తమని తోఁచుచున్నది.అని, తాత్పర్యము.

కి మగ్నౌ నిపతా మ్యద్య ఆహొస్విద్బడబాముఖే
శరీర మాహో సత్త్వానాం దద్మి సాగరవాసినామ్. ౧౪

టీక॥ అద్య=ఇప్పుడు; అగ్నౌ=అగ్నిహోత్రమునందు; నిపతామికిం= పడుదునా యేమి? ఆహొస్విత్=లేక; బడబాముఖే=పాతాళమునందు; నిపతామికిం(అధ్యాహృతము)= పడుదునా యేమి? ఆహో=లేక; శరీరం= దేహమును; సాగరవాసినాం=సముద్రమునందుండునట్టి; సత్త్వానాం= జంతువులకు; దద్మి(దదామి)=ఇత్తునా యేమి?

నేనిప్పుడు, ప్రాణంబులవిడుచుటకు, నిప్పులోదుముకుదునా? లేక, పాతాళంబునంబడుదునా? లేక, సముద్రంబులోఁబడి, యందునివసించుసత్వంబులకు, నాదేహము నాహారంబుగా నొసంగుదునా? అని, తాత్పర్యము.

కథంహి జీవతా శక్యో మయా ద్రష్టుం హరీశ్వరః
తౌవా పురుషశార్దూలౌ కార్యసర్వస్వఘాతినా. ౧౫

టీక॥ కార్యసర్వస్వఘాతినా= కార్యమునంతయునశింపఁజేసిన; జీవతా= బ్రతుకుచున్న; మయా=నాచేత; కథంహి=ఎట్లు; హరీశ్వరః= వానరనాయకుండగుసుగ్రీవుండు; ద్రష్టుం= చూచుటకు; శక్యః = అలవియగును? పురుషశార్దూలౌ=పురుషశ్రేష్ఠులగు; తౌవా= ఆరామలక్ష్మణులైనను; కథం, ద్రష్టుం, శక్యౌ(అధ్యాహృతము)=ఎట్లు, చూచుటకు, అలవియగుదురు?

నేనిట్లు కార్యమునంతయుఁ జెఱపి, జీవించియుండియు, వానరేశ్వరుండగు సుగ్రీవునెట్లు చూడఁగలను? పురుషశ్రేష్ఠులగు నా రామలక్ష్మణులనైనను, ఎట్లు చూడఁగలను? అని, తాత్పర్యము.

మయాఖలు తదేవేదం రోషదోషాత్ప్రదర్శితమ్
ప్రథితం త్రిషు లోకేషు కపిత్వ మనవస్థితమ్. ౧౬

టీక॥ మయా = నాచేత; త్రిషు= మూఁడైన; లోకేషు=లోకములందు; ప్రథితం=ప్రసిద్ధమయిన; అనవస్థితం = వ్యవస్థలేకుండుటయనెడు; తత్= ఆ;

ఇదం=ఈ; కపిత్వమేవ= కోఁతిస్వభావమునే; రోషదోషాత్ = కోపముయొక్క-దోషమువలన; ప్రదర్శితం ఖలు=చూపఁబడినదిగదా! ముల్లోకంబులందును బ్రసిద్ధమయిన కోఁతిస్వభావమగు నాచాంచల్యమునే, యిప్పుడు నేను, కోపంబుచే, లంకనుదహించి, యందఱకుం దెల్పినవాఁడనైతిని. అని, తాత్పర్యము.

ధిగస్తు రాజసం భావ మనీశ మనవస్థితమ్
ఈశ్వరేణాపి యద్రాగా న్మయా సీతా నరక్షితా. ౧౭

టీక॥ యత్ = ఏకారణమువలన; సీతా=సీతాదేవి; నరక్షితా= రక్షింపఁబడలేదో; తత్(అధ్యాహృతము) = ఆకారణమువలన; అనీశం= నియామకుఁడు లేనిదియు; అనవస్థితం= వ్యవస్థ లేనిదియునగు; రాజసం = రజోగుణసంబంధియయిన; భావం=స్వభావమునుగూర్చి; ధిక్ =దహింపంబడుట ; అస్తు=అగుఁగాక.

నేను, రక్షింపసమర్థుఁడనైనను, ఇప్పుడుకోపమువలన , సీతాదేవిని రక్షింపనైతిని , గావున, నతిస్వతంత్రమును జపలమునగురాజసస్వభావము, దహింపఁబడుఁగాక. అని, తాత్పర్యము.

వినష్టాయాంతు సీతాయాం తావుభౌ వినశిష్యతః
తయో ర్వినాశే సుగ్రీవ స్సబంధు ర్వినశిష్యతి. ౧౮

టీక॥సీతాయాం = సీతాదేవి;వినష్టాయాంతు=నశించినంతనే;తౌ= ఆరామలక్ష్మణులు;ఉభౌ=ఇద్దఱును;వినశిష్యతః=నశింపంగలరు. తయోః= ఆరామలక్ష్మణులయొక్క; వినాశే=నాశముకాఁగా;సబంధుః=బంధువులతోఁగూడిన;సుగ్రీవః=సుగ్రీవుఁడు; వినశిష్యతి=నశింపంగలఁడు.

సీతాదేవి, నాశమునొందుటదెలిసినంతనె,యారామలక్ష్మణులిద్దఱునునాశమునొందఁగలరు;అంతవారలిద్దఱును నశించినపిమ్మట,సుగ్రీవుండుసమస్తబంధువులతోడ,నాశమునొందును.

అని, తాత్పర్యము.

ఏతదేవ వచ శ్శ్రుత్వా భరతో భ్రాతృవత్సలః

ధర్మాత్మా సహశత్రుఘ్నః కథం శక్ష్యతి జీవితుమ్. ౧౯

టీక॥ ఏతత్=ఈ; వచః= మాటను; శ్రుత్వైవ= విన్నంతనె; భ్రాతృవత్సలః= తోఁబుట్టువులయందతిప్రేమగలవాఁడును; ధర్మాత్మా= ధర్మస్వభావుఁడునగు; సహశత్రుఘ్నః= శత్రుఘ్నునితోఁగూడిన; భరతః=భరతుఁడు; కథం=ఎట్లు; జీవితుం= బ్రతుకుటకు; శక్ష్యతి= చాలును ? నశించుననుట.

ఈమాటనువిన్నంతనె, భ్రాతృవత్సలుఁడును ధర్మాత్ముండునగు భరతుండును శత్రుఘ్నుండును, నశింపఁగలరు. అని, తాత్పర్యము.

ఇక్ష్వాకువంశే ధర్మిష్ఠే గతే నాశ మసంశయమ్
భవిష్యంతి ప్రజా స్సర్వా శ్శోకసంతాపపీడితాః. ౨౦

టీక॥ధర్మిష్ఠే=మిక్కిలియుధర్మముగల; ఇక్ష్వాకువంశే=ఇక్ష్వాకువంశము; నాశం=నాశమును; గతే= పొందఁగా; అసంశయం= సందేహములేకుండునట్లుగా; ప్రజాః=ప్రజలు ; సర్వాః=అందఱును ; శోకసంతాపపీడితాః=దుఃఖముచేతను సంతాపముచేతనుబీడింపఁబడినవారలు; భవిష్యంతి= కాఁగలరు.

ఇట్లు, పరమధార్మికంబగు నిక్ష్వాకువంశంబంతయునశింపఁగానె , జనులందఱు, దుఃఖంబుచేతను సంతాపముచేతనుంబీడితులుకాఁగలరు.

అని, తాత్పర్యము.

త దహం భాగ్యరహితో లుప్తధర్మార్థసంగ్రహః
రోషదోషపరీతాత్మా వ్యక్తం లోకవినాశనః. ౨౧

టీక॥తత్=అందువలన, అహం=నేను; భాగ్యరహితః = భాగ్యముచేవిడువఁబడినవాఁడను. లుప్తధర్మార్థసంగ్రహః= లోపించినధర్మార్థంబులసంగ్రహించుటగలవాఁడను. రోషదోషపరీతాత్మా = కోపముయొక్కదోషముచే వ్యాపింపఁబడినమనసుగలవాఁడను. లోకవినాశనః=లోకంబులనశింపఁ

జేయువాఁడను. ఇతి (అధ్యాహృతము)=అని;వ్యక్తం=స్పష్టము.

అట్లగుటంజేసి, నేను, నిర్భాగ్యుండను;ధర్మార్థంబులు రెంటను లేనివాఁడను;పాపస్వభావముగలవాఁడను; లోకంబులకన్నిటికి, వినాశము దెచ్చువాఁడను;అని,స్పష్టము.అని,హనుమంతుండు, చింతించెను.అని, తాత్పర్యము.

ఇతి చింతయత స్తస్య నిమిత్తా న్యుపపేదిరే
పూర్వమ ప్యుపలబ్ధాని సాక్షా త్పునరచింతయత్. ౨౨

టీక॥తస్య=ఆహనుమంతుండు; ఇతి=ఇట్లు;చింతయతః = ఆలోచించుచుండఁగా;పూర్వమపి=ముందును;ఉపలబ్ధాని=చూడఁబడిన; నిమిత్తాని=శుభసూచకములగు నిమిత్తములు ; సాక్షాత్ = ప్రత్యక్షముగా;తం(అధ్యాహృతము)=అతని;ఉపపేదిరే= పొందినవి.పునః=మఱల;అచింతయత్ = ఆలోచించెను.

హనుమంతుండిట్లు, చింతించుచుండఁగా, నిదివఱకతనికిఁ గొంచెముగాఁ దోఁచియున్న శుభనిమిత్తములు , చక్కఁగాఁదెలియునట్లు , మిక్కుటముగాఁ,గలిగినవి;అంతనతండు,మఱల, నిట్లని,యాలోచించెను.

అని, తాత్పర్యము.

అథవా చారుసర్వాంగీ రక్షితా స్వేన తేజసా
న నశిష్యతి కల్యాణీ నాగ్ని రగ్నౌ ప్రవర్తతే. ౨౩

టీక॥అథవా—అటుగాదేని; కల్యాణీ=మంగళరూపిణియగు;చారుసర్వాంగీ— సుందరములయిన సమస్తావయవములునుగలసీతాదేవి; స్వేన= తనదైన; తేజసా=ప్రభావముచేత;రక్షితా= రక్షింపఁబడినదై ; ననశిష్యతి=నశించియుండదు.అగ్నిః=నిప్పు;అగ్నౌ=నిప్పునందు; నప్రవర్తతే=ప్రవర్తింపదు.

అటుగాదేని, మంగళరూపిణియగు నాసీతాదేవి,యెంతమాత్రమునాశము నొందదు; తన తేజస్సుచేతనే రక్షింపఁబడియుండును;అగ్నిహోత్రము, అగ్నిహోత్రమునెట్లుదహించును?

అని, తాత్పర్యము.

నహి ధర్మాత్మన స్తస్య భార్యా మమితతేజసః

స్వచారిత్రాభిగుప్తాం తాం స్ప్రష్టు మర్హతి పావకః. ౨౪

టీక॥ పావకః=అగ్నిహోత్రుఁడు; ధర్మాత్మనః=ధర్మస్వభావుండును; అమితతేజసః=కొలందిలేని కాంతిగలవాఁడునగు; తస్య= ఆరాముని యొక్క; భార్యాం=పెండ్లామును; స్వచారిత్రాభిగుప్తాం=తనచరిత్రముచేత రక్షింపఁబడినదియునగు; తాం=ఆసీతను; స్ప్రష్టుం=తాఁకుటకు; నార్హతిహి=తగఁడుగదా!

ధర్మాత్ముండును గొలందిలేనితేజంబు గలవాఁడునగు రామునిభార్యయుఁదనపాతివ్రత్యమహిమచే రక్షింపఁబడినదియునగుసీతాదేవిని, అగ్నిహోతుండు,స్పృశింపనైనంజాలఁడు.

అని, తాత్పర్యము.

నూనం రామప్రభావేన వైదేహ్యా స్సుకృతేనచ
యన్మాం దహనకర్మాఽయం నాదహ ద్ధవ్యవాహనః. ౨౫

టీక॥ దహనకర్మా= దహించుటయె కార్యముగాఁగల ; అయం=ఈ; హవ్యవాహనః= అగ్నిహోత్రుఁడు; మాం=నన్ను; నాదహత్ (ఇతి) యత్=దహింపఁడయ్యెననునది యేదిగలదో; తత్ (అధ్యాహృతము)=అది; రామప్రభావేన=రామునిప్రభావముచేతను; వైదేహ్యాః=సీతాదేవియొక్క; సుకృతేనచ=పుణ్యముచేతను; ఆసీత్ (అధ్యాహృతము)=అయినది.

దహించుటయెస్వభావముగాఁగల యీయగ్నిహోత్రుండు, నన్నుదహింపకుండుటయు , రామునిప్రభావంబునను సీతాదేవిపుణ్యమహిమంబునను, అయినదిగాని, వేఱుగాదు.

అని, తాత్పర్యము.

త్రయాణాం భరతాదీనాం భ్రాతౄణాం దేవతాచ యా
రామస్యచ మనఃకాంతా సా కథం వినశిష్యతి. ౨౬

టీక॥ యా=ఎవ్వతె ; భరతాదీనాం= భరతుఁడు మొదలుగాఁగల; భ్రాతౄణాం=తోఁబుట్టువులకు; త్రయాణాం=ముగ్గురికిని; దేవతాచ= దేవతయునో; రామస్య = రామునకు; మనఃకాంతాచ=మనఃప్రియయునో; సా=అట్టిసీతా

దేవి;కథం=ఎట్లు; వినశిష్యతి=నశింపం గలదు?

భరతలక్ష్మణశత్రుఘ్నులకు మువ్వ రికిని దేవతయు, రామునకుమనఃప్రియ యునగుసీతాదేవియు,నెట్లునశించును?

అని, తాత్పర్యము.

యద్వా దహనకర్మాఽయం సర్వత్ర ప్రభురవ్యయః
నమే దహతి లాంగూలం కథ మార్యాం ప్రధక్ష్యతి. ౬౨

టీక॥యద్వా — లేక; దహనక ర్మా= దహించుటయెకార్యముగాఁ గలవాఁడును; సర్వత్ర=అంతటను;ప్ర భుః=వ్యాపించువాఁడును; అవ్యయః= నాశములేనివాఁడునగు;అయం= ఈ యగ్నిహోత్రుఁడు; మే=నాయొక్క; లాంగూలం=తోఁకను;నదహతి = ద హింపకున్నాఁడు.ఆర్యాం= పూజ్యు రాలగు సీతాదేవిని;కథం=ఎట్లు; ప్రధ క్ష్యతి=దహించును?

అటుగాదేని, దహనస్వభావుండు ను,ఎచ్చటనుఅడ్డములేనివాఁడునునాశర హితుండునగు నీయగ్నిహోత్రుండు, నాతోఁకనే దహింపలేదే; ఇంకఁబూ జ్యురాలగుసీతాదేవి,నెట్లు, దహించు ను.అని,హనుమంతుండు, చింతించెను.

అని, తాత్పర్యము.

పునశ్చాఽ చింతయ త్తత్ర హనుమాన్ విస్మిత స్తదా
హిరణ్యనాభస్య గిరే ర్జలమధ్యే ప్రదర్శనమ్. ౬౩

టీక॥తత్ర=అచ్చట; తదా=అప్పు డు;హనుమాన్=హనుమంతుఁడు;పున శ్చ=మఱలను;విస్మితః=అశ్చర్యమునొం దినవాఁడై;జలమధ్యే=నీటినడుమ;హిర ణ్యనాభస్య=మైనాకమను;గిరేః=పర్వ తముయొక్క;ప్రదర్శనం=చూచుటను; అచింతయత్=తలంచెను.

అంత,నచ్చట,హనుమంతుండు, మ ఱల,బరమాశ్చర్యంబునొంది, సముద్ర మధ్యంబునఁదనకు మైనాకపర్వతంబగ పడుటందలంచెను.

అని, తాత్పర్యము.

తపసా సత్యవాక్యేన అనన్యత్వాచ్చ భర్తరి

అపి సా నిర్దహేద గ్నిం న తా మగ్నిః ప్రధక్ష్యతి. ౨౯

టీక॥ సా=ఆసీతాదేవి; తపసా=తపస్సుచేతను; సత్యవాక్యేన = సత్యవాక్యముచేతను; భర్తరి= పెనిమిటి విషయమయి; అనన్యత్వాచ్చ=ఇతరుఁడు లేకుండుటవలనను; అగ్నిమపి=అగ్ని హోత్రునైనను; నిర్దహేత్ = దహించును. అగ్నిః = అగ్నిహోత్రుఁడు; తాం=ఆసీతాదేవిని ; నప్రధక్ష్యతి=దహింపఁడు.

సీతాదేవి,తనతపఃప్రభావంబునను సత్యబలంబునను, పాతివ్రత్యమహిమంబునను, అగ్నిహోత్రమునుంగూడ, దహించును; అగ్నిహోత్రుండావిడనెంతమాత్రముదహింపఁజాలఁడు,అని,హనుమంతుండు, చింతించెను.

అని, తాత్పర్యము.

స తథా చింతయం స్తత్ర దేవ్యా ధర్మపరిగ్రహమ్
శుశ్రావ హనుమా న్వాక్యం చారణానాం మహాత్మనామ్. ౩౦

టీక॥ సః=ఆ;హనుమాన్= హనుమంతుండు; తత్ర=అచ్చట; తథా=అట్లు; దేవ్యాః = సీతాదేవియొక్క;ధర్మపరిగ్రహం=ధర్మముయొక్కసంగ్రహమునుగూర్చి;చింతయన్=చింతించుచు;మహాత్మనాం=పూజ్యమయినస్వభావముగల;చారణానాం= చారణులయొక్క;వాక్యం=మాటను ; శుశ్రావ=వినెను.

ఆహనుమంతుండు, అట్లు, సీతాదేవిధర్మ ప్రభావమును గుఱించిచింతించుచు , మహాత్ములగుచారణులు చెప్పుకొనుమాటలనువినెను.

అని, తాత్పర్యము.

అహో ఖలు కృతం కర్మ దుష్కరంహి హనూమతా
అగ్నిం విసృజతా భీక్ష్ణం భీమం రాక్షసవేశ్మని. ౩౧

టీక॥ రాక్షసవేశ్మని=రాక్షసులగృహమునందు; అభీక్ష్ణం=మిక్కిలియు ; భీమం=భయంకరమయిన; అగ్నిం = అగ్నిహోత్రమును; విసృజతా= విడుచుచున్న;హనూమతా=హనుమంతునిచేత;దుష్కరం = చేయనలవిగానిః;క

మః — కార్యము; కృతంఖలు= చేయఁబడినదిగదా! అహో — ఆశ్చర్యము!

హనుమంతుండు, రాక్షసుల యిండ్లయందుభయంకరాకారంబగు నగ్నిహోత్రంబుదరికొల్పి, మఱియెవ్వరికి నిజేయనలవిగాని కార్యముం జేసినాఁడు. ఆశ్చర్యము! అని, తాత్పర్యము.

ప్రపలాయితరక్షస్స్త్రీబాలవృద్ధసమాకులా
జనకోలాహలాధ్మాతా క్రందంతీ వాద్రికందరే. ౩౨

టీ॥ ప్రపలాయితరక్షస్స్త్రీబాలవృద్ధసమాకులా= పరుగెత్తుచున్న రాక్షసులచేతను స్త్రీలచేతను బాలురచేతను వృద్ధులచేతనునిండిఁనదియు; అద్రికందరే= పర్వతగుహయందు; జనకోలాహలాధ్మాతా — జనులకోలాహలధ్వనిచేధ్వనింపఁజేయఁబడినదియునగు; ఏషా(అధ్యాహృతము) = ఈలంక; క్రందంతీవ=ఏడ్చుచున్నదివలె; వర్తతే(అధ్యాహృతము)=ఉన్నది.

రాక్షసులును స్త్రీలును బాలురును వృద్ధులునుభయంబునం బరుగెత్తుచుండ, జనులకోలాహలధ్వనులం బర్వతగుహలుపూరితంబులయి యుండఁటంజేసి, యీలంకయంతయు, నేడ్చుచున్నట్లున్నది. అని, తాత్పర్యము.

దగ్ధేయం నగరీ సర్వా సాట్టప్రాకారతోరణా
జానకీ నచ దగ్ధేతి విస్మయో ద్భుతఏవ నః. ౩౩

టీక॥ సాట్టప్రాకారతోరణా — కోటబురుజులతోనుప్రాకారంబులతోనుబహిర్ద్వారంబులతోనుం గూడిన; ఇయం=ఈ; నగరీ — పట్టణము; సర్వా= అంతయు; దగ్ధా=దహింపఁబడినది. జానకీచ=సీతమాత్రము; నదగ్ధా= దహింపఁబడలేదు. ఇతి=అని; విస్మయః= ఆశ్చర్యము; నః=మాకు; అద్భుతఏవ=ఇదివఱకుఁగలుగనిదే.

ఈపట్టణంబంతయుఁ, గోటబురుజులతోను ప్రాకారంబులతోను బహిర్ద్వారంబులతోను దహింపఁబడినది; సీతమాత్రముదహింపఁబడలేదు; ఇట్టియాశ్చర్యమును, మేమిదివఱకెప్పుడును జూడలేదు. అని, చారణులు, చెప్పుకొనిరి. అని, తాత్పర్యము.

స నిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః
ఋషివాక్యైశ్చ హనుమా నభవ త్ప్రీతమానసః. ౩౪

టీక॥ సః=ఆ; హనుమాన్=హనుమంతుండు; దృష్టార్థైః=చూడఁబడిన ప్రయోజనముగల; నిమిత్తైశ్చ=శుభనిమిత్తముల చేతను; మహాగుణైః=గొప్పగుణములుగల; కారణైశ్చ=కారణములచేతను; ఋషివాక్యైశ్చ=చారణులమాటలచేతను; ప్రీతమానసః=సంతసించినమనసుగలవాఁడు; అభవత్=ఆయెను.

ఆహనుమంతుండు, ఇదివఱకుఁ జెప్పఁబడిన సఫలములయిన శుభనిమిత్తములచేతను, రామప్రభావాదులగు గొప్పకారణంబులచేతను, చారణులు చెప్పకొనుమాటలచేతను, సీతకునాశముగలుగలేదనినమ్మి, సంతోషించెను. అని, తాత్పర్యము.

తతః కపిః ప్రాప్తమనోరథార్థ
స్తా మక్షతాం రాజసుతాం విదిత్వా
ప్రత్యక్షత స్తాం పునరేవ దృష్ట్వా
ప్రతిప్రయాణాయ మతిం చకార. ౩౫

టీక॥ తతః=అటుపిమ్మట; కపిః=హనుమంతుఁడు; ప్రాప్త మనోరథార్థః=పొందఁబడినకోరుకులప్రయోజనములుగలవాఁడై; రాజసుతాం=రాచకొమార్తెయగు; తాం=ఆసీతాదేవిని; అక్షతాం=నాశమునొందనిదానిఁగా; విదిత్వా=తెలిసికొని; తాం=ఆసీతాదేవిని; ప్రత్యక్షతః=ప్రత్యక్షముగా; పునరేవ=మఱలనే; దృష్ట్వా=చూచి; ప్రతిప్రయాణాయ=మఱలిపోవుటకొఱకు; మతిం=బుద్ధిని; చకార=చేసెను.

అంత, హనుమంతుండు, ఈడేఱిన కోరుకులుగలవాఁడై, రాచకొమార్తెయగుసీతాదేవినాశమునొందకున్నదని తెలిసికొని, మఱలనాసీతం బ్రత్యక్షంబుగాఁజూచి, రామునొద్దకుఁబోఁగోరెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

సుందరకాండే, పంచపంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండపంచపంచాశసర్గటీక, ముగిసినది.

---

ద్రి

షట్పంచాశసర్గప్రారంభః.

తతస్తు శింశుపామూలే జానకీం పర్యుపస్థితామ్
అభివాద్యాఽబ్రవీ ద్దిష్ట్యా పశ్యామి త్వా మిహాఽక్షతామ్. ౧

టీక॥తతస్తు=అటుపిమ్మటను ; సః (అధ్యాహృతము) = ఆహనుమంతుఁడు; శింశుపామూలే=శింశుపావృక్షముక్రిందను; పర్యుపస్థితాం= ఉన్న; జానకీం=సీతను; అభివాద్య=నమస్కరించి;"దిష్ట్యా=భాగ్యముచేత; ఇహ=ఇచ్చట;అక్షతాం = నాశమునొందక యున్న; త్వాం=నిన్ను; పశ్యామి= చూచుచున్నాను."ఇతి(అధ్యాహృతము)= అని;అబ్రవీత్=చెప్పెను.

అంత,హనుమంతుండు, శింశుపావృక్షమూలంబుననున్నసీతాదేవి యొద్దకుఁబోయి , యాబిడకునమస్కరించి, "నాభాగ్యవశంబున, నిప్పుడు , ఏయపాయంబునుఁబొందక క్షేమంబుగ నున్ననిన్నుఁజూచుచున్నాను." అని, చెప్పెను. అని,తాత్పర్యము.

తత స్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునఃపునః
భర్తృస్నేహాన్వితం వాక్యం హనుమంత మభాషత. ౨

తతః=అటుపిమ్మట; సీతా=సీతాదేవి; ప్రస్థితం=పయనమయిన; తం= ఆహనుమంతుని; పునఃపునః= మాటిమాటికి; వీక్షమాణా=చూచుచు; హ

నుమంతం = హనుమంతునిగూర్చి; భర్తుః స్నేహాన్వితం = పెనిమిటియందలిస్నేహముతోఁగూడిన ; వాక్యం = మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, నాసీతాదేవి, పయనమయి వచ్చిన హనుమంతుని మాటిమాటికిం జూచుచుఁ, బెనిమిటియందలి స్నేహంబున,మఱల,నతనితో నొకమాటం జెప్పెను- అని, తాత్పర్యము-

కామ మస్య త్వమేవైకః కార్యస్య పరిసాధనే
పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే బలోదయః. ౩

టీక॥ పరవీరఘ్న=శత్రువీరులంజంపునట్టిహనుమంతుఁడా! అస్య=ఈ; కార్యస్య = పనియొక్క; పరిసాధనే = సాధించుటయందు; త్వం=నీవు; ఏకఏవ=ఒకఁడవే ; కామం = మిక్కిలియు; పర్యాప్తః=చాలుదువు. తే= నీయొక్క; బలోదయః=బలముయొక్కయభివృద్ధి; యశస్యః=మంచికీర్తిని కలిగించునది.

శత్రువీరులంజంపునట్టిహనుమంతుడా! ఈరాక్షసులనందఱనుజయించి,నన్నురామునొద్దంజేర్చుటకు, నీవొకఁడవెచాలుదువు ; నీబలముమిక్కిలియు నధికమైనది- అని, తాత్పర్యము-

శరైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః
మాం నయేద్యది కాకుత్స్థ స్తత్తస్య సదృశం భవేత్. ౪

టీక. పరబలార్దనః= శత్రుసైన్యములంబీడించునట్టి; కాకుత్స్థఏవ=రాముఁడే;శరైః = బాణములచేత;లంకాం=లంకను;సంకులాం= నిండినదానిఁగా;కృత్వా=చేసి;మాం=నన్ను; నయేద్యది=కొనిపోవునేని;తత్=అది; తస్య=ఆరామునకు;సదృశం=సరియయినది;భవేత్=అగును.

శత్రుసైన్యంబులం జంపునట్టి రాముండే, యిచ్చటికివచ్చి, బాణంబులనీలంకయంతయునిండించి , నన్నుఁగొనిపోవునేని, యదియెయతనికిందగియుండును. అని, తాత్పర్యము.

తద్యథా తస్య విక్రాంత మనురూపం మహాత్మనః

భవ త్యాహవశూరస్య తథా త్వ ముపపాదయ- ౫

టీక॥తత్=అందువలన; మహాత్మనః=మహాప్రభావుండును; ఆహవశూరస్య=యుద్ధమునందుభయములేనివాఁడునగు;తస్య=ఆరామునకు; అనురూపం= తగిన;విక్రాంతం= పరాక్రమించుట;యథా=ఎట్లు;భవతి=అగునో;తథా=అట్లు;త్వం=నీవు;ఉపపాదయ=ఘటింపుము.

అందువలన,మహాత్ముండును యుద్ధమునందుభయములేనివాఁడునగు నారాముండుదనకుందగులాగునఁబరాక్రమించునట్లు, నీవెఘటింపవలెను. అని, సీతాదేవి,హనుమంతునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము-

తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్
నిశమ్య హనుమాం స్తస్యా వాక్య ముత్తర మబ్రవీత్- ౬

టీక॥హనుమాన్ = హనుమంతుఁడు;అర్థోపహితం=అధికమయినయర్థముతోఁగూడినదియు; ప్రశ్రితం=వినయముతోఁగూడినదియు; హేతుసంహితం= కారణములతోఁగూడినదియునగు;తత్=ఆ;తస్యాః = ఆసీతాదేవియొక్క;వాక్యం=మాటను;నిశమ్య=విని;ఉత్తరం=బదులయిన;వాక్యం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

హనుమంతుండు, అధికార్థంబుగలదియు,వినయసహితంబునుయుక్తకారణంబులతోఁగూడినదియునగు, సీతాదేవిమాటనువిని,యందుకుత్తరము,ఇట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

క్షిప్రమేష్యతి కాకుత్థ్సో హర్యృక్షప్రవరై ర్వృతః
యస్తే యుధి విజిత్యారీన్ శోకం వ్యపనయిష్యతి. ౭

టీక॥యః=ఎవ్వఁడు;యుధి=యుద్ధమునందు;అరీన్ = శత్రువులను; విజిత్య=జయించి; తే=నీయొక్క; శోకం=దుఃఖమును;వ్యపనయిష్యతి=పోఁగొట్టునో;సః(అధ్యాహృతము)=అట్టి;కాకుత్థ్సః = రాముఁడు; హర్యృక్షప్రవరైః = వానరులలోనుఎలుఁగుగొడ్డులలోనుశ్రేష్ఠులచేఁ;వృతః = చుట్టఁబడిన

వాఁడై; క్షిప్రం=శీఘ్రముగా; ఏష్యతి=రాఁగలఁడు.

ఎవ్వఁడు, యుద్ధంబున, శత్రువులను జయించి, నీదుఃఖంబుదీర్చునో, అట్టిరాముండు, వానరోత్తములనుఎలుఁగుగొడ్డులనుంగూడి, శీఘ్రముగా రాఁగలండు. అని, హనుమంతుండు, సీతతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ మాశ్వాస్య వైదేహీం హనుమాన్ మారుతాత్మజః
గమనాయ మతిం కృత్వా వైదేహీ మభ్యవాదయత్. ౮

టీక॥ మారుతాత్మజః=వాయుదేవునికొడుకైన; హనుమాన్=హనుమంతుండు; ఏవం=ఇట్లు; వైదేహీం=సీతాదేవిని, ఆశ్వాస్య=ఊఱడించి; గమనాయ=పోవుటకొఱకు; మతిం=మనసును; కృత్వా=చేసి; వైదేహీం=సీతాదేవిని; అభ్యవాదయత్=నమస్కరించెను.

వాయుదేవుని కుమారుండగుహనుమంతుండు, ఇట్లుసీతాదేవినాశ్వాసించి, యంత, రామునొద్దకుఁబోఁగోరి, సీతాదేవికినమస్కారంబుఁజేసెను.

అని, తాత్పర్యము.



తత స్స కపిశార్దూల స్స్వామిసందర్శనోత్సుకః
ఆరురోహ గిరిశ్రేష్ఠ మరిష్ట మరిమర్దనః. ౯

టీక॥ తతః = అటుపిమ్మట ; అరిమర్దనః = శత్రువులమర్దించునట్టి ; సః = ఆ ; కపిశార్దూలః = వానరోత్తముండగుహనుమంతుండు ; స్వామిసందర్శనోత్సుకః = ప్రభువుదర్శనమునందుత్సాహముగలవాఁడై ; అరిష్టం = అరిష్టమను ; గిరిశ్రేష్ఠం = పర్వతశ్రేష్ఠమును ; ఆరురోహ = ఎక్కెను.

అంత, శత్రువులం జంపువాఁడును వానరశ్రేష్ఠుండునగు హనుమంతుండు, తన స్వామినిరాముంజూడఁ గోరినవాఁడై, యరిష్టంబను పర్వతంబు నారోహించెను.

అని, తాత్పర్యము.

తుంగపద్మకజుష్టాభి ర్నీలాభి ర్వనరాజిభిః
సోత్తరీయ మివాంభోదై శ్శృంగాంతరవిలంబిభిః. ౧౦

బోధ్యమానమివ ప్రీత్యా దివాకరకరై శ్శుభైః
ఉన్మిషంత మివోద్ధూతై ర్లోచనై రివ ధాతుభిః. ౧౧

తోయౌఘనిస్వనై ర్మంద్రైః ప్రాధీత మివ పర్వతమ్
ప్రగీతమివ విస్పష్టై ర్నానాప్రస్రవణస్వనైః. ౧౨

దేవదారుభి రత్యుచ్చై రూర్ధ్వబాహు మివ స్థితమ్
ప్రపాతజలనిర్ఘోషైః ప్రాక్రుష్టమివ సర్వతః. ౧౩

వేపమాన మివ శ్యామైః కంపమానై శ్శరద్వనైః
వేణుభి ర్మారుతోద్ధూతైః కూజంత మివ కీచకైః. ౧౪

నిశ్శ్వసంత మివామర్షా ద్ఘోరై రాశీవిషోత్తమైః
నీహారకృతగంభీరై ర్ధ్యాయంత మివ గహ్వరైః. ౧౫

మేఘపాదనిభైః పాదైః ప్రక్రాంత మివ సర్వతః
జృంభమాణ మివాకాశే శిఖరై రభ్రమాలిభిః. ౧౬

కూటైశ్చ బహుధాకీర్ణై శ్శోభితం బహుకందరైః
సాలతాలాశ్వకర్ణైశ్చ వంశైశ్చ బహుభి ర్వృతమ్. ౧౭

లతావితానై ర్వితతైః పుష్పవద్భి రలంకృతమ్

నానామృగగణాకీర్ణం ధాతునిష్యందభూషితమ్. ౧౮
బహుప్రస్రవణోపేతం శిలాసంచయసంకటమ్
మహర్షియక్షగంధర్వకిన్నరోరగసేవితమ్. ౧౯
లతాపాదపసంఘాతం సింహాధ్యుషితకందరమ్
వ్యాఘ్రసంఘసమాకీర్ణం స్వాదుమూలఫలద్రుమమ్. ౨౦
త మారురోహ హనుమాన్ పర్వతం పవనాత్మజః
రామదర్శనశీఘ్రేణ ప్రహర్షేణాభిచోదితః. ౨౧

టీక॥తుంగపద్మకజుష్టాభిః=ఉన్నతములగు పద్మకములను వృక్షములతోఁగూడిన;నీలాభిః=నల్లని; వన రాజిభిః = వనపఙ్క్తులచేత ; సపరిధాన మివస్థితం (అధ్యాహృతము) = కట్టుబట్టతోఁగూడినదివలెనున్నదియు; శృంగాంతరవిళంబిభిః=శిఖరముల నడుమఁ్రవేలుకాడుచున్న; అంభోదైః= మేఘములచేత; సోత్తరీయమివ(స్థితం)=ఉత్తరీయములతోఁగూడినదివలెనున్నదియు ; శుభైః=మంగళకరములగు; దివాకరకరైః=సూర్యునికిరణములచేతహస్తములచేత;ప్రీత్యా=ప్రేమచేత; బోధ్యమానమివ(స్థితం)=మేలుకొలుపఁబడుచున్నదివలెనున్నదియు;ఉద్ధూతైః= బయలువెడలినవియు;లోచనైరివ(స్థితైః)=కండ్లువలెనున్నవియునగు; ధాతుభిః= గైరికధాతువులచేత ; ఉన్మిషంతమివ (స్థితం)= కండ్లుతెఱచుచున్నదివలెనున్నదియు; మంద్రైః=గంభీరములగు; తోయౌఘనిస్వనైః=జలప్రవాహములధ్వనులచేత;ప్రాధీతమివ(స్థితం)= చక్కఁగానధ్యయనము సేయుచున్నదివలెనున్నదియు; పర్వతం= కొండయును;విస్పష్టైః=మిక్కిలియు స్పష్టములగు;నానాప్రస్రవణస్వనైః= నానావిధములగు సెలయేఱులయొక్క ధ్వనులచేత; ప్రగీతమివ(స్థితం)=చక్కఁగాఁబాడుచున్నదివలెనున్నదియు ; అత్యుచ్చైః=మిక్కిలియునున్నతములగు; దేవదారుభిః=దేవదారు వృక్షములచేత; ఊర్ధ్వబాహుమివస్థితం= పైకెత్తఁబడినచేతులుగలదివలెనున్నదియు; సర్వతః = అంతట; ప్రపాతజలనిర్ఘోషైః = చఱియల జలములయొక్క ధ్వనులచేత;ప్రాక్రుష్టమివ (స్థితం) = ఆక్రోశించుచున్నదివలె నున్నదియు ; కంపమానైః=కదలుచున్నవియు; శ్యా

మైః=నల్లనివియునగు;శరద్వనైః=శర
దృతువునందలి వృక్షసమూహములచే
త;వేపమానమివ(స్థితం)= వడంకుచు
న్నదివలెనున్నదియు; మారుతోద్ధూతైః
గాలిచేఁగొట్టఁబడిన; కీచకైః=గాలిగొ
ట్టినప్పుడుధ్వనించునట్టి; వేణుభిః=వెదు
ళ్లచేత;కూజంతమివ(స్థితం)=కూయు
చున్నదివలెనున్నదియు;ఘోరైః= భ
యంకరములగు;ఆశీవిషోత్తమైః= సర్ప
శ్రేష్ఠములచేత; అమర్షాత్=కోపము
వలన;నిశ్శ్వసంతమివ(స్థితం)= నిట్టూ
ర్పు[illegible]విడుచుచున్నదివలెనున్నదియు ;
నీహారకృతగంభీరైః= మంచుచేఁగప్పఁ
బడినవియు గంభీరములునగు; గహ్వ
రైః=గుహలచేత;ధ్యాయంతమివ (స్థి
తం)= ధ్యానముసేయుచున్నదివలెను
న్నదియు;మేఘపాదనిభైః=మేఘంబుల
పాదములతోసమానములగు;పాదైః=
చిన్నకొండలచేత;సర్వతః=అంతటను;
ప్రక్రాంతమివ (స్థితం) = నడచునది
వలెనున్నదియు;అభ్రమాలిభిః=మేఘం
బులపఙ్క్తులుగల;శిఖరైః= శిఖరముల
చేత;ఆకాశే=ఆకాశమునందు; జృంభ
మాణమివ(స్థితం)=ఆవులింతవిడుచుచు
న్నదివలెనున్నదియు; బహుకందరైః=
పెక్కుగుహలుగలవియు; బహుధా=
పెక్కువిధములుగా; ఆకీర్ణైః=వెదచ
ల్లఁబడినవియునగు;కూటైః=శిఖరముల
చేత;శోభితంచ= ప్రకాశింపఁజేయఁబ
డినదియు; బహుభిః=పెక్కులయిన;
సాలతాలాశ్వకర్ణైశ్చ = సాలవృక్ష
ములచేతను తాటిచెట్ల చేతను ఇనుమద్ది
చెట్లచేతను;వంశైశ్చ=వెదుళ్లచేతను;
వృతం=చుట్టఁబడినదియు;పుష్పవద్భిః=
అధికములయిన పుష్పములుగల ; విత
తైః=విస్తీర్ణములగు;లతావితానైః=తీఁ
గెలసమూహములచేత;అలంకృతం =
అలంకరింపఁబడినదియు ; నానామృగ
గణాకీర్ణం = నానావిధములయిన
మృగముల సమూహములచేత వ్యాపిం
పఁబడినదియు; ధాతునిష్యంద భూషి
తం= గైరికధాతువులుకాఱుటచేనలం
కరింపఁబడినదియు ; బహుప్రస్రవణో
పేతం= పెక్కుసెలయేఱులతోఁ గూ
డినదియు ; శిలాసంచయసంకటం =
రాళ్లసమూహములచే సంకటమయిన
దియు ; మహర్షియక్షగంధర్వ కిన్న
రోరగసేవితం= పూజ్యులగు ఋషు
లచేతను యక్షులచేతను గంధర్వులచే
తను గిన్నరులచేతను సర్పములచేతను
సేవింపఁబడినదియు ; లతాపాదపసం
ఘాతం= తీఁగెలయొక్కయు వృక్షము

లయొకర్లయు సమూహముగలదియు; సింహాధ్యుషితకందరం = సింహములచేనధిష్ఠింపఁబడిన గుహలుగలదియు ; వ్యాఘ్రసంఘసమాకీర్ణం= పులులసమూహములచేవ్యాపింపఁబడినదియు ; స్వాదుమూలఫలద్రుమం= తియ్యని గడ్డలును ఫలములును గలవృక్షములు గలదియునగు ; తం = ఆ ; పర్వతం = అరిష్టపర్వతమును ; పవనాత్మజః = వాయుపుత్రుండగు ; హనుమాన్=హనుమంతుండు ; రామదర్శనశీఘ్రేణ = రామునిచూచుటయందుత్వరగల; ప్రహర్షేణ= సంతోషముచేత; అభిచోదితః=ప్రేరింపఁ బడినవాఁడై; ఆరురోహ=ఎక్కెను.

ఉన్నతంబులగు పద్మకవృక్షంబులతోఁగూడినవనపఙ్క్తులచే వస్త్రంబుగట్టుకొన్నట్లు , శిఖరంబులనడుమద్రవేలుకాడుమేఘంబులచేను త్తరీయంబులుదాల్చినట్లు,చూపట్టుదాని, ఉద్గతంబులగు ధాతువులునేత్రంబులుంబోలెఁ గ్రాలుచుండుటంజేసి,సూర్యుండుహస్తంబులచేతంబోలెఁగిరణంబులచేతమేలుకొలుపఁ,గండ్లుదెఱచి,చూచుచున్నపోలిక్రం, గానవచ్చుదాని, గంభీరంబులగుజలప్రవాహధ్వానంబులచే నధ్యయనంబుసేయుపగిదిందోఁచుదాని, విస్పష్టంబులగు సెలయేఱులధ్వనులవలన,సంగీతంబుగావించుకరణింగన్పట్టుదాని, నత్యున్నతంబులగు దేవదారువృక్షంబులుండుటచే, నూర్ధ్వబాహుండైతపంబు సల్పుమహామునిభంగిభాసిల్లుదానిఁ, బ్రపాతంబులంబడుజలంబులధ్వనులచే,నంతటను,ఆక్రోశించుచున్నట్లున్నదాని,శరదృతువునందుజనియించువనంబులుగాలికిం దూలుచుండుటచే, హనుమంతునివలన భయంబునగడగడవడంకువడుచునం గనుపట్టుదాని , వాయువుచేఁ గొట్టఁ బడిన కీచకంబులను వెదుళ్లు ధ్వనించుటఁజేఁ , గూయుచున్నట్లున్నదాని , భయంకరంబులగు సర్పంబులు నిట్టూర్పులువిడుచుచుండుటం జేసి , హనుమంతునిపైఁగోపంబున , నిట్టూర్పులు విడుచుచున్నవిధంబునం జూపట్టుదాని; గంభీరములగుగుహలన్నియుమంచుచేఁ గప్పఁబడియుండుటంజేసి, సమస్తేంద్రియంబుల నిరోధించిధ్యానంబు సేయుభాతింగానవచ్చుదాని, మేఘంబులకుఁ బాదంబులనందగు ప్రత్యంత పర్వతంబులచేనడచుచున్నట్లగపడుదాని , నాకాశంబునం దత్యున్నతంబులై మేఘసంఘంబులతోఁగూడిన శిఖరంబులతో నొప్పి యుండుటవలన , నావులింతలు విడుచుచున్నట్లు దర్శనీయం బగు

దాని, హనుమంతుని పాదాహతించబ రిపరివిధంబులనాకీర్ణంబులయిన పె క్క-గుహలుగల శిఖరంబులతోఁ గూ డినదియు, సాలవృక్షంబులతోనుఅశ్వక ర్ణతరువులతోను వెదుళ్లతోనుం గూడి నదియునుఁ, బుష్పవంతంబునగులతాస మూహంబులరమణీయం బయినదియు, నానావిధమృగంబులుగలదియు, నచ్చ టచ్చటం గాఱుచుండుధాతువులచేనలం కృతంబయినదియుఁ, బెక్కు-సెలయే ళ్లుగలదియు,నధికముగాఱాళ్లుండుటచే సంకటస్థలంబైనదియు,మహర్షులచే తను యక్షులచేతనుగంధర్వులచేతనుగి న్నరులచేతను సర్పంబులచేతనుసేవిం పఁబడినదియు, వృక్షలతాసమూహస మేతంబులునుసిం-హాధిష్ఠితంబులగుగుహ లుగలదియు,వ్యాఘ్రసమూహంబుతోఁ గూడినదియు,రుచ్యంబులగుమూలఫలం బులతోఁగూడినవృక్షంబులుగలదియున గు,నరిష్టపర్వతమును, వాయుదేవునికు మారుండగుహనుమంతుండు, రామద ర్శనాత్సుక్యంబుమనంబునందెనంగొన, నారోహించెను. అని, తాత్పర్యము.

తేన పాదతలాక్రాంతా రమ్యేషు గిరిసానుషు
సఘోషాస్సమశీర్యంత శిలాశ్చూర్ణీకృతా స్తతః. ౨౨

టీక॥ తతః=అటుపిమ్మట, రమ్యేషు=సుందరములగు; గిరిసానుషు = కొండనెత్తములందు; శిలాః= ఱాళ్లు; తేన=ఆహనుమంతునిచేత; పాదతలాక్రాంతాః= పాదములచేనాక్రమింపఁ బడినవై;సఘోషాః=ధ్వనులతోఁగూడిన వై; చూర్ణీకృతాః= చూర్ణములు గాఁజేయఁబడినవై; సమశీర్యంత= పడినవి.

అంత, నాహనుమంతుండు, పాదంబులంద్రొక్కఁగానే, రమ్యంబులగు కొండనెత్తంబులందలిఱాళ్లు సంధ్వనిగదురఁ,జూర్ణంబులై పడియె. అని, తాత్పర్యము.

స తమారుహ్య శైలేంద్రం వ్యవర్ధత మహాకపిః ౨౩
దక్షిణా దుత్తరం పారం ప్రార్థయ న్లవణాంభ

టీక॥మహాకపిః= పెద్దకోఁతియగు; సః=ఆహనుమతుండు; తం=ఆ;శైలేంద్రం=పర్వతశ్రేష్ఠమును; ఆరుహ్య = ఎక్కి; లవణాంభసః=ఉప్పునీళ్లుగలసముద్రముయొక్క; దక్షిణాత్ = దక్షిణపుగట్టుననుండి;ఉత్తరం=ఉత్తరవుది

కుర్వానందలి; పారం=గట్టును; ప్రార్థయన్=కోరుచు; వ్యవర్ధత = పెరిగెను.

ఆహనుమంతుండు, ఆయరిష్టపర్వతంబు నారోహించినపిదప, సముద్రుని యుత్తరపుగట్టుఁజేరంగోరి మేనుఁ, బెంచెను. అని, తాత్పర్యము.

అధిరుహ్య తతో వీరః పర్వతం పవనాత్మజః
దదర్శ సాగరం భీమం మీనోరగనిషేవితమ్. ౨౪

టీక|| వీరః=పరాక్రమశాలియగు; పవనాత్మజః= వాయుపుత్రుండగుహనుమంతుండు; పర్వతం= అరిష్టపర్వతమును; అధిరుహ్య=ఎక్కి; తతః=అటుపిమ్మట; మీనోరగనిషేవితం=మత్స్యములచేతను సర్పములచేతను సేవింపఁబడినదియు; భీమం = భయంకరమయినది ం=సముద్రమును; దదర్శ=చూచెను.

పరాక్రమవంతుండును, వాయుదేవునికుమారుండునగుహనుమంతుండు, ఆయరిష్టపర్వతంబు నారోహించినంతనె, మీనసర్పంబులచేత సేవింపఁబడినదై భయంకరంబై పొలుచు, సముద్రముం జూచెను. అని, తాత్పర్యము.



స మారుత ఇవాకాశం మారుతస్యాత్మసంభవః
ప్రపేదే హరిశార్దూలో దక్షిణాదుత్తరాం దిశమ్. ౨౫

టీక॥ మారుతస్య= వాయుదేవుని యొక్క; ఆత్మసంభవః = పుత్రుండును; హరిశార్దూలః= వానరశ్రేష్ఠుండునగు; సః=ఆహనుమంతుండు; మారుతఇవ=వాయుదేవుండువలె ; దక్షిణాత్=దక్షిణపుగట్టుననుండి ; ఉత్తరాం=ఉత్తరపు; దిశం = దిక్కును గూర్చి; ఆకాశం=ఆకాశమును; ప్రపేదే=పొందెను.

వాయుదేవునిపుత్రుండును వానరశ్రేష్ఠుండునగునాహనుమంతుండు; సముద్రంబుదక్షిణపుగట్టుననుండి,యుత్తరపుగట్టుఁజేరుటకై, వాయుదేవుండుంబోలె,నాకాశంబునకెగసెను.

అని, తాత్పర్యము.

స తదా పీడిత స్తేన కపినా పర్వతోత్తమః
ర రాస సహ తై ర్భూతైః ప్రవిశ న్వసుధాతలమ్. ౫౬
కంపమానైశ్చ శిఖరైః పతద్భి రపిచ ద్రుమైః

టీక॥తదా=అప్పుడు;తేన= ఆ;కపినా=హనుమంతునిచేత;పీడితః=పీడింపఁబడిన;సః=ఆ;పర్వతోత్తమః=పర్వతశ్రేష్ఠము;తైః=ఆ;భూతైస్సహ=జంతువులతోను; కంపమానైః= చలించుచున్న;శిఖరైశ్చ=శిఖరములతోను; పతద్భిః=పడుచున్న;ద్రుమైరపిచ=వృక్షములతోను;వసుధాతలం= భూతలమును;ప్రవిశన్=ప్రవేశించుచు; రరాస=ధ్వనించెను.

అప్పుడు,పర్వతశ్రేష్ఠంబగునాయరిష్టపర్వతము, హనుమంతునిచేఁబీడింపఁబడి,మహాధ్వనిగదుర, నందున్నసమస్తజంతువులతోను వడంకుచున్నశిఖరంబులతోనువిఱిగియున్న వృక్షంబులతోనుం గూడ, నేలకుసమముగాఁగూలినది.

అని, తాత్పర్యము.

తస్యోరువేగా న్మథితాః పాదపాః పుష్పశాలినః. ౫౭
నిపేతు ర్భూతలే రుగ్ణా శ్శక్రాయుధహతాఇవ

టీక॥తస్య = ఆహనుమంతునియొక్క;ఊరువేగాత్= తొడలవేగమువలన;మథితాః=మథింపఁబడిన; పుష్పశాలినః=పూలచేనొప్పుచున్న; పాదపాః= వృక్షములు ; శక్రాయుధహతాఇవ= ఇంద్రుని యాయుధంబగు వజ్రాయుధ

ముచేఁగొట్టఁబడినవివలె;రుగ్ణాః= విఱిగినవై;నిపేతుః=పడినవి.

ఆ హనుమంతుని యూరువేగంబునఁ,బుష్పవంతంబులగువృక్షంబులు, వజ్రాయుధంబువ్రేటునంబోలె,విఱిగి, నేలంబడినవి.అని, తాత్పర్యము.

కందరాంతరసంస్థానాం పీడితానాం మహౌజసామ్. ౨౮
సింహానాం నినదో భీమో నభో భిందన్ స శుశ్రువే

టీక॥కందరాంతరసంస్థానాం= గుహలలోపల నున్నవియును; పీడితానాం=పీడింపఁబడినవియును;మహౌజసాం=అధికమయినపరాక్రమముగలవియునగు;సింహానాం=సింహంబులయొక్క;భీమః=భయంకరమగు;సః=అట్టి;నినదః=ధ్వని;నభః=ఆకాశమును; భిందన్=భేదించుచు;శుశ్రువే = వినంబడినది.

ఆపర్వతగుహలలో నున్నవియుమహాపరాక్రమంబులునగు సింహంబులు, హనుమంతుండుపర్వతంబుపైఁ బాదంబులూఁదుటచేఁబీడింపఁబడి,యాకాశంబువిఱిగిపడునోయనునట్లు,భయంకరంబుగ,నఱచినవి.

అని, తాత్పర్యము.

త్రస్తవ్యావిద్ధవసనా వ్యాకులీకృతభూషణాః. ౨౯
విద్యాధర్య స్సముత్పేతు స్సహసా ధరణీధరాత్

టీక॥విద్యాధర్యః= విద్యాధరస్త్రీలు;సహసా = తటాలున; ధరణీధరాత్=పర్వతముననుండి; త్రస్తవ్యావిద్ధవసనాః=భయముచేవ్యత్యస్తములయినవస్త్రములుగలవారలై;వ్యాకులీకృతభూషణాః = వ్యాకులంబులుగాఁజేయఁబడిన (అన్యోన్యస్థానంబులుదప్పునట్లుచేయఁబడిన)సొమ్ములుగలవారలై ; సముత్పేతుః=ఎగిరిరి.

అప్పుడు,విద్యాధరస్త్రీలు,భయంబున,వస్త్రంబులుజాఱ, భూషణంబులన్యోన్యస్థానంబులు దప్పివ్యాకులంబులయ్యెవేలుకాఁడఁ,దటాలున, నాయరిష్టపర్వతంబువిడిచి, యాకాశంబునకుద్గమించిరి.అని, తాత్పర్యము.

అతిప్రమాణా బలినో దీప్తజిహ్వా మహావిషాః. ౩౦

నిపీడితశిరోగ్రీవా వ్యచేష్టంత మహాహయః

టీక॥ అతిప్రమాణాః= అధికమయినప్రమాణముగలవియు; బలినః=అధికమయినబలముగలవియు;దీప్తజిహ్వాః= మండుచున్ననాలుకలుగలవియు;మహావిషాః= అధికమయినవిషముగలవియునగు;మహాహయః= గొప్పసర్పములు; నిపీడితశిరోగ్రీవాః=పీడింపఁబడినతలలును మెడలునుగలవై ;వ్యచేష్టంత= కదలినవి.

మహాకాయంబులును బలవంతంబులును, మండుచున్ననాలుకలుగలవియు మహావిషంబులునగుమహాసర్పంబులు , తలలులును మెడలునుబీడింపఁబడుటచే , నాపర్వతంబుననుండి వెడలినవి.

అని, తాత్పర్యము.

కిన్నరోరగగంధర్వయక్షవిద్యాధరా స్తదా. ౩౧
పీడితం తం నగవరం త్యక్త్వా గగనమాస్థితాః

టీక॥ తదా=అప్పుడు; కిన్నరోరగగంధర్వయక్షవిద్యాధరాః= కిన్నరులునుసర్పంబులునుగంధర్వులునుయక్షులునువిద్యాధరులును;పీడితం=పీడింపఁబడిన;తం=ఆ;నగవరం= పర్వతశ్రేష్ఠమును;త్యక్త్వా=విడిచి;గగనం=ఆకాశమును;ఆస్థితాః=పొందిరి.

అప్పుడు,కిన్నరులును సర్పంబులును గంధర్వులును యక్షులునువిద్యాధరులును, హనుమంతునిచేఁబీడింపఁబడినయాయరిష్టపర్వతముంబరిత్యజించి,యాకాశంబునొందిరి-అని,తాత్పర్యము.

సచ భూమిధర శ్శ్రీమాన్ బలినా తేన పీడితః. ౩౨
సవృక్షశిఖరోదగ్రః ప్రవివేశ రసాతలమ్

టీక॥ శ్రీమాన్=అధికమయిన కాంతిగలదియును; సవృక్షశిఖరోదగ్రః = వృక్షములతోఁగూడినశిఖరములచేనుత్తమమయినదియునగు;సః=ఆ; భూమిధరశ్చ=పర్వతమును; బలినా= బలవంతుఁడగు; తేన=ఆహనుమంతునిచేత; పీడితః=పీడింపఁబడినదై ; రసాతలం= భూతలమును; ప్రవివేశ = ప్రవేశించినది.

శ్రీమంతంబును వృక్షంబులతోఁ గూ

డిన శిఖరంబులతోనొప్పు చున్నదియునగు, నాయరిష్టపర్వతము, బలవంతుండగుహనుమంతుండు పాదంబులూఁదుటచే, నేలకుసమంబయినది.

అని, తాత్పర్యము.

దశయోజనవిస్తార స్త్రింశద్యోజన ముచ్ఛ్రితః. 33
ధరణ్యాం సమతాం యాత స్స బభూవ ధరాధరః

టీక॥దశయోజనవిస్తారః=పదియోజనంబులవెడల్పుగలదియు; త్రింశద్యోజనం=ముప్పదియోజనములు; ఉచ్ఛ్రితః=ఉన్నతమయినదియునగు; సః=ఆ; ధరాధరః= అరిష్టపర్వతము ; ధరణ్యాం=భూమియందు;సమతాం= సమమగుటను;యాతః=పొందినది;బభూవ=ఆయెను.

పదియోజనంబులవెడల్పును ముప్పదియోజనంబులయౌన్నత్యంబునుం గలయాయరిష్టపర్వతము, నేలకుసమంబుగాఁగూలినది. అని, తాత్పర్యము.

స విలంఘయిషు ర్భీమం సలీలం లవణార్ణవమ్. 34
కల్లోలాస్ఫాలవేలాంత ముత్పపాత నభో హరిః

టీక॥సః=ఆ;హరిః= హనుమంతుఁడు;భీమం=భయంకరమును; కల్లోలాస్ఫాలవేలాంతం=అలలయొక్క కొట్టుగలతీరప్రదేశముగలదియునగు;లవణార్ణవం=ఉప్పుసముద్రమును; సలీలం=విలాసముతోఁగూడునట్లుగా ; విలంఘయిషుః=దాటఁగోరినవాఁడై;నభః=ఆకాశమునుగూర్చి; ఉత్పపాత= ఎగిరెను.

ఆహనుమంతుండు, తీరంబులమహాతరంగంబులుగలిగి, భయంకరంబై యొప్పుచున్న సముద్రమును దాటఁగోరినవాఁడై,యాకాశంబునకెగిరెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే,శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, షట్పంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, సుందరకాండషట్పంచాశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

స ప్త పం చా శ స ర్గ ప్రా రం భః.

సచంద్రకుముదం రమ్యం సార్కకారండవం శుభమ్
తిష్యశ్రవణకాదంబ మభ్రశైవాలశాద్వలమ్. ౧
పునర్వసుమహామీనం లోహితాంగమహాగ్రహమ్
ఐరావతమహాద్వీపం స్వాతిహంసవిలోళితమ్. ౨
వాతసంఘాతజాతోర్మిచంద్రాంశుశిశిరాంబుమత్
భుజంగయక్షగంధర్వప్రబుద్ధకమలోత్పలమ్. ౩
హనుమా న్మారుతగతి ర్మహానౌరివ సాగరమ్
అపార మపరిశ్రాంతః పుప్లువే గగనార్ణవమ్. ౪

టీక॥ సచంద్రకుముదం= చంద్రుండను తెల్లకలువతోఁ గూడినదియు; రమ్యం=సుందరంబును; సార్కకారండవం=సూర్యుండను నీరుకోడిగలదియు; శుభం=మంగళకరంబును; తిష్యశ్రవణకాదంబం= పుష్యనక్షత్రమును శ్రవణనక్షత్రమునను కలహంస పక్షులు గలదియు; అభ్రశైవాలశాద్వలం = మేఘంబులను పాఁచియునుబచ్చికనేలయును గలదియును;పునర్వసుమహామీనం= పునర్వసునక్షత్రమను పెద్దచేఁప గలదియు; లోహితాంగ మహాగ్రహం= అంగారకుండను గొప్పమొసలి గలదియు; ఐరావతమహాద్వీపం=ఐరావతమను పెద్దదీవిగలదియు; స్వాతిహంసవిలోళితం = స్వాతినక్షత్రమనుహంసపక్షిచేఁ గదలింపఁ బడినదియు; వాతసంఘాతజాతోర్మిచంద్రాంశు శిశిరాంబుమత్= గాలిద్రేటునం గలిగిన యలలవంటిచంద్రకిరణంబులనుచల్లనినీ

ళ్లుగలదియు ; భుజంగ యక్షగంధర్వ ప్రబుద్ధకమలోత్పలం=సర్పములును యక్షులును గంధర్వులునను వికసించిన తామరపూలును కలువలునుగలదియు; అపారం=తుదలేనిదియునగు; గగనార్ణవం=ఆకాశమను సముద్రమును ; సాగరం=సముద్రమును; మహానౌరివ= పెద్ద యోడవలె; మారుతగతిః = వాయువుయొక్క గమనమువంటి గమనముగల ; హనుమాన్=హనుమంతుండు; అపరిశ్రాంతః=అలసటలేనివాండై; పుప్లువే= పొందెను.

చంద్రుండు తెల్లకలువగా, సూర్యుండు నీరుకోడిగాం, బుష్యశ్రవణనక్షత్రంబులు కలహంసలుగా , మేఘంబులు పాంచియును దీరంబునందలి పచ్చిక భూములును గాం , బునర్వసునక్షత్రము మహామీనంబుగా, నంగారకుండు పెద్ద మొసలిగా, నైరావతంబు మహాద్వీపంబుగా, స్వాతినక్షత్రంబు హంసపక్షిగా, గాలిచేం గలుగు నలలవంటి చంద్రకిరణంబులు చల్లనినీళ్లుగా, నప్యోవర్ణాంబులనొప్పు సర్పంబులును యక్షులునుగంధర్వులును వికసించినపద్మోత్పలంబులుగా, రెండవ సముద్రంబు భంగిభాసిల్లుచున్న యాకాశంబును, వాయువేగుండగు హనుమంతుం, డెంతమాత్రమలసటలేక, పెద్దయోడ సముద్రంబునుంబోలె , నొందెను. అని, తాత్పర్యము.

గ్రసమానఇవా కాశం తారాధిప మివోల్లిఖన్
హరన్నివ సనక్షత్రం గగనం సార్కమండలమ్. ౫
మారుతస్యాత్మజ శ్శ్రీమాన్ కపి ర్వ్యోమ చరో మహాన్
హనుమా న్మేఘజాలాని వికర్షన్నివ గచ్ఛతి. ౬

టీక॥ మారుతస్య = వాయుదేవుని యొక్క ; ఆత్మజః = కొడుకును; శ్రీమాన్ = అధికమయిన కాంతిగలవాండును; వ్యోమచరః= ఆకాశమునందుం దిరుగువాండునగు; మహాన్=పెద్ద; కపిః= కోంతియునగు; హనుమాన్ = హనుమంతుండు; ఆకాశం=ఆకాశమును; గ్రసమానఇవ=మ్రింగుచున్నవాండువలె; తారాధిపం=చంద్రుని; ఉల్లిఖన్నివ=ఒరయుచున్నవాండువలె ; సనక్షత్రం = నక్షత్రములతోం గూడినదియు; సార్కమండలం= సూర్యమండ

లముతోఁగూడినదియునగు; గగనం = ఆకాశమును; హరన్నివ= హరించుచున్నవాఁడువలె; మేఘజాలాని= మేఘసమూహములను; వికర్షన్నివ= ఈడ్చుచున్నవాఁడువలె; గచ్ఛతి = పోవుచుండెను.

వాయుదేవుని కుమారుండును శ్రీమంతుండునగు హనుమంతుండు,ఆకాశంబును మ్రింగువాఁడువోలె , చంద్రుఁ గొరయువాఁడువలె,నక్షత్రంబులతోను సూర్య మండలంబుతోను ఆకాశంబు నంతయుహరించువానిభంగి, మేఘ సమూహంబుల నాకర్షించువాని క్రైవడిం, బూపట్టుచు, నాకాశంబునం బోయెను. అని, తాత్పర్యము.

పాండరారుణవర్ణాని నీలమాంజిష్ఠకానిచ
హరితారుణవర్ణాని మహాభ్రాణి చకాశిరే. ౭

టీక॥మహాభ్రాణి= గొప్పమేఘంబులు; పాండరారుణవర్ణాని= తెల్లనిరంగుగలవిగానుఎఱ్ఱనిరంగుగలవిగాను; నీలమాంజిష్ఠికానిచ=నల్లనివిగాను పసువువన్నెగలవిగాను ; హరితారుణవర్ణాని; పచ్చనిరంగుగలవిగాను, నలుపుగలసినమెఱుపు వన్నెగలవిగాను;చకాశిరే=ప్రకాశించినవి.

మహామేఘంబులు , హనుమంతుని కాంతిసంపర్కంబునం జేసి , తెల్లనివిగానుఎఱ్ఱనివిగానునల్లనివిగాను బసుపువన్నెగలవిగాను బచ్చనివిగానునలుపుగలసినమెఱుపువన్నెగలవిగాను, బ్రకాశించినవి. అని, తాత్పర్యము.

ప్రవిశ న్నభ్రజాలాని నిష్పతంశ్చ పునఃపునః
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ చంద్రమాఇవ లక్ష్యతే. ౮

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; పునఃపునః= మాటిమాటికి;అభ్రజాలాని= మేఘసమూహంబులను;ప్రవిశన్= చొచ్చుచు;నిష్పతంశ్చ= బయలువెడలుచును;ప్రచ్ఛన్నశ్చ=కప్పఁబడినవాఁడును;ప్రకాశశ్చ=బయలుపడినవాఁడునగు;చంద్రమాఇవ=చంద్రుండువలె;లక్ష్యతే=చూడఁబడుచుండెను.

ఆహనుమంతుండు,మాటిమాటికి, మేఘంబులం బ్రవేశించుచును మఱల బ

యలు వెడలుచును, మేఘంబులచేఁ గప్పఁబడినవాఁడును మఱలవిడివడిన వాఁడునగుచంద్రునిపోలిక౯, గానవచ్చుచుండెను. అని, తాత్పర్యము.

వివిధాభ్రఘనాపన్నగోచరో ధవళాంబరః
దృశ్యాదృశ్యతను ర్వీర స్తదా చంద్రాయతేంబరే. ౯

టీక॥ తదా=అప్పుడు; ధవళాంబరః=తెల్లనివస్త్రములుగల; వీరః= పరాక్రమశాలియగు హనుమంతుఁడు; అంబరే = ఆకాశమునందు; వివిధాభ్రఘనాపన్నగోచరః= నానావిధములయిన మేఘముల సమూహముల యందుఁబొందఁబడినమార్గముగలవాఁడై; దృశ్యాదృశ్యతనుః=చూడఁదగినదియుఁ జూడఁగూడ నిదియునగు శరీరముగలవాఁడై; చంద్రాయతే=చంద్రుఁడువలెనున్నాఁడు.

అప్పుడు, తెల్లనివస్త్రములుగట్టుకొనియున్న పరాక్రమశాలియగు హనుమంతుండు, మేఘసమూహంబులంబొవుచుండుటంజేసి, కొంతసేపుదృశ్యుండై,కొంతదడవు,అదృశ్యుండై,చంద్రుండువలెనుండెను.

అని, తాత్పర్యము.

తార్క్ష్యాయమాణో గగనే బభాసే వాయునందనః
దారయ న్మేఘబృందాని నిష్పతంశ్చ పునఃపునః. ౧౦
నద న్నాదేన మహతా మేఘస్వనమహాస్వనః

టీక॥ వాయునందనః=వాయుదేవునికుమారుండగుహనుమంతుండు;మేఘబృందాని=మేఘసమూహంబులను;పునఃపునః=మాటిమాటికి; దారయ౯=చీల్చుచు;నిష్పతంశ్చ=వెడలుచును;మేఘస్వనమహాస్వనః=మేఘధ్వనివంటిమహాధ్వనిగలవాఁడై;మహతా=అధికమయిన;నాదేన=ధ్వనిచేత;నద౯ = అఱచుచు;గగనే=ఆకాశమునందు; తార్క్ష్యాయమాణః= గరుత్మంతుండువలెనాచరించుచున్నవాఁడై; బభాసే=ప్రకాశించెను.

వాయుదేవుని కుమారుండగుహనుమంతుండు,మాటిమాటికి, మేఘసమూహంబుల దారిచేసికొని,వానిం బ్రవేశించుచున్బయలువెడలుచు, మేఘగర్జ

నంబులవంటిసింహనాదంబులు సేయుచు, గరుత్మంతుండుంబోలెఁ బ్రకాశించెను. అని, తాత్పర్యము.

ప్రవరాన్ రాక్షసాన్ హత్వా నామ విశ్రావ్య చాత్మనః. ౧౧
ఆకులాం నగరీం కృత్వా వ్యథయిత్వాచ రావణమ్
అర్దయిత్వా బలం ఘోరం వైదేహీ మభివాద్యచ. ౧౨
ఆజగామ మహాతేజాః పున ర్మధ్యేన సాగరమ్

టీక॥ మహాతేజాః= అధికమయిన పరాక్రమముగలహనుమంతుఁడు; ప్రవరాన్=శ్రేష్ఠులగు; రాక్షసాన్= రాక్షసులను; హత్వా=చంపి; ఆత్మనః= తనయొక్క; నామ= పేరును ; విశ్రావ్యచ= వినిపించియు; నగరీం= పట్టణమును; ఆకులాం = కలఁతనొందినదానిఁగా; కృత్వా= చేసి ; రావణం = రావణుని;వ్యథయిత్వాచ= దుఃఖింపఁజేసియు; ఘోరం = భయంకరమగు; బలం= సైన్యమును; అర్దయిత్వా= పీడించి; వైదేహీం=సీతను ; అభివాద్యచ = నమస్కరించియు; పునః=మఱల; సాగరంమధ్యేన = సముద్రమధ్యముచేత; ఆజగామ=వచ్చెను.

మహాపరాక్రమశాలియగు హనుమంతుండు , ఉత్తములగురాక్షసులంజంపి , తనపేరుఁబ్రచురపరచి, పట్టణంబునంతయు , నల్లకల్లోలముగావించి, రావణునకుఁబెద్దదుఃఖముఁగలుగఁజేసి, భయంకరంబగుసైన్యముంజంపి, సీతాదేవికినమస్కారంబుసల్పి, మఱల , సముద్రంబుదాఁటనారంభించెను. అని, తాత్పర్యము.

పర్వతేంద్రం సునాభంచ సముపస్పృశ్య వీర్యవాన్. ౧౩
జ్యాముక్త ఇవ నారాచో మహావేగోఽభ్యుపాగతః

టీక॥వీర్యవాన్=అధికమయినపరాక్రమముగలహనుమంతుండు; పర్వతేంద్రం=పర్వతశ్రేష్ఠమగు ; సునాభం= మైనాకపర్వతమును;సముపస్పృశ్యచ= తాఁకియు; జ్యాముక్తః=అల్లెత్రాటివలనవిడువఁబడిన; నారాచఇవ=బాణమువలె;మహావేగః=అధికమయిన వేగముగలవాఁడై;అభ్యుపాగతః = వచ్చి

నాఁడు.

పరాక్రమవంతుండగు హనుమంతుండు, పర్వతశ్రేష్ఠంబగు మైనాకమును వీడ్కొని, యల్లెత్రాటివలన విడువంబడిన బాణంబుపగిది, నతివేగంబునం బోయెను. అని, తాత్పర్యము.

స కించి దనుసంప్రాప్త స్సమాలోక్య మహాగిరిమ్. ౧౪
మహేంద్రం మేఘసంకాశం ననాద హరిపుంగవః

టీక॥హరిపుంగవః=వానరశ్రేష్ఠుండగు; సః = ఆహనుమంతుండు; కించిత్=కొంచెము; అనుసంప్రాప్తః= సమీపము నొందినవాఁడై; మేఘసంకాశం = మేఘముతోసమానమయిన; మహేంద్రం = మహేంద్రమను; మహాగిరిం=పెద్దపర్వతమును; సమాలోక్య= చూచి; ననాద=అఱచెను.

వానరశ్రేష్ఠుండగు హనుమంతుండు, కొంచెముసమీపమునొంది, మేఘసమానమగు మహేంద్రపర్వతంబుఁజూచి, సంతోషంబున , సింహనాదముగావించెను. అని, తాత్పర్యము.

స పూరయామాస కపి ర్దిశో దశ సమంతతః. ౧౫
నద న్నాదేన మహతా మేఘస్వనమహాస్వనః

టీక॥మేఘస్వనమహాస్వనః= మేఘగర్జనమువంటిమహాధ్వనిగల; సః=ఆ; కపిః=హనుమంతుండు; నదన్ = అఱచుచు; మహతా=గొప్పదగు; నాదేన=ధ్వనిచేత; సమంతతః=అంతటను; దశ=పదియగు; దిశః=దిక్కులను; పూరయామాస=నిండించెను.

మేఘగర్జనమువంటిమహాధ్వనిగల హనుమంతుఁడు, అట్లుసింహనాదంబుగావించి, మహాధ్వనిచే, దిక్కులన్నియు నిండునట్లు, చేసెను.

అని, తాత్పర్యము.

స తం దేశ మనుప్రాప్త స్సుహృద్దర్శనలాలసః. ౧౬
ననాద హరిశార్దూలో లాంగూలం చాప్యకంపయత్

టీక॥సః=ఆ; హరిశార్దూలః=వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు ; తం=

ఆ; దేశం=ప్రదేశమును; అనుప్రాప్తః= పొందినవాఁడై; సుహృద్దర్శనలాలసః= స్నేహితుల చూచుటయందధికేచ్ఛగలవాఁడై; ననాద=అఱచెను. లాంగూలం చాపి=తోఁకను; అకంపయత్= ఆడించెను.

అంత, వానరోత్తముఁడగు హనుమంతుండు, అంగదాదివానరులున్నస్థలంబునకు సమీపంబయిన ప్రదేశంబు నొంది, సుహృద్దర్శనోత్సుకుండై, వాలంబునాడించుచు, సింహనాదంబుగావించెను. అని, తాత్పర్యము.

తస్య నానద్యమానస్య సుపర్ణచరితే పథి. ౧౭
ఫలతీ వాస్య ఘోషేణ గగనం సార్కమండలమ్

టీక॥ సుపర్ణచరితే= గరుత్మంతునిచేసంచరింపఁబడిన; పథి= ఆకాశమార్గమునందు; నానద్యమానస్య= మిక్కిలియునఱచుచున్న; తస్య=ఆ; అస్య=ఈహనుమంతునియొక్క; ఘోషేణ=ధ్వనిచేత; సార్కమండలం= సూర్యమండలముతోఁగూడిన; గగనం=ఆకాశము; ఫలతీవ=భేదిల్లునట్లున్నది.

గరుత్మంతునిసంచారస్థానంబగునాకాశమార్గంబునం బ్రచండ సింహనాదంబులు సేయుచున్న యాహనుమంతునిధ్వనికి, సూర్యమండలంబుతోఁ గూడ నాకాశంబు, పగులునట్లుండినది.

అని, తాత్పర్యము.

యే తు తత్రోత్తరే తీరే సముద్రస్య మహాబలాః. ౧౮
పూర్వం సంవిష్ఠితా శ్శూరా వాయుపుత్రదిదృక్షవః
మహతో వాతనున్నస్య తోయదస్యేవ గర్జితమ్. ౧౯
శుశ్రువుస్తే తదా ఘోష మూరువేగం హనూమతః

టీక॥ పూర్వం=మునుపు; తత్ర = అచ్చట; సముద్రస్య = సముద్రముయొక్క; ఉత్తరే=ఉత్తరపుదిక్కునందలి; తీరే=గట్టునందు; మహాబలాః = అధికమయిన బలముగలవారలును ; శూరాః=యుద్ధమునందు భయములేనివారలును వాయుపుత్రదిదృక్షవః= హనుమంతునిఁ జూడగోరువారలు నగు ; యే=ఏవానరులు; సంవిష్ఠితాః= ఉన్నవారో; తే తు=ఆవానరులు; తదా= అ

ష్పదము; వాతనున్నస్య=వాయువుచేఁబ్రేరింపఁబడిన; మహతః=గొప్పదగు; తోయదస్య= మేఘముయొక్క; గర్జితమివ (స్థితం)=ధ్వనివలెనున్న; హనూమతః = హనుమంతునియొక్క; ఘోషం=ధ్వనిని; ఊరువేగం= తొడలవేగమును; శుశ్రువుః = వినిరి.

అచ్చట, సముద్రంబు నుత్తరతీరంబుననున్న, మహాబలశాలులును యుద్ధమునందుభయములేని వారలును హనుమంతుండెప్పుడువచ్చునోయని యెదురుసూచుచున్నవారలునగు నాయంగదాదివానరులు, వాయుప్రేరితంబగుమహామేఘంబు గర్జాధ్వనివలెనున్న హనుమంతునిసింహనాదంబును, ఊరువేగంబును, వినిరి. అని, తాత్పర్యము.

తే దీనమనస స్సర్వే శుశ్రువుః కాననౌకసః. ౨౦
వానరేంద్రస్య నిర్ఘోషం పర్జన్యనినదోపమమ్

టీక॥ దీనమనసః=దుఃఖంబునొందినమనసుగల; తే=ఆ; కాననౌకసః=అంగదాదివానరులు; సర్వే= అందఱును; పర్జన్యనినదోపమం=మేఘగర్జనముతోఁబోల్కిగల; వానరేంద్రస్య=వానరశ్రేష్ఠుండగు హనుమంతునియొక్క; నిర్ఘోషం=ధ్వనిని; శుశ్రువుః=వినిరి.

ఏమివిందుమోయనిదుఃఖంబు నొందియున్నయాయంగదాదివానరు లందఱును, మేఘగర్జనంబువంటి, హనుమంతుసింహనాదంబును,వినిరి. అని, తాత్పర్యము.

నిశమ్య నదతో నాదం వానరా స్తే సమంతతః. ౨౧
బభూవు రుత్సుకా స్సర్వే సుహృద్దర్శన కాంక్షిణః

టీక॥ తే=ఆ; వానరాః=వానరులు; సర్వే=అందఱును; సమంతతః=అంతటను; నదతః=అఱచుచున్న హనుమంతునియొక్క; నాదం=ధ్వనిని; నిశమ్య=విని; సుహృద్దర్శనకాంక్షిణః=స్నేహితునిచూచుటంగోరువారలై ; ఉత్సుకాః=ఉత్సాహముగలవారలు ; బభూవుః=అయిరి.

ఆయంగదాదివానరులందఱును, అట్లుసింహనాదంబులు సేయుచున్నహనుమంతునికంఠమువిని, స్నేహితుండగుహనుమంతుంజూచుటయం దుత్సుకులయి




యుండిరి. అని, తాత్పర్యము.

జాంబవాన్ స హరిశ్రేష్ఠః ప్రీతిసంహృష్టమానసః. ౨౨
ఉపామంత్ర్య హరీన్ సర్వా నిదం వచన మబ్రవీత్

టీక॥హరిశ్రేష్ఠః=వానరోత్తముఁడగు;సః=ఆ;జాంబవాన్ = జాంబవంతుఁడు;ప్రీతిసంహృష్టమానసః= ప్రేమచేసంతసించిన మనసుగలవాఁడై; హరీన్=వానరులను;సర్వాన్ = అందఱను;ఉపామంత్ర్య=పిలిచి;ఇదం=ఈ; వచనం=మాటను;అబ్రవీత్=చెప్పెను.

వానర శ్రేష్ఠుండగు నాజాంబవంతుం,డప్పుడు, పరమసంతోషంబునొంది,వానరులనందఱుంబిలిచి,యిట్లని, చెప్పెను.అని, తాత్పర్యము.

సర్వథా కృతకార్యోఽ సౌ హనుమా నాత్ర సంశయః. ౨౩
నహ్యస్యాఽ కృతకార్యస్య నాద ఏవం విధో భవేత్

టీక॥అసౌ=ఈ; హనుమాన్=హనుమంతుఁడు; సర్వథా=అన్నివిధంబులను;కృతకార్యః = చేయఁబడినకార్యముగలవాఁడు. అత్ర=ఈవిషయమునందు;సంశయః=సందేహము; న=లేదు. అకృతకార్యస్య=చేయఁబడనికార్యముగల;అస్య=ఈహనుమంతునియొక్క ; నాదః=ధ్వని;ఏవంవిధః= ఇటువంటిదిగా;నభవేద్ధి=ఉండదుగదా!

ఈహనుమంతుం, డన్నివిధంబులం గృతకృత్యుండైవచ్చుచున్నాఁడు;ఇందుకుసందియములేదు; ఇతండు కృతకృత్యుండుకాఁడేని,యితనికంఠధ్వని,యింతగంభీరముగానుండదు. అని,జాంబవంతుండువానరులకుంజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య బాహూరువేగంచ నినాదంచ మహాత్మనః. ౨౪
నిశమ్య హరయో హృష్టా స్సముత్పేతు స్తత స్తతః

టీక॥హరయః=వానరులు ; మహాత్మనః=అధికమయిన పరాక్రమముగల; తస్య=ఆహనుమంతునియొక్క ; బాహూరువేగంచ= చేతులయొక్కయుఁ






దోడలయొక్కయు వేగమును; నినాదం చ=ధ్వనిని;నిశమ్య=విని;హృష్టాః=సంతసించినవారలై ;తత స్తతః= అచ్చట చ్చట; సముత్పేతుః=ఎగిరిరి.

వానరులు, మహాపరాక్రమశాలియగునాహనుమంతునిబాహూరువేగ ధ్వనిని,సింహనాదంబునువిని, సంతోషంబునొంది,యచ్చటచ్చట,గంతులువేయసాగిరి. అని, తాత్పర్యము.

తే నగాగ్రా న్నగాగ్రాణి శిఖరా చ్ఛిఖరాణిచ. ౨౫
ప్రహృష్టా స్సమపద్యంత హనూమంతం దిదృక్షవః

టీక॥తే= ఆవానరులు ; ప్రహృష్టాః= మిక్కిలియుసంతసించిన వారలై;హనూమంతం= హనుమంతుని; దిదృక్షవః=చూడఁగోరినవారలై; నగాగ్రాత్ =వృక్షముయొక్కకొననుండి;నగాగ్రాణి=చెట్లకొనలను ; శిఖరాత్ = పర్వతశిఖరముననుండి; శిఖరాణిచ=శిఖరములను;సమపద్యంత=పొందిరి.

ఆవానరులు , పరమసంతోషంబునొంది,హనుమంతుంజూచుటకై , చెట్టుమీఁదనుండి, చెట్లమీఁదికిని,పర్వతశిఖరంబుననుండిపర్వతశిఖరంబులమీఁదికిని, ఎక్కిరి.అని, తాత్పర్యము.

తే ప్రీతాః పాదపాగ్రేషు గృహ్య శాఖా స్సువిష్ఠితాః. ౨౬
వాసాంసీవ ప్రశాఖాశ్చ సమావిధ్యంత వానరాః

టీక॥ తే=ఆ;వానరాః = వానరులు; ప్రీతాః=సంతసించినవారలై ;పాదపాగ్రేషు = చెట్టుకొనలందు; శాఖాః = కొమ్మలను; గృహ్య (గృహీత్వా)=పట్టుకొని; సువిష్ఠితాః= ఉన్నవారలై;ప్రశాఖాశ్చ=చిన్నకొమ్మలను; వాసాంసీవ=వస్త్రములనువలె; సమావిధ్యంత=ఆడించిరి.

ఆవానరులు, సంతోషంబున వృక్షాగ్రంబులంనుఁ, గొమ్మలంబట్టుకొనికూర్చుండి దూరంబున మిత్రులువచ్చునప్పుడు, జనులు, వారలను శీఘ్రంబుగా రమ్మనుటకై, తమవస్త్రంబులనాడించునట్లు, హనుమంతుని శీఘ్రంబుగారమ్మని, చిన్నకొమ్మలనాడించిరి.

అని, తాత్పర్యము.



గిరిగహ్వరసంలీనో యథా గర్జతి మారుతః. ౨౭
ఏవం జగర్జ బలవాన్ హనుమాన్ మారుతాత్మజః

టీక॥యథా=ఎట్లు;గిరిగహ్వరసంలీనః=పర్వతగుహలయందణఁగిన;మారుతః=వాయువు;గర్జతి = ధ్వనించునో;ఏవం=ఇట్లు;బలవాన్ = అధికమయినబలముగల;మారుతాత్మజః= వాయుదేవుని కుమారుండగు ; హనుమాన్=హనుమంతుండు;జగర్జ=ధ్వనించెను.

వాయువు, పర్వతగుహలయందుఁజేరి,గర్జించునట్లు , వాయుదేవునికు మారుండగు బలవంతుండయిన హనుమంతుండు,గర్జించెను.

అని, తాత్పర్యము.

త మభ్రఘన సంకాశ మాపతంతం మహాకపిమ్. ౨౮
దృష్ట్వా తే వానరా స్సర్వే తస్థుః ప్రాంజలయ స్తదా

టీక॥తే=ఆ;వానరాః=వానరులు;సర్వే=అందఱును;తదా=అప్పుడు; అభ్రఘనసంకాశం=మేఘసమూహంబుతోసమానుఁడును; ఆపతంతం=వచ్చుచున్నవాఁడునగు;మహాకపిం = పెద్దకోఁతియగు;తం=ఆహనుమంతుని; దృష్ట్వా=చూచి;ప్రాంజలయః=మంచిచేమోడ్పుగలవారలయి;తస్థుః= నిలిచిరి.

ఆవానరులందఱు,నప్పుడు, మేఘసమూహంబుంబోలెవచ్చుచున్నయాహనుమంతుంజూచి, చేమోడ్పులుగీలించి, నిలిచియుండిరి.అని,తాత్పర్యము.

తతస్తు వేగవాం స్తస్య గిరే గిరినిభః కపిః. ౨౯
నిపపాత మహేంద్రస్య శిఖరే పాదపాకులే

టీక॥తతస్తు=అటుపిమ్మటను; వేగవాన్=అధికమయినవేగముగలవాఁడును;గిరినిభః= పర్వతముతోసమానుఁడునగు;కపిః = హనుమంతుండు;తస్య=ఆ;మహేంద్రస్య=మహేంద్రమను; గిరేః = పర్వతముయొక్క;పాదపాకులే=వృక్షముచేనిండిన;శిఖరే= శృంగమునందు;నిపపాత= వ్రాలెను.

అంత, వేగవంతుండునుబర్వతాకారుండునగుహనుమంతుండు, పెకుంటావృక్షంబులనిండియున్న యామహేంద్రపర్వతశిఖరంబుపై, వ్రాలెను. అని, తాత్పర్యము.

హర్షేణాపూర్యమాణోఽసౌ రమ్యే పర్వతనిర్ఝరే. ౩౧
ఛిన్నపక్ష ఇవాకాశాత్పపాత ధరణీధరః

టీక॥అసౌ = ఈహనుమంతుండు; హర్షేణ= సంతోషముచేత ; ఆపూర్యమాణః = నింపఁబడుచున్నవాఁడై; రమ్యే=సుందరమగు; పర్వతనిర్ఝరే= పర్వతమునందలిసెలయేఱునందు ; ఆకాశాత్ = ఆకాశమునందు; ఛిన్నపక్షః=నఱకఁబడినఱెక్కలుగల , ధరణీధరఇవ= పర్వతమువలె ; పపాత = వ్రాలెను.

హనుమంతుండు, సుహృద్దర్శనంబునం, బరమసంతోషంబునొంది, రమ్యంబగుసెలయేటిగట్టున.ఛిన్నపక్షం బగు పర్వతంబుకైవడి, నాకాశంబుననుండి వ్రాలెను. అని, తాత్పర్యము.

తత స్తే ప్రీతమనస స్సర్వే వానరపుంగవాః
హనుమంతం మహాత్మానం పరివార్యోపతస్థిరే

టీక॥తతః=అటుపిమ్మట; తే= ఆ; వానరపుంగవాః=వానరశ్రేష్ఠులు; సర్వే=అందఱును; ప్రీతమనసః= సంతసించినమనసుగలవారలై ; మహాత్మానం=అధికమయిన పరాక్రమంబుగల; హనుమంతం=హనుమంతుని ; పరివార్య=చుట్టుకొని;ఉపతస్థిరే=సేవించిరి.

అంత,నావానరోత్తములందఱు,పరమసంతోషంబునొంది , మహాత్ముండగుహనుమంతుంబరివేష్టించి , కొలిచియుండిరి. అని,తాత్పర్యము.

పరివార్యచ తే సర్వే పరాం ప్రీతి ముపస్థితాః- ౩౨

టీక॥ పరివార్యచ = పరివేష్టించియు; తే=ఆవానరులు; సర్వే = అందఱును;పరాం=అధికమయిన; ప్రీతిం= సంతోషమును; ఉపస్థితాః= పొందిరి.

అట్లుపరివేష్టించియు, నాయంగదాదివానరులందఱును, బరమసంతోషంబునొందియుండిరి. అని, తాత్పర్యము.

ప్రహృష్టవదనా స్సర్వే త మరోగ ముపాగతమ్
ఉపాయనాని చాదాయ మూలానిచ ఫలానిచ. 33
ప్రత్యర్చయన్ హరిశ్రేష్ఠం హరయో మారుతాత్మజమ్

టీక॥హరయః=వానరులు;సర్వే=అందఱును;ప్రహృష్టవదనాః= మిక్కిలియుసంతసించినముఖముగలవారలై;అరోగం=రోగములేనివాఁడును;ఉపాగతం=వచ్చినవాఁడును; హరిశ్రేష్ఠం = వానరోత్తముండును ; మారుతాత్మజం = వాయుదేవునికుమారుండునగు; తం=ఆహనుమంతుని; మూలానిచ = గడ్డలను;ఫలానిచ=పండ్లను; ఉపాయనానిచ=కానుకలనుగా; ఆదాయ=తెచ్చి;ప్రత్యర్చయన్=పూజించిరి.

ఆవానరులందఱు, క్షేమంబుగవచ్చిన, వానరశ్రేష్ఠుండునువాయుపుత్త్రుండునగు హనుమంతునింజూచి, మిక్కిలియుసంతోషంబునొంది, మూలంబులను ఫలంబులనుందెచ్చి, కానుకలుసమర్పించి,యతనింబూజించిరి. అని, తాత్పర్యము.

హనుమాంస్తు గురూ న్వృద్ధా న్జాంబవత్ప్రముఖాం స్తదా. 34
కుమార మంగదం చైవ సోవందత మహాకపిః

టీక॥మహాకపిః= పెద్దకోఁతియగు; సః=ఆ;హనుమాంస్తు= హనుమంతుండును;తదా=అప్పుడు;గురూన్=ఆచార్యులును;వృద్ధాన్ = ముసలివారలునగు;జాంబవత్ప్రముఖాన్= జాంబవంతుండు మొదలుగాఁగలవారలను ; కుమారం = యువరాజైన; అంగదంచైవ=అంగదుని;అవందత= నమస్కరించెను.

హనుమంతుండును, జాంబవంతుండుమున్నగుగురువులకునువృద్ధులకును , యువరాజుండగు నంగదునకును, నమస్కారంబుఁజేసెను. అని,తాత్పర్యము.

స తాభ్యాం పూజితః పూజ్యః కపిభిశ్చ ప్రసాదితః. 35

దృష్టా సీతేతి విక్రాంత స్సంక్షేపేణ న్యవేదయత్

టీక॥విక్రాంతః = పరాక్రమించినవాఁడును; పూజ్యః= పూజింపఁదగినవాఁడునగు;సః = ఆహనుమంతుఁడు; తాభ్యాం= ఆజాంబవదంగదులచేత; పూజితః=పూజింపఁబడినవాఁడై; కపిభిశ్చ=వానరులచేతను;ప్రసాదితః=సంతోషింపఁజేయఁబడినవాఁడై; "దృష్టా= చూడఁబడినది; సీతా=సీతాదేవి" ఇతి=అని;సంక్షేపేణ= సంగ్రహముచేత;న్యవేదయత్=తెలిపెను.

పరాక్రమశాలియుఁ బూజ్యుండునగుహనుమంతుండు , ఆజాంబవదంగదులచేఁబూజింపఁబడినవాఁడై, వానరులచేఁబ్రసాదితుండై, "చూచితిని, సీతను" అని,నిస్సంశయముగాఁ దేటపడ, సంక్షేపమునం జెప్పెను.

అని, తాత్పర్యము.

నిషసాదచ హస్తేన గృహీత్వా వాలిన స్సుతమ్. ౩౬
రమణీయే వనోద్దేశే మహేంద్రస్య గిరే స్తదా

టీక॥సః(అధ్యాహృతము)= ఆహనుమంతుఁడు; తదా=అప్పుడు; వాలినః=వాలియొక్క;సుతం= కొడుకైనయంగదుని; హస్తేన=హస్తముచేత; గృహీత్వా=గ్రహించి ; మహేంద్రస్య=మహేంద్రమను;గిరేః=పర్వతముయొక్క; రమణీయే= సుందరమయిన;వనోద్దేశే=అరణ్య ప్రదేశమునందు; నిషసాదచ=కూర్చుండెను.

ఆహనుమంతుండు, వాలిపుత్రుండగుహనుమంతుని , గవుఁగిలించుకొని, మహేంద్రపర్వతంబునందు, సుందరంబగునొక్కవనప్రదేశంబునం, గూర్చుండెను. అని, తాత్పర్యము.

హనుమా నబ్రవీ ద్ధృష్ట స్తదా తా న్వానరర్షభాన్. ౩౭

టీ॥తదా=అప్పుడు; హనుమాన్= హనుమంతుఁడు;హృష్టః=సంతసించినవాఁడై; వానరర్షభాన్= వానరశ్రేష్ఠులగు; తాన్ = ఆయంగదాదులను గూర్చి; అబ్రవీత్=చెప్పెను.

అప్పుడు,హనుమంతుండు, సంతో

షంబునొంది,వానరశ్రేష్ఠులగునాయంగదాదులంబూచి,యిట్లని,చెప్పెను. అని,తాత్పర్యము.

అశోకవనికాసంస్థా దృష్టా సా జనకాత్మజా
రక్ష్యమాణా సుఘోరాభి రాక్షసీభి రనిందితా. ౩౮
ఏకవేణీ ధరా బాలా రామదర్శనలాలసా
ఉపవాసపరిశ్రాంతా జటిలా మలినా కృశా. ౩౯

టీక॥అశోకవనికాసంస్థా=అశోకవనమునందున్నదియును; సుఘోరాభిః=మిక్కిలియుభయంకరలయిన ; రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత ; రక్ష్యమాణా=రక్షింపఁబడుచున్నదియు; అనిందితా=నిందింపఁబడినదియు ; ఏకవేణీధరా=ఒక్క-టిజడను ధరించు చున్నదియును;బాలా=చిన్నదియును; రామదర్శనలాలసా=రాముని చూచుటయందధికేచ్ఛగలదియు; ఉపవాస పరిశ్రాంతా=ఉపవాసములచేఁ నలసినదియు, జటిలా=జటలుగలదియు ; మలినా=మురికిగలదియు;కృశా=చిక్కి-నదియు నగు; సా=ఆ;జనకాత్మజా= జనకుని కొమార్తెయయినసీతాదేవి;దృష్టా= చూడఁబడినది.

అశోకవనంబున, భయంకరాకారలగురాక్షసస్త్రీలచేరక్షింపఁ బడినదై యనిందితయైజడగట్టినతల వెండ్రుకలు గలదై , రామదర్శనలాలస యయి, యుపవాసంబులంగృశించిజటలుధరించి మలినాంగియయి, యున్న, జనకాత్మజయగు,సీతాదేవింజూచినాను.అని,హనుమంతుండు,అంగదాది వానరులకుం జెప్పెను. అని,తాత్పర్యము.

తతో దృష్టేతి వచనం మహార్థ మమృతోపమమ్
నిశమ్య మారుతే స్సర్వే ముదితా వానరా భవన్. ౪౦

టీక॥తతః = అటుపిమ్మట; వానరాః=వానరులు;సర్వే = అందఱును; మారుతేః= వాయుదేవునికుమారుండగుహనుమంతునియొక్క-; మహార్థం= అధికమయినయర్థముగలదియు; అమృతోపమం= అమృతంబుతోఁబోలిక-గల

దియునగు; "దృష్టా=చూడఁబడినది." ఇతి=అనెడు; వచనం = మాటను; నిశమ్య=విని; ముదితాః=సంతసించినవారలు; భవన్ (అభవన్)=అయిరి.

అంత, "సీతాదేవింజూచితిని" అనునధికార్థంబగునమృతంబువంటి హనుమంతునివచనంబువిన్నంతనె, వానరులందఱు, పరమసంతోషంబునొందిరి.

అని, తాత్పర్యము.

క్ష్వేళం త్యన్యే నదంత్యన్యే గర్జంత్యన్యే మహాబలాః
చక్రుః కిలి కిలా మన్యే ప్రతిగర్జంతి చాఽపరే. ౪౫

టీక॥ మహాబలాః = అధికమయినబలముగలవానరులు; అన్యే=మఱికొందఱు; క్ష్వేళంతి= సింహనాదంబులుచేయుచున్నారు. అన్యే=మఱికొందఱు; నదంతి=అఱచుచున్నారు. అన్యే = మఱికొందఱు; గర్జంతి=వృషభంబులువలెనఱచిరి. అన్యే = మఱికొందఱు; కిలికిలాం=కిలికిలయనుధ్వనిని; చక్రుః= చేసిరి. అపరేచ= మఱికొందఱును; ప్రతిగర్జంతి=బదులఱచిరి.

బలవంతులగునావానరులు, సంతోషంబునం, గొందఱు, సింహనాదంబులు గావించిరి; కొందఱునాదంబులు గావించిరి; కొందఱువృషభంబులువలెగర్జించిరి; కొందఱు వానరజాతిసహజమయినకిలికిలాధ్వనింజేసిరి; మఱికొందఱు, గర్జించువారలకు బదులుగర్జించిరి.

అని, తాత్పర్యము.

కేచి దుచ్ఛ్రితలాంగూలాః ప్రహృష్టాః కపికుంజరాః
అంచితాయతదీర్ఘాణి లాంగూలాని ప్రవివ్యధుః. ౪౬

టీక॥ కేచిత్ = కొందఱు; కపికుంజరాః=వానరశ్రేష్ఠులు; ప్రహృష్టాః=మిక్కిలియుసంతసించినవారలై; ఉచ్ఛ్రితలాంగూలాః = ఎత్తఁబడినతోఁకగలవారలై; అంచితాయతదీర్ఘాణి = సుందరములునుబలిసినవియునునిడుపులయినవియునగు; లాంగూలాని=తోఁకలను; ప్రవివ్యధుః=కొట్టిరి.

కొందఱు, వానరోత్తములు, సంతోషంబున, బలిసినవియుదీర్ఘములయినవియుసుందరములునగు తమతోఁకలంబైకెత్తి, నేలంగొట్టిరి. అని, తాత్పర్యము.

అపరేచ హనూమంతం వానరా వారణోపమమ్
ఆప్లుత్య గిరిశృంగేభ్య స్సంస్పృశంతి స్మహర్షితాః. ౪౩

టీక॥ అపరేచ= మఱికొందఱును; హర్షితాః = సంతోషమునొందినవారలై; గిరిశృంగేభ్యః= పర్వతశిఖరములనుండి; ఆప్లుత్య=దుమికి ; వారణోపమం=ఏనుంగుతోఁబోలికగల; హనూమంతం=హనుమంతుని; సంస్పృశంతి స్మ=తాఁకిరి.

మఱికొందఱు వానరులు , సంతోషంబునఁ, బర్వతశిఖరంబులనుండి, దుమికి, ఏనుంగువలెనున్న హనుమంతుని, స్పృశించిరి. అని, తాత్పర్యము.

ఉక్తవాక్యం హనూమంత మంగద స్తమథా బ్రవీత్
సర్వేషాం హరివీరాణాం మద్ధ్యే వచన ముత్తమమ్. ౪౪

టీక॥అథ=అటుపిమ్మట;అంగదః=అంగదుఁడు; హరివీరాణాం=వానరవీరులయొక్క; సర్వేషాం= అందఱియొక్కయు; మద్ధ్యే=నడుమను ; ఉక్తవాక్యం=చెప్పఁబడిన మాటను;తం= ఆ; హనూమంతం=హనుమంతునిగూర్చి;ఉత్తమం=శ్రేష్ఠంబగు;వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత,నంగదుండు, వానర వీరులయందఱినడుమ, సీతంజూచితినని చెప్పి, యూరకున్న హనుమంతునిజూచి,యుత్తమంబగునీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

సత్త్వే వీర్యే నతే కశ్చి త్సమో వానర విద్యతే
య దవప్లుత్య విస్తీర్ణం సాగరం పున రాగతః. ౪౫

టీక॥వానర = హనుమంతుఁడా ! యత్=ఎందువలన ; విస్తీర్ణం= వెడలుపైన; సాగరం=సముద్రమును; అవప్లుత్య=దాఁటి; పునః = మఱల; ఆగతః = వచ్చినాఁడవో; తత్ (అధ్యాహృతము) = అందువలన; తే=నీకు; సత్త్వే=బలమునందును; వీర్యే=పరాక్రమమునందును ; సమః = సరియగువాఁడు; కశ్చిత్=ఒకానొకఁడును; న=లేఁడు.

హనుమంతుఁడా! శతయోజనంబులవిస్తీర్ణంబగు నీసముద్రము దాఁటిపోయి, మరల దాఁటివచ్చినావు కావున, బలంబునందుఁగాని, పరాక్రమంబునందుఁగాని; నీకుసరియగువాఁ డెవ్వఁడును, లేఁడు. అని, తాత్పర్యము.

అహో స్వామిని తే భక్తి రహో వీర్య మహో ధృతిః
దిష్ట్యా దృష్టా త్వయా దేవీ రామపత్నీ యశస్వినీ. ౪౭

టీక॥ తే=నీయొక్క; స్వామిని=ప్రభునందలి; భక్తిః=భక్తి; అహో=ఆశ్చర్యకరము! వీర్యం=పరాక్రమము; అహో=ఆశ్చర్యకరము! ధృతిః = ధైర్యము; అహో=ఆశ్చర్యకరము! యశస్వినీ=అధికమయిన కీర్తిఁగలదియు; రామపత్నీ=రామునిభార్యయును; దేవీ=రాణియునగు; వైదేహీ=సీత; దిష్ట్యా=భాగ్యముచేత; త్వయా=నీచేత; దృష్టా=చూడఁబడినది.

నీకుండు రాజభక్తిమఱి యెవ్వరికిని లేదు; నీపరాక్రమమును, నీధైర్యమును జూడ, నాశ్చర్యముగలుగుచున్నది; మాభాగ్యవశంబున, నీవు, పతివ్రతయగు రామునిభార్యనుసీతాదేవిం, జూచినావు. అని, తాత్పర్యము.

దిష్ట్యా త్యక్ష్యతి కాకుత్స్థ శ్శోకం సీతావియోగజమ్

టీక॥ దిష్ట్యా= భాగ్యముచేత; కాకుత్స్థః=రాముండు; సీతావియోగజం=సీతావిరహంబువలనఁ గలిగిన; శోకం=దుఃఖమును; త్యక్ష్యతి=విడువఁగలడు.

మాభాగ్యవశంబున, నింక, రాముండు, సీతావిరహదుఃఖంబులేక సుఖంబుగానుండఁగలఁడు. అని, యంగదుండు, హనుమంతునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తతోఙ్గదం హనూమంతం జాంబవంతంచ వానరాః. ౪౮
పరివార్య ప్రముదితా భేజిరే విపులా శ్శిలాః

టీక॥ తతః= అటుపిమ్మట; వానరాః=వానరులు; ప్రముదితాః=మిక్కిలి యుసంతోషించినవారలై; అంగదం=అంగదుని; హనూమంతం=హనుమం

తుని; జాంబవంతంచ= జాంబవంతునిన్; పరివార్య=పరివేష్టించి; విపులాః= విశాలములగు; శిలాః=ఱాళ్లను; భేజిరే=పొందిరి.

అంత, వానరులందఱుఁ, బరమసంతుష్టులై, యంగద హనుమజ్జాంబవంతుల ముగ్వురం బరివేష్టించి, విశాలంబులగు శిలలపైఁ గూర్చుండిరి. అని, తాత్పర్యము.

శ్రోతుకామా స్సముద్రస్య లంఘనం వానరోత్తమాః- ౪౮
దర్శనంచాపి లంకాయా స్సీతాయా రావణస్యచ
తస్థుః ప్రాంజలయ స్సర్వే హనుమ ద్వదనోన్ముఖాః- ౪౯

టీక॥ వానరోత్తమాః= వానరశ్రేష్ఠులు; సర్వే=అందఱును; సముద్రస్య= సముద్రము యొక్క; లంఘనం=దాఁటుటను; లంకాయాః= లంక యొక్కయు; సీతాయాః=సీత యొక్కయు; రావణస్యచ=రావణుని యొక్కయు; దర్శనం చాపి=చూచుటను; శ్రోతుకామాః=వినఁ గోరినవారలై; ప్రాంజలయః= మంచి చేమోడ్పుగలవారలై; హనుమద్వదనోన్ముఖాః = హనుమంతుని ముఖంబునకెదురు మొగము గలవారలై; తస్థుః=ఉండిరి.

ఆవానరశ్రేష్ఠులందఱు, హనుమంతుం డు సముద్రంబు దాఁటుటయు, లంకానగరంబుఁ జూచుటయు, సీతాదేవిని సందర్శించుటయు, రావణుం గాంచుటయు, నీవృత్తాంతములను వినం గోరినవారలై, చేమోడ్పు గీలించి, హనుమంతుని మొగంబు చూచుచు, నుండిరి.

అని, తాత్పర్యము.

తస్థౌ తత్రాంగద శ్శ్రీమాన్ వానరై ర్బహుభిర్వృతః
ఉపాస్యమానో విబుధై ర్దివి దేవపతి ర్యథా. ౫౦

టీక॥ తత్ర=అచ్చట; శ్రీమాన్=అధికమయిన కాంతి గల; అంగదః = అంగదుఁడు; బహుభిః=పెక్కులయిన; వానరైః=వానరుల చేత; వృతః= చుట్టఁబడినవాఁడై; దివి = స్వర్గమునందు; విబుధైః=దేవతల చేత; ఉపాస్యమానః=సేవింపఁబడుచున్న; దేవపతిర్యథా= దేవేంద్రుఁడువలె; తస్థౌ=ఉండెను.

అచ్చట, శ్రీమంతుండగు నంగదుండు, లెక్కలేని వానరులచేఁ బరివేష్టింపఁ

బడి, స్వర్గంబునందు దేవతలచే సేవింపఁబడుచున్న దేవేంద్రుండుంబోలెఁ, బ్రకాశించుచుండెను-

అని, తాత్పర్యము.

హనూమతా కీర్తిమతా యశస్వినా
తథాంగదేనాంగదబద్ధబాహునా
ముదా తదా ధ్యాసిత మున్నత మ్మహా
న్మహీధరాగ్రం జ్వలితం శ్రియాఽభవత్- ౫౧

టీక॥ తదా = అప్పుడు ; కీర్తిమతా = అధికమయినకీర్తిగల; హనూమతా=హనుమంతునిచేతను; తథా= అట్లు; యశస్వినా= అధికమయినకీర్తిగల; అంగదబద్ధబాహునా=కట్టఁబడిన బాహుపురులుగలచేతులుగల ; అంగదేన=అంగదునిచేతను; ముదా = సంతోషముచేత; అధ్యాసితం = అధిష్ఠింపఁబడినదియు; ఉన్నతం=పొడవైనదియు; మహాత్ = గొప్పదియునగు; మహీధరాగ్రం = పర్వతశిఖరము ; శ్రియా=కాంతిచేత; జ్వలితం = ప్రకాశించినది; అభవత్ —అయినది.

అప్పుడు , మిక్కిలియున్నతంబునువిశాలంబునగు నామహేంద్రపర్వతశిఖరంబు, మహాకీర్తిశాలియగుహనుమంతునిచేతను, గీర్తిమంతుండునుబాహుపురులుధరించినవాఁడునగునంగదునిచేతను, అధిష్ఠింపఁబడియుండుటంజేసి, మహాతేజంబునం దేజరిల్లుచుండినది.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, సప్తపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండసప్తపంచాశసర్గటీక,
ముగిసినది.

—

౩౮౬

అష్టపంచాశసర్గ ప్రారంభః.

తత స్తస్య గిరే శ్శృంగే మహేంద్రస్య మహాబలాః
హనుమత్ప్రముఖాః ప్రీతిం హరయో జగ్ము రుత్తమామ్. ౧

టీక॥తతః = అటుపిమ్మట;మహాబలాః= అధికమయినబలముగలవారలును;హనుమత్ప్రముఖాః = హనుమంతుఁడుమున్నుగాఁగలవారలునగు;హరయః=వానరులు;తస్య=ఆ; మహేంద్రస్య=మహేంద్రమను;గిరేః = పర్వతముయొక్క;శృంగే=శిఖరమునందు; ఉత్తమాం=అధికమయిన;ప్రీతిం = సంతోషమును;జగ్ముః=పొందిరి-

అంత,మహాబలశాలులగుహనుమంతుండుమున్నగువానరులు,మహేంద్రపర్వతంబునంజేరి , పరమసంతోషంబునొందిరి.అని,తాత్పర్యము.

తం తతః ప్రీతిసంహృష్టః ప్రీతిమంతం మహాకపిమ్
జాంబవా న్కార్యవృత్తాంత మపృచ్ఛ దనిలాత్మజమ్. ౨

టీక॥తతః = అటుపిమ్మట;జాంబవాన్=జాంబవంతుఁడు; ప్రీతిసంహృష్టః=సంతోషముచేఁగగుర్పాటునొందినవాఁడై;ప్రీతిమంతం = అధికమయినసంతోషముగలవాఁడును; మహాకపిం=పెద్దకోఁతియునగు; అనిలాత్మజం=వాయుదేవుని కుమారుండయినహనుమంతుని;కార్యవృత్తాంతం = సీతాదర్శనకార్యసంబంధి వృత్తాంతమును; అపృచ్ఛత్=అడిగెను.

అంత,జాంబవంతుండు, సంతోషంబున మేనంబులకలుప్పొడమఁ, బరమసంతుష్టుండగు వాయుపుత్త్రుహనుమంతుం జూచి, సీతంజూచివచ్చినవృత్తాంతంబు నడిగెను. అని,తాత్పర్యము.

కథం దృష్టా త్వయా దేవీ కథంవా తత్ర వర్తతే
తస్యాంవా స కథం వృత్తః క్రూరకర్మా దశాననః. ౩



టీక॥త్వయా=నీచేత; దేవీ=సీతాదేవి; కథం=ఎట్లు; దృష్టా=చూడఁబడినది?కథంవా=ఎట్లు;తత్ర= అచ్చట; వర్తతే=ఉన్నది ? క్రూరకర్మా=క్రూరములగుకార్యములుగల; సః=ఆ; దశాననః=రావణుఁడు;తస్యాం= ఆసీతయందు;కథంవా=ఎట్లు;వృత్తః= నడుచుకొనుచున్నాఁడు?

నీవుసీతాదేవినెట్లుచూచినావు? ఆ బిడయచ్చటనెట్లున్నది? అతిక్రూరుండగునారావణుండు, ఆబిడవిషయమయి యెట్లునడుచుకొనుచున్నాఁడు?

అని, తాత్పర్యము.

తత్త్వతస్సర్వ మేతన్నః ప్రబ్రూహి త్వం మహాకపే
శ్రుతార్థా శ్చింతయిష్యామో భూయః కార్యవినిశ్చయమ్ . ౪

టీక॥మహాకపే=పెద్దకోఁతివగుహనుమంతుఁడా!త్వం=నీవు; నః=మాకు; ఏతత్=దీని;సర్వం=అంతను; తత్త్వతః=యథార్థముగా; ప్రబ్రూహి= చెప్పుము.శ్రుతార్థాః= వినఁబడినవృత్తాంతముగలవారమై ; భూయః = ఇంకమీఁద;కార్యవినిశ్చయం=కార్యముయొక్క-నిశ్చయించుటను ; చింతయిష్యామః=ఆలోచించెదము.

హనుమంతుఁడా!ఈసమాచారము నంతయు,మాకు,యథార్థముగా, జెప్పుము;వృత్తాంతమంతయువిని,యాపైని;చేయవలసినకార్యమును,నిశ్చయించుకొనెదము. అని, తాత్పర్యము.

యశ్చార్థ స్తత్ర వక్తవ్యో గతై రస్మాభి రాత్మవాన్
రక్షితవ్యంచ యత్తత్ర తద్భవాన్ వ్యాకరోతి నః. ౫

టీక॥తత్ర=అచ్చట;గతైః= పోయిన;అస్మాభిః=మనచేత;యః=ఏ; అర్థశ్చ=సంగతియు;వక్తవ్యః= చెప్పఁబడవలయునో;యత్=యేదియు; తత్ర= అచ్చట;రక్షితవ్యం= రక్షింపఁబడవలయునో;తత్=దాని;నః=మాకు; ఆత్మవాన్ = అధికమయినబుద్ధిగల ; భవాన్=నీవు;వ్యాకరోతి = వివరించిచెప్పుము.

మనమురామునొద్దకుఁ బోయినప్పుడు, ఏసంగతంజెప్పవలయునో, దేనిదాఁచవలయునో, దానినంతయునీవుబు

ద్ధిమంతుఁడవుకావున, వివరముగా, మాకుం జెప్పుము. అని, జాంబవంతుండు, హనుమంతునడిగెను.

అని, తాత్పర్యము.

స నియుక్త స్తత స్తేన సంప్రహృష్టతనూరుహః
ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై ప్రత్యభాషత. ౬

టీక॥ తతః=అటుపిమ్మట; సః=ఆ హనుమంతుఁడు; తేన=ఆజాంబవంతునిచేత; నియుక్తః=ఆజ్ఞాపింపఁబడినవాఁడై; సంప్రహృష్టతనూరుహః=మిక్కిలియుఁగగుర్పొడిచిన వెండ్రుకలు గలవాఁడై; దేవ్యై=రాణియగు; సీతాయై=సీతకొఱకు; శిరసా=శిరసుచేత; ప్రణమ్య=నమస్కరించి; ప్రత్యభాషత=బదులుచెప్పెను.

అంత, హనుమంతుండు, అట్లుజాంబవంతుండుప్రశ్న సేయఁగాఁ బులకాంకితదేహుండై, సాష్టాంగంబుగ సీతాదేవికినమస్కరించి; యిట్లని, చెప్పందొడంగెను. అని, తాత్పర్యము.

ప్రత్యక్షమేవ భవతాం మహేంద్రాగ్రా త్ఖ మాప్లుతః
ఉదధే ర్దక్షిణం పారం కాంక్షమాణ స్సమాహితః. ౭

టీక॥ అహం=నేను; సమాహితః=ఏకాగ్రుండనై; ఉదధేః=సముద్రముయొక్క; దక్షిణం=దక్షిణపుదిక్కునందలి; పారం=గట్టును; కాంక్షమాణః=కోరుచు; మహేంద్రాగ్రాత్=మహేంద్రపర్వత శిఖరమున నుండి; ఖం=ఆకాశమును; ఆప్లుతః=పొందినాను. ఇదం (అధ్యాహృతము)= ఇది; భవతాం=మీకు; ప్రత్యక్షమేవ=ప్రత్యక్షమే,

నేను, సమాహితుండనై; సముద్రముదక్షిణపుగట్టుఁజేరఁగోరి; మహేంద్రపర్వతశిఖరంబుననుండి, యాకాశంబుకెగరుట, మీరందఱునుజూచినదే.

అని, తాత్పర్యము.

గచ్ఛత శ్చ హి మే ఘోరం విఘ్నరూప మివాభవత్
కాంచనం శిఖరం దివ్యం పశ్యామి సుమనోహరమ్. ౮




టీక॥ గచ్ఛతః=పోవుచున్న; మేచ=నాకును; సుమనోహరం= మిక్కిలియు రమణీయమును; దివ్యం=శ్రేష్ఠమును; కాంచనం = బంగారు వికారమయిన దియునగు; శిఖరం=పర్వతశిఖరము; విఘ్నరూపమివ = విఘ్నమయినదివలె; అభవత్=అయినది. తత్ (అధ్యాహృతము)=దాని; పశ్యామి = (భూతాభకాలమందులట్) చూచితిని.

నేను బోవుచుండఁగానే, పరమ రమణీయంబును దివ్యంబునగు నొక కాంచనశిఖరంబు, విఘ్నము సేయునది నాకడ్డమువచ్చినది.

అని, తాత్పర్యము.

స్థితం పంథాన మావృత్య మేనే విఘ్నంచ తన్నగమ్

టీక॥పంథానం=మార్గమును; ఆవృత్య=అడ్డగించుకొని ; స్థితం=ఉన్న; తం=ఆ;నగం=పర్వతమును ; విఘ్నంచ=విఘ్నమునుగానే ; మేనే=తలంచినాను.

ఆపర్వతము,మార్గము నడ్డగించుకొని,యుండినది, కావున, నేను, అది నాకువిఘ్నముసేయవచ్చినట్లు తలంచినాను. అని, తాత్పర్యము.

ఉపసంగమ్య తం దివ్యం కాంచనం నగసత్తమమ్. ౯
కృతా మే మనసా బుద్ధిర్భేత్తవ్యోఽయం మయేతిచ

టీక॥దివ్యం= శ్రేష్ఠమయినదియు; కాంచనం = స్వర్ణమయంబునగు ; తం=ఆ;నగసత్తమం= పర్వతశ్రేష్ఠమును;ఉపసంగమ్య=పొంది;మే= నాయొక్క; మనసా=మనసుచేత; మయా=నాచేత; అయం=ఈపర్వతము;భేత్తవ్యః= పగులఁగొట్టఁబడవలసినది. "ఇతి=అని,బుద్ధిశ్చ=తలంపును;కృతా=చేయఁబడినది.

దివ్యంబునుస్వర్ణమయంబునగునా పర్వతంబునొంది, నేను, "ఈపర్వతంబునుబగులగొట్టవలయును" అని,తలంచితిని- అని,తాత్పర్యము.

ప్రహితంచ మయా తస్య లాంగూలేన మహాగిరేః. ౧౦
శిఖరం సూర్యసంకాశం వ్యశీర్యత సహస్రధా




టీక॥తస్య=ఆ;మహాగిరేః= గొప్ప పర్వతముయొక్క; సూర్యసంకాశం= సూర్యునితోసమానమయిన; శిఖరం= శృంగము; మాయా=నాచేత;లాంగూలేన=తోఁకచేత; ప్రహతంచ=కొట్టఁబడినదియునై; సహస్రధా=వేయిపఱియలుగా; వ్యశీర్యత=పగిలినది.

అంత,సూర్యసంకాశంబగు నాపర్వతశిఖరంబును నేనువాలంబునంగొట్టఁగా,నది వేయి పఱియలయిపగిలినది.

అని, తాత్పర్యము.

వ్యవసాయంచ తం బుద్ధ్వా సహోవాచ మహాగిరిః. ౧౧
పుత్రేతి మధురాం వాణీం మనః ప్రహ్లాదయన్నివ

టీక॥సః = ఆ("హ" అనునది పాదపూరణార్థము);మహాగిరిః= పెద్దపర్వతము;తం=ఆ;వ్యవసాయం=ప్రయత్నమును;బుద్ధ్వాచ = తెలిసియు;"పుత్ర=కొడుకా!" ఇతి = అనెడు;మధురాం = మనోహరమయిన;వాణీం= మాటను;ఉక్త్వా(అధ్యాహృతము)=చెప్పి;మనః = మనస్సును;ప్రహ్లాదయన్నివ=సంతోషింపఁజేయుచునే;ఉవాచ= చెప్పెను.

ఆపర్వతమంత, నేనుదన్నుఁబగులఁగొట్టయత్నించుచున్నానని, తెలిసికొని, నన్ను"కొడుకా"యనిమధురంబుగాఁబిలిచి, నామనంబునకుసంతోషంబునెఱపుచు,నిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

పితృవ్యంచాపి మాం విద్ధి సఖాయం మాతరిశ్వనః. ౧౨
మైనాక మితి విఖ్యాతం నివసంతం మహోదధౌ

టీక॥మాతరిశ్వనః = వాయుదేవునకు;మాం=నన్ను; సఖాయం = మిత్రుండను,కావున;పితృవ్యం=పినతండ్రిని;మహోదధౌ= సముద్రమునందు; నివసంతం = నివసించుచున్నవాఁడను; మైనాకం=మైనాకుండను;ఇతి=అని; విఖ్యాతం = ప్రసిద్ధుండనగువానిఁగా;విద్ధి=ఎఱుంగుము.

నేను, నీతండ్రివాయుదేవునకు మిత్రుండను,గావున,నీకుఁబినతండ్రిని, సముద్రంబులోనున్నాను; మైనాకుండను పేరుగలవాఁడనని, యెఱుంగుము.

అని, తాత్పర్యము.

పక్షవంతః పురా పుత్ర బభూవుః పర్వతోత్తమాః. ౧౩
ఛందతః పృథివీం చేరు ర్బాధమానా స్సమంతతః

టీక॥పుత్ర=కుమారుఁడా! పురా=మున్ను; పర్వతోత్తమాః = పర్వతశ్రేష్ఠంబులు; పక్షవంతః= ఱెక్కలుగలవిగా; బభూవుః=ఉండినవి;సమంతతః=అంతటను; బాధమానాః = బాధించుచు, ఛందతః=యథేచ్ఛగా; పృథివీం=భూమిని; చేరుః=సంచరించినవి.

కుమారుఁడా! మున్నుపర్వతంబులన్నియు, ఱెక్కలుగలిగియుండినవి; అప్పుడవి స్వేచ్ఛగాభూమియంతయుఁ దిరుగుచు;సమస్తభూతంబులనుబాధించుచుండినవి. అని, తాత్పర్యము.

శ్రుత్వా నగానాం చరితం మహేంద్రః పాకశాసనః. ౧౪
చిచ్ఛేద భగవాన్ పక్షాన్ వజ్రేణైషాం సహస్రశః

టీక॥భగవాన్=మాహాత్మ్యము గలవాఁడును; పాకశాసనః= పాకుండనురాక్షసునిశిక్షించినవాఁడునగు ; మహేంద్రః=దేవేంద్రుఁడు; నగానాం=పర్వతములయొక్క; చరితం = కార్యమును; శ్రుత్వా=విని; ఏషాం= ఈపర్వతములయొక్క; పక్షాన్=ఱెక్కలను; సహస్రశః= వేనవేలుగా ; వజ్రేణ=వజ్రాయుధముచేత; చిచ్ఛేద= నఱికెను.

అంత,భగవంతుండునుపాకాసురుంజంపినవాఁడునగుదేవేంద్రుండు, పర్వతంబులుసేయుదుశ్చేష్టనువిని, వానిఱెక్కలనన్నింటిని,వజ్రాయుధంబుచే, ఛేదించెను.అని, తాత్పర్యము.

అహంతు మోక్షిత స్తస్మా త్తవ పిత్రా మహాత్మనా. ౧౫
మారుతేన తదా వత్స ప్రక్షిప్తోఽస్మి మహార్ణవే

టీక॥వత్స=బిడ్డఁడా!అహంతు=నేనుమాత్రము;మహాత్మనా= పూజ్యమయినస్వభావంబుగల;తవ=నీయొక్క; పిత్రా=తండ్రియగు;మారుతేన= వాయువుచేత;తస్మాత్= ఆయింద్రునివలన; మోక్షితః = విడిపింపఁబడినాను.తదా=అప్పుడు;మహార్ణవే = మహాసముద్రంబునందు;ప్రక్షిప్తః= పడద్రో

యఁబడినవాఁడను; అస్మి = అగుచున్నాను.

బిడ్డఁడవగుహనుమంతుఁడా! అప్పుడు,మహాత్ముండగునీతండ్రి వాయుదేవుండు,నన్నుమాత్రము, ఈమహాసముద్రంబులోఁబడవైచి,దేవేంద్రునిబారింబడకుండ,రక్షించినాఁడు.

అని, తాత్పర్యము.

రామస్యచ మయా సాహ్యే వర్తితవ్య మరిందమ. ౧౬
రామో ధర్మభృతాం శ్రేష్ఠో మహేంద్రసమవిక్రమః

టీక॥అరిందమ= శత్రువులనడంగద్రొక్కునట్టి హనుమంతుఁడా! మయా=నాచేత; రామస్యచ= రామునియొక్కయు;సాహ్యే= తోడ్పాటునందు;వర్తితవ్యం=ఉండుటకావలసినది. రామః=రాముండు; ధర్మభృతాం= ధర్మంబును భరించువారిలోపల; శ్రేష్ఠః=ఉత్తముఁడు.మహేంద్ర సమవిక్రమః=దేవేంద్రుని పరాక్రమముతో సమానమయిన పరాక్రమముగలవాఁడు.

శత్రువులనడంగఁద్రొక్కు వాఁడవగుహనుమంతుఁడా!ఇందువలన, నేను, వాయువువలనమహోపకారంబునొందినవాఁడనుగాన, అతని కుమారుండవగునీకుసాహాయ్యముచేయవలసినవాఁడనగుటస్పష్టముగదా;మఱియు, రాముండు,ధార్మికులలో నుత్తముఁడు, దేవేంద్రునకుంబలెఁబరాక్రమంబు గలవాఁడును,గావున,నేనతనికిని, సాహాయ్యముసేయవలసినవాఁడనే ; నీవతనిదూతవుకాఁబట్టి,ఈరెండు సంబంధంబులను,నేను,నీకుసాహాయ్యముసేయవలసినవాఁడనగుచున్నాను.అని , మైనాకుండు,నాతోఁజెప్పెను.

అని,తాత్పర్యము.

ఏతచ్ఛ్రుత్వా వచ స్తస్య మైనాకస్య మహాత్మనః. ౧౭
కార్య మావేద్యతు గిరే రుద్యతంచ మనో మమ

టీక॥మహాత్మనః = పూజ్యమయినస్వభావముగల ; తస్య=ఆ ; మైనాకస్య=మైనాకుండను; గిరేః = పర్వతముయొక్క; ఏతత్=ఈ; వచః=మాటను; శ్రుత్వా=విని, కార్యం=పనిని ; ఆవేద్యతు=తెలిపియు; మమ=నాయొక్క; మనః=మనసు; ఉద్యతంచ = ఉద్యుక్తమయినదియు-

మహాత్ముండగు నామైనాకుండిట్లు చెప్పఁగానే, నేనతనికి, గావచ్చినకార్యంబుఁదెలపి, యాపైఁబోవుటకుద్యుక్తుండనైతిని. అని, తాత్పర్యము.

తేన చాహ మనుజ్ఞాతో మైనాకేన మహాత్మనా, ౧౮

టీక॥ మహాత్మనా=పూజ్యమయిన స్వభావముగల; తేన=ఆ; మైనాకేన చ=మైనాకునిచేతను; అహం=నేను; అనుజ్ఞాతః = అంగీకరింపఁబడినాను.

మహాత్ముండగునామైనాకుండును, నాకుఁ, బొమ్మని,యనుజ్ఞనొసంగెను. అని, తాత్పర్యము.

స చాప్యంతర్హితః శైలో మానుషేణ వపుష్మతా
శరీరేణ మహాశైల శ్శైలేనచ మహోదధౌ ౧౯

టీక॥మహాశైలః=పెద్దపర్వతమగు; సః=ఆ; శైలశ్చాపి=మైనాకపర్వతంబును;వపుష్మతా= పుష్టిలమయినదేహముగల;పుష్టిలమయినదనుట;మానుషేణ=మనుష్యసంబంధియగు ; శరీరేణ=దేహముచేత; అంతర్హితః=మఱఁగుపడెను. శైలేనచ= పర్వతాకారమగు దేహముచేతను; మహోదధౌ= మహాసముద్రంబునందు; స్థితః(అధ్యాహృతము)=ఉండెను.

అంత,నామైనాకపర్వతము,నాతో మాటలాడుటకై ధరించిన పుష్టిలంబగుమానుషరూపంబును, మఱుఁగుపఱిచి, కేవలపర్వతాకారంబున, సముద్రంబుపైనుండెను.అని, తాత్పర్యము.

ఉత్తమం జవ మాస్థాయ శేషం పంథాన మాస్థితః
తతోఽహం సుచిరం కాలం వేగేనా భ్యాగమం పథి. ౨౦

టీక॥తతః=అటుపిమ్మట; అహం= నేను;ఉత్తమం=అధికమయిన; జవం= వేగమును; ఆస్థాయ=అవలంబించి; శేషం =మిగిలిన;పంథానం=మార్గము ను;ఆస్థితః=పొందినవాఁడనై;పథి= మార్గమునందు; వేగేన=వేగముచేత;సుచిరం=అధికమయిన ; కాలం=కాలమును; అభ్యాగమం=పోతిని.

అంత, నేను, మహావేగంబవలంబించి, శేషించినమార్గంబును దాటుటకై, వేగంబునఁజాలసేపు, పోవుచుంటిని- అని, తాత్పర్యము.

తతః పశ్యా మ్యహం దేవీం సురసాం నాగమాతరమ్
సముద్రమధ్యే సా దేవీ వచనం మా మభాషత. ౨౧

టీక॥తతః=అటుపిమ్మట; అహం=నేను; నాగమాతరం= సర్పంబునకుఁదల్లియును; దేవీం=అమ్మవారునగు; సురసాం=సురసను; పశ్యామి(అపశ్యం)=చూచినాను. సా=ఆ; దేవీ= సురసాదేవి; సముద్రమధ్యే= సముద్రమునడుమ; మాం=నన్నుఁగూర్చి;వచనం = మాటను;అభాషత= చెప్పెను.

అంత, నేను,సర్పమాతయగు, సురసాదేవింజూచినాను;ఆసురసాదేవి, సముద్రమధ్యంబున,నన్నుఁజూచి, యిట్లని,చెప్పినది.అని, తాత్పర్యము.

మమ భక్షః ప్రదిష్ట స్త్వ మమరై ర్హరిసత్తమ
అత స్త్వాం భక్షయిష్యామి విహిత స్త్వం చిరస్య మే. ౨౨

టీక॥హరిసత్తమ=వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా!త్వం = నీవు;మమ=నాకు; భక్షః = ఆహారముగా: అమరైః=దేవతలచేత; ప్రదిష్టః= ఇయ్యఁబడినావు . అతః = ఇందువలన; త్వాం=నిన్ను; భక్షయిష్యామి=తినెదను.త్వం=నీవు; మే=నాకు;చిరస్య= బహుకాలమునకు; విహితః=లబ్ధుఁడవు.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! దేవతలునాకునిన్ను, ఆహారముగానిచ్చిరి;కావున,నిన్నునేనుభక్షించెదను. నీవునాకుబహుకాలంబునకు దొరకినావు.అని,సురస,నాతోఁజెప్పినది.

అని, తాత్పర్యము.

ఏవముక్త స్సురసయా ప్రాంజలిః ప్రణత స్థ్సితః
వివర్ణవదనో భూత్వా వాక్యంచేద ముదీరయమ్. ౨౩

టీక॥అహం(అధ్యాహృతము)=నేను;సురసయా=సురసచేత;ఏవం = ఇట్లు;ఉక్తః = చెప్పఁబడినవాఁడనై ; ప్రాంజలిః= మంచిచేమోడ్పుగలవాఁడ



నై; ప్రణతః=నమస్కరించినవాఁడనై; స్థితః = నిలిచినవాఁడనై; వివర్ణవదనః=తెల్లఁబాఱినముఖముగలవాఁడను; భూత్వా=అయి; ఇదం = ఈ; వాక్యం చ=మాటను; ఉదీరయం=చెప్పినాను.

నేను, సురసాదేవిమాటనువిని, చేమోడ్పుగేలించి, నమస్కరించి, ముఖంబునవైవర్ణ్యంబుగదుర, నాబిడ, కిట్లని, చెప్పినాను. అని, తాత్పర్యము.

రామో దాశరథి శ్శ్రీమాన్ ప్రవిష్టో దండకావనమ్
లక్ష్మణేనసహ భ్రాత్రా సీతయాచ పరంతపః. ౨౮

టీక॥ పరంతపః=శత్రువులఁదపింపఁజేయువాఁడును; శ్రీమాన్=అధికమయినకాంతిగలవాఁడును; దాశరథిః=దశరథునికొడుకునగు; రామః = రాముఁడు; భ్రాత్రా=తమ్ముఁడగు; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ; సీతయాచ=సీతతోనుంగూడ; దండకావనం= దండకారణ్యమును; ప్రవిష్టః = ప్రవేశించినాఁడు.

శ్రీమంతుండును, శత్రువులందపింపఁజేయువాఁడును దశరథపుత్రుండునగు రాముండును, అతని తమ్ముండులక్ష్మణుండును, భార్యసీతయును, దండకారణ్యంబుఁబ్రవేశించిరి. అని, తాత్పర్యము.

తస్య సీతా హృతా భార్యా రావణేన దురాత్మనా

టీక॥ తస్య = అతనియొక్క; భార్యా=పెండ్లాము; సీతా= సీతయనునది; దురాత్మనా=దుష్టస్వభావముగల; రావణేన = రావణునిచేత; హృతా=అపహరింపఁబడినది.

రామునిభార్యయగుసీతను , దురాత్ముండగు రావణుం డపహరించెను. అని, తాత్పర్యము.

తస్యా స్సకాశం దూతోహం గమిష్యే రామశాసనాత్. ౨౯

టీక॥ అహం=నేను; రామశాసనాత్=రామునాజ్ఞవలన; దూతః = రాయబారినై; తస్యాః= ఆసీతాదేవియొక్క; సకాశం = సమీపమునుగూర్చి; గమిష్యే=పోయెదను.

నేనిప్పుడు, రామునియాజ్ఞవలన, ఆ



సీతాదేవియొద్దకుఁబోవుచున్నాను. అని, తాత్పర్యము.

కర్తుమర్హసి రామస్య సాహాయ్యం విషయే సతీ

టీక॥ విషయే=రాముని, దేశమునందు; సతీ=ఉన్న; త్వం (అధ్యాహృతము)=నీవు; రామస్య = రామునికి; సాహాయ్యం=తోడ్పాటును; కర్తుం=చేయుటకు; అర్హసి=తగుదువు.

నీవు, రాముని రాజ్యంబున నివసించుచున్నావు, కావున, రామునకు సాహాయ్యము సేయవలసినదానవే యగుచున్నావు.

అని, తాత్పర్యము.

అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్. ౨౬
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే

టీక॥ అథవా=అటుగాదేని; మైథిలీం=సీతను; అక్లిష్టకారిణం=దుఃఖములేనట్లుసేయునట్టి; రామంచ=రామును; దృష్ట్వా=చూచి; తే=నీయొక్క; వక్త్రం=నోటిని; ఆగమిష్యామి=పొందెదను. తే=నీకొఱకు; సత్యం= సత్యగా; ప్రతిశృణోమి = ప్రతిజ్ఞసేయుచున్నాను.

అట్లునీవురామునకు సాహాయ్యము సేయనొడంబడవేని, నేను,బోయి, సీతంజూచి, యాబిడవృత్తాంతమును రామునకుంజెప్పి,యంత, మఱలవచ్చి, నీనోరు ప్రవేశించెదను; నామాట సత్యము; నీవుసందేహింపవలదు- అని, నేను, సురసతోఁజెప్పినాను.

అని, తాత్పర్యము.

ఏవముక్తా మయా సాతు సురసా కామరూపిణీ. ౨౭
అబ్రవీన్నాతివర్తేత కశ్చిదేష వరో మమ

టీక॥కామరూపిణీ= ఇచ్ఛాధీనంబగురూపముగల;సా=ఆ;సురసాతు=సురసయును;మయా= నాచేత; ఏవం= ఇట్లు;ఉక్తా=చెప్పఁబడినదై; "నాతివర్తేత=అతిక్రమింపఁడు . మమ=నాకు;ఏషః=ఇది; కశ్చిత్ =ఒకానొక; వరః=వరము."ఇతి (అధ్యాహృతము)=అని;అబ్రవీత్=చెప్పెను.

నేనిట్లు చెప్పఁగాఁ గామరూపిణియగు నాసురస, అందుకియ్యకొనక, "నాచేఁ బట్టుకొనఁబడినవాఁ డెవ్వఁడును నన్నతిక్రమించిపోఁజాలఁడు, ఇట్లు నాకు వరంబున్నది." అని, చెప్పినది.

అని, తాత్పర్యము;

ఏవ ముక్త స్సురసయా దశయోజన మాయతః. ౨౮
తతో ర్ధగుణవిస్తారో బభూవాఽహం క్షణేన తు

టీక॥ దశయోజనం=పదియోజనములు; ఆయతః=నిడుపైన; అహం= నేను; సురసయా=సురసచేత; ఏవం= ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినవాఁడనై ; తతః=ఆపదియోజనములకన్నను; అర్ధగుణవిస్తారః=సగముగూర్చుట చేవైశాల్యముగలవాఁడను; క్షణేనతు= క్షణముచేత నే; బభూవ=అయితిని.

అప్పుడు, పదియోజనంబులు నిడువుగల నేను, సురసయామాటం జెప్పఁగా నేక్షణంబునఁ, బదునైదు యోజనంబులు నిడుపుగలవాఁడనైతిని.

అని, తాత్పర్యము.

మత్ప్రమాణానురూపంచ వ్యాదితంచ ముఖం తయా. ౨౯

టీక॥ తయాచ=ఆసురసచేత ; ముఖం=నోరు; మత్ప్రమాణానురూపంచ=నాకొలందికిఁదగినట్టుగాను ; వ్యాదితం=తెఱవఁబడినది.

ఆసురసయు, నా దేహప్రమాణమునకుందగునట్టు, నోరుఁదెఱచినది.

అని, తాత్పర్యము.

తద్దృష్ట్వా వ్యాదితం చాస్యం హ్రస్వం హ్యకరవం వపుః
తస్మి న్ముహూర్తేచ పున ర్బభూ వాంగుష్ఠమాత్రకః. ౩౦

టీక॥ వ్యాదితం = తెఱవఁబడిన ; తత్=ఆ; ఆస్యంచ=నోరును; దృష్ట్వా=చూచి; వపుః=దేహమును; హ్రస్వం= చిన్నదిగా; అకరవంహి = చేసితినిగదా! పునః=మఱల; తస్మిన్ = ఆ; ముహూర్తేచ=కాలమునందే; అంగుష్ఠమాత్రకః=అంగళమంతటివాఁడను; బభూవ=అయితిని.

నేను, అట్లుసురసనోరుదెఱచుటం జూచి,యాకాలంబుననే, నాదేహము నుమిక్కిలియుఁజిన్నదిచేసికొని, ఒక యంగుళమంతటి దేహముగలవాఁడనైతిని. అని, తాత్పర్యము.

అభిపత్యాశు తద్వక్త్రం నిర్గతోఽహం తతః క్షణాత్

టీక॥తతః=అటుపిమ్మట; అహం=నేను;ఆశు=శీఘ్రముగా;తద్వక్త్రం=ఆసురసనోరును;అభిపత్య – పొంది; క్షణాత్=క్షణంబున;నిర్గతః= వెడలినాను.

అంత, నేను,శీఘ్రంబుగా, నాసురసనోటిలోఁబ్రవేశించి,క్షణంబున, మఱల, వెడలి,వచ్చితిని. అని, తాత్పర్యము.

అబ్రవీత్సురసా దేవీ స్వేన రూపేణ మాం పునః. ౩౧

టీక॥పునః=మఱల;దేవీ= తల్లియగు;సురసా=సురస; స్వేన = తనదైన; రూపేణ=ఆకారముచేత;మాం = నన్నుఁగూర్చి;అబ్రవీత్=చెప్పెను.

అంత, సురసాదేవి, తనమెప్పటిరూపంబుధరించి,నన్నుఁజూచి,యిట్లనిచెప్పినది. అని, తాత్పర్యము.

అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్
సమానయచ వైదేహీం రాఘవేణ మహాత్మనా- ౩౨

టీక॥ సౌమ్య = తిన్ననివాఁడవునగు;హరిశ్రేష్ఠ=వానరోత్తముఁడవునగు హనుమంతుఁడా!అర్థసిద్ధ్యై= కార్యసిద్ధికొఱకు;యథాసుఖం=సుఖమునతిక్రమింపక; గచ్ఛ=పొమ్ము.మహాత్మనా=పూజ్యమయిన స్వభావముగల ; రాఘవేణ=రామునితో;వైదేహీంచ=సీతను;సమానయ=చేర్పుము.

సౌమ్యుండవువానరశ్రేష్ఠుండవునగు హనుమంతుఁడా!నీవుసుఖంబుగాఁ బోయి,కార్యసిద్ధింబొందుము; సీతను రామునితోడంజేర్పుము.

అని,తాత్పర్యము.

సుఖీ భవ మహాబాహో ప్రీతాస్మి తవ వానర

టీక॥మహాబాహో = పెద్దచేతులుగల; వానర = హనుమంతుఁడా! సుఖీ = సుఖముగలవాఁడవు; భవ = అగుము. తవ = నీకు; ప్రీతా = సంతసించినదానను; అస్మి = అగుచున్నాను.

మహాబాహుండవగువానరుఁడా! నీవుసుఖమునొందుదువుగాక; నీయందు నాకుఁబ్రీతిగల్గినది. అని, సురసాదేవి, నాతోఁజెప్పినది. అని, తాత్పర్యము.

తతో౽హం సాధు సాధ్వీతి సర్వభూతైః ప్రశంసితః. ౩౩

టీక॥ తతః = అటుపిమ్మట; అహం = నేను; సాధుసాధు = లెస్సలెస్స; ఈతి (ఇతి) = అని; సర్వభూతైః = సమస్తభూతంబులచేతను; ప్రశంసితః = కొనియాడఁబడినాను.

అంత, సమస్తభూతంబులును, "లెస్స! లెస్స!" యనినన్నుఁబ్రస్తుతించినవి. అని, తాత్పర్యము.

తతోంతరిక్షం విపులం ప్లుతో౽హం గరుడో యథా

టీక॥తతః = అటుపిమ్మట; అహం = నేను; గరుడోయథా = గరుత్మంతుండువలె; విపులం = విశాలమయిన; అంతరిక్షం = ఆకాశమును; ప్లుతః = పొందినాను.

అంత, మఱలనేను, గరుత్మంతుండుంబోలె, నాకాశంబునకుద్గమించితిని. అని, తాత్పర్యము.

ఛాయా మే నిగృహీతాచ నచ పశ్యామి కించన- ౩౪

టీక॥మే = నాయొక్క; ఛాయాచ = నీడయు; నిగృహీతా = పట్టుకొనఁబడినది- కించనచ = దేనిని; నపశ్యామి = చూడనైతిని-

అంతలో, దేనిచేతనో. నామేనినీడ, పట్టుకొనఁబడినది; నాకేదియు నగపడలేదు-
అని, తాత్పర్యము-

సోహం విగతవేగ స్తు దిశో దశ విలోకయన్
నకించి త్తత్ర పశ్యామి యేన మే౽ప హృతాగతిః. ౩౫

టీక॥ విగతవేగః= పోయినవేగము కలః; సః=ఆ; అహంతు= నేనును; దశ= పదియగు; దిశః= దిక్కులను; విలోకయన్= చూచుచు; యేన= దేనిచేత; మే= నాయొక్క; గతిః= నడక; అపహృతా= అపహరింపఁబడినదో; తత్ (అధ్యాహృతము)= దాని; కించిత్= దేని నిఁ; నపశ్యామ= చూడనైతిని-

వేగంబంతయునిలిచినంతనె, నేను, దిక్కులన్నియు, వెదకినను, నాఘాయను బట్టుకొనినదియేదో, అదినాకగపడ నేలేదు- అని, తాత్పర్యము-

తతో మే బుద్ధి రుత్పన్నా కిన్నామ గగనే మమ
ఈదృశో విఘ్న ఉత్పన్నో రూపం యత్ర నదృశ్యతే. ౩౬

టీక॥ తతః= అటుపిమ్మట; యత్ర= ఎచ్చట; రూపం= రూపము; నదృశ్యతే= చూడఁబడలేదో; ఈదృశః= ఇట్టి; విఘ్నః= విఘ్నము; మమ= నాకు; గగనే= ఆకాశమునందు; కిన్నామ= ఎందుకు; ఉత్పన్నః= కలిగినదిః ఇతి (అధ్యాహృతము)= అనెడు; బుద్ధిః= తలంపు; మే= నాకు; ఉత్పన్నా= కలిగినది-

అంత, ఆకాశమునందిట్టి విఘ్నము నాకెట్లుగలిగినదిః విఘ్నముసేయు నదియేదో, దానిరూపమును నాకగపడలేదే" అని, నేనుజింతించితిని-

అని, తాత్పర్యము-

అధోభాగేన మే దృష్టి శ్శోచతా పాతితా మయా
తతో ద్రాక్ష మహం భీమం రాక్షసీం సలిలేశయామ్. ౩౭

టీక॥ శోచతా= దుఃఖించుచున్న; మయా= నాచేత; మే= నాయొక్క; దృష్టిః= చూపు; అధోభాగేన= క్రిందిప్రదేశముచేత; పాతితా= త్రోయఁబడినది, పఱుపఁబడినదనుట. తతః= అటుపిమ్మట; అహం= నేను; భీమాం= భయంకరయను; సలిలేశయాం= జలమునందున్నదియునగు; రాక్షసీం= రాక్షసస్త్రీని; అద్రాక్షం= చూచితిని•

నేనంతదుఃఖించుచుఁగ్రింద, జలంబు తట్టుచూచినాను; అచ్చట, జలంబుల, భయంకరాకారయగు నొకరాక్షసస్త్రీ నాకగపడినది-

అని, తాత్పర్యము-

ప్రహస్యచ మహానాద ముక్తోహం భీమయా తయా
అవస్థిత మసంభ్రాంత మిదం వాక్య మశోభనమ్- ౩౮

టీక॥ అహం=నేను; భీమయా = భయంకరయగు; తయాచ = ఆ రాక్షసస్త్రీచేతను; మహానాదం=పెద్దధ్వనిగల్గునట్లు; ప్రహస్య=నవ్వి; అవస్థితం= దృఢమయినదియు; అసంభ్రాంతం = తొట్రుపాటు లేనిదియును; అశోభనం= అమంగళకరంబునగు; ఇదం = ఈ; వాక్యం=మాటను; ఉక్తః = చెప్పఁబడినాను-

అంత, భయంకరాకారయగు నా రాక్షసి, నన్నుఁజూచి, మహాధ్వనిగల్గునట్లు, నవ్వి, యెంతమాత్రమును దొట్రుపాటు లేక, దృఢంబుగా, నమంగళంబగు నీమాటం జెప్పినది-

అని, తాత్పర్యము-

క్వాసి గంతా మహాకాయ క్షుధితాయా మమేప్సితః
భక్షః ప్రీణయ మే దేహం చిర మాహారవర్జితమ్- ౩౯

టీక॥ మహాకాయ= పెద్దమేనుగలవాఁడా! క్వ=ఎచ్చటికి; గంతా = పోవువాఁడవు; అసి=అగుచున్నావు? క్షుధితాయాః =ఆఁకలిగొన్న; మమ = నాకు; భక్షః=ఆహారము; ఈప్సితః= కోరఁబడినది- చిరం = బహుకాలముగా; ఆహారవర్జితం= ఆహారము చేవిడువఁబడిన; మే=నాయొక్క; దేహం= దేహమును; ప్రీణయ=సంతోషింపఁజేయుము-

పెద్దదేహముగలవాఁడా ! నీవెచ్చటికిఁబోవుచున్నావు ? నేనాఁకలిగొనియున్నాను; నాకాహారము గావలయును ; బహుకాలముగా నాహారము లేని నాకుఁదృప్తిగావింపుము- అని, యా రాక్షసి, నాతోఁజెప్పినది-

అని, తాత్పర్యము.

బాఢ మిత్యేవ తాం వాణీం ప్రత్యగృహ్ణా మహం తతః
ఆస్యప్రమాణా దధికం తస్యాః కాయ మపూరయమ్- ౪౦

టీక॥ అహం=నేను; తాం = ఆ; వాణీం=మాటను; "బాఢం= మంచిది."ఇత్యేవ—అనియే; ప్రత్యగృహ్ణాం= పుచ్చుకొంటిని.తతః=అటుపిమ్మట; తస్యాః=ఆరాక్షసియొక్క; ఆస్యప్రమాణాధికం= నోటియొక్కప్రమాణముకన్నఅధికముగా; కాయం=దేహమును; అపూరయం=వృద్ధినొందించితిని.

నేను,"మంచిదని , యొప్పుకొని , యంత,నారాక్షసినోటికన్ననెచ్చుగా, నాదేహంబునుబెంచితిని.

అని, తాత్పర్యము-

తస్యాశ్చాస్యం మహద్భీమం వర్ధతే మమ భక్షణే

టీక॥ తస్యాః— ఆరాక్షసియొక్క; భీమం=భయంకరంబును ; మహత్ = పెద్దదియునగు; ఆస్యంచ = నోరును; మమ=నాయొక్క; భక్షణే= తినుటనిమిత్తమయి;వర్ధతే=వృద్ధిఁబొందుచుండినది.

భయంకరంబునుబెద్దదియునగు నారాక్షసినోరును నన్నుభక్షించు నిమిత్తమయి, నాదేహమునకన్ననెచ్చుగావృద్ధిఁబొందినది. అని, తాత్పర్యము.

నచ మాం సాధు బుబుధే మమ వా వికృతం కృతమ్. ౮౧

టీక॥సా=ఆరాక్షసస్త్రీ; మాం = నన్నుఁగాని; మమ=నాయొక్క ; కృతం—చేయఁబడిన ; వికృతంవా=వికారమునుగాని; సాధు=లెస్సగా; నబుబుధే=తెలిసికొనదయ్యె.

ఆరాక్షసస్త్రీ, నేనుగామరూపిననిగాని, నేనుగావలెననియట్టివికృతరూపముఁదాల్చితిననిగాని,యెంతమాత్రము, తెలిసికొనదయ్యె.

అని, తాత్పర్యము.

తతోఽహం విపులం రూపం సంక్షిప్య నిమిషాంతరాత్

తస్యా హృదయ మాదాయ ప్రపతామి నభస్స్థలమ్. ౮౨

టీక॥తతః=అటుపిమ్మట; అహం= నేను;నిమిషాంతరాత్ =నిమిషకాలంబువలన;విపులం=పెద్దదయిన; రూపం= ఆకారమును;సంక్షిప్య=చిన్నదిచేసికొని;తస్యాః = ఆరాక్షసస్త్రీయొక్క; హృదయం=గుండెను; ఆదాయ=తీసి

కొని; నభస్థలం = ఆకాశమును; ప్రపతామి = పొందుచున్నాను, పొందితిననుట.

అంత, నేను, ఒకటి-నిమిషంబున, నాపెద్దరూపమునుజిన్నదిచేసికొని, ఆరాక్షసి కడుపులోనికిఁజొచ్చి, గుండెకాయం బెఱికికొని, యాకాశంబునకుద్గమించితిని. అని, తాత్పర్యము.

సా విసృష్టభుజా భీమా పపాత లవణాంభసి
మయా పర్వతసంకాశా నికృత్తహృదయా సతీ. ౮౩

టీక॥ భీమా = భయంకరయు; పర్వతసంకాశా = పర్వతముతో సమానయునగు; సా = ఆరాక్షసి; మయా = నాచేత; నికృత్తహృదయా = నఱకఁబడినగుండెగలది; సతీ = అయినదై; విసృష్టభుజా = విడువఁబడినభుజములుగలదై; లవణాంభసి = ఉప్పునీళ్లుగలసముద్రమునందు; పపాత = పడెను.

నేను, దానిగుండెకాయంబెఱికినంతనె, భయంకరయుఁబర్వతాకారయునగునారాక్షసస్త్రీ, చేతులువ్రేలాడవేసి, సముద్రంబునంబడినది.

అని, తాత్పర్యము.

శృణోమి ఖగతానాంచ సిద్ధానాం చారణైస్సహ
రాక్షసీ సింహికా భీమా క్షిప్రం హనుమతా హతా. ౮౪

టీక॥ "భీమా = భయంకరయగు; సింహికా = సింహికయను; రాక్షసీ = రాక్షసస్త్రీ; హనుమతా = హనుమంతునిచేత; క్షిప్రం = శీఘ్రముగా; హతా = చంపఁబడినది" ఇతి(అధ్యాహృతము) = అని; చారణైస్సహ = చారణులతోఁగూడ; బ్రువతాం(అధ్యాహృతము) = చెప్పుచున్న; ఖగతానాం = ఆకాశమునొందిన; సిద్ధానాంచ = సిద్ధులయొక్కయు; వచః(అధ్యాహృతము) = మాటను; శృణోమి = వింటిని.

"హనుమంతుండు, ఒకటి-నిమిషంబున, భయంకరయగుసింహికం, జంపె" నని, ఆకాశమునందున్నసిద్ధులునుజారణులును జెప్పుకొనఁగావింటిని.

అని, తాత్పర్యము.

తాం హత్వా పునరేవాహం కృత్యమాత్యయికం స్మరన్

గత్వా చాహం మహాధ్వానం పశ్యామి నగమండితమ్. ౪౫
దక్షిణం తీర ముదధే ల౯ంకా యత్రచ సా పురీ

టీక॥అహం=నేను; తాం= ఆసింహికను;హత్వా=చంపి;పునరేవ= మరలనే;ఆత్యయికం= ఆపదంగలిగించునట్టి;కృత్యం=పనిని;స్మర౯ =తలంచుచు;అహం=నేను;మహాధ్వానం=పెద్దమార్గమును; గత్వాచ=పొందియు; యత్ర=ఎచ్చట;సా=ఆ; లంకా=లంకయను; పురీ=పట్టణము; అస్తి(అధ్యాహృతము)=ఉన్నదో; తత్ (అధ్యాహృతము)=అట్టి;నగమండితం=వృక్షములచేనలంకరింపఁబడినదియు; ఉదధేః=సముద్రముయొక్క;దక్షిణం=దక్షిణపుదిక్కు-సందలి;తీరంచ=గట్టును; పశ్యామి=చూచినాను.

అట్లు, నేను, సింహికంజంపి, "యెట్టికార్యమును జేసితిని" అని, దుష్కరంబగు నా కార్యము నేతలంచుకొనుచు, బహుదూరంబుపోయి, లంకాపట్టణం బెచ్చటనున్నదో, అట్టినానావృక్ష మండితంబగు,సముద్రంబుదక్షిణ తీరంబుఁజూచితిని.

అని, తాత్పర్యము.

అస్తం దినకరే యాతే రక్షసాం నిలయం పురమ్. ౪౬
ప్రవిష్టోఽహ మవిజ్ఞాతో రక్షోభి ర్భీమవిక్రమైః

టీక॥దినకరే=సూర్యుఁడు; అస్తం=అస్తమయమును;యాతే= పొందఁగా; అహం=నేను;భీమవిక్రమైః= భయంకరమయినపరాక్రమముగల; రక్షోభిః=రాక్షసులచేత;అవిజ్ఞాతః= ఎఱుంగఁబడనివాఁడనై ;రక్షసాం= రాక్షసులకు;నిలయం=స్థానమయిన; పురం=లంకాపట్టణమును;ప్రవిష్టః=ప్రవేశించినాను.

సూర్యుఁడస్తమించినపిదప, నేను, భయంకరంబగుపరాక్రమంబుగల రాక్షసులకుఁదెలియకుండునట్లు, రాక్షసనివాసస్థానంబయినలంకాపురిం బ్రవేశించినాను. అని, తాత్పర్యము.

తత్ర ప్రవిశత శ్చాపి కల్పాంతఘనసన్నిభా. ౪౭
అట్టహాసం విముంచంతీ నారీ కాప్యుత్థితా పురః

టీక॥ తత్ర=అచ్చట ; ప్రవిశతశ్చాపి=ప్రవేశించుచుండఁగానే; కల్పాంతఘనసన్నిభా=ప్రళయకాలము నందలి మేఘముతోసమానురాలగు; కాపి= ఒకానొక; నారీ=స్త్రీ; అట్టహాసం=పెద్దనవ్వును; విముంచంతీ=విడుచుచు; పురః=ముందట; స్థితా=నిలిచినది.

నేనట్లుప్రవేశించుచుండఁగానే, ప్రళయ కాలమునందలి మేఘంబు వంటి యాకారంబుగలదయొకానొకస్త్రీ, గట్టిగానవ్వుచు, నాముందటనిలిచినది.

అని, తాత్పర్యము.

జిఘాంసంతీం తత స్తాం తు జ్వలదగ్నిశిరోరుహామ్. ౪౮
సవ్యముష్టిప్రహారేణ పరాజిత్య సుభైరవామ్
ప్రదోషకాలే ప్రవిశం

టీక॥ తతః=అటుపిమ్మట; జిఘాంసంతీం= చంపఁగోరినదియు; జ్వలదగ్నిశిరోరుహాం= మండుచున్ననిప్పువంటితలవెండ్రుకలు గలదియు; సుభైరవాం=మిక్కిలియుభయంకరయునగు; తాంతు=ఆరాక్షసిని ; సవ్యముష్టిప్రహారేణ= ఎడమచేతిపిడికిలిప్రేటుచేత; పరాజిత్య=జయించి; ప్రదోషకాలే=సాయంకాలమునందు; ప్రవిశం(ప్రావిశం)=ప్రవేశించినాను.

అంత, మండుచున్న యగ్నిహోత్రమువంటి తలవెండ్రుకలుగలదియు భయంకరాకారయునన్నుఁజంపంగోరివచ్చినదియునగు, నారాక్షసిని , ఎడమచేతిపిడికిలిప్రేటునం, జోక్కొంచి , సాయంకాలంబున , లంకాపురంబుఁబ్రవేశించినాను. అని, తాత్పర్యము,

భీతయాఽహం తయోదితః. ౪౯

టీక॥ అహం=నేను; భీతయా= భయంబునొందిన; తయా= ఆస్త్రీచేత; ఉదితః=చెప్పఁబడినాను.

ఆరాక్షసి, యంత, భయంబునొంది, నన్నుఁజూచి, యిట్లని, చెప్పినది.

అని, తాత్పర్యము.

అహం లంకాపురీ వీర నిర్జితా విక్రమేణ తే

యస్మా త్తస్మా ద్విజేతాసి సర్వరక్షాం స్యశేషతః. ౫౦

టీక॥వీర— పరాక్రమశాలివగుహనుమంతుఁడా!యస్మాత్= ఎందువలన; లంకాపురీ=లంకానగరినగు; అహం= నేను; తే=నీయొక్క; విక్రమేణ= పరాక్రమముచేత;నిర్జితా= జయింపఁబడినానో;తస్మాత్= అందువలన; అశేషతః=మిగతలేనట్లు;సర్వరక్షాంసి=సమస్తరాక్షసులను;విజేతాసి=జయింపఁగలవు.

పరాక్రమశాలివగు హనుమంతుఁడా! నేనులంకాపురిని;నీవు,నన్నుఁ బరాక్రమించునజయించినావుకావున , నింక లంకలో సమస్తరాక్షసులనుజయింపఁగలవు. అని, యారాక్షసి, నాతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తత్రాఽహం సర్వరాత్రంతు విచిన్వన్ జనకాత్మజామ్
రావణాంతఃపురగతో నచాఽపశ్యం సుమధ్యమామ్. ౫౧

టీక॥అహం=నేను;తత్ర = ఆలంకయందు;సర్వరాత్రంతు—రాత్రియంతయు;జనకాత్మజాం= జనకునికొమార్తెయగుసీతాదేవిని; విచిన్వన్=వెదకుచు;రావణాంతఃపురగతశ్చ=రావణునియంతఃపురమునొందినవాఁడనునై;సుమధ్యమాం=సుందరమయిననడుముగలసీతాదేవిని;నాపశ్యం=చూడనైతిని.

నేనా,రాత్రియంతయు,లంకయందు,సీతనువెదకినను, రావణునియంతఃపురంబునఁ జొచ్చియు,వెదకినను,సుందరమయిననడుముగలసీతాదేవి నాకగపడలేదు. అని,తాత్పర్యము.

తత స్సీతా మపశ్యం స్తు రావణస్య నివేశనే
శోకసాగర మాసాద్య న పార ముపలక్షయే. ౫౨

టీక॥తతః = అటుపిమ్మట; అహం (అధ్యాహృతము)= నేను;రావణస్య= రావణునియొక్క; నివేశనే=ఇంటియందు;సీతాం=సీతను; అపశ్యంస్తు=చూడనివాఁడనైయె;శోకసాగరం= దుఃఖసముద్రమును; ఆసాద్య=పొంది ; పా

రం=తుదను; నోపలక్షయే=చూడనై తిని.

అంత, నేను, రావణునింట, సీతంగానక, పారంబులేని, దుఃఖసముద్రంబున, మునింగితిని. అని, తాత్పర్యము.

శోచతాచ మయా దృష్టం ప్రాకారేణ సమావృతమ్
కాంచనేన వికృష్టేన గృహోపవన ముత్తమమ్. ౫౩

టీక॥ శోచతా=దుఃఖించుచున్న; మయా=నాచేత; కాంచనేన=బంగారువికారమును; వికృష్టేన=అతిదీర్ఘమయినదియునగు; ప్రాకారేణ=ప్రహరిచేత; సమావృతం=చుట్టఁబడినదియు; ఉత్తమం=శ్రేష్ఠమునగు; గృహోపవనంచ=ఇంటియుద్యానవనంబును; దృష్టం=చూడఁబడినది.

నేనట్లుదుఃఖించుచును, గాంచనమయంబునతిదీర్ఘంబునగు ప్రాకారమునం బరివేష్టింపఁబడిన యుత్తమంబగు గృహోద్యానవనంబుఁగాంచితిని. అని, తాత్పర్యము.

స ప్రాకార మవప్లుత్య పశ్యామి బహుపాదపమ్

టీక॥సః=అట్టి; అహం(అధ్యాహృతము)=నేను; ప్రాకారం=ప్రహరిని; అవప్లుత్య=దాఁటి; బహుపాదపం=పెక్కువృక్షములు గల యుద్యానవనమును; పశ్యామి=చూచితిని.

అంత, నేనాప్రాకారమును దాఁటి పెక్కువృక్షంబులుగల యాయుద్యానవనముం జూచితిని. అని, తాత్పర్యము,

అశోకవనికామధ్యే శింశుపాపాదపో మహాన్. ౫౪
త మారుహ్యచ పశ్యామి కాంచనం కదళీవనమ్

టీ॥అశోకవనికామధ్యే=అశోకవనమునడుమను; మహాన్=పెద్దదగు; శింశుపాపాదపః=శింశుపావృక్షము; అస్తి(అధ్యాహృతము)=ఉన్నది. తం=ఆశింశుపావృక్షమును; ఆరుహ్యచ=ఎక్కియు; కాంచనం=బంగారువికారమయిన; కదళీవనం=అఁటితోఁటను; పశ్యామి=చూచితిని.

ఆయశోకవనంబునఁదుమ, నొకర్ఱ చె ద్దశింశుపావృక్షంబున్నది; నేనుదానినారోహించి, కాంచనమయంబగునరఁటి చెట్లసమూహముంగంటిని.

అని, తాత్పర్యము.

అదూరే శింశుపావృక్షా త్పశ్యామి వరవర్ణినీమ్. ౨౨
శ్యామాం కమలపత్రాక్షీ ముపవాసకృశాననామ్
తదేకవాసస్సంవీతాం రజోధ్వస్త శిరోరుహామ్. ౨౬
శోకసంతాపదీనాంగీం సీతాం భర్తృహితే స్థితామ్
రాక్షసీభి ర్విరూపాభిః క్రూరాభి రభిసంవృతామ్ .౨౭
మాంసశోణితభక్షాభి ర్వ్యాఘ్రీభి ర్హరిణీమివ

టీక॥ అహం(అధ్యాహృతము)= నేను; శింశుపావృక్షాత్(శింశుపావృక్షస్య)=శింశుపావృక్షమునకు; అదూరే=సమీపమునందు;వరవర్ణినీం= ఉష్ణకాలమునసుఖశీతలమును శీతకాలమునసుఖోష్ణమునగు దేహముగలిగి, భర్తయందనురాగముగలయుత్తమస్త్రీయును;శ్యామాం=యౌవనమధ్యస్థయును; కమలపత్రాక్షీం= తామరపూతేకులవంటికన్నులుగలదియును ; ఉపవాసకృశాననాం=ఉపవాసములచేతఁగృశించినముఖము గలదియును ; తదేకవాససంవీతాం=అదేవస్త్రముచేతచుట్టఁబడినదియు; రజోధ్వస్తశిరోరుహాం=దుమ్ముచేఁజెడినతలవెండ్రుకలుగలదియు; శోకసంతాపదీనాంగీం= మనసునందలిదుఃఖముచేతను దేహమునందలిసంతాపముచేతనుదైన్యమునొందిన యవయవములుగలదియును;భర్తృహితే=పెనిమిటియొక్క మేలునందు;స్థితాం= ఉన్నదియును;విరూపాభిః= వికృతమయినరూపముగలవారలును;క్రూరాభిః=దయలేనివారలును; మాంసశోణితభక్షాభిః= మాంసమును నెత్తురు నెయాహారముగాఁగలవారలునగు; రాక్షసీభిః= రాక్షసస్త్రీలచేత;అభిసంవృతాం=చుట్టఁబడినదియును; వ్యాఘ్రీభిః=పెద్దపులులచేత;అభిసంవృతాం(అధ్యాహృతము) = చుట్టఁబడిన; హరిణీమివ(స్థితాం)= లేడివలెనున్నదియునగు; సీతాం=సీతను; పశ్యామి=చూచితిని.

అంత, నాశింశుపా వృక్షంబునకు సమీపంబున , నుష్ణ కాలంబున సుఖశీతలంబును శీతకాలంబున సు

ఖోష్ణంబు నగు దేహముఁగలిగి భర్తయం దధికానురాగము గల యుత్తమ వనితయు, యౌవన మధ్యస్థయు తామరపూఁ రేకులుంబోలెవిశాలసుందరంబులగు నేత్రంబులుగలదియు, నుపవాసంబులం గృశించిన ముఖముగలదియు, మున్ను రావణుం డెత్తుకొనిపోవునప్పుడు మనముచూచితి మే, అదేవస్త్రంబునుగట్టుకొనియున్నదియు, దుమ్ముచే నిండినతలవెంట్రుకలుగలదియు, దుఃఖసంతాపంబులం బరితపించుచున్నదియుఁ, బతిహితంబుఁగోరుచున్నదియు, వికృతాకారలును నిర్దయలును మాంసమును నెత్తురు భక్షించు వారలునగు రాక్షసస్త్రీలచేఁ, బెద్దపులులచే లేడివలెఁ, బరివేష్టింపఁబడియున్నదియునగు, సీతాదేవిం, జూచినాను.

అని, తాత్పర్యము.

సామయా రాక్షసీ మధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః. ౧౮
ఏకవేణీ ధరా దీనా భర్తృచింతా పరాయణా
భూమిశయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే. ౧౯
రావణా ద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా
కథం చిన్మృగశాబాక్షీ తూర్ణ మాసాదితా మయా. ౨౦

టీక॥మయా=నాచేత; సామయా=దుఃఖముతోఁగూడినదియు; రాక్షసీమధ్యే=రాక్షసస్త్రీలనడుమ; ముహుర్ముహుః=మాటిమాటికి; తర్జ్యమానా=బెదరింపఁబడుచున్నదియు; ఏకవేణీధరా=ఒక్కజెడను ధరించి నదియు; దీనా=దైన్యమునొందినదియు; భర్తృచింతాపరాయణా=పెనిమిటియొక్కచింతించుటయెముఖ్యమయినగతిగాఁగలదియు; భూమిశయ్యావివర్ణాంగీ=నేలయందుఁ బరుండుటచేఁ దెల్లఁబాఱిన దేహముగలదియు; హిమాగమే=హేమంతర్తువుయొక్క వచ్చుటయందు; పద్మినీవ(స్థితా)= కమలసమూహమువలెనున్నదియు; రావణాత్=రావణునియొద్దనుండి; వినివృత్తార్థా=మఱలిన చిత్తవృత్తి గలదియు; మర్తవ్యకృతనిశ్చయా=చావవలెనని చేయఁబడిననిశ్చయముగలదియు; మృగశాబాక్షీ = జింకపిల్లయొక్కకండ్లవంటికండ్లుగలదియునగుసీతాదేవి; కథంచిత్=అతిప్రయాసముచేత; తూర్ణం=శీఘ్రముగా; ఆసాదితా=పొందఁబడినది.

స ౫౮

రాక్షసస్త్రీలనడుమ, వారలచే బెదరింపఁబడుచు, నొకజడగాఁగట్టినతలవెండ్రుకలుగలిగి, దైన్యమునొంది, యెల్లప్పుడును భర్తను ధ్యానించుచు, నేలంబరుండుటచే వైవర్ణ్యంబు నొందినదేహంబుగలదికావున, హేమంతర్తువునందుఁ గమలసమూహముంబోలెఁ జూపట్టుచున్నదై, రావణుని యందుమనంబుఁ జేర్పక, యతనినిబంధమునం జేసి, ప్రాణంబులువిడువంగోరియున్న దానిఁ, జింకపిల్లకుంబోలెవిశాలసుందరచంచలనేత్రంబులుగలదాని, సీతాదేవిని, అతిప్రయాసంబునం, జూచితిని. అని, తాత్పర్యము.



తాంద్దృష్ట్వా తాదృశీం నారీం రామపత్నీం యశస్వినీమ్
తత్రైవ శింశుపావృక్షే పశ్య న్నహ మవస్థితః. ౬౧

టీక ॥ అహం=నేను; తాదృశం=అట్టి; నారీం=స్త్రీయును; యశస్వినీం=అధికమయినకీర్తిగలదియును; రామపత్నీం = రామునిభార్యయునగు; తాం=ఆసీతాదేవిని; దృష్ట్వా=చూచి; తత్రైవ=అచ్చటనే; శింశుపావృక్షే=శింశుపావృక్షమునందు; పశ్యన్=చూచుచు; అవస్థితః=ఉండినాను.

నేను, అట్టియుత్తమవనితయుఁబరమపతివ్రతయునగు రామభార్యను సీతాదేవింజూచి, యట్లె చూచుచు, నాశింశుపావృక్షంబుమీఁదనేయుంటిని.

అని, తాత్పర్యము.

తతో హాలహలాశబ్దం కాంచీనూపురమిశ్రితమ్
శృణో మ్యధికగంభీరం రావణస్య నివేశనే. ౮౨

టీక॥ తతః=అటుపిమ్మట; రావణస్య=రావణునియొక్క; నివేశనే=గృహమునందు; అధికగంభీరం= మిక్కిలియుగంభీరమును; నూపురమిశ్రితం = మొలనూళ్లతోనుఅందెలతోనుగలసినదియనగు; హాలహాలాశబ్దం=హాలహాలయనుధ్వనిని;శృణోమి=వింటిని.

అంత, రావణునిగృహంబుననుండి, మిక్కిలియు గంభీరంబగు, కాంచీనూపురంబులధ్వనులతోఁ గలసిన, హాలహలయనుశబ్దంబొకటి,వినవచ్చినది.

అని, తాత్పర్యము.

తతోహం పరమో ద్విగ్న స్స్వం రూపం ప్రతిసంహరన్
అహంతు శింశుపావృక్షే పక్షీవ గహనే స్థితః. ౮౩

టీక॥ తతః=అటుపిమ్మట; అహం=నేను; పరమోద్విగ్నః= మిక్కిలియుభయంబునొందినవాఁడనై; స్వం=నాదైన; రూపం=ఆకృతిని;ప్రతిసంహరన్= చిన్నదిచేసికొనుచు;స్థితః = (అధ్యాహృతము) ఉంటిని. అహంతు = నేనును;గహనే= తెలియఁగూడని;శింశుపావృక్షే= శింశుపావృక్షమునందు; పక్షీవ=పక్షివలె; స్థితః=ఉంటిని.

అంత, నేనుమిగులభయంబునొంది, నాదేహంబుమఱియుంజిన్నచేసికొని, యాకులచే నిండియుండిన శింశుపావృక్షంబునఁ బక్షివలె, నెవ్వరికిందెలియకుండునట్లు, ఉంటిని.

అని, తాత్పర్యము.

తతో రావణదారాశ్చ రావణశ్చ మహాబలః
తం దేశం సమనుప్రాప్తా యత్ర సీతాఽ భవత్ స్థితా. ౮౪

టీక॥ తతః= అటుపిమ్మట; రావణదారాశ్చ= రావణునిభార్యలును ; మహాబలః=అధికమయినబలముగల ; రావణశ్చ=రావణుండును; యత్ర=ఎచ్చట; సీతా=సీత; స్థితా=ఉన్నది; అభవత్=అయెనో; తం=ఆ; దేశం= ప్ర

దేశమును; సమనుప్రాప్తాః=పొందిరి.
అంత, రావణునిభార్యలును,మహా బలశాలియగురావణుండును, సీతాదేవియుండు, స్థలంబునకువచ్చిరి.
అని, తాత్పర్యము.

తం దృష్ట్వాథ వరారోహా సీతా రక్షోగణేశ్వరమ్
("తద్దృష్ట్వాథ వరారోహా సీతా రక్షో మహాబలం"ఇతిపాఠాంతరం.)
సంకుచ్యోరూ స్తనౌ పీనౌ బాహుభ్యాం పరిరభ్యచ. ౬౫

టీక॥ అథ=అటుపిమ్మట; వరారోహా = శ్రేష్ఠములగుపిఱుఁదులుగల; సీతా=సీతాదేవి; తం=ఆ ; రక్షోగణేశ్వరం= రాక్షససమూహనాయకుండగురావణుని ; ( పాఠాంతరపక్షమందు.) తత్=ఆ; మహాబలం= అధికమగుబలముగల; రక్షః = రావణుని; దృష్ట్వా=చూచి; ఊరూ=తొడలను; సంకుచ్య=ముణుచుకొని;పీనౌ=బలిసిన ; స్తనౌ= స్తనములను; బాహుభ్యాం = చేతులచేత; పరిరభ్యచ=కవుఁగిలించుకొనియు; ఆస (అధ్యాహృతము) = ఉండినది.

అంత,నుత్తమంబులగు పిఱుఁదులుగలయాసీతాదేవి,మహాబలుండగు నా రావణుంజూచి , తొడలుముణుచుకొని, పీనంబులగు స్తనంబులను జేతులతోఁ గట్టుకొని, నిశ్చలయయియుండినది.
అని, తాత్పర్యము.

విత్రస్తాం పరమోద్విగ్నాం వీక్షమాణాం తత స్తతః
త్రాణం కించి దపశ్యంతీం వేపమానాం తపస్వినీమ్. ౬౬
తా మువాచ దశగ్రీవ స్సీతాం పరమ దుఃఖితాం
అవాక్ఛిరాః ప్రపతితో బహుమన్యస్వ మా మితి. ౬౭

టీక॥దశగ్రీవః= రావణుండు; అవాక్ఛిరాః= వంగినతలగలవాఁడై;ప్రపతితః=పడినవాఁడై, నమస్కరించినవాఁడైయనుట;విత్రస్తాం= మిక్కిలియుభయముపడియున్నదియు ; పరమోద్విగ్నాం= మిక్కిలియు దిగులునొందినదియు;తత స్తతః= ఆయాదిక్కులను;వీక్షమాణాం = చూచుచున్నదియు; కిం

చిత్=కొంచెమయినను; త్రాణం=రక్షణమును; అపశ్యంతీం = చూడకున్నదియు; వేపమానాం = వడంకుచున్నదియు; తపస్వినీం=శోచనీయయును; పరమదుఃఖితాం= మిక్కిలియుదుఃఖమునొందినదియునగు; తాం=ఆ; సీతాం= సీతనుగూర్చి; "మాం=నన్ను; బహుమన్యస్వ=గౌరవింపుము." ఇతి = అని; ఉవాచ=చెప్పెను.

రావణుండు, మిక్కిలియుభయంబునుదిగులునొందినదై దిక్కులంజూచుచు నెచ్చటనురక్షకుంగానక, గడగడవడంకుచున్న దాని, శోచనీయయగు దానిం, బరమదుఃఖితయగు నాసీతాదేవింజూచి, తలవాంచి నమస్కరించి, "నన్ను గౌరవించిచూడుము," అని ప్రార్థించెను.

అని, తాత్పర్యము.

యది చేత్త్వం తు దర్పాన్మాం నాభినందసి గర్వితే
ద్వౌ మాసా వంతరం సీతే పాస్యామి రుధిరం తవ. ౬౮

టీక॥ గర్వితే = గర్వమునొందియున్నదానవగు; సీతే=సీతా! త్వంతు=నీవుమాత్రము; దర్పాత్ =గర్వమువలన; మాం=నన్ను; నాభినందసియదిచేత్ = గౌరవింపకుందువేని; ద్వౌ = రెండైన; మాసౌ=నెలలు; అంతరం=అవధి. తతః (అధ్యాహృతము) = అటుపిమ్మట; తవ=నీయొక్క; రుధిరం=నెత్తురును; పాస్యామి=త్రాగెదను.

గర్వమునొందియున్నట్టిసీతా! నీవుమాత్రము, గర్వంబున, నన్ను గౌరవింపకనెయుందువేని, యింక రెండుమాసములవధియున్నది; అటుపిమ్మట, నిన్నుం జంపి నీనెత్తురుం ద్రాగెదను. అని, రావణుండు సీతాదేవితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఏతచ్ఛ్రుత్వా వచస్తస్య రావణస్య దురాత్మనః
ఉవాచ పరమక్రుద్ధా సీతా వచన ముత్తమమ్. ౬౯

టీక॥ సీతా=సీతాదేవి; దురాత్మనః= దుష్టబుద్ధిగల; తస్య=ఆ; రావణస్య=రావణునియొక్క; ఏతత్ =ఈ; వచః= మాటను; శ్రుత్వా=విని; పరమక్రుద్ధా=మిక్కిలియుఁగోపంబునొందినదై; ఉత్తమం= శ్రేష్ఠంబగు; వచనం=

మాటను; ఉవాచ=చెప్పెను.

సీతాదేవి, దురాత్ముండగు రావణుని మాటనువిని పరమకోపంబు నొంది, యుత్తమంబగునీమాటనుచెప్పెను. అని, తాత్పర్యము.

రాక్షసాధమ రామస్య భార్యా మమిత తేజసః
ఇక్ష్వాకుకులనాథస్య స్నుషాం దశరథస్యచ. ౨౦
అవాచ్యం వదతో జిహ్వా కథం న పతితా తవ

టీక॥ రాక్షసాధమ=రాక్షసులలో నధముండవగు రావణుఁడా; అమిత తేజసః= కొలందిలేనిపరాక్రమముగల; రామస్య= రామునియొక్క; భార్యాం= భార్యను; ఇక్ష్వాకుకులనాథస్య=ఇక్ష్వాకువంశమునకు ప్రభుండగు; దశరథస్య=దశరథునియొక్క; స్నుషాం=కోడలనగు; మాం(అధ్యాహృతము)= నన్నుఁగూర్చి; అవాచ్యం = చెప్పఁదగని మాటను; వదతః=చెప్పునట్టి; తవ=నీయొక్క; జిహ్వా=నాలుక; కథం=ఎట్లు; నపతితా=పడలేదు?

రాక్షసాధముండవగు రావణుఁడా! అమితపరాక్రమశాలియగు రాముని భార్యను, ఇక్ష్వాకుకుల నాథుండగు దశరథునికోడలనగు నన్నుఁ జెప్పరానిమాట నాడితివే, నీనాలుక వీడి నేలంబడదేల; అని, తాత్పర్యము.

కించి ద్వీర్యం తవానార్య యోమాం భర్తు రసన్నిధౌ. ౨౧
అపహృత్యాగతః పాప తేనాదృష్టో మహాత్మనా

టీక॥ అనార్య=దుష్టుండవు; పాప=పాపముసేయుస్వభావముగలవాఁడవగు రావణుఁడా; యః (త్వం)= ఏనీవు; భర్తుః=పెనిమిటియొక్క; అసన్నిధౌ= సమీపంబునలేకుండుకాలంబునందు; మాం= నన్ను; అపహృత్య= అపహరించి; మహాత్మనః=అధికమయినపరాక్రమముగల; తేన=అతనిచేత; అదృష్టః=చూడఁబడనివాఁడవై; ఆగతః=వచ్చినావో; తస్య (అధ్యాహృతము)= అట్టి; తవ= నీయొక్క; వీర్యం = పరాక్రమము; కించిత్=స్వల్పము.

దుష్టుండవు పాపిష్ఠుండవగు రావణుఁడా! నీవునాభర్తయగు రాముండు

సమీపంబునలేనప్పుడు, నన్నపహరించి యతనికంట్లంబడకుండునట్లు, దొంగవై వచ్చినావు, కావున, నీపరాక్రమము మిక్కిలియు స్వల్పము.

అని, తాత్పర్యము.

న త్వం రామస్య సదృశో దాస్యేప్యస్య న యుజ్యసే. ౭౨
యజ్ఞీయ స్సత్యవాదీచ రణశ్లాఘీచ రాఘవః

టీక॥ త్వం=నీవు; రామస్య=రామునకు; సదృశః = సరియయినవాఁడవు; న=కావు; అస్య=ఈరామునియొక్క; దాస్యేపి = దాసత్వమునందును; న యుజ్యసే=యుక్తుండవుకావు. రాఘవః=రాముఁడు; యజ్ఞీయః=యాగములుసేయువాఁడు; సత్యవాదీచ= సత్యమునె చెప్పువాఁడును. రణశ్లాఘీచ = యుద్ధంబును గొనియాడు వాఁడును, యుద్ధప్రియుండుననుట.

నీవు, రామునకుసరికావు, అతనికి దాసుండగుటకైననునీకు యోగ్యత లేదు; రాముండు, పెక్కుయాగంబులు సేయువాఁడు; సత్యవాదియు; యుద్ధప్రియుండును. అని, సీతాదేవి, రావణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

జానక్యా పరుషం వాక్య మేవ ముక్తో దశాననః. ౭౩
జజ్వాల సహసా కోపా చ్చితాస్థ ఇవ పావకః

టీక॥దశాననః = రావణుండు; ఏవం=ఇట్లు; జానక్యా=సీతాదేవిచేత ; పరుషం=కఠినంబగు; వాక్యం= మాటను; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; సహసా=శీఘ్రంబున; కోపాత్= కోపమువలన; చితాస్థః=చితియందున్న; పావకఇవ=అగ్నిహోత్రుండువలె; జజ్వాల=మండెను,

ఇట్లు, సీతాదేవిచెప్పిన పరుషంబగు వచనంబునువిని, రావణుండు, తత్క్షణంబునఁ, జితియందలి యగ్నిహోత్రుని భంగిఁ, గోపంబునంబ్రజ్వరిల్లెను.

అని, తాత్పర్యము.

వివృత్య నయనే క్రూరే ముష్టి ముద్యమ్య దక్షిణమ్. ౭౪
మైథిలీం హంతు మారబ్ధ స్త్రీభి ర్హాహాకృతం తదా

టీక॥ సః (అధ్యాహృతము)-ఆరావణుండు; క్రూరే = భయంకరములగు; నయనే= నేత్రములను; వివృత్య=తెఱచి;దక్షిణం=కుడిదైన;ముష్టిం=పిడికిలిని; ఉద్యమ్య=ఎత్తి; మైథిలీం=సీతను;హంతుం=చంపుటకు; ఆరబ్ధః=ప్రయత్నించినాఁడు. తదా = అప్పుడు; స్త్రీభిః= స్త్రీలచేత; హాహాకృతం=హా!హా!అనిచేయఁబడినది.

అంత, నారావణుండు, భయంకరంబులగు నేత్రంబులం దెఱచి,దక్షిణహస్తంబునముష్టి,నలవరించి, సీతాదేవిం జంపఁబోయెను; దానింజూచి,యచ్చటి స్త్రీలు,హాహాకారంబులు గావించిరి. అని, తాత్పర్యము.

స్త్రీణాం మధ్యా త్సముత్పత్య తస్య భార్యా దురాత్మనః. ౭౫
వరా మండోదరీనామ తయా సంప్రతిషేధితః

టీక॥దురాత్మనః=దుష్టబుద్ధిగల;తస్య = ఆరావణునియొక్క;మండోదరీనామ=మండోదరియనెడు;వరా= ఉత్తమయగు;భార్యా=భార్య;ఆసీత్(అధ్యాహృతము)=ఉండినది.తయా= ఆమండోదరిచేత;స్త్రీణాం= స్త్రీలయొక్క;మధ్యాత్ =నడుమనుండి; సముత్పత్య=వెడలివచ్చి; సః= అరావణుఁడు! ప్రతినిషేధితః=నిషేధింపంబడినాఁడు.

దురాత్ముండగు నారావణునియుత్తమ భార్య, మండోదరియనుపేరుగలదియొక్క తెయందుండినది; అబిడ,స్త్రీలనడుమనుండివచ్చి,యతని,సీతంజంపవలదని నిషేధించినది. అని, తాత్పర్యము.

ఉక్త శ్చ మధురాం వాణీం తయా స మదనార్దితః. ౭౬

టీక॥మదనార్దితః=మన్మథునిచేఁబీడితుండగు;సః=ఆరావణుండు;తయా=ఆమండోదరిచేత;మధురాం = మనోహరమయిన; వాణీంచ=మాటను;ఉక్తః=చెప్పఁబడినాఁడు.

ఆమండోదరి, మన్మథపీడితుండగు నారావణునకు మధురంబగు నీమాటనుంగూడఁజెప్పినది.అని, తాత్పర్యము.

సీతయా తవ కిం కార్యం మహేంద్రసమవిక్రమ

టీక॥ మహేంద్రసమవిక్రమ = దేవేంద్రునిపరాక్రమంబుతో సమానమయిన పరాక్రమంబుగలరావణుఁడా! తవ = నీకు; సీతయా = సీతచే; కిం = ఏమి; కార్యం = ప్రయోజనము?

మహేంద్రునకుం బోలెఁ బరాక్రమంబుగలవాఁడవగు రావణుఁడా! నీకు సీతతో నేమిప్రయోజనము?

అని, తాత్పర్యము.

దేవగంధర్వకన్యాభి ర్యక్షకన్యాభి రేవచ. ౭౭
సార్ధం ప్రభో రమస్వేహ సీతయా కిం కరిష్యసి

టీక॥ ప్రభో = ప్రభుండవగు రావణుఁడా! దేవగంధర్వకన్యాభిః = దేవకన్యలతోను గంధర్వకన్యలతోను; యక్షకన్యాభి రేవచ సార్ధం = యక్షకన్యలతోనుంగూడ; ఇహ = ఇప్పుడు; రమస్వ = క్రీడింపుము. సీతయా = సీతచేత; కిం = ఏమి; కరిష్యసి = చేయఁగలవు?

ప్రభుండవగు రావణుఁడా! దేవకన్యలను గంధర్వకన్యలను యక్షకన్యలనుంగూడియథేష్టంబుగాఁ క్రీడింపుము; ఈసీతతో నీకేమికార్యమున్నది? అని, యామండోదరి, రావణునకుం జెప్పినది. అని, తాత్పర్యము-

తత స్తాభి స్సమేతాభి ర్నారీభి స్స మహాబలః. ౭౮
ప్రసాద్య సహసా తో నీ భవనం స్వం నిశాచరః

టీక॥ తతః = అటుపిమ్మట; మహాబలః = అధికమయినబలముగల; నిశాచరః = రాక్షసుండగు; సః = ఆరావణుండు; సహసా = శీఘ్రంబున; సమేతాభిః = కూడిన; తాభిః = ఆ; నారీభిః = స్త్రీలచేత; ప్రసాద్య = ఆశ్వాసించి; స్వం = తనదైన; భవనం = గృహమును; నీతః = పొందింపఁబడినాఁడు-

అంత, నాస్త్రీలందఱుఁజేరి, శీఘ్రంబున, మహాబలుండగు నా రావణునిఁ బ్రసన్నుంగావించి, గృహంబునకుఁ దీసికొనిపోయిరి.

అని, తాత్పర్యము-

యాతే తస్మిన్ దశగ్రీవే రాక్షస్యో వికృతాననాః. ౭౯
సీతాం నిర్భర్త్సయామాసు ర్వాక్యైః క్రూరైస్సుదారుణైః

టీక॥తస్మిన్=ఆ;దశగ్రీవే= రావణుఁడు;యాతే = పోఁగా;వికృతాననాః=వికృతములగుముఖములుగల; రాక్షస్యః=రాక్షసస్త్రీలు;క్రూరైః= కఠినములును;సుదారుణైః= మిక్కిలియు భయంకరములునగు;వాక్యైః=మాటలచేత;సీతాం=సీతను; నిర్భర్త్సయామాసుః=బెదరించిరి.

ఆరావణుండుపోయినపిమ్మట, వికృతంబులగుముఖములుగలరాక్షసస్త్రీలు,పరుషంబులునుభయంకరములునగుమాటలచే,సీతాదేవిని, బెదరించిరి. అని, తాత్పర్యము.

తృణవద్భాషితం తాసాం గణయామాస జానకీ. ౮౦
గర్జితంచ తదా తాసాం సీతాం ప్రాప్య నిరర్థకమ్

టీక॥జానకీ=సీత; తాసాం=ఆరాక్షసస్త్రీలయొక్క;భాషితం = మాటనుతృణవత్=తృణమునువలె; గణయామాస=లెక్కించెను. తదా=అప్పుడు; తాసాం=ఆరాక్షసస్త్రీలయొక్క; గర్జితంచ=అఱపును;సీతాం= సీతను; ప్రాప్య=పొంది; నిరర్థకం (అర్థాపహృతము) = ప్రయోజనంబులేనిదీ;అభూత్(అర్థాపహృతము)= అయినది.

సీతాదేవి,యారాక్షసస్త్రీలమాటలందృణీకరించెను:ఆరాక్షసస్త్రీలెంతగర్జించినను,ఆమాటలన్నియు, సీతావిషయమయి, నిష్ప్రయోజనంబులయినవి.అని, తాత్పర్యము.

వృథాగర్జితనిశ్చేష్టా రాక్షస్యః పిశితాశనాః. ౮౧
రావణాయ శశంసుస్తా స్సీతాధ్యవసితం మహత్

టీక॥ పిశితాశనాః = మాంసమె యాహారముగాఁగల;తాః=ఆ; రాక్షస్యః=రాక్షసస్త్రీలు ; వృథాగర్జితనిశ్చేష్టాః=వ్యర్థములయినయఱపులుగలవారలుకావుననూరకున్నవారలై; మహత్=గొప్పదగు;సీతాధ్యవసితం=సీ

తాదేవిప్రయత్నమును; రావణాయ = రావణునికొఱకు; శశంసుః = చెప్పిరి.

మాంసమేయాహారముగాఁగలయా రాక్షసస్త్రీలు తమగర్జనలు వ్యర్థములగుటంబట్టి నిశ్చేష్టులయి, రావణుని యొద్దకుఁబోయి, సీతాదేవియభిప్రాయమంతయుఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

తత స్తా స్సహితా స్సర్వా విహతాశా నిరుద్యమాః. ౮౨
పరిక్షిప్య సమంతా త్తాం నిద్రావశ ముపాగతాః

టీక॥ తతః = అటుపిమ్మట; తాః = ఆ రాక్షసస్త్రీలు; సర్వాః = అందఱును; విహతాశాః = కొట్టఁబడినయాశగలవారలై; నిరుద్యమాః = ప్రయత్నములేనివారలై; సహితాః = కూడినవారలై; తాం = ఆసీతను; సమంతాత్ = అంతటను; పరిక్షిప్య = చుట్టుకొని; నిద్రావశం = నిద్రయొక్కలోఁకువను; ఉపాగతాః = పొందినారు.

అంత, నారాక్షసస్త్రీలందఱును, నిరాశలై, సీతాదేవినివశీకరించుప్రయత్నంబునువిడిచి, సీతాదేవిం జుట్టుకొనియుండి, కొంతసేపునకు, నిద్రాధీనలయిరి. అని, తాత్పర్యము.

తాసు చైవ ప్రసుప్తాసు సీతా భర్తృహితే రతా. ౮౩
విలప్య కరుణం దీనా ప్రశుశోచ సుదుఃఖితా

టీక॥ తాసు = ఆరాక్షసస్త్రీలు; ప్రసుప్తాసుచైవ = నిద్రపోయినంతనె; భర్తృహితే = పెనిమిటిమేలునందు; రతా = ఆసక్తురాలగు; సీతా = సీతాదేవి; దీనా = దైన్యమునొందినదై; కరుణం = దుఃఖముగల్గునట్లు; విలప్య = విలపించి; సుదుఃఖితా = మిక్కిలియు దుఃఖమునొందినదై; ప్రశుశోచ = మిక్కిలియు దుఃఖించినది.

ఆరాక్షసస్త్రీలు నిద్రపోయినపిమ్మట, మహాపతివ్రతయగుసీతాదేవి, పరమదుఃఖంబునొంది, దీనయయి, విలపించుచు, దుఃఖించుచుండినది.

అని, తాత్పర్యము.

తాసాం మధ్యా త్సముత్థాయ త్రిజటా వాక్య మబ్రవీత్. ౮౪

టీక॥ త్రిజటా= త్రిజట యనునది; తాసాం = ఆరాక్షస స్త్రీలయొక్క; మధ్యాత్ = నడుమనుండి; సముత్థాయ=లేచి; వాక్యం = మాటను; అబ్రవీత్ = చెప్పినది.

అందుఁ, త్రిజటయను రాక్షసి యొక్క తే, ఆరాక్షస స్త్రీలనడుమనుండిని ద్రపోయిలేచి, యీమాటం జెప్పినది.

అని, తాత్పర్యము.

ఆత్మానం ఖాదత క్షిప్రం న సీతా వినశిష్యతి
జనకస్యాత్మజా సాధ్వీ స్నుషా దశరథస్య చ. ౮౫

టీక॥ ఆత్మానం=నన్ను; క్షిప్రం = శీఘ్రముగా; ఖాదత= భక్షింపుఁడు. జనకస్య=జనకమహారాజుయొక్క; ఆత్మజా=కొమార్తెయును; సాధ్వీ = పతివ్రతయును; దశరథస్య= దశరథునియొక్క; స్నుషాచ=కోడలునగు; సీతా= సీతాదేవి; నవినశిష్యతి= నాశమునొందదు.

సీతనుభక్షింపవలదు; శీఘ్రముగా నన్నుభక్షింపుఁడు; జనకమహారాజుకొమార్తెయు దశరథునికోడలునుబరమ పతివ్రతయునగుసీతాదేవి , యెంతమాత్రమునాశమునొందదు.

అని, తాత్పర్యము.

స్వప్నో హ్యద్య మయా దృష్టో దారుణో రోమహర్షణః
రక్షసాం చ వినాశాయ భర్తు రస్యా జయాయచ. ౮౬

టీక॥ అద్య=ఇప్పుడు; మయా= నాచేత; రక్షసాం= రాక్షసులయొక్క; వినాశాయచ = నాశముకొఱకును; అస్యాః=ఈబిడయొక్క; భర్తుః= పెనిమిటియొక్క; జయాయచ=జయముకొఱకును; దారుణః = భయంకరమును; రోమహర్షణః= వెంద్రుకలను గగుర్పాటునొందించునదియునగు; స్వప్నః=కల; దృష్టోహి = చూడఁబడినది గదా!

ఇప్పుడు, రాక్షసవినాశంబును, శ్రీరామజయంబునుసూచించునట్టి, మహాభయంకరంబగు స్వప్నంబొకటి నాఁకుఁగలిగినది. అని, తాత్పర్యము.




అల మస్మా త్పరిత్రాతుం రాఘవా ద్రాక్షసీగణమ్
అభియాచామ వైదేహీ మేత ద్ధి మమ రోచతే. ౮౭

టీక॥ ఏషా(అభ్యాఖ్యాతము)=ఈ సీత; అస్మాత్=ఈ; రాఘవాత్=రాముని వలన; రాక్షసీగణం=రాక్షస స్త్రీల సమూహమును; పరిత్రాతుం=రక్షించుటకు; అలం=సమర్థురాలు. వైదేహీం = సీతాదేవిని; అభియాచామ=ప్రార్థింతము. ఏతత్=ఇది; మమ=నాకు; రోచతేహి= రుచించుచున్నది గదా!

రామునివలనంజావకుండ, మనలనందఱంగాపాడుటకు, ఈసీతాదేవియె కర్తవ్యచాలును; కావున, మనమీసీతాదేవింబ్రార్థింతము; ఇదియే యిప్పటికిం జేయందగుకార్యమనినాకుందోఁచుచున్నది.

అని, తాత్పర్యము.

యస్యా హ్యేవంవిధ స్స్వప్నో దుఃఖితాయాః ప్రదృశ్యతే
సా దుఃఖై ర్వివిధై ర్ముక్తా సుఖ మాప్నో త్య నుత్తమమ్. ౮౮

టీక॥ యస్యాః=ఎవ్వతెయే; దుఃఖితాయాః=దుఃఖంబునొందియుండఁగా; ఏవంవిధః=ఇట్టి; స్వప్నః=స్వప్నము; ప్రదృశ్యతే=చూడఁబడునో; సా=ఆబిడ; వివిధైః=నానావిధములగు; దుఃఖైః=దుఃఖములచేత; ముక్తా= విడువఁబడినదై; అనుత్తమం = తనకన్న శ్రేష్ఠములేని; సుఖం = సౌఖ్యమును; ఆప్నోతిహి=పొందఁగలదు.

ఎవ్వతేని, దుఃఖమునొంది యుండఁగా, నిట్టిస్వప్నంబుగలుగునేని, యాబిడ, దుఃఖంబులన్నియుఁబాసి, యుత్తమంబగు, సుఖంబునొందును.

అని, తాత్పర్యము.

ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా

టీక॥ జనకాత్మజా = జనకునికొమార్తెయగు; మైథిలీ=సీతాదేవి; ప్రణిపాతప్రసన్నాహి= నమస్కారముచేఁ బ్రసాదంబు నొందునదిగదా!

జనకమహారాజు కొమార్తెయగుసీతాదేవి, మనమెన్ని యపరాధంబు




లుగావించినను , నమస్కారముచేసి ప్రార్థించుతుమేని,మనయెడలం బ్రసన్నయగును.అని,త్రిజట, రాక్షసస్త్రీలకుం జెప్పినది. అని, తాత్పర్యము.

తత స్సా హ్రీమతీ బాలా భర్తు ర్విజయహర్షితా. ౮౯
అవోచ ద్యది త త్తథ్యం భవేయం శరణం హి వః

టీక॥ తతః=అటుపిమ్మట; సా=ఆ; బాలా=చిన్నదగుసీతాదేవి;భర్తుః=పెనిమిటియొక్క; విజయహర్షితా=జయవార్తచే సంతోషమునొందినదై; హ్రీమతీ=సిగ్గునొందినదై; తత్= ఆ త్రిజటమాట; తథ్యంయది = నిజమగునేని; వః=మీకు; శరణం= రక్షకురాలను; భవేయంహి= అగుదునుగదా!" ఇతి (అధ్యాహృతము) = అని;అవోచత్=చెప్పెను.

అంత,బాలయగుసీతాదేవి, తనభర్తకుజయంబుగల్గునని యెడు మాటను వినిసంతోషంబునుసిగ్గునుంబొంది, యా రాక్షసస్త్రీలంజూచి, "త్రిజటచెప్పినది సత్యమగునేని, నేనుమిమ్ములరక్షించెదను" అని.చెప్పెను. అని, తాత్పర్యము.

తాంచాహం తాదృశీం దృష్ట్వా సీతాయా దారుణాందశాం.౯౦
చింతయామాస విక్రాంతో నచ మే నిర్వృతం మనః

టీక॥ అహంచ= నేనును; సీతాయాః= సీతయొక్క; తాదృశీం= అట్టి;దారుణాం = భయంకరమయిన; తాం=ఆ;దశాం=అవస్థను; దృష్ట్వా= చూచి;విక్రాంతః = దుఃఖముచేనాక్రమింపఁబడినవాఁడనై;చింతయామాస= చింతించితిని. మే = నాయొక్క ; మనః = మనస్సు; నచనిర్వృతం=సుఖంబునొందనేలేదు.

నేను, సీతాదేవికింగల్గిన యనిర్వాచ్యంబగు, నాదుర్దశంజూచి, దుఃఖాక్రాంతుండనై, చింతనొందితిని; నామనసునకుసెంతమాత్రము, సుఖంబుగలుగలేదు. అని,తాత్పర్యము.

సంభాషణార్థంచ మయా జానక్యా శ్చింతితో విధిః. ౯౧

ఇక్ష్వాకూణాం హి వంశస్తు తతో మమ పురస్కృతః

టీక॥మయా=నాచేత; జానక్యాః=సీతయొక్క; సంభాషణార్థం చ=మాటలాడుటకును; విధిః = ఉపాయము; చింతితః=ఆలోచింపఁబడినది. తతః=అందువలన; మమ (మయా) = నాచేత; ఇక్ష్వాకూణాం = ఇక్ష్వాకువంశపురాజులయొక్క; వంశస్తు=వంశమే; పురస్కృతః=ముందిడుకొనఁబడినది.

నేను సీతతో సంభాషించుటకు, నొక యుపాయంబు నాలోచించితిని; అట్లు మొదట, నిక్ష్వాకువంశంబు నభివర్ణించి చెప్పితిని. అని, తాత్పర్యము.

శ్రుత్వాతు గదితాం వాచం రాజర్షిగణపూజితామ్. ౯౨
ప్రత్యభాషత మాం దేవీ బాష్పైః పిహితలోచనా

టీక॥దేవీ = సీతాదేవి; మయా (అధ్యాహృతము) = నాచేత; గదితాం=చెప్పఁబడినదియు; రాజర్షిగణపూజితాం= రాజర్షులసమూహముచేఁబూజింపఁబడినదియునగు; వాచం=మాటను; శ్రుత్వాతు=విన్నంతనే; బాష్పైః=కన్నీళ్లచేత; పిహితలోచనా=కప్పఁబడినకన్నులుగలదై; మాం=నన్నుంగూర్చి; ప్రత్యభాషత = బదులుచెప్పెను.

సీతాదేవి, నేను జెప్పిన యుత్తమంబగుమాటనువిని, కన్నీళ్లుగారు, నన్నుఁజూచి, యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

కస్త్వం కేన కథం చేహ ప్రాప్తో వానరపుంగవ. ౯౩
కా చ రామేణ తే ప్రీతి స్తన్మే శంసితు మర్హసి

టీక॥వానరపుంగవ = వానరశ్రేష్ఠుండవగుహనుమంతుఁడా! త్వం=నీవు; కః=ఎవ్వఁడవు? కేన=దేనిచేత; కథం చ=ఎట్లును; ఇహ=ఇచ్చటికి; ప్రాప్తః=వచ్చినాఁడవు? రామేణచ=రామునితోను; తే=నీకు; కా=ఏమి; ప్రీతిః=స్నేహము? తత్=దానిని; మే=నాకొఱకు; శంసితుం=చెప్పుటకు; అర్హసి=తగుదువు.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవెవ్వఁడవు? ఎందుచేత నిచ్చటికి వచ్చినావు? సముద్రం బెట్లు దరించితివి? నీ

కు రామునితో స్నేహం బెట్లు కలిగినదికి దీనినంతయు నాకు సవిస్తరముగాఁ జె ప్పుము. అని, సీతాదేవి, నాతోఁజెప్పినది. అని, తాత్పర్యము.

తస్యా స్తద్వచనం శ్రుత్వా హ్యహమ ప్యబ్రువం వచః. ౯౪

టీక॥ అహమపి= నేనను; తస్యాః= ఆసీతాదేవియొక్క; తత్ = ఆ; వచః= మాటను; శ్రుత్వా= విని; వచః= మాటను; అబ్రువంహి= చెప్పితినిగదా!

సీతాదేవి, చెప్పినమాటనువిని, నేనును, ఈమాటం జెప్పితిని. అని, తాత్పర్యము.

దేవి రామస్య భర్తుస్తే సహాయో భీమవిక్రమః
సుగ్రీవో నామ విక్రాంతో వానరేంద్రో మహాబలః. ౯౫

టీక॥ దేవి= సీతాదేవి! తే = నీయొక్క; భర్తుః= పెనిమిటియగు; రామస్య= రామునకు; సహాయః= సహాయుడును; భీమవిక్రమః - భయంకరమగు పరాక్రమముగలవాఁడును; విక్రాంతః= పరాక్రమించియుండువాఁడును; మహాబలః= అధికమయినబలముగలవాఁడునగు; సుగ్రీవో నామ= సుగ్రీవుండనెడు; వానరేంద్రః= వానరరాజు; అస్తి (అధ్యాహృతము)= కలఁడు.

సీతాదేవీ! నీ పెనిమిటియగు రామునకు స్నేహితుండును, భయంకరంబగు పరాక్రమంబుగలవాఁడును మహాబలుండునగు, సుగ్రీవుండను వానరరాజొకండు, కలఁడు. అని, తాత్పర్యము.

తస్య మాం విద్ధి భృత్యం త్వం హనుమంత మిహాగతమ్

టీక॥ ఇహ= ఇచ్చటికి; ఆగతం= వచ్చిన; మాం= నన్ను; తస్య= ఆసుగ్రీవునియొక్క; భృత్యం= భృత్యునిగాను; హనూమంతం= హనుమంతుఁడనుపేరుగలవానిగాను; త్వం= నీవు; విద్ధి= ఎఱుంగుము.

నేను ఆసుగ్రీవునిభృత్యుండననియు, హనుమంతుండను పేరుగలవాఁడననియు, నెఱుంగుము- అని, తాత్పర్యము.

భర్త్రాహం ప్రేషిత స్తుభ్యం రామేణాక్లిష్టకర్మణా. ౯౬

టీక॥ అహం=నేను; అక్లిష్టకర్మణా=దుఃఖములేనికార్యములుగల; భర్త్రా=పెనిమిటియగు; రామేణ=రామునిచేత; తుభ్యం=నీకొఱకు; ప్రేషితః=పంపఁబడినాను.

అక్లిష్టకర్ముఁడగు నీపెనిమిటి రాముండు, నన్ను నీకొఱ కిచ్చుటకిఁ బంపినాఁడు. అని, తాత్పర్యము.

ఇదంచ పురుషవ్యాఘ్ర శ్శ్రీమాన్ దాశరథే స్స్వయమ్
అంగుళీయ మభిజ్ఞాన మదా త్తుభ్యం యశస్విని. ౯౭

టీక॥యశస్విని = అధికమయినకీర్తిఁగలదానవగుసీతాదేవీ! పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుండును; శ్రీమాన్=అందఱికన్ననధికుండునగు; దాశరథిః=దశరథుని కొడుకైనరాముండు ; స్వయం=తానే;ఇదం=ఈ; అంగుళీయంచ=ముద్దుటుంగరమును;అభిజ్ఞానం=గుఱుతుగా; తుభ్యం = నీకొఱకు; అదాత్=ఇచ్చినాఁడు.

అధికమగు కీర్తిఁవహించినదానవగుసీతాదేవీ! పురుషశ్రేష్ఠుండును శ్రీమంతుఁడునగురాముండు, తానైయె, నీకు గుఱుతునకై, యీయంగుళీయకంబు నిచ్చినాఁడు.అని, తాత్పర్యము.

తదిచ్ఛామి త్వయాజ్ఞప్తం దేవి కిం కరవాణ్యహమ్
రామలక్ష్మణయోః పార్శ్వం నయామి త్వాం కిముత్తరమ్. ౯౮

టీక॥దేవి=సీతాదేవీ!తత్= అందువలన; అహం=నేను; త్వయా= నీచేత; ఆజ్ఞప్తం=ఆజ్ఞాపింపఁబడుటను; ఇచ్ఛామి=కోరుచున్నాను. కిం=ఏమి;కరవాణి=చేయుదును? త్వాం=నిన్ను; రామలక్ష్మణయోః= రామలక్ష్మణులయొక్క; పార్శ్వం=ప్రక్కను ; నయామి=పొందించెదను. ఉత్తరం = బదులు;కిం=ఏమి?

సీతాదేవీ!అందువలన, నీయాజ్ఞఁ గోరెదను;నేనేమిసేయవలయు? నిన్ను రామలక్ష్మణులయొద్దకుంగొనిపోయెదను;దీనికేమిచెప్పెదవు? అని, నేను, సీతాదేవితోఁజెప్పితిని. అని, తాత్పర్యము.

ఏతచ్ఛ్రుత్వా విదిత్వాచ సీతా జనకనందినీ
ఆహ రావణ ముత్సాద్య రాఘవో మాం నయత్వితి. ౯౯

టీక॥ జనకనందినీ=జనకమహారాజునుసంతసింపఁజేయునట్టి; సీతా=సీతాదేవి; ఏతత్=ఈమాటను; శ్రుత్వా=విని; విదిత్వాచ=తెలిసికొనియు; "రాఘవః=రాముండు; రావణం= రావణుని; ఉత్సాద్య=చంపి; మాం= నన్ను; నయతు=కొనిపోవుఁగాక"; ఇతి=అని; ఆహ=చెప్పినది.

జనకమహారాజుకొమార్తెయగు, సీతాదేవి, నామాటనువిని, యాలోచించి "రాముండే రావణుంజంపి, నన్నుఁగొనిపోవవలయును" అనిచెప్పినది.

అని, తాత్పర్యము.

ప్రణమ్య శిరసా దేవీ మహ మార్యా మనిందితామ్
రాఘవస్య మనోహ్లాద మభిజ్ఞాన మయాచిషమ్. ౧౦౦

టీక॥ అహం= నేను; ఆర్యాం=పూజ్యురాలును; అనిందితాం=నిందింపఁబడనట్టిదియునగు; దేవీం=సీతాదేవిని; శిరసా=శిరసుచే; ప్రణమ్య= నమస్కరించి=రామస్య=రామునియొక్క=మనోహ్లాదం= మనసును సంతోషపఱచునట్టి; అభిజ్ఞానం= గుఱుతును; అయాచిషం= అడిగితిని.

అంత, నేను, బూజ్యురాలును అనిందితయునగు నాసీతాదేవికి సాష్టాంగ నమస్కారముగావించి, రామునిమనంబునకు సంతోషంబు గలిగించునట్టి, గుఱుతొకటియిమ్మని, ప్రార్థించితిని.

అని, తాత్పర్యము.

అథ మా మబ్రవీ త్సీతా గృహ్యతా మయ ముత్తమః
మణి ర్యేన మహాబాహూ రామ స్త్వాం బహు మన్యతే. ౧౦౧

టీక॥ అథ = అటుపిమ్మట; సీతా= సీతాదేవి ; మాం = నన్నుఁగూర్చి; యేన = ఏరత్నము చేత; మహాబాహుః = గొప్పచేతులుగల; రామః= రాముఁడు; త్వాం= నిన్ను; బహుమన్యతే=గౌరవించునో; అయం=ఈ; ఉ

,త్తమః= శ్రేష్ఠంబగు; మణిః=రత్నము; గృహ్యతాం= తీసికొనఁబడుఁగాక;" ఇతి (అధ్యాహృతము)= అని; అబ్రవీత్= చెప్పినది;

అంత, సీతాదేవి, "నీవీమణిం దీసికొనుము, దీనింజూచి మహాబాహుండగు రాముండు,నిన్ను బహుమానించును," అని,నాతోఁజెప్పినది.

అని,తాత్పర్యము.

ఇత్యుక్త్వాతు వరారోహా మణిప్రవర మద్భుతమ్
ప్రాయచ్ఛ త్పరమోద్విగ్నా వాచా మాం సందిదేశ హ. ౧౦౨

టీక॥ పరమోద్విగ్నా = మిక్కిలియుదుఃఖమునొందిన;వరారోహా=శ్రేష్ఠములగుపిఱుఁదులుగలసీతాదేవి;ఇతి= ఇట్లు; ఉక్త్వాతు = చెప్పినంతనే; అద్భుతం= ఆశ్చర్యకరంబగు; మణిప్రవరం= మణిశ్రేష్ఠమును; ప్రాయచ్ఛత్= ఇచ్చెను. వాచా=మాటచేత; మాం= నన్నుఁగూర్చి;సందిదేశ=సమాచారము చెప్పెను. ("హ" అనునది పాదపూరణార్థము.)

పరమదుఃఖితయును త్తమంబులగుపిఱుఁదులుగలదియునగు సీతాదేవి, ఆయాశ్చర్యకరంబగు కాంతిగల,మణిశ్రేష్ఠంబునొసంగి,మఱియుంగొన్నివృత్తాంతరూపఁబులగుఉత్తులం జెప్పినది.

అని, తాత్పర్యము.

తత స్తస్యై ప్రణమ్యాహం రాజపుత్ర్యై సమాహితః
ప్రదక్షిణం పరిక్రామ మిహా భ్యుద్గతమానసః. ౧౦౩

టీక॥తతః=అటుపిమ్మట; అహం= నేను; సమాహితః=ఎచ్చరికగలవాఁడనై; ఇహ=ఇచ్చటికి; అభ్యుద్గతమానసః=వచ్చుటయందు మనసు గలవాఁడనై;తస్యై=ఆ; రాజపుత్ర్యై=రాచకొమార్తెయగుసీతాదేవికొఱకు; ప్రణమ్య=నమస్కరించి;ప్రదక్షిణం= ప్రదక్షిణముగా;పరిక్రామం(పర్యక్రామం)= చుట్టితిని.

అంత, నేను,ఎచ్చరికవొంది, యిచ్చటికిశీఘ్రముగా రావలయునని తలంచి, రాచకొమార్తెయగు నాసీతాదేవికి, నమస్కరించి,ప్రదక్షిణంబుచేసితిని.

అని, తాత్పర్యము.

ఉక్తో౽హం పునరేవేదం నిశ్చిత్య మనసా తయా

టీక॥ తయా=ఆసీతాదేవిచేత; పునరేవ=మఱలనే; మనసా=మనసుచే; నిశ్చిత్య=నిశ్చయించి; అహం= నేను; ఇదం=ఈమాటను; ఉక్తః=చెప్పఁబడినాను.

మఱలనాసీతాదేవి, మనంబుననాలోచించినన్నుంజూచి, యిట్లని, చెప్పినది. అని, తాత్పర్యము.

హనుమన్మమ వృత్తాంతం వక్తుమర్హసి రాఘవే. ౧౦౪

టీక॥ హనుమన్=హనుమంతుఁడా! రాఘవే=రామునియందు; మమ=నాయొక్క; వృత్తాంతం= సమాచారమును; వక్తుం=చెప్పుటకు; అర్హసి=తగుదువు.

హనుమంతుఁడా! నీవు, నాకష్టానిష్టములనన్నియు, రామునకుం జెప్పవలయు. అని, తాత్పర్యము.

యథా శ్రుత్వైవ నచిరాత్తావుభౌ రామలక్ష్మణౌ
సుగ్రీవసహితౌ వీరా వుపేయాతాం తథా కురు. ౧౦౫

టీక॥ యథా= ఎట్లు; శ్రుత్వైవ= విన్నంతనె; నచిరాత్=శీఘ్రంబున; వీరౌ=పరాక్రమశాలులగు; తౌ=ఆ; రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు; ఉభౌ= ఇద్దఱును; సుగ్రీవసహితౌ= సుగ్రీవునితోఁగూడినవారలై; ఉపేయాతాం=వత్తురో; తథా=అట్లు; కురు=చేయుము.

నావృత్తాంతమును విన్నంతనె, పరాక్రమవంతులగు నా రామలక్ష్మణులిద్దఱును సుగ్రీవుండును, శీఘ్రంబుననిచ్చటికి వచ్చునట్లు, నీవు సేయవలయును.

అని, తాత్పర్యము.

యద్యన్యథా భవేదేతద్ద్వౌ మాసౌ జీవితం మమ
న మాం ద్రక్ష్యతి కాకుత్స్థో మ్రియే సా౽హ మనాథవత్. ౧౦౬

టీక॥ ఏతత్=ఇది; అన్యథా= వేఱువిధముగా; భవేద్యది = అగునేని;

మమ= నాయొక్క; జీవితం = జీవితకాలము ; ద్వౌ = రెండైన ; మాసౌ= నెలలు; కాకుత్థ్స్= రాముండు; మాం=నన్ను;నద్రక్ష్యతి= చూడఁడు. సా=అట్టి; అహం = నేను; అనాథవత్ = నాథుండులేనిదివలె; మ్రియే= మరణంబు నొందుదును.

అట్లు, వారలు రాకుండురేని, ఇంక రెండుమాసములె నేను బ్రతికియుందుదును; అటుపిమ్మట సనాథవలె మరణంబు నొందెదను; అంత రాముండువచ్చియుఁ గార్యములేదు. అని, సీతాదేవి,నాతోఁజెప్పినది.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా కరుణం వాక్యం క్రోధో మా మభ్యవర్తత

టీక॥తత్ = ఆ;కరుణం=దుఃఖముగలిగించునట్టి; వాక్యం=మాటను; శ్రుత్వా=విని;క్రోధః=కోపము; మాం=నన్ను;అభ్యవర్తత=పొందినది.

దుఃఖకరంబగునామాటనువిన్నంతనె,నాకుఁగోపంబువచ్చినది.

అని, తాత్పర్యము.

ఉత్తరంచ మయా దృష్టం కార్యశేష మనంతరమ్. ౧౦౭

టీక॥ఉత్తరంచ=అటుపిమ్మటను;మయా=నాచేత; అనంతరం=అటుపిమ్మటఁజేయవలసిన;కార్యశేషం=మిగతపని;దృష్టం=చూడఁబడినది.

అంత, నేను,ఆపైఁజేయవలసిన కార్యంబు,నాలోచించి,నిశ్చయించితిని.

అని, తాత్పర్యము.

తతో వర్ధత మే కాయ స్తదా పర్వతసన్నిభః

టీక॥తతః=అటుపిమ్మట;తదా = అప్పుడు; మే=నాయొక్క;కాయః = దేహము;పర్వతసన్నిభః = పర్వతముతోసమానముగా; అవర్ధత= పెరిఁగినది.

అంత,నేనప్పుడు, నాదేహమును పర్వతాకారంబుగాఁ, బెంచితిని.

అని,తాత్పర్యము.

యుద్ధకాంక్షీ వనం తచ్చ వినాశయితు మారభే. ౧౦౮

టీక॥అహం (అధ్యాహృతము) = నేను; యుద్ధకాంక్షీ—యుద్ధమునుగోఁరువాఁడనై; తత్=ఆ; వనంచ—అశోకవనంబును; వినాశయితుం= నశింపఁజేయుటకు; ఆరభే= ప్రయత్నించితిని.

నేను, యుద్ధంబుసేయఁగోరి, రావణునకుఁగోపంబుఁగలిగించుటకై, యశోకవనంబునంతయు నాశమునొందించితిని. అని, తాత్పర్యము.

తద్భగ్నం వనషండంతు భ్రాంతత్రస్తమృగద్విజమ్
ప్రతిబుద్ధా నిరీక్షంతే రాక్షస్యో వికృతాననాః. ౧౯

టీక॥వికృతాననాః= వికృతములగు ముఖములుగల; రాక్షస్యః = రాక్షసస్త్రీలు; ప్రతిబుద్ధాః= మేలుకొన్నవారలై; భగ్నం — విఱువఁబడినదియు; భ్రాంతత్రస్తమృగద్విజం= భ్రమంబునొందినవియు భయపడినవియు నగు మృగంబులునుబక్షులును గలదియు నగు; తత్—ఆ; వనషండంతు = వనసమూహమును; నిరీక్షంతే= చూచుచుండిరి.

వికృతంబులగుముఖంబులుగల యారాక్షసస్త్రీలు, వనంబువిఱుచుశబ్దంబునకు మేలొంటని, ఆయశోక వనంబంతయువిఱువంబడి, బెదరిపఱచుమృగ పక్షులతోఁగూడియుండుటం, జూచిరి. అని, తాత్పర్యము.

మాంచ దృష్ట్వా వనే తస్మిన్ సమాగమ్య తతస్తతః
తాస్సమభ్యాగతాః క్షిప్రం రావణాయా చచక్షిరే. ౨౦

టీక॥ తాః= ఆరాక్షసస్త్రీలు; తస్మిన్=ఆ; వనే= ఆయశోకవనంబునందు; మాంచ—నన్నును; దృష్ట్వా—చూచి; తతస్తతః=అన్యోన్యస్థలంబులనుండి ; సమాగమ్య — ఒక్కటిగాఁగూడి; క్షిప్రం=శీఘ్రముగా ; సమభ్యాగతాః= పోయినవారలై ; రావణాయ=రావణునికొఱకు; ఆచచక్షిరే=చెప్పిరి.

ఆరాక్షసస్త్రీలు, ఆయశోకవనమునను న్ననన్నుఁజూచి, నేనెవనంబునంతయువిఱిచినవాఁడనని తెలిసికొని, యందఱునొకటియై, శీఘ్రంబునంబోయి, యిట్లని, రావణునకుం, జెప్పిరి. అని, తాత్పర్యము-

రాజ న్వన మిదం దుర్గం తవ భగ్నం దురాత్మనా
వానరేణ హ్యవిజ్ఞాయ తవ వీర్యం మహాబల. ౧౧

టీక॥ మహాబల = అధికమయినబలముగల; రాజన్ = రాక్షస రాజుండవగురావణుఁడా! దురాత్మనా= దుష్టబుద్ధిగల; వానరేణ = వానరునిచేత;తవ=నీయొక్క; వీర్యం= పరాక్రమమును; అవిజ్ఞాయ= తెలియక; తవ = నీయొక్క; దుర్గం= ప్రవేశింపఁగూడని; ఇదం=ఈ; వనం= అశోకవనము; భగ్నంహి=విఱువఁబడినదికదా!

మహాబలుండవు రాక్షస రాజుండవగు రావణుఁడా ! దురాత్ముండగునొక వానరుండు,నీపరాక్రమంబు నెఱుంగనివాఁడుకావున,దుష్ప్రవేశంబగు నీయ శోకవనమును,విఱిచినాఁడు.

అని, తాత్పర్యము.

దుర్బుద్ధే స్తస్య రాజేంద్ర తవ విప్రియకారిణః
వధ మాజ్ఞాపయ క్షిప్రం యథా సౌ విలయం వ్రజేత్. ౧౨

టీక॥ రాజేంద్ర=రాజశ్రేష్ఠుండవగురావణుఁడా!యథా=ఎట్లు; అసౌ= ఇతండు; విలయం= నాశమును; వ్రజేత్=పొందునో; తథా(అధ్యాహృతము)=అట్లు; దుర్బుద్ధేః=దుష్టబుద్ధిగలవాఁడును; తవ=నీకు; విప్రియకారిణః=అప్రియమునుజేసినవాఁడునగు; తస్య=ఆవానరునకు; క్షిప్రం=శీఘ్రముగా;వధం= చంపుటను; ఆజ్ఞాపయ= ఆజ్ఞాపింపుము.

రాజశ్రేష్ఠుండవగురావణుఁడా!దుర్బుద్ధియు, నీకువిరోధంబు గావించినవాఁడునగు నావానరుండు, నాశంబునొందునట్లు,శీఘ్రంబుగా,నతనింజంప, నాజ్ఞాపింపుము. అని,యారాక్షసస్త్రీలు,రావణునకుంజెప్పిరి.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా రాక్షసేంద్రేణ విసృష్టా భృశదుర్జయాః
రాక్షసాః కింకరానామ రావణస్య మనోనుగాః. ౧౩

టీక॥తత్=ఆమాటను; శ్రుత్వా=విని; రాక్షసేంద్రేణ=రాక్షసేశ్వరుండ

వగు రావణుని చేత; భృశదుర్జయాః= మిక్కిలియు జయింప నలవి గానివారలును; రావణస్య= రావణుని యొక్క; మనోనుగాః= మనసునను సరించువారలునగు; కింకరానామ= కింకరుల నెడు; రాక్షసాః= రాక్షసులు; విసృష్టాః= పంపఁబడినారు.

ఆమాటనువిని, రాక్షసేశ్వరుండగు రావణుండు, మిక్కిలియు దుర్జయులును, దనకు వశవర్తులునగు, కింకరులనం బడు రాక్షసులం బంపెను.

అని, తాత్పర్యము.

తేషా మశీతిసాహస్రం శూలముద్గరపాణినామ్
మయా తస్మి న్వనోద్దేశే పరిఘేణ నిషూదితమ్. ౧౧౪

టీక॥ శూలముద్గరపాణినాం (శూలముద్గరపాణీనాం)= శూలములును ఇనుపగుదియలును హస్తములంగల; తేషాం= ఆకింకరుల యొక్క; అశీతిసాహస్రం= ఎనుబది వేలు; తస్మిన్= ఆ; వనోద్దేశే= అశోకవనప్రదేశమునందు; పరిఘేన= ఇనుపగుదియ చేత; మయా= నాచేత; నిషూదితం= చంపఁబడినది.

నేనంత, శూలంబులను ముద్గరంబులను జేతులం దాల్చియున్న యాకింకరుల నెనుబది వేల మందినింగూడ, నాయ శోకవనసమీపంబున నుండు పరిఘంబుచేఁ, జంపితిని. అని, తాత్పర్యము.

తేషాంతు హతశేషా యే తే గత్వా లఘువిక్రమాః
నిహతంచ మహత్సైన్యం రావణా యాచచక్షిరే. ౧౧౫

టీక॥ తేషాంతు = ఆకింకరులలోనే; హతశేషాః= చంపఁబడఁగా మిగిలిన వారలు; యే= ఎవరో; తే= వారలు; లఘువిక్రమాః= శీఘ్రమయిన నడకగలవారలై; గత్వా= పోయి; మహత్= గొప్పదగు; సైన్యంచ= సైన్యమును; నిహతం= చంపఁబడినదానిగా; రావణాయ= రావణునికొఱకు; ఆచచక్షిరే= చెప్పిరి.

ఆకింకరులలో హతశేషులగు రాక్షసులు, శీఘ్రంబున, రావణునొద్దకుఁ బాఱిపోయి, సైన్యంబంతయు నావానరుని చేఁ జంపబడినదని రావణునకుం జెప్పిరి. అని, తాత్పర్యము.

తతో మే బుద్ధి రుత్పన్నా చైత్యప్రాసాద మాక్రమమ్

టీక॥ తతః=అటుపిమ్మట; మే=నాకు; బుద్ధిః=తలంపు; ఉత్పన్నా= పుట్టినది; చైత్యప్రాసాదం=పట్టణంబు నడుమనుండు మేడను; ఆక్రమం= ఆక్రమించితిని.

అంత, నాకొకబుద్ధిపుట్టినది; అంత నచ్చటనుండు చైత్యప్రాసాదంబుమీఁది కెదుమికితిని. అని, తాత్పర్యము.

తత్రస్థాన్ రాక్షసాన్ హత్వా శతం స్తంభేన వై పునః. ౧౧౬
లలామభూతో లంకాయా స్సవై విధ్వంసితో మయా

టీక॥ మయా=నాచేత; పునర్వై= మఱలను; స్తంభేన= స్తంభముచేత; తత్రస్థాన్=అచ్చటనుండిన; రాక్షసాన్= రాక్షసులను; శతం = నూర్గురను; హత్వా=చంపి; లంకాయాః= లంకాపట్టణమునకు; లలామభూతః=అలంకారభూత మయిన; సవై = ఆ చైత్యప్రాసాదమును; విధ్వంసితః=నశింపఁజేయఁబడినది.

నేను, అచ్చటనుండు స్తంభంబునుం దీసి, యందుండిన రాక్షసుల నూర్వురం జంపి, లంకాపట్టణంబున కంతయు నలంకార భూతమయిన, యాచైత్యప్రాసాదమునుంగూడ, నాశంబు నొందించితిని. అని, తాత్పర్యము.

తతః ప్రహస్తస్య సుతం జంబుమాలిన మాదిశత్. ౧౧౭
రాక్షసై ర్బహుభి స్సార్ధం ఘోరరూపై ర్భయానకైః

టీక॥ తతః = అటుపిమ్మట ; సః ( అధ్యాహృతము ) = ఆరావణుండు ; ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క; సుతం=కొడుకైన; జంబుమాలినం= జంబుమాలిని; ఘోరరూపైః=భయంకరాకారులును; భయానకైః=భయంకరులునగు; బహుభిః = అనేకులయిన; రాక్షసైస్సార్ధం=రాక్షసులతోఁగూడ; ఆదిశత్= ఆజ్ఞాపించెను.

అంత, నారావణుండు, ప్రహస్తపుత్రుండగు జంబుమాలిని, భయంకరా

కారులగు పెక్కు రాక్షసులతోఁగూడ, నా పైకిఁబంపెను. అని, తాత్పర్యము.

తం మహాబలసంపన్నం రాక్షసం రణకోవిదమ్. ౧౧౮
పరిఘేణాతి ఘోరేణ సూదయామి సహానుగమ్

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; మహాబలసంపన్నం= అధికమయి నబలముతోఁగూడినవాఁడును; రణకోవిదం=యుద్ధంబునందుఁబండితుండును; సహానుగం = అనుచరులతోఁ గూడిన వాఁడునగు; రాక్షసం = రాక్షసుండయిన; తం=ఆజంబుమాలిని; అతిఘోరేణ=మిక్కిలియుభయంకరమగు; పరిఘేణ = ఇనుపగుదియచేత; సూదయామి=చంపితిని.

నేను, మహాబలుండును, యుద్ధంబు నంబండితుండునగు నాజంబుమాలిని, అతనితోఁగూడవచ్చిన రాక్షస సైన్యమును, భయంకరాకారంబగు నాపరిఘంబుచేతనే, చంపితిని.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వా రాక్షసేంద్రస్తు మంత్రిపుత్రా న్మహాబలాన్. ౧౧౯
పదాతిబలసంపన్నాన్ ప్రేషయామాస రావణః

టీక॥ రాక్షసేంద్రః= రాక్షసేశ్వరుండగు; రావణస్తు = రావణుండును; తత్ =దాని; శ్రుత్వా = విని; మహాబలాన్ =అధికమయినబలముగల వారలును; పదాతిబలసంపన్నాన్= కాలిబంటుసైన్యముతోఁ గూడినవారలునగు; మంత్రిపుత్రాన్=మంత్రికుమారులను; ప్రేషయామాస=పంపెను.

రాక్షసేశ్వరుండగు రావణుండు, ఆజంబుమాలిచంపఁబడుటనువిని, మహాబలశాలులగుమంత్రిపుత్రులను, బదాతిసైన్యంబుతోఁగూర్చి, నాపైకిఁబంపెను.

అని, తాత్పర్యము.

పరిఘేణైవ తాన్ సర్వాన్ నయామి యమసాదనమ్. ౧౨౦

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; తాన్=ఆ; సర్వాన్ = అందఱను; పరిఘేణైవ = ఇనుపగుదియచేతనే; యమసాదనం= యమునిగృహం

బును; నయామి=పొందించితిని.

నేనంత, నాపరిఘంబుచేతనె , ఆ మంత్రిపుత్రులనందఱను యమునొద్దకుఁ బంపితిని. అని, తాత్పర్యము.

మంత్రిపుత్రాన్ హతాన్ శ్రుత్వా సమరే లఘువిక్రమాన్
పంచసేనాగ్రగాన్ శూరాన్ ప్రేషయామాస రావణః. ౧౨౧

టీక॥ రావణః=రావణుఁడు; సమరే=యుద్ధంబునందు; లఘువిక్రమాన్=శీఘ్రమయిన పరాక్రమముగల ; మంత్రి పుత్రాన్=మంత్రికొడుకులను; హతాన్=చంపఁబడినవారలనుగా; శ్రుత్వా=విని; శూరాన్=యుద్ధమునందు భయములేనట్టి; పంచసేనాగ్రగాన్=అయిదుసేనానాయకులను; ప్రేషయామాస =పంపెను.

రావణుండు, యుద్ధంబున, శత్రువునకెంత మాత్రమునవకాశమివ్వక పరాక్రమించువారలగు నా మంత్రి పుత్రులు నాచేఁజంపఁబడిరని, విని, శూరులగు, సేనానాయకుల, నయిదుఁగురం బంపెను. అని, తాత్పర్యము.

తా నహం సహసైన్యా న్వై సర్వా నేవా భ్యసూదయమ్

టీక॥ అహం = నేను; సహసైన్యాన్= సైన్యములతోఁగూడిన ("వై" అనునది పాదపూరణార్థము); తాన్=ఆసేనానాయకులను; సర్వానేవ=అందఱనే; అభ్యసూదయం=చంపితిని.

నేనంత, నాసేనానాయకులనైదుగురను, వారలసేనలతోఁగూడం, జంపివేసితిని. అని, తాత్పర్యము.

తతః పున ర్దశగ్రీవః పుత్ర మక్షం మహాబలమ్. ౧౨౨
బహుభీ రాక్షసైస్సార్ధం ప్రేషయామాస రావణః

టీక॥ తతః=అటుపిమ్మట; దశగ్రీవః=పదికంఠములుగల; రావణః=రావణుఁడు; పునః=మఱల; మహాబలం= అధికమయినబలముగల; పుత్రం=కొడుకైన; అక్షం=అక్షుని; బహుభిః=అనేకులయిన; రాక్షసైస్సార్ధం= రాక్షసుల

తోఁగూడ; ప్రేషయామాస=పంపెను. అంత, దశకంఠుండగు రావణుండు, మఱల, మహాబలుండగు తనకొడుకునకు కుమారుని, పెక్కు రాక్షసులతోఁగూడ, నాపైకిఁబంపెను.

అని, తాత్పర్యము.

తంతు మండోదరీపుత్రం కుమారం రణపండితమ్. ౧౭౩
సహసా ఖం సముత్క్రాంతం పాదయోశ్చ గృహీతవాన్

టీక॥ మండోదరీపుత్రం=మండోదరియొక్క కొడుకును; కుమారం=చిన్నవాఁడును; రణపండితం=యుద్ధమునందుఁబండితుండును; సహసా= తటాలున; ఖం = ఆకాశమునుగూర్చి; సముత్క్రాంతం = ఎగిరినవాఁడునగు; తంతు= ఆయక్షుని; పాదయోశ్చ=పాదములయందును; గృహీతవాన్= పట్టికొంటిని,

మండోదరీపుత్రుండును, బాలుండును యుద్ధపండితుండునగు, నాయక్షకుమారుండు, తటాలున, నాకాశంబునకుద్గమింపఁగానే, నేనతని పాదములంబట్టుకొంటిని. అని, తాత్పర్యము.

చర్మాసినం శతగుణం భ్రామయిత్వా వ్యపేషయమ్. ౧౭౪

టీక॥ చర్మాసినం(చర్మాసిం)= డాలుతోఁగూడిన కత్తిగలయక్షుని; శతగుణం=నూఱుమాఱులు; భ్రామయిత్వా= త్రిప్పి ; వ్యపేషయం= ముద్దచేసితిని.

అట్లు, డాలునుగత్తియుంగొనియాకాశంబున కుద్గమించిన యాయక్షకుమారుని పాదములుపట్టినూఱుమాఱులు గిరగిరంద్రిప్పి, నేలంబడవయిచి, చేతులుఁగాళ్లు మున్నగునవి గానరాకుండఁబొడిపొడి గాఁజేసితిని.

అని, తాత్పర్యము.

త మక్ష మాగతం భగ్నం నిశమ్య స దశాననః
తత ఇంద్రజితంనామ ద్వితీయం రావణస్సుతమ్. ౧౭౫
వ్యాదిదేశ సుసంక్రుద్ధో బలినం యుద్ధదుర్మదమ్

టీక॥ తతః=అటుపిమ్మట; దశాననః=పదిముఖములుగల; సః=ఆ; రావ

ణః=రావణుఁడు; ఆగతం= వచ్చిన; తం=ఆ; అక్షం=అక్షుని; భగ్నం=మరణమునొందినవానిఁగా; నిశమ్య=విని; సుసంక్రుద్ధః = మిక్కిలియుఁగోపించినవాఁడై; ద్వితీయం=రెండవవాఁడు; బలినం=బలవంతుండును; యుద్ధదుర్మదం=యుద్ధమునందు దుస్సహమయిన మదముగలవాఁడునగు; ఇంద్రజితంనామ=ఇంద్రజిత్తనెడు; సుతం=కొడుకును; వ్యాదిదేశ=ఆజ్ఞాపించెను.

అంత, నక్షకుమారుండు చచ్చుటను విని, దశముఖుండగు రావణుండు, పరమ కోపంబునొంది, మఱల, బలవంతుండును యుద్ధోన్మత్తుండునగు నింద్రజిత్తను కొడుకును, నాపైకిఁబంపెను.

అని, తాత్పర్యము.

తచ్చాప్యహం బలం సర్వం తం చ రాక్షసపుంగవమ్. ౧౭౮
నష్టౌజసం రణే కృత్వా పరం హర్ష ముపాగమమ్

టీక॥అహం=నేను; తత్=ఆ; బలం=సైన్యమును; సర్వంచాపి = అంతయును; తం=ఆ; రాక్షసపుంగవం=రాక్షసశ్రేష్ఠుండగునింద్రజిత్తును; రణే = యుద్ధమునందు; నష్టౌజసం=పోయిన బలముగలవానిఁగా; కృత్వా= చేసి; పరం = అధికమయిన ; హర్షం = సంతోషమును; ఉపాగమం = పొందితిని.

నేను, అతనితోఁగూడవచ్చినయాసైన్యమునంతయుఁజంపి, రాక్షసశ్రేష్ఠుండగు నాయింద్రజిత్తును; యుద్ధంబునహతంబుఁగావించి, పరమసంతోషంబు నొందినాఁడను.

అని, తాత్పర్యము.

మహతాపి మహాబాహుః ప్రత్యయేన మహాబలః. ౧౭౯
ప్రేషితో రావణేనైవ సహవీరై ర్మదోత్కటైః

టీక॥మహాబాహుః=గొప్పచేతులుగలవాఁడును; మహాబలః= అధికమయినబలముగలవాఁడునగునింద్రజిత్తు= రావణేనైవ= రావణునిచేతనే ; మహతా=అధికమయిన; ప్రత్యయేన= నమ్మకముచేత; మదోత్కటైః=మదముచేనతిశయించినట్టి; వీరైస్సహ= పరాక్రమవంతులతోఁగూడ; ప్రేషితోపి =

పంపఁబడినాఁడుగదా.

రావణుండు, మహాబాహుండును మహాబలశాలియునగునింద్రజిత్తు, ఎట్లు మునను వానరుంజంపునని దృఢవిశ్వాసంబున, నాయింద్రజిత్తును,వీర్యమత్తులగురాక్షసవీరులతోఁగూడ నాపైకిఁబంపెనుగదా! అని, తాత్పర్యము.

సో విషహ్యం హి మాం బుద్ధ్వా స్వం బలం చా వమర్దితమ్.౧౩౭
బ్రాహ్మేణాస్త్రేణ సతు మాం ప్రాబధ్నా చ్చాతివేగితః

టీక॥సః=ఆయింద్రజిత్తు; మాం=నన్ను;అవిషహ్యం= ఓర్వఁగూడనివానిఁగాను; స్వం=తనదైన; బలంచ= బలమును;అవమర్దితం=నలఁగఁజేయంబడినదానిఁగాను;బుద్ధ్వా= ఎఱింగి; సతు=ఆయింద్రజిత్తును; అతివేగితః = మిక్కిలియు వేగమునొందినవాఁడై ; బ్రాహ్మేణ=బ్రహ్మసంబంధియగు; అస్త్రేణచ=అస్త్రముచేతనే;ప్రాబధ్నాత్=బంధించెను.

ఆయింద్రజిత్తు, నేనజేయుండనగుటయుఁదనబలంబునశించుటయు నెఱింగి,మహావేగంబునబ్రహ్మాస్త్రంబు నేసి నన్నుబంధించెను. అని, తాత్పర్యము.

రజ్జుభిశ్చా భిబధ్నంతి తతో మాం తత్ర రాక్షసాః. ౧౩౮

టీక॥తతః=అటుపిమ్మట;తత్ర= అచ్చట; రాక్షసాః= రాక్షసులు; రజ్జుభిశ్చ=పగ్గములచేతను;మాం=నన్ను ; అభిబధ్నంతి=అంతటంగట్టిరి

అంత,నప్పుడు, రాక్షసులు,నన్నుఁ, బగ్గములచే, దేహమంతయుబంధించిరి. అని, తాత్పర్యము.

రావణస్య సమీపంచ గృహీత్వా మా ముపానయన్

టీక॥తే(అధ్యాహృతము)= ఆరాక్షసులు;మాం=నన్ను;గృహీత్వా=తీసికొని;రావణస్య=రావణునియొక్క;సమీపంచ=సమీపంబునుంగూడ; ఉపానయన్=పొందించిరి.

అంత నారాక్షసులునన్నురావణునియొద్దకుఁదీసికొనిపోయిరి. అని, తాత్పర్యము.

దృష్ట్వా సంభాషితశ్చాహం రావణేన దురాత్మనా. ౧౩౦

టీక॥ అహం=నేను;దురాత్మనా=దుష్టబుద్ధిగల;రావణేన= రావణునిచేత;దృష్ట్వా=చూచి;సంభాషితశ్చ=మాటలాడcబడినాను.

దురాత్ముండగు రావణుండు నన్నుంజూచి నాతోసంభాషణంబుc జేసినాడు. అని, తాత్పర్యము.

పృష్టశ్చ లంకాగమనం రాక్షసానాం చ తం వధమ్

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను;రావణేన(అధ్యాహృతము)=రావణునిచేత;లంకాగమనం=లంకయొక్క-పొందుటంగూర్చియు; రాక్షసానాం= రాక్షసులయొక్క;తం=ఆ; వధంచ = చంపుటనుగూర్చియు;పృష్టశ్చ—అడుగcబడినాను.

రావణుండు,"నీవులంకకేల వచ్చినావు? రాక్షసులనేలచంపివావు?" అని, నన్నడిగినాcడు.అని, తాత్పర్యము.

తత్సర్వంచ మయా తత్ర సీతార్థమితి జల్పితమ్ ౧౩౧

టీక॥ తత్ర=అచ్చట; మయా=నాచేత—తత్ =అది;సర్వంచ=అంతయు; సీతార్థం = సీతకొఱకు; ఇతి=అని; జల్పితం=చెప్పcబడినది.

అచ్చట నేను, ఇదంతయు, సీతాదేవికొఱకై చేసితినని, చెప్పినాను. అని, తాత్పర్యము.

అస్యాహం దర్శనాకాంక్షీ ప్రాప్త స్త్వద్భవనం విభో

టీక॥విభో=రాక్షసరాజుండవగు రావణుcడా! అహం= నేను; అస్యాః= ఈసీతయొక్క (సంధియార్షము);దర్శనాకాంక్షీ= చూచుటను గోరువాcడనై; త్వద్భవనం= నీయింటిని; ప్రాప్తః=పొందినాను.

రాక్షసరాజుండవగు రావణుcడా! నేనీసీతాదేవింజూడగోరియే, నీపట్టణంబగు లంకకువచ్చినాను. అని, తాత్పర్యము.

మారుతస్యౌరసః పుత్రో వానరో హనుమా నహమ్. ౧౩౨

టీక॥ అహం=నేను; మారుతస్య=వాయుదేవునియొక్క; ఔరసః = వీర్యమునకుఁ బుట్టిన; పుత్రః = కుమారుండను; వానరః = వానరుండను; హనుమాన్=హనుమంతుఁడను పేరుగలవాఁడను.

నేను, వాయుదేవుని కుమారుండను, వానరజాతిని; నాపేరు హనుమంతుండనియందురు.

అని, తాత్పర్యము.

రామదూతం చ మాం విద్ధి సుగ్రీవసచివం కపిమ్

టీక॥ కపిం=కోఁతినగు; మాం=నన్ను; రామదూతం=రాముని దూతగాను; సుగ్రీవసచివం = సుగ్రీవునిమంత్రిగాను; విద్ధి= ఎఱుంగుము.

నేను సుగ్రీవునియమాత్యుండనియు రామునిదూతననియు, నెఱుంగుము.

అని, తాత్పర్యము.

సోహం దూత్యేన రామస్య త్వత్సకాశ మిహా గతః. ౧౩౩

టీక॥ సః=అట్టి; అహం= నేను; రామస్య=రామునకు; దూత్యేన=దూతకార్యముచేత; ఇహ=ఇచ్చటికి; త్వత్సకాశం = నీసమీపమును; ఆగతః=పొందినాను.

నేను, రాముండు సందేశంబుఁ జెప్పిపంపగా, దానిం దెల్పుటకై, ఇచ్చటికినీయొద్దకువచ్చినాను.

అని, తాత్పర్యము.

సుగ్రీవశ్చ మహాతేజా స్స త్వాం కుశల మబ్రవీత్

టీక॥మహాతేజాః= అధికమయినపరాక్రమముగల;సః=ఆ;సుగ్రీవశ్చ= సుగ్రీవుండును;త్వాం=నిన్నుఁగూర్చి; కుశలం=క్షేమమును;అబ్రవీత్=చెప్పెను.

మహాపరాక్రమశాలియగు, సుగ్రీవుండు, నీకు, క్షేమమును జెప్పుమన్నాఁడు, అని, తాత్పర్యము.

ధర్మార్థకామసహితం హితం పథ్య మువాచచ. ౧౩౪

టీక॥ ధర్మార్థ కామసహితం= ధర్మముతోను అర్థముతోను కామముతోనుంగూడినదియు ; హితం=ఇంపైనదియు; పథ్యం= మేలుగలిగించునదియునగుమాటను ; ఉవాచచ = చెప్పెను.

మఱియు, ధర్మార్థ కామంబుల మూఁడింటినింగలిగించునదియు హితంబును మేలొనరించునదియునగు నీమాటను, నీకుఁ జెప్పమనెను.

అని, తాత్పర్యము.

వసతో ఋశ్యమూకే మే పర్వతే విపులద్రుమే
రాఘవో రణవిక్రాంతో మిత్రత్వం స ముపాగతః. ౧౩౫

టీక॥ విపులద్రుమే= అధికములయినవృక్షములుగల; ఋశ్యమూకే=ఋశ్యమూకమను; పర్వతే= కొండయందు; వసతః= ఉన్న; మే=నాకు; రణవిక్రాంతః=యుద్ధంబునందుఁ బరాక్రమముగల; రాఘవః=రాముఁడు; మిత్రత్వం= చెలికాఁడగుటను; ఉపాగతః= పొందినాఁడు.

అధికవృక్షంబులుగల ఋశ్యమూకపర్వతంబునందు నేనునివసించియుండఁగా, యుద్ధవిశారదుండగు రామునకును నాకును, స్నేహముగలిగినది.

అని, తాత్పర్యము.

తేన మే కథితం రాజ్ఞా భార్యా మే రక్షసా హృతా
తత్ర సాహాయ్య మస్మాకం కార్యం సర్వాత్మనా త్వయా. ౧౩౬

టీక॥ "మే=నాయొక్క; భార్యా= పెండ్లాము; రక్షసా= రాక్షసునిచేత; హృతా= అపహరింపఁబడినది. తత్ర= ఆవిషయమునందు; త్వయా= నీచేత; సర్వాత్మనా= సమస్తప్రయత్నముచేతను; అస్మాకం=మాకు; సాహాయ్యం= తోడ్పాటు; కార్యం= చేయఁదగినది". ఇతి(అధ్యాహృతము)= అని; రాజ్ఞా= రాజయిన; తేన= ఆ రామునిచేత; మే= నాకొఱకు; కథితం= చెప్పఁబడినది.

"నాభార్యను రాక్షసుఁడొకఁ డపహరించినాఁడు; వానివధించి నాభార్యం

దీనికోనివచ్చుటయందు,నీవు,సమస్త విధంబులను, మాకు,సాహాయ్యంబు సేయవలయును" అని, రామందునన్నడిగెను. అని, తాత్పర్యము.

మయాచ కథితం తస్మై వాలినశ్చ వధం ప్రతి
తత్ర సాహాయ్యహేతో ర్మేణ సమయం కర్తుణ మర్హాణసి. ౧౩౭

టీక॥మయాచ=నాచేతనుంగూడ; తస్మై=ఆరామునికొఱకు ; వాలినః=వాలియొక్క; వధంప్రతిచ= చంపుటనుగూర్చియు ; ఉక్త్వా (అధ్యాహృతము)=చెప్పి;తత్ర = ఆవిషయమందు; మే=నాకొఱకు;సాహాయ్యహేతోః = తోడుపాటునిమిత్తమయి; సమయం=ప్రతిజ్ఞను; కర్తుణం = చేయుటకు; అర్హాణసి = తగుదువు. ఇతి(అధ్యాహృతము) = అని; కథితం=చెప్పఁబడినది.

అంత, నేనును,ఆరామునకు, నాకునువాలికినింగల విరోధంబుఁజెప్పి , వాలింజంపువిషయమయి, నీవు,నాకు సాహాయ్యంబుఁజేసెదనని , ప్రతిజ్ఞ సేయవలయునని, యడిగితిని.

అని,తాత్పర్యము-

వాలినా హృతరాజ్యేన సుగ్రీవేణ మహాప్రభుః
చక్రేఽగ్నిసాక్షికం సఖ్యం రాఘవ స్సహలక్ష్మణః. ౧౩౮

టీక॥మహాప్రభుః= మహారాజుండును; సహలక్ష్మణః=లక్ష్మణునితోఁ గూడినవాఁడునగు; రాఘవః=రాముఁడు; వాలినా=వాలిచేత; హృతరాజ్యేన=అపహరింపఁబడినరాజ్యముగల; సుగ్రీవేణ=సుగ్రీవుండునగునాతో; అగ్నిసాక్షికం=అగ్నిహెూత్రము సాక్షిగాఁగల్గునట్లు; సఖ్యం=స్నేహమును;చక్రే=చేసెను.

అంత , మహారాజుండగురాముండు, లక్ష్మణునితోడంగూడ, వాలిచేరాజ్యమునపహరించి తఱిమి కొట్టఁబడిననాతో , నగ్నిసాక్షికముగా స్నేహము చేసెను.అని, తాత్పర్యము.

తేన వాలిన ముత్పాట్య శరేణైకేన సంయుగే
వానరాణాం మహారాజః కృత స్స ప్లవతాం ప్రభుః. ౧౩౯



టీక॥ తేన = ఆరామునిచేత; సంయుగే=యుద్ధమునందు; ఏకేన = ఒకటైన; శరేణ=బాణముచేత; వాలినం=వాలిని; ఉత్పాట్య = పెల్లగించి, చంపియనుట; ప్లవతాం=వానరులలో; ప్రభుః=సమర్థుండనగు; కృతః అస్మి; అహం(అధ్యాహృతము)=నేను; వానరాణాం=వానరులకు; మహారాజః=మహారాజుండనుగా; కృతః=చేయఁబడినాను.

అంత, రాముండు, యుద్ధంబున, వాలిని ఒక్క బాణంబునం జంపి, వానరశ్రేష్ఠుండనగు నన్ను, వానరులకు రాజును గాఁజేసెను. అని, తాత్పర్యము.

తస్య సాహాయ్య మస్మాభిః కార్యం సర్వాత్మనా త్విహ
తేన ప్రస్థాపిత స్తుభ్యం సమీప మిహ ధర్మతః. ౧౪౦

టీక॥ఇహ = ఈవిషయమందు; అస్మాభిః=మాచేత; తస్య= ఆరామునకు; సాహాయ్యం=తోడ్పాటు; సర్వాత్మనా= సర్వప్రయత్నముచేతను; కార్యం= చేయందగినది. తేన=అందుచేత; అహం (అధ్యాహృతము)=ఈతండు; తుభ్యం (తవ) = నీయొక్క; సమీపం=సమీపమునకు; ఇహ= ఇచ్చటికి; ధర్మతః=ధర్మమువలన; ప్రస్థాపితః=పంపఁబడినాఁడు.

ఈవిషయంబున, మేము రామునకవశ్యము సాహాయ్యము సేయవలయును; కావున, ధర్మంబునను సరించి, నీయొద్దకిచ్చటికి, ఈఁడు పంపఁబడినాఁడు. అని, తాత్పర్యము.

క్షిప్ర మానీయతాం సీతా దీయతాం రాఘవాయ చ
యావ న్న హరయో వీరా విధమంతి బలం తవ. ౧౪౧

టీక॥యావత్ = ఎంతలోపల; వీరాః=పరాక్రమశాలులగు; హరయః=వానరులు; తవ=నీయొక్క; బలం=సైన్యమును; నవిధమంతి=చంపకుందురో; తావత్(అధ్యాహృతము)= అంతలోపల; క్షిప్రం=శీఘ్రముగా; సీతా= సీతాదేవి; ఆనీయతాం= తేఁబడుఁగాక. రాఘవాయ= రామునికొఱకు; దీయతాంచ=ఇయ్యఁబడుంగాక.

పరాక్రమవంతులగు వానరులు, నీ



పట్టణంబుమీఁదికెత్తివచ్చిన సైన్యంబుఁ దెచ్చి, రామునకొసంగుము.
జంపుటకుమున్నె, నీవు, శీఘ్రముగానే    అని, తాత్పర్యము.

వానరాణాం ప్రభావోహి న కేన విదితః పురా
దేవతానాం సకాశంచ యే గచ్ఛంతి నిమంత్రితాః. ౧౮౭

టీక॥ యే=ఎవ్వరు; నిమంత్రితాః= పిలువఁబడినవారలై; దేవతానాం = దేవతలయొక్క; సకాశంచ = సమీపంబునుంగూర్చి; గచ్ఛంతి=పోవుదురో; తేషాం (అధ్యాహృతము)=అట్టి; వానరాణాం=వానరులయొక్క; ప్రభావః=ప్రభావము; పురా= మున్ను; కేన=ఎవ్వనిచేత; నవిదితః= తెలియఁబడలేదు?

సాహాయ్యార్థము మహాహూతులయి పోయి దేవతలకుంగూడ సాహాయ్యంబు చేసి, జయింపఁగొనునట్టి, వానరవీరుల ప్రభావంబుఁ దెలియనివాఁ డెవ్వఁడు? నీకునుం దెలియును.

అని, తాత్పర్యము.

ఇతి వానరరాజస్త్వా మాహేత్యభిహితో మయా

టీక॥ ఇతి=ఇట్లు; వానరరాజః=వానరాధీశ్వరుండగు సుగ్రీవుండు; త్వాం= నిన్నుఁగూర్చి; ఆహ = చెప్పెను. ఇతి=అని; సః (అధ్యాహృతము)= ఆ రావణుండు; మయా= నాచేత; అభిహితః= చెప్పఁబడినాఁడు.

ఇట్లు, నీతోఁ జెప్పుమని, వానరరాజుండగు సుగ్రీవుండు చెప్పినాఁడు. అని నేను రావణునకుం జెప్పితిని.

అని, తాత్పర్యము.

మాం నైక్షత తతః క్రుద్ధ శ్చక్షుషా ప్రదహన్నివ. ౧౮౮

టీక॥ తతః=అటుపిమ్మట; సః (అధ్యాహృతము)= ఆ రావణుండు; క్రుద్ధః= కోపమునొందినవాఁడై; చక్షుషా = కంటిచేత; ప్రదహన్నివ= కాల్చువాఁడువలె; మాం= నన్ను; ఐక్షత= చూచెను.

అంత, నా రావణుండు, కోపము నొంది, నేత్రంబుల నట్టిదనంబుగదుర, నన్ను దహించునట్లు, చురచుర జూచెను. అని, తాత్పర్యము.

తేన వధ్యోఽహ మాజ్ఞప్తో రక్షసా రౌద్రకర్మణా
మత్ప్రభావ మవిజ్ఞాయ రావణేన దురాత్మనా. ౧౪౪

టీక॥ రౌద్రకర్మణా= భయంకరంబగుకార్యములుగలవాఁడును; దురాత్మనా= దుష్టమగుబుద్ధిగల వాఁడునగు; రక్షసా= రాక్షసుండయిన; తేన= ఆ; రావణేన= రావణునిచేత; మత్ప్రభావం= నాయొక్క ప్రభావమును; అవిజ్ఞాయ= తెలియక; అహం= నేను; వధ్యః= చంపఁదగినవాఁడనుగా; ఆజ్ఞప్తః= ఆజ్ఞాపింపంబడినాను.

భయంకరంబులగు కార్యంబులు సేయువాఁడును దురాత్ముండునగు నా రావణుండు, అంత, నాప్రభావంబు నెఱుంగక, నన్నువధింపనాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

తతో విభీషణో నామ తస్య భ్రాతా మహామతిః

టీక॥ తతః= అచ్చట; తస్య= ఆ రావణునియొక్క; భ్రాతా =తమ్ముఁడును; మహామతిః= ప్రాజ్యమగుబుద్ధిగలవాఁడునగు; విభీషణో నామ= విభీషణుండను వాఁడు; ఆసీత్ (అధ్యాహృతము)= ఉండెను.

అచ్చట, రావణునితమ్ముండు, మహాబుద్ధిశాలి, విభీషణుండనువాఁడొకండుండెను.

అని, తాత్పర్యము.

తేన రాక్షసరాజోఽసౌ యాచితో మమ కారణాత్. ౧౪౫

టీక॥ తేన= ఆవిభీషణునిచేత; అసౌ= ఈ; రాక్షసరాజః= రాక్షసేశ్వరుండగు రావణుఁడు; మమ= నాయొక్క; కారణాత్= కారణమువలన; యాచితః= ప్రార్థింపఁబడినాఁడు.

ఆ విభీషణుండు, నానిమిత్తమయి, రాక్షసరాజుండగు రావణునిట్లని, ప్రార్థించినాఁడు.

అని, తాత్పర్యము.

నైవం రాక్షసశార్దూల త్యజ్యతా మేష నిశ్చయః

టీక॥ రాక్షసశార్దూల=రాక్షసశ్రేష్ఠుండవగు రావణుఁడా! ఏవం= ఇట్లు;న(కర్తవ్యం)= చేయఁబడఁగూడదు. ఏషః=ఈ;నిశ్చయః= నిశ్చయము; త్యజ్యతాం=విడువఁబడుఁగాక.

రాక్షస శ్రేష్ఠుఁడవగు రావణుఁడా! ఇట్లింతమాత్రము చేయరాదు; ఈనిశ్చయంబును వదలుము. అని, తాత్పర్యము.

రాజశాస్త్రవ్యపేతోహి మార్గ స్సంసేవ్యతే త్వయా. ౧౪౬

టీక॥త్వయా=నీచేత; రాజశాస్త్రవ్యపేతః=రాజశాస్త్రముచే విడువఁబడిన; మార్గః=మార్గము; సంసేవ్యతేహి=సేవింపఁబడుచున్నదిగదా!

నీవిప్పుడు చేయఁదలంచినది, రాజధర్మశాస్త్రమునకు విరుద్ధము; కావున,నిట్లు సేయరాదు.

అని, తాత్పర్యము.

దూతవధ్యా న దృష్టాహి రాజశాస్త్రేషు రాక్షస

టీక॥రాక్షస=రాక్షసుండవగు రావణుఁడా! రాజశాస్త్రేషు=రాజధర్మములందెలుపుశాస్త్రములందు;దూతవధ్యా=దూతవధము;దృష్టా=చూడఁబడినది;నహి=కాదుగదా!

రాక్షసుండవగు రావణుఁడా! రాజధర్మశాస్త్రంబులం దెచ్చటను, దూతంజంపవచ్చునని చెప్పియుండలేదు.

అని, తాత్పర్యము.

దూతేన వేదితవ్యంచ యథార్థం హితవాదినా. ౧౪౭

టీక॥హితవాదినా=మేలుగలిగించుమాటలు చెప్పునట్టి; దూతేన= రాయబారిచేత;యథార్థం=సత్యమగుమాట;వేదితవ్యంచ=తెలుపఁబడవలసినదే.

హితవాదియగు దూత, తనప్రభువు చెప్పిపంపిన మాటలను, యథార్థముగానవశ్యము చెప్పవలసినది.

అని, తాత్పర్యము.

సుమహత్యపరాధేపి దూతస్యాతులవిక్రమ
విరూపకరణం దృష్టం నవధోస్తీతి శాస్త్రతః. ౧౪౮

విమోచయిత్వా తం బంధం ప్రకృతిస్థ స్థ్సితః పునః
ఆయసం పరిఘం గృహ్యా తాని రక్షాంస్య సూదయమ్. ౧౫౪

టీక॥ తతః=అటుపిమ్మట;అహం=నేను; పునః=మఱల;ఆత్మనః=నాయొక్క; మహత్ = మిక్కిలియుగొప్పదగు; రూపం = ఆకారమును; సంక్షిప్య=చిన్నదిచేసికొని; తం = ఆ; బంధం=కట్టును; విమోచయిత్వా = (విమోచ్య) వదలించుకొని; పునః = మఱల; ప్రకృతిస్థః= స్వభావంబుననున్నవాఁడను; స్థితః=అయినవాఁడనై; ఆయసం= ఇనుముతోఁజేయఁబడిన=పరిఘం = గుదియును; గృహ్యా (గృహీత్వా)=తీసికొని; తాని=ఆ; రక్షాంసి=రాక్షసులను; అసూదయం=చంపితిని.

అంత, నేను, నాపెద్దయాకారంబును మిక్కిలియుఁ జిన్నదిగాఁ జేసికొని, యాబంధంబులవదలించుకొని, మఱల, నెప్పటియట్ల,పర్వతాకారుండనై ;యచ్చటనుండునొక్క యినుపగుదియందీసి, యారాక్షసులంజంపితిని.

అని, తాత్పర్యము

తత స్తన్నగరద్వారం వేగేనా ప్లుతవా నహమ్

టీక॥ తతః=అటుపిమ్మట;అహం=నేను; తత్=ఆ; నగరద్వారం=పట్టణద్వారమును; వేగేన = వేగముచేత; ఆప్లుతవాన్= పొందినాఁడను.

అంత, నేను, వేగంబున, నాపట్టణద్వారంబు మీఁదికి,దుమికితిని-

అని,తాత్పర్యము.

పుచ్ఛేన చ ప్రదీప్తేన తాం పురీం సాట్టగోపురామ్. ౧౫౫
దహామ్యహ మసంభ్రాంతో యుగాంతాగ్ని రివప్రజాః

టీక ॥ అహం= నేను; యుగాంతాగ్నిః= ప్రళయకాలమునందలియగ్నిహోత్రుండు; ప్రజాఇవ=ప్రజలనువలెఁ; ప్రదీప్తేన= మండుచున్న; పుచ్ఛేనచ = తోఁకచేతనే;సాట్టగోపురాం= బురుజులతోను బహిద్వారంబులతోనుంగూడిన; తాం=ఆ; పురీం= లంకా పట్టణమును;అసంభ్రాంతః =

తోట్రుపాటులేనివాఁడనై; దహామి (అదహం)= దహించితిని-

అంతఁ, బ్రళయకాలాగ్నిహోత్రుండు ప్రజలదహించునట్లు, నేను అసంభ్రాంతుండనై, మండుచున్నలాంగూలంబులచేబురుజులతోనుబహిద్వారంబులతోనుంగూడినయాలంకాపట్టణంబునంతయు, దహించితిని.

అని, తాత్పర్యము.

వినష్టా జానకీ వ్యక్తం నహ్యదగ్ధః ప్రదృశ్యతే. ౧౫౬
లంకాయాం కశ్చిదుద్దేశ స్సర్వా భస్మీకృతా పురీ

టీక॥జానకీ=సీతాదేవి; వినష్టా= నాశంబునొందినది. వ్యక్తం= స్పష్టంబు. లంకాయాం= లంకయందు; కశ్చిత్ =ఒకానొక; ఉద్దేశః= ప్రదేశమును; అదగ్ధః = దహింపఁబడనిది; నదృశ్యతేహి=చూడఁబడకున్నదిగదా; పురీ=పట్టణము; సర్వా= అంతయు; భస్మీకృతా=భస్మముసేయఁబడినది.

అయ్యో! సీతాదేవినిప్పులోఁబడి నశించినదేమొ! లంకయందు, ఒక్కప్రదేశమయినను, దహింపఁబడకుండ లేదే! పట్టణంబంతయు, నీఱయినదే; సీతకేమిగల్గినదో!

అని, తాత్పర్యము.

దహతా చ మయా లంకాం దగ్ధా సీతా న సంశయః. ౧౫౭

టీక॥లంకాం=లంకను; దహతా= దహించుచున్న; మయా=నాచేత; సీతాచ=సీతాదేవియు; దగ్ధా= దహింపఁబడినది. సంశయః=సందేహము ; న= లేదు.

నేను, లంకాపట్టణంబునుదహించుచు, సీతాదేవినింగూడ దహించియుందును; ఇందుసంశయముండదు.

అని, తాత్పర్యము.

రామస్య హి మహత్కార్యం మయేదం వితథీకృతమ్

టీక॥రామస్య= రామునియొక్క; మహత్ =గొప్పదగు; ఇదం=ఈ; కార్యం=పని; మయా=నాచేత; వితథీకృతం = వ్యర్థముగాఁజేయఁబడినదిగ

దా!
గొప్పదగు రామునికార్యంబు నంతయు, నేను, జెఱచితిని.

అని, తాత్పర్యము.

ఇతి శోకసమావిష్ట శ్చింతా మహ ముపాగతః. ౧౫౮

టీక॥అహం=నేను; ఇతి=ఇట్లు;శోకసమావిష్టః= దుఃఖముచేనావేశింపఁబడినవాఁడనై; చింతాం = చింతను; ఉపాగతః=పొందినాను.

ఇట్లు నేను దుఃఖాక్రాంతుండనై చింతనొందితిని. అని, తాత్పర్యము.

అథాహం వాచ మశ్రౌషం చారణానాం శుభాక్షరామ్
జానకీ నచ దగ్ధేతి విస్మయోదంతభాషితామ్. ౧౫౯

టీక॥ అథ=అటుపిమ్మట; అహం=నేను; చారణానాం = చారణులయొక్క; శుభాక్షరాం=మంగళకరంబులగునక్షరంబులుగలదియు ; విస్మయోదంతభాషితాం = ఆశ్చర్యవృత్తాంతముచేఁజెప్పఁబడినదియునగు;"జానకీ=సీతాదేవి; నచదగ్ధా=దహింపఁబడనేలేదు."ఇతి= అను; వాచం=మాటను; అశ్రౌషం=వింటిని.

అంత నేను, ఆకాశంబున, "సీతాదేవిదహింపఁబడలే"దని యాశ్చర్యంబు నంజారణులుచెప్పఁగొను మంగళకరంబగుమాటనువింటిని.

అని, తాత్పర్యము.

తతో మే బుద్ధి రుత్పన్నా శ్రుత్వా తా మద్భుతాం గిరమ్

టీక॥అద్భుతాం=ఆశ్చర్యకరంబగు; తాం=ఆ; గిరం=మాటను;శ్రుత్వా=విని; తతః=అటుపిమ్మట;మే= నాకు; బుద్ధిః=జ్ఞానము; ఉత్పన్నా=పుట్టినది.

ఆశ్చర్యకరంబగునాచారణుల మాటనువిన్నపిమ్మట, నాకు, సీతాదేవినశింపలేదని, తెలిసినది.

అని, తాత్పర్యము.

అదగ్ధా జానకీ త్యేవం నిమిత్తై శ్చోప లక్షితా. ౧౬౦

టీక॥ నిమిత్తైశ్చ = శకునములచే తను; ఇత్యేవం= ఈప్రకారముగానే; జానకీ=సీతాదేవి; అదగ్ధా=దహింపఁబడనిదిగా; ఉపలక్షితా= తెలియఁబడినది.

శుభనిమిత్తంబులచేతనుంగూడ, సీతాదేవిదహింపఁబడలేదని తెలిసికొంటిని. అని, తాత్పర్యము.

దీప్యమానేతు లాంగూలే నమాం దహతి పావకః
హృదయం చ ప్రహృష్టంమే వాతా స్సురభిగంధినః. ౧౬౧

టీక॥ లాంగూలే = తోఁక; దీప్యమానేతు=వెలిఁగింపబడుచున్నను; పావకః=అగ్నిహోత్రము; మాం= నన్ను; నదహతి=దహింపకున్నది. మే= నాయొక్క; హృదయంచ= మనసును; ప్రహృష్టం= సంతసించినది; వాతాః= వాయువులు; సురభిగంధినః=మంచివాసనగలవి; సంతి(అధ్యాహృతము)=అగుచున్నవి.

నాతోఁకమండుచున్నను, అగ్నిహోత్రము, నన్ను ఎంతమాత్రము దహింపకున్నది; మఱియునామనసు సంతుష్టంబైయున్నది; వాయువు, సుగంధియై వీచుచున్నది; అని, తాత్పర్యము,

తై ర్నిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః
ఋషివాక్యైశ్చ సిద్ధార్థై రభవం హృష్టమానసః. ౧౬౨

టీక॥ దృష్టార్థైః= చూడఁబడినబలముగల; తైః= ఆ; నిమిత్తైః= శకునముల చేతను; మహాగుణైః=అధికమయిన గుణముగల; కారణైశ్చ=కారణములచేతను; సిద్ధార్థైః= సిద్ధమగునర్థముగల; ఋషివాక్యైశ్చ= ఋషివాక్యములచేతను; అహం (అధ్యాహృతము)=నేను; హృష్టమానసః= సంతసించినమనసుగలవాఁడను; అభవం=అయితిని.

పెక్కుమాఱులు, సఫలంబు లయినయీ శుభనిమిత్తంబులచేతను, అట్లు, తప్పక ఫలంబునొసంగునట్టి, నేత్రస్ఫురణాదీతర నిమిత్తములచేతను, సత్యములగు చారణవాక్యములచేతను, దుఃఖంబువిడిచి, నేనుసంతోషంబు నొందితిని. అని. తాత్పర్యము.

పున ర్దృష్ట్వాచ వైదేహీం విసృష్టశ్చ తయాపునః

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; పునః = మఱల; వైదేహీం= సీతాదేవిని; దృష్ట్వాచ= చూచియు; తయా= ఆబిడచేత; పునః=మఱల;విసృష్టశ్చ= విడువఁబడినాను.

అంత నేను, మఱల సీతాదేవిం జూచి, యాబిడయనుజ్ఞ నొందితిని.

అని, తాత్పర్యము.

తతః పర్వత మాసాద్య తత్రారిష్ట మహం పునః. ౧౬౩
ప్రతి ప్లవన మారేభే యుష్మద్దర్శనకాంక్షయా

టీక॥తతః=అటుపిమ్మట;పునః=మఱల;అహం=నేను;తత్ర=అచ్చట; అరిష్టం=అరిష్టమను; పర్వతం=పర్వతమును; ఆసాద్య=పొంది; యుష్మద్దర్శనకాంక్షయా = మీయొక్క చూచుటయందుఁగోరికచేత;ప్రతిప్లవనం=మఱలదాఁటుటను;ఆరేభే=చేసితిని.

అంత, నేను,ఆలంకయందుండు,నరిష్ట పర్వతంబునెక్కి, మిమ్ములంజూడఁగోరి,మఱల,సముద్రంబు దాఁటితిని.

అని, తాత్పర్యము.

తతః పవనచంద్రార్క సిద్ధగంధర్వసేవితమ్. ౧౬౪
పంథాన మహ మాక్రమ్య భవతో దృష్టవా నిహ

టీక॥ తతః=అంత; అహం=నేను; పవనచంద్రార్క-సిద్ధగంధర్వసేవితం= వాయువుచేతనుజంద్రునిచేతనుసూర్యునిచేతనుసిద్ధులచేతను గంధర్వులచేతను సేవింపఁబడిన;పంథానం=మార్గమును;ఆక్రమ్య=ఆక్రమించి; ఇహ=ఇచ్చట;భవతః=మిమ్ములను; దృష్టవాన్ = చూచినాఁడను.

అట్లు,వాయువుచేతను జంద్రసూర్యులచేతను సిద్ధులచేతనుగంధర్వులచేతను,సేవింపఁబడుచుండునట్టి నాకాశమార్గంబునవచ్చి,యిచ్చటనుండు,మిమ్ములంజూచితిని.

అని, తాత్పర్యము.

రాఘవస్య ప్రభావేన భవతాం చైవ తేజసా. ౧౬౫

సుగ్రీవస్యచ కార్యార్థం మయా సర్వ మనుష్ఠితమ్

టీక॥ రాఘవస్య=రామునియొక్క; ప్రభావేన=మాహాత్మ్యముచేతను; భవతాం=మీయొక్క; తేజసాచైవ=ప్రభావము చేతను, అనుగ్రహబలముచేతనను ట; మయా=నాచేత; సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క; కార్యార్థం=కార్యవస్తువు; సర్వంచ=అంతయు; అనుష్ఠితం=చేయఁబడినది.

శ్రీరామునిప్రభావంబువలనను, మీయనుగ్రహబలంబునను, నేను, సుగ్రీవునికార్యంబునంతయుఁ జేసితిని. అని, తాత్పర్యము.

ఏత త్సర్వం మయా తత్ర యథావ దుపపాదితమ్. ౧౬౬
అత్ర య న్నకృతం శేషం తత్సర్వం క్రియతా మితి

టీక॥మయా=నాచేత; తత్ర=అచ్చట; ఏతత్=ఇది; సర్వం=అంతయు; యథావత్=యథోచితముగా; ఉపపాదితం = చేయఁబడినది. అత్ర = దీనియందు; యత్=ఏది; నకృతం=చేయఁబడలేదో; శేషం=మిగిలినదో; తత్=అది; సర్వం=అంతయు; క్రియతాం=చేయఁబడుఁగాక. ఇతి=అని; పార్థయే (అధ్యాహృతము)=కోరెదను.

అచ్చట, ఈకార్యంబులనంతయు నేను, యథాయుక్తముగ నే చేసితిని; ఇంక నిప్పుడేమి చేయవలసియున్నదో, దానినంతయుఁ జేయవలయునని, కోరెదను. అని, హనుమంతుండు, వానరులకుం జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, అష్టపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండాష్టపంచాశసర్గటీక,
ముగిసినది.

శ్రీః

## ఏకోనవష్టితమసర్గప్రారంభః.

ఏత దాఖ్యాయ తత్సర్వం హనుమా న్మారుతాత్మజః
భూయ స్సముపచక్రామ వచనం వక్తు ముత్తరమ్. ౧

టీక॥మారుతాత్మజః=వాయుదేవునికుమారుండగు; హనుమాన్=హనుమంతుండు;తత్=ఆ; ఏతత్=దీని; సర్వం=అంతయు; ఆఖ్యాయ= చెప్పి; భూయః=మఱల; ఉత్తరం=ఆపైనఁజెప్పవలసిన;వచనం=మాటను; వక్తుం=చెప్పుటకు;సముపచక్రామ= ఆరంభించెను.

వాయుదేవునికుమారుండగు హనుమంతుండు,తాను సీతంజూచినవృత్తాంతమంతయుంజెప్పి, మఱల, నాపైమాటను,జెప్పనారంభించెను.

అని, తాత్పర్యము.

సఫలో రాఘవోద్యోగ స్సుగ్రీవస్యచ సంభ్రమః
శీల మాసాద్య సీతాయా మమచ ప్రవణం మనః. ౨

టీక॥సీతాయాః = సీతాదేవియొక్క; శీలం=సద్వృత్తమును, పాతివ్రత్యముననుట;ఆసాద్య= పొంది; రాఘవోద్యోగః= రాముని ప్రయత్నమును; సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క; సంభ్రమశ్చ = ఉత్సాహమును; సఫలః = సఫలముతోఁ గూడినది. మమ = నాయొక్క; మనశ్చ = మనసును; ప్రవణం= తత్పరమయినది,

సీతాదేవిమహాపతివ్రతగానున్నది గావున, రామునిప్రయత్నంబును సుగ్రీవుని యుత్సాహంబునుఫలంబులగును; నామనసును, ఆసీతాదేవియందధికభక్తినొందియున్నది. అని, తాత్పర్యము.

తపసా నిర్దహే ల్లోకాన్ క్రుద్ధోవా నిర్దహేదపి
సర్వథాతి ప్రవృద్ధోసౌ రావణో రాక్షసాధిపః. ౩

టీక॥ అసౌ= ఈ; రాక్షసాధిపః= రాక్షసులకుఁ బ్రభుండగు; రావణః= రావణుఁడు; తపసా=తపసుచేత;లోకాన్ = లోకములను; నిర్దహేత్= దహించును. క్రుద్ధోవా=కోపంబునొందినవాఁడయినను; నిర్దహేత్ = దహించును. సర్వథా = అన్నివిధంబులను;అతిప్రవృద్ధః = మిక్కిలియు వృద్ధిఁబొందినాఁడు,

రాక్షసేశ్వరుండగు రావణుండుతపసుచేసమస్తలోకంబులందహింపఁగలఁడు; అతండుకోపంబునొందినచోసమస్తలోకంబులను దహింపఁగలండు ; అన్నివిధంబులను, అతండు , మహాతపస్వి. అని,తాత్పర్యము.

తస్య తాం స్పృశతో గాత్రం తపసా న వినాశితమ్

టీక॥తాం=ఆసీతాదేవిని; స్పృశతః=తాఁకుచున్న; తస్య= ఆరావణునియొక్క; గాత్రం = దేహము;తపసా=తపస్సుచేత ; నవినాశితం=నశింపఁజేయఁబడదయ్యె!

ఆరావణుండు మహాపతివ్రతయగు సీతాదేవిందాకినను , మహాతపస్వియగుటంజేసి;నాశంబు నొందకున్నాఁడు.అని,తాత్పర్యము.

న త దగ్నిశిఖా కుర్యా త్సంస్పృష్టా పాణినాసతీ. ౭
జనకస్యాత్మజా కుర్యా ద్యత్క్రోధకలుషీకృతా

టీక॥సతీ = పతివ్రతయగు; జనకస్య =జనకమహారాజుయొక్క; ఆత్మజా= కొమార్తెయగుసీతాదేవి; సంస్పృష్టా=తాఁకఁబడినదై;క్రోధకలుషీకృతా= కోపముచేకలఁగఁజేయఁబడినదై;యత్=దేని;కుర్యాత్=చేయునో;తత్= దానిని ; అగ్నిశిఖా=అగ్నిజ్వాల; నకుర్యాత్= చేయదు.

పతివ్రతయగు సీతాదేవినిదాఁకినచో, నాబిడకుపితయయి, దహించునట్లు,అగ్నిజ్వాలయుంగూడదహింపఁజాలదు; అట్లు,తనభర్తచేతనేరావణుంజంపించవలయుననివీరపత్నీధర్మంబవలంబించి, రావణునిమీఁదఁగోపింపకుండుటచేతనే , రావణుండుజీవించియున్నాఁడుగాని;వేఱుగాదు.

అని,తాత్పర్యము.

జాంబవత్ప్రముఖాన్ సర్వా ననుజ్ఞాప్య మహాహరీన్. ౫
అస్మిన్నేవం గతే కార్యే భవతాంచ నివేదితే
న్యాయ్యం స్మసహ వైదేహ్యా ద్రష్టుం తౌ పార్థివాత్మజౌ. ౬

టీక॥ అస్మిన్=ఈ; కార్యే=పని; ఏవం=ఇట్లు; గతే=పొందఁబడఁగా; భవతాంచ= మీకును; నివేదితే= తెలుపబడఁగా; జాంబవత్ప్రముఖాన్=జాంబవంతుండుమున్నగాఁగల ; మహాహరీన్=గొప్పవానరులను; అనుజ్ఞాప్య= అనుమతింపఁజేసి; వైదేహ్యాసహ= సీతాదేవితోఁగూడ; తౌ=ఆ; పార్థివాత్మజౌ = రాచకొమరులగు రామలక్ష్మణులను; ద్రష్టుం=చూచుటకు; న్యాయ్యంస్మ=యుక్తముగదా!

ఇదివఱకుఁజేసిన కార్యమును మీకుఁజెప్పి, జాంబవంతుండుమున్నగుమిమ్ములనొప్పించి, మీతోఁగూడమఱలనచ్చటికిఁబోయి, సీతాదేవిందీసికొని, యాబిడతోఁగూడ, రాజపుత్రులగు రామలక్ష్మణులఁజూచుటయుక్తమని , నాయభిప్రాయము.

అని, తాత్పర్యము.

అహమేకోపి పర్యాప్త స్సరాక్షసగణాం పురీమ్
తాం లంకాం తరసా హంతుం రావణంచ మహాబలమ్. ౭

టీక॥అహం=నేను;ఏకోపి=ఒకరుఁడనైనను;సరాక్షసగణాం=రాక్షససమూహములతోఁగూడిన; లంకాం = లంక యను;పురీం=పట్టణమును; మహాబలం= అధికమయినబలముగల; రావణంచ-రావణుని;తరసా=వేగముచే; హంతుం=చంపుటకు;పర్యాప్తః=చాలుదును.

నేను,ఒకరుఁడనైనను , లంకయందలి రాక్షసులనందఱను మహాబలుండగురావణుని, వేగంబునఁజంపఁజాలుదును.అని, తాత్పర్యము.

కిం పున స్సహితో వీరై ర్బలవద్భిః కృతాత్మభిః
కృతాస్త్రైః ప్లవగైః శక్తై ర్భవద్భి ర్విజయైషిభిః. ౮

టీక॥ వీరైః=పరాక్రమవంతులును; బలవద్భిః= అధికమయినబలముగలవారలును; కృతాత్మభిః=చేయఁబడినబుద్ధిగలవారలును; కృతాస్త్రైః=నేర్చికొనఁబడినయస్త్రంబులుగలవారలును; ప్లవగైః=వానరులును; శూరైః=యుద్ధమునందుభయములేనివారలును; విజయైషిభిః= జయంబుఁగోరువారలునగు; భవద్భిః=మీతో; సహితః= కూడినవాఁడనై ; పర్యాప్తఇతి (అధ్యాహృతము) = చాలుదునని; కింపునః (వక్తవ్యం)=చెప్పఁబడవలయునా?

ఇంకఁ, బరాక్రమవంతులును బలవంతులునుబుద్ధిమంతులును నస్త్రంబులుదెలిసినవారలును శూరులునుజయంబుఁగోరువారలునగు మీతోఁగూడియుండగా, నేనులంకలోని, రాక్షసులను రావణునింజంపఁగలనని, చెప్పనేల ?

అని, తాత్పర్యము.

అహంతు రావణం యుద్ధే ససైన్యం సపురస్సరమ్
సహపుత్రం వధిష్యామి సహోదరయుతం యుధి. ౯

టీక॥అహం=నేను; యుద్ధే=యుద్ధమునందు; ససైన్యం= ససైన్యంబులతోఁగూడినవాఁడును; సపురస్సరం= ముందునడచు వారితోఁ గూడినవాఁడును ; సహపుత్రం=కొడుకులతోఁగూడినవాఁడును; సహోదరయుతం=తోఁబుట్టువులతోఁగూడినవాఁడునగు; రావణం=రావణుని; యుధి=యుద్ధమునందు; వధిష్యామి=చంపెదను.

నేనొక్కఁడనే, రావణుని, నతని సైన్యంబులను, అనుచరులను గొడుకులను, దోఁబుట్టువులను, అందఱనుయుద్ధంబునంజంపెదను.

అని, తాత్పర్యము.

బ్రాహ్మ మైంద్రంచ రౌద్రంచ వాయవ్యం వారుణం తథా
యది శక్ర జితోస్త్రాణి దుర్నిరీక్ష్యాణి సంయుగే. ౧౦
తాన్యహం విధమిష్యామి హనిష్యామిచ రాక్షసాన్

టీక॥ బ్రాహ్మం = బ్రహ్మాస్త్రముగాని; ఐంద్రంచ= ఐంద్రాస్త్రంబుగాని; రౌద్రంచ= రౌద్రాస్త్రంబుగాని; వాయవ్యం= వాయవ్యాస్త్రముగాని;

తథా= అట్లు; వారుణం= వారుణాస్త్రముగాని; సంయుగే=యుద్ధమునందు; దుర్నిరీక్షాణి= చూడఁగూడనట్టి; శక్రజితః= ఇంద్రజిత్తుయొక్క; అస్త్రాణి=అస్త్రములు; (ఆగచ్ఛంతి) యది= వచ్చునేని; తాని=వానిని; అహం= నేను; విధమిష్యామి= కొట్టివేసెదను. రాక్షసాంశ్చ=రాక్షసులను;హనిష్యామి= చంపెదను.

ఇంద్రజిత్తుయుద్ధంబునఁ, దేవతలచూడనలవిగానట్టి, బ్రహ్మాస్త్రమునుగాని, మాహేంద్రాస్త్రంబునుగాని రౌద్రాస్త్రంబునుగాని,వాయవ్యాస్త్రంబునుగాని,వారుణాస్త్రంబునుగాని, ప్రయోగించినను, నేనాయస్త్రంబులన్నింటినిఁగొట్టివేసి, రాక్షసులఁజంపెదను.

అని, తాత్పర్యము

భవతా మభ్యనుజ్ఞాతో విక్రమో మే రుణద్ధి తమ్. ౧౧

టీక॥ భవతాం=మీయొక్క; అనుజ్ఞాతః=అనుజ్ఞవలన; మే=నాయొక్క; విక్రమః=పరాక్రమము; తం =ఆయింద్రజిత్తును; రుణద్ధి=అడ్డగించుచున్నది.

మీరు, అనుజ్ఞయొసంగినచోఁ;పరాక్రమంబున, నాయింద్రజిత్తును గూడజయింపఁగలను. అని, తాత్పర్యము.

మయాతులా విసృష్టా హి శైల వృష్టి ర్నిరంతరా
దేవానపి రణే హన్యా త్తాం పునస్తా న్నిశాచరాన్. ౧౨

టీక॥ రణే= యుద్ధంబునందు; మయా=నాచేత; విసృష్టా= విడువఁబడిన; నిరంతరా=అవకాశములేని,దట్టమయినయనుట;అతులా= సరిలేని; శైలవృష్టిః=పర్వతవర్షము;దేవానపి=దేవతలనైనను;హన్యాత్=చంపును. తాన్= ఆ; నిశాచరాన్= రాక్షసులను; హన్యాదితి (అధ్యాహృతము) = చంపునని; కింపునః(వక్తవ్యం) = చెప్పఁబడవలయునామేమి?

యుద్ధంబున, నేను గురిపించునట్టి సాంద్రంబగుశైలవర్షముచే నమృతంబుద్రావియున్న దేవతలైనను బ్రాణంబులువిడుతురు,ఇంకనీరాక్షసులుచత్తురనిచెప్పనేల?

అని, తాత్పర్యము.

సాగరో ప్యతియా ద్వేలాం మందరః ప్రచలేదపి
న జాంబవంతం సమరే కంపయే దరివాహినీ. ౧౩

టీక॥ సాగరోపి=సముద్రంబైనను; వేలాం=చెలియలికట్టను;అతియాత్(అతీయాత్)=అతిక్రమించును ; మందరోపి=మందరపర్వతంబైనను;ప్రచలేత్=చలించును; జాంబవంతం= జాంబవంతుని; అరివాహినీ=శత్రుసైన్యము; సమరే=యుద్ధమునందు; నకంపయేత్=కదలింపజాలదు.

ఒకవేళసముద్రంబుచెలియలికట్టనతిక్రమించినను, అతిక్రమించును;మందరపర్వతంబైనను జలనంబునొందును ; జాంబవంతుండెంతమాత్రమును,శత్రుసైన్యంబునకుఁజెనకఁడు.

అని,తాత్పర్యము.

సర్వరాక్షససంఘానాం రాక్షసా యేచ పూర్వకాః
అల మేకో వినాశాయ వీరో వాలిసుతః కపిః. ౧౪

టీక॥ సర్వరాక్షససంఘానాం=సమస్త రాక్షస సమూహములయొక్కయు;పూర్వజాః= మొదటివారగు;రాక్షసాః= రాక్షసులు;యే=ఎవ్వరో;తేషాం(అధ్యాహృతము) చ=వారలయొక్కయు; వినాశాయ= నాశముకొఱకు; వీరః=పరాక్రమవంతుండును; వాలిసుతః=వాలిపుత్రుండునగు;కపిః=వానరుఁడయిన యంగదుండు ; ఏకః = ఒక్కఁడు; అలం=చాలును.

రాక్షససైన్యంబులనన్నింటిని , వారలలోముఖ్యులగువారలనందఱనుజంపుటకు, వీరుండగువాలికుమారుండంగదుండొకండె,చాలును.

పనసస్యోరువేగేన నీలస్యచ మహాత్మనః
మందరోప్య వశీర్యేత కింపున ర్యుధి రాక్షసాః. ౧౫

టీక॥ పనసస్య = పనసునియొక్కయు; మహాత్మనః=మహాబలుండగు;నీలస్యచ=నీలునియొక్కయు;ఊరువేగేన=తొడలవేగముచేత; మందరోపి=మందరపర్వతంబుగూడ ; అవశీర్యేత=పగులును. యుధి=యుద్ధమునందు; రాక్షసాః=రాక్షసులు ; అవశీర్యేరన్నితి(అధ్యాహృతము)=నశింతురని ; కింపునః

(వక్తవ్యం)=చెప్పఁబడవలయును? మహాబలశాలులగుపనసనీలులయూరువేగంబున, మందరపర్వతంబైనను శించును; ఇంకనీ రాక్షసులువధింపఁబడుదురని చెప్పనేల!

అని, తాత్పర్యము.

సదేవాసురయక్షేషు గంధర్వోరగపక్షిషు
మైందస్య ప్రతియోద్ధారం శంసత ద్వివిదస్య వా. ౧౬

టీక॥ సదేవాసురయక్షేషు=దేవతలతోను అసురులతోను యక్షులతోనుం గూడిన; గంధర్వోరగపక్షిషు = గంధర్వులయందును సర్పములయందును బక్షులయందును; మైందస్య= మైందునకుఁగాని; ద్వివిదస్యవా=ద్వివిదునకుఁగాని; ప్రతియోద్ధారం = ప్రతిభటుని ; శంసత = చెప్పుఁడు.

దేవతలయందుఁ గాని యసురులయందుఁగాని యక్షులయందుఁ గాని గంధర్వులయందుఁగాని సర్పములందుగాని పక్షులయందుఁగాని, మైందద్వివిదులతోసరిగాఁబోరువాఁ డెవ్వఁడు? వచింపుఁడు. అని, తాత్పర్యము.

అశ్విపుత్రౌ మహాభాగా వేతౌ ప్లవగసత్తమా
ఏతయోః ప్రతియోద్ధారం నపశ్యామి రణాజిరే. ౧౭

టీక॥ఏతౌ= ఈ; ప్లవగసత్తమా = వానరశ్రేష్ఠులగుమైందద్వివిదులు; అశ్విపుత్రౌ= అశ్వినీదేవతలకొడుకులు. మహాభాగౌ= పూజ్యమయినభాగ్యముగలవారలు. రణాజిరే = యుద్ధభూమియందు; ఏతయోః=వీరలకు; ప్రతియోద్ధారం=ప్రతిభటుని ; నపశ్యామి = చూడకున్నాను.

వానరశ్రేష్ఠులగునీమైందద్వివిదులు, అశ్వినీదేవతలకుఁబుట్టినవారలు; మహాభాగులు; యుద్ధభూమియందు, వీరలతోసరిగాఁబోరువారలెవ్వరును లేరు.

అని, తాత్పర్యము-

పితామహవరోత్సేకా త్పరమం దర్ప మాస్థితౌ
అమృతప్రాశినా వేతౌ సర్వవానరసత్తమా. ౧౮

టీక॥ఏతౌ=ఈమైందద్వివిదులు; పితామహవరోత్సేకాత్= బ్రహ్మదేవుని వరముయొక్క-యతిశయముచే వలన; పరమం=మిక్కి-లియునధికమయిన;దర్పం=గర్వమును;ఆస్థితౌ=పొందినవారలు.అమృతప్రాశినౌ= అమృతంబుభుజించినవారలు. సర్వవానరసత్తమౌ= సమస్తవానరులలోను శ్రేష్ఠులు.

ఈమైందద్వివిదు లిద్దఱును, బ్రహ్మదేవునివరంబునొందియతి గర్వితులయి యున్నవారు;మఱియు,నమృతంబునుం గూడ భుజించియున్నవారు; వానరుల యందఱిలోను శ్రేష్ఠులు.

అని, తాత్పర్యము.

అశ్వినో ర్మానదార్థం హి సర్వలోకపితామహః
సర్వావధ్యత్వ మతుల మనయో ర్దత్తవాన్ పురా. ౧౯

టీక॥సర్వలోకపితామహః=బ్రహ్మదేవుండు;పురా=మున్ను; అశ్వినోః=అశ్వినీదేవతలయొక్క-; మానార్థం=గౌరవించుటకొఱకు; అనయోః= ఈమైందద్వివిదులకు;అతులం=సరిలేని; సర్వావధ్యత్వం= అందఱిచేతనువధింపఁగూడకుండుటను; దత్తవాన్ హి=ఇచ్చినాఁడుగదా!

బ్రహ్మదేవుండు,మున్ను, ఈమైందద్వివిదులతండ్రులగునశ్వినీదేవతలకుసంతోషంబుగల్గుటకై, ఈమైందద్వివిదులకు,ఎవ్వరిచేతనైనఁజంపుటకలవిగాకుండునట్లు, వరంబొసంగెను,

అని, తాత్పర్యము.

వరోత్సేకేన మత్తౌ చ ప్రమథ్య మహతీం చమూమ్
సురాణా మమృతం వీరౌ పీతవంతౌ ప్లవంగమౌ. ౨౦

టీక॥ వీరౌ=పరాక్రమవంతులగు; ప్లవంగమౌ= వానరులగు మైందద్వివిదులు; వరోత్సేకేన= వరాతిశయముచేత;మత్తౌచ=గర్వించినవారలునై; మహతీం=గొప్పదగు; చమూం = సైన్యమును; ప్రమథ్య=కొట్టి; సురాణాం=దేవతలయొక్క-; అమృతం = అమృతమును; పీతవంతౌ= త్రాగినారు.

పరాక్రమవంతులగు నీమైంద ద్వివిదులు, అట్లువరగర్వంబున , మదించి, యెదురులేక, గొప్పసేనలంజించి చెండాడి , దేవతల యమృతంబులఁ

ద్రావినారు. అని, తాత్పర్యము.

ఏతావేవ హి సంక్రుద్ధౌ సవాజిరథకుంజరామ్
లంకాం నాశయితుం శక్తౌ సర్వే తిష్ఠంతు వానరాః. ౨౧

టీక॥ ఏతావేవ = వీరలుమాత్రమె; సంక్రుద్ధౌ=కోపమునొందినవారలై; సవాజిరథకుంజరాం=గుఱ్ఱములతోను రథములతోను ఏనుంగులతోనుంగూడిన; లంకాం=లంకను; నాశయితుం=నాశమునొందించుటకు; శక్తౌ=సమర్థులు. వానరాః=వానరులు; సర్వే=అందఱును; తిష్ఠంతు=ఉందురుగాక.

వానరులనందఱనట్లుండనిమ్ము; ఈ మైందద్వివిదులిద్దఱే, కుపితులయి, రావణసైన్యంబులనన్నింటినిఁజంపి, లంకాపురినంతయునాశంబునొందింపంజాలుదురు. అని, తాత్పర్యము.

మయైవ నిహతా లంకా దగ్ధా భస్మీకృతా పునః
రాజమార్గేషు సర్వత్ర నామ విశ్రావితం మయా. ౨౨

టీక॥ లంకా= లంకాపట్టణము; మయైవ=నాచేతనె; నిహతా=కొట్టఁబడినదై; దగ్ధా = దహింపఁబడినదై; పునః=ఇంకను; భస్మీకృతా= బూడిదగాఁజేయబడినది. మయా=నాచేత; రాజమార్గేషు=రాజమార్గంబులందు; సర్వత్ర= అంతయును; నామ=పేరు; విశ్రావితం=వినిపింపఁబడినది.

నేనే, లంకాపట్టణంబంతయు దహించి బూడిదగాఁజేసితిని; రాజమార్గంబులందంతటను, పేరు, అందఱికిఁదెలియునట్లు, చాటించినాను. అని, తాత్పర్యము.

జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః
రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః. ౨౩
అహం కోసలరాజస్య దాసః పవనసంభవః
హనుమానితి సర్వత్ర నామ విశ్రావితం మయా. ౨౪

టీక॥ అతిబలః = అధికమయినబలముగల; రామః=రాముఁడు;జయతి=సర్వోత్కర్షముగనున్నాఁడు.మహాబలః=అధికమయినబలముగల ; లక్ష్మణశ్చ= లక్ష్మణుండును ; జయతి(అధ్యాహృతము)=సర్వోత్కర్షణంబునను న్నాఁడు. రాజా = వానరరాజుండును; రాఘవేణ=రామునిచేత ; అభిపాలితః = పాలింపఁ బడినవాఁడు నగు ; సుగ్రీవః=సుగ్రీవుఁడు;జయతి=సర్వోత్కర్షంబునను న్నాఁడు.అహం=నేను ; కోసలరాజస్య= కోసలదేశపురాజయినరామునియొక్క; దాసః=దాసుండను. పవనసంభవః=వాయుదేవునివలనఁబుట్టినవాఁడను. హనుమాన్ = హనుమంతుండను పేరుగలవాఁడను. ఇతి=అని;సర్వత్ర=అంతటను; మయా= నాచేత; నామ=పేరు; విశ్రావితం=వినిపింపఁబడినది.

మహాబలుండగు రాముండు సర్వోత్కృష్టుండై యున్నాఁడు ; మహాబలుండగులక్ష్మణుండును సర్వోత్కృష్టుండై యున్నాఁడు ; వానరరాజుండును రామునిచేఁ గాపాడఁబడుచున్న వాఁడును గు సుగ్రీవుండును, సర్వోత్కృష్టుండై యున్నాఁడు; నేనుగోసలదేశ రాజుండగురామునకు దాసుండను; వాయుపుత్రుండను; హనుమంతుండను పేరుగలవాఁడను;అని, లంకయందంతటను పేరుఁజాటించితిని.

అని,తాత్పర్యము.

అశోకవనికామధ్యే రావణస్య దురాత్మనః
అధస్తాచ్ఛింశుపావృక్షే సాధ్వీ కరుణ మాస్థితా. ౨౨
రాక్షసీభిః పరివృతా శోకసంతాపకర్శితా
మేఘలేఖాపరివృతా చంద్రలేఖేవ నిష్ప్రభా. ౨౬
అచింతయంతీ వైదేహీ రావణం బలదర్పితమ్

టీక॥ సాధ్వీ=పతివ్రతయగు; వైదేహీ=సీతాదేవి;దురాత్మనః= దుష్టబుద్ధిగలరావణస్య= రావణునియొక్క ; అశోకవనికామధ్యే=అశోకవనంబునడుమను; శింశుపావృక్షే= శింశుపావృక్షమునందు; అధస్తాత్ =క్రిందను; రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత; పరివృతా=చుట్టఁబడినదై; శోకసంతాప క

ర్శితా=దుఃఖముచేతనుసంతాపముచే తనుకృశింపఁజేయఁబడినదై; మేఘలేఖాపరివృతా—మేఘపఙ్క్తిచేఁ గప్పఁబడిన; నిష్ప్రభా=కాంతిలేని; చంద్రలేఖేవ (స్థితా)= చంద్రలేఖవలెనున్నదై; బలదర్పితం=బలముచే గర్వించిన; రావణం=రావణుని; అచింతయంతీ=తలంపనిదై; కరుణం—దుఃఖముగల్గునట్లు; ఆస్థితా=ఉన్నది.
పతివ్రతయగు సీతాదేవి, దురాత్ముండగురావణుని యశోకవనంబున, శింశుపావృక్షంబుక్రింద, రాక్షసస్త్రీల నడుమ, దుఃఖసంతాపంబులం బొఱలుచుఁ, గృశించి, మేఘావృతంబగుచంద్రరేఖవలెఁగాంతిహీనయై, బలగర్వితుండగు రావణునిమనసునసైనందలంపక, రామునే ధ్యానింపుచునుండుటం జూడఁగా, మిక్కిలియు దుఃఖము గలుగుచున్నది. అని, తాత్పర్యము.

పతివ్రతాచ సుశ్రోణీ అవష్టబ్ధాచ జానకీ. ౨౭
అనురక్తాహి వైదేహీ రామం సర్వాత్మనా శుభా
అనన్యచిత్తా రామేచ పౌలోమీవ పురందరే. ౨౮

టీక॥పతివ్రతాచ=పతివ్రతయు; సుశ్రోణీచ = సుందరములగుపిఱుఁదులుగలదియునగు; జానకీ=సీతాదేవి; అవష్టబ్ధా = నిరోధింపఁబడియున్నది. శుభా=మంగళకరియగు; వైదేహీ=సీతాదేవి; సర్వాత్మనా=సమస్తమయినమనసుచేతను; రామం=రామునిగూర్చి; అనురక్తాహి= అనురాగముగలదిగదా. పురందరే=ఇంద్రునందు; పౌలోమీవ — శచీదేవివలె; రామే = రామునందు; అనన్యచిత్తాచ = ఇతరులయందుమనసులేనిదియు; భవతి (అధ్యాహృతము)— అగుచున్నది.

పతివ్రతయు సుందరములగు పిఱుఁదులుగలదియునగు సీతాదేవి, రావణునిచేనెంతనిర్బధింపఁబడినను, మనసునంతయునేకరీతిగా రామునందెచేర్చియతనియందె యను రాగము గల్గియున్నది; మఱియునహుషుండెంతనిర్బంధించినను, శచీదేవి, యతనిపైమనసునుంచనట్లు, రావణుండెంత నిర్బంధించినమును, సీతాదేవి, యతనిపైనెంతమాత్రమనసునుంచక, యితరంబువిడిచి, మనంబున, రామునేధ్యానింపుచున్నది.
అని, తాత్పర్యము.

తదేకవాసస్సంవీతా రజోధ్వస్తా తథైవచ
శోకసంతాపదీనాంగీ సీతా భర్తృహితే రతా. ౨౯

టీక॥ సీతా=సీతాదేవి ; తదేకవాసస్సంవీతా= ఆయొక్క వస్త్రముచేత చుట్టఁబడినదై ;రజోధ్వస్తా = పరాగముచేధ్వంసమునొందినదై ; తథైవచ=అట్లే; శోకసంతాపదీనాంగీ=దుఃఖముచేతను సంతాపముచేతను దైన్యమునొందిన యవయవములుగలదై;భర్తృహితే= పెనిమిటిమేలునందు ; రతా=ఆసక్తురాలై ; అస్తి(అధ్యాహృతము)=ఉన్నది.

సీతాదేవి, యొకవస్త్రమునె విడువకగట్టుకొని , దేహమంతయుదుమ్మునిండఁ, బరమదుఃఖితయయి, భర్తృహితంబుఁగోరుచున్నది.

అని, తాత్పర్యము.

సా మయా రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః
రాక్షసీభి ర్విరూపాభి ర్దృష్టా హి ప్రమదావనే ౩౦
ఏకవేణీధరా దీనా భర్తృచింతాపరాయణా
అధశ్శయ్యావివర్ణాంగీ పద్మినీవ హిమాగమే. ౩౧
రావణా ద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా

టీక॥మయా = నాచేత; ప్రమదావనే=అశోకవనమునందు ; రాక్షసీమధ్యే=రాక్షసస్త్రీలనడుమను ; విరూపాభిః = వికృతాకారులగు; రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత ; ముహుర్ముహుః=మాటిమాటికి;తర్జ్యమానా=బెదరింపఁబడుచున్నదియు ; ఏకవేణీధరా = ఒకజెడనుధరించినదియు; దీనా=దైన్యమునొందినదియు; భర్తృచింతాపరాయణా=పెనిమిటియొక్కచింతించుటయె ముఖ్యగతిగాఁ గలదియు; అధశ్శయ్యావివర్ణాంగీ= నేలయందుఁబరుండుటచేఁ దెల్లఁబాఱిన దేహముగలదియు; హిమాగమే= హేమంతర్తువుయొక్క వచ్చుటయందు; పద్మినీవ(స్థితా)= కమలసమూహమువలెనున్నదియు; రావణాత్ = రావణునియొద్దనుండి, వినివృత్తార్థా=మఱలి

నచిత్తవృత్తిగలదియు ; మతతావ్యక్తనిశ్చయా= చావవలెనని చేయఁబడిన నిశ్చయముగలదియునగు ; సా=ఆసీతాదేవి; దృష్టాహి = చూడఁబడినది గదా!

నేను, సీతాదేవి, రావణునియశోకవనంబున, రాక్షసస్త్రీలనడుమ వికృతాకారలగు రాక్షసస్త్రీలచే బెదరింపబడుచు, నొక్కజడగాఁగట్టినదల వెంట్రుకలతో, దైన్యంబునొంది, మనంబునఁ బెనిమిటయగు రామునే ధ్యానించుచు, నేలంబరుండుటచేఁ దెల్లఁదాలిన దేహంబుగల్గి, హేమంతఋతువునందలిపద్మినివలెఁ గాంతిహీనయయి, రావణునియందు మనంబు సేర్పక, మరణంబునొందనిశ్చయించియుండునప్పుడు, చూచితిని గదా. అని, తాత్పర్యము.

కథంచి న్మృగశాబాక్షీ విశ్వాస ముపపాదితా. ౩౨

టీక॥ మృగశాబాక్షీ = జింకపిల్లయొక్కకండ్లవంటికండ్లుగలసీతాదేవి; కథంచిత్=అతిప్రయాసమున; విశ్వాసం= నమ్మకమును; ఉపపాదితా = పొందింపఁబడినది.

జింకపిల్లకుంబోలె నేత్రంబులుగలయాసీతాదేవికి, అతిప్రయాసమున "నేను రాముండుపంపఁగావచ్చినదూత" అని, చెప్పి, నమ్మకంబుగలిగించినాను.

అని, తాత్పర్యము.

తత స్సంభాషితా చైవ సర్వ మర్థంచ దర్శితా
రామసుగ్రీవసఖ్యంచ శ్రుత్వా ప్రీతి ముపాగతా. ౩౩

టీక॥ తతః=అటుపిమ్మట;సీతా(అధ్యాహృతము)=సీతాదేవి ; సంభాషితా చైవ= మాటలాడఁబడినదియు. సర్వం=సమస్తమయిన ; అర్థంచ=సమాచారమును;దర్శితా= తెలుపఁబడినది. రామసుగ్రీవసఖ్యంచ= రామసుగ్రీవులస్నేహమును ; శ్రుత్వా=విని; ప్రీతిం=సంతోషమును; ఉపాగతా=పొందినది.

అంత, నేనాబిడతో మాటలాడి, సమాచారంబంతయుఁ జెప్పితిని; ఆబిడ, రామునకునుసుగ్రీవునకును స్నేహంబు కలుగుటనువిని, సంతోషంబునొందినది.

అని, తాత్పర్యము.

నియత స్సముదాచారో భక్తి ర్భర్తరి చోత్తమా

టీక॥ సీతాయాః(అధ్యాహృతము)= సీతకు; సముదాచారః=సదాచారము; నియతః=నిత్యము; భర్తరి=పెనిమిటి యందు;భక్తిశ్చ = భక్తియును; ఉత్త మా=మిక్కిలియునధికము.

సీతయందు, సదాచారమునిత్యము గానున్నది; భర్తయందు త్తమమయిన భక్తిగలదు. అని, తాత్పర్యము.

య న్నహంతి దశగ్రీవం స మహాత్మా కృతాగసమ్. ౩౪

టీక॥సా(అధ్యాహృతము)= ఆసీతా దేవి;యత్ =ఏకారణమువలన;కృతాగ సం=చేయఁబడినయపరాధముగల;దశ గ్రీవం=రావణుని; నహంతి= చంపకు న్నదో;తత్(అధ్యాహృతము)= అందు వలన;సః=ఆరావణుఁడు;మహాత్మా= మహానుభావుఁడు.

రావణుండు మహాపరాధము గావించినను, సీతాదేవియతనింజంపివేయ కున్నది గావున,నా రావణుండు, మహానుభావుఁడు.

అని, తాత్పర్యము.

నిమిత్తమాత్రం రామస్తు వధే తస్య భవిష్యతి

టీక॥ రామస్తు=రాముండుమాత్ర ము; తస్య=ఆరావణుని యొక్క; వధే= చంపుటయందు;నిమిత్తమాత్రం=నిమి త్తమాత్రము; భవిష్యతి=కాఁగలఁడు.

ఆరావణుఁ తపస్సంతయు, సీతా దేవినినిబంధించుటచేతనే నశించియు న్నది; ఇంక,నతనింజంప, రాముండు ని మిత్తమాత్రముగానుండవలసినదే కాని యెంతమాత్రముకష్టము లేదు-

అని, తాత్పర్యము.

సా ప్రకృత్యైవ తన్వంగీ తద్వియోగాచ్చ కర్శితా. ౩౫
ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా

టీక॥ప్రకృత్యైవ= స్వభావముచే తనే; తన్వంగీ=కృశించిన దేహముగల దగు; సా=ఆసీతాదేవి; తద్వియోగా చ్చ= ఆరామవియోగంబువలనను; క

శీర్ణతా=కృశింపఁజేయఁబడినదై; ప్రతిపత్పాఠశీలస్య=పాడ్యమియందుఁజదువుస్వభావము గలవానియొక్క; విద్యేవ=విద్యవలె;తనుతాం=కృశత్వమును; గతా=పొందినది.

స్వభావంబుననేకృశాంగియగు నా సీతాదేవి, యీ యువియోగంబున, మఱియుంగృశయయ్యు, పాడ్యమినాఁడుచదువువాని విద్యక్షీణించునట్లు, కృశించియున్నది. అని, తాత్పర్యము.

ఏవ మాస్తే మహాభాగా సీతా శోకపరాయణా. ౨౬

టీక॥ మహాభాగా= పూజ్యమయినభాగ్యముగల; సీతా=సీతాదేవి; ఏవం=ఇట్లు; శోకపరాయణా=దుఃఖమేముఖ్యమయినగతిగాఁగలదై;ఆస్తే= ఉన్నది.

మహాభాగురాలగు సీతాదేవి, యీప్రకారము, పరమదుఃఖితయయియున్నది. అని, తాత్పర్యము.

యదత్ర ప్రతికర్తవ్యం తత్సర్వ ముపపద్యతామ్

టీక॥అత్ర=ఈవిషయమందు; యత్=ఏది;ప్రతికర్తవ్యం = బదులుచేయఁబడవలసినదో;తత్=అది;సర్వం=అంతయు;ఉపపద్యతాం=చేయఁబడుఁగాక.

ఇంకదీనికి,ఏమి ప్రతికారంబుసేయవలయునో,దానినంతయుఁజేయుఁడు, అని,హనుమంతుండు, వానరులకుం జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ఏకోనషష్టితమస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది,పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు,సుందరకాండైకోనషష్టితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

## షష్టితమసర్గప్రారంభః.

తస్య తద్వచనం శ్రుత్వా వాలిసూను రభాషత

టీక ॥ తస్య=ఆహనుమంతునియొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; వాలిసూనుః = వాలికుమారుండగునంగదుండు; అభాషత = చెప్పెను.

ఆహనుమంతునిమాటనువిని, వాలికుమారుండగునంగదుండు, ఇట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

అయుక్తంతు వినాదేవీం దృష్టవద్భిశ్చ వానరాః. ౧
సమీపం గంతు మస్మాభీ రాఘవస్య మహాత్మనః

టీక॥వానరాః=వానరులారా! దృష్టవద్భిశ్చ= (సీతను)జూచినవారలమగు; అస్మాభిః=మనచేత; దేవీంవినా=సీతనువిడిచి; మహాత్మనః= అధికమయినపరాక్రమముగల; రాఘవస్య= రామునియొక్క; సమీపం = సమీపమును; గంతుం = పొందుటకు మాత్రము; అయుక్తం=యుక్తముకాదు.

వానరులారా! మనము సీతాదేవిం జూచియు, నావిడనుదీసికొనక, మహాత్ముండగు రామునొద్దకుంబోవుటమాత్రము, యుక్తముకాదు.

అని, తాత్పర్యము.

దృష్టా దేవీ నచానీతా ఇతి తత్ర నివేదనమ్. ౨
అయుక్తమివ పశ్యామి భవద్భిః ఖ్యాతవిక్రమైః

టీక॥ ఖ్యాతవిక్రమైః= ప్రసిద్ధమగు పరాక్రమముగల; భవద్భిః= మీచేత; "దేవీ=సీతాదేవి; దృష్టా=చూడఁబడినది. నచానీతా=తీసికొనిరాఁబడలేదు" ఇతి=అని; తత్ర=అచ్చట; నివేదనం=చెప్పటను; అయుక్తం = యుక్తముకానిదానిఁగా; ("ఇవ" అనునది వాక్యాలంకారార్థము) పశ్యామి= చూచుచున్నాను.

మీరలు, మహాపరాక్రమశాలురని

వినుతికెక్కి, యిప్పుడు, "సీతాదేవిం బూచితిమిగాని, యిచ్చటికిఁదీసికొనిరాలేదు" అని, రామసన్నిధానంబునం జెప్పుట, యుక్తముకాదని, నాకుండోఁచుచున్నది. అని, తాత్పర్యము.

న హి నః ప్లవనే కశ్చి న్నాపి కశ్చి త్పరాక్రమే. ౩
తుల్య స్సామరదైత్యేషు లోకేషు హరిసత్తమాః

టీక॥ హరిసత్తమాః=వానరశ్రేష్ఠులారా! సామరదైత్యేషు=దేవతలతోను దైత్యులతోనుంగూడిన; లోకేషు=లోకములందు; నః=మనకు; తుల్యః=సమానుఁడు; ప్లవనే=ఎగురుటయందు; కశ్చిత్=ఒకానొకఁడును; నహి=లేదుగదా! పరాక్రమేపి=పరాక్రమమందును; కశ్చిత్=ఒకఁడును; న=లేఁడు.

వానరశ్రేష్ఠులారా! దేవతలయందుఁగాని దైత్యులయందుఁగాని, యిట్టిసమస్తలోకంబులందును, ఆకాశగమనంబునందుఁగాని పరాక్రమంబునంగాని, మనకుసమానుండెవ్వండును లేఁడు.

అని, తాత్పర్యము.

తేష్వేవం హతవీరేషు రాక్షసేషు హనూమతా. ౪
కిమన్య దత్ర కర్తవ్యం గృహీత్వా యామ జానకీమ్

టీక॥ తేషు=ఆ; రాక్షసేషు=రాక్షసులు; ఏవం=ఇట్లు; హనూమతా=హనుమంతునిచేత; హతవీరేషు=చంపఁబడినవీరులుగలవారలగుచుండఁగా; అత్ర=ఇందు; అన్యత్=ఇతరమయినది; కిం=ఏమి; కర్తవ్యం=చేయఁబడవలసినది? జానకీం=సీతను; గృహీత్వా=తీసికొని; యామ=పోవుదము.

ఇట్లు, హనుమంతుండు, ఆరాక్షసులలోవీరులగు వారినందఱుంజంపినవెనుక, మనకింకేమిచేయవలసియున్నది; సీతాదేవిందీసికొనిపోవుదము. అని, యంగదుండుచెప్పెను.

అని, తాత్పర్యము.

తమేవం కృతసంకల్పం జాంబవాన్ హరిసత్తమః. ౫
ఉవాచ పరమప్రీతో వాక్య మర్థవ దర్థవిత్

టీక॥ అర్థవిత్ = కార్యముల నెఱింగినవాఁడును; హరిసత్తమః = వానరశ్రేష్ఠుండునగు; జాంబవాన్ = జాంబవంతుండు; పరమప్రీతః = మిక్కిలియు సంతోషమునొందినవాఁడై; అర్థవత్ = అధికమయినయర్థముగల; వాక్యం = మాటను; ఉవాచ = చెప్పెను.

కార్యోపాయంబుల నెఱింగిన వాఁడును, వానరశ్రేష్ఠుండునగు జాంబవంతుండు, అంగదునిమాటనువిని, పరమసంతుష్టుండై, యర్థికార్థంబగునీ మాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

న తావ దేషా మతి రక్షమా నో
యథా భవా న్పశ్యతి రాజపుత్ర. ౬
యథాతు రామస్య మతి ర్నివిష్టా
తథా భవా న్పశ్యతు కార్యసిద్ధిమ్

టీక॥ రాజపుత్ర = రాచకొమరుండవగునంగదుఁడా! భవాన్ = నీవు; యథా = ఎట్లు; పశ్యతి = చూచుచున్నావో; ఏషా = ఈ; మతిః = ఆలోచనము; నః = మాకు; అక్షమా = అయుక్తమయినది. న తావత్ = కానేకాదు. యథా = ఎట్లు; రామస్య = రామునియొక్క; మతిః = ఆలోచనము; నివిష్టా = ఉన్నదో; తథాతు = అట్లే; భవాన్ = నీవు; కార్యసిద్ధిం = కార్యముయొక్క నెఱవేఱుటను; పశ్యతు = చూడుము.

రాజపుత్రుండవగు నంగదుఁడా! నీవాలోచించినది, మాకును, యుక్తముగానేతోఁచుచున్నది; అయినను, మనముసమర్థులమయినను, రామాజ్ఞననుసరించియేకదా ప్రవర్తింప వలయును; కావున, నతండు, ఎట్లు, ఆజ్ఞాపించెనో, ఆప్రకారము, కార్యసిద్ధియగునట్లు, సేయుము. అని, జాంబవంతుండు, అంగదునకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, షష్టితమస్సర్గః.

ఇదిస్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, సుందరకాండసష్టితమసర్గటీక, ముగిసినది.



శ్రీః

ఏకషష్టితమసర్గప్రారంభః.

తతో జాంబవతో వాక్య మగృహ్ణంత వనౌకసః
అంగదప్రముఖా వీరా హనుమాంశ్చ మహాకపిః. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; అంగదప్రముఖాః= అంగదుఁడుమున్నగాఁగల; వీరాః= పరాక్రమవంతులగువానరులును; మహాకపిః= పెద్దకోఁతియగు; హనుమాంశ్చ=హనుమంతుండును; వనౌకసః= ఇతరవానరులును; జాంబవతః= జాంబవంతునియొక్క; వాక్యం-మాటను; అగృహ్ణంత= గ్రహించిరి.

అంత, నంగదుండుమున్నగువీరవానరులును, హనుమంతుండును, ఇతరవానరులును, జాంబవంతుండు చెప్పినమాటకు సమ్మతించిరి.

ఇది, తాత్పర్యము.

ప్రీతిమంత స్తత స్సర్వే వాయుపుత్రపురస్సరాః
మహేంద్రాద్రిం పరిత్యజ్య పుప్లువుః ప్లవగర్షభాః. ౨
మేరుమందరసంకాశా మత్తా ఇవ మహాగజాః
ఛాదయంత ఇవాకాశం మహాకాయా మహాబలాః. ౩
సభాజ్యమానం భూతైస్త మాత్మవంతం మహాబలమ్
హనుమంతం మహావేగం వహంత ఇవ దృష్టిభిః. ౪
రాఘవే చార్థనిర్వృత్తిం కర్తుంచ పరమం యశః
సమాధాయ సమృద్ధార్థాః కర్మసిద్ధిభి రున్నతాః. ౫

ప్రియాఖ్యానోన్ముఖాస్సర్వే సర్వేయుద్ధాభినందినః
సర్వే రామప్రతీకారే నిశ్చితార్థా మనస్వినః. ౬

టీక॥తతః=అటుపిమ్మట; ప్రీతిమంతః=అధికమయిన సంతోషము గలవారలును; మేరుమందరసంకాశాః = మేరుపర్వతముతోను మందరపర్వతముతోను సమానులును; మత్తాః=మదించిన; మహాగజాఇవ (స్థితాః)=పెద్దయేనుంగులువలెనున్నవారలును; ఆకాశం = ఆకాశమును ; ఛాదయంతఇవ (స్థితాః)=కప్పుచున్నట్లున్నవారలును; మహాకాయాః= పెద్దశరీరముగలవారలును; మహాబలాః= అధికమయినబలముగలవారలును; భూతైః= భూతంబులచేత; సభాజ్యమానం=పూజింపఁబడుచున్నవాఁడును; ఆత్మవంతం=అధికమయినధైర్యముగలవాఁడును ; మహాబలం=అధికమయినబలముగలవాఁడును; మహావేగం=అధికమయిన వేగముగలవాఁడునగు; తం=ఆ; హనుమంతం = హనుమంతుని; దృష్టిభిః=చూపులచేత; వహంతఇవ (స్థితాః)= మోయుచున్నట్లున్నవారలును; రాఘవే= రామునందు; అర్థనిర్వృత్తిం = కార్యసిద్ధిని; పరమం=మిక్కిలియునధికమయిన ; యశశ్చ=కీర్తిని; కర్తుం= చేయుటకు;సమాధాయ=నిశ్చయించి; స్థితాః (అధ్యాహృతము)=ఉన్నవారలును; సమృద్ధార్థాః= సిద్ధమగుకార్యముగలవారలును; కర్మసిద్ధిభిః= కార్యసిద్ధులచేత ; ఉన్నతాః=అధికులును;సర్వే= అందఱు ; ప్రియాఖ్యానోన్ముఖాః = సంతోషవార్తయొకట-చెప్పుట కభిముఖులును; సర్వే=అందఱు ; యుద్ధాభినందినః=యుద్ధమును గొనియాడువారలును; సర్వే=అందఱు ; రామప్రతీకారే= రామునకుఁ బ్రత్యుపకారముసేయుటయందు; నిశ్చితార్థాః = నిశ్చయమునొందిన మనోవృత్తిగల వారలును; మనస్వినః=మంచిమనస్సుగలవారలును; వాయుపుత్రపురస్సరాః= వాయుదేవుని కుమారుండగు హనుమంతుండెముందునడచువాఁడుగాఁ గలవారలునగు; ప్లవగర్షభాః = వానరశ్రేష్ఠులు; సర్వే=అందఱును; మహేంద్రాద్రిం=మహేంద్రపర్వతమును; పరిత్యజ్య=విడిచి; పుప్లువుః=ఎగిరిరి.

అంతఁబరగమసంతుష్టులును మేరుమందరాకారులును మత్తంబులగుమహాగజంబులుంబోలెనున్నవారలును, మహాకా

యులును మహాబలశాలులును, ఆకాశంబునాచ్ఛాదించుపగిదింజూపట్టుచు, సర్వభూతనమస్కృతుండు, మహాధైర్యశాలియును మహాబలశాలియు మహావేగుండగు హనుమంతు ననిమేష దృష్టులంజూచుచు, రామకార్యంబు సాధించి పరమంబగు యశస్సును సంపాదింపఁ దలంపుగొనియున్నవారలును, కృతార్థులును కార్యసిద్ధి గలిగియుండుటం జేసి యితర వానరులకన్న నధికులును, అందఱు రామునకు సీతాదర్శన ప్రియవార్తం జెప్ప సహామహామికచే నభిముఖులై, అందఱు నుయుద్ధకాంక్షులై, అందఱు రామునకుం బ్రత్యుపకారంబు సేయ నిశ్చయించియున్నవారలును, మంచి మనస్సుగలవారలునగు, హనుమంతుండు మొదలగు నావానరశ్రేష్ఠులందఱు, మహేంద్రపర్వతము విడిచి, శ్రీరామ సుగ్రీవ సన్నిధికింబోవ సమకట్టి, యాకాశంబున కుద్గమించిరి. అని, తాత్పర్యము-

ప్లవమానాః ఖ మాప్లుత్య తతస్తే కాననౌకసః
నందనోపమ మాసేదుర్వనం ద్రుమలతాయుతమ్. ౭

టీక॥ తతః=అటుపిమ్మట; తే=ఆ; కాననౌకసః= వానరులు; ఖం=ఆకాశమును; ఆప్లుత్య=పొంది; ప్లవమానాః= పోవుచు ; నందనోపమం = నందనవనముతోఁబోలిక గలదియును ; ద్రుమలతాయుతం=వృక్షములతోను తీఁగెలతోనుంగూడినదియునగు; వనం= మధువనమును; ఆసేదుః= పొందిరి.

అంత, నావానరులు, అట్లు, ఆకాశమార్గంబునం బోవుచు, నానావృక్షంబులతోను లతలతోనుంగూడి దేవలోకంబునం దలి నందనవనంబుతో సాటి సేయందగి యొప్పుచున్న మధువనంబుఁ జేరిరి. అని, తాత్పర్యము.

యత్తన్మధువనం నామ సుగ్రీవస్యాభిరక్షితమ్
అధృష్యం సర్వభూతానాం సర్వభూతమనోహరమ్. ౮
యద్రక్షతి మహావీర్య స్సదా దధిముఖః కపిః
మాతులః కపిముఖ్యస్య సుగ్రీవస్య మహాత్మనః. ౯
తే తద్వన ముపాగమ్య బభూవుః పరమోత్కటాః
వానరా వానరేంద్రస్య మనఃకాంతతమం మహత్. ౧౦

టీక॥ యత్=ఏది; సుగ్రీవస్య (సుగ్రీవేణ)=సుగ్రీవునిచేత; అభిరక్షితం=కాపాడఁబడినదియు ; సర్వభూతానాం=సమస్తభూతంబులకును ; అధృష్యం=ధర్షింపఁగూడనిదియు;సర్వభూతమనోహరం=సమస్తభూతములమనంబులనుహరించునదియు; తత్=అట్టి;మధువనంనామ = మధువనంబనుపేరుగలదో; యత్=దేని; మహాత్మనః=అధికమయినపరాక్రమముగల ; కపిముఖ్యస్య=వానరశ్రేష్ఠుండగు ; సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క; మాతులః=మేనమామయును; మహావీర్యః=అధికమయినపరాక్రమముగలవాఁడునగు;దధిముఖః=దధిముఖుఁడను;కపిః= వానరుఁడు ; సదా=ఎల్లప్పుడును ; రక్షతి=రక్షించుచున్నాఁడో; తత్=అట్టి; వానరేంద్రస్య = వానరేశ్వరుండగుసుగ్రీవునియొక్క; మనఃకాంతతమం= మనసునకుఁ బ్రియతమంబును; మహత్= గొప్పదియునగు; వనం=మధువనమును; తే=ఆ; వానరాః = వానరులు; ఉపాగమ్య=పొంది; పరమోత్కటాః=మిక్కిలియునుత్సుకులు; బభూవుః=అయిరి.

ఏది, సుగ్రీవునియాజ్ఞచేసమస్తభూతంబులకును దేఱిచూడనలవిగాక, యతిమనోహరంబైయుండునో, ఏదిమహాపరాక్రమశాలియు వానరశ్రేష్ఠుండునగుసుగ్రీవునిపనుపున , నతనిమేనమామ మహాపరాక్రమశాలిదధిముఖుండనువానరునిచే నెల్లప్పుడు నేమఱక రక్షింపఁబడుచుండునో, అట్టి, వానరాధీశ్వరుండగుసుగ్రీవునకుఁ బ్రియతమంబగుమధువనమునుబొంది, ఆయంగదాదివానరులు , మధువుఁద్రావం, బరమోత్సుకులయిరి. అని, తాత్పర్యము.

తత స్తే వానరా హృష్టా దృష్ట్వా మధువనం మహత్
కుమార మభ్యయాచంత మధూని మధుపింగళాః. ౧౧

టీక॥ తతః=అటుపిమ్మట; మధుపింగళాః=తేనెవలె గోరోచనపువన్నెగల; తే=ఆ; వానరాః=వానరులు; మహత్=గొప్పదగు; మధువనం= మధువనమును;దృష్ట్వా=చూచి; హృష్టాః=సంతోషమునొందినవారలై;కుమారం=యువరాజుండగునంగదుని; మధూని=తేనెలను;అభ్యయాచంత=అడిగిరి.

అంతఁ, దేనియకుంబోలెఁ బింగళవర్ణంబుగల యావానరులు; మధువ

నంబునుజూచి సంతుష్టులై యువరాజుం డగు నంగదునియొద్దకుంబోయి "మా కుం దేనియఁ లిప్పించవలయును" అని ప్రార్థించిరి. అని, తాత్పర్యము

తతః కుమారస్తాన్ వృద్ధాన్ జాంబవత్ప్రముఖాన్ కపీన్
అనుమాన్య దదౌ తేషాం నిసర్గం మధుభక్షణే. ౧౨

టీక॥ తతః=అటుపిమ్మట; కుమారః=అంగదుండు; వృద్ధాన్ = ముసలివారలగు; తాన్ = ఆ; జాంబవత్ప్రముఖాన్ = జాంబవంతుండు మొదలుగాఁగల; కపీన్ = వానరులను; అనుమాన్య = సమ్మతింపఁజేసి; తేషాం = ఆవానరులకు; మధుభక్షణే= తేనెయొక్క భక్షించుటయందు; నిసర్గం=అనుజ్ఞను; దదౌ=ఇచ్చెను.

అంత, నంగదుండు, అందు, వృద్ధులగు జాంబవంతుండు మొదలగువారలతోఁ జెప్పి వారల యనుమతిందీసికొని, యావానరులకు మధువుఁ ద్రావ ననుజ్ఞనొసంగెను. అని, తాత్పర్యము.

తతశ్చానుమతాస్సర్వే సంప్రహృష్టా వనౌకసః
ముదితాః ప్రేరితాశ్చాపి ప్రనృత్యంతో భవం స్తతః, ౧౩

టీక॥ తతశ్చ= ఆసీతాదర్శనంబువలననె; సంప్రహృష్టాః=మిక్కిలియు సంతోషంబునొందియున్న; వనౌకసః= వానరులు; సర్వే= అందఱును; అనుమతాః = అనుమతినిం బొందిన వారలునై; ముదితాః = సంతోషించినవారలై; ప్రేరితాశ్చాపి=ప్రేరింపఁబడినవారలునై; తతః=అంత; ప్రనృత్యంతః= ఆడుచున్నవారలు; అభవన్=అయిరి.

సీతాదర్శనంబుననె పరమసంతుష్టులయియున్న యావానరులు, అంగదుండు మధువుఁద్రావ ననుమతియొసంగ నంత, మఱియుం బ్రహృష్టులయి, యతండు "ఓ! త్రాఁగుఁడు; యథేష్టముగాఁ ద్రాగుఁడు" అని ప్రేరేపింప, సంతోషంబుంబట్టఁజాలక, నర్తనంబు సేయసాగిరి. అని, తాత్పర్యము.

గాయంతి కేచిత్ప్రణమంతి కేచి

నృత్యంతి కేచి త్ప్రహసంతి కేచిత్
పతంతి కేచి ద్విచరంతి కేచి
త్ప్లవంతి కేచి త్ప్రలపంతి కేచిత్. ౧౪

టీక॥ కేచిత్=కొందఱు; గాయంతి=(ధూతాతార్థమందులట్. ఇట్లుముందును.)పాడిరి. కేచిత్= కొందఱు;ప్రణమంతి=వంగిరి. కేచిత్= కొందఱు; నృత్యంతి=ఆడిరి. కేచిత్= కొందఱు, ప్రహసంతి= గట్టిగానవ్విరి. కేచిత్= కొందఱు; పతంతి= పడిరి. కేచిత్= కొందఱు; విచరంతి=తిరిగిరి. కేచిత్- కొందఱు; ప్లవంతి=ఎగిరిరి. కేచిత్= కొందఱు; ప్రలపంతి=అఱచిరి.

ఆవానరులు, సంతోషంబుఁబట్టజాలక,పిచ్చెత్తినట్లు;కొందఱు గానముచేసిరి;కొందఱు నేలకుఁదలక్రిందుగావంగిరి;కొందఱునృత్యంబుగావించిరి; కొందఱుపకపకనవ్విరి; కొందఱు నేలంబడిరి;కొందఱుదూరముపరుగెత్తిరి; కొందఱు,ఎగిరిరి; కొందఱు కేకలువేసిరి.

అని, తాత్పర్యము.

పరస్పరం కేచి దుపాశ్రయంతే
పరస్పరం కేచి దుపాక్రమంతే
పరస్పరం కేచి దుపబ్రువంతే
పరస్పరం కేచి దుపారమంతే, ౧౫

టీక॥ కేచిత్=కొందఱు ; పరస్పరం=ఒండొరులను; ఉపాశ్రయంతే= ఆశ్రయించిరి. కేచిత్= కొందఱు; పరస్పరం=ఒండొరులను ; ఉపాక్రమంతే=పట్టుకొనిరి. కేచిత్=కొందఱు ; పరస్పరం=ఒండొరులనుగూర్చి ; ఉపబ్రువంతే= రహస్యముఁజెప్పిరి. కేచిత్=కొందఱు ; పరస్పరం=ఒండొరులనుగూర్చి; ఉపారమంతే= క్రీడించిరి.

కొందఱు,ఒండొరులనాశ్రయించిరి; కొందఱు , ఒండొరులంబట్టుకొనిరి ; కొందఱు , ఒండొరులతో రహస్యంబులుచెప్పుకొనిరి. కొందఱు, ఒక్కఁగుమిగాఁజేరి, విహరించిరి.

అని, తాత్పర్యము.

ద్రుమా ద్ద్రుమం కేచి దభిద్రవంతే
క్షితౌ నగాగ్రా న్నిపతంతి కేచిత్
మహీతలా త్కేచి దుదీర్ణవేగా
మహాద్రుమాగ్రా ణ్యభిసంపతంతి. ౧౮

టీక॥ కేచిత్=కొందఱు ; ద్రుమాత్=వృక్షంబుననుండి; ద్రుమం= వృక్షమునుగూర్చి; అభిద్రవంతే= పఱుగెత్తిరి. కేచిత్=కొందఱు; నగాగ్రాత్ = వృక్షముయొక్కకొననుండి; క్షితౌ = నేలయందు; నిపతంతి=పడిరి. కేచిత్= కొందఱు; ఉదీర్ణవేగాః=అధికమయిన వేగముగలవారలై ;మహీతలాత్ = భూతలముననుండి; మహాద్రుమాగ్రాణి=పెద్దవృక్షములకొనలను; అభిసంపతంతి=పొందిరి.

కొందఱు, ఒకవృక్షముననుండిమఱియొకవృక్షమునకుఁ బఱుగెత్తిరి; కొందఱువృక్షాగ్రంబుననుండి , నేలకుదుమికిరి ; కొందఱు మహావేగులయి , నేలనుండి, గొప్పవృక్షంబుల కొనలపైకెగిరిరి.

అని, తాత్పర్యము.

గాయంత మన్యః ప్రహస న్నుపైతి
హసంత మన్యః ప్రహస న్నుపైతి
రుదంత మన్యః ప్రరుద న్నుపైతి
నుదంత మన్యః ప్రణుద న్నుపైతి. ౧౯

టీక॥ అన్యః=మఱియొకఁడు;ప్రహసన్=గట్టిగానవ్వుచు; గాయంతం= పాడుచుండువాని; ఉపైతి=పొందెను. అన్యః=మఱియొకఁడు; ప్రహసన్= గట్టిగానవ్వుచు; హసంతం=నవ్వుచుండువాని; ఉపైతి= పొందెను. అన్యః= మఱియొకఁడు; ప్రరుదన్=త్రోయుచు; రుదంతం=ఏడ్చువాని; ఉపైతి = పొందెను. అన్యః=మఱియొకఁడు ప్రణదన్= గట్టిగానఱచుచున్నవాఁడై, నుదంతం=త్రోయుచున్నవాని;ఉపైతి= పొందెను.

ఒకఁడు గానముసేయుచుండఁగా, మఱియొకరుండు వికవికనవ్వుచు నతనిపైఁబడెను ; ఒకఁడునవ్వుచుండఁగా, మఱియొకఁడుమఱి యొనర్థి

కముగానవ్వుచునతనిపైఁబడెను;ఒక్కఁడువ్యాజంబునరోదనంబుసేయుచుండఁగా, మఱియొక్కఁడతనింద్రోయుచు, నతనిపైఁబడెను; అట్లొక్కఁడు, మఱియొకనింద్రోయుచుండఁగా, ఇంక నొక్కఁడు, కేకలువేయుచు,నతనిపైఁ బడెను. అని, తాత్పర్యము.

సమాకులం త త్కపిసైన్యమాసీ
న్మధుప్రపానో త్కటసత్త్వచేష్టమ్
నచాత్ర కశ్చి న్న బభూవ మత్తో
నచాత్ర కశ్చి న్న బభూవ తృప్తః. ౧౮

టీక॥ తత్=ఆ; కపిసైన్యం= వానరసైన్యము; మధు ప్రపానోత్కట సత్త్వచేష్టం= తేనియయొక్క మిక్కిలియుఁ ద్రావుటచేనతిశయించిన చిత్తచేష్టలుగలదై; సమాకులం=కలతనొందినది; ఆసీత్ = అయినది. అత్ర= ఇందు; కశ్చిత్=ఒకానొకఁడును; మత్తః= మదించినవాఁడు; నబభూవ=కాకుండలేదు; అత్ర=ఇందు; కశ్చిత్= ఒకానొకండును; తృప్తః=తృప్తిఁబొందినవాఁడును; నబభూవ=కాకుండలేదు.

ఆవానరులందఱును, విపరీతముగా తేనియలంద్రావుటచే, మత్తత నొంది నానావిధచేష్టలం జేయుచుండిరి; అందు, ఒక్కండైనను మత్తత నొందనివాఁడులేఁడు; ఒక్కండైనను యథేష్టంబుగామధుపానంబుఁజేసి తృప్తి నొందని వాఁడులేఁడు. అని, తాత్పర్యము.

తతో వనం తత్పరిభక్ష్యమాణం
ద్రుమాంశ్చ విధ్వంసితప త్త్రపుష్పాన్
సమీక్ష్య కోపా ద్దధివక్త్రనామా
నివారయామాస కపిః కపీం స్తాన్, ౧౯

టీక॥ తతః= అటుపిమ్మట; పరిభక్ష్యమాణం = భక్షింపఁ బడుచున్న; తత్=ఆ; వనం= వనమును; విధ్వంసితపత్త్రపుష్పాన్=నాశంబునొందింపఁబడినయాకులునుబూలునుగల; ద్రుమాంశ్చ= వృక్షములను; సమీక్ష్య= చూచి; దధివక్త్రనామా= దధిముఖుండనుపేరుగల; కపిః=వానరుఁడు; కోపాత్=

కోపమువలన; తాక్=ఆ; కపీన్=వానరులను; నివారయామాస= అడ్డగించెను.

అంత. మధువనంబునురక్షించుచుండు సుగ్రీవ మాతులుండు దధిముఖుండనువానరుండు, వానరులందఱు, అవనమునందలిమధువునంతయుఁ ద్రావుటయు వృక్షముల పత్రపుష్పంబు లంతయునాశమునొందించుటయుఁ, జూచి, కోపంబునొంది,యావానరుల, వనంబు విడిచిపొమ్మని నివారించెను.

అని, తాత్పర్యము.

స తైః ప్రవృద్ధైః పరిభర్త్స్యమానో
వనస్య గోప్తా హరివీరవృద్ధః
చకార భూయో మతి ముగ్రతేజా
వనస్య రక్షాం ప్రతి వానరేభ్యః. ౨౦

టీక॥వనస్య=మధువనముయొక్క; గోప్తా=రక్షించువాఁడును ; ఉగ్రతేజాః= భయంకరమయిన ప్రభావము గలవాఁడునగు; సః=ఆ ; హరివీరవృద్ధః= వృద్ధుండగు వానరవీరుఁడయినదధిముఖుండు; ప్రవృద్ధైః = (సంతోషంబుచే) వృద్ధింబొందియున్న; తైః= ఆవానరులచేత;పరిభర్త్స్యమానః=తిరస్కరింపఁబడుచున్నవాఁడై; వానరేభ్యః=వానరులవలన; వనస్య= వనముయొక్క; రక్షాంప్రతి= రక్షించుటనుగూర్చి; భూయః=మఱల;మతిం= బుద్ధిని; చకార=చేసెను.

మధువన రక్షకుండును వృద్ధుండును భయంకర ప్రభావుండునగు నాదధిముఖుండంత, మత్తులగు నావానరులు తన్ను సరకుసేయక తిరస్కరించుటం జూచి, యామధువనంబును వానరుల వలనం జెడకుండరక్షించుటకై, మఱలం బ్రయత్నంబుచేసెను.

అని, తాత్పర్యము.

ఉవాచ కాంశ్చి త్పరుషాణి ధృష్ట
మసక్త మన్యాంశ్చ తలై ర్జఘాన
సమేత్య కైశ్చి త్కలహం చకార
తథైవ సామ్నోప జగామ కాంశ్చిత్. ౨౧

టీక॥ సః(అధ్యాహృతము)=ఆదధిముఖుఁడు ; కాంశ్చిత్=కొందఱనుగూర్చి; ధృష్టం=గట్టిగా; పరుషాణి=పరుషవాక్యములను; ఉవాచ=చెప్పెను. అసక్తం=విడువక; అన్యాంశ్చ=ఇతరులను; తలైః=అఱచేతులచేత ; జఘాన=కొట్టెను. కైశ్చిత్=కొందఱితో;సమేత్య=చేరి; కలహం=జగడమును;చకార=చేసెను. తథైవ=అట్లే; కాంశ్చిత్=కొందఱను; సామ్నా=మంచిమాటలచేత; ఉపజగామ=పొందెను.

ఆదధిముఖుండు,కొందఱియొద్దకుఁబోయిపరుషవాక్యంబులవలదని, చెప్పెను; కొందఱను , దలప్రహారంబులం , బ్రహారించెను ; కొందఱితోజగడమాడెను; కొందఱమంచిమాటలతోఁబ్రార్థించెను. అని,తాత్పర్యము.

స తైర్మదాత్సంపరివార్య వాక్యై
ర్బలాచ్చ తేన ప్రతివార్యమాణైః
ప్రధర్షితస్త్యక్తభయైస్సమేత్య
ప్రకృష్యతే చాప్యనవేక్ష్య దోషమ్. ౨౨

టీక॥ తేన=ఆదధిముఖునిచేత ; బలాచ్చ = బలిమివలనను; ప్రతివార్యమాణైః= అడ్డగింపఁబడుచున్నవారలును; త్యక్తభయైః= విడువఁబడినభయముగలవారలునగు;తైః=ఆవానరులచేత; సః= ఆదధిముఖుండు; మదాత్=మదమువలన;సమేత్య=చేరి;సంపరివార్య=చుట్టుకొని; వాక్యైః= మాటలచేత; ప్రధర్షితః=తిరస్కరింపఁబడినవాఁడై; దోషం=దోషమును; అనవేక్ష్య=చూడక;ప్రకృష్యతేచాపి=ఈడ్వఁబడుచునున్నాఁడు.

అట్లాదధిముఖుఁడు, ఆవానరులను నివారింప , వారలుఎంతమాత్రముభయంబులేక, మదంబున, నందఱునొక్కటిగాఁజేరి, యాదధిముఖుంబరివేష్టించి, మాటలందిరస్కరించియు , నతండు, ప్రభుండనియాయినను దోషంబుదలంపక, యతని, నలుప్రక్కలంఁబీడించిరి. అనితాత్పర్యము.

నఖైస్తుదంతో దశనైర్దశంత

స్తలైశ్చ పాదైశ్చ సమాపయంతః
మదా త్కపిం తం కపయ స్సమగ్రాః
మహావనం నిర్విషయంచ చక్రుః. ౨౩

టీక॥ కపయః = వానరులు; సమగ్రాః=అందఱు; మదాత్= మదమువలన; తం=ఆ; కపిం = దధిముఖుని; నఖైః=గోళ్లచేత; తుదంతః= హింసించుచును; దశనైః=పండ్లచేత; దశంతః= కొఱుకుచును; తలైశ్చ = అఱచేతుల చేతను; పాదైశ్చ=పాదముల చేతను; సమాపయంతః = సమాప్తి నొందించుచును; మహావనంచ=పెద్దదగుమధువనమును; నిర్విషయం= పదార్థములులేనిదానిఁగా; చక్రుః=చేసిరి.

వానరులందఱు, మదంబున, నాదధిముఖుని, గోళ్లంగీఱుచు, దంతంబులం గొఱుకుచుఁ, దలంబుల చేతను బాదంబుల చేతను జావమోఁదుచును, నామధువనంబునందలి, తేనియమొదలగు భోగ్యద్రవ్యంబుల నన్నింటిని, గాఁజేసిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,

సుందరకాండే, ఏకషష్టితమస్సర్గః.

ఇదిస్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర

వ్యాఖ్యానంబునందు, సుందరకాండైకషష్టితమసర్గటీక,

ముగిసినది.



ద్వి ష ష్టి త మ స ర్గ ప్రా రం భః.

తానువాచ హరిశ్రేష్ఠో హనుమాన్వానరర్షభః

టీక॥ హరిశ్రేష్ఠః=వానరోత్తముండును; వానరర్షభః= వానరులయందు వృషభమువంటివాఁడునగు; హనుమాన్=హనుమంతుఁడు; తాన్=ఆవానరులనుగూర్చి; ఉవాచ=చెప్పెను.

వానరశ్రేష్ఠుండగుహనుమంతుండు ఆవానరులంజూచియిట్లని, చెప్పెను.

అని, తాత్పర్యము.

అవ్యగ్రమనసో యూయం మధు సేవత వానరాః. ౧

టీక॥వానరాః = వానరులారా! యూయం=మీరలు; అవ్యగ్రమనసః=కలఁతలేనిమనసుగలవారలై; మధు=తేనియను; సేవత=త్రాగుఁడు.

వానరులారా!మీరలు,మనంబునభయంబుంచుకొనక, తేనియలంగ్రోలుఁడు.

అని, తాత్పర్యము.

అహం మావారయిష్యామి యుష్మాకం పరిపంథినః

టీక॥అహం= నేను; యుష్మాకం= మీయొక్క; పరిపంథినః=శత్రువులను; ఆవారయిష్యామి=అడ్డగించెదను.

మిమ్ములను దాఁగనీక, యడ్డమువచ్చువారలను, నేనువారింపుచుండెదను. అని,హనుమంతుండు, వానరులకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రుత్వా హనుమతో వాక్యం హరీణాం ప్రవరోంగదః. ౨
ప్రత్యువాచ ప్రసన్నాత్మా పిబంతు హరయో మధు
అవశ్యం కృతకార్యస్య వాక్యం హనుమతో మయా. ౩
అకార్య మపి కర్తవ్యం కి మంగ పున రీదృశమ్

టీక ॥ హనుమతః=హనుమంతుని యొక్క; వాక్యం=మాటను; శ్రుత్వా=విని; హరీణాం=వానరులలో; ప్రవరః=శ్రేష్ఠుండగు; అంగదః=అంగదుండు; ప్రసన్నాత్మా= ప్రసాదమునొందిన మనసుగలవాఁడై; "హరయః= వానరులు; మధు= తేనియను; పిబంతు= త్రాగుదురు గాక. కృతకార్యస్య=చేయఁబడినకార్యముగల; హనుమతః = హనుమంతునియొక్క; వాక్యం= మాట; అకార్యమపి=చేయందగనిదైనను; మయా=నాచేత; అవశ్యం=అవశ్యము. కర్తవ్యం= చేయఁబడవలసినది. అంగ=ఓయీ; ఈదృశం=ఇట్టిది; కర్తవ్యమితి (అధ్యాహృతము)= చేయఁబడవలసినదని; కింపునః (వక్తవ్యం)- చెప్పఁబడవలయునా? ఇతి (అధ్యాహృతము)=అని; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

హనుమంతుండు చెప్పినదివిని, వానరశ్రేష్ఠుండగునంగదుండు, ప్రసన్నహృదయుండై, "వానరులు యథేష్టంబుగాఁ దేనియలం గ్రోలుదురు గాక. కృతకృత్యుండగు హనుమంతుండు, ఇప్పుడు అకార్యమగు దానిం జేయుమని చెప్పినను, నేను దాని నవశ్యము చేయవలసినవాఁడను; ఇంక నిట్టి సత్కార్యమును జెప్పినప్పుడు, చెప్పనేల?" అని, యానతిచ్చెను. అని, తాత్పర్యము.

అంగదస్య ముఖా చ్ఛ్రుత్వా వచనం వానరర్షభాః. ౪
సాధుసాధ్వితి సంహృష్టా వానరాః ప్రత్యపూజయన్

టీక॥ వానరర్షభాః= వానరశ్రేష్ఠులగు; వానరాః= వానరులు ; అంగదస్య=అంగదునియొక్క; ముఖాత్=నోటనుండి; వచనం=మాటను; శ్రుత్వా=విని; సంహృష్టాః= మిక్కిలియు సంతసించినవారలై; సాధుసాధు=బలేబలే; ఇతి=అని; ప్రత్యపూజయన్=పూజించిరి,

ఆ వానరోత్తములు, అంగదుని నోటనుండి వచ్చినమాటనువిని, పరమసంతుష్టులయి, యంగదుని, సాధువాక్యంబులం గొనియాడిరి.

అని, తాత్పర్యము.

పూజయిత్వాంగదం సర్వే వానరా వానరర్షభమ్. ౫

జగ్ము ర్మధువనం యత్ర నదీవేగ ఇవద్రుమమ్

టీక॥ వానరాః = వానరులు; సర్వే= అందఱును; వానర్షభం= వానరశ్రేష్ఠుండగు; అంగదం= అంగదుని; పూజయిత్వా=పూజించి; యత్ర= ఎచ్చట, మధువనం= మధువనము;అస్తి (అధ్యాహృతము)= ఉన్నదో; తత్ర= (అధ్యాహృతము) = అచ్చటికి; నదీవేగః= ఏటివేగము; ద్రుమమివ= వృక్షమునువలె; జగ్ముః=పొందిరి.

వానరులందఱు, అట్లు, వానరశ్రేష్ఠుండగు నంగదుని గొనియాడి, నదీవేగంబు వృక్షముపైకివచ్చి వృక్షముం బడఁదోయునట్లు,మధువనంబును నశింపఁజేయుటకై, యచ్చటికిఁబోయిరి.

అని, తాత్పర్యము.

తే ప్రవిష్టా మధువనం పాలా నాక్రమ్య వీర్యతః. ౬
అతిసర్గాచ్చ పటవో దృష్ట్వా శ్రుత్వాచ మైథిలీమ్
పపు స్సర్వే మధు తదా రసవ త్ఫల మాదదుః. ౭

టీక॥ వీర్యతః= పరాక్రమమువలనను; అతిసర్గాచ్చ= అనుజ్ఞ వలనను; మైథిలీం=సీతను; దృష్ట్వా= చూచియు; శ్రుత్వాచ=వినియు; పటవః= సమర్థులయిన, బలవంతులయినయనుట; తే= ఆవానరులు; సర్వే= అందఱును; మధువనం= మధువనమును; ప్రవిష్టాః= ప్రవేశించినవారలై; పాలాన్=కావలివారలను;ఆక్రమ్య=ఆక్రమించి;తదా= అప్పుడు, మధు = తేనియను; పపుః= త్రావిరి. రసవత్ = మంచిరుచిగల;ఫలం= పండును;ఆదదుః= గ్రహించిరి.

పరాక్రమముచేతను, అంగదునియనుజ్ఞ వలనను, సీతాదేవిం జూచియు వినియునుండుట వలనను,ఇనుమడించిన బలముగల యావానరులందఱు,మధువనంబుఁజొచ్చి, యచ్చటి కావలివారలం బట్టికట్టివేసి, మధువునంతయుఁ గ్రోలిరి, రుచ్యంబులగు ఫలంబులను భక్షించిరి. అనితాత్పర్యము.

ఉత్పత్య చ తతస్సర్వే వనపాలాన్ సమాగతాన్
తాడయంతి స్మశతశ స్సక్తా న్మధువనే తదా ౮

టీక॥ తతః=అటుపిమ్మట; తదా=అప్పుడు; సర్వే= అందఱును; ఉత్పత్య చ = ఎగిరియు; మధువనే = మధువనమునందు; సక్తాన్ = ఆసక్తులును; సమాగతాన్ = వచ్చినవారలునగు; వనపాలాన్ = వనరక్షకులను; శతశః = నూఱువిధములుగా; తాడయంతిస్మ=కొట్టిరి.

అట్లు, వానరులందఱునుయథేష్టంబుగాఁ దా్రివియుభక్షించియు, లేచి, తమపైకినివారింపవచ్చిన, వనరక్షకులం బట్టి, నానావిధంబులంగొట్టిరి.

అని, తాత్పర్యము.

మధూని ద్రోణమాత్రాణి బాహుభిః పరిగృహ్య తే
పిబంతి సహితా స్సర్వే నిఘ్నంతి స్మ తథాపరే. ౯

టీక॥ తే=ఆవానరులు; సర్వే= అందఱును; సహితాః = కూడినవారలై; బాహుభిః= చేతులచేత; ద్రోణమాత్రాణి = తూమెఁడుప్రమాణముగల; మధూని=తేనియలను; పరిగృహ్య=పట్టుకొని;పిబంతి=త్రాఁగిరి. తథా=అట్లు; అపరే=ఇతరులు; నిఘ్నంతిస్మ=కొట్టిరి.

ఆవానరులందఱునొక్కటిగా చేరి కొందఱు,తూమెఁడు తేనియగలపటలంబులం జేతులంబట్టుకొని, త్రాఁగుచుండిరి; మఱికొందఱు, విరోధులంబ్రహరింపుచుండిరి.

అని,తాత్పర్యము.

కేచి త్పీత్వా పవిధ్యంతి మధూని మధుపింగళాః
మధూచ్ఛిష్టేన కేచిచ్చ జఘ్నురన్యోన్య ముత్కటాః. ౧౦

టీక॥ మధుపింగళాః= తేనియవలె గోరోచనపువన్నెగల; కేచిత్=కొందఱు;పీత్వా=త్రాఁగి; మధూని= తేనెతెట్టెలను; అపవిధ్యంతి=పాఱవేసిరి కేచిచ్చ=కొందఱును;మధూచ్ఛిష్టేన= మైనముతో;అన్యోన్యం=ఒండొరులును; ఉత్కటాః=మదించినవారలై;జఘ్నుః= పోయిరి.

తేనియకుంబోలె గోరోచనపు వన్నెగల కొందఱు, తేనియలం దా్రివి తెట్టెలం బాఱవైచిరి; కొందఱా మైన ముంజీసికొనిమత్తులై పడుచు లేచుచుఁ,

బోయిరి. అని, తాత్పర్యము.

అపరే వృక్షమూలేతు శాఖాం గృహ్యా వ్యవస్థితాః
అత్యర్థంచ మదగ్లానాః పర్ణాన్యాస్తీర్య శేరతే. ౧౧

టీక॥ అపరే=ఇతరులు; వృక్షమూలేతు=చెట్టుక్రిందనే; శాఖాం = కొమ్మను; గృహ్య (గృహీత్వా)= పట్టుకొని; వ్యవస్థితాః=ఉన్నవారలై; అత్యర్థంచ=మిక్కిలియు; మదగ్లానాః= మదముచేడస్సినవారలై; పర్ణాని = ఆకులను; ఆస్తీర్య=పఱచుకొని; శేరతే=పరుండిరి.

ఇతరులగువానరులు, మదంబునఁబోవంజాలక, ఆచెట్టుకొమ్మనేపట్టుకొనియుండి, యంతకంతకు మదం బతిశయింప, వృక్షపత్రంబులుపఱచుకొని, నేలంబరుండిరి. అని, తాత్పర్యము.

ఉన్మత్తభూతాః ప్లవగా మధుమత్తాశ్చ హృష్టవత్
క్షిపంతిచ తదాన్యోన్యం స్ఖలంతిచ తథాఽపరే. ౧౨

టీక॥ప్లవగాః=వానరులు; మధుమత్తాశ్చ=తేనియచేమదించినవారలునై; ఉన్మత్తభూతాః=పిచ్చిపట్టినవారలై; తదా=అప్పుడు; హృష్టవత్= సంతోషంబునొందినట్లు; అన్యోన్యం=ఒండొరులను; క్షిపంతిచ=త్రోసిరి. తథా = అట్లు; అపరే=ఇతరులు; స్ఖలంతిచ= తడఁబడుచుండిరి.

వానరులు, మధుపానంబున మత్తులయి, పిచ్చెత్తినట్లు, సంతోషంబునొందినట్లు, కొందఱు, ఒకరినొకరు, పడఁద్రోసిరి; మఱికొందఱు, నడవంజాలక, తడఁబడుచుండిరి.

అని, తాత్పర్యము.

కేచిత్క్ష్వేళాం ప్రకుర్వంతి కేచి త్కూజంతి హృష్టవత్
హరయో మధునా మత్తాః కేచిత్సుప్తా మహీతలే. ౧౩

టీక ॥ హరయః — వానరులు; మధునా=తేనెచేత; మత్తాః=మదించిన

వారలై; కేచిత్= కొందఱు; క్ష్వేళాం=సింహనాదమును; ప్రకుర్వంతి= చేసిరి. కేచిత్=కొందఱు; హృష్టవత్=సంతోషంబునొందినట్లు; కూజంతి=కూసిరి. కేచిత్=కొందఱు; మహీతలే=భూతలమునందు; సుప్తాః=నిదురించిరి.

వానరులు, మధు, మత్తులయి, కొందఱు, పీరరసంబొప్ప, సింహనాదంబు గావించిరి; కొందఱుసంతోషంబునొందినట్లుకూయుచుండిరి; కొందఱు, నేలంబడినిదురించిరి. అని, తాత్పర్యము.

కృత్వా కేచి ద్ధసం త్యన్యే కేచి త్కుర్వంతిచే తరత్
కృత్వా కేచి ద్వదం త్యన్యే కేచి ద్బుధ్యంతి చేతరత్. ౧౪

టీక॥ అన్యే=ఇతరులయిన; కేచిత్=కొందఱు; కృత్వా=చేసి; హసంతి=నవ్విరి. కేచిత్=కొందఱు; ఇతరత్=ఇతరమయినదాని; కుర్వంతి= చేసిరి. అన్యే=ఇతరులగు; కేచిత్= కొందఱు; కృత్వా=చేసి; వదంతి= చెప్పిరి. కేచిచ్చ=కొందఱు; ఇతరత్= ఇతరమయినదాని; బుధ్యంతి= తెలిసికొనిరి.

మఱికొందఱు, చేయఁగూడని, గ్రామ్యకార్యంబొకటిచేసి, తమలోఁదామునవ్వుకొనిరి; ఇతరులు కొందఱు, మఱియొకగ్రామ్యకార్యంబొనర్చిరి; మఱికొందఱు, అట్టిగ్రామ్యంబుఁగావించి, తాముచేసినది, యితరులకుంజెప్పుకొనిరి; ఇతరులు, మఱియొక్కదానిఁజేయందలంచిరి. అని, తాత్పర్యము.

యే ప్యత్ర మధుపాలా స్స్యుః ప్రేష్యా దధిముఖస్య తు
తేపి తై ర్వానరై ర్భీమైః ప్రతిషిద్ధా దిశో గతాః. ౧౫

టీక॥ అత్ర=ఇందు; దధిముఖస్య తు=దధిముఖునియొక్క, యే; ప్రేష్యాః= పరిచారకులగు; మధుపాలాఅపి= మధురక్షకులును; యే=ఎవ్వరు; సంతి(అధ్యాహృతము)=కలరో; తేపి= వారలును; భీమైః = భయంకరులగు; తైః= ఆ; వానరైః = వానరుల చేత; ప్రతిషిద్ధాః = త్రోయఁబడిన వారలై; దిశః = దిక్కులను; గతాః= పొందిరి.

ఈమధువనంబునందుదధిముఖాజ్ఞానువర్తులగు మధురక్షకులందఱు, భయంకరాకారులగు నావానరులచే, బాధింపఁబడినవారలై, దిక్కులకుం బాఱిరి.

అని, తాత్పర్యము.

జానుభి స్తు ప్రకృష్టాశ్చ దేవమార్గం ప్రదర్శితాః
అబ్రువన్ పరమోద్విగ్నా గత్వా దధిముఖం వచః. ౧౬

టీక॥ తే(అధ్యాహృతము) = ఆమధువనరక్షకులగువానరులు ; జానుభి స్తు = మోఁకాళ్లచేతను; ప్రకృష్టాశ్చ = ఈడ్వఁబడినవారలునై ; దేవమార్గం=అపానమార్గమును ; ప్రదర్శితాః=చూపఁబడినవారలునై ; పరమోద్విగ్నాః=మిక్కిలియుదుఃఖితులయి; దధిముఖం=దధిముఖునిగూర్చి ; గత్వా=పోయి; వచః=మాటను; అబ్రువన్=చెప్పిరి.

మఱియు, నీవానరులు, మధువనరక్షకులగువానరులను, మోఁకాళ్లను బట్టియెత్తి యపానద్వారంబును ముఖంబునొద్దకుఁ జేర్చి, యిట్లుపీడింపఁగా, వారలుపరమదుఃఖితులయి, దధిముఖునొద్దకువచ్చి,యిట్లని,చెప్పిరి.

అని, తాత్పర్యము.

హనూమతా దత్తవరై ర్హతం మధువనం బలాత్
వయం చ జానుభిః కృష్టా దేవమార్గంచ దర్శితాః. ౧౭

టీక॥ హనూమతా=హనుమంతునిచేత; దత్తవరైః= ఇయ్యఁబడినవరముగలవానరులచేత; బలాత్= బలిమివలన; మధువనం = మధువనము ; హతం=నశింపఁజేయఁబడినది. వయంచ= మేమును; జానుభిః=మోఁకాళ్లచేఁకృష్టాః=ఈడ్వఁబడినవారలమై; దేవమార్గంచ = అపానద్వారంబును ; దర్శితాః=చూపఁబడితిమి.

హనుమంతునివలనవరంబునొంది, వానరులు, మధువనంబునంతయునశింపఁజేసిరి; ఇంతియగాక, మమ్ములను; మోఁకాళ్లంబట్టిలేవనెత్తిమాయపానద్వారంబుముఖంబునొద్దకుఁ జేరునట్లుచేసి, యిట్లునానావిధంబులంబీడించిరి. అని, మధురక్షకులగువానరులుదధి

ముఖునితోఁ జెప్పిరి. అని, తాత్పర్యము.

తతో దధిముఖః క్రుద్ధో వనప స్తత్ర వానరః
హతం మధువనం శ్రుత్వా సాంత్వయామాస తాన్ హరీన్. ౧౮

టీక॥ తతః= అటుపిమ్మట; తత్ర= అచ్చట; వనపః= మధువనమును పాలించునట్టి; వానరః= వానరుండగు; దధిముఖః= దధిముఖుండు; మధువనం= మధువనమును; హతం= నశింపఁజేయఁబడినదిగా; శ్రుత్వా= విని; క్రుద్ధః= కోపించినవాఁడై, తాన్= ఆ; హరీన్= వానరులను; సాంత్వయామాస= ఊఱడించెను.

అంత, నామధువనంబును బాలించునట్టి దధిముఖుండు, మధువనంబు నంతయు నశింపఁజేయుట నువిని, కోపంబునొంది, తనభటులగు, వానరులను మంచిమాటల నాశ్వాసించెను. అని, తాత్పర్యము.

ఇహా గచ్ఛత గచ్ఛామో వానరాన్ బలదర్పితాన్
బలేన వారయిష్యామో మధు భక్షయతో వయమ్. ౧౯

టీక॥ ఇహ = ఇచ్చటికి; ఆగచ్ఛత= రండు. వయం= మనము; గచ్ఛామః= పోయెదము. బలదర్పితాన్= బలము చేగర్వించినవారలును; మధు= తేనెను; భక్షయతః= భక్షించుచున్నవారలునగు; వానరాన్= వానరులను; బలేన= బలిమిచేత; వారయిష్యామః= అడ్డగించెదము.

మీరలిటురండు; మనమందఱమును బోయి, బలగర్వితులయి మధువంతయుఁ ద్రావుచున్న వానరులం బ్రహరించి, బలంబున, నివారింతము. అని, దధిముఖుండు, భటులకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రుత్వా దధిముఖస్యేదం వచనం వానరర్షభాః
పున ర్వీరా మధువనం తేనైవ సహసా యయుః. ౨౦

టీక॥ వీరాః= పరాక్రమశాలులగు; వానరర్షభాః = వానరశ్రేష్ఠులు; దధిముఖస్య= దధిముఖుని యొక్క; ఇదం= ఈ; వచనం= మాటను; శ్రుత్వా= విని;

పునః=మఱల; తేనైవ=అతనితోఁగూడనె; సహసా=వేగమున; మధువనం=మధువనమును; యయుః=పొందిరి.

పరాక్రమవంతులగు నావానరశ్రేష్ఠులు, దధిముఖుండు చెప్పినయామాట నువిని, మఱల, నతనింగూడి; వేగంబున, మధువనంబుఁబ్రవేశించిరి.

అని, తాత్పర్యము.

మధ్యే చైషాం దధిముఖః ప్రగృహ్య తరసా తరుమ్
సమభ్యధావ ద్వేగేన తేచ సర్వే ప్లవంగమాః. ౨౧

టీక॥ దధిముఖశ్చ = దధిముఖుండును; తరసా=బలముచే; తరుం=వృక్షమును; ప్రగృహ్య = గ్రహించి; ఏషాం=ఈవానరులయొక్క; మధ్యే=నడుమునందు; వేగేన=వేగముచేత; సమభ్యధావత్=పరుగెత్తెను. తే=ఆ; ప్లవంగమాః=వానరులు; సర్వేచ=అందఱును; సమభ్యధావన్(అధ్యాహృతము)=పరుగెత్తిరి.

దధిముఖుండును, బలంబుననొక్కవృక్షంబుఁబెకలించి దానింబట్టుకొని యావానరులనడుమనతివేగంబునఁబరుగెత్తెను; ఆవానరులును వెంబడించిరి.

అని, తాత్పర్యము.

తే శిలాః పాదపాంశ్చాపి పర్వతాంశ్చాపి వానరాః
గృహీత్వా భ్యగమన్ క్రుద్ధా యత్ర తే కపికుంజరాః. ౨౨

టీక॥ తే=ఆ; వానరాః=వానరులు; క్రుద్ధాః = కోపంబునొందినవారలై; శిలాః=ఱాళ్లను; పాదపాంశ్చ = వృక్షములను; పర్వతాంశ్చాపి= పర్వతములను; గృహీత్వా=పట్టుకొని; యత్ర= ఎచ్చట; తే=ఆ; కపికుంజరాః=వానరశ్రేష్ఠులు; సంతి(అధ్యాహృతము) = ఉన్నారో; తత్ర(అధ్యాహృతము)= అచ్చటికి; అభ్యగమన్=పోయిరి.

ఆవానరులు, మహాకోపంబునొంది, ఱాళ్లనువృక్షములనుబర్వతంబులనుంజేకొని, వానరశ్రేష్ఠులగు నంగదాదులున్నచోటికింబరుగెత్తిరి.

అని, తాత్పర్యము.

తే స్వామివచనం వీరా హృదయే ష్వవసజ్య తత్

స ౬౨

త్వరయా హ్యభ్యధావంత సాలతాల శిలాయుధాః. ౨౩

టీక॥ వీరాః=పరాక్రమశాలులగు; తే=ఆవానరులు; తత్=ఆ; స్వామివచనం = ప్రభుండగుదధిముఖునియొక్క మాటను; హృదయేషు=మనస్సులందు; అవసజ్య=ఉంచుకొని; సాలతాలశిలాయుధాః = మద్దిచెట్లును తాటిచెట్లును ఱాళ్లునే యాయుధములు గాఁగలవారలై; త్వరయా= వేగముచేత; అభ్యధావంతహి= పరుగెత్తిరి.

పరాక్రమ శాలులగు, నావానరులును, తమప్రభుండగు, దధి ముఖుని యాజ్ఞను మనంబుననుంచుకొని, సాల వృక్షంబులను దాలవృక్షంబులను శిలలను ఆయుధంబులను గాఁగొని, వేగంబునం బరుగెత్తిరి. అని, తాత్పర్యము.

వృక్షస్థాంశ్చ తలస్థాంశ్చ వానరాన్ బలదర్పితాన్
అభ్యక్రామం స్తతో వీరాః పాలా స్తత్ర సహస్రశః. ౨౪

టీక॥ తతః=అటుపిమ్మట; వీరాః= పరాక్రమవంతులగు; పాలాః=మధువనరక్షకులు; సహస్రశః= వేనవేలుగా; తత్ర=అచ్చట; బలదర్పితాన్= బలముచే గర్వించినవారలును; వృక్షస్థాంశ్చ=వృక్షమునందున్నవారలును; తలస్థాంశ్చ= క్రిందనున్నవారలునగు; వానరాన్= వానరులను; అభ్యక్రామన్=ఆక్రమించిరి.

అంతఁ, బరాక్రమవంతులగుమధురక్షకులయినవానరులు, వేనవేలుగా, బల దర్పితంబులగు నంగదాదివానరులపైఁబడి, వృక్షంబులపైనున్న వారలను క్రిందనున్నవారలను, అందఱనొక్కపెట్టనాక్రమించిరి. అని, తాత్పర్యము.

అథ దృష్ట్వా దధిముఖం క్రుద్ధం వానరపుంగవాః
అభ్యధావంత వేగేన హనుమత్ప్రముఖా స్తదా. ౨౫

టీక॥ అథ= అటుపిమ్మట; తదా= అప్పుడు; హనుమత్ప్రముఖాః = హనుమంతుండు మొదలు గాఁగల; వానరపుంగవాః = వానరశ్రేష్ఠులు ; క్రుద్ధం = కోపంబునొందిన; దధిముఖం=దధిముఖుని; దృష్ట్వా=చూచి; వేగేన= వేగ

ముచేత; అభ్యధావంత=ఎదురుపరిగెత్తిరి.

అంత, హనుమంతుండు మొదలుగాఁగలవానరశ్రేష్ఠులందఱును, దధిముఖుండుకోపించివచ్చుటంజూచి, వేగంబున నతని నెదుర్కొనిరి.

అని, తాత్పర్యము.

తం సవృక్షం మహాబాహుం రూపవంతం మహాబలమ్
ఆర్యకం ప్రాహరత్తత్ర బాహుభ్యాం కుపితోఙ్గదః. ౨౬

టీక॥అంగదః=అంగదుండు; కుపితః=కోపించినవాఁడై; తత్ర=అచ్చట; సవృక్షం= వృక్షముతోఁగూడినవాఁడును; మహాబాహుం = పెద్దచేతులుగలవాఁడును; రూపవంతం=సౌందర్యమునుగలవాఁడును; మహాబలం=అధికమయినబలముగలవాఁడునగు; ఆర్యకం=మామతాతయయిన; తం=ఆదధిముఖుని; బాహుభ్యాం=చేతులచేత; ప్రాహరత్ = కొట్టెను.

అంత, నంగదుండు, కుపితుండై, మహాబాహుండును మహాబలుండును వృక్షంబుచేతం గొనివచ్చుచున్న వాఁడునగుదధిముఖుని, రెండుచేతులతోనుం బ్రహరించెను. అని, తాత్పర్యము.

మదాంధశ్చ నవేద్ధైన మార్యకోయం మమేతి సః
అథైనం నిష్పిపేషాశు వేగవ ద్వసుధాతలే. ౨౭

టీక॥సః = ఆయంగదుండును; మదాంధః=మదముచేతగ్రుడ్డివాఁడై; "అయం=ఇతండు; మమ=నాయొక్క; ఆర్యకః=మామతాత;" ఇతి=అని; ఏనం=ఈదధిముఖుని; న వేద= ఎఱుంగఁడయ్యె; అథ= అటుపిమ్మట; ఏనం=ఈదధిముఖుని; వేగవత్ = వేగముగలుగునట్లుగా; ఆశు=శీఘ్రముగా; వసుధాతలే=భూమియందు; నిష్పిపేష=నలిపెను.

ఆయంగదుండు, మదాంధుండైయున్నవాఁడుగావున, "ఇతండు నామామ తాత" యనియెఱుంగక, యతని, నేలంబడఁద్రోసి, చక్కఁగాఁగ్రుమ్మెను. అని, తాత్పర్యము.

స భగ్నబాహూరుభుజో విహ్వల శ్శోణితోక్షితః

ముమోహ సహసా వీరో ముహూర్తం కపికుంజరః. ౨౮

టీక॥వీరః=పరాక్రమశాలియును;క పికుంజరః=వానరశ్రేష్ఠుండునగు; సః= ఆదధిముఖుఁడు ; భగ్నబాహూరుభుజః=విఱిగిన చేతులునుదొడలును మూఁపులునుగలవాఁడై;విహ్వలః=అవయవములస్వాధీనతదప్పినవాఁడై;సహసా= శీఘ్రముగా;ముహూర్తం=కొంచెము సేపు; ముమోహ=మూర్ఛనొందెను.

పరాక్రమవంతుండును వానరశ్రేష్ఠుండునగునాదధిముఖుఁ, డంతఁ, జేతులయందును దొడలయందునుమూఁపులయందునునొప్పిదగుల , నవయవంబుల స్వాధీనతదప్పి,కొంత సేపు, మూర్ఛిల్లియుండెను.అని, తాత్పర్యము.

స సమాశ్వస్య సహసా సంక్రుద్ధో రాజమాతులః
వానరా న్వారయామాస దండేన మధుమోహితాన్. ౨౯

టీక॥రాజమాతులః= రాజయినసుగ్రీవుని మేనమామయగు; సః=ఆదధిముఖుండు;సహసా=శీఘ్రముగా; సమాశ్వస్య=ఊఱడిల్లి;సంక్రుద్ధః= మిక్కిలియుఁగోపించినవాఁడై ; మధుమోహితాన్ = తేనెచేనజ్ఞానంబునొందఁజేయఁబడినట్టి;వానరాన్= వానరులను; దండేన= దండముచేత;వారయామాస= అడ్డగించెను.

వానరరాజుండగుసుగ్రీవుని మేనమామయగునాదధిముఖుండు,అంతశీఘ్రంబునమూర్ఛదేఱిక్రుద్ధుండై, తేనెఁద్రావుటచే దేహంబు దెలియకున్న వానరులను, దండమునందఱిమెను.అని, తాత్పర్యము

స కథంచి ద్విముక్త స్తై ర్వానరై ర్వానరర్షభః
ఉవాచై కాంత మాశ్రిత్య భృత్యాన్ స్వాన్ సముపాగతాన్. ౩౦

టీక॥సః=ఆ;వానరర్షభః= వానరశ్రేష్ఠుండగుదధిముఖుండు; తైః=ఆ; వానరైః=వానరులచేత;కథంచిత్=అతిప్రయాసముగా;విముక్తః=విడువఁబడినవాఁడై;ఏకాంతం= రహస్యప్రదేశమును;ఆశ్రిత్య = పొంది; సముపాగతాన్=వచ్చిన;స్వాన్ = తనవారలగు;భృత్యాన్= భృత్యులనుగూర్చి; ఉ

వాచ=చెప్పెను.

వానరశ్రేష్ఠుండగు నాదధిముఖుం డు, అట్లతిప్రయాసంబుననావానరులవ లనందప్పించుకొని, యేకాంత ప్రదేశ మునొంది,యచ్చటవెన్నుదగిలివచ్చినత నభృత్యులంజూచి,యిట్లని,చెప్పెను.

అని, తాత్పర్యము.

ఏతే తిష్ఠంతు గచ్ఛామో భర్తా నో యత్ర వానరః
సుగ్రీవో విపులగ్రీవ స్సహ రామేణ తిష్ఠతి. ౩౧

టీక॥ఏతే = ఈయంగదాదులు;తి ష్ఠంతు=ఉందురుగాక.యత్ర=ఎచ్చట; నః=మనకు;భర్తా=ప్రభువును; విపు లగ్రీవః=విశాలమగుకంఠముగలవాఁడు నగు;వానరః=వానరుఁడైన; సుగ్రీవః= సుగ్రీవుఁడు;రామేణసహ = రాముని తోఁగూడ;తిష్ఠతి = ఉన్నాఁడో;తం(అ ధ్యాహృతము)=ఆప్రదేశమునుగూర్చి; గచ్ఛామః=పోవుదము.

ఈయంగదాదులట్లు పడియుందు రుగాక; మనప్రభుండునువిశాలకంఠుం డునగుసుగ్రీవుండును రాముండునుఎచ్చ టనుందురో,అచ్చోటికింబోవుదము.

అని, తాత్పర్యము.

సర్వం చైవాంగదే దోషం శ్రావయిష్యామి పార్థివే
అమర్షీ వచనం శ్రుత్వా ఘాతయిష్యామి వానరాన్. ౩౨

టీక॥ పార్థివే= రాజసమీపంబు నందు; సర్వం = సమస్తమయిన; దో షంచైవ= దోషమును; అంగదే= అం గదునియందు; శ్రావయిష్యామి = విని పించెదను. అమర్షీ = అధిక మయిన కోపముగలసుగ్రీవుండు;వచనం= మా టను; శ్రుత్వా=విని; వానరాన్=వా నరులను;ఘాతయిష్యామి=చంపించును.

వానరరాజుండగు సుగ్రీవుని సమీ పంబున, “దోషంబంతయు నంగదుని దే” యనిచెప్పెదను; అంతనధిక కో పసుండగుసుగ్రీవుండు, కోపమునొంది, యావానరుల నందఱంజంపించును.

అని, తాత్పర్యము.

ఇష్టం మధువనం హ్యేత త్సుగ్రీవస్య మహాత్మనః

పితృపైతామహం దివ్యం దేవైరపి దురాసదమ్. ౩౩

టీక॥ పితృపైతామహం = తండ్రితాతలనుండివచ్చినదియు ; దివ్యం = శ్రేష్ఠమును; దేవైరపి = దేవతలచేత నుంగూడ; దురాసదం= పొందఁగూడనదియునగు; ఏతత్ = ఈ; మధువనం= మధువనము; మహాత్మనః=అధికమయినపరాక్రమముగల; సుగ్రీవస్య = సుగ్రీవునికి;ఇష్టంహి=ప్రియముగదా!

తండ్రితాతలనుండి వచ్చినదియు దివ్యంబును దేవతలకైనంజొరనలవిగానిదియునగునీమధువనంబు , మహాత్ముండగుసుగ్రీవునకు , మిక్కిలియుఁబ్రియమయినదిగదా! అని, తాత్పర్యము.

స వానరా నిమాన్ సర్వాన్ మధులుబ్ధాన్ గతాయుషః
ఘాతయిష్యతి దండేన సుగ్రీవ స్ససుహృజ్జనాన్. ౩౪

టీక॥ సః=ఆ; సుగ్రీవః = సుగ్రీవుఁడు; మధులుబ్ధాన్=తేనెయందాసగొన్నవారలును;గతాయుషః= పోయినయాయుస్సుగలవారలును ; ససుహృజ్జనాన్= స్నేహితులతోఁగూడినవారలునగు;ఇమాన్=ఈ;వానరాన్=వానరులను; సర్వాన్=అందఱను ; దండేన=శిక్షచేత; ఘాతయిష్యతి= చంపింపఁగలఁడు.

ఆసుగ్రీవుండు, తేనెయందాసగొనియున్నవారలును,ఆసన్నమృత్యువులునగునీవానరులకందఱకును , వీరలస్నేహితులకును, మరణశిక్షవిధించును. అని, తాత్పర్యము.

వధ్యాహ్యేతే దురాత్మానో నృపాజ్ఞాపరిభావినః
అమర్షప్రభవో రోష స్సఫలో నో భవిష్యతి- ౩౫

టీక॥ నృపాజ్ఞాపరిభావినః = రాజాజ్ఞనుదిరస్కరించునట్టి; దురాత్మానః=దుష్టబుద్ధులగు; ఏతే = వీరలు;వధ్యాహి = చంపఁదగినవారలుగదా! అమర్షప్రభవః = ఓర్వలేమియేకారణముగాఁగల; నః =మనయొక్క; రోషః=కోపము; సఫలః=ఫలముతోఁగూడినది; భవిష్యతి=కాఁగలదు.

దుష్టబుద్ధులగువీరలు, రాజాజ్ఞందిరస్కరించుటవలన, వీరలువధింపఁదగిన వారలె యగుచున్నారు కావున వానరరాజుండగుసుగ్రీవుండువీరల నవశ్యమువధించును;అట్లు, మనకోపమును సఫలంబు గాఁగలదు. అని దధిముఖుండు, తనభృత్యులకుంజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త్వా దధిముఖో వనపాలా న్మహాబలః
జగామ సహసోత్పత్య వనపాలై స్సమన్వితః. ౩౬

టీక॥ మహాబలః=అధికమగుబలముగలఁ;దధిముఖః=దధిముఖుఁడు; ఏవం=ఇట్లు;వనపాలాన్= మధువనరక్షకులనుగూర్చి;ఉక్త్వా=చెప్పి; వనపాలైః=మధువనరక్షకులతో; సమన్వితః=కూడినవాఁడై;సహసా=శీఘ్రముగా; ఉత్పత్య=ఎగిరి;జగామ=పోయెను.

మహాబలశాలియగు నాదధిముఖుండిట్లుమధువనరక్షకులకుంజెప్పి, వారలతోఁగూడ,నాకాశంబునకుద్గమించి, శీఘ్రంబునంబోయెను.

అని, తాత్పర్యము-

నిమేషాంతర మాత్రేణ సహిప్రాప్తో వనాలయః
సహస్రాంశు సుతో ధీమాన్ సుగ్రీవో యత్ర వానరః. ౩౭

టీక॥యత్ర=ఎచ్చట;ధీమాన్= బుద్ధిమంతుండును; సహస్రాంశుసుతః =సూర్యునికొడుకునగు;సుగ్రీవః= సుగ్రీవుండను;వానరః= వానరుండు; అస్తి (అధ్యాహృతము) = ఉన్నాఁడో;తం (అధ్యాహృతము) = ఆప్రదేశమును; సః=ఆ;వనాలయః=వానరుండగుదధిముఖుండు;నిమేషాంతరమాత్రేణ= నిమిషమాత్రముచేత ; ప్రాప్తోహి = పొందినాఁడుగదా!

ఆదధిముఖుఁడు, బుద్ధిమంతుండును సూర్యకుమారుండగు సుగ్రీవుండుండుచోటికి, ఒకనిమేషంబునంబోయిచే

అని, తాత్పర్యము-

రామంచ లక్ష్మణం చైవ దృష్ట్వాసుగ్రీవ మేవ చ
సమప్రతిష్ఠాం జగతీ మాకాశా న్నిపపాతహ. ౩౮

టీక॥ సః (అధ్యాహృతము) = ఆదధి ముఖుండు, రామంచ = రాముని; లక్ష్మణంచైవ = లక్ష్మణునిని; సుగ్రీవ మేవచ = సుగ్రీవునిని; దృష్ట్వా = చూచి, ఆకాశాత్ = ఆకాశంబుననుండి; సమప్రతిష్ఠాం = మిట్టపల్లము లేనిస్థితిగల; జగతీం = భూమిని; నిపపాత = పొందెను. "హ" అనునది పాదపూరణార్థము.

ఆదధిముఖుండు, రామలక్ష్మణసుగ్రీవులంజూచి, యంత, నాకాశంబుననుండి, మిట్టపల్లము లేని సమభూమికి వ్రాలెను. అని, తాత్పర్యము.

సన్నిపత్య మహావీర్య స్సర్వై స్తైః పరివారితః
హరి ర్దధిముఖః పాలైః పాలానాం పరమేశ్వరః. ౩౯
స దీన వదనో భూత్వా కృత్వా శిరసిచాంజలిమ్
సుగ్రీవస్య శుభౌ మూర్ధ్నా చరణౌ ప్రత్యపీడయత్. ౪౦

టీక॥ మహావీర్యః = అధికమయిన పరాక్రమముగలవాఁడును; పాలానాం = రక్షకులకు; పరమేశ్వరః = మహాప్రభుండును; హరిః = వానరుఁడునగు; సః = ఆ; దధిముఖః = దధిముఖుఁడు; తైః = ఆ; పాలైః = మధువనరక్షకులచేత; సర్వైః = అందఱిచేతను; పరివారితః = పరివేష్టింపఁబడినవాఁడై; దీనవదనః = దుఃఖముపొందినముఖముగలవాఁడు; భూత్వా = అయి; శిరసి = తలయందు; అంజలిం = చేమోడ్పును; కృత్వాచ = చేసియు; శుభౌ = మంగళకరంబులగు; సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క; చరణౌ = పాదములను; మూర్ధ్నా = తలచేత; ప్రత్యపీడయత్ = పీడించెను.

మహాపరాక్రమశాలియు మధువనరక్షకులకందఱకుఁ బ్రభుండునగు నాదధిముఖుండు, తనభృత్యులయందఱిచే తనుంబరివేష్టింపఁబడినవాఁడై, దీనవదనుండై, శిరంబునంజేమోడ్పుగీలించి తనశిరంబు మంగళకరంబులగు సుగ్రీవునిపాదంబులుసోఁకం, బ్రణామంబు గావించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, ద్విషష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, సుందరకాండద్విషష్టితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీః.

త్రిషష్టితమసర్గప్రారంభః.

తతో మూర్ధ్నా నిపతితం వానరం వానరర్షభః
దృష్ట్వైవో ద్విగ్నహృదయో వాక్య మేతదువాచహ. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; వానరర్షభః = వానరశ్రేష్ఠుండగుసుగ్రీవుండు; మూర్ధ్నా=తలచేత; నిపతితం=నమస్కరించిన; వానరం = దధిముఖుని; దృష్ట్వైవ=చూచినంతనె; ఉద్విగ్నహృదయః=భయమునొందినమనసుగలవాఁడై; ఏతత్=ఈ; వాక్యం = మాటను; ఉవాచ= చెప్పెను. "హ" అనునది పాదపూరణార్థము.

అంత, వానరశ్రేష్ఠుండగుసుగ్రీవుండు, అట్లుతనకు సాష్టాంగంబుగ నమస్కరించినదధిముఖుంజూచినంతనె, ఇతం డెందుకువచ్చెనని మహాభయంబునొంది, యీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఉత్తిష్ఠోత్తిష్ఠ కస్మాత్త్వం పాదయోః పతితో మమ
అభయం తే భవే ద్వీర సర్వమేవా భిధీయతామ్. ౨

టీక॥ఉత్తిష్ఠ=లెమ్ము. ఉత్తిష్ఠ = లెమ్ము. కస్మాత్= ఎందువలన; త్వం=నీవు; మమ=నాయొక్క; పాదయోః= పాదములయందు; పతితః=పడినావు? వీర= పరాక్రమశాలివగుదధిముఖుఁడా! తే= నీకు; అభయం = భయంబులేమి; భవేత్ =అగును. సర్వమేవ=అంతయును; అభిధీయతాం=చెప్పఁబడుఁగాక.

పరాక్రమశాలివగు దధిముఖుఁడా! లెమ్ము లెమ్ము. నీవునాపాదంబులంబడితి వేల? నీకభయంబొసంగెదను; జరిగినసమాచారంబునంతయుఁ జెప్పుము.

అని, తాత్పర్యము.

సతు విశ్వాసితస్తేన సుగ్రీవేణ మహాత్మనా
ఉత్థాయ సుమహాప్రాజ్ఞో వాక్యం దధిముఖో బ్రవీత్. ౩

టీక॥ సుమహాప్రాజ్ఞః = మిక్కిలి యుగొప్పపండితుఁడగు; సః= ఆ;దధిముఖస్తు= దధిముఖుండును; మహాత్మనా= పూజ్యమయిన హృదయముగల; తేన= ఆ; సుగ్రీవేణ= సుగ్రీవునిచేత; విశ్వాసితః=నమ్మింపఁబడినవాఁడై; ఉత్థాయ= లేచి; వాక్యం=మాటను; అబ్రవీత్= పలికెను.

మహాపండితుండగు నా దధిముఖుండు, మహాత్ముండగు నాసుగ్రీవుండ భయంబాసంగుటవలన విశ్వాసంబువొంది, లేచి, యిట్లని చెప్పెను.

అని, తాత్పర్యము.

నైవర్క్ష రజసా రాజన్న త్వయా నాపి వాలినా
వనం నిసృష్టపూర్వంహి భక్షితం తచ్చ వానరైః. ౪

టీక॥ రాజన్ = వానరరాజుండవగుసుగ్రీవుఁడా! వనం=మధువనము; ఋక్షరజసా=ఋక్షరజస్సుచేత; ననిసృష్టపూర్వంహి=మున్నువిడువఁబడినది కాదుగదా! త్వయా=నీచేత; న (నిసృష్టపూర్వంహి)= మున్నువిడువఁబడినది కాదుగదా! వాలినాపి=వాలిచేతను; న (నిసృష్టపూర్వంహి)=మున్ను విడువఁబడినదికాదుగదా ! తచ్చ=అట్టిమధువనంబును; వానరైః=వానరులచేత ; భక్షితం=తినఁబడినది.

వానరరాజుండవగుసుగ్రీవుఁడా! నీతండ్రిఋక్షరజునికాలంబునంగాని నీయన్నవాలికాలంబునంగాని నీకాలంబునంగానియిదివఱకెప్పుడును, ఎవ్వరికిని జొరనలవిగాకుండినమధువనంబును, నేఁటికాలంబునకు, అంగదాదివానరులు వచ్చి, అంతయుభక్షించిరి.

అని, తాత్పర్యము.

ఏభిః ప్రధర్షితాశ్చైవ వానరా వనరక్షిభిః
మధూన్యచింతయిత్వేమాన్భక్షయంతి పిబంతిచ. ౫

టీక॥ వానరాః= అంగదాదివానరులు; ఏభిః=ఈ ; వనరక్షిభిః = వనమునురక్షించువానరులచేత ; ప్రధర్షితాశ్చైవ=బెదరింపఁబడినవారలునై ; ఇమాన్=వీరలను ; అచింతయిత్వా=చింతింపక; మధూని=తేనెలను; భక్షయంతి = తినుచున్నారు. పిబంతిచ=త్రాఁగుచున్నారును.

ఆవానరులు, మధువనరక్షకులగువీరలుపోయి బెదరించినను, వీరలనుసరకు సేయక,యథేష్టముగాఁ దేనియలఁద్రాఁగుచున్నారు. అని, తాత్పర్యము.

శిష్ట మత్రాప విధ్యంతి భక్షయంతి తథాపరే
నివార్యమాణా స్తే సర్వే భ్రువోవై దర్శయంతి హి. ౬

టీక॥శిష్టం=మిగతను;అత్ర= ఇచ్చట;అపవిధ్యంతి = పాఱవేసెదరు. తథా=అట్లు;అపరే = మఱికొందఱు;భక్షయంతి=తినుచున్నారు. తే=వారలు; సర్వే=అందఱును;నివార్యమాణాః=అడ్డగింపఁబడుచున్నవారలై; భ్రువౌ=కనుబొమ్మలను("వై"అనునదిపాదపూరణార్థము);దర్శయంతిహి= చూపుచున్నారుగదా!

కొందఱుయథేష్టంబుగాఁద్రావి మిగతనేలంబాఱఁబోసెదరు; మఱికొందఱుఁద్రావెదరు; ఈరక్షకులునివారించినచోఁ,గనుబొమలంజూపెదరు.

అని, తాత్పర్యము.

ఇమే హి సంరబ్ధతరా స్తథా తై స్సంప్రధర్షితాః
వారయంతో వనా త్తస్మా త్క్రుద్ధై ర్వానరపుంగవైః ౭

టీక॥సంరబ్ధతరాః=మిక్కిలియుసంరంభముగలవారలును; తస్మాత్=ఆ;వనాత్ = మధువమునుండి; వారయంతః= అడ్డగింపుచున్న వారలునగు; ఇమే= ఈవనరక్షకులు, క్రుద్ధైః= కోపమునొందిన; తైః= ఆ; వానరపుంగవైః= వానరశ్రేష్ఠులచేత; తథా=అట్లు; సంప్రధర్షితాః = బెదరింపఁబడినారు.

వనరక్షకులగువీరలు, సంరంభంబున, "వనంబుననుండి పొం"డని, వారలనువారింపఁగా, నావానరశ్రేష్ఠులు,

అట్లుబొమ్మముడి పాటుఁబూవుటమొదలగు వానిచేత వీరలను బెదరించిరి. అని, తాత్పర్యము.

తత స్తైర్బహుభి ర్వీరై ర్వానరై ర్వానరర్షభ
సంరక్తనయనైః క్రోధా ద్ధరయః ప్రవిచాలితాః. ౮

టీక॥వానరర్షభ= వానరశ్రేష్ఠుండవగుసుగ్రీవుఁడా!బహుభిః= అనేకులును;వీరైః=పరాక్రమశాలులును; సంరక్తనయనైః= ఎఱ్ఱనికండ్లుగలవారలునగు;తైః=ఆ;వానరైః= వానరులచేత; క్రోధాత్= కోపమువలన;హరయః= వనరక్షకులగు వానరులు ; ప్రవిచాలితాః=తఱుమఁబడినారు.

వానరశ్రేష్ఠుండవగుసుగ్రీవుఁడా! అనేకులునుబరాక్రమవంతులగు నావానరులు,కోపంబునఁ,గన్నులనెఱ్ఱదనంబు గదుర, వనరక్షకులగు నీవానరులనందఱం,దఱిమిరి. అని, తాత్పర్యము.

పాణిభి ర్నిహతాః కేచి త్కేచి జ్జానుభి రాహతాః
ప్రకృష్టాశ్చ యథాకామం దేవమార్గంచ దర్శితాః. ౯

టీక॥కేచిత్ = కొందఱు; పాణిభిః=హస్తములచేత; నిహతాః= కొట్టఁబడినారు. కేచిత్=కొందఱు; జానుభిః=మోఁకాళ్ల చేత;ఆహతాః= కొట్టఁబడినవారలై ;ప్రకృష్టాశ్చ= ఈడ్వఁబడినవారలునై, దేవమార్గంచ= ఆకాశమార్గంబును; దర్శితాః= చూపఁబడినారు.

ఆవానరులు, వనరక్షకులంగొందఱుహస్తంబులంగొట్టిరి;కొందఱుమోఁకాళ్లంబ్రహరించి , లేవనెత్తి తలక్రిందుగాఁ బట్టిమ ద్యాకాశంబుఁ జూచునట్లుగావించిరి. అని, తాత్పర్యము.

త్వయి తే హతా శ్శూరా స్త్వయి తిష్ఠతి భర్తరి
కృత్స్నం మధువనంచైవ ప్రకామం తైః ప్రభక్ష్యతే. ౧౦

టీక॥ భర్తరి=ప్రభుండవగు; త్వయి= నీవు; తిష్ఠతి=ఉండఁగా; తైః =

ఆవానరులచేత; ఏవం=ఇట్లు; ఏతే=ఈ; శూరాః = యుద్ధమునందుభయయములేనట్టివానరులు; హతాః= కొట్టఁబడిరి. ప్రకామం=యథేష్టముగా; కృత్స్నం= సమస్తమయిన ; మధువనంచైవ=మధువనంబును;ప్రభక్ష్యతే = భక్షింపఁబడుచున్నది.

ప్రభుండవగునీవుండఁగానే, ఆయంగదాదివానరులు, ఇట్లుశూరులగువీరలం బ్రహరించి,మధువనంబునందలి, మధువునంతయుఁద్రాఁగుచున్నారు. అని, దధిముఖుండు, సుగ్రీవునితోఁ జెప్పకొనెను. అని,తాత్పర్యము.

ఏవం విజ్ఞాప్యమానం తం సుగ్రీవం వానరర్షభమ్
అపృచ్ఛ త్తమ్మహా ప్రాజ్ఞో లక్ష్మణః పరవీరహా. ౧౧

టీక॥మహాప్రాజ్ఞః = మహాపండితుండును;పరవీరహా= శత్రువీరులంజంపువాఁడునగు; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ఏవం=ఇట్లు;విజ్ఞాప్యమానం= విన్నవింపఁబడుచున్న వాఁడును ; వానరర్షభం=వానరశ్రేష్ఠుండునగు; సుగ్రీవం=సుగ్రీవుని;తం=ఆదధిముఖునిగూర్చి; అపృచ్ఛత్=అడిగెను.

ఇట్లుదధిముఖుండు వానరశ్రేష్ఠుండగుసుగ్రీవునితో విన్నవించుకొనుటంజూచి,మహాపండితుండును శత్రువీరులంజంపువాఁడునగు లక్ష్మణుండు, ఆదధిముఖుంగూర్చి,సుగ్రీవు,నిట్లని,పృచ్ఛించెను-అని, తాత్పర్యము.

కి మయం వానరో రాజన్ వనపః ప్రత్యుపస్థితః
కంచార్థ మభినిర్దిశ్య దుఃఖితో వాక్య మబ్రవీత్- ౧౨

టీక॥ రాజన్= వానరరాజుండవగుసుగ్రీవుఁడా! అయం=ఈ;వనపః = వనంబునుబాలించునట్టి; వానరః=వానరుండు; కిం=ఎందుకు;ప్రత్యుపస్థితః = వచ్చినాఁడు? దుఃఖితః=దుఃఖమునొందినవాఁడై; కం=ఏ; అర్థంచ = ప్రయోజనమును; అభినిర్దిశ్య= ఉద్దేశించి; వాక్యం=మాటను ; అబ్రవీత్=పలికెను?

వానరరాజుండవగు సుగ్రీవుఁడా ! వనపాలకుండగు నీవానరుండిచ్చటికేల వచ్చినాఁడు? మఱియు నెందుకుదుఃఖి

తుండవ్యోః ఇప్పుడిచ్చట నేమిచెప్పు చున్నాఁడుః అనిలక్ష్మణుండు, సుగ్రీవునడిగెను- అని, తాత్పర్యము-

ఏవ ముక్తస్తు సుగ్రీవో లక్ష్మణేన మహాత్మనా
లక్ష్మణం ప్రత్యువాచేదం వాక్యం వాక్య విశారదః. ౧౩

టీక ॥ వాక్య విశారదః = మాటలయందుఁబండితుండగు; సుగ్రీవః=సుగ్రీవుండు; మహాత్మనా= అధికమయిన బలముగల; లక్ష్మణేన=లక్ష్మణునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు = చెప్పఁబడిన వాఁడైనంతనె; లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి; ఇదం=ఈ; వాక్యం=మాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను-

మాటలుచెప్పుటయందుఁబండితుండగు;సుగ్రీవుండు, మహాపరాక్రమశాలియగు లక్ష్మణుండుచెప్పినదివిని,యతనింజూచి, ఇట్లని,బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

ఆర్య లక్ష్మణ సంప్రాహ వీరో దధిముఖః కపిః
అంగద ప్రముఖై ర్వీరై ర్భక్షితం మధు వానరైః. ౧౪
విచిత్య దక్షిణా మాశా మాగతై ర్హరిపుంగవైః

టీక॥ ఆర్య=పూజ్యుఁడవగు; లక్ష్మణ=లక్ష్మణుఁడా! వీరః= పరాక్రమశాలియగు; దధిముఖః = దధిముఖుండను; కపిః= వానరుఁడుః "దక్షిణాం= దక్షిణపు; ఆశాం = దిక్కును ; విచిత్య=వెదకి;ఆగతైః=వచ్చినవారలును; వీరైః = పరాక్రమశాలులును; హరిపుంగవైః=వానరశ్రేష్ఠులునగు ; అంగదప్రముఖైః = అంగదుండుమొదలుగాఁగల; వానరైః=వానరులచేత; మధు= తేనె; భక్షితం=తినఁబడినది-" ఇతి (అధ్యాహృతము)=అని సంప్రాహ=చెప్పుచున్నాఁడు-

పూజ్యుండవగులక్ష్మణుఁడా!"దక్షిణదిక్కును వెదకివచ్చినట్టి, పరాక్రమవంతులును వానరోత్తములునగు నంగదాది వానరులు.మధువనంబునందలి మధువు నంతయుఁద్రావిరి"అని, వీరుండగునీద

ధిముఖుండు, చెప్పుచున్నాఁడు. అని, తాత్పర్యము.

నైషా మకృతకృత్యానా మీదృశ స్స్యా దుపక్రమః. ౧౫
ఆగతైశ్చ ప్రమథితం యథా మధువనం హి తైః
ధర్షితంచ వనం కృత్స్న ముపయుక్తంచ వానరైః, ౧౬

టీక॥ యథా= ఎట్లు; ఆగతైః=వచ్చిన; తైః=ఆ; వానరైః= వానరులచేత; మధువనం = మధువనము ; ప్రమథితంచ=విఱువఁబడినదియునో; వనం= మధువనము; కృత్స్నం= అంతయు; ధర్షితంచ = ఆక్రమింపఁబడినదియునో; ఉపయుక్తంచ= భక్షింపఁబడినదియునో; ఈదృశః= ఇట్టి; ఉపక్రమః= ప్రయత్నము ; అకృతకృత్యానాం = చేయఁబడిన చేయవలసినకార్యముగలవారలుకానట్టి; ఏషాం=ఈయంగదాదివానరులకు ; నస్యాత్ = కలుగదు.

ఈయంగదాదివానరులు , వచ్చుచునే,మధువనంబు, ప్రవేశించి, దానినంతయునాక్రమించియు , దానివిఱిచియు, నందలితేనియనంతయుఁద్రావినారే; వీరలుకృతకృత్యులు గాకుండినచో, నిట్టికార్యంబు సేయసాహసింపంజాలరు. అని, తాత్పర్యము.

వనం యదా భిపన్నా స్తే సాధితం కర్మ వానరైః

టీక॥ తే=ఆవానరులు ; యదా= ఎప్పుడు; వనం = మధువనమును ; అభిపన్నాః=ప్రవేశించినారో; తదా= అప్పుడు; వానరైః = వానరులచేత ; కర్మ=కార్యము; సాధితం= సాధింపఁబడినది.

ఆవానరులు, ధైర్యంబున, మధువనంబుఁబ్రవేశించుటవలన , వారలుకార్యంబునుసాధించియేవచ్చిరని , స్పష్టమగుచున్నది. అని,తాత్పర్యము.

దృష్టా దేవీ న సందేహో న చాన్యేన హనూమతా. ౧౭

టీక॥ దేవీ=సీతాదేవి ; దృష్టా = చూడఁబడినది. సందేహః = సంశయము; న=లేదు. అన్యేనచ= ఇతరునిచేతను; న = కాదు. హనూమతా =

హనుమంతునిచేతనే ; దృష్టా (అధ్యాహృతము)=చూడఁబడినది.

వారలుసీతాదేవింజూచివచ్చిరి; ఇతరుండెవ్వండునుజూచియుండఁడు;హనుమంతుండె, సీతాదేవింజూచియుండును. అని, తాత్పర్యము.

న హ్యన్య స్సాధనే హేతుః కర్మణోస్య హనూమతః

టీక॥ హనూమతః= హనుమంతుని కన్న; అన్యః=ఇతరుండు; అస్య=ఈ; కర్మణః = కార్యముయొక్క; సాధనే=సాధించుటయందు; హేతుః=కారణము; నహి=కాఁడుగదా!

హనుమంతుండుదక్క,నింకనెవ్వండును, ఈకార్యంబునుసాధింపంజాలఁడు. అని, తాత్పర్యము.

కార్యసిద్ధి ర్మతి శ్చైవ తస్మి న్వానరపుంగవే. ౧౦
వ్యవసాయశ్చ వీర్యంచ శ్రుతంచాపి ప్రతిష్ఠితమ్

టీక॥ వానరపుంగవే = వానరశ్రేష్ఠుండగు; తస్మిన్ = ఆహనుమంతునందు; కార్యసిద్ధిశ్చైవ= కార్యంబునెఱవేఱుటయును; మతిశ్చైవ= బుద్ధియును; వ్యవసాయశ్చ=ప్రయత్నమును ; వీర్యంచ=పరాక్రమమును ; శ్రుతంచాపి=విద్యయును; ప్రతిష్ఠితం=ఉన్నది.

కార్యసాధనసామర్థ్యంబును , బుద్ధియు,నుత్సాహంబును, బరాక్రమంబును, విద్యయు, ఇవన్నియు, వానరశ్రేష్ఠుండగు నాహనుమంతు నందునెలకొనియున్నవి. అని, తాత్పర్యము.

జాంబవా న్యత్ర నేతా స్యా దంగదశ్చ మహాబలః. ౧౧
హనుమాం శ్చాప్యధిష్ఠాతా నతస్య గతి రన్యథా

టీక॥ యత్ర = ఏకార్యమునందు; జాంబవాన్ = జాంబవంతుండు; నేతా=నాయకుండు; స్యాత్=అగునో; మహాబలః = అధికమయినబలముగల; అంగదశ్చ=అంగదుండును; నేతాస్యాత్ (అధ్యాహృతము) = నాయకుండగునో ; హనుమాంశ్చాపి=హనుమంతుండును; అధిష్ఠాతా = అధిష్ఠించినవాఁడు;స్యాత్ (అధ్యాహృతము)=అగునో;తస్య = ఆకార్యముయొక్క;

గతిః= ప్రాప్తి; అన్యథా= వేఱువిధము గా; న= కాదు.

ఏకార్యంబునందు, జాంబవంతుండు నుమహాబలుండగు నంగదుండును నాయకులయియుందురో, మఱియుహనుమంతుండునుదోడ్పడియుండునో, ఆకార్యం బుదప్పక సిద్ధించునేకాని వేఱువిధము కానేరదు. అని, తాత్పర్యము.

అంగదప్రముఖై ర్వీరై ర్హతం మధువనం కిల. ౨౦

టీక॥ అంగదప్రముఖైః= అంగదుండు మొదలుగాఁగల; వీరైః= వీరులచేత; మధువనం= మధువనము; హతంకిల= నశింపఁజేయఁబడినదిగదా.

అంగదుండు మొదలగువానరవీరులు, వచ్చి, మధువనంబునంతయుఁ జెఱిచిరి- అని, తాత్పర్యము.

వారయంతశ్చ సహితా స్తథా జానుభి రాహతాః

టీక॥ ఏతే (అధ్యాహృతము) = ఈవనపాలకులు, సహితాః = కూడుకొనినవారలై; వారయంతశ్చ = నివారించుచును; తథా = అట్లు; జానుభిః= మోకాళ్లచేత; ఆహతాః= కొట్టఁబడినారు

అప్పుడే, వనపాలకులందఱును కలసియుండి, వారలను వారింపఁగా, వారలు వీరిలనందఱ, నానా విధంబులం బ్రహరించిరి.

అని, తాత్పర్యము.

ఏత దర్థ మయం ప్రాప్తో వక్తుం మధురవా గిహ ౨౧
నామ్నా దధిముఖో నామ హరిః ప్రఖ్యాతవిక్రమః

టీక॥ మధురవాక్= మధురమయిన మాటగలవాఁడును; ప్రఖ్యాతవిక్రమః= ప్రసిద్ధినొందినపరాక్రమముగల వాఁడును; నామ్నా= పేరుచేత; దధిముఖో నామ= దధిముఖుండనిప్రసిద్ధుం డునగు; అయం= ఈ; హరిః= వానరుఁడు; ఏతదర్థం = ఇందుకొఱకు; వక్తుం= చెప్పుటకు; ఇహ= ఇచ్చటికి; ప్రాప్తః= వచ్చినాఁడు.

మధురముగా మాటలాడు వాఁడు

ను, మహాపరాక్రమశాలియునగుదధిముఖుండనునీవానరుండు, ఈసమాచారంబునేచెప్పుటకై, యిచ్చటికివచ్చినాఁడు. అని, తాత్పర్యము.

దృష్టా సీతా మహాబాహో సౌమిత్రే పశ్య తత్త్వతః. ౨౨

టీక॥మహాబాహో= పెద్దచేతులుగల;సౌమిత్రే=లక్ష్మణుఁడా!సీతా=సీతాదేవి;దృష్టా=చూడఁబడినది.తత్త్వతః=యాథార్థ్యముచేత; పశ్య=చూడుము.

మహాబాహుండవగులక్ష్మణుఁడా! వానరులుసీతంజూచియుందురు; నీవును యథార్థంబుగానాలోచింపుము.

అని, తాత్పర్యము.

అభిగమ్య తథా సర్వే పిబంతి మధు వానరాః

టీక॥తథా=అట్లు;వానరాః=వానరులు;సర్వే = అందఱును;అభిగమ్య=పొంది;మధు=తేనియను;పిబంతి=త్రాఁగుచున్నారు.

కావుననె, యావానరులందఱును, నిర్భయంబుగా, మధువనంబుఁజొచ్చి, యథేష్టంబుగాఁ దేనియలంద్రావుచున్నారు.అని, తాత్పర్యము.

న చాప్యదృష్ట్వా వైదేహీం విశ్రుతాః పురుషర్షభ. ౨౩
వనం దత్తవరం దివ్యం ధర్షయేయు ర్వనౌకసః

టీక॥పురుషర్షభ= పురుషశ్రేష్ఠుండవగులక్ష్మణుఁడా! విశ్రుతాః=ప్రసిద్ధులగు; వనౌకసః = వానరులు; వైదేహీం = సీతాదేవిని;అదృష్ట్వాచాపి=చూడకయె;దత్తవరం= ఇయ్యఁబడినవరముగలదియు;దివ్యం= శ్రేష్ఠంబునగు; వనం = మధువనమును; నధర్షయేయుః=నశింపఁజేయరు.

బుద్ధియందును బరాక్రమంబునందు నుబ్రఖ్యాతులగునావానరులు,సీతంజూడకయేవచ్చియుండినచో, బ్రహ్మదేవునిచే నాతండ్రికొసంగంబడినదియుదివ్యంబునగుమధువనంబు నెంతమాత్రముప్రవేశింపరు. అని, సుగ్రీవుండులక్ష్మణునితోఁజెప్పెను.అని, తాత్పర్యము.

తతః ప్రహృష్టో ధర్మాత్మా లక్ష్మణ స్సహ రాఘవః. ౨౪

టీక॥ తతః=అటుపిమ్మట; ధర్మాత్మా=ధర్మస్వభావుండగు; లక్ష్మణః=లక్ష్మణుండు; సహరాఘవః= రామునితోఁగూడినవాఁడై; ప్రహృష్టః = సంతసించినాఁడు.

అంత, ధర్మాత్ముఁడగు లక్ష్మణుండును రాముండును, సంతోషంబునొందిరి. అని, తాత్పర్యము.

శ్రుత్వా కర్ణసుఖాం వాణీం సుగ్రీవవదనా చ్చ్యుతామ్
ప్రాహృష్యత భృశం రామో లక్ష్మణశ్చ మహాబలః. ౨౫

టీక॥ రామః=రాముండును; మహాబలః = అధికమయినబలముగల; లక్ష్మణశ్చ=లక్ష్మణుండును; సుగ్రీవవచనాత్ = సుగ్రీవునినోటనుండి; చ్యుతాం = జాఱిన; కర్ణసుఖాం = చెవులకుసుఖకరమయిన; వాణీం=మాటను; శ్రుత్వా=విని; భృశం=మిక్కిలియు; ప్రాహృష్యత= సంతోషించెను.

సుగ్రీవునినోటనుండి వెడలినకర్ణసుఖావహంబగు నామాటనువిని, రాముండును మహాబలుండగులక్ష్మణుండును, మిక్కిలియు సంతోషించిరి.

అని, తాత్పర్యము.

శ్రుత్వా దధిముఖ స్యే దం సుగ్రీవస్తు ప్రహృష్యచ
వనపాలం పున ర్వాక్యం సుగ్రీవః ప్రత్యభాషత. ౨౬

టీక॥ సుగ్రీవః= మంచికంఠముగల; సుగ్రీవస్తు = సుగ్రీవుండును; దధిముఖస్య=దధిముఖునియొక్క; ఇదం=ఈమాటను; శ్రుత్వా=విని; ప్రహృష్యచ= సంతోషించియు; పునః = మఱల; వనపాలం=వనరక్షకుఁడగుదధిముఖునిగూర్చి; వాక్యం=మాటను; ప్రత్యభాషత=బదులుచెప్పెను.

సుందరమగుకంఠముగల యాసుగ్రీవుండు, దధిముఖుండు చెప్పినదివిని, సంతోషించి, వనపాలకుండగు నాదధిముఖునింజూచి, యిట్లని, బదులు చెప్పెను.

అని, తాత్పర్యము.

ప్రీతో స్మి సో హం యద్భుక్తం వనం తైః కృతకర్మభిః
మర్షితం మర్షణీయంచ చేష్టితం కృతకర్మణామ్. ౨౭

టీక॥యత్ = ఎందువలన; కృతకర్మభిః = చేయఁబడినకార్యముగల; తైః=ఆవానరులచేత; వనం=మధువనము; భుక్తం = భుజింపఁబడినదో; తత్ (అధ్యాహృతము)=అందువలన; సః=అట్టి; అహం=నేను; ప్రీతః=సంతసించినవాఁడను; అస్మి=అగుచున్నాను. కృతకర్మణాం= చేయఁబడిన కార్యముగలవారలయొక్క; చేష్టితం= కార్యము; మర్షితం= క్షమింపఁబడినది; మర్షణీయంచ=క్షమింపఁదగినదియు.

కృతకృత్యులగు నావానరులు, మధువనంబునందలిమధువు నంతయుఁ ద్రాగినందుకు, నేను, సంతసించితిని; వారలు, కృతకృత్యులు కాఁబట్టి, వారలచేష్టను, నేను క్షమింపవలసినది కావున, క్షమించితిని.

అని, తాత్పర్యము.

ఇచ్ఛామి శీఘ్రం హనుమత్ప్రధానాన్
శాఖామృగాం స్తాన్ మృగరాజదర్పాన్
ద్రష్టుం కృతార్థాన్ సహ రాఘవాభ్యాం
శ్రోతుం చ సీతాధిగమే ప్రయత్నమ్. ౨౮

టీక॥కృతార్థాన్= చేయఁబడినప్రయోజనముగలవారలును; మృగరాజదర్పాన్= సింహముయొక్క గర్వమువంటిగర్వముగలవారలునగు ; హనుమత్ప్రధానాన్ =హనుమంతుండుముఖ్యుఁడుగాఁగల; తాన్= ఆ; శాఖామృగాన్= వానరులను; ద్రష్టుం= చూచుటకును; సీతాధిగమే=సీతాదేవియొక్క పొందుటయందు; ప్రయత్నం=ప్రయత్నమును; శ్రోతుంచ=వినుటకును; రాఘవాభ్యాం సహ= రామలక్ష్మణులతోఁగూడ; ఇచ్ఛామి=కోరుచున్నాను.

కృతార్థులును సింహంబునకుం బోలెగర్వంబుగలవారలునగు హనుమంతుండుమున్నగు నావానరులం జూచుటకును సీతాదేవిం జూచుటకై వారలు చేసిన ప్రయత్నంబును వినుటకును నేనును రామలక్ష్మణులును, గోరుచున్నాము. అని

సుగ్రీవుండు నధిముఖునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ప్రీతిస్ఫీతాక్షౌ సంప్రహృష్టౌ కుమారౌ
దృష్ట్వా సిద్ధార్థౌ వానరాణాంచ రాజా
అంగైస్సంహృష్టైః కర్మసిద్ధిం విదిత్వా
బాహ్వోరాసన్నాం సోతిమాత్రం ననంద. ౨౯

టీక॥ సః= ఆ; వానరాణాం=వానరులయొక్క; రాజాచ = రాజయిన సుగ్రీవుండును; ప్రీతిస్ఫీతాక్షౌ=సంతోషముచే వికసించిన కండ్లుగల వారలును; సంప్రహృష్టౌ=గగుర్పాటునొందినవారలును; సిద్ధార్థౌ = ఈడేఱిన ప్రయోజనముగల వారలునగు, కుమారౌ = రామలక్ష్మణులను; దృష్ట్వా= చూచి; సంహృష్టైః = సంతోషంబు నొందిన; అంగైః= అవయవములచేత; కర్మసిద్ధిం = కర్మసిద్ధిని; బాహ్వోః = చేతులకు; ఆసన్నాం= సమీపించినదానిఁగా; విదిత్వా= తెలిసికొని; అతిమాత్రం= మిక్కిలియును; ననంద=సంతోషించెను.

సిద్ధార్థులమయితి మని సంతోషమున వికసించిననేత్రంబులతో నొప్పుచు దేహంబంతయుగగుర్పాటు నొందియున్న రామలక్ష్మణులంజూచి, వానరరాజుండగునాసుగ్రీవుండు, సంతోషంబునందనవయవంబులందుఁ గనుపడు శుభనిమిత్తంబులఁచే, గార్యసిద్ధిహస్తగతంబయినదని, మిక్కిలియుసంతసించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, త్రిషష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండత్రిషష్టితమసర్గటీక,
ముగిసినది.

శ్రీ

## చతుష్షష్టితమసర్గప్రారంభః.

సుగ్రీవేణైవ ముక్తస్తు హృష్టో దధిముఖః కపిః
రాఘవం లక్ష్మణంచైవ సుగ్రీవం చాభ్యవాదయత్. ౧

టీక॥ దధిముఖః= దధిముఖుండను; కపిః=వానరుండు; ఏవం=ఇట్లు ; సుగ్రీవేణ=సుగ్రీవుని చేత;ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనె; హృష్టః = సంతసించినవాఁడై; రాఘవం=రాముని; లక్ష్మణంచైవ=లక్ష్మణుని; సుగ్రీవంచ = సుగ్రీవుని; అభ్యవాదయత్= నమస్కరించెను.

దధిముఖుండు, సుగ్రీవుండు చెప్పిన దివిని, సంతోషంబునొంది , రామునకునులక్ష్మణునకును సుగ్రీవునకునునమస్కారంబుగావించెను.

అని, తాత్పర్యము.

స ప్రణమ్యచ సుగ్రీవం రాఘవౌచ మహాబలౌ
వానరైస్సహితైశ్శూరైర్దివమేవోత్పపాత హ. ౨

టీక॥ సః = ఆదధిముఖుండు;సుగ్రీవం=సుగ్రీవుని;మహాబలౌ=అధికమయినబలముగల;రాఘవౌచ= రామలక్ష్మణులను;ప్రణమ్యచ=నమస్కరించియు; సహితైః=కూడిన;శూరైః=యుద్ధమునందు భయములేనట్టి; వానరైః (సహ)=వానరులతోఁగూడ;దివమేవ=ఆకాశమునుగూర్చియే;ఉత్పపాత=ఎగిరెను."హ"అనునదిపాదపూరణార్థము.

ఆదధిముఖుం,డట్లు, సుగ్రీవునకును మహాబలశాలులగు రామలక్ష్మణులకునునమస్కారంబుగావించి, శూరులగు వనపాలురు వెంబడింప, నాకాశంబున కుద్గమించెను. అని,తాత్పర్యము.

స యథైవాగతః పూర్వం తథైవ త్వరితం గతః
నిపత్య గగనాద్భూమౌ తద్వనం ప్రవివేశ హ. ౩

టీక॥ సః= ఆదధిముఖుండు; పూర్వం=మునుపు ; యథైవ=ఎట్లో; ఆగతః=వచ్చినాఁడో; తథైవ=అట్లే; త్వరితం=శీఘ్రముగా; గతః = పోయినవాఁడై; గగనాత్= ఆకాశంబుననుండి; భూమౌ=నేలయందు; నిపత్య = వ్రాలి; తత్= ఆ; వనం= మధువనమును, ప్రవివేశ=చొచ్చెను; "హ" అనునది పాదపూరణార్థము.

ఆదధిముఖుండు, మున్నెట్లువచ్చినాఁడో, అట్లుశీఘ్రంబునంబోయి, యంతనాకాశంబుననుండి నేలకువ్రాలి యామధువనంబుఁబ్రవేశించెను. అని, తాత్పర్యము.

స ప్రవిష్టో మధువనం దదర్శ హరియూథపాన్
విమదా నుత్థితా న్సర్వా న్మేహమానా న్మధూదకమ్. ౪

టీక॥ సః=ఆదధిముఖుండు; మధువనం=మధువనమును; ప్రవిష్టః=ప్రవేశించినవాఁడై;విమదాన్ = మదములేనివారలును; ఉత్థితాన్ = లేచినవారలును; మధూదకం = తేనెనునీటిని ; మేహమానాన్ = మూత్రద్వారంబునవిడుచు చున్నవారలునగు; హరియూథపాన్=వానరశ్రేష్ఠులను; సర్వాన్=అందఱను;దదర్శ=చూచెను.

ఆదధిముఖుండు, అట్లుమధువనంబుఁ బ్రవేశించి, యచ్చటఁద్రాఁగినమధువుజీర్ణించుటవలనఁ, గైపువిడిచి, లేచి, తేనెయు నీళ్లును గలసినమూత్రంబు విడుచుచున్న యంగదాది వానరశ్రేష్ఠులంజూచెను. అని, తాత్పర్యము.

స తా నుపాగమ ద్వీరో బద్ధ్వా కరపుటాంజలిమ్
ఉవాచ వచనం శ్లక్ష్ణ మిదం హృష్టవ దంగదమ్. ౫

టీక॥ వీరః=పరాక్రమశాలియగు; సః=ఆదధిముఖుండు; తాన్=ఆవానరులను; ఉపాగమత్=పొందెను. కరపుటాంజలిం=దొప్పవంటి , చేతులచే మోడ్పును; బద్ధ్వా=కట్టి; అంగదం= అంగదునిగూర్చి; శ్లక్ష్ణం = మధురమును; హృష్టవత్ = సంతోషము గలదియునగు; ఇదం = ఈ; వచనం =

మాటను; ఉవాచ=చెప్పెను.

పరాక్రమవంతుండగు నాదధిముఖుండు, ఆవానరులయొద్దకుఁబోయి, దొప్పవంటియంజలిబంధించి, యంగదుం జూచిసంతోషంబునమధురంబగునీమాటంజెప్పెను.అని, తాత్పర్యము.

సౌమ్య రోషో న కర్తవ్యో యదేత త్పరివారితమ్
అజ్ఞానా ద్రక్షిభిః క్రోధా ద్భవంతః ప్రతిషేధితాః. ౬

టీక॥ సౌమ్య = చిన్ననివాఁడవగు నంగదుఁడా! ఏతత్ = ఈ; పరివారితం= అంతటనుఅడ్డగించుట ; యత్ (అస్తి) = ఏదిగలదో; తత్ (అధ్యాహృతము)=దానిఁగూర్చి; రోషః=కోపము; నకర్తవ్యః= చేయఁబడఁగూడదు. అజ్ఞానాత్ = తెలియమివలన ; రక్షిభిః=వనపాలురచేత; క్రోధాత్ = కోపమువలన; భవంతః=మీరలు ; ప్రతిషేధితాః=నిషేధింపఁబడినారు.

శాంతుండవగు నంగదుఁడా!వీరలు నివారించిరని నీవుకోపంబు సేయవలదు; ఈవనపాలురు , అజ్ఞానంబు వలన, నట్లుకోపంబున మిమ్మడ్డగించి నారు. అని, తాత్పర్యము.

యువరాజ స్త్వ మీశశ్చ వనస్యాస్య మహాబల
మౌర్ఖ్యా త్పూర్వం కృతోదోష స్తంభవాన్ క్షంతుమర్హసి. ౭

టీక॥ మహాబల=అధికమయిన బలముగలవాఁడవగు నంగదుఁడా!త్వం= నీవు; యువరాజః = యువరాజుండవు. అస్య=ఈ; వనస్య=మధువనమునకు;ఈశశ్చ=ప్రభుండవును. పూర్వం= మున్ను; మౌర్ఖ్యాత్ =అజ్ఞానమువలన; దోషః=దోషము; కృతః=చేయఁబడినది. భవాన్=నీవు ; తం=దానిని; క్షంతుం=క్షమించుటకు; అర్హసి = తగుదువు.

మహాబలుండవగునంగదుఁడా ! నీవుయువరాజుండవు, గావున; నీమధువనంబునకుఁ బ్రభుండవయితివి; అజ్ఞానంబువలన, మున్నపరాధంబు చేసితిమి; నీవుదానిక్షమింపవలయు.

అని, తాత్పర్యము.

ఆఖ్యాతం హి మయా గత్వా పితృవ్యస్య తవానఘ
ఇహోపయాతం సర్వేషా మేతేషాం వనచారిణామ్. ౮

టీక॥ అనఘ= పాపరహితుండవగునంగదుఁడా! మయా=నాచేత; గత్వా=పోయి; తవ=నీయొక్క; పితృవ్యస్య=పినతండ్రికి; ఏతేషాం=ఈ; వనచారిణాం=వానరులయొక్క; సర్వేషాం=అందఱియొక్క-యు;ఇహ= ఇచ్చటికి;ఉపయాతం=వచ్చుట ; ఆఖ్యాతంహి=చెప్పఁబడినదిగదా!

పాపరహితుండవగు నంగదుఁడా! నేనుబోయి, నీపినతండ్రి సుగ్రీవునకు, ఈవానరులందఱును ఇచ్చటికి వచ్చియుండుటంజెప్పితిని.

అని, తాత్పర్యము.

స త్వదాగమనం శ్రుత్వా సహైభి హరియూథపైః
ప్రహృష్టో నతు రుష్టో౽సౌ వనం శ్రుత్వా ప్రధర్షితమ్. ౯

టీక॥ అసౌ=ఈ;సః= ఆసుగ్రీవుఁడు; ఏభిః=ఈ; హరియూథపైః= వానరశ్రేష్ఠులతోఁగూడ;త్వదాగమనం = నీరాకను; శ్రుత్వా=విని; వనం=మధువనమును; ప్రధర్షితం= చెఱచఁబడినదానిఁగా; శ్రుత్వా=విని;ప్రహృష్టః= సంతోషించినాఁడు. నతురుష్టః= కోపింపనేలేదు-

నేను, నీవీవానరులయందఱితోడంగూడవచ్చుటయు, మధువనంబునంతయుఁజెఱచుటయుంజెప్పగా,విని,యాసుగ్రీవుండు, పరమసంతోషంబు నొందెనుగాని, యెంతమాత్రముకోపంబు నొందఁడయ్యె- అని, తాత్పర్యము-

ప్రహృష్టో మాం పితృవ్య స్తే సుగ్రీవో వానరేశ్వరః
శీఘ్రం ప్రేషయ సర్వాంస్తా నితిహోవాచ పార్థివః. ౧౦

టీక ॥ వానరేశ్వరః = వానరులకుఁబ్రభుండును; తే=నీయొక్క; పితృవ్యః=పినతండ్రియునగు; పార్థివః= రాజయిన; సుగ్రీవః=సుగ్రీవుఁడు; ప్రహృష్టః = సంతోషించినవాఁడై ; మాం=నన్నుఁగూర్చి; "తాన్= వార

లను; సర్వాన్ = అందఱను; శీఘ్రం = శీఘ్రముగా; ప్రేషయ = పంపుము" ఇతి=అని; ("హ" అనునది పాదపూరణార్థము); ఉవాచ=చెప్పెను- వానరాధీశ్వరుఁడగు నీపినతండ్రి సుగ్రీవుండు, అట్లు పరమసంతోషంబు నొంది "ఆయంగదుండు మున్నగువానరులను శీఘ్రంబునంబంపుము" అని, ఆజ్ఞాపించెను- అని, తాత్పర్యము-

శ్రుత్వా దధిముఖస్యేదం వచనం శ్లక్ష్ణ మంగదః
అబ్రవీ త్తాన్ హరిశ్రేష్ఠో వాక్యం వాక్యవిశారదః. ౧౧

టీక॥ వాక్యవిశారదః = మాటలయందుఁబండితుండును; హరిశ్రేష్ఠః= వానరశ్రేష్ఠుండునగు; అంగదః= అంగదుండు; దధిముఖస్య = దధిముఖుని యొక్క; ఇదం=ఈ; శ్లక్ష్ణం= ప్రియమయిన; వచనం = మాటను ; శ్రుత్వా=విని; తాన్= ఆవానరులనుగూర్చి; వాక్యం=మాటను; అబ్రవీత్= చెప్పెను.

మాటలుచెప్పుటయందుఁ బండితుండునువానరోత్తముండునగు నంగదుండు, ప్రియంబగునీదధిముఖునిమాటనువిని, యావానరులంజూచి, ఇట్లనిచెప్పెను. అని, తాత్పర్యము.

శంకే శ్రుతో ఽయం వృత్తాంతో రామేణ హరియూథపాః
తత్ క్షమం నేహ న స్స్థాతుం కృతే కార్యే పరంతపాః. ౧౨

టీక॥పరంతపాః= శత్రువులందపింపఁజేయునట్టి;హరియూథపాః= వానరశ్రేష్ఠులారా!"అయం =ఈ; వృత్తాంతః=సమాచారము; రామేణ= రామునిచేత;శ్రుతః=వినఁబడినది."ఇతి(అధ్యాహృతము)=అని; శంకే=సందేహించుచున్నాను-తత్ =అందువలన; కార్యే= పని;కృతే=చేయఁబడినదగుచుండఁగా; నః=మనకు;ఇహ=ఇచ్చట; స్థాతుం=నిలుచుటకు;నక్షమం=యుక్తముకాదు.

శత్రువులందపింపఁజేయునట్టి వానరశ్రేష్ఠులారా! మనమిచ్చటికివచ్చియున్నసంగతి రామునకుం దెలిసినదనితోఁచుచున్నది;కావునఁ, గార్యంబుసాధించినవెనుక, మనమిచ్చటనుండుట యుక్తముకాదు-అని, తాత్పర్యము.

పీత్వా మధు యథాకామం విశ్రాంతా వనచారిణః
కిం శేషం గమనం తత్ర సుగ్రీవో యత్ర మే గురుః. ౧౩

టీక॥వనచారిణః = వానరులు;యథాకామం=యథేష్టముగా;మధు= తేనియను;పీత్వా=త్రాఁగి;విశ్రాంతాః=విశ్రమించినారు. శేషం=మిగత; కిం(అస్తి)=ఏమియున్నదిః?యత్ర = ఎచ్చట;మే=నాయొక్క;గురుః= పినతండ్రియయిన;సుగ్రీవః=సుగ్రీవుఁడు; అస్తి (అధ్యాహృతము)=ఉన్నాఁడో; తత్ర=అచ్చటికి;గమనం=పోవుటయె.

వానరులందఱు, యథేష్టంబుగా మధువుఁద్రావి యలసటఁదీర్చుకొన్నారు; ఇంకనిచ్చటఁ జేయవలసినది యేమియున్నది? నాపినతండ్రి సుగ్రీవునియొద్దకుఁ బోవలసినదే. అని, తాత్పర్యము.

సర్వే యథా మాం వక్ష్యంతి సమేత్య హరియూథపాః
తథా స్మి కర్తా కర్తవ్యే భవద్భిః పరవా నహమ్. ౧౪

టీక॥హరియూథపాః= వానరశ్రేష్ఠులు;సర్వే=అందఱును;సమేత్య= వచ్చి;మాం=నన్నుఁగూర్చి; యథా=ఎట్లు;వక్ష్యంతి=చెప్పఁగలరో;తథా=అట్లు;కర్తా=చేయువాఁడను;అస్మి=అగుచున్నాను. కర్తవ్యే= చేయఁబడవలసినకార్యమునందు;అహం=నేను; భవద్భిః=మీచేత;పరవాన్= పరతంత్రుండను.

వానరశ్రేష్ఠులందఱువచ్చి యెట్లుచెప్పుదురో, అట్లునేను జేయవలసినవాఁడను; ఇప్పుడు, నేనుమీరలుచెప్పునట్లుచేయవలసినవాఁడనేకాని స్వతంత్రుండనుగాను. అని, తాత్పర్యము.

నాజ్ఞాపయితు మీశో హం యువరాజో స్మి యద్యపి
అయుక్తం కృతకర్మాణో యూయం ధర్షయితుం మయా. ౧౫

టీక॥అహం=నేను; యువరాజః=యువరాజుండను;యద్యప్యస్మి= అగుచున్నానుసరేఅయినను; ఆజ్ఞాపయితుం=ఆజ్ఞాపించుటకు;ఈశః = సమర్థుఁడను;న=కాను.కృతకర్మాణః=చేయఁబడినకార్యముగలః యూయం=

మీరలు; మయా = నాచేత; ధర్షయి తుం = బెదరించుటకు; అయుక్తం = యుక్తముకాదు.

నేనుయువరాజుండనైనను, ఇప్పుడు మిమ్మాజ్ఞాపింపసమర్థుండఁగాను; కార్యంబుసాధించివచ్చియున్న మిమ్ములనే నాజ్ఞాపించుట యుక్తముకాదు. అని, అంగదుండు, వానరులకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

బ్రువత స్తాం గదస్యై వం శ్రుత్వా వచన మవ్యయమ్
ప్రహృష్టమనసో వాక్య మిద మూచు ర్వనౌకసః. ౧౬

టీక॥ వనౌకసః = వానరులు; ఏవం = ఇట్లు; బ్రువతః = చెప్పుచున్న; అంగదస్య = అంగదునియొక్క; అవ్యయం = నాశములేని, వెలలేనియనుట; వచనం = మాటను; శ్రుత్వాచ = వినియు; ప్రహృష్టమనసః = సంతసించినమనస్సుగలవారలై; ఇదం = ఈ; వాక్యం = మాటను; ఊచుః = చెప్పిరి.

అంత, వానరులు, అంగదుండుచెప్పిన వెలలేనిమాటనువిని, పరమసంతోషంబునొంది, యంగదుంజూచియిట్లని, చెప్పిరి. అని, తాత్పర్యము.

ఏవం వదతి కో రాజన్ ప్రభు స్సన్ వానరర్షభ
ఐశ్వర్యమదమత్తో హి సర్వో హ మితి మన్యతే. ౧౭

టీక॥ రాజన్ = రాజవగు; వానరర్షభ = వానరశ్రేష్ఠుండవయినయంగదుఁడా! కః = ఎవ్వఁడు; ప్రభుః = రాజు; సన్ = అగుచు; ఏవం = ఇట్లు; వదతి = చెప్పును? సర్వః = సమస్తజనమును; ఐశ్వర్యమదమత్తః = ఐశ్వర్యముచేఁగలిగిన మదముచేమత్తుఁడై; అహమితి = నేనని; మన్యతే = తలంచును.

మాకుఁబ్రభుండవువానరశ్రేష్ఠుండవగునంగదుఁడా! రాజయినవాఁడెవ్వఁడిట్లుచెప్పును? అందఱునుబ్రభుత్వముచే దేహంబు దెలియక, యహంకరించియుందురేకాని, యిట్లువినయంబుగలిగియుండరు. అని, తాత్పర్యము.

తవచేదం ను సదృశం వాక్యం నాన్యస్య కస్యచిత్

సన్నతిహీనతవాఖ్యాతి భవిష్యచ్ఛుభయోగ్యతామ్. ౧౮

టీక॥ ఇదం= ఈ; వాక్యం= మాటః తవచ—నీకే;సదృశంను—సరియయినదిగదా! అన్యస్య=ఇతరునికి;కస్యచిత్=ఎవ్వనికిని; న=సరియయినదికాదు. తవ=నీయొక్క; సన్నతిహీ = వినయమే;భవిష్యచ్ఛుభయోగ్యతాం=కలుగఁబోవుమంగళంబునకుఁదగియుండుటను; ఆఖ్యాతి= చెప్పుచున్నది.

ఇట్లుచెప్పుట, నీకేతగును, గానిమఱియెవ్వనికినిందగదు; నీవినయంబువలననే, నీకింకగొప్పమంగళంబుగలుగుననియునందుకు నీవుదగిన వాడవనియుఁ దెలియుచున్నది.

అని, తాత్పర్యము.

సర్వే వయమపి ప్రాప్తా స్తత్ర గంతుం కృతక్షణాః
స యత్ర హరివీరాణాం సుగ్రీవః పతి రవ్యయః. ౧౯.

టీక॥ వయమపి=మేమును;సర్వే=అందఱమును; యత్ర=ఎచ్చట; హరివీరాణాం=వానరవీరులకు; పతిః— ప్రభుండును; అవ్యయః= నాశరహితుండునగు; సః=ఆ; సుగ్రీవః= సుగ్రీవుండు;అస్తి—(అధ్యాహృతము) ఉన్నాఁడో; తత్ర=అచ్చటికి; గంతుం=పోవుటకు; కృతక్షణాః= చేయఁబడిన యుత్సాహముగలవారలమై; ప్రాప్తాః = వచ్చినాము-

మేమందఱమును, వానరవీరులకుం బ్రభుండును నాశరహితుండునగునా సుగ్రీవుని యొద్దకుఁబోవుటకై యె సిద్ధసన్నాహులమయివచ్చినాము-

అని, తాత్పర్యము-

త్వయా హ్యనుక్తైః హరిభి ర్నైవ శక్యం పదా త్పదమ్
క్వచి ద్గంతుం హరిశ్రేష్ఠ బ్రూమ స్సత్య మిదం తు తే. ౨౦

టీక॥ హరిశ్రేష్ఠ= వానరశ్రేష్ఠుండవగు నంగదుఁడా! త్వయా= నీచేత=అనుక్తైః=చెప్పఁబడినట్టి;హరిభిః= వానరులచేత; క్వచిత్= ఒకానొకచోటికిని ; పదాత్ = అడుగుననుండి ; పదం=అడుగునుగూర్చి; గంతుం= పో




పుటకు; నైవశక్యంహి = అలవికానే కాదుగదా! తే=నీకు; సత్యం= సత్యమయిన; ఇదం = ఈమాటను; బ్రూమః=చెప్పుచున్నాము-

వానరశ్రేష్ఠుండవగునంగదుండా! నీయాజ్ఞ లేక, వానరులకు,ఎచ్చటికిని నొకరీయడుగైనను బోవనలవిగాదు; ఇది సత్యము, నీకుం జెప్పినాము. అని, యావానరులంగదుని తో విన్నవించుకొనిరి-

అని, తాత్పర్యము-

ఏవం తు వదతాం తేషా మంగదః ప్రత్యువాచహ
బాఢం గచ్ఛామ ఇత్యుక్త్వా ఖ ముత్పేతు మహాబలాః- ౨౧

టీక॥ తేషాం=వారలు; ఏవం= ఇట్లు; వదతాంతు = చెప్పుచుండఁగానే; అంగదః = అంగదుండు; "బాఢం=మంచిది; గచ్ఛామః = పోయెదము." ఇతి(అధ్యాహృతము)=అని ; ప్రత్యువాచ=బదులుచెప్పెను. ("హ" అనునది పాదపూరణార్థకము)- ఇతి= అని; ఉక్త్వా=చెప్పి; మహాబలాః=అధికమయినబలముగలవానరులు; ఖం= ఆకాశమునుగూర్చి; ఉత్పేతుః = ఎగిరిరి-

ఆవానరు లిట్లు చెప్పినమాటనువిని, యంగదుండు "మంచిది, పోయెదము" అని,చెప్పెను; ఇట్లు; మాటలాడుకొని, మహాబలశాలులగు నావానరులు, ఆకాశంబునకుద్గమించిరి-

అని, తాత్పర్యము-

ఉత్పతంత మనూత్పేతు స్సర్వే తే హరియూథపాః
కృత్వా కాశం నిరాకాశం యంత్రోత్క్షిప్తా ఇవాచలాః- ౨౨

టీక॥ తే=ఆ ; హరియూథపాః= వానరశ్రేష్ఠులు; సర్వే=అందఱును : ఆకాశం=ఆకాశమును ; నిరాకాశం= అవకాశములేనిదానిఁగా; కృత్వా = చేసి;యంత్రోత్క్షిప్తాః = యంత్రములచేనెగురఁగొట్టఁబడిన; అచలాః=పర్వతంబులువలె; ఉత్పతంతం= ఎగురుచున్నయంగదుని; అనూత్పేతుః= వెంబడించిమెగిరిరి-

ఆయంగదుండాకాశంబునకుద్గమింపఁగానే, యావానరశ్రేష్ఠులందఱును, ఆకాశంబునంతయు నిరవకాశంబుగాఁ




జేయుచు, యంత్రింబులనెగురఁగొట్టఁబడినపర్వతంబులుంబోలె, నతనివెంట నెయాకాశంబునకుద్గమించిరి- అని, తాత్పర్యము-

తేంబరం సహసోత్పత్య వేగవంతః ప్లవంగమాః
వినదంతో మహానాదం ఘనా వాతేరితా యథా- ౨౩

టీక॥ వేగవంతః= అధికమయినవేగముగల; తే=ఆ; ప్లవంగమాః= వానరులు; సహసా=వేగముగా ; అంబరం = ఆకాశమునుగూర్చి; ఉత్పత్య=ఎగిరి; వాతేరితాః = వాయువుచేఁబ్రేరింపఁబడిన; ఘనాయథా= మేఘంబులువలె; మహానాదం = అధికమయినధ్వనిగల్గునట్లుగా; వినదంతః=అఱచుచు ; జగ్ముః(అధ్యాహృతము) = పోయిరి-

వేగవంతులగునావానరులు, వేగంబుననాకాశంబునకుద్గమించి , మహావాయుప్రేరితంబులగుమేఘంబులుంబోలె , మహాధ్వనిగలుగునట్లుగజీఁచుచుంబోయిరి- అని, తాత్పర్యము.

అంగదే హ్యననుప్రాప్తే సుగ్రీవో వానరాధిపః
ఉవాచ శోకోపహతం రామం కమలలోచనమ్- ౨౪

టీక॥అంగదే=అంగదుండు; అననుప్రాప్తేహి=రాకుండఁగానే; వానరాధిపః = వానరులకుఁబ్రభుండగు;సుగ్రీవః=సుగ్రీవుఁడు;శోకోపహతం=దుఃఖముచేఁగొట్టఁబడిన; కమలలోచనం=కమలములవంటికండ్లుగల; రామం=రామునిగూర్చి;ఉవాచ=చెప్పెను-

అంగదుండువచ్చుటకుమున్నె,వానరేశ్వరుండగుసుగ్రీవుండు, దుఃఖితుండునుగమలంబులవంటి కండ్లుగలవాఁడునగురామునింబూచి,యిట్లని, చెప్పెను- అని, తాత్పర్యము-

సమాశ్వసిహి భద్రం తే దృష్టా దేవీ న సంశయః
నాగంతు మిహ శక్యం తై రతీతే సమయే హి నః- ౨౫

టీక॥సమాశ్వసిహి=ఊఱడిల్లుము- తే=నీకు;భద్రం=మంగళము;అస్తు(అధ్యా

హృతము)=అగుఁగాక-దేవీ=సీతాదేవి;దృష్టా=చూడఁబడినది- సంశయః=సందేహము;న=లేదు-నః=మనయొక్క; సమయే=అవధి;అతీతే=కడవఁగా;తైః=వారలచేత;ఇహ = ఇచ్చటికి; ఆగంతుం=వచ్చుటకు;నశక్యం=అలవికాదు-

నీవింక దుఃఖింపకుము;నీకుమంగళమగుఁగాక; వారలుసీతాదేవింజూచివచ్చినారు; సంశయములేదు; వారలుసీతం జూడకుందు రేని, నేనుజెప్పినయవధిదాఁటిపోయిన వెనుక, నిచ్చటికి రాఁజాలరు- అని, తాత్పర్యము-

న మత్సకాశ మాగచ్ఛే త్కృత్యే హి విని పాతితే
యువరాజో మహాబాహుః ప్లవతాం ప్రవరోంగదః. ౨౬

టీక॥కృత్యే = కార్యము;వినిపాతితే = నశింపఁజేయఁబడినదగుచుండఁగా;మహాబాహుః = పెద్దచేతులుగలవాఁడును;ప్లవతాం=వానరులలోపల; ప్రవరః=శ్రేష్ఠుండును; యువరాజః=యువరాజుండునగు;అంగదః = అంగదుండు;మత్సకాశం = నాసమీపమునుగూర్చి;నాగచ్ఛేద్ధి=రాఁడుగదా!

కార్యముచెడియుండునేని , మహాబాహుండునువానరశ్రేష్ఠుండునుయువరాజుండునగు నంగదుండు, నాయొద్దకెంతమాత్రము రాఁడు.

అని, తాత్పర్యము.

యద్యప్య కృతకృత్యానా మీదృశ స్స్యా దుపక్రమః
భవే త్స దీనవదనో భ్రాంతవిప్లుతమానసః. ౨౭

టీక॥అకృతకృత్యానాం= చేయఁబడని కార్యముగలవానరులకు;ఈదృశః= ఇట్టి;ఉపక్రమో యద్యపి= ప్రయత్నము గలిగినను;సః=ఆయంగదుఁడు; దీనవదనః=దుఃఖితమగుముఖముగలవాఁడును; భ్రాంతవిప్లుతమానసః=భ్రాంతినొందినదియుఁజలనమునొందినదియునగుమనస్సుగలవాఁడునుగా;భవేత్ =ఉండును.

ఒకవేళ, నావానరులు, కార్యంబు సాధింపనివారలైయు యిచ్చటికివచ్చినను,అప్పటి,కంగదుండు, దీనవదనుండును, భ్రాంతియుఁజలనంబునొందినమన

సుగలవాఁడును గానుండును. అని, తాత్పర్యము.

పితృపైతామహం చైత త్పూర్వకై రభిరక్షితమ్
న మే మధువనం హన్యా దహృష్టః ప్లవగేశ్వరః. ౨౯

టీక॥ప్లవగేశ్వరః= వానరులకుఁబ్రభుండగునంగదుండు;అహృష్టః = సంతోషింపనివాఁడై ; పితృపైతామహం చ = తండ్రితాతలనుండివచ్చినదియు; పూర్వకైః=మునుపటివారలచేత; అభిరక్షితం=కాపాడఁబడినదియునగు; ఏతత్=ఈ;మే = నాయొక్క;మధువనం=మధువనమును;నహన్యాత్= కొట్టఁడు.

వానరేశ్వరుండగునంగదుండు,అట్లు సంతోషంబు నొందకుండునేని, తండ్రి తాతలనాఁటనుండి జాగ్రత్తతోరక్షింపఁబడుచుండిన నామధువనంబు నెంత మాత్రమునశింపఁజేయఁడు.

అని,తాత్పర్యము.

కౌసల్యా సుప్రజా రామ సమాశ్వసి హి సువ్రత

టీక॥సువ్రత=మంచివ్రతములుగల; రామ=రాముఁడా!కౌసల్యా = కౌసల్య;సుప్రజాః=మంచిసంతానముగలది. సమాశ్వసిహి=ఊఱడిల్లుము.

మంచివ్రతంబు లాచరించునట్టిరాముఁడా! సీతసమాచారము తెలిసినదికావున, ఇంకనీవు క్షేమంబు నొందఁగలవు కాఁబట్టి,యిప్పుడు,కౌసల్యమంచికొడుకుగలదైనది;నీవుదుఃఖంబువిడువుము.

అని, తాత్పర్యము.

దృష్టా దేవీ న సందేహో నచాన్యేన హనూమతా. ౪౧
న హ్యన్యః కర్మణో హేతు స్సాధనే స్య హనూమతః

టీక॥దేవీ=సీతాదేవి;దృష్టా= చూడఁబడినది.సందేహః=సంశయము;న= లేదు;అన్యేనచ = ఇతరునిచేతను;న= కాదు.హనూమతా= హనుమంతునిచేతనే;దృష్టా(అధ్యాహృతము)=చూడఁబడినది.హనూమతః= హనుమంతునికన్న

న్యః; అన్యః=ఇతరుఁడు; అస్య = ఈ; క
ర్మణః=కార్యముయొక్క; సాధనే=
సాధించుటయందు; హేతుః = కారణ
ము; నహి=కాఁడుగదా!

సీతాదేవింజూచివచ్చిరి; ఇందుసం
శయములేదు; అందు హనుమంతుఁడే
చూచి యుండునుగాని, యింక నెవ్వం
డును జూచియుండఁడు; హనుమంతుం
డుదక్కమఱియెవ్వండును, ఈకార్యం
బునుసాధింపంజాలఁడు.

అని, తాత్పర్యము.

హనూమతి హి సిద్ధిశ్చ మతిశ్చ మతిసత్తమ. ౩౦
వ్యవసాయశ్చ వీర్యంచ సూర్యే తేజఇవ ధ్రువమ్

టీక॥ మతిసత్తమ=బుద్ధిమంతులలో
శ్రేష్ఠుండవగురాముఁడా; సిద్ధిశ్చ= కార్య
సిద్ధియును; మతిశ్చ= బుద్ధియును; వ్య
వసాయశ్చ=ప్రయత్నమును; వీర్యంచ=
పరాక్రమమును; హనూమతి=హనుమం
తునందు; సూర్యే=సూర్యునియందు; తే
జఇవ= తేజస్సువలె; ధ్రువం= నిశ్చ
యము.

బుద్ధిమంతులలో శ్రేష్ఠుండవగురాముఁ
డా! సూర్యునియందుఁ గాంతియుండు
నట్లు కార్యసిద్ధియు బుద్ధియు నుత్సా
హంబును బరాక్రమంబును హనుమం
తునందు స్థిరముగానున్నవి.

అని, తాత్పర్యము.

జాంబవా న్యత్ర నేతా స్యా దంగదశ్చ బలేశ్వరః. ౩౧
హనుమాం శ్చాప్య ధిష్ఠాతా న తస్య గతి రన్యథా

టీక॥ యత్ర = ఏకార్యమునందు;
జాంబవాన్=జాంబవంతుఁడు; నేతా=
నాయకుఁడో; అంగదశ్చ = అంగదుం
డును; బలేశ్వరః=సేనానాయకుండో;
హనుమాంశ్చాపి = హనుమంతుండు
ను ; అధిష్ఠాతా = అధిష్ఠించియుండు
వాఁడో; తస్య=ఆకార్యముయొక్క; గ
తిః=ప్రాప్తి; అన్యథా = వేరువిధము
గా; న= కాదు.

ఏకార్యంబునందు జాంబవంతుండు
నాయకుండును, అంగదుండు సేనాధి
పతియుంగానుండునో, మఱియుహను
మంతుండును దోడ్పడియుండునో, అ
ట్టికార్యంబుదప్పక సిద్ధించును గాని, వే

ఱువిధంబుగాదు. అనీ, తాత్పర్యము,

మాభూ శ్చింతాసమాయుక్త స్సంప్ర త్యమితవిక్రమ. ౩౨

టీక॥ అమితవిక్రమ= కొలందిలేని పరాక్రమముగలరాముఁడా! త్వం (అధ్యాహృతము)= నీవు; చింతాసమాయుక్తః= చింతతోఁగూడిన వాఁడవు; మాభూః= కావలదు.

అమిత పరాక్రమశాలియగు రాముఁడా! నీవింకదుఃఖింపవలదు. అని, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తతః కిలకిలాశబ్దం శుశ్రావా సన్న మంబరే
హనుమత్కర్మదృప్తానాం నదతాం కాననౌకసామ్. ౩౩
కిష్కింధా ముపయాతానాం సిద్ధిం కథయతా మివ

టీక॥ తతః = అటుపిమ్మట ; సః (అధ్యాహృతము) = ఆసుగ్రీవుఁడు; హనుమత్కర్మదృప్తానాం=హనుమంతునికార్యముచే గర్వించిన వారలును; నదతాం= గర్జించు వారలును; కిష్కింధాం=కిష్కింధను; ఉపయాతానాం= సమీపించినవారలును; సిద్ధం= కార్యసిద్ధిని ; కథయతామివ (స్థితానాం)= చెప్పుచున్నట్లున్నవారలునగు; కాననౌకసాం=వానరులయొక్క;ఆసన్నం=సమీపించిన; కిలకిలాశబ్దం=కిలకిలయనుధ్వనిని;శుశ్రావ=వినెను.

అంత,నావానరులు, కిష్కింధకుసమీపముగావచ్చి, హనుమంతునిసాహసంబునకు గర్వించియున్నవారలుగావునఁ, గార్యసిద్ధియయినదనియందఱకుం దెలియునట్లుసింహనాదంబులు సేయఁగా,నాకాశంబుననుండి;యాధ్వని, సుగ్రీవునకువినవచ్చెను.

అని, తాత్పర్యము.

తత శ్శ్రుత్వా నినాదం తం కపీనాం కపిసత్తమః. ౩౪
ఆయతాంచితలాంగూల స్సో భవ ద్ధృష్టమానసః

టీక॥ కపిసత్తమః=వానరశ్రేష్ఠుండగు; సః=ఆసుగ్రీవుఁడు; కపీనాం= వా

నరులయొక్క; తం=ఆ; నినాదం=ధ్వనిని; శ్రుత్వా=విని; తతః=అంత;హృష్టమానసః = సంతసించినమనసుగలవాఁడై; అభవత్ =ఉండెను.

వానరశ్రేష్ఠుండగు నాసుగ్రీవుండు, ఆవానరులసింహనాదంబువిని , పరమసంతుష్టుండై, వాలంబునిడుపుగాఁ జేసికొనియాడించుకొనుచు,నుండెను.

అని, తాత్పర్యము.

ఆజగ్ముస్తేపి హరయో రామదర్శనకాంక్షిణః. ౩౫
అంగదం పురతః కృత్వా హనూమంతంచ వానరమ్

టీక॥ రామదర్శనకాంక్షిణః=రామునిచూచుటకొఱకుఁగోరుచున్న; తే=ఆ; హరయోపి=వానరులును ; అంగదం= అంగదుని ; హనూమంతంచ=హనుమంతుండను; వానరంచ = వానరుని; పురతః=ముందట; కృత్వా=చేసి , ఉంచికొనియనుట ; ఆజగ్ముః = వచ్చిరి.

రామదర్శనంబుఁగోరుచున్న యావానరులును, అంగదునిహనుమంతుని మున్నిడుకొని, వచ్చిరి.

అని, తాత్పర్యము.

తేంగదప్రముఖా వీరాః ప్రహృష్టాశ్చ ముదాన్వితాః. ౩౬
నిపేతు ర్హరిరాజస్య సమీపే రాఘవస్యచ

టీక॥ వీరాః = పరాక్రమశాలులగు; తే=ఆ; అంగదప్రముఖాః = అంగదుండు మొదలుగాఁ గలవానరులు ; ముదా=సంతోషముతో ; అన్వితాః=కూడినవారలై; ప్రహృష్టాః = గగుపాటునొందినవారలై ; హరిరాజస్య= వానరులకుఁబ్రభుండగుసుగ్రీవునియొక్కయు; రాఘవస్యచ = రామునియొక్కయు ; సమీపే= సమీపంబునందు; నిపేతుః=వ్రాలిరి.

పరాక్రమవంతులగు నంగదుండు మొదలుగాఁగలయావానరులు, అంత, వానరరాజుండగు సుగ్రీవుండును రాముండునుండుచోట,వ్రాలిరి.

అని,తాత్పర్యము.

హనుమాంశ్చ మహాబాహుః ప్రణమ్య శిరసా తతః. ౩౭

నియతాం మక్షతాం దేవీం రాఘవాయ న్యవేద యత్

టీక॥ తతః=అటుపిమ్మట ; మహాబాహుః = పెద్దచేతులుగల ; హనుమాంశ్చ=హనుమంతుండును;శిరసా=తలచేత; ప్రణమ్య= నమస్కరించి ; రాఘవాయ=రామునికొఱకు; దేవీం=సీతాదేవిని; నియతాం = నియమముతోఁగూడినదానిఁగాను;అక్షతాం=నాశములేనిదానిఁగాను; న్యవేదయత్ = చెప్పెను.

అంత, మహాబాహుండగుహనుమంతుండు, సాష్టాంగముగనమస్కరించి, "సీతాదేవిపాతివ్రత్యనియమంబునందే జరిల్లుచు క్షేమంబుగనున్న"దని, రామునకుంజెప్పెను. అని, తాత్పర్యము.

నిశ్చితార్థ స్తత స్తస్మిన్ సుగ్రీవః పవనాత్మజే. ౩౮
లక్ష్మణః ప్రీతిమా న్ప్రీతం బహుమానా దవైక్షత

టీక॥తతః=అటుపిమ్మట;తస్మిన్= ఆ;పవనాత్మజే = వాయుకుమారుండగు హనుమంతునందు ; నిశ్చితార్థః=నిశ్చయింపఁబడినప్రయోజనముగల;సుగ్రీవః = సుగ్రీవుండును; లక్ష్మణః=లక్ష్మణుండును; ప్రీతిమాన్= అధికమయినసంతోషముగలవాఁడై; ప్రీతం=సంతోషమునొందిన హనుమంతుని;అవైక్షత=చూచెను.

అంత , వాయుదేవునికుమారుండగునాహనుమంతుండే తప్పకకార్యంబు సాధించియుండుననినిశ్చయించియున్న సుగ్రీవుండునులక్ష్మణుండును , సంతోషంబునొంది,సంతసించియున్నయాహనుమంతుని, బహుమానదృష్టింజూచిరి. అని, తాత్పర్యము.

ప్రీత్యాచ రమమాణోథ రాఘవః పరవీరహా. ౩౯
బహుమానేన మహతా హనుమంత మవైక్షత

టీక॥ అథ=అటుపిమ్మట ; పరవీరహా=శత్రువీరులంజంపునట్టి;రాఘవః=రాముండు ; ప్రీత్యా=సంతోషముచే; రమమాణః=క్రీడింపుచు; మహతా = అధికమయిన; బహుమానేన= గౌరవముచేత; హనుమంతం=హనుమంతు

ని; అవైక్షత=చూచెను-

అంత, శత్రువీరులంజంపునట్టిరాముండు, పరమసంతోషంబునొంది, పరమబహుమానంబున, సాహనుమంతుంజూచెను- అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, చతుష్షష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండచతుష్షష్టితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

పంచషష్టితమసర్గప్రారంభః.

తతః ప్రస్రవణం శైలం తే గత్వా చిత్రకాననమ్
ప్రణమ్య శిరసా రామం లక్ష్మణంచ మహాబలమ్. ౧
యువరాజం పురస్కృత్య సుగ్రీవ మభివాద్యచ
ప్రవృత్తి మథ సీతాయాః ప్రవక్తు ముపచక్రముః. ౨

టీక॥ తతః=అటుపిమ్మట; తే=ఆవానరులు; చిత్రకాననం=నానావిధములగునడవులుగల; ప్రస్రవణం=ప్రస్రవణమను; శైలం=పర్వతమును; గత్వా=పొంది; శిరసా= తలచేత; రామం=రాముని; మహాబలం= అధికమయినబలముగల; లక్ష్మణంచ= లక్ష్మణుని; ప్రణమ్య= నమస్కరించి; సుగ్రీవం=సుగ్రీవుని; అభివాద్యచ=నమస్కరించియు; యువరాజం=యువరాజయినయంగదుని; పురస్కృత్య=మున్నిడికొని; అథ=అటుపిమ్మట; సీతాయాః=సీతాదేవియొక్క; ప్రవృత్తిం=సమాచారమును; ప్రవక్తుం= చెప్పుటకు; ఉపచక్రముః= ఆరంభించిరి.




అట్లు; ఆవానరులు, చిత్రంబుల గునరణ్యాంబులుగల ప్రస్రవణపర్వతం బుఁజేరి, సాష్టాంగముగ రామలక్ష్మణులకునమస్కరించి, సుగ్రీవునకును మొ్రొక్కి, యంత, యువరాజుండగు నంగదుంబురస్కరించుకొని, సీతావృత్తాంతంబుఁజెప్పనారంభించిరి.

అని, తాత్పర్యము.

రావణాంతఃపురే రోధం రాక్షసీభిశ్చ తర్జనమ్
రామే సమనురాగంచ యశ్చాయం సమయః కృతః. ౩
ఏత దాఖ్యాంతి తే సర్వే హరయో రామసన్నిధౌ

టీక॥ తే=ఆ; హరయః= వానరులు; సర్వే=అందఱును; రావణాంతఃపురే=రావణునియంతఃపురంబునందు; రోధం=అడ్డగించుటను; రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత; తర్జనంచ= బెదరించుటను ; రామే=రామునియందు; సమనురాగంచ=ప్రేమను; యః=ఏ; అయం=ఈ; సమయః=అవధి ; కృతః=చేయఁబడినదో ; తం (అధ్యాహృతము) చ=దానిని; ఏతత్= దీనిని; రామసన్నిధౌ= రామునిసమీపమునందు;ఆఖ్యాంతి =చెప్పిరి

ఆవానరులందఱును, సీతాదేవిరావణునియంతఃపురంబునందు నిర్బంధంబుననుండుటయునాబిడనురాక్షసస్త్రీలుబెదరించుటయు, నాబిడకు రామునియందుంగలయనురాగంబును, రావణుండుసీతకుఁబెట్టిన యవధియును,ఈ సమాచారంబంతయు, రామునకుం జెప్పిరి.అని, తాత్పర్యము.

వైదేహీ మక్షతాం శ్రుత్వా రామస్తూత్తర మబ్రవీత్. ౪

టీక॥ రామస్తు=రాముండును; వైదేహీం=సీతాదేవిని; అక్షతాం= నాశమునొందనిదానిఁగాను; శ్రుత్వా=విని;ఉత్తరం = బదులుమాటను; అబ్రవీత్=చెప్పెను.

రాముండు, సీతాదేవినాశంబునొందక క్షేమంబుగనున్నదనివిని, వానరులంజూచి, యిట్లనిబదులుచెప్పెను.

అని, తాత్పర్యము.

క్వ సీతా వర్తతే దేవీ కథంచ మయి వర్తతే




ఏతన్మే సర్వ మాఖ్యాత వైదేహీం ప్రతి వానరాః. ౫

టీక॥ వానరాః = వానరులారా! దేవీ = రాణియగు; సీతా = సీత; క్వ = ఎచ్చట; వర్తతే = ఉన్నది? కథంచ = ఎట్లును; మయి = నావిషయమయి ; వర్తతే = ఉన్నది? వైదేహీం ప్రతి = సీతనుగూర్చి; ఏతత్ = దీని; సర్వం = అంతను; మే = నాకొఱకు; ఆఖ్యాత = చెప్పుఁడు.

వానరులారా! సీతాదేవియెచ్చటనున్నది ? నావిషయమయియాబిడమనస్సెట్లున్నది ? ఈసమాచారమునంతయునాకుమీరుచెప్పవలయును. అని, రాముండువానరులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

రామస్య గదితం శ్రుత్వా హరయో రామసన్నిధౌ
చోదయంతి హనూమంతం సీతావృత్తాంతకోవిదమ్. ౬

టీక॥ హరయః = వానరులు ; రామస్య = రామునియొక్క; గదితం = మాటను; శ్రుత్వా = విని; రామసన్నిధౌ = రాముని సమీపమునందు ; సీతావృత్తాంతకోవిదం = సీతయొక్కవృత్తాంతమునందుఁబండితుండగు; హనూమంతం = హనుమంతుని ; చోదయంతి = ప్రేరించిరి.

వానరులు , రాముండుచెప్పినమాటనువిని , రామసమీపంబున , సీతావృత్తాంతంబుఁ జక్కఁగానెఱింగినహనుమంతునింజెప్పుమనిరి.

అని, తాత్పర్యము.

శ్రుత్వాతు వచనం తేషాం హనుమా న్మారుతాత్మజః
ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై తాం దిశం ప్రతి. ౭
ఉవాచ వాక్యం వాక్యజ్ఞస్సీతాయా దర్శనం యథా

టీక॥ తేషాం = ఆవానరులయొక్క; వచనం = మాటను; శ్రుత్వాతు = విన్నం తనె; వాక్యజ్ఞః = మాటలనెఱింగినట్టి; మారుతాత్మజః = వాయుదేవునికుమా

రుండగు;హనుమాన్= హనుమంతుండు;వైదేహ్యా=రాణియగు;సీతాయై=సీతకొఱకు;తాం=ఆ;దిశం ప్రతి= దిక్కునుగూర్చి;శిరసా=తలచేత; ప్రణమ్య= నమస్కరించి;సీతాయాః = సీతయొక్క;దర్శనం=చూచుట;యథా = ఎట్లో;తథా(అధ్యాహృతము)= అట్లు; వాక్యం=మాటను;ఉవాచ=చెప్పెను.

ఆవానరులు చెప్పినమాటనువిని మాటలయందుఁబండితుండును వాయుదేవునికుమారుండునగు హనుమంతుండు,సీతాదేవికిని,ఆబిడయుండుదిక్కునకును,సాష్టాంగంబుగ నమస్కరించి,తానుసీతాదేవింజూచినవిధముంజెప్పెను.

అని, తాత్పర్యము.

సముద్రం లంఘయిత్వాహం శతయోజన మాయతమ్ . ౮
అగచ్ఛం జానకీం సీతాం మార్గమాణో దిదృక్షయా

టీక॥అహం=నేను;శతయోజనం=నూఱుయోజనంబులు;ఆయతం = దీర్ఘమయిన;సముద్రం=సముద్రమును; లంఘయిత్వా=దాఁటి; దిదృక్షయా=చూడనిచ్ఛచేత;జానకీం=జనకునికొమార్తెయగు;సీతాం = సీతను;మార్గమాణః=వెదకుచు;అగచ్ఛం=పోతిని.

నేను,నూఱుయోజనంబులయాయామంబుగలసముద్రంబుదాఁటి, సీతాదేవింజూడఁగోరి,వెదకుచుఁ,బోతిని.

అని, తాత్పర్యము.

తత్ర లంకేతి నగరీ రావణస్య దురాత్మనః. ౯
దక్షిణస్య సముద్రస్య తీరే వసతి దక్షిణే

టీక॥తత్ర=అచ్చట; దక్షిణస్య=దక్షిణదిక్కునందున్న;సముద్రస్య=సముద్రముయొక్క;దక్షిణే = దక్షిణదిక్కునందున్న;తీరే = గట్టునందు;దురాత్మనః=దుష్టబుద్ధిగల;రావణస్య=రావణునియొక్క;లంకేతి=లంకయను; నగరీ=పట్టణము;వసతి=ఉన్నది.

అచ్చట,దక్షిణసముద్రంబుదక్షిణపుగట్టునందు,దురాత్ముండగురావణునిపట్టణంబులంకయనునదియొకటిగలదు.

అని,తాత్పర్యము.

తత్ర దృష్టా మయా సీతా రావణాంతఃపురే సతీ. ౧౦
సన్న్యస్య త్వయి జీవంతీ రామా రామ మనోరథమ్

టీక॥ రామ=రాముఁడా! తత్ర=అచ్చట; రావణాంతఃపురే=రావణుని యంతఃపురమునందు; సతీ = పతివ్రతయు; రామా=మనోహరురాలును; త్వయి=నీయందు; మనోరథం=కోర్కెని; సన్న్యస్య=ఉంచి; జీవంతీ=జీవించియున్నదియునగు; సీతా= సీతాదేవి; మయా=నాచేత; దృష్టా = చూడఁబడినది.

రాముఁడా! అచ్చట, రావణాంతఃపురంబునందుఁ, బతివ్రతయుసుందరాంగియు,నీయందుమనంబుంచి జీవంబుతోనున్నదియునగు,సీతాదేవింజూచితిని. అని, తాత్పర్యము.

దృష్టా మే రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః. ౧౧
రాక్షసీభి ర్విరూపాభీ రక్షితా ప్రమదావనే

టీక॥ ప్రమదావనే= అంతఃపురవనమునందు; రాక్షసీమధ్యే= రాక్షసస్త్రీలనడుమ; విరూపాభిః= వికృతమయినయాకారముగల; రాక్షసీభిః = రాక్షసస్త్రీలచేత;ముహుర్ముహుః= మాటిమాటికిఁ తర్జ్యమానా= బెదరింపఁబడుచున్నదియు;రక్షితా=రక్షింపఁబడినదియునగు; సీతా(అధ్యాహృతము)=సీతాదేవి; మే=(తృతీయార్థమందుషష్ఠి)నాచేత; దృష్టా= చూడఁబడినది.

అచ్చటనంతఃపురవనంబున, రాక్షసస్త్రీలనడుమఁ, గావలియున్న రాక్షసస్త్రీలచేమాటిమాటికి, బెదరింపఁబడుచున్నసీతాదేవింజూచితిని.

అని, తాత్పర్యము.

దుఃఖ మాసాద్యతే దేవి తథాఽదుఃఖోచితా సతీ. ౧౨

టీక॥అదుఃఖోచితా= దుఃఖంబునకుఁదగినదికానిదియు;సతీ = పతివ్రతయునగు;దేవీ=సీతాదేవి;తథా = అట్లు;దుఃఖం=దుఃఖమును; ఆసాద్యతే= పొందింపఁబడుచున్నది.

దుఃఖంబనుభవింప నెంతమాత్రము

తగనిదియుఁ బతివ్రతయునగు సీతాదే
వి, యట్లునానావిధ దుఃఖంబులంబొం
దుచున్నది.అని,తాత్పర్యము.

రావణాంతఃపురే రుద్ధా రాక్షసీభి స్సురక్షితా
ఏకవేణీధరా దీనా త్వయి చింతాపరాయణా. ౧౩
అధశ్శయ్యావివర్ణాంగీ పద్మినీవ హిమాగమే
రావణా ద్వినివృత్తార్థా మర్తవ్యకృత నిశ్చయా. ౧౪
దేవీ కథంచి త్కాకుత్స్థ త్వన్మనా మార్గితా మయా

టీక॥ కాకుత్స్థ=రాముఁడా! రావణాంతఃపురే = రావణునియంతఃపురమునందు;రుద్ధా = అడ్డగింపఁబడినదియు;రాక్షసీభిః= రాక్షసస్త్రీలచేత;సురక్షితా=చక్కఁగారక్షింపఁబడినదియు;ఏకవేణీధరా= ఒకజడనుధరించినదియు;దీనా = దుఃఖితయును;త్వయి=నీయందలి; చింతాపరాయణా= చింతయె ముఖ్యమయిన గతిగాఁగలదియు;అధశ్శయ్యావివర్ణాంగీ= క్రిందఁబరుండుటచేఁదెల్లఁబాఱిన దేహముగలదియు;హిమాగమే= హేమంతర్తువునందు;పద్మినీవ(స్థితా)= తామరకొలంకువలెనున్నదియు;రావణాత్ =రావణునివలన;వినివృత్తార్థా= మఱలినచిత్తవృత్తిగలదియు; మర్తవ్యకృతనిశ్చయా= చావవలెననిచేయఁబడిననిశ్చయముగలదియు;త్వన్మనాః= నీయందు మనసుగలదియునగు; దేవీ=సీతాదేవి; కథంచిత్ = అతిప్రయాసమున; మయా= నాచేత;మార్గితా=వెదకఁబడినది.

రాముఁడా! రావణాంతఃపురంబున,రాక్షసస్త్రీలచేరక్షింపఁబడుచు,నొక్కజడగాఁగట్టిన తలవెండ్రుకలుగల్గి దీనయయి, నీయందెమనసునుంచి నిన్నె ధ్యానింపుచు, నేలంబరుండుటచేఁ, దెల్లఁబాఱినదేహముగలదిగావున హేమంతర్తువునందలి తామరకొలంకుం బోలెఁగాంతిహీనయయి, రావణునందు మనంబు సేర్పక, యతనినిర్బంధంబున కుమరణంబునొందనిశ్చయించియున్న, సీతాదేవిని, అతిప్రయాసంబునంజూచితిని.అని, తాత్పర్యము.

ఇక్ష్వాకువంశవిఖ్యాతిం శనైః కీర్తయతానఘ. ౧౫

సా మయా నరశార్దూల విశ్వాస ముపపాదితా

టీక॥ అనఘ— పాపరహితుండవును; నరశార్దూల=పురుషశ్రేష్ఠుండవు నగురాముఁడా! శనైః=మెల్లగా ; ఇక్ష్వాకువంశవిఖ్యాతిం = ఇక్ష్వాకువంశముయొక్క ప్రసిద్ధిని;కీర్తయతా=చెప్పుచున్న; మయా=నాచేత; సా= ఆసీతాదేవి; విశ్వాసం=నమ్మకమును; ఉపపాదితా=పొందింపఁబడినది.

పాపరహితుండవును బురుషశ్రేష్ఠుండవునగురాముఁడా! నేను మెల్లఁగానిక్ష్వాకువంశవృత్తాంతంబుఁజెప్పి , యాబిడకునాయందునమ్మకంబు గల్గించుకొంటిని.

అని, తాత్పర్యము.

తత స్సంభాషితా దేవీ సర్వ మర్థంచ దర్శితా. ౧౬

టీక॥ తతః=అటుపిమ్మట; దేవీ = సీతాదేవి; సంభాషితా=మాటలాడఁబడినది- సర్వం = సమస్తమయిన; అర్థంచ=సమాచారమును; దర్శితా= చూపఁబడినది, తెలియఁజేయఁబడినది.

అంత, నేనుసీతాదేవితోమాటలాడి, సమాచారమునంతయుం జెప్పితిని.

అని, తాత్పర్యము-

రామసుగ్రీవసఖ్యంచ శ్రుత్వా ప్రీతి ముపాగతా

టీ॥ సా(అధ్యాహృతము)= ఆసీత;రామసుగ్రీవసఖ్యంచ=రామసుగ్రీవుల స్నేహమును;శ్రుత్వా=విని;ప్రీతిం=సంతోషమును;ఉపాగతా=పొందినది.

ఆసీతాదేవి, నీకునుసుగ్రీవునకుంగల స్నేహమునువిని ,సంతోషంబునొందినది. అని,తాత్పర్యము.

నియత స్సముదాచారో భ_క్తి శ్చాస్యా_స్తథా త్వయి. ౧౭

టీక॥ అస్యాః=ఈసీతయొక్క; సముదాచారః = సదాచారము ; నియతః=నిశ్చితము. తథా=అట్లు;త్వయి=నీయందు;భ_క్తిశ్చ=భ_క్తియును ; నియతా(అధ్యాహృతము)=నిశ్చితము.

ఈసీతాదేవిపాతివ్రత్యంబును, ఆ

బిడకునీయందుగల భక్తియును, ఎంత మాత్రముదఱుఁగకున్నది-

అని, తాత్పర్యము-

ఏవం మయా మహాభాగా దృష్టా జనకనందినీ
ఉగ్రేణ తపసా యుక్తా త్వద్భక్త్యా పురుషర్షభ. ౧౮

టీక॥పురుషర్షభ= పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! ఏవం=ఇట్లు ; మహాభాగా= పూజ్యమయినయదృష్టము గలదియు; ఉగ్రేణ=భయంకరమగు; తపసా=తపసుతోను; త్వద్భక్త్యా = నీయందలిభక్తితోను; యుక్తా = కూడినదియునగు; జనకనందినీ= జనకమహారాజు కొమారితెయయినసీతాదేవి; మయా=నాచేత;దృష్టా = చూడఁబడినది.

పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! ఇట్లు, నేను, మహాభాగ్యురాలును, భయంకరంబుగానాహారంబువిడిచి , నీయందుమహాభక్తిగలిగియున్నదియునగుసీతాదేవింజూచితిని.

అని, తాత్పర్యము.

అభిజ్ఞానంచ మే దత్తం యథా వృత్తం తవాంతికే
చిత్రకూటే మహాప్రాజ్ఞ వాయసం ప్రతి రాఘవ. ౧౯

టీక॥ మహాప్రాజ్ఞ = మహాపండితుండవగు; రాఘవ= రాముఁడా! చిత్రకూటే= చిత్రకూట పర్వతమునందు; తవ=నీయొక్క;అంతికే= సమీపమునందు; వాయసంప్రతి= కాకినిగూర్చి; యథా=ఎట్లు;వృత్తం= జరిగినదో, తథా(అధ్యాహృతము)= అట్లు; అభిజ్ఞానంచ=గుఱుతును;మే= నాకొఱకు;దత్తం=ఇయ్యఁబడినది.

మహాపండితుండవగురాముఁడా! చిత్రకూటపర్వతంబున నీయొద్దజరగినయొకకాకివృత్తాంతంబును, నాకు గుఱుతుగాఁజెప్పినది. అని, తాత్పర్యము-

విజ్ఞాప్యశ్చ నరవ్యాఘ్రో రామోవాయుసుత త్వయా
అఖిలేనేహ యద్దృష్ట మితి మా మాహ జానకీ. ౨౦

టీక॥ వాయుసుత—వాయుకుమారుండవగుహనుమంతుఁడా! త్వయా=నీచేత; నరవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుండగు; రామః=రాముఁడు; ఇహ—ఇచ్చట; యత్—ఏది; దృష్టం= చూడఁబడినదో; తత్ (అధ్యాహృతము)= దాని; అఖిలేన = సాకల్యముచేత; విజ్ఞాప్యః==విన్నవింపఁదగినవాఁడు. ఇతి=అని; జానకీ=సీతాదేవి; మాం—నన్నుఁగూర్చి; ఆహ=చెప్పెను.

"వాయు కుమారుండవగు హనుమంతుఁడా! నీవిచ్చటఁజూచినదిచూచినట్టుగా, సమాచారంబునంతయుఁ, బురుషశ్రేష్ఠుండగు రాముని యొద్ద విన్నవింపవలయు" అని. సీతాదేవి, నాతోఁజెప్పినది. అని, తాత్పర్యము-

అయం చాస్మై ప్రదాతవ్యో యత్నా త్సుపరిరక్షితః
బ్రువతా వచనా న్యేవం సుగ్రీవ స్యోపశృణ్వతః. ౨౧

టీక॥యత్నాత్= ప్రయత్నమువలన; సుపరిరక్షితః = చక్కఁగారక్షింపఁబడిన; అయంచ = ఈమణియును; సుగ్రీవస్య=సుగ్రీవుఁడు; ఉపశృణ్వతః=వినుచుండఁగా; ఏవం=ఇట్లు; వచనాని=మాటలను; బ్రువతా = చెప్పుచున్న; త్వయా (అధ్యాహృతము) = నీచేత; అస్మై=ఈరామునికొఱకు; ప్రదాతవ్యః=ఇవ్వఁబడవలసినది.

నీవు, సుగ్రీవుండును వినుచుండఁగా, నేనిప్పుడుచెప్పు మాటలుం జెప్పి, యింతవఱకుమహాప్రయత్నంబునం గాపాడినయాచూడామణిని, రామునకొసంగుము. అని, తాత్పర్యము.

ఏష చూడామణి శ్శ్రీమాన్ మయా సుపరిరక్షితః

టీక॥ శ్రీమాన్—అధికమయినకాంతిగల; ఏషః=ఈ; చూడామణిః—చూడామణి; మయా—నాచేత; సుపరిరక్షితః—చక్కఁగారక్షింపఁబడినది.

శ్రీమంతంబగునీచూడామణిని, నేను మహాప్రయత్నంబునంగాపాడితిని-
అని, తాత్పర్యము-

మనశ్శిలాయా స్తిలకో గండపార్శ్వే నివేశితః. ౨౨

త్వయా ప్రణష్టే తిలకే తం కిల స్మర్తు మర్హసి

టీక॥తిలకే=బొట్టు; ప్రణష్టే= నశింపఁగా;త్వయా = నీచేత;మనశ్శిలాయాః=మణిసిలయొక్క;తిలకః = బొట్టు;గండపార్శ్వే= గుండ్రాయిప్రక్క ను, లేక, చెక్కిలి ప్రక్కను; నివేశితః= ఉంచఁబడినది-తం = ఆసమాచారమును;స్మర్తుం = తలంచుకొనుటకు;అర్హసికిల=తగుదువుగదా!

ఒకనాఁడు, నానుదుటిమీఁదిబొట్టుకలఁగికనుపడకుండఁగా,నీవు, మణిసిలను బొట్టుగాఁజేసి,నానుదుటంబ్రతిఫలించి బొట్టుగాఁజూపట్టుచుండునట్లు,నాయెదుటనుండినగుండ్రాయిపై, నుంచినావు;దానిందలఁచుకొనుము.

అని, తాత్పర్యము.

లేక; ఒకనాఁడు, నానుదుటిమీఁది బొట్టుకలఁగియగపడకుండఁగా,నీవు,మణిసిలనుబొట్టుగాఁజేసి, పరిహాసార్థము,నాచెక్కిలిపైఁబెట్టినావు; దానిం దలంచుకొనుము.అని, తాత్పర్యము.

ఏష నిర్యాతిత శ్శ్రీమా న్మయా తే వారిసంభవః. ౨౩
ఏతం దృష్ట్వా ప్రమోదిష్యే వ్యసనే త్వా మివానఘ

టీక॥అనఘ=పాపరహితుండవగు రాముఁడా!మయా=నాచేత; తే=నీకొఱకు;శ్రీమాన్= అధికమయినకాంతిగల;వారిసంభవః=జలమునందుఁబుట్టిన; ఏషః=ఈచూడామణి;నిర్యాతితః= పంపఁబడినది.వ్యసనే = దుఃఖమునందు; త్వామివ=నిన్నువలె;ఏతం= దీనిని;దృష్ట్వా=చూచి;ప్రమోదిష్యే = సంతోషింపఁగలను.

పాపరహితుండవగురాముఁడా!సముద్రంబునందుఁబుట్టిన యీచూడామణినీకొఱకుఁబంపితిని; ఈదుఃఖంబునందు,నిన్నుఁజూచినట్లు, దీనింజూచిసంతోషించుచుంటిని.అని, తాత్పర్యము.

జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ. ౨౪
ఊర్ధ్వం మాసా న్న జీవేయం రక్షసాం వశ మాగతా

టీక॥దశరథాత్మజ = దశరథునిపుత్రుండవగురాముఁడా! మాసం=మాసకాలము;జీవితం = ప్రాణమును;ధారయిష్యామి=ధరించెదను. మాసాత్ =

మాసముకన్న; ఊర్ధ్వం = పైని; రక్షసాం= రాక్షసులయొక్క; వశం=అధీనతను; ఆగతా=పొందినదాననై; నజీవేయం=జీవింపను.

దశరథ కుమారుండవగు రాముఁడా! ఇంక నొక్కనెలవఱకు జీవించియుండెదను; ఈ రాక్షసుల నడుమంజిక్కి, యింకనొక్కమాసంబునకుఁబైని జీవింపంజాలను. అని, సుగ్రీవుండువినుచుండ రామునితోఁజెప్పి, యీచూడామణినిమ్ము. అని, సీతాదేవినాతోఁజెప్పినది. అని, తాత్పర్యము.

ఇతి మా మ బ్రవీ త్సీతా కృశాంగీ ధర్మచారిణీ. ౬౫
రావణాంతఃపురే రుద్ధా మృగీవో త్ఫుల్లలోచనా

టీక॥ కృశాంగీ= కృశించిన దేహముగలదియు; ధర్మచారిణీ = ధర్మమునాచరించునదియు; రావణాంతఃపురే= రావణునియంతఃపురంబునందు; రుద్ధా= అడ్డగింపఁబడినదియు; మృగీవ=లేడివలె; ఉత్ఫుల్లలోచనా = వికసించినకంద్లుగలదియునగు; సీతా = సీతాదేవి; ఇతి=అని; మాం=నన్నుఁగూర్చి; అబ్రవీత్ =చెప్పెను.

కృశించినదేహముఁగలదియు, ధర్మంబు వదలకున్నదియు రావణుని యంతఃపురంబుననిరోధింపఁబడియున్నదియు లేడివలెభయాతిశయంబునవికసించిననేత్రంబులుగలదియునగు సీతాదేవి, నాతోనిట్లుచెప్పినది- అని, తాత్పర్యము.

ఏతదేవ మయా ఖ్యాతం సర్వం రాఘవ యద్యథా. ౬౬

టీక॥ రాఘవ= రాముఁడా! యత్= ఏది; యథా=ఎట్లు; సీతయా, ఆఖ్యాతం (అధ్యాహృతము)= సీతాదేవిచేఁ జెప్పఁబడినదో; తథా (అధ్యాహృతము)=అట్లు; ఏతత్ = ఈసమాచారము; సర్వమేవ = అంతయునే; ఆఖ్యాతం=చెప్పఁబడినది,

రాముఁడా! సీతాదేవినాతోనేమేమిచెప్పినదో, దానినంతయు; నీకుఁజెప్పివేసితిని. అని, తాత్పర్యము.

సర్వథా సాగరజలే సంతారః ప్రవిధీయతామ్

టీక॥సర్వథా = అన్నివిధములను; సాగరజలే = సముద్రజలమునందు; సంతారః=దాఁటించుసాధనము ; ప్రవిధీయతాం=చేయఁబడుఁగాక.

ఎట్లయినను;సముద్రంబుదాఁటునుపాయంబునాలోచింపుఁడు. అనిహనుమంతుండు, రామునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తౌ జాతాశ్వాసౌ రాజపుత్రౌ విదిత్వా
తచ్చాభిజ్ఞానం రాఘవాయ ప్రదాయ. ౨౭
దేవ్యాచాఖ్యాతం సర్వమేవానుపూర్వ్యా
ద్వాచా సంపూర్ణం వాయుపుత్త్రశ్శశంస

టీక॥ వాయుపుత్రః= వాయుదేవునికుమారుండగుహనుమంతుండు;తౌ= ఆ; రాజపుత్రౌ = రాచకొమరులగు రామలక్ష్మణులను;జాతాశ్వాసౌ=కలిగినయూఁఱటగలవారలనుగా;విదిత్వా= తెలిసికొని; తత్=ఆ; అభిజ్ఞానం= గుఱుతును; రాఘవాయ= రామునికొఱకు; ప్రదాయచ= ఇచ్చియు;దేవ్యా= సీతాదేవిచేత; ఆఖ్యాతం= చెప్పఁబడినదాని; సర్వమేవ=అంతయే; ఆనుపూర్వ్యాత్= క్రమమువలన; వాచా = మాటచేత; సంపూర్ణంచ= సమస్తమునుగా; శశంస=చెప్పెను.

ఇట్లు వాయుదేవునికుమారుండగు హనుమంతుండు, రాచకొమరులగురామలక్ష్మణులుకొంత యూఱట నొంది యుండుటందెలిసికొని, సీతయొసంగిన చూడామణినిరామునకొసంగి, యాబిడ చెప్పిపంపిన సమాచారము నంతయుఁ, గ్రమముగా, రామునకుంజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే,శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
సుందరకాండే, పంచషష్టితమస్సర్గః.

ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, సుందరకాండపంచషష్టితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

## షట్షష్టితమసర్గప్రారంభః.

ఏవ ముక్తో హనుమతా రామో దశరథాత్మజః
తం మణిం హృదయే కృత్వా ప్రరురోద సలక్ష్మణః. ౧

టీక॥ దశరథాత్మజః= దశరథునికుమారుండగు; రామః= రాముఁడు ; సలక్ష్మణః= లక్ష్మణునితోఁగూడినవాఁడై; హనుమతా = హనుమంతునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; తం=ఆ; మణిం= చూడామణిని; హృదయే = మనసునందు; కృత్వా=చేసి; ప్రరురోద= రోదనంబుఁ జేసెను.

దశరథునికుమారుండగు రాముండు హనుమంతుండు చెప్పినదివిని, యాచూడామణిని ఱొమ్మునపైనుంచుకొని, లక్ష్మణునితోఁగూడ రోదనంబుఁజేసెను. అని, తాత్పర్యము.

తంతు దృష్ట్వా మణిశ్రేష్ఠం రాఘవ శ్శోకకర్శితః
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యాం సుగ్రీవ మిద మబ్రవీత్. ౨

టీక॥ మణిశ్రేష్ఠం = మణులలోనుత్తమంబయిన; తం=ఆచూడామణిని; దృష్ట్వాతు=చూచినంతనె; రాఘవః= రాముండు; శోకకర్శితః= దుఃఖముచేఁగృశింపఁజేయఁబడినవాఁడై; అశ్రుపూర్ణాభ్యాం = కన్నీళ్లనిండిన; నేత్రాభ్యాం=కన్నులతో, సుగ్రీవం= సుగ్రీవునిగూర్చి; ఇదం=ఈమాటను ; అబ్రవీత్ =చెప్పెను.

మణులలోనుత్తమంబగునాచూడామణింజూచినంతనె, రాముండు, పరమదుఃఖంబుఁబొంది, కండ్లునిండఁగన్నీళ్లుగాఱ, సుగ్రీవుంజూచి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

యథైవ ధేను స్స్రవతి స్నేహా ద్వత్సస్య వత్సలా
తథా మమాపి హృదయం మణిరత్నస్య దర్శనాత్. ౩

టీక॥ యథా=ఎట్లు ; వత్సలా = దూడయందధికప్రీతిగల; ధేనుః = ఆవు; వత్సస్య = దూడయొక్క; స్నేహాత్=స్నేహమువలన;స్రవత్యేవ=ద్రవించుచునేయుండునో;తథా=అట్లు;మమ=నాయొక్క; హృదయమపి=మనసును; మణిరత్నస్య=మణిశ్రేష్ఠము యొక్క; దర్శనాత్=చూచుటవలన ; స్రవతి (అధ్యాహృతము)= ద్రవించును-

దూడయందధికప్రీతిగల యావు , దూడయందలిస్నేహంబున స్రవించునట్లు;నామనసు; ఈచూడామణింజూచి ద్రవించుచున్నది.అని, తాత్పర్యము-

మణిరత్న మిదం దత్తం వైదేహ్యా శ్శ్వశురేణ మే

టీక॥ఇదం=ఈ; మణిరత్నం=మణిశ్రేష్ఠము;మే=నాయొక్క;శ్వశురేణ=మామయగుజనకమహారాజుచేత; వైదేహ్యాః=సీతాదేవికి;దత్తం=ఇయ్యఁబడినది.

మణిశ్రేష్ఠమగునీచూడామణిని, నామామయగుజనకమహారాజు,సీతాదేవికొరకుంగొసంగెను.అని, తాత్పర్యము.

వధూకాలే యథాబద్ధ మధికం మూర్ధ్ని శోభతే. ౪

టీక॥యథా=ఎట్లు;అధికం=మిక్కిలియు;శోభతే = ప్రకాశించునో; తథా(అధ్యాహృతము) = అట్లు;వధూకాలే=వివాహకాలమునందు;బద్ధం=కట్టఁబడినది.

వివాహకాలంబున నధికప్రకాశంబుగలుగునట్లు, దానిందలయందుబంధించిరి.అని, తాత్పర్యము.

అయంహి జలసంభూతో మణి స్సజ్జనపూజితః
యజ్ఞే పరమతుష్టేన దత్త శ్శక్రేణ ధీమతా. ౫

టీక॥యజ్ఞే=యాగమునందు; పరమతుష్టేన=మిక్కిలియుసంతోషించిన ;ధీ




మతా=అధికమయినబుద్ధిగల; శక్రేణ= ఇంద్రుని చేత; జలసంభూతః = జలమునందుఁబుట్టినదియు; సజ్జనపూజితః= పెద్దలచేఁ బూజింపఁబడినదియునగు; అయం= ఈ; మణిః = చూడామణి; దత్తో హి=ఇయ్యఁబడినదిగదా!

మున్ను, బుద్ధిమంతుండగునింద్రుండు, జనకమహారాజొక యాగము సేయఁగా, దానికిసంతోషించి, జలంబునంబుట్టినదియుఁ బెద్దలచేఁ బూజింపఁబడినదియునగునీచూడామణిని, ఆయనకొసంగెను. అని, తాత్పర్యము.

ఇమం దృష్ట్వా మణిశ్రేష్ఠం యథా తాతస్య దర్శనమ్
అద్యాస్మ్యవగత స్సౌమ్య వైదేహస్య తథా విభోః. ౬

టీక॥ సౌమ్య= తిన్ననివాఁడవగుసుగ్రీవుఁడా! అద్య = ఇప్పుడు; అహం(అధ్యాహృతము)= నేను; ఇమం= ఈ; మణిశ్రేష్ఠం = మణులలోనుత్తమమయిన చూడామణిని; దృష్ట్వా = చూచి; తాతస్య= తండ్రియొక్కయు; తథా= అట్లు; విభోః= ప్రభుండగు; వైదేహస్య= జనకమహారాజు యొక్కయు; దర్శనం= చూచుటను; అవగతో యథా= పొందినట్లు; అస్మి= అగుచున్నాను.

సౌమ్యుండవగుసుగ్రీవుఁడా! ఇప్పుడు నాకు, ఈచూడామణింజూడఁగా, నా తండ్రి దశరథమహారాజును జనకమహారాజునుంజూచినట్లున్నది.

అని, తాత్పర్యము.

అయంహి శోభతే తస్యాః ప్రియాయా మూర్ధ్ని మే మణిః
అస్యాద్య దర్శనే నాహం ప్రాప్తాం తా మివ చింతయే. ౭

టీక॥ అయం= ఈ; మణిః= చూడామణి; మే= నాయొక్క; ప్రియాయాః= ప్రియురాలగు; తస్యాః = ఆసీతయొక్క; మూర్ధ్ని= తలయందు; శోభతేహి= ప్రకాశించునుగదా! అద్య=ఇప్పుడు; అహం= నేను; అస్య= దీనియొక్క; దర్శనేన= చూచుటచేత; తాం= ఆసీతను; ప్రాప్తామివ= వచ్చినదానివలె; చింతయే= తలంచుచున్నాను.

ఈచూడామణి నాప్రియురాలి శిరంబునంబ్రకాశించుచుండునది కావున, ఇప్పుడు, నాకుదీనింబూచుటచే నాప్రియు




రాలింబూచినట్లున్నది. అనిరాముండు సుగ్రీవునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

కి మాహ సీతా వైదేహీ బ్రూహి సౌమ్య పునఃపునః
పిపాసు మివ తోయేన సించంతీ వాక్యవారిణా. ౮

టీక॥ సౌమ్య=తిన్ననివాఁడవగుహనుమంతుఁడా! వైదేహీ= జనకమహారాజుకొమాతెయగు; సీతా=సీతాదేవి; పునఃపునః= మాటిమాటికి; తోయేన=జలముచేత; పిపాసుమివ= దప్పిగొన్న వానివలె; మాం(అధ్యాహృతము)= నన్ను; వాక్యవారిణా= మాటయనుజలముచేత, సించంతీ=తడుపుచు; కిం=ఏమి; ఆహ=చెప్పినది?

సౌమ్యుండవగుహనుమంతుఁడా!సీతాదేవి, దప్పిగొన్నవాని జలంబుచేతంబోలె నన్నువాక్యజలంబులందడుపుచు, ఇంకను,ఏమిచెప్పినది? అనిరాముండు, హనుమంతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతస్తు కిం దుఃఖతరం యదిమం వారిసంభవమ్
మణిం పశ్యామి సౌమిత్రే వైదేహీ మాగతాం వినా. ౯

టీక॥ సౌమిత్రే=లక్ష్మణుఁడా!ఆగతాం=వచ్చిన;వైదేహీంవినా=సీతాదేవినివిడిచి; ఇమం=ఈ;వారిసంభవం=జలమునందుఁబుట్టిన;ఇమం=ఈ;మణిం=మణిని;పశ్యామి(ఇతి)యత్= చూచుచున్నాననునదియేదిగలదో; ఇతస్తు=దీనికన్నను;దుఃఖతరం= మిక్కిలియుదుఃఖముగలిగించునది;కిం=ఏమి?

లక్ష్మణుఁడా!సీతంజూడక, సీతధరించునీచూడామణిని జూచుచున్నానే! దీనికన్నినంకనాకు దుఃఖము గలిగించునదియేమి? అని, తాత్పర్యము.

చిరంజీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి

టీ॥వైదేహీ=సీతాదేవి; మాసం=మాసకాలము; ధరిష్యతియది= ప్రాణంబులుదాల్చియుండునేని; చిరం=బహుకాలము; జీవతి=బ్రతికియున్నది.

సీత, యింక మాసమువఱకు నన్ను విడచి బ్రతికియుండునేని, ఆ! అది బహుకాలము వఱకు బ్రతికి యుండినట్లె! అని, తాత్పర్యము.

క్షణం సౌమ్య నజీవేయం వినా తా మసితేక్షణామ్. ౧౦

టీక॥ సౌమ్య= తిన్ననివాఁడవగులక్ష్మణుఁడా! అహం (అధ్యాహృతము)=నేను; అసితేక్షణాం = నల్లనికండ్లుగల; తాంవినా=ఆసీతనువిడిచి; క్షణం క్షణకాల మయినను ; నజీవేయం=బ్రతుకను.

తిన్ననివాఁడవగులక్ష్మణుఁడా; నేనింక, నల్లనికండ్లుగలయాసీతను విడిచి క్షణంబయినను బ్రతికియుండంజాలను. అనిరాముండు లక్ష్మణునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

నయ మా మపి తం దేశం యత్ర దృష్టా మమ ప్రియా
న తిష్ఠేయం క్షణమపి ప్రవృత్తి ముపలభ్యచ. ౧౧

టీక॥ యత్ర=ఎచ్చట; మమ= నాయొకతె; ప్రియా= ప్రియురాలయినసీత; దృష్టా=చూడఁబడినదో; తం=ఆ; దేశం=ప్రదేశమును; మామపి=నన్నును; నయ=పొందింపుము. ప్రవృత్తిం= సమాచారమును; ఉపలభ్యచ= తెలిసియు; క్షణమపి= కొంచెమునేపయినను; నతిష్ఠేయం=నిలువను.

నీవెచ్చట సీతాదేవిం జూచినావో అచ్చటికి నన్నునుంగొనిపొమ్ము; ఆబిడవృత్తాంతంబుఁ దెలిసినవెనుక, నేనింక క్షణంబైనను, ఇచ్చోనుండను. అని, తాత్పర్యము.

కథం సా మమ సుశ్రోణీ భీరుభీరు స్సతీ సదా
భయావహానాం ఘోరాణాం మధ్యే తిష్ఠతి రక్షసామ్. ౧౨

టీక॥ సుశ్రోణీ=మంచిపిఱుందులుగలదియు; భీరుభీరుః = మిక్కిలియుభయంబునొందు స్వభావము గలదియునగు; సా=అట్టి; మమ= నాయొకతె; సతీ=భార్య; సదా=ఎల్లప్పుడును; భయావహానాం = భయంబుఁగల్గించు

నట్టి; ఘోరాణాం=ఉగ్రులయిన ; రక్షసాం=రాక్షసులయొక్క; మధ్యే= నడుమ; కథం=ఎట్లు ; పతిష్ఠతి=ఉన్నది?

సుందరంబులగు పిఱుఁదులు గలదియుమిక్కిలియుభయపడుస్వభావంబు గలదియునగు నాభార్యసీత, భయంకరాకారులునుగ్రులునగు రాక్షసులనడుమనెల్లప్పుడు నెట్లున్నది?

అని, తాత్పర్యము-

శారద స్తిమిరోన్ముక్తో నూనం చంద్ర ఇవాంబుదైః
ఆవృతం వదనం తస్యా న విరాజతి రాక్షసైః- ౧౩

టీక॥ శారదః=శరదృతువునందుఁ బుట్టినదియు ; తిమిరోన్ముక్తః= చీఁకటిచేవిడువఁబడినదియు ; అంబుదైః = మేఘములచేత; ఆవృతః(అధ్యాహృతము)=కప్పఁబడినదియునగు ; చంద్రఇవ=చంద్రుఁడువలె ; రాక్షసైః= రాక్షసులచేత ; ఆవృతం=కప్పఁబడిన ; తస్యాః=ఆసీతయొక్క; వదనం=ముఖము; నవిరాజతి= ప్రకాశింపకుండును- నూనం=నిశ్చయము!

ఎంతమాత్రముచీఁకటిలేని, శరదృతువునందలిచంద్రుండు, మేఘంబులచేఁగప్పఁబడినచోఁబ్రకాశింపకుండునట్లు, సీతముఖంబు, రాక్షసులచేఁగప్పఁబడినదగుటంజేసి , యెంతమాత్రముప్రకాశింపదు; ఇదినిశ్చయము!

అని, తాత్పర్యము-

కి మాహ సీతా హనుమం స్తత్త్వతః కథయాద్య మే
ఏతేన ఖలు జీవిష్యే భేషజేనాతురో యథా- ౧౪

టీక॥హనుమన్=హనుమంతుఁడా! సీతా=సీత;కిం=ఏమి;ఆహ=చెప్పినది? అద్య=ఇప్పుడు; మే=నాకొఱకు;తత్త్వతః=యాథార్థ్యముచేత; కథయ=చెప్పుము. భేషజేన=ఔషధముచేత; ఆతురోయథా=రోగివలె;ఏతేన=దీనిచేత; జీవిష్యేఖలు=జీవించియుందునుగదా!

హనుమంతుఁడా! సీతయేమిచెప్పినది? నాకిప్పుడుయథార్థముగాఁజెప్పుము;రోగిమందుచేజీవించునట్లు, నేనుసీతచెప్పినమాటలనునీవుజెప్పఁగా వినుచు జీవించియుందును.

అని, తాత్పర్యము.

మధురా మధురాలాపా కి మాహ మమ భామినీ
మద్విహీనా వరారోహా హనుమన్ కథయస్వ మే. ౧౫

టీక॥ హనుమన్ = హనుమంతుఁడా! మధురా = సుందరియును; మధురాలాపా = మనోహరములగుమాటలుగలదియు; వరారోహా = శ్రేష్ఠములయినపిఱుఁదులుగలదియును; మద్విహీనా = నాచేవిడువఁబడినదియునగు; మమ = నాయొక్క; భామినీ = భార్య; కిం = ఏమి; ఆహ = చెప్పినది? మే = నాకొఱకు; కథయస్వ = చెప్పుము.

హనుమంతుఁడా! సుందరియుమధురంబులగుమాటలు చెప్పునదియుసుందరంబులగుపిఱుఁదులుగలదియునగు నా భార్యసీతాదేవి, నన్నువిడిచి, పరమదుఃఖితయయి, నీతోనేమిచెప్పినది? నాకుఁ జెప్పుము. అని, రాముండుహనుమంతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, షట్షష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండషట్షష్టితమసర్గటీక,
ముగిసినది.

---

౹౭

సప్తషష్టితమసర్గప్రారంభః.

ఏవ ముక్తస్తు హనుమా న్రాఘవేణ మహాత్మనా
సీతాయా భాషితం సర్వం న్యవేదయత రాఘవే. ౧

టీక॥ హనుమాన్ = హనుమంతుండు; మహాత్మనా = పూజ్యమయినస్వభావముగల; రాఘవేణ = రామునిచేత; ఏవం = ఇట్లు; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁ

యైనంతనె; సీతాయాః= సీతయొక్క; భాషితం=మాటను;సర్వం=అంతయు; రాఘవే=రామునందు; న్యవేదయత= తెలిపెను.

హనుమంతుండు, మహాత్ముండగు రాముండు చెప్పినదివిని, సీతాదేవిచెప్పినదంతయు రామునకుం జెప్పనారంభించెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తవతీ దేవీ జానకీ పురుషర్షభ
పూర్వవృత్త మభిజ్ఞానం చిత్రకూటే యథాతథమ్ ౨

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! దేవీ = రాణియగు; జానకీ=సీతాదేవి;చిత్రకూటే= చిత్రకూటపర్వతమునందు; పూర్వవృత్తం= ముందుజరగినదాని;అభిజ్ఞానం= గుఱుతునుగా;యథాతథం = జరగినది జరగినట్లుగా;ఏవం=ఈప్రకారము;ఉక్తవతీ=చెప్పినది.

పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! సీతాదేవి, చిత్రకూటపర్వతంబునజరగిన వృత్తాంతమును జరగినదిజరగినట్లుగా, నీప్రకారము,నాకుగుఱుతుగాఁజెప్పెను. అని, తాత్పర్యము.

సుఖసుప్తా త్వయా సార్ధం జానకీ పూర్వ ముత్థితా
వాయస స్సహసో త్పత్య విరరాద స్తనాంతరే. ౩

టీక॥జానకీ=సీతాదేవి; త్వయాసార్ధం=నీతోఁగూడ;సుఖసుప్తా= సుఖముగానిద్రించినదై; పూర్వం=మున్ను; ఉత్థితా=లేచినది. వాయసః=కాకి; సహసా=శీఘ్రముగా;ఉత్పత్య = వచ్చి; స్తనాంతరే= స్తనంబులనడుమ;విరరాద=గీరెను.

సీతాదేవి, యా చిత్రకూటపర్వతంబున,నీతోఁగూడఁబరుండి, సుఖంబుగా,నిదురింపుచుండి,ముందు,తానునిద్రలేచినది;అప్పుడు,కాకంబొకటివేగంబునవచ్చియాబిడ, స్తనంబులపైగీరెను. అని, తాత్పర్యము.

పర్యాయేణచ సుప్త స్త్వం దేవ్యంకే భరతాగ్రజ

పునశ్చ కిల పక్షీ స దేవ్యా జనయతి వ్యథామ్. ౪

టీక॥ భరతాగ్రజ=భరతునియన్నయగురాముఁడా! త్వం = నీవు ; పర్యాయేణచ=క్రమముచేతను; దేవ్యంకే=సీతాదేవితొడయందు; సుప్తః = నిదురించినావు. పునశ్చ = మఱలను; సః=ఆ; పక్షీ=కాకము; దేవ్యాః = సీతాదేవికి; వ్యథాం = దుఃఖమును; జనయతికిల=కలిగించుచున్నదిగదా!

భరతునియన్నయగురాముఁడా ఆసీతాదేవి నిద్రలేచినపిమ్మట, నీవు, ఆబిడతొడపైఁబరుండి, నిదురించితివి; మఱల, నాకాకము, సీతాదేవినిబాధింపనారంభించినది.

అని, తాత్పర్యము.

పునః పున రుపాగమ్య విరరాద భృశం కిల

టీక॥ సః(అధ్యాహృతము)=ఆకాకము; పునఃపునః=మాటిమాటికి; ఉపాగమ్య=వచ్చి; స్తనాంతరే=స్తనంబులనడుమ; విరరాద=గీఱెను.

ఆకాకము, మాటిమాటికి, సీతాదేవిపైకివచ్చి, యాబిడ స్తనంబులగీఱుచుండెను. అని, తాత్పర్యము.

తత స్త్వం బోధిత స్తస్యాశ్శోణితేన సముక్షితః. ౫

టీక॥తతః=అటుపిమ్మట;తస్యాః=ఆసీతయొక్క, శోణితేన= నెత్తురుచేత; సముక్షితః=విడువఁబడినవాఁడవై ; బోధితః=మేలుకొలుపఁబడినావు.

అంత, నాబిడనెత్తురుచేఁదడుపఁబడుచుండినసన్నునిద్రలేపినది.

అని, తాత్పర్యము.

వాయసేనచ తేనైవ సతతం బాధ్యమానయా
బోధితః కిలదేవ్యా త్వం సుఖసుప్తః పరంతప. ౬

టీక॥ పరంతప= శత్రువులఁదపింపఁజేయునట్టిరాముఁడా! తేన= ఆ ; వాయసేనైవచ= కాకముచేతనే; సతతం=ఎల్లప్పుడును;బాధ్యమానయా=

బాధింపఁబడుచున్న; దేవ్యా= సీతా దేవిచేత; సుఖసుప్తః=సుఖముగానిదురించిన; త్వం=నీవు; బోధితఃకిల= మేలుకొలుపఁబడినావుగదా!

శత్రువులందపింపఁజేయునట్టి రాముఁడా! అంత, సీతాదేవి, యాకాకముచేవిడువక బాధింపఁబడుచు, నా బాధనుదాళలేక, సుఖంబుగానిదురించుచున్ననిన్నునిద్రలేపినది.

అని, తాత్పర్యము.

తాంతు దృష్ట్వా మహాబాహో దారితాంచ స్తనాంతరే
ఆశీవిషఇవ క్రుద్ధో నిశ్వసన్నభ్యభాషథాః. ౭

టీక॥ మహాబాహో = పెద్దచేతులుగలరాముఁడా! త్వం (అధ్యాహృతము) = నీవు; స్తనాంతరే= స్తనంబులనడుమ ; దారితాం = గీఱఁబడిన ; తాం=ఆసీతను; దృష్ట్వాతు= చూచినంతనె; క్రుద్ధః=కోపంబునొందిన; ఆశీవిషఇవ=సర్పమువలె; నిశ్వసన్= నిట్టూర్పులువిడుచుచు;అభ్యభాషథాః= చెప్పితివి.

మహాబాహుండవగురాముఁడా! నీవు స్తనంబులపైగీఱఁబడియున్న యాసీతంజూచినంతనె, సర్పముంబోలెఁగోపంబునొందినిట్టూర్పులువుచ్చుచు, నిట్లని, చెప్పితివి- అని, తాత్పర్యము.

నఖాగ్రైః కేన తే భీరు దారితంతు స్తనాంతరమ్
కః క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా. ౮

టీక॥ భీరు= భయపడుస్వభావముగలసీతా? కేన = ఎవ్వనిచేత; నఖాగ్రైః=గోళ్లకొనలచేత; తే= నీయొక్క; స్తనాంతరం= స్తనమధ్యమునందు;దారితం=గీఱఁబడినది? కః=ఎవ్వఁడు; సరోషేణ=కోపముతోఁ గూడినదియు; పంచవక్త్రేణ= ఐదుతలలుగలదియునగు; భోగినా= పాముచేత; క్రీడతి=క్రీడించును?

భయపడుస్వభావముగలసీతా! ఎవ్వఁడు, నఖాగ్రంబుల నీ స్తనంబులను గీఱెను? ఎవ్వండు, కోపించియున్న యయిదుతలలపాముతోనాటలాడును? అనినీవు, సీతతోఁ జెప్పితివి

అని, తాత్పర్యము-

నిరీక్షమాణ స్సహసా వాయసం సముపైక్షథాః
నఖై స్సరుధిరై స్తీక్ష్ణై స్త్వా మేవాభి ముఖం స్థితమ్. ౯

టీక ‖ త్వం (అధ్యాహృతము) = నీవు; సహసా = శీఘ్రముగా; నిరీక్షమాణః=చూచుచు ; సరుధిరైః= నెత్తురుతోఁగూడినవియు;తీక్ష్ణైః=కఱకుగలవియునగు; నఖైః= గోళ్లతో; త్వామేవ = ఆసీతనుగూర్చియే; అభిముఖం=ఎదురుమొగమయి; స్థితం=ఉన్న; వాయసం — కాకమును; సముపైక్షథాః=చూచినావు.

అంత, శీఘ్రంబున,నాలుగుప్రక్కలంజూచి, యాబిడకెదురుగానే నెత్తురుదగిలి తీక్ష్ణములయినవియునగు గోళ్లతోనున్నకాకింజూచితివి.

అని, తాత్పర్యము-

సుతః కిల స శక్రస్య వాయసః పతతాంవరః
ధరాంతరచర శ్శీఘ్రం పవనస్య గతౌ సమః. ౧౦

టీక‖పతతాం=పక్షులలో;వరః— శ్రేష్ఠమగు; సః=ఆ; వాయసః—కాకము; శక్రస్య=ఇంద్రునియొక్క; సుతః కిల=కొడుకుగదా! ధరాంతరచరః— పర్వతమధ్యంబునం దిరుగునది·శీఘ్రం= వేగముగా; గతౌ=పోవుటయందు; పవనస్య=వాయువునకు; సమః=సమానమయినది.

పక్షులలోశ్రేష్ఠమయినయాకాకి,ఇంద్రునికొడుకు; పర్వతప్రదేశములం దిరుగుచుండును ; శీఘ్రగమనంబున వాయువునకు సరివచ్చునది-

అని, తాత్పర్యము.

తత స్తస్మి న్మహాబాహో కోపసంవర్తితేక్షణః
వాయసే త్వం కృథాః క్రూరాం మతిం మతిమతాం వర. ౧౧

టీక‖మహాబాహో= పెద్దచేతులుగలవాఁడవును;మతిమతాం = బుద్ధిమంతులలో;వరః= శ్రేష్ఠుండవునగురాముఁడా!తతః=అటుపిమ్మట;త్వం= నీ

వు;కోపసంవర్తితేక్షణః=కోపముచేఁదిరుగుడువడినకండ్లుగలవాఁడవై; వాయసే=కాకియందు;క్రూరాం=భయంకరమయిన;మతిం=బుద్ధిని; కృథాః(అకృథాః)= చేసితివి.

మహాబాహుండవుబుద్ధిమంతులలో శ్రేష్ఠుండవునగురామా! అంత,నీవు మహాకోపంబునొంది,ఆకాకిపై, నతిభయంకరంబగుబుద్ధింజేసితివి.
అని, తాత్పర్యము.

స దర్భం సంస్తరా ద్గృహ్య బ్రహ్మాస్త్రేణ హ్యయోజయః

టీక॥సః=అట్టి; త్వం(అధ్యాహృతము)=నీవు;సంస్తరాత్ = ఆసనమునుండి;దర్భం=దర్భను; గృహ్య(గృహీత్వా)=తీసి;బ్రహ్మాస్త్రేణ= బ్రహ్మాస్త్రముతో;అయోజయో హి = కూర్చితివిగదా!

అంత,నీవు, దర్భాసనంబునుండి, యొకదర్భనుదీసి,దానిని,బ్రహ్మాస్త్రమంత్రంబునసభిమంత్రించితివి.
అని,తాత్పర్యము.

ప్రదీప్త ఇవ కాలాగ్ని ర్జజ్వాలాభిముఖః ఖగమ్. ౧౨

టీక॥సః=ఆదర్భ;ఖగం = పక్షినిగూర్చి;అభిముఖః = ఎదురుమొగమైనవాఁడై;దీప్తః=మండుచున్న; కాలాగ్నిరివ= ప్రళయకాలాగ్నిహోత్రమువలె;జజ్వాల=మండినది-

అంత, నాదర్భ, యాకాకికెదురై ప్రళయకాలాగ్నిహోత్రంబువలెజ్వలించినది.అని,తాత్పర్యము.

క్షిప్తవాం స్త్వం ప్రదీప్తంహి దర్భం తం వాయసం ప్రతి
తతస్తు వాయసం దీప్త స్సదర్భోనుజగామహ. ౧౩

టీక॥ త్వం=నీవు; ప్రదీప్తం= మండుచున్న; తం=ఆ; దర్భం= దర్భను; వాయసంప్రతి= కాకినిగూర్చి; క్షిప్తవాన్ హి; వేసితివిగదా! తతస్తు=అంతను;సః=ఆ;దర్భః = దర్భ; దీప్తః= మండినదై; వాయసం=కాకిని; అనుజగామ=వెంబడించినది. "హ" అనునది పాదపూరణార్థము.

నీ వుమందుచున్న యాదర్భను, కాకిపైవేసితివి; అంత నాదర్భ, జ్వలించుచు, నాకాకిపై కదరినది.

అని, తాత్పర్యము.

స పిత్రాచ పరిత్యక్త స్సురైశ్చ సమహర్షిభిః
త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త్రాతారం నాధిగచ్ఛతి. ౧౪

టీక॥ సః=ఆకాకము, త్రీన్=మూఁడైన; లోకాన్ = లోకంబులను; పరిక్రమ్య=చుట్టి; పిత్రాచ=తండ్రిచేతను; సమహర్షిభిః=మహాఋషులతోఁ గూడిన; సురైశ్చ = దేవతల చేతను; పరిత్యక్తః= విడువఁబడినదై ; త్రాతారం=రక్షకుని=నాధిగచ్ఛతి = పొందదయ్యె.

ఆకాకము, ముల్లోకంబులుం దిరిగినను, దండ్రియయినయింద్రుండునుదా నిరక్షింపఁ జాలఁడయ్యె; అట్లుదేవతను మహాఋషులును దానిని రక్షింపం జాలరైరి; అట్లు, ఎచ్చటికిఁబోయినను దానికిరక్షకుండుదొరకఁడయ్యె.

అని, తాత్పర్యము.

పున రేవా గత స్త్రస్త స్త్వత్సకాశ మరిందమ

టీక॥అరిందమ= శత్రువులనడంగం ద్రొక్కు-నట్టిరాముఁడా! సః (అధ్యాహృతము)=ఆకాకము;త్రస్తః= భయపడినదై;పునః = మఱల;త్వత్సకాశమేవ=నీసమీపమునే;ఆగతః=పొందినది.

శత్రువులనడంగంద్రొక్కు-నట్టి రాముఁడా!ఆకాకి, మిక్కి-లియుభయపడి, మరలనీయొద్దకేవచ్చినది.

అని, తాత్పర్యము.

స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణా గతమ్. ౧౫
వధార్హమపి కాకుత్థ్స కృపయా పర్యపాలయః

టీక॥కాకుత్థ్స= రాముఁడా! సః= అట్టి;శరణ్యః= శరణుపొందఁదగినవాఁడవగు;త్వం(అధ్యాహృతము)= నీవు; భూమౌ=నేలయందు;నిపతితం= పడి

నదియును; శరణాగతం=రక్షకునిగాఁ బొందినదియునగు; తం = ఆకాకమును; వధార్హమపి= చంపుటకుఁదగినదానినైనను ; కృపయా=దయచేత; పర్యపాలయః=రక్షించితివి.

రాముఁడా! అట్టిశరణ్యుండవగునీవు, నీముందటభయంబునంగావవేయని నేలంబడినదియుశరణాగతంబునగు నా కాకము,అపరాధి, కావునవధార్హమయినను, దానింగాపాడితివి.

అని, తాత్పర్యము.

మోఘ మస్త్రం నశక్యంతు కర్తుఁ మిత్యేవ రాఘవ. ౧౮
భవాం స్తస్యా క్షి కాకస్య హినస్తి స్మ స దక్షిణమ్

టీక॥ రాఘవ=రాముఁడా! సః= అట్టి; భవాన్=నీవు ; అస్త్రం= బ్రహ్మాస్త్రము ; మోఘం=వ్యర్థముగా; కర్తుం=చేయుటకు; నశక్యంతు= అలవిగాదే; ఇత్యేవ=అనియే; తస్య= ఆ; కాకస్య=కాకియొక్క; దక్షిణం= కుడిదైన; అక్షి=కంటిని;హినస్తిస్మ= కొట్టితివి-

రాముఁడా! బ్రహ్మాస్త్రమువ్యర్థము సేయనలవిగాదనియే , నీవు , ఆ కాకికుడికన్నుకొట్టివేసితివి-

అని, తాత్పర్యము.

రామ త్వాం స నమస్కృత్య రాజ్ఞే దశరథాయ చ. ౧౯
విసృష్టస్తు తదా కాకః ప్రతిపేదే స్వమాలయమ్

టీక ॥ రామ = రాముఁడా! తదా=అప్పుడు; సః=ఆ; కాకః= కాకము ; విసృష్టస్తు=విడువఁబడినంతనె ; త్వాం=నిన్ను; రాజ్ఞే= రాజయిన; దశరథాయచ=దశరథునికొఱకును ; నమస్కృత్య=నమస్కరించి ; స్వం=తనదైన; ఆలయం= స్థానమును ; ప్రతిపేదే=పొందెను-

రాముఁడా! అప్పుడు , నీవుదాని విడిచినవిమ్మట, నాకాకి, నీకునుదశరథమహారాజునకును నమస్కరించి, తనస్థానంబునకుఁబోయినది-

అని, తాత్పర్యము-

ఏవ మస్త్ర విదాం శ్రేష్ఠ స్సత్త్వవాన్ శీలవానపి. ౧౭
కిమర్థ మస్త్రం రక్షస్సు న యోజయతి రాఘవః

టీక॥ ఏవం=ఇట్లు; అస్త్రవిదాం=అస్త్రంబులనెఱింగినవారలలో; శ్రేష్ఠః=ఉత్తముండును; సత్త్వవాన్=అధికమయినబలముగలవాఁడును; శీలవానపి=సత్స్వభావముగలవాఁడునగు; రాఘవః=రాముఁడు; కిమర్థం=ఎందుకొఱకు; రక్షస్సు=రాక్షసులయందు; అస్త్రం=అస్త్రమును; నయోజయతి=కూర్పఁడు-

ఇట్లు అస్త్రవేత్తలలో నుత్తముండును బలవంతుండును సత్స్వభావంబు గల వాఁడునగు రాముండు, రాక్షసులపై నస్త్రంబును బ్రయోగింపఁడేల? అని, తాత్పర్యము-

న నాగా నాపి గంధర్వా నా సురా న మరుద్గణాః. ౧౮
న చ సర్వే రణే శక్తా రామం ప్రతి సమాసితుమ్

టీక॥ రణే=యుద్ధంబునందు; రామం=రామునిఁగూర్చి; సమాసితుం=ఎదురునిలుచుటకు; నాగాః=సర్పములు; నశక్తాః=సమర్థములుకావు-గంధర్వాఅపి=గంధర్వులును; న(శక్తాః)=సమర్థులుకారు-అసురాః=అసురులు; న(శక్తాః)=సమర్థులుకారు-మరుద్గణాః=దేవతలసమూహములు; న(శక్తాః)=సమర్థములుకావు-సర్వేచ=అందఱును; న(శక్తాః)=సమర్థులు కారు-

సర్పంబులుగాని గంధర్వులు గాని యసురులుగాని దేవతలుగాని, యెవ్వరును, యుద్ధంబున, రామునియెదుటనిలువఁజాలరు-అని, తాత్పర్యము-

తస్య వీర్యవతః కచ్చి ద్యద్యస్తి మయి సంభ్రమః. ౨౦
క్షిప్రం సునిశితై ర్బాణై ర్హన్యతాం యుధి రావణః

టీక॥ వీర్యవతః=అధికమయినపరాక్రమముగల; తస్య=ఆరామునికి; మయి=నాయందు; కచ్చిత్=ఒకానొక; సంభ్రమః=ఉత్సాహము; అస్తియది;

కలదేని;క్షిప్రం — శీఘ్రముగా;సునిశితైః=తీక్ష్ణములగు;బాణైః— బాణములచేత;యుధి — యుద్ధమునందు;రావణః=రావణుఁడు;హన్యతాం= చంపఁబడుఁగాక.

మహాపరాక్రమశాలియగు,నారామునకుఁ గొంచెమేని నాయందుత్సాహంబుండునేని,శీఘ్రింబుగాఁ, దీక్ష్ణంబులగుబాణంబులుప్రయోగించి,యుద్ధంబున,రావణుంజంపుఁగాక.

అని, తాత్పర్యము.

భ్రాతు రాదేశ మాజ్ఞాయ లక్ష్మణోవా పరంతపః- ౨౧
స కిమర్థం నరవరో న మాం రక్షతి రాఘవః

టీక॥పరంతపః=శత్రువులఁదపింపఁజేయునట్టి;నరవరః = పురుషశ్రేష్ఠుండగు;రాఘవః= రఘువంశంబునంబుట్టిన;సః=ఆ;లక్ష్మణోవా = లక్ష్మణుండైనను;భ్రాతుః=అన్నయొక్క; ఆదేశం=ఆజ్ఞను;ఆజ్ఞాయ=తీసికొని;కిమర్థం— ఎందుకొఱకు;మాం=నన్ను; నరక్షతి=రక్షింపకున్నాఁడు?

శత్రువులఁ దపింపఁజేయువాఁడును బురుషశ్రేష్ఠుండును రఘువంశంబునంబుట్టినవాఁడునగులక్ష్మణుండైనను, అన్నయనుజ్ఞనొంది,వచ్చి, నన్నురక్షింపకున్నాఁడేమి?అని, తాత్పర్యము.

శక్తౌ తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్నిసమతేజసౌ. ౨౨
సురాణామపి దుర్ధర్షౌ కిమర్థం మా ముపేక్షతః

టీక॥ శక్తౌ=సమర్థులును; పురుషవ్యాఘ్రౌ=పురుషశ్రేష్ఠులును ; వాయ్వగ్నిసమతేజసౌ = వాయువుయొక్కయు నగ్నియొక్కయుఁ దేజస్సులతో సమానములయినతేజస్సులుగలవారలును;సురాణామపి=దేవతలకైనను; దుర్ధర్షౌ=ఎదిరింపఁగూడని వారలు నగు; తౌ = ఆరామలక్ష్మణులు; కిమర్థం=ఎందుకొఱకు; మాం=నన్ను ; ఉపేక్షతః=ఉపేక్షించుచున్నారు?

సమర్థులును బురుష శ్రేష్ఠులును వాయ్వగ్నులకుంబోలెఁ దేజంబు గలవారలును దేవతలకుంగూడ నెదిరింపనలవిగాని వారలునగు నారామలక్ష్మ

ణులు, నన్నేలయుపేక్షించి యున్నారు? అని, తాత్పర్యము.

మమైవ దుష్కృతం కించి న్మహ దస్తి న సంశయః. ౨౩
సమర్థా సహితౌ య న్మాం నావేక్షేతే పరంతపౌ

టీక॥ యత్ = ఎందువలన; సమర్థౌ=శక్తులును; సహితౌ= కూడినవారలును; పరంతపౌ=శత్రువులం దపింపఁజేయువారలు నగు రామలక్ష్మణులు; మాం=నన్ను; నావేక్షేతే = చూడకున్నారో ; తత్ (అధ్యాహృతము)=అందువలన; మమ = నాయొక్క; మహత్=గొప్పదైన; కించిత్=ఒకానొక; దుష్కృతం=పాపము; అస్తి=ఉన్నది- సంశయః=సందేహము; న=లేదు.

సమర్థులును శత్రువులఁ దపింపఁజేయంగలవారలునగు నా రామలక్ష్మణులొకటిగానుండి, నన్నుఁజూడకున్నారే, యిందువలన నేనేమైనను గొప్పపాపమునుజేసియున్నట్లున్నది ; ఇందుకుసంశయములేదుఅని, సీతాదేవి నాతోఁజెప్పినది. అని, తాత్పర్యము.

వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రు భాషితమ్. ౨౪
పున రప్యహ మార్యాం తా మిదం వచన మబ్రువమ్

టీక॥ కరుణం = దుఃఖకరంబును ; సాశ్రుభాషితం= కన్నీళ్లతోఁగూడునట్లుచెప్పఁబడినదియునగు; వైదేహ్యాః= సీతయొక్క; వచనం=మాటను; శ్రుత్వా=విని; అహం=నేను; పునరపి= మఱలను; ఆర్యాం=పూజ్యురాలగు ; తాం=ఆసీతనుగూర్చి; ఇదం=ఈ ; వచనం=మాటను ; అబ్రువం = చెప్పితిని.

సీతాదేవిదుఃఖకరంబుగాఁ, గన్నులనిండఁగన్నీళ్లుగాఱంజెప్పినమాటనువిని, నేను , బూజ్యురాలగునాసీతాదేవింజూచి, మఱలనిట్లని, చెప్పితిని.
అని, తాత్పర్యము.

త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన తే శపే. ౨౫
రామే దుఃఖాభిభూతేతు లక్ష్మణః పరితప్యతే

టీక॥ దేవి=సీతాదేవీ! రామః = రాముఁడు ; త్వచ్ఛోకవిముఖః=నీదుఃఖముచేవైముఖ్యమునొందినవాఁడు. తే= నీకొఱకు; సత్యేన=సత్యముచేత ; శపే = శపథముసేయుచున్నాను, రామే=రాముండు; దుఃఖాభిభూతేతు = దుఃఖముచేతఁగొట్టఁబడఁగానే; లక్ష్మణః=లక్ష్మణుఁడు; పరితప్యతే= పరితపించుచున్నాఁడు.

సీతాదేవీ! నేనునీకొఱకు ; సత్యముపైశపథముచేసిచెప్పుచున్నాను ; నీదుఃఖంబునరాముండే కార్యంబునందునుత్సాహంబులేకున్నాఁడు; రాముండు దుఃఖంబు నొందఁగానే; లక్ష్మణుండు నుదుఃఖంబునొందును-

అని, తాత్పర్యము.

కథంచి ద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్. ౨౬
అస్మి న్ముహూర్తే దుఃఖానా మంతం ద్రక్ష్యసి భామిని

టీక॥భామిని=స్త్రీవగుసీతాదేవీ కథంచిత్ = అతిప్రయాసమున; భవతీ=నీవు;దృష్టా=చూడఁబడినావు. పరిశోచితుం = దుఃఖించుటకు; కాలః= కాలము;న=కాదు. అస్మిన్=ఈ; ముహూర్తే = ముహూర్తమునందు; దుఃఖానాం= దుఃఖములయొక్క ;అంతః = నాశమును; ద్రక్ష్యసి=చూడగలవు.

సీతాదేవీ ! అతిప్రయాసంబున నిన్నుంజూడఁగంటిని; ఇప్పుడుసంతోషింపవలయునుగాని దుఃఖింపరాదు;ఇంకశీఘ్రంబుగానే, నీదుఃఖంబులన్నియునశించును. అని, తాత్పర్యము.

తా వుభౌ నరశార్దూలౌ రాజపుత్రా వనిందితౌ. ౨౭
త్వద్దర్శన కృతోత్సాహౌ లంకాం భస్మీ కరిష్యతః

టీక॥ నరశార్దూలౌ= పురుషశ్రేష్ఠులును; అనిందితౌ=నిందింపఁబడనివారలును; త్వద్దర్శనకృతోత్సాహౌ=నీయొక్క చూచుటయందుఁజేయఁబడినయుత్సాహంబుగలవారలును; రాజపుత్రౌ=రాచకొమరులునగు ; తౌ= ఆ రామలక్ష్మణులు; ఉభౌ=ఇద్దఱును;లంకాం=లంకను; భస్మీకరిష్యతః= భస్మ

ముగాఁజేయుదురు.

పురుష శ్రేష్ఠులును, నిందింపఁబడని వారలును నిన్నుఁజూడగోరియుండువారలునగు రాచకొమరుఁలయిన రామలక్ష్మణులిద్దఱును, లంకాపట్టణంబంతయుభస్మంబుగావింతురు.

అని, తాత్పర్యము.

హత్వాచ సమరే రౌద్రం రావణం సహబాంధవమ్. ౭౮
రాఘవ స్త్వాం వరారోహే స్వాం పురీం నయతే ధ్రువమ్

టీక॥వరారోహే= శ్రేష్ఠములగుపిఱుఁదులుగలసీతాదేవీ! రాఘవః= రాముఁడు;సమరే = యుద్ధంబునందు;రౌద్రం=భయంకరుండగు;రావణం= రావణుని;సహబాంధవం=బంధువులతోఁగూడినవానిఁగా; హత్వా = చంపి; త్వాం=నిన్ను;స్వాం=తనదైన;పురీం=పట్టణమును;నయతే=పొందించును.ధ్రువం=నిశ్చయము.

సుందరములగుపిఱుఁదులుగల సీతాదేవీ! రాముండు,భయంకరుండగురావణుని,యుద్ధంబునంజంపి, నిన్నుఁదనపట్టణంబునకుఁ గొనిపోవును; ఇదినిశ్చయము.అని,తాత్పర్యము.

యత్తు రామో విజానీయా దభిజ్ఞాన మనిందితే. ౭౯
ప్రీతిసంజననం తస్య ప్రదాతుం త్వ మిహార్హసి

టీక॥ అనిందితే=నిందింపఁబడనట్టిసీతాదేవీ!యత్తు=దేనిని;రామః = రాముండు;విజానీయాత్ = ఎఱుంగునో; తత్(అధ్యాహృతము)=అట్టి; తస్య= ఆరామునకు; ప్రీతిసంజననం=సంతోషముగలిగించునట్టి;అభిజ్ఞానం = గుఱుతును;ఇహ=ఇప్పుడు;ప్రదాతుం=ఇచ్చుటకు;త్వం=నీవు;అర్హసి=తగుదువు.

నిందింపఁబడనట్టిసీతాదేవీ! రాముండుదేనినెఱుంగునో, మఱియునేదియతనికిసంతోషంబుగలిగించునో,అట్టి, గుఱుతును, నీవునాకిప్పుడు , ఇవ్వవలయును. అని,సీతాదేవితోఁ జెప్పెలిని.

అని, తాత్పర్యము.

సా భివీక్ష్య దిశ స్సర్వా వేణ్యుద్గ్రథిత ముత్తమమ్- ౩౦
ముక్త్వా వస్త్రా ద్దదౌ మహ్యం మణి మేతం మహాబల

టీక॥ మహాబల= అధికమయినబలముగలరాముఁడా! సా = ఆసీత; సర్వాః=సమస్తమయిన; దిశః=దిక్కులను. అభివీక్ష్య= చూచి; వేణ్యుద్గ్రథితం = తలజడయందుబంధింపఁ బడినదియు, తలజడయందు బంధింపఁదగినదియుననుట; ఉత్తమం = శ్రేష్ఠమునగు;ఏతం=ఈ;మణిం=చూడామణిని;వస్త్రాత్=వస్త్రముననుండి; ముక్త్వా= విడిచి;మహ్యం= నాకొఱకు; దదౌ= ఇచ్చెను.

మహాబలుండవగు రాముఁడా! అంత,సీతాదేవి, దిక్కులన్నియుఁ జూచుచుఁ,దలజడలో ధరింపఁదగినదియు నుత్తమంబునగు నీచూడామణిని,జీరకొంగుననుండి, విప్పి, నాచేతికిచ్చినది,

అని, తాత్పర్యము-

ప్రతిగృహ్య మణిం దివ్యం తవ హేతో ర్రఘూద్వహ. ౩౧
శిరసా తాం ప్రణమ్యార్యా మహ మాగమనే త్వరే

టీక॥ రఘూద్వహ= రాముఁడా! అహం= నేను; తవ = నీవను; హేతోః=కారణమువలన; దివ్యం= శ్రేష్ఠమగు; మణిం= చూడామణిని; ప్రతిగృహ్య= పుచ్చుకొని; ఆర్యాం= పూజ్యురాలగు; తాం=ఆసీతను; శిరసా= తలచేత; ప్రణమ్య=నమస్కరించి; ఆగమనే=వచ్చునిమిత్తమయి; త్వరే= వేగిరపడితిని.

రాముఁడా! నేనట్లు నీకొఱకై, దివ్యంబగు, చూడామణిందీసికొని, పూజ్యురాలగుసీతాదేవికి సాష్టాంగంబుగ నమస్కరించి, త్వరగామఱలి రాఁదలంచితిని. అని, తాత్పర్యము,

గమనే చ కృతోత్సాహ మవేక్ష్య వరవర్ణినీ. ౩౨
వివర్ధమానంచ హి మా ముచాచ జనకాత్మజా

టీక॥ వరవర్ణినీ = ఉష్ణకాలంబున శీతలంబును శీతల కాలంబున సుఖో



ష్ణంబునగు దేహము గలిగిభర్తయందధిక ప్రేమగల స్త్రీయగు ; జనకాత్మజా=జనకునికొమార్తెయయిన సీతాదేవి; గమనే=పోవుటయందు;కృతోత్సాహం= చేయఁబడినయుత్సాహముగలవాఁడును;వివర్ధమానంచ= పెరుఁగుచున్నవాఁడునగు;మాం = నన్ను;అవేక్ష్య=చూచి;ఉవాచహ=చెప్పినదిగదా!

ఉష్ణకాలంబునసుఖశీతంబునుశీతకాలంబునసుఖోష్ణంబునగుదేహముగల్గిపెనిమిటియందధిక ప్రేమగలయుత్తమస్త్రీయగు జనకమహారాజుకొమార్తెయయినసీతాదేవి,ప్రయాణోన్ముఖుండనై మేనుఁబెంచుచున్ననన్నుంజూచి, యిట్లని,చెప్పినది.అని,తాత్పర్యము.

అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పసందిగ్ధభాషిణీ. ౩౩
మమోత్పతనసంభ్రాంతా శోకవేగసమాహతా

టీక॥ సా(అధ్యాహృతము)= ఆసీత; అశ్రుపూర్ణముఖీ= కన్నీళ్లతో నిండినముఖముగలదియు;దీనా=దైన్యంబునొందినదియు ; బాష్పసందిగ్ధభాషిణీ=కన్నీళ్లచే సందేహంబుగలుగునట్లు మాటలాడునదియు; మమ = నాయొక్క; ఉత్పతనసంభ్రాంతా= ఎగురుటను గురించితొట్రుపాటు నొందినదియు; శోకవేగసమాహతా=దుఃఖముయొక్క-యతిశయముచేతఁగొట్టఁబడినదియుఁగా; ఆసీత్(అధ్యాహృతము)= ఉండినది-

అప్పుడు , సీతాదేవి,కండ్లునిండఁగన్నీళ్లుగార , దీనయయి,మాటలుదడఁబడ,నేనెక్క-డఁబోయెదనోయనిభయపడి, పరమదుఃఖితయయి యుండినది-
అని,తాత్పర్యము-

హనుమన్ సింహసంకాశౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౩౪
సుగ్రీవంచ సహామాత్యం సర్వాన్ బ్రూయా హ్యనామయమ్

టీక॥ హనుమన్= హనుమంతుఁడా! సింహసంకాశౌ=సింహములతో సమానులయిన; తౌ= ఆ;రామలక్ష్మణౌ=రామలక్ష్మణులను;ఉభౌ= ఇద్దఱనుగూర్చియు; సహామాత్యం= మంత్రులతోఁగూడిన;సుగ్రీవంచ=సుగ్రీవునిగూర్చియు;సర్వాన్=అందఱునుగూర్చియు;అనామయం= ఆరోగ్యమును;



బ్రూయాహి=చెప్పుముగదా!

హనుమంతుఁడా! సింహసమాను లగు నారామలక్ష్మణుల కిద్దఱకును,సుగ్రీవునకును, అతనిమంత్రులకును, అందఱకును, ఆరోగ్యంబుఁజెప్పుము.

అని, తాత్పర్యము-

యథాచ స మహాబాహు ర్మాం తారయతి రాఘవః. ౩౫
అస్మా ద్దుఃఖాంబుసంరోధా త్త్వం సమాధాతు మర్హసి

టీక॥ యథా = ఎట్లు; మహాబాహుః=పెద్దచేతులుగల; సః=ఆ; రాఘవః=రాముఁడు; అస్మాత్=ఈ; దుఃఖాంబుసంరోధాత్=దుఃఖసముద్రమువలన; మాం=నన్ను; తారయతి= తరింపఁజేయునో ; తథా (అధ్యాహృతము) = అట్లు; త్వం=నీవు; సమాధాతుం=జతపఱచుటకు; అర్హసి=తగుదువు.

మహాబాహుండగు రాముండు, నన్నీదుఃఖసముద్రంబుననుండి కడతేర్చునట్లు, నీవుపోయి సన్నాహముసేయవలయును.

అని, తాత్పర్యము.

ఇమంచ తీవ్రం మమ శోకవేగం
రక్షోభి రేభిః పరిభర్త్సనంచ. ౩౬
బ్రూయాస్తు రామస్య గత స్సమీపం
శివ స్తవాధ్వాస్తు హరిప్రవీర

టీక॥ హరిప్రవీర= వానరవీరుండవగుహనుమంతుఁడా ! త్వం (అధ్యాహృతము) = నీవు; రామస్య=రామునియొక్క; సమీపం = సమీపమునున్; గతస్తు=పొందినవాఁడవై నంతనే;మమ= నాయొక్క;ఇమం=ఈ;తీవ్రం=తీక్ష్ణమయిన; శోకవేగం= దుఃఖాతిశయమును; ఏభిః=ఈ;రక్షోభిః = రాక్షసులచేత; పరిభర్త్సనంచ = బెదరించుటను; బ్రూయాః=చెప్పుము.

వానరశ్రేష్ఠుండవగు హనుమంతుఁడా! నీవురామునియొద్దకుఁ బోయినంతనె , తీక్ష్ణంబయిన యీనా దుఃఖంబును, ఈరాక్షసులునన్ను బెదరించుటయు, నీవురామునకుఁజెప్పవలయును. అని,సీతాదేవి, నాతోఁజెప్పినది.

అని, తాత్పర్యము.

ఏతత్త వార్యా నృపరాజ సింహ
సీతా వచః ప్రాహ విషాదపూర్వమ్. ౩౭
ఏతచ్చ బుద్ధ్వా గదితం మయా త్వం
శ్రద్ధత్స్వ సీతాం కుశలాం సమగ్రామ్

టీక॥ నృపరాజసింహ= రాజరాజశ్రేష్ఠుండవగు రాముఁడా! ఆర్యా = పూజ్యురాలగు; సీతా=సీత; తవ= నీకు; ఏతత్=ఈ; వచః=మాటను; విషాదపూర్వం= దుఃఖము ముందుగలుగునట్లుగా; ప్రాహ= చెప్పినది. త్వం= నీవు; మయా= నాచేత; గదితం=చెప్పఁబడిన; ఏతత్ = దీనిని; బుద్ధ్వాచ = తెలిసియు; సీతాం = సీతను; సమగ్రాం= తక్కువలేనిదానిఁగాను; కుశలాం= క్షేమముగలదానిఁగాను; శ్రద్ధత్స్వ=నమ్ముము.

రాజరాజ శ్రేష్ఠుండవగు రాముఁడా! పూజ్యురాలగు సీతాదేవి యీప్రకారంబునీకుంజెప్పుమని, దుఃఖంబునంజెప్పెను; నేనుజెప్పిన గుఱుతులనాలోచించి, నేనుజెప్పినట్లు, సీతయన్నివిధంబులను క్షేమంబుగానున్నదనినమ్ముము. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
సుందరకాండే, సప్తషష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, సుందరకాండసప్తషష్టితమసర్గటీక,
ముగిసినది.



శ్రీ

అష్టషష్టితమసర్గప్రారంభః.

అథాహ ముత్తరం దేవ్యా పునరుక్త స్ససంభ్రమః
తవ స్నేహా న్నరవ్యాఘ్ర సౌహార్దా దనుమాన్య వై. ౧

టీక॥ నరవ్యాఘ్ర= పురుషశ్రేష్ఠుం డవగురాముఁడా! అథ = అటుపిమ్మట; సంభ్రమః= వేగిరపాటుతోఁగూడిన; అహం=నేను; దేవ్యా=సీతాదేవిచేత; తవ=నీయొక్క; స్నేహాత్ = చెలిమివలన; సౌహార్దాత్= ఆప్తత్వమువలన; అనుమాన్య=సమ్మానించి; ("వై" అనునది పాదపూరణార్థము) ; ఉత్తరం= పైఁజేయవలసినకార్యమునుగూర్చి; పునః=మఱల; ఉక్తః= చెప్పఁబడినాను.

పురుషశ్రేష్ఠుండవగురాముఁడా! అంత, సీతాదేవి , నీకునాయందెచ్చుగా స్నేహంబుండుటవలనను, నేనుయథార్థంబుగా సాహాయ్యంబు చేయుదునను నమ్మకంబువలనను, బ్రయాణంబునకైత్వరపడుచున్ననన్నుంజూచి, యింకఁజేయవలసినకార్యమునుగూర్చి, యిట్లని, చెప్పెను. అని, తాత్పర్యము.

ఏవం బహువిధం వాచ్యో రామో దాశరథీ స్త్వయా
యథా మా మాప్నుయా చ్ఛీఘ్రం హత్వా రావణ మాహవే. ౨

టీక॥ యథా—ఎట్లు; శీఘ్రం = శీఘ్రముగా; ఆహవే=యుద్ధమునందు; రావణం—రావణుని; హత్వా= చంపి; మాం=నన్ను, ఆప్నుయాత్ =పొందునో; ఏవం=ఇట్లు; బహువిధం= అనేకవిధములుగా; త్వయా=నీచేత; దాశరథిః=దశరథునికొడుకైన; రామః= రాముండు ; వాచ్యః =చెప్పఁదగినవాఁడు.

దశరథునిపుత్రుండగురాముండు , యుద్ధంబునరావణుంజంపి , నన్ను,శీఘ్రంబుగాఁబొందునట్లు, నీవు, నానావిధంబుగా, నతనికిఁ, జెప్పవలయు.

అని, తాత్పర్యము.

స ౬౮

యదివా మన్యసే వీర వసైకాహ మరిందమ
కస్మింశ్చి త్సంవృతే దేశే విశ్రాంత శ్శ్వో గమిష్యసి. ౩

టీక॥ అరిందమ=శత్రువులనడంగఁ ద్రొక్కు-నట్టి; వీర = పరాక్రమశాలి వగుహనుమంతుఁడా ! మన్యసేయది వా=తలంతు వేని; ఏకాహం = ఒక్క-దినము; వస=ఉండుము; కస్మింశ్చిత్= ఒకానొక; సంవృతే = రహస్యమయిన; దేశే= ప్రదేశమునందు; విశ్రాంతః = అలసటదీర్చుకొన్నవాఁడవై ; శ్వః= రేపు; గమిష్యసి= పోఁగలవు.

శత్రువులనడంగఁద్రొక్కు-నట్టిపరాక్రమవంతుండవగుహనుమంతుఁడా! నీకిచ్చయుండునేని, యిచ్చో నొకదిన ముండుము;ఎచ్చట నేనియొకరహస్యప్రదేశంబునవిశ్రమించి రేవుపోఁగలవు.

అని, తాత్పర్యము.

మమ చాప్యల్పభాగ్యాయా స్సాన్నిధ్యా త్తవ వీర్యవన్
అస్య శోకవిపాకస్య ముహూర్తం స్యా ద్విమోక్షణమ్. ౪

టీక॥ వీర్యవన్ = అధికమగుపరాక్రమముగల హనుమంతుఁడా; తవ = నీయొక్క; సాన్నిధ్యాత్= సన్నిధానమువలన; అల్పభాగ్యాయాః; స్వల్పమయిన యదృష్టముగల; మమచ = నాయొక్క-యు; అస్య=ఈ; శోకవిపాకస్య=దుఃఖఫలమునకు; ముహూర్తం= స్వల్పకాలము; విమోక్షణం = విడుదల; స్యాత్ =అగును.

పరాక్రమవంతుండవగు హనుమంతుఁడా! అట్లు , నీవిచ్చటనొకదినంబుందువేని , నీసహవాసమువలన , మంద భాగ్యురాలనగునాకును, గొంచెము సేపుదుఃఖశాంతియగును.

అని, తాత్పర్యము.

గతే హి త్వయి విక్రాంతే పున రాగమనాయవై
ప్రాణానామపి సందేహో మమ స్యా న్నాత్ర సంశయః. ౫

టీక॥ విక్రాంతే=పరాక్రమించిన;త్వయి= నీవు; పునరాగమనాయ= మ

అలివచ్చుటకొఱకు; గతేహి= పోఁగా నే; మమ=నాయొక్క; ప్రాణానామ పి=ప్రాణంబులకును ; సందేహః=సందేహము; స్యాత్=అగును. అత్ర=ఈ విషయమందు; సంశయః — సందేహము; న=లేదు.

పరాక్రమశాలివగుసీవు , పునరాగమనంబునకై పోఁగానే, నాప్రాణంబులుఁపోయినను బోవును;ఇందుకుసంది యములేదు.అని,తాత్పర్యము-

తవా దర్శనజ శ్శోకో భూయో మాం పరితాపయేత్
దుఃఖా ద్దుఃఖపరాభూతాం దుర్గతాం దుఃఖభాగినీమ్. ౬

టీక॥ తవ = నీయొక్క ; అదర్శనజః = చూడకుండుటవలనం గలిగిన; శోకః=దుఃఖము; దుఃఖాత్= రామవియోగదుఃఖమువలన; దుఃఖపరాభూతాం=దుఃఖముచేలోఁగొనఁబడినదానను; దుర్గతాం=దీనురాలను ; దుఃఖభాగినీం= దుఃఖంబునొందిన దాననగు; మాం=నన్ను; భూయః= మిక్కిలియు; పరితాపయేత్ = తపింపఁజేయును.

మొదలేరామ వియోగ దుఃఖంబునొంది పరితపించుచు, దీనురాలనై యీ రాక్షసులచే బాధింపఁ బడుచున్న నేను, ఇఁకనిన్నుంజూడకుందునేని, మఱియుదుఃఖంబునొందుదును.

అని,తాత్పర్యము.

అయం చ వీర సందేహ స్తిష్ఠతీవ మమాగ్రతః
సుమహాం స్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర. ౭

టీక॥ వీర= పరాక్రమశాలివగు; హరీశ్వర=వానరశ్రేష్ఠుండవైన హనుమంతుఁడా ! త్వత్సహాయేషు = నీకు సహాయులయిన; హర్యృక్షేషు= వానరులయందునుఎలుఁగుగొడ్డులయందును; సుమహాన్= మిక్కిలియుగొప్పదగు; అయం=ఈ; సందేహశ్చ=సందేహమును; మమ= నాయొక్క; అగ్రతః= ముందట; తిష్ఠతీవ = నిలిచియున్నట్లున్నది.

పరాక్రమశాలివి వానర శ్రేష్ఠుండవగు, హనుమంతుఁడా! నీ సహాయు

లగుబుుక్షువానరులవిషయమై, నాకొక గొప్పసందేహంబున్నది.

అని, తాత్పర్యము.

కథన్ను ఖలు దుష్పారం తరిష్యంతి మహోదధిమ్
తాని హర్యృక్ష సైన్యాని తౌ వా నరవరాత్మజౌ. ౮

టీక॥కథన్నుఖలు = ఎట్లు;దుష్పారం=దాటఁగూడని;మహోదధిం= మహాసముద్రమును; తాని=ఆ; హర్యృక్ష సైన్యాని= వానరులయొక్కయు నెలుఁగుగొడ్డులయొక్క సైన్యంబులు; తరిష్యంతి=దాటఁగలవు?తౌ = ఆ;నరవరాత్మజౌవా= రాజపుత్రులగు రామలక్ష్మణులు గాని;తరిష్యతః (అధ్యాహృతము)=దాటఁగలరు?

ఆబుుక్షువానరులు, దాటఁగూడని యీమహాసముద్రంబు నెట్లుదాఁటుదురు? రాజపుత్రులగురామలక్ష్మణులయినను,ఎట్లుదాటఁగలరు?

అని, తాత్పర్యము.

త్రయాణామేవ భూతానాం సాగరస్యాస్య లంఘనే
శక్తి స్స్యాద్వైనతేయస్య తవ వా మారుతస్యవా. ౯

టీక॥వైనతేయస్య= గరుత్మంతునకును;తవవా=నీకును;మారుతస్యవా= వాయువునకును;త్రయాణాం= మూఁడైన;భూతానామేవ=ప్రాణులకే; అస్య=ఈ;సాగరస్య = సముద్రముయొక్క;లంఘనే = దాఁటుటయందు;శక్తిః=సామర్థ్యము;స్యాత్ =అగును.

గరుత్మంతునకును నీకును వాయువునకును మీముగ్వురకేయీసముద్రంబు దాఁటుటకుశక్తియున్నది, గాని, మఱియెవ్వరికిని లేదు. అని, తాత్పర్యము.

తదస్మిన్ కార్యనిర్యోగే వీర్యైవం దురతిక్రమే
కిం పశ్యసి సమాధానం బ్రూహి కార్యవిదాం వర. ౧౦

టీక॥వీర=పరాక్రమశాలివగు; కార్యవిదాం = కార్యంబులనెఱింగినవార




లలోపల;వర = శ్రేష్ఠుండవయినహను మంతుఁడా!తత్=అందువలన; ఏవం= ఇట్లు;దురతిక్రమే= అతిక్రమింపఁగూడ ని;అస్మిన్=ఈ;కార్యనిర్యోగే = పని యొక్కనిర్వాహమునందు;కిం=ఏమి;స మాధానం = సమాధానమును;పశ్య సి=చూచుచున్నావు?బ్రూహి = చె ప్పుము.

పరాక్రమశాలివి, కార్యంబుఁదెలిసి నవారలలోశ్రేష్ఠుండవగు హనుమంతుఁ డా!ఇట్లు,అసాధ్యంబగుకార్యంబునుసా ధించుటకు, నీవేమియుపాయం బూ హించియున్నావు? చెప్పుము.

అని, తాత్పర్యము.

కామ మస్య త్వమే వైకః కార్యస్య పరిసాధనే
పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే ఫలోదయః. ౧౧

టీక॥పరవీరఘ్న= శత్రువీరులంజం పునట్టిహనుమంతుఁడా!అస్య=ఈ; కా ర్యస్య=కార్యముయొక్క;పరిసాధనే= సాధించుటయందు;త్వం=నీవు; ఏకఏవ కామం=ఒక్కఁడవే;పర్యాప్తః= చా లుదువు. తే=నీయొక్క; ఫలోదయః= ఫలముయొక్కయుదయించుట, ఫలసా ధనమనుట;యశస్యః = అధికమయినకీ ర్తినిగలిగించునది.

శత్రువీరులంజంపునట్టిహనుమంతుఁ డా!నీకార్యసాధనశక్తియద్భుతంబయి నది,కావున,నీకార్యంబుసాధించుటకునీ వొక్కండవె,చాలుదువు-

అని, తాత్పర్యము-

బలై స్సమగ్రై ర్యది మాం హత్వా రావణ మాహవే
విజయీ స్వాం పురీం రామో నయే త్తత్స్యా ద్యశస్కరమ్. ౧౨

టీక॥ రామః= రాముఁడు; సమ గ్రైః=సమస్తములగు; బలైః= సై న్యముల చేత;ఆహవే= యుద్ధమునందు; రావణం=రావణుని; హత్వా=చంపి; విజయీ=జయముగలవాఁడై; మాం= నన్ను; స్వాం=తనదైన; పురీం= పట్ట ణమును; నయేద్యది = పొందించునేని; తత్=అది; యశస్కరం= కీర్తిగలిగిం చునది; స్యాత్=అగును.

రాముండు, వానరసైన్యములతోఁ గూడవచ్చి, యుద్ధంబున రావణుంజం పి, జయంబునొంది, నన్నుఁదనపట్టణం




బునకుంగొనిపోవునేని, యది నాకును అతనికిని, గీర్తికరంబగును.

అని, తాత్పర్యము.

యథా హం తస్య వీరస్య వనా దుపధినా హృతా
రక్షసా తద్భయా దేవ తథా నార్హతి రాఘవః. ౧౩

టీక॥ యథా=ఎట్లు; తస్య=ఆ; వీరస్య=పరాక్రమశాలియగురామునియొక్క; భార్యా(అధ్యాహృతము)=భార్యనగు; అహం=నేను; రక్షసా= రాక్షసుండగురావణునిచేత; తద్భయా దేవ=ఆరాముని భయమువలననే; ఉపధినా=కపటంబుచేత; వనాత్= అడవినుండి; హృతా = అపహరింపఁబడినానో; తథా=అట్లు; రాఘవః= రాముఁడు; నార్హతి=తగఁడు;

రావణుండు పరాక్రమవంతుండగురామునిభార్యనగునన్ను, వనంబుననుండిరామభయంబునఁగపటంబుగానపహరించుకొనివచ్చినట్లు, రాముండు నన్ను రహస్యముగాఁదీసికొనిపోవుటయెంతమాత్రము యుక్తముకాదు.

అని, తాత్పర్యము.

బలై స్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః
మాం నయేద్యది కాకుత్స్థ స్త త్తస్య సదృశం భవేత్. ౧౪

టీక॥ పరబలార్దనః = శత్రుసైన్యంబులహింసించునట్టి; కాకుత్స్థః = రాముఁడు; లంకాం= లంకను; బలైః= సైన్యములచేత; సంకులాం=నిండినదానిగా; కృత్వా=చేసినంతనే; మాం= నన్ను; నయేద్యది=కొనిపోవునేని; తత్= అది; తస్య=ఆరామునకు; సదృశం=సరియయినది; భవేత్=అగును.

శత్రుసైన్యంబులం జంపునట్టిరాముండు, లంకయంతయుసైన్యంబులనిండించి, నన్నుఁగొనిపోవునేని, యతనికి సదృశంబుగానుండును.

అని, తాత్పర్యము.

త ద్యథా తస్య విక్రాంత మనురూపం మహాత్మనః

భవత్యా హవశూరస్య తథా త్వ ముపపాదయ. ౧౫

టీక॥ తత్=అందువలన; మహాత్మనః=అధికమయినపరాక్రమముగలవాఁడును; ఆహవశూరస్య= యుద్ధమునందుభయములేనట్టివాఁడునగు;తస్య=ఆ రామునకు; అనురూపం= తగిన; విక్రాంతం=పరాక్రమించుట;యథా=ఎట్లు; భవతి=అగుచున్నదో. తథా=అట్లు; త్వం=నీవు; ఉపపాదయ = కూర్చుము.

అందువలన, మహాపరాక్రమశాలియు యుద్ధప్రియుండునగు నారాముండు, తనపరాక్రమంబున కనురూపంబుగాఁబరాక్రమించునట్లు,నీవొనగూర్పవలయును.అని, తాత్పర్యము.

త దర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్
నిశమ్యా హం తత శ్శేషం వాక్య ముత్తర మబ్రువమ్. ౧౬

టీక॥అహం= నేను;అర్థోపహితం= అధికమయినయర్థముతోఁగూడినదియు;హేతుసంహితం = కారణముతోఁగూడినదియు;ప్రశ్రితం=వినయముగలదియునగు;తత్=ఆ; వాక్యం=మాటను;నిశమ్య=విని;తతః=అటుపిమ్మట; శేషం=మిగిలిన;ఉత్తరం=బదులయిన; వాక్యం=మాటను;అబ్రువం=చెప్పితిని.

అధికార్థమునుయుక్తియుక్తంబునువినయోపపన్నంబునగునామాటనువిని, నేను,ఇట్లని,బదులుచెప్పితిని.

అని, తాత్పర్యము.

దేవి హర్యృక్షసైన్యానా మీశ్వరః ప్లవతాం వరః
సుగ్రీవ స్సత్త్వసంపన్న స్తవా ర్థే కృతనిశ్చయః- ౧౭

టీక॥దేవి=సీతాదేవీ!హర్యృక్షసైన్యానాం=వానరులయొక్కయు నెలుఁగుగొడ్డులయొక్కయు సైన్యంబులకు; ఈశ్వరః=ప్రభుండును;ప్లవతాం= వానరులలోపల;వరః = శ్రేష్ఠుండును;సత్త్వసంపన్నః=బలముతోఁగూడినవాఁడునగు;సుగ్రీవః=సుగ్రీవుఁడు;తవ= నీయొక్క;అర్థే=ప్రయోజనమునందు; కృతనిశ్చయః= చేయఁబడిననిశ్చయముగలవాఁడు-

సీతాదేవీ! ఋక్షవానరాధీశ్వరుండునువానరశ్రేష్ఠుండును బలవంతుండు

నగుసుగ్రీవుండు, నీకార్యంబుసాధింపని శ్చయించియున్నాఁడు.

అని, తాత్పర్యము.

తస్య విక్రమసంపన్నా స్సత్త్వవంతో మహాబలాః
మనస్సంకల్పసంపాతా నిదేశే హరయ స్థ్సితాః. ౧౮

టీక॥తస్య=ఆసుగ్రీవునియొక్క; నిదేశే = అజ్ఞయందు ; విక్రమసంపన్నాః= పరాక్రమముతోఁగూడినవారలును;సత్త్వవంతః=అధికమయినశక్తిగలవారలును;మహాబలాః=అధికమయినబలముగలవారలును;మనస్సంకల్పసంపాతాః=మనసుయొక్కసంకల్పమువంటిగమనముగలవారలునగు; హరయః=వానరులు;స్థితాః=ఉన్నారు.

పరాక్రమవంతులునుశక్తిమంతులును బలవంతులును మనసునకుంబోలెవేగంబుగలవారలునగు వానరులనేకులు, ఆసుగ్రీవునిచేతిక్రిందనున్నారు.

అని, తాత్పర్యము.

ఏషాం నోపరినాధ స్తా న్నతిర్య క్సజ్జతే గతిః
నచ కర్మసు సీదంతి మహత్స్వ మిత తేజసః. ౧౯

టీక॥ఏషాం=ఈవానరులయొక్క; గతిః=గమనము; ఉపరి = మీదుగా; నసజ్జతే=అడ్డపడదు. అధస్తాత్=క్రిందుగా; న(సజ్జతే)= అడ్డపడదు. తిర్యక్=అడ్డముగా; న(సజ్జతే)= అడ్డపడదు; అమితతేజసః=కొలందిలేనితేజస్సుగలయీవానరులు ; మహత్సు=గొప్పదగు; కర్మసు = కార్యములందు; నసీదంతిచ = అలసటనుబొందరు

ఆవానరులు , ఆకాశమార్గంబునంగానిపాతాళమార్గంబునంగానితిర్యఙ్మార్గంబునంగాని యడ్డములేకసంచరింపంగలరు, మఱియు , నెట్టిగొప్పకార్యంబునైనను , ఎంతమాత్రము శ్రమలేక, చేయంగలరు.

అని, తాత్పర్యము.

అసకృత్తై ర్మహాభాగై ర్వానరై ర్బలదర్పితైః
ప్రదక్షిణీకృతా భూమి ర్వాయుమార్గానుసారిభిః. ౨౦.

టీక॥ మహాభాగైః= పూజ్యమయినభాగ్యముగలవారలును;బలదర్పితైః =

బలముచేగవిఁాంచినవాఁరలును ; వాయుమాగాఁనుసారిభిః=వాయువుయొక్క-మాగఁముననుసరించునట్టివారలునగు; తైః=ఆ; వానరైః= వానరులచేత; అసకృత్= పలుమాఁఱు; భూమిః=భూమి; ప్రదక్షిణీకృతా= ప్రదక్షిణింపఁబడినది.

మహాభాగులును బలదపిఁాతులునగునావానరులు , ఆకాశంబునసంచరించుచుభూమికంతయుఁ బలుమాఁఱు లుప్రదక్షిణంబుగావించిరి.

అని, తాత్పర్యము.

మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః
మత్తః ప్రత్యవరః కశ్చి న్నాస్తి సుగ్రీవసన్నిధౌ. ౨౧

టీక॥ తత్ర=అచ్చట ; సుగ్రీవసన్నిధౌ= సుగ్రీవునిసమీపమునందు; మద్విశిష్టాశ్చ=నాకన్ననధికులును ; తుల్యాశ్చ=నాకుసమానులునగు;వనౌకసః=వానరులు; సంతి=ఉన్నారు-మత్తః=నాకన్న; ప్రత్యవరః = తక్కు-వయినవాఁడు ; కశ్చిత్ = ఒకానొకండు; నాస్తి=లేఁడు.

అచ్చట,సుగ్రీవునియొద్దనుండువానరులందుగొందఱు,నాకన్ననధికులును, గొందఱునాకుసమానులునుగానున్నారు;ఒకఁడైనను, నాకుఁదక్కు-వయినవాఁడులేఁడు. అని,తాత్పర్యము.

అహం తావదిహ ప్రాప్తః కిం పునస్తే మహాబలాః
నహి ప్రకృష్టాః ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః. ౨౨

టీక॥ అహంతావత్ = నేనే; ఇహ=ఇచ్చటికి; ప్రాప్తః=వచ్చినాను. మహాబలాః=అధికమయినబలముగల; తే=ఆవానరులు; కింపునః= (రాఁగలరని) చెప్పవలసినదేమియున్నది? ప్రకృష్టాః=శ్రేష్ఠులగువారలు; నప్రేష్యంతేహి= పంపఁబడరుగదా! ఇతరే = ఇతరులగు; జనాః=జనులు; ప్రేష్యంతేహి=పంపఁబడుదురుగదా!

నేనేయిచ్చటికివచ్చినానే యింకబలవంతులగునావానరులు రాఁగలరనిచెప్పనేల? ఎచ్చటికైనఁ బంప వలసియున్నప్పుడు ; ఉత్తములంబంపరు ; తక్కు-వయయినవారలనెపంపుదురు.

అని, తాత్పర్యము.

త దలం పరితాపేన దేవి మన్యు ర్వ్యపైతు తే
ఏకోత్పాతేన వై లంకా మేష్యంతి హరియూథపాః. ౨౩

టీక॥ దేవి=సీతాదేవీ! పరితాపేన=పరితపించుటచేత; అలం =చాలును. తే=నీయొక్క; మన్యుః= కోపము; ఉపైతు=పోవుఁగాక. హరియూథపాః= వానరశ్రేష్ఠులు ; ఏకోత్పాతేన = ఒకటెయెగురుచేతనే ; లంకాం=లంకను; ఏష్యంతి=పొందగలరు.

సీతాదేవీ! నీవుపరితపింపవలదు ; దుఃఖంబువిడువుము; వానరులిచ్చిటికి, ఒకటెయెగురునవచ్చిచేరుదురు.

అని, తాత్పర్యము.

మమ పృష్ఠగతౌ తౌచ చంద్రసూర్యా వివోదితౌ
త్వత్సకాశం మహాభాగే నృసింహా వాగమిష్యతః. ౨౪

టీక॥మహాభాగే = పూజ్యమయిన భాగ్యముగలసీతాదేవీ!నృసింహౌ=పురుషశ్రేష్ఠులగు;తౌచ=ఆరామలక్ష్మణులును;ఉదితౌ=ఉదయించిన; చంద్రసూర్యావివ=చంద్రసూర్యులువలె;మమ=నాయొక్క;పృష్ఠగతౌ=వీఁపునుబొందినవారలై;త్వత్సకాశం= నీసమీపమును; ఆగమిష్యతః=రాఁగలరు.

మహాభాగురాలవగుసీతాదేవీ! పురుషశ్రేష్ఠులగు నారామలక్ష్మణులును, నావీపుపైనెక్కి చంద్రసూర్యులుదయించినట్లు,నీయొద్దకు రాఁగలరు.

అని, తాత్పర్యము.

అరిఘ్నం సింహసంకాశం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్
లక్ష్మణంచ ధనుష్పాణిం లంకాద్వార ముపస్థితమ్. ౨౫

టీక॥అరిఘ్నం = శత్రువులంజంపువాఁడును; సింహసంకాశం=సింహముతోసమానుండునగు;రాఘవం= రామునిః;ధనుష్పాణిం = విల్లుచేతఁగలవాఁడును;లంకాద్వారం=లంకవాకిలిని; ఉపస్థితం=పొందిన;లక్ష్మణంచ= లక్ష్మణునిని; క్షిప్రం=శీఘ్రముగా;ద్రక్ష్యసి=చూడఁగలవు.

శత్రువులంజంపువాఁడునుసింహసమానుండునగురాముని, ధనుర్ధరుండైలంకాద్వారంబుననున్నలక్ష్మణుని,నీవు,శీఘ్రంబునఁజూడఁగలవు.అని, తాత్పర్యము.

నఖదంష్ట్రాయుధాన్ వీరాన్ సింహశార్దూలవిక్రమాన్
వానరా న్వారణేంద్రాభాన్ క్షిప్రం ద్రక్ష్యసి సంగతాన్. ౨౬

టీక॥ నఖదంష్ట్రాయుధాన్ = గోళ్లును దంతంబులు నాయుధంబులుగాఁగలవారలును; వీరాన్ = పరాక్రమవంతులును; సింహశార్దూలవిక్రమాన్ = సింహంబులయొక్కయుఁ బులులయొక్కయుఁ బరాక్రమమువంటి పరాక్రమము గలవారలును; వారణేంద్రాభాన్ = గజశ్రేష్ఠములయొక్క కాంతివంటికాంతిగలవారలునగు; వానరాన్ = వానరులను; సంగతాన్ = చేరినవారలనుగా; క్షిప్రం = శీఘ్రముగా; ద్రక్ష్యసి = చూడఁగలవు.

నఖదంతంబులె యాయుధంబులు గాఁగలవారలునుబరాక్రమవంతులును సింహశార్దూలంబులకుంబోలె బరాక్రమంబు గలవారలును గజేంద్రంబుల కాంతివంటి కాంతిగలవారలునగువానరులు, శీఘ్రంబుగా, లంకయందుఁజేరియుండుటంజూడఁగలవు.

అని, తాత్పర్యము.

శైలాంబుదనికాశానాం లంకామలయసానుషు
నర్దతాం కపిముఖ్యానా మచిరా చ్ఛ్రోష్యసి స్వనమ్. ౨౭

టీక॥ శైలాంబుదనికాశానాం = పర్వతంబులతోను మేఘంబులతోను సమానులును; లంకామలయ సానుషు = లంకయందలి మలయ పర్వతము యొక్క నెత్తములందు; నర్దతాం = ధ్వనించు చున్న వారలునగు; కపిముఖ్యానాం = వానరశ్రేష్ఠులయొక్క; స్వనం = ధ్వనిని; అచిరాత్ = శీఘ్రముగ; శ్రోష్యసి = వినగలవు.

ఇంక, శీఘ్రంబుగనే లంకామలయంబునందలి సానువులయందు సింహనాదంబులు సేయుచున్న మేఘాకారులును పర్వతాకారులునగువానరులధ్వనులునీకువినవచ్చును. అని, తాత్పర్యము.

నివృత్తవనవాసంచ త్వయా సార్ధమరిందమమ్
అభిషిక్త మయోధ్యాయాం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్. ౨౮

టీక॥ అరిందమం = శత్రువులనడంచువాఁడును, నివృత్త వనవాసం = నెఱవేర్చినవనవాసముగలవాఁడును; అయోధ్యాయాం = అయోధ్య యందు; త్వయా సార్ధం = నీతోఁగూడ; అభిషిక్తం = అభిషేకింపఁబడినవాఁడు

నగు; రాఘవం=రామునిః క్షిప్రం = శీఘ్రముగా ; ద్రక్ష్యసి = చూడఁగలవు. ఇంక,శీఘ్రంబుగానే, వనవాసవ్రతంబునెఱవేర్చుకొని , నీతోఁగూడ నయోధ్య యందుఁ బట్టాభిషిక్తుండై యున్న, శత్రుహంత యగు రాముం జూడగలవు. అని, నేనుసీతాదేవికిం జెప్పితిని. అని, తాత్పర్యము.

తతో మయా వాగ్భి రదీనభాషిణా శివాభి రిష్టాభి రభిప్రసాదితా
జగామ శాంతిం మమ మైథిలాత్మజా తవాపి శోకేన తదాభిపీడితా.౭౫

టీక॥ తతః=అటుపిమ్మట; తదా= అప్పుడు; మమ=నాయొక్క; పురతః (అధ్యాహృతము)=ముందట; తవ = నీయొక్క; శోకేనాపి= దుఃఖముచేతను; అభిపీడితా= మిక్కిలియుఁబీడింపఁబడిన; జనకాత్మజా=జనకునికూఁతురయినసీతాదేవి; అదీనభాషిణా=దుఃఖములేనట్లుమాటలాడునట్టి; మయా = నాచేత; శివాభిః = మంగళకరంబులును ; ఇష్టాభిః=ప్రియంబులునగు ; వాగ్భిః=మాటలచేత; అభిప్రసాదితా = ఊఱడింపఁబడినదై; శాంతిం = దుఃఖశాంతిని; జగామ=పొందెను.

అంత , నీవుసీతావియోగంబున మిక్కిలియుదుఃఖంబు నొందియున్నావని, నావలనవిని, సీతాదేవి, మిక్కిలియుదుఃఖింపఁగా , నేను , దుఃఖంబుపోవునట్లు, ప్రియకరంబులగుమంచిమాటలుచెప్పి , యాబిడదుఃఖంబుఁబోఁగొట్టితిని. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే,ఆదికావ్యే,
సుందరకాండే, అష్టషష్టితమస్సర్గః.
సమాప్తశ్చాయం సుందరకాండః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు , శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు,సుందరకాండాష్టషష్టితమసర్గటీక,ముగిసినది.
సుందరకాండంబు సమాప్తినొందెను.

శ్రీరామార్పణమస్తు.

